33

## వైదికగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 8 |
| రుద్రాధ్యాయము | ... | 1 | 8 |
| సత్యనారాయణవ్రతకల్పము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 12 |
| ,, ద్వితీయభాగము | ... | 1 | 8 |
| వ్రతచూడామణి, సంస్కృతము | ... | 2 | 8 |

## జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము | ... | 10 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 1 | 8 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 0 | 12 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము, చక్కనిప్రతి | ... | 2 | 8 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 1 | 0 |
| రెట్టమతశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 14 |
| లఘుతాజకము ,, | ... | 0 | 12 |
| వృద్ధపారాశర్యము ,, | ... | 0 | 12 |
| శ్రీపతి ,, | ... | 1 | 8 |
| సర్వార్థచింతామణి, మూలముమాత్రము | ... | 0 | 12 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |

## ధర్మశాస్త్రగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము | ... | 1 | 4 |
| ధర్మసింధు, తెనుగువచనము | ... | 5 | 0 |
| మనుస్మృతి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 6 | 0 |

7-8-0

వాగ్భటాచార్యకృత

# అష్టాంగహృదయము

## ఉత్తరస్థానము

ఆంధ్రతాత్పర్యసహితము.





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1931.

## తృతీయాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము.



## త్రయోదశాధ్యాయము.

సప్తదశాధ్యాయము.

## ద్వావింశాధ్యాయము.

## పంచత్రింశాధ్యాయము.

సప్తత్రింశాధ్యాయము.

## అష్టత్రింశాధ్యాయము.

# జ్యోతిష గ్రంథములు.



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము, చక్కనిప్రతి | ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |
| కాలామృతము ,, | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 2 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 8 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితము, నూతనముద్రితము | | 2 | 0 |
| బృహద్యోగరత్నాకరము | ... | 0 | 8 |
| భృగుసూత్రములు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, | ... | 0 | 8 |
| మయవాస్తువు ,, | ... | 0 | 3 |
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| రెట్టమతశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 10 |
| లఘుతాచకము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |
| వనమాల (వర్షఫణి), సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 4 |
| వృద్ధపారాశరము ,, | ... | 0 | 10 |
| శకునశాస్త్రము (శిఖినరసింహశతకము), తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| శ్రీపతి, సాంధ్ర తాత్పర్యము | ... | 1 | 8 |
| సర్వార్థచింతామణి, మేలుప్రతి | ... | 0 | 12 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 3 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 4 |
| సాముద్రికశాస్త్రము, తెనుఁగు పద్యకావ్యము | ... | 0 | 6 |
| సారావళి, సాంధ్ర తాత్పర్యము | ... | 3 | 0 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తెనుఁగు | | 0 | 3 |
| హోరారత్నమాల | ... | 0 | 8 |

## వేదాంత గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అద్వైతానుభూతి ... | 0 | 2 |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము ... | 0 | 2 |
| అష్టోత్తరశతోపనిషత్తులు ... | 6 | 0 |
| ఆత్మబోధము, సటీక ... | 0 | 4 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| ఆత్మపూజ ,, ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ... | 0 | 4 |
| ఉత్తరగీతా, సాంధ్రటీకాతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 12 |
| జ్ఞానవాసిష్ఠము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 8 | 0 |
| జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 3 | 8 |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యానాంధ్రటీకాతాత్పర్యసహితము ... | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| డిటో తెనుఁగువచనము ... | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము, చిన్నసైజు ... | 0 | 3 |
| భగవద్గీతలు, మూలముమాత్రము, చిన్నసైజు ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు ... | 0 | 6 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము, కాలికోబైండు ... | 1 | 4 |
| డిటో ,, చిన్నసైజు ... | 0 | 8 |
| డిటో అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమాతో ... | 0 | 8 |
| భగవద్గీతలు, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యసహితము, మతత్రయభాష్యములనుండి అనేక అంశములిందు చేర్చి శ్లోకానుక్రమణికతో ముద్రింపఁబడినది. ... | 2 | 12 |
| రామగీతా, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| వివేకచూడామణి ఆంధ్రతాత్పర్యసహితము, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| వేదాంతస్తోత్రపంచకము, శ్రీశంకరాచార్యకృతము, ఆంధ్రతాత్పర్యసహితము:— ఇందు ఏకశ్లోకి, యతిపంచకము, మనీషాపంచకము, ప్రాతఃస్మరణము మొదలైనవి గలవు ... | 0 | 4 |
| వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 2 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము, నూతనముద్రితము ... | 2 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,



శ్రీరస్తు.

వాగ్భటాచార్యకృత

# అష్టాంగహృదయము

సాంధ్రతాత్పర్యము.

# ఉత్తరస్థానము.

## ప్రథమాధ్యాయము.

(బాలచికిత్స) 2-వ అంగము.

అవతారిక. "క్రియతేఽష్టాంగహృదయం నాతిసంక్షేపవిస్తరమ్, కాయబాలగ్రహోర్ధ్వాంగశల్యదంష్ట్రాజరావృషాన్, అష్టావంగాని తస్యాహుశ్చికిత్సా యేషు సంశ్రితా." అనువచనములచే కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, విషచికిత్స, రసాయనచికిత్స, వాజీకరణచికిత్స అను నెనిమిదియంగములుగల అష్టాంగహృదయమను వైద్యగ్రంథమును చేయుచున్నానని గ్రంథకర్తయైన వాగ్భటాచార్యుఁడు తొలుత ప్రతిజ్ఞచేసి అటులనే సూత్రశారీర నిదానచికిత్సకల్పములను పూర్వస్థానములచే కాయచికిత్సను నిరూపించి పదంపడి క్రమప్రాప్తంబైన బాలచికిత్సాదులను నిరూపించుటకై ఉత్తరస్థానమను నీ ప్రకరణము నారంభించి యందు తొలుత బాలచికిత్సయని పఱంగునంగమును నిరూపించుచున్నాఁడు! ఇదియే కౌమారభృత్యతంత్రమని ప్రాచీనులచే వ్యవహరింపఁ బడియె:—

## బాలోపచరణీయాధ్యాయము.

సూ. అథాతో బాలోపచరణీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

తా. కల్పస్థాన నిరూపణానంతరము బాలురకుపయుక్తమైన యౌషధ స్తన్య లక్షణాదులను బోధించునట్టి బాలోపచరణీయమను నీ యధ్యాయమును వివరించెదము.

### శిశువు జనించినతోడనే చేయవలసిన యుపచారక్రమము.

శ్లో. జాతమాత్రం విశోధ్యోల్బాద్బాలం సైంధవసర్పిషా,
ప్రసూతిక్లేశితం చాను బలాతైలేన సేచయేత్. ౧
అశ్మనోర్వాదనం చాస్య కర్ణమూలే సమాచరేత్,
అథాస్య దక్షిణే కర్ణే మంత్రముచ్చారయేదిమమ్. ౨
అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే,
ఆత్మా వై పుత్ర! నామాసి స జీవ శరదశ్శతమ్. ౩
శతాయుశ్శతవర్షోఽసి దీర్ఘమాయురవాప్నుహి.
నక్షత్రాణి దిశో రాత్రిరహశ్చ త్వాఽభిరక్షతు. ౪

తా. శిశువు జనించినతోడనే శిశువుయొక్క శరీరముపై సైంధవలవణము చేర్చిన నేతినిపూసి శరీరమునం దంటికొనియుండు మావిని పరిహరింపఁజేసి ప్రసవ శ్రమను జెందియుండు నాశిశువునకు బలాతైలముచే సేచనముచేయించవలయును. పిదప ఆశిశువు యొక్క కర్ణరంధ్రముల సమీపమున రెండురాళ్లచే చప్పుడుచేయించి తర్వాత దక్షిణ కర్ణమునందు క్రింద చెప్పియుండు:—“అంగాదంగాత్సంభవసి” అను మంత్రములను జపించవలయును.

### శిశువునకు నాభినాళచ్ఛేదస్నానక్రమము.

స్వస్థీభూతస్య నాభిం చ సూత్రేణ చతురంగులాత్,
బద్ధ్వోర్ధ్వం వర్ధయిత్వా చ గ్రీవాయామవసంజయేత్. ౫
నాభిం చ కుష్ఠతైలేన సేచయేత్స్నాపయేదను,
క్షీరివృక్షకషాయేణ సర్వగంధోదకేన వా. ౬
కోష్ణేన తప్తరజతతపనీయనిమజ్జనైః,

తా. మాతృగర్భమునుండి వెలుపలికి వచ్చుటవలన కలిగిన శ్రమ శమించి సుఖముగనుండు శిశువుయొక్క నాభినాళమును నాల్గంగులములకుపై నూలును చుట్టి గట్టిగకట్టి ఛేదించి యానూలును శిశువు మెడకు చుట్టవలయును. పిదప ఆనాభికి చెంగల్వకోష్టువైచి కాఁచిన తైలమునుపూసి యాశిశువునకు క్షీరవృక్షకషాయముచేఁగాని, వెండి బంగారు వీనిని పలుమారు నిప్పులోకాల్చి చందనాద్యుదకములో పలుమారు ముంచి సుఖోష్ణముగనుండు నాయుదకముచేఁగాని, స్నానముచేయించవలయును.

"అశ్వత్థోదుంబరప్లక్షవటపిప్పలసంజ్ఞితాః,
పంచైతే క్షీరిణో వృక్షాస్సమాఖ్యాతా విచక్షణైః."

రావి, మేడి, జువ్వి, మఱ్ఱి, కలుజువ్వి అనునవి క్షీరవృక్షము లనఁబడును. అని తంత్రాంతరమునందు చెప్పియున్నది.

### శిశువునకు బ్రాహ్మ్యాదికల్కపానము

తతో దక్షిణతర్జన్యా తాలూన్నమ్యావకుంఠయేత్. ౭
శిరసి స్నేహపిచునా ప్రాశ్యం చాస్య ప్రయోజయేత్,
హరేణుమాత్రం మేధాయుర్బలార్థమభిమంత్రితమ్. ౮
ఐంద్రీబ్రాహ్మీవచాశంఖపుష్పీకల్కం ఘృతం మధు,

తా. వైద్యుఁడు తనకుడిజుట్టనవ్రేలిచే శిశువుయొక్క లోదౌడనుపైకెత్తినువ్వులనూనెలో తడుపఁబడిన ప్రత్తిచే శిరమును మూయవలయును. పిదప ఆయుస్సు బలము బుద్ధియు వృద్ధిజెందుటకై పిన్నపాపర మండూకబ్రహ్మి సరస్వతియాకు వస శంఖపుష్పి వీని కల్కములో ఆవునెయ్యి తేనెయు కలిపి పూర్వోక్తమంత్రముచే నభిమంత్రించి రేణుకంతప్రమాణము శిశువునకు నాకించవలయును.

### శిశువునకు స్వర్ణచూర్ణాదిలేహము.

చామీకరవచాబ్రాహ్మీతాప్యపథ్యారజీకృతాః. ౯
లిహ్యాన్మధుఘృతోపేతాః హేమధాత్రీరజోఽథవా,

తా. బంగారు, వస, మండూకబ్రహ్మి, సరస్వతియాకు, ధాతుమాక్షికము, కరక్కాయ వీనిని చక్కగ చూర్ణముచేసి ఆవునెయ్యి, తేనె వీనిలో కలిపిగాని, లేకబంగారు ఉసిరికవరుగు వీనిచూర్ణమును ఆవునెయ్యి, తేనె వీనిలో కలిపిగాని శిశువునకు నాకించవలయును.

### శిశువునకు గర్భోదకవమనము చేయించుట.

గర్భాంభస్సైంధవవతా సర్పిషా వామయేత్తతః. ౧౦

తా. పిదప ఆవునేతితో సైంధవలవణముకలిపి యాశిశువునకు నాకించి కడుపులోనుండు గర్భోదకమును వమనము చేయించవలయును.

### జాతకర్మము.

ప్రాజాపత్యేన విధినా జాతకర్మాణి కారయేత్,

తా. తమతమ గృహ్యసూత్రములలోఁ జెప్పఁబడియుండు శిశువునకుజాతకర్మమును చేయించవలయును.

శిశువునకు ఒకటి రెండు మూడుదినములయందు ఘృతాదిపానము.

సిరాణాంహృదయస్థానాం వివృతత్వా త్ప్రసూతితః. ౧౧
తృతీయేఽహ్ని చతుర్థే వా స్త్రీణాం స్తన్యం ప్రవర్తతే,
ప్రథమే దివసే తస్మా త్త్రికాలం మధుసర్పిషీ. ౧౨
అనంతామిశ్రితే మంత్రపావితే ప్రాశయేచ్ఛిశుమ్,
ద్వితీయే లక్ష్మణాసిద్ధం తృతీయే చ ఘృతం తతః. ౧౩
ప్రాక్ప్రషిద్ధస్తనస్యాస్య తత్పాణితలసమ్మితమ్,
స్తన్యానుపానం ద్వౌ కాలౌ నవనీతం ప్రయోజయేత్. ౧౪

తా. హృదయమునందలి సిరలు ప్రసవశ్రమముచేత తెరవఁబడియుండుటవలన స్త్రీలకు ప్రసవించిన మూడవదినమునందుఁగాని నాల్గవదినమునందుఁగాని చనుబాలు జనించును. కావున శిశువునకు ప్రథమదినమునందు తేనె ఆవునెయ్యి కొంచెము దూలగొవిలరసము అనునీమూటినిఒక్కటిగాకలిపి మంత్రముచేనభిమంత్రించి దినమునకుమూడు మార్లు పానముచేయించవలయును. రెండవ మూడవదినములయందు లక్ష్మణసంజిని నేతిలోవైచికాఁచి యాఘృతమును దినమునకు మూఁడుమార్లు పానము చేయించవలయును. పిదప ఆశిశువుయొక్క అరచేతిప్రమాణము వెన్నను రెండుకాలములయందు శిశువునకు భుజింపఁజేసి చనుపాలను త్రాగించవలయును.

స్తన్యపానక్రమము.

మాతురేవ పిబే త్స్తన్యం తత్పరం దేహవృద్ధయే,
స్తన్యధాత్ర్యావుభే కార్యే తదసంపది వత్సలే. ౧౫
అవ్యంగే బ్రహ్మచారిణ్యౌ వర్ణప్రకృతితస్సమే,
నీరుజే మధ్యవయసౌ జీవద్వత్సే న లోలుపే. ౧౬
హితాహారవిహారేణ యత్నా దుపచరేచ్చ తే,

తా. శిశువు తల్లిచనుబాలను పానముచేసినయెడల మిక్కుటముగ బలము పుష్టి కలుగును. తల్లికి చనుపాలులేకుండినచో శిశువునందుప్రీతిగలవారును, అంగహీనత లేనివారును, మైథునమునువర్జించినవారును, సమానవర్ణము సమానప్రకృతిగలవారును, రోగరహితులును, మధ్యమవయస్సు గలవారును, జీవించియుండు శిశువుగలవారును

చాపల్యరహితులునైన దాదులనిద్దరి పాలిచ్చుటకు నేర్పరచి వారిని హితాహారవిహారాదులచే కడుప్రయత్నముతో నుపచరింపవలయును.

### స్తన్యక్షయవృద్ధి కారణములు.

శోకక్రోధలంఘనాయాసా స్తన్యనాశస్య హేతవః. ౧౭
స్తన్యస్య శీధువర్జ్యాని మద్యాన్యానూపజా రసాః,
క్షీరం క్షీరిణ్య ఓషధ్యశ్శోకాదే శ్చ విపర్యయః. ౧౮

తా. శోకము కోపము లంఘనము శ్రమకరమైనపనులు నివి చనుపాలు నశించుటకు కారణములు. శీధువను మద్యముతప్ప యితరములైన మద్యములు, అనూపదేశ జంతుమాంసరసములు, పాలు, పాలతోఁగూడియుండు జీవంతి మొదలగు నోషధులు, శోకము కోపము లంఘనము శ్రమకరములైన పనులు భయము ఇవి లేకుండుట. ఇవి యన్నియు చనుపాలవృద్ధికి కారణంబులు.

### రోగకర స్తన్యములు.

విరుద్ధాహారభుక్తాయాః క్షుధితాయా విచేతసః,
ప్రదుష్టధాతోర్గర్భిణ్యా స్తన్యం రోగకరం శిశోః. ౧౯

తా. విరుద్ధాహారములను భుజించియుండుస్త్రీ, ఆఁకలితోఁగూడియుండుస్త్రీ, ఉన్మాదముగలస్త్రీ, రసరక్తాదిధాతువులు దుష్టములైయుండుస్త్రీ, గర్భిణీస్త్రీ, వీరల చనుబాలు శిశువునకు రోగమును కలుగజేయును. కావున అట్టివారి స్తన్యమును ఇప్పింపఁదగదు.

### స్తన్యాభావమునందు మేఁకపాలు మొదలగునవి.

స్తన్యాభావే పయ శ్ఛాగం గవ్యం వా తద్గుణం పిబేత్,
హ్రస్వేన పంచమూలేన స్థిరయా వా సితాయుతమ్. ౨౦

తా. తల్లికి చనుబాలులేకుండినయెడల మేఁకపాలను శిశువునకు పానము చేయించవలయును. లేక హ్రస్వపంచమూలములనుగాని, ముయ్యాకుపొన్ననుగాని ఆవుపాలలోవైచి చక్కఁగకాఁచి అందులో పంచదారకలిపి పానముచేయించిన మేఁకపాలవలెనే హితకరముగనుండును.

### ఆఱవరాత్రియందు బలిరక్షణాదులు.

షష్ఠీం నిశాం విశేషేణ కృతరక్షాబలిక్రియాః,
జాగృయుర్బాంధవా స్తస్య దధతః పరమాం ముదమ్. ౨౧

తా. బంధువులు శిశువుజనించిన యారవ దినమునందు రాత్రి రక్ష బలి మొద

లగు పూజలను జేసి యా శిశువునకు మిగుల సంతసమును కల్గించుచు జాగరణము చేయ వలయును.

## నామకరణాదులు.

దశమే దివసే పూర్ణే విధిభిః స్వకులోచితైః,
కారయేత్సూతికోత్థానం నామ బాలస్య చార్చితమ్. ౧౨
బిభ్రతోఽంగై ర్మనోహ్వాలరోచనాగురుచందనమ్,
నక్షత్ర దేవతాయుక్తం బాంధవం వా సమాక్షరమ్. ౧౩

తా. పదియవదినము సంపూర్ణమైన పిదప స్వకులోచిత విధానంబులచే సూతి కోత్థానమును (అనఁగా ప్రసవించినస్త్రీకి స్నానము మొదలగువానిని) చేయించ వల యును. మఱియు నాశిశువుయొక్క శరీరమునకు మణిశిల హరిదళము గోరోచనము అగరు చందనము వీనిని లేపనముచేసి నక్షత్ర దేవతాయుక్తముగను లేక పూర్వబంధు వుల సంబంధముగలదిగను సమాక్షరములుగలదిగను కులజాత్యాదులకు యుక్తంబుగను శుభకరముగను నుండు పేరును పెట్టవలయును.

## శిశువుయొక్క ఆయుస్సును పరీక్షించు క్రమము.

తతః ప్రకృతిభేదోక్తరూపైరాయుః పరీక్షణమ్,
ప్రాగుదక్ఛిరసః కుర్యాద్బాలస్య జ్ఞానవాన్ భిషక్. ౧౪
శుచిధౌతోపధానాని నిర్మలాని మృదూని చ,
శయ్యాస్తరణవాసాంసి రక్షోఘ్నైర్ధూపితాని చ. ౧౫

తా. సమర్థుఁడగువైద్యుఁడు నామకరణానంతరము శిశువును తూర్పున శిర ముండునటులగాని, ఉత్తరమున శిరముండునటులగాని బరుండబెట్టి వికృతి విజ్ఞానీ యాధ్యాయమున చెప్పియుండు ప్రకృతిభేదలక్షణంబులచే ఆయుస్సును పరీక్షించి ఆ శిశువునకు పరిశుద్ధముగను తెల్లగనునుండు దిండ్లు, మురికిలేనిదిగ మెత్తగనుండు పరుపు వీనికిరక్షోహరములైన ధూపములుచేసి అందులో శిశువును పరుండబెట్ట వలయును.

## రక్షోహరధూపము.

కాకో విశస్తశ్శస్తశ్చ ధూపనే త్రివృతాన్వితః,

తా. సజీవముగనుండు కాకినిచంపి యాకాకిమాంసమును తెల్లతెగడును గూర్చి శిశువుయొక్క పరుపులు గుడ్డలు మున్నగువానికి ధూపము వేసినరాక్షసహరముగ నుండును.

### శిశువునకు మణ్యౌషధాదిధారణము.

జీవత్ఖడ్గాదిశృంగోత్థాః సదా బాలశ్శుభాన్మణీః. ౨౬
ధారయేదౌషధీః శ్రేష్ఠా బ్రాహ్మ్యైంద్రీ జీవకాదికాః,
హస్తాభ్యాం గ్రీవయా మూర్ధ్నా విశేషాత్సతతం వచామ్. ౨౭
ఆయుర్మేధాస్మృతిస్వాస్థ్యకరీం రక్షోఽభిరక్షిణీమ్,

తా. జీవించియుండు ఖడ్గమృగము మొదలైనవాని కొమ్ములలో జనించినవియు ... కరములునైన రత్నములు మండూకబ్రహ్మి సరస్వతియాకు పిన్నపాపర జీవకము వలగు నోషధులు వీనిని శిశువుయొక్క హస్తాదులయందు ధరింపఁజేయవలయును. ...యు రాక్షసుల నివారించునదియు, ఆయుస్సు బుద్ధి స్మృతి సౌఖ్యము వీనిని గలుగఁ ...నదియు నైనవసను చేతులు మెడ శిరము వీనియందెల్లప్పుడు ధరించునటుల ...వలయును.

### శిశువునకు అన్నప్రాశనము.

పంచమే మాసి పుణ్యేఽహ్ని ధరణ్యాముపవేశయేత్. ౨౮
షష్ఠేఽన్నప్రాశనం మాసి క్రమాత్తత్ర ప్రయోజయేత్,

తా. ఐదవ మాసమున శుభదినమునందు శిశువును భూమిపై పరుండబెట్టవల... ఆరవ మాసమునందు విధిప్రకారము అన్నప్రాశనమును చేయించవలయును.

### శిశువుకు కర్ణవేధము.

షట్సప్తమాష్టమాసేషు నీరుజస్య శుభేఽహని. ౨౯
కర్ణౌ హిమాగమే విధ్యేద్ధాత్ర్యంకస్థస్య సాంత్వయన్,

తా. (6) లేక (7) లేక (8) వ మాసమున ఆరోగ్యతనున్న శిశువును శుభ...ర్తమున చల్లనికాలమునందు తల్లియంకతలంబుననుంచుకొని శిశువునకు భయము ...ండునటుల నోదార్చుచు చెవులను కుట్టవలయును.

### కర్ణవేధన క్రమము.

ప్రాగ్దక్షిణం కుమారస్య భిషగ్వామం తు యోషితః. ౩౦
దక్షిణేన దధత్సూచీం పాళిమన్యేన పాణినా,
మధ్యతః కర్ణపీఠస్య కించిద్గండాశ్రయం ప్రతి. ౩౧
జరాయుమాత్రప్రచ్ఛన్నే రవిరశ్మ్యవభాసితే,
ధృతస్యనిశ్చలం సమ్యగలక్తకరసాంకితే. ౩౨

విధ్యేద్దైవకృతే ఛిద్రే సకృదేవర్జులాఘవాత్,
నోర్ధ్వం న పార్శ్వతో నాధస్సిరాస్తత్ర హి సంశ్రితాః. 33
కాళికా మర్మరీ రక్తా

తా. బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు తల్లియంకతలంబున శిశువునుకదలకుండ పట్టుకొనునటులజేసి తనకుడిచేతితో సూదిని, ఎడమచేతితో శిశువుయొక్క చెవి కొనభాగమునుపట్టుకొని తన్మధ్యభాగమున కొంచెముకణత ప్రక్కన జరాయువుచే మూయఁబడియుండునదియు, సూర్యరశ్మిచే ప్రకాశించునదియు, తొలుత లత్తుకరసము చేగుర్తుబెట్టఁబడినదియునైన దైవకృతరంధ్రమును వంకరలేక ఒకేపర్యాయము కుట్టవలయును. పురుషశిశువునకు తొలుత కుడిచెవియును స్త్రీశిశువునకు తొలుత నెడమచెవియును కుట్టవలయును. చెవితన్మధ్యయొక్క మధ్యప్రదేశమున కూర్ధ్వాధః పార్శ్వప్రదేశములయందు 'కాళికా, మర్మరీ, రక్తా' అనునాడులకు గాయముతగులును; కావున పైన చెప్పినస్థలమునకన్న నితరస్థలములయందు కర్ణవేధనము చేయఁజనదు.

కర్ణసిరావేధమువలనజనించు నుపద్రవములు.

తద్వ్యథా ద్రాగరుగ్జ్వరాః,
సశోఫదాహసంరంభ మన్యాస్తంభావతానకాః.
తేషాం యథామయం కుర్యాద్విభజ్యాశు చికిత్సితమ్. 34

తా. చెవులయందుండు కాళికాది సిరలకు గాయము తగిలిన యెఱుపువర్ణము శూల, జ్వరము, వాపు, సర్వాంగతాపము, జ్వరవేగము, మన్యాస్తంభము, అపతానకము, ఈయుపద్రవములు జనించును. కావున చక్కఁగపర్యాలోచించి ఆయారోగములను తగినట్టు చికిత్సలు చేయవలయును.

స్థానవేధ గుణము.

స్థానే వ్యథాస్రరుధిరం నరుగ్రాగాదిసంభవః. 35

తా. చెవిని సరియైన స్థానమునందు కుట్టినయెడల రక్తము, శూలలు, ఎఱుపు వర్ణము మొదలగునవి కలుగనేరవు.

కర్ణవేధానంతరకర్తవ్యము.

స్నేహాక్తం సూచ్యనుస్యూతం సూత్రం చాను నిధాపయేత్,
ఆమే తైలేన సించేచ్చ బహళాం తద్వదారయా. 36
విధ్యేత్పాళీం హితభుజస్సంచార్యాథ స్థవీయసీ,
వర్తిస్త్ర్యహాత్తతో రూఢం వర్ధయేత శనైశ్శనైః 37

తా. చెవినికుట్టినపిదప సూదిలో గ్రుచ్చియుండు దారమును నూనెలో తడిపి యాద్వారమునందుకట్టి దాని నుంచవలయును. పలుమారు తైలముచే తడుపుచుండవల యును. శిశువు చెవితమ్మెలావుగనుండినయెడల చర్మమునుకుట్టునట్టి సూదిచేకుట్టవల యును. పిదప మూఁడు దినములకుపైన లావుగనుండు వర్తులను కుట్టినద్వారములో ప్రవే శింపఁజేసి మెల్ల మెల్లఁగ నానాట నాద్వారమును పెంచవలయును.

## శిశువునకు అన్నప్రయోగక్రమము.

అథైనం జాతదశనం క్రమేణాపనయేత్స్తనాత్,
పూర్వోక్తం యోజయేత్క్షీర మన్నం చ లఘు బృంహణమ్. ౩౮

తా. శిశువునకు దంతములుజనించిన పిదప క్రమక్రమముగ చనుబాలను నివ ర్తింపఁజేసి పూర్వము చెప్పియుండు మేఁకపాలు మొదలగునవియు లఘువుగను శరీర పుష్టికరముగను నుండు అన్నమును తినిపించవలెను.

## శిశువునకు దీపనాది మోదకములు.

ప్రియాళమజ్జమధుకమధులాజాసితోపలైః,
అపస్తనస్య సంయోజ్యః ప్రీణనో మోదకశ్శిశోః. ౩౯
దీపనో బాలబిల్వైలాశర్కరాలాజసక్తుభిః,
సంగ్రాహీ ధాతకీపుష్పశర్కరాలాజతర్పణైః ౪౦

తా. చనుబాలనువిడిచి అన్నాదులనుభుజించునట్టి శిశువునకు చారపప్పు అతి మధురము, తేనె, వరిపేలాలు, ఖండశర్కర వీనితోచేయఁబడిన కుడుముల నిప్పించ వలయును. ఇదితృప్తినిగలుగఁజేయును; మఱియు లేఁతమారేడు ఏలకులు, పంచదార, వరిపేలపిండి వీనితోచేయఁబడినవియు అగ్నిదీపనకరములునైన కుడుములను, ఆరెపువ్వు పంచదార వరిపేలపిండి వీనితోచేయఁబడినవియు మలమును గట్టిపరచునవియునైన మోదకముల నిప్పించవలయును.

## శిశువులకు సౌమ్యౌషధప్రయోగము.

రోగాం శ్చాస్య జయేత్సౌమ్యై ర్భేషజై రవిషాదకైః,
అన్యత్రాత్యయికాద్వ్యాధేర్విరేకం సుతరాం త్యజేత్. ౪౧

తా. శిశువునకు రోగముజనించినయెడల నేదైన దారుణము కాకుండునవియు కష్టమును కలుగఁజేయకుండునవియునైనయౌషధములచే చికిత్స చేయవలయును. అసాధ్య వ్యాధియందు తప్ప యితరరోగములయందు విరేచనమున కిప్పింపఁజనదు.

### త్రాసన నిషేధము.

త్రాసయేన్నావిధేయం తం త్రస్తం గృహ్ణంతి హి గ్రహాః.

తా. చండితనముగల శిశువును బెదరింపంజనదు. అటులబెదరించిన నాసమయమున నాశిశువునకు బాలగ్రహములు సోఁకును.

### శిశురక్షణక్రమము.

వస్త్రవాతాత్పరస్పర్శాత్పాలయేల్లంఘితాచ్చ తమ్. ౪౨

తా. శిశువునకు బట్టనుండువచ్చు గాలిని సోకనీయకూడదు. కఠినములగు వస్తువుల స్పర్శము తగులనీయఁదగు. ఆహారం బిడక పస్తుబెట్టఁదగదు.

### బాలురకు బ్రాహ్మ్యాదిఘృతము.

బ్రాహ్మీసిద్ధార్థకవచాసారిబాకుష్ఠసైంధవైః,
సకణై స్సాధితం పీతం వాఙ్మేధాస్మృతికృద్ఘృతమ్. ౪౩
ఆయుష్యం పాప్మరక్షోఘ్నం భూతోన్మాదనిబర్హణమ్,

తా. మండూకబ్రహ్మి (సరస్వతియాఁకు), తెల్లవాలు, వస, నల్లసుగంధిపాల, చెంగల్వకోష్టు, సైంధవలవణము, పిప్పళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలోఁ కలిపి ఘృతపాకవిధి ప్రకారము పక్వముచేయఁబడినఘృతమును శిశువునకు పానముచేయించిన వాక్పటుత్వము, బుద్ధి, స్మృతి, ఆయుర్వృద్ధి ఇవి కలుగును. మఱియు పాపము, రాక్షసబాధ, భూతపీడ, ఉన్మాదంబును హరించును.

### అష్టాంగఘృతము.

వచేందులేఖా మండూకీ శంఖపుష్పీ శతావరీ. ౪౪
బ్రహ్మసోమాఽమృతా బ్రాహ్మీః కల్కీకృత్య పలాంశికాః,
అష్టాంగం విపచే త్సర్పిః ప్రస్థం క్షీరం చతుర్గుణమ్ ౪౫
తత్పీతంధన్య మాయుష్యం వాఙ్మేధాస్మృతిబుద్ధికృత్,

తా. వస, క్రాలుగచ్చ, మండూకబ్రహ్మి (సరస్వతియాఁకు), శంఖపుష్పి, పిల్లిపీఁచర, బ్రహ్మచెట్టు, తిప్పతీఁగె, పొన్నగంటి వీనిని దినుసుకు (1) పలముచొప్పున గ్రహించి కల్కముచేసి (1) ప్రస్థ మావునేతిలోఁకలిపి (4) ప్రస్థము ఆవుపాలుబోసి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది అష్టాంగఘృతమనఁబడును. దీనిని శిశువులకు పానముచేయించిన ఆయుర్వృద్ధి, వాక్పటుత్వము, ధారణాశక్తి, స్మృతి, బుద్ధి ఇవి కలుగును.

### సారస్వతఘృతము.

అజాక్షీరాభయావ్యోషపాఠోగ్రాశిగ్రుసైంధవైః. ౪౬
సిద్ధం సారస్వతం సర్పి ర్వాఙ్మేధాస్మృతి *వహ్ని కృత్,

తా. కరక్కాయలు, త్రికటుకములు, చిరుబొద్ది, వస, మునగ, సైంధవలవణము వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలోకలిపి నేతికినాలుగింతలు మేకపాలుబోసి విధిప్రకారము పక్వముచేసిన నది సారస్వతఘృతమనఁబడును. ఇది బాలురకు వాక్పటుత్వము, ధారణాశక్తి, స్మృతి, అగ్నిదీపనము వీనిని కలుగఁజేయును.

### శిశువునకు వచాదిఘృతము.

వచామృతాశఠీపథ్యా శంఖినీవేల్లనాగరైః. ౪౭
అపామార్గేణ చ ఘృతం సాధితం పూర్వవద్గుణైః,

తా. వస, తిప్పతీఁగె, కచోరములు, కరకాయ, శంఖిని, వాయువిడంగములు, శుంఠి, ఉత్తరేణి వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలోకలిపి పక్వముచేసి యిప్పించిన శిశువునకు పైశ్లోకములోజెప్పియుండు బుద్ధి మొదలగు గుణములు కలుగును.

### హేమచూర్ణాదియోగ చతుష్టయము.

హేమ శ్వేతవచా కుష్ఠమర్కపుష్పీ సకాంచనా. ౪౮
హేమమత్స్యాక్షకశ్శంఖః కై డర్యః కనకం వచా,
చత్వార ఏతే పాదోక్తాః ప్రాశ్యా మధుఘృతాప్లుతాః ౪౯
వర్షం లీఢా వపుర్మేధాబలవర్ణకరాశ్శుభాః,

తా. బంగారు, తెల్లవస, చెంగల్వకోష్టు వీనిచూర్ణము నైనను, కోలపాల, బంగారు వీనిచూర్ణము నైనను, బంగారు, పొన్నగంటి, శంఖము వీనిచూర్ణము నైనను, సమ్ముదుటేకు, బంగారు, వస వీనిచూర్ణము నైనను; ఈనాల్గుచూర్ణయోగములతో నేనినైనను తేనె, ఆవునెయ్యి వీనిలో కలిపి శిశువునకు ఒక సంవత్సరమువరకు నాకించిన శరీరమునకువృద్ధి, బుద్ధి, బలము, మంచివర్ణంబును కలుగును. ఈ నాల్గు యోగములు కడుప్రశస్తంబులైనవి.

---

* బుద్ధి కృత్.

### వాక్శుద్ధికరవచాదిచూర్ణము.

వచాయష్ట్యాహ్వసింధూత్థపథ్యానాగరదీప్యకైః ౫౦
శుద్ధ్యతేవాగ్ఘవిర్లీఢైస్సకుష్ఠకణజీరకైః,

ఇత్యష్టాంగహృదయే ఉత్తరతంత్రే ప్రథమోఽధ్యాయః

తా. వస, యష్టిమధుకము, సైంధవలవణము, కరక్కాయ, సొంటి, ఓమము, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, జీలకఱ్ఱ వీనిని సమభాగములుగ చూర్ణముచేసి నేతిలోకలిపి బాలులకు నాకించిన వాక్కు స్ఫుటముగ నగును.

ఇది అష్టాంగహృదయమందలి ఉత్తరతంత్రమను
మొదటి అధ్యాయము ముగిసినది.



శ్రీ ర స్తు

# ద్వితీయాధ్యాయము.



అవ. పూర్వాధ్యాయమునందుఁజెప్పిన ప్రకారము బాలురకు పచారములను జేసియు రోగములు కలిగినయెడల నారోగములకు చికిత్సలను తెలియపరచుటకై బాలోపచరణీయాధ్యాయనిరూపణానంతరము బాలామయ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్న యది:—

## బాలామయప్రతిషేధాఽధ్యాయః.

అథాతో బాలామయ ప్రతిషేధం వ్యాఖ్యాస్యామః.
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

తా. బాలోపచరణీయాధ్యాయనిరూపణానంతరము బాలురకు జనించు రోగములకు చికిత్సలను దెలియపరచునట్టి బాలామయ ప్రతిషేధమను నీ యధ్యాయమును వివరించెదము.

### త్రివిధబాలురు.

త్రివిధః కథితో బాలః క్షీరాన్నోభయవర్తనః,
స్వాస్థ్యం తాభ్యామదుష్టాభ్యాం దుష్టాభ్యాం రోగసంభవః.౧

తా. క్షీరవర్తనుఁడు అన్నవర్తనుఁడు ఉభయవర్తనుఁడు అని బాలురు మూఁడు ప్రకారములుగనుందురని మహర్షులు వచింపుచున్నారు. (పాలనుమాత్రము త్రాగుస్థితి నుండుబాలుఁడు క్షీరవర్తనుఁడు, పాలనువదలి యన్నమునుమాత్రము తిను బాలుఁడు అన్నవర్తనుఁడు, పాలను అన్నమును గూడ నాహారముచేయు బాలుఁడు ఉభయవర్తనుడు.) అట్టిపాలు అన్నము ఇవి దోషరహితంబులై యుండినయెడల బాలురకు రోగము జనింపదు. దుష్టంబులైయుండిన రోగములు జనించును.

### శుద్ధక్షీరలక్షణము.

యదప్సు చైకతాం యాతి న చ దోషైరధిష్ఠితమ్,
తద్విశుద్ధం పయః

తా. ఉదకములోఁబోసిన నొకటిగకలియునదిగను వాతాదిదోషములచే చెరచబడకయుండునదిగనుండుపాలు శుద్ధమయినదని తెలిసికొనవలయును.

### వాతదుష్టక్షీరలక్షణము.

వాతాద్దుష్టం తుప్లవతేఽంభసి. ౨
కషాయం ఫేనిలం రూక్షం వర్చోమూత్రవిబంధకృత్,

తా. ఉదకములోఁబోసిన పైకితేలునదిగను వగరుగను నురుగుతోఁగూడినదిగను, రూక్షగను (జిడ్డులేనిదిగ) నుండు చనుపాలు వాతముచే దుష్టమయినదని తెలిసికొనవలయును. ఇది మలమూత్రములను బంధించును.

### పిత్తదుష్టక్షీరలక్షణము.

పిత్తా దుష్ణామ్లకటుకం పీతరాజ్యప్సు దాహకృత్. ౩

తా. పిత్తముచే దూషింపఁబడిన చనుపాలు ఉష్ణముగను పుల్లగను కారముగను ఉండును; ఉదకములోఁబోసిన పసుపువర్ణముగల రేఖలుగలదిగనుండును; ఇది సర్వాంగతాపమును కలుగజేయును.

### కఫదుష్టక్షీరలక్షణము.

కఫా త్సలవణం సాంద్రం జలే మజ్జతి పిచ్ఛిలమ్,

తా. కఫదుష్టమైన చనుబాలు కొంచెముప్పగ దట్టముగనుండును. ఉదకములోఁ బోసిన కలియక మునిగిపోవును. జిగటగనుండును.

### సంసర్గసన్నిపాత దుష్టక్షీరలక్షణము.

సంసృష్టలింగం సంసర్గా త్త్రిలింగం సాన్నిపాతికమ్. ౪

తా. రెండేసిదోషముల సంసర్గముచే దుష్టమైన చనుబాలు వాతాదులకు వేరువేర జెప్పఁబడిన లక్షణములలో రెండేసిదోషముల లక్షణములు కలిగియుండును. సన్నిపాతదుష్టమైనపాలకు వాతాదిదోషదుష్టలక్షణములన్నియుఁ గలిగియుండును.

### దుష్టక్షీరజరోగములు.

యథా స్వలింగాం స్తద్వ్యాధీన్ జనయత్యుపయోజితమ్,

తా. పైవాతాదిదోషములచే దుష్టమైన పాలను శిశువున కుపయోగించినచో ఆ యాదోషలక్షణములుగల వ్యాధులు జనించును.

### తీక్ష్ణాతీక్ష్ణరోగజ్ఞానము.

శిశో స్తీక్ష్ణామతీక్ష్ణాంచ రోదనాల్లక్షయేద్రుజమ్. ౫

తా. శిశువునకు స్వల్పముగను లేక తీవ్రముగనునుండు రోగమును ఆశిశువు యొక్క రోదనముచేతనే తెలిసికొనవలయును. (అనఁగా మిక్కుటముగ నేడ్చిన దారుణవ్యాధియనియు, కొంచెముగనేడ్చిన స్వల్పవ్యాధియనియు) తెలిసి కొన వలయును.

## ఉపద్రవయుక్తశరీరచిహ్నము.

సోఽయం స్పృశేద్భృశం దేశం యత్రచ స్పర్శనాక్షమః,
తత్ర విద్యాద్రుజం

తా. శిశువు తనశరీరములో ఏప్రదేశమును పలుమారు చేతితో తాకుచుండునో, ఎచట తాకిన సహించకుండునో అట్టిప్రదేశమునందు నొప్పికలిగియున్నదని తెలిసి కొనవలయును.

## శిశువుయొక్కశిరోహృదోగాదిచిహ్నము.

మూర్ధ్ని రుజం చాక్షినిమీలనాత్. ౬
హృది జిహ్వోష్ఠదశనశ్వాసముష్టినిపీడితైః,
కోష్ఠే విబంధవమథుస్తనదంశాంత్రకూజనైః. ౭
ఆధ్మానపృష్ఠనమనజఠరోన్నమనైరపి,
వస్తౌ గుహ్యే చ విణ్మూత్రసంగత్రాసదిగీక్షణైః. ౮

తా. శిశువు ఎల్లపుడు కండ్లుమూసికొనియుండినచో శిరమునందు నొప్పికలిగి యున్నదనియు, నాలుక, పెదవులు వీనిని పలుమారుకరచుట, శ్వాసము, చేతులు ముడిచికొనుట, ఇవి కలిగియుండినచో హృదయమునందునొప్పి గలిగియున్నదనియు, మలబంధము, వాంతి, తల్లిస్తనములను కరచుట ప్రేగులరచుట, ఇవి కలిగియుండినచో కడుపునందు నొప్పిగలిగి యున్నదనియు, కడుపుబ్బరము, వీపునువంచుట కడుపును పైకెత్తుట ఇవికలిగియొండినచో పొత్తికడుపుననొప్పి గలిగియున్నదనియు, మలమూత్ర ప్రతిబంధము, ఉలికిపడుట, దిక్కులుచూచుట ఇవికలిగియుండినచో గుదమునందు నొప్పిగలిగియున్నదనియు తెలిసికొనవలయును.

## బాలరోగచికిత్సాక్రమము.

అథ ధాత్ర్యాః క్రియాం కుర్యాద్యథాదోషం యథామయమ్,

తా. శిశువులకు రోగముజనించినచో నారోగములకును దోషములకును అనుగుణ ములైన చికిత్సలను తల్లికిచేయవలయును.

### వాతదుష్టస్తన్యదోషచికిత్స.

తత్ర వాతాత్మకే స్తన్యే దశమూలం త్ర్యహం పిబేత్. ౯
అథవాఽగ్ని వచాపాఠాకటుకాకుష్ఠదీప్యకమ్,
సభార్ఙ్గి దారుసరళవృశ్చికాలీకణోషణమ్. ౧౦

తా. వాతదుష్టస్తన్యమునందు దశమూలకషాయమునుగాని, చిత్రమూలము, వస, చిరుబొద్ది, కటుకరోహిణి, చెంగల్వకోష్టు, ఓమము, గంటుభారంగి, దేవదారు, సరళదేవదారు, తేలుమణి, పిప్పళ్లు, మిరియాలు వీనికషాయమునుగాని మూఁడుదినములు తల్లికి పానముచేయించవలయును.

### వాతదుష్టస్తన్యమునందు ఘృతపానాదులు.

తతః పిబేదన్యతమం వాతవ్యాధిహరం ఘృతమ్,
అనుచాచ్ఛసురామేవం స్నిగ్ధం మృదు విరేచయేత్. ౧౧
వస్తికర్మ తతః కుర్యాత్స్వేదాదీంశ్చానిలాపహాన్,

తా. పిదప తల్లికి వాతవ్యాధి చికిత్సితాధ్యాయమున చెప్పియుండు వాతహరఘృతములలో దేనినైన నొకదానిని పానముచేయించి తేటగనుండు సురయను మద్యమును పానముచేయించవలయును. తర్వాత స్నేహకర్మను చేయించి మృదువిరేచనము, వస్తికర్మ, వాతహరములైన స్వేదాభ్యంగములు వీనిని క్రమముగ చేయించవలయును.

### వాతదుష్టస్తన్యమునందు శిశువునకు రాస్నాదిచూర్ణము.

రాస్నాజమోదాసరళదేవదారురజోన్వితమ్. ౧౨
బాలో లిహ్యాద్ఘృతంతైర్వా విపక్వం ససితోపలమ్,

తా. సన్నరాస్నము, ఓమము, సరళదేవదారుచెక్క వీనిని చక్కగచూర్ణము చేసి నేతిలోకలిపి శిశువునకు నాకించవలయును. లేక పైజెప్పఁబడిన సన్నరాష్ట్రము మొదలగుద్రవ్యములతో పక్వము జేయఁబడినఘృతములో ఖండశర్కరను కలిపి నాకించవలయును.

### పిత్తదుష్టస్తన్యజనితరోగచికిత్స.

పిత్తదుష్టేఽమృతాభీరుపటోలీనింబచందనమ్. ౧౩
ధాత్రీ కుమారశ్చ పిబేత్క్వాథయిత్వా ససారిబమ్,
అథవా త్రిఫలాముస్తభూనింబకటురోహిణీః. ౧౪

సారిబాదిం పటోలాదిం పద్మకాదిం తథా గణమ్,

తా. పిత్తముచే దుష్టమైన స్తన్యమునందు తల్లికిని బిడ్డకును తిప్పతీఁగె, పిల్లిపీచర, చేఁదుపొట్ల, వేము, చందనము, నల్లసుగంధిపాల వీని నుదకములోవైచి చక్కఁగ కాఁచి యాకషాయమునుగాని, త్రిఫలములు, తుంగముస్తలు, నేలవేము, కటుకరోహిణి వీని కషాయమునుగాని, సారిబాది గణద్రవ్యములకషాయమునుగాని, పటోలాదిగణద్రవ్యముల కషాయమునుగాని, పద్మకాదిగణద్రవ్యముల కషాయమునుగాని పానముచేయింప వలయును.

పిత్తదుష్టస్తన్యరోగమునందు ఘృతపానాదులు.

ఘృతాన్యేభిశ్చ సిద్ధాని పిత్తఘ్నం చ విరేచనమ్. ౧౩

శీతాంశ్చాభ్యంగలేపాదీన్యుంజ్యాత్

తా. పిత్తముచే దూషింపఁబడిన స్తన్యమునందు సారిబాది గణద్రవ్యముల కల్కముతోడను పటోలాదిగణద్రవ్యములకల్కముతోడను పద్మకాదిగణద్రవ్యముల కల్కముతోడను వెవ్వేరుగ పక్వము చేయఁబడిన ఘృతములను తల్లికిని బిడ్డకును పానము చేయించవలయును. పిత్తహరములగు విరేచనౌషధముల నిప్పించి శీతముగనుండు అభ్యంగ లేపనాదులను చేయించవలయును.

కఫదుష్టస్తన్యజనితరోగచికిత్స.

శ్లేష్మాత్మకే పునః.

యష్ట్యాహ్వసైంధవయుతం కుమారం పాయయేద్ఘృతమ్. ౧౪

సింధూత్థపిప్పలీమద్వా పిష్టైః క్షౌద్రయుతైరథ,

రాటపుష్పైః స్తనౌ లింపేచ్ఛిశోశ్చ దశనచ్ఛదౌ. ౧౫

సుఖ మేవం వమేద్బాలః

తా. శ్లేష్మదుష్టస్తన్యమునందు యష్టిమధుకము, సైంధవలవణము వీనిచూర్ణమును నేతిలోకలిపిగాని, సైంధవలవణము, పిప్పళ్లు వీనిచూర్ణమును నేతిలోకలిపిగాని శిశువునకు పానముచేయించవలయును. మ్రంగపువ్వును నూరి తేనెలో కలిపి తల్లిస్తనముల ను శిశువుయొక్క పెదవులకును లేపనముచేసి యాస్తన్యమును శిశువు పానముచేయు నట్లు చేయవలయును. ఇటులచేసిన శిశువునకు అనాయాసముగ వమనంబగును.

కఫదుష్టస్తన్యజనితరోగమున తల్లికి వమనాదులు.

తీక్ష్ణైర్ధాత్రీం తు వామయేత్,

అథాచరితసంసర్గీం ముస్తాదిక్వథితం పిబేత్. ౧౮
తద్వత్తగరపృథ్వీకాసురదారుకళింగకాన్,
అథవాతివిషాముస్తషడ్గ్రంథాపంచకోలకమ్. ౧౯

తా. పిదప తీక్ష్ణమైన వమనౌషధములచే తల్లికి వమనముచేయించి పేయమొదలగు వానిని త్రిప్పించి ముస్తాదిగణద్రవ్యముల కషాయమునుగాని, గ్రంథితగరము, పెద్దజీలకఱ్ఱ, దేవదారు, కొడిసెవిత్తులు వీనికషాయమునుగాని, అతివస, తుంగముస్తలు, వస, పంచకోలములు వీనికషాయమునుగాని పానముచేయించవలయును.

## బాలురకు క్షీరాలసకరోగలక్షణము.

స్తన్యే త్రిదోషమలినే దుర్గంధ్యామం జలోపమమ్,
విబద్ధమచ్ఛం విచ్ఛిన్నం ఫేనిలం చోపవేశ్యతే. ౨౦
శకృన్నానావ్యథావర్ణం మూత్రం పీతం సితం ఘనమ్,
జ్వరారోచకతృట్ఛర్దిశుష్కోద్గారవిజృంభికాః. ౨౧
అంగభంగోఽంగవిక్షేపః కూజనం వేపథుర్భ్రమః,
ఘ్రాణాక్షిముఖపాకాద్యా జాయంతేఽన్యేఽపి తం గదమ్. ౨౨
క్షీరాలసకమిత్యాహురత్యయం చాతిదారుణమ్,

తా. చనుబాలు సన్నిపాతదుష్టంబై యుండినచో శిశువునకు దుర్గంధముగలదియు, అజీర్ణముతోఁగూడినదియు, ఒకపుడు జలముతో తుల్యమైనదియు, మలబంధముతోఁగూడినదియు, ఒకపుడు నిర్మలముగనుండునదియు, నురుగుతోఁ గూడినదియు, నానావిధములైన బాధలు వర్ణములుగలదియు నగు మలమువెడలును. మూత్రము పసుపువర్ణముగను, కొంచెము తెల్లగను, చిక్కగను వెడలును. జ్వరము, అరోచకము, దప్పి, వాంతి, ఓఁకరం, ఆవులింతలు, అవయవములను విరిచికొనుట, కదలించుట, కూఁతలు వేయుట, వణఁకు, భ్రమ, ముక్కు, కండ్లు, నోరు, వీనియందు పాకము (అనఁగా వ్రణము) మొదలగు ననేకోపద్రవములు జనించును. దీనిని క్షీరాలసకరోగమని వైద్యవరులు చెప్పెదరు. ఇది మరణమును కలుగఁజేయును; మిగుల దారుణమైనది.

## క్షీరాలసకరోగచికిత్స.

తత్రాశు ధాత్రీం బాలం చ వమనేనోపపాదయేత్. ౨౩
విహితాయాం చ సంసర్గ్యాం వచాదిం యోజయేద్గణమ్,
నిశాదిం వాథవా ముస్త్రీ పాఠాతిక్తాఘనామయాన్. ౨౪

తా. క్షీరాలసకరోగమునందు శిశువునకు తల్లికిని వమనము చేయించి తల్లికి పేయమొదలగు ఆహారముల నిప్పించి, వచాదిగణద్రవ్య కషాయమునుగాని చూర్ణమును గాని, నిశాదిగణ ద్రవ్యకషాయమునుగాని చూర్ణమునుగాని, అతివస, చిరుబొద్ది, కటుక రోహిణి, తుంగముస్తలు, చెంగల్వకోష్టు వీని కషాయమును గాని చూర్ణమును గాని యిప్పించవలయును.

## స్తన్యదోషహరద్రవ్యములు.

పాఠామృతాశుంఠీ త్రికటుకాదేవాహ్వసారిబాః,
సముస్తమూర్వేంద్రయవాః స్తన్యదోషహరాః పరమ్. ౨౫

తా. చిరుబొద్ది, తిప్పతీగె, నేలవేము, కటుకరోహిణి, దేవదారు, నల్ల సుగంధిపాల, తుంగముస్తలు, చాగ, కొడిసెవిత్తులు ఇవి స్తన్యదోషములను పోగొట్టును.

అనుబంధే యథావ్యాధి ప్రతికుర్వీత కాలవిత్,

తా. పైన చెప్పినప్రకారము చికిత్స జేసినను బాలురకు స్తన్యదోషమువలన జనించిన రోగము శమింపకయుండిన కాలము నెఱింగి వైద్యుండు రోగానుగుణముగ చికిత్సలను చేయవలయును.

## దంతోత్పత్తిజనితరోగములు.

దంతోద్భేదశ్చ రోగాణాం సర్వేషామపి కారణమ్. ౨౬
విశేషాజ్జ్వరవిడ్భేదకాసచ్ఛర్దిశిరోరుజామ్,
అభిష్యందస్య పోథక్యా విసర్పస్య చ జాయతే. ౨౭
పృష్ఠభంగే బిడాలానాం బర్హిణాం చ శిఖోద్గమే,
దంతోద్భవే చ బాలానాం న హి కించిన్న దూయతే. ౨౮

తా. శిశువులకు దంతోత్పత్తి సర్వరోగములకు కారణము కావున పండ్లు మొలచునప్పుడు శిశువులకు జ్వరము, మలభేదము, కాసము, వాంతి, తలనొప్పి, అభిష్యందము, పోథకి, విసర్పము అనునీరోగములు విశేషముగ కలుగును. మఱియు పిల్లులకు పృష్ఠభంగము కలుగునప్పుడును, నెమళ్లకు జుట్టు జనించునప్పుడును, బాలురకు దంతములు జనించునప్పుడు సర్వాంగములయందు దవ్యముగ మిక్కుటమైన యుపద్రవములు కలుగును.

## దంతోత్పత్తిరోగచికిత్స

యథాదోషం యథారోగం యథోద్రేకం యథాశయమ్,
విభజ్య దేశకాలాదీంస్తత్ర యోజ్యం భిషగ్జితమ్. ౨౯

తా. బాలురకు దంతములు జనించుటవలన కలుగు రోగములయందు వాతాది దోషములు, జ్వరాదిరోగములు, ఆశయము, దేశకాలసత్త్వసాత్మ్య ప్రకృతులు వీని నాలోచించి తత్తదనుకూలముగ నౌషధముల నొసంగవలయును.

బాలుర కౌషధములు.

త ఏవ దోషా దూష్యాశ్చ జ్వరాద్యా వ్యాథయశ్చ యత్,
అత స్తదేవ భైషజ్యం మాత్రా త్వస్య కనీయసీ. 30
సౌకుమార్యాల్పకాయత్వాత్సర్వాన్నానుపసేవనాత్,

తా. సూత్రస్థానములో చెప్పియుండు వాతాదిదోషములు, రసాదిధాతువులు, జ్వరాదిరోగములు ఇవి బాలురకును పెద్దవారికుండువిధముగనే యుండును. కాన వస్తుభేద ముండదు. కావున చికిత్సాస్థానములో చెప్పియుండు నౌషధములనే బాలుర కిప్పించవలయును. అయితే శిశువులు సుకుమారులుగను, స్వల్పముగనుండు శరీరముగలవారునగుటవలనను, సమస్తవిధాన్నములను భుజింపకుండుటవలనను, వారికి నౌషధపరిమాణము మాత్రము మిక్కిలి స్వల్పముగ నుండును.

బాలురకు వమనము.

స్నిగ్ధా ఏవ సదా బాలా ఘృతక్షీరనిషేవణాత్. 31
సద్యస్తాన్ వమనం తస్మాత్పాయయేన్మతిమాన్ మృదు,

తా. శిశువు లెల్లపుడు ఘృతక్షీరములను భుజింపుచుండుటవలన స్నిగ్ధశరీరులుగ నుందురు, కావున వారికి జ్వరాదిరోగములు కనిపించినతోడనే మృదువైన వమనౌషధమును బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు పానము చేయించవలయును.

స్తన్యపానము చేయుబాలురకు వమనము.

స్తన్యస్య తృప్తం వమయేత్క్షీరక్షీరాన్నసేవినమ్. 32

తా. చనుబాలనుమాత్రము త్రాగునట్టి శిశువులకును, పాలు, అన్నము ఈరెంటిని భుజించునట్టి శిశువులకును తొలుత చనుబాలను తృప్తిగ పానముచేయించి పిదప వమనము చేయించవలయును.

అన్నమును భుజించునట్టిబాలురకు వమనక్రమము.

పీతవంతం తనుం పేయామన్నాదం ఘృతసంయుతామ్,

తా. అన్నమునుమాత్రము భుజించునట్టి బాలురకు తేటగనుండు పేయయను గంజిలో ఆవునేతినికలిపి తృప్తిగ పానముచేయించి వమనౌషధము నిప్పించవలయును.

బాలురకు వస్త్యాదిప్రయోగక్రమము.

వస్తిసాధ్యే విరేకేణ మర్శేన ప్రతిమర్శనమ్. 33
యుంజ్యాద్విరేచనాదీంస్తు ధాత్ర్యా ఏవ యథోదితాన్,

తా. శిశువులకు విరేచనము చేయించతగిన రోగములయందు వస్తికర్మను, మర్శమను నస్యముచే చికిత్స జేయఁదగినరోగములయందు ప్రతిమర్శమను నస్యమును ప్రయోగించవలయును. రోగమునకు తగిన విరేచనాద్యౌషధములను తల్లికి మాత్రము ప్రయోగించవలయును.

స్తన్యదోషహారమూర్వాదిచూర్ణము.

మూర్వావ్యోషవరాకోలజంబూత్వగ్దారుసర్షపాః. 34
సపాఠా మధునా లీఢాః స్తన్యదోషహరాః పరమ్,

తా. చాగ, త్రికటుకములు, త్రిఫలములు, రేఁగు, నేరేడుపట్ట, దేవదారు, ఆవాలు, చిరుబొద్ది వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి యాచూర్ణమును తేనెలోకలిపి నాకించిన శిశువులకు స్తన్యదోషము హరించును.

దంతోత్పత్తియందు పిప్పల్యాదిచూర్ణప్రతిసారణము.

దంతపాళీం సమధునా చూర్ణేన ప్రతిసారయేత్. 35
పిప్పల్యా ధాతకీపుష్పధాత్రీఫలకృతేన వా,

తా. పిప్పలిచూర్ణమును తేనెలోకలిపిగాని, ఆరెపువ్వు, ఉసిరికపెరుగు వీని చూర్ణమునుగాని శిశువుయొక్క నోటిలో దంతముల కాధారములగు చిగుళ్లయందు మెల్లగ గాచవలయును.

దంతోత్పత్తికి లావకాదిమాంసచూర్ణము.

లావతిత్తిరివల్లూరరజఃపుష్పరసప్లుతమ్. 36
ద్రుతం కరోతి బాలానాం దంతకేసరవన్ముఖమ్,

తా. లావుకపిట్ట, తిత్తిరిపిట్ట వీని మాంసములను చక్కగ యెండించి చూర్ణము చేసి తేనెలో కలిపి బాలురకు నిప్పించిన శీఘ్రముగ తామరరేకులవంటి దంతములు నించును.

దంతోత్పత్తికి వచాదిఘృతము.

వచాద్విబృహతీపాఠాకటుకాతివిషాఘనైః 37
మధురైశ్చ ఘృతం సిద్ధం సిద్ధం దశనజన్మని,



తా. వస, చిన్నములుక, పెద్దములక, చిరుబొద్ది, కటుకరోహిణి, అతివస, తుంగముస్తలు మధురగణద్రవ్యములు వీనిని కల్కముచేసి ఆవునేతిలో కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి యాఘృతము నిప్పించిన బాలురకు శీఘ్రముగ దంతములు జనించును.

బాలరోగహర రజన్యాదిచూర్ణము.

రజనీ దారు సరళ శ్రేయసీః బృహతీద్వయమ్. ౩౮
పృశ్నిపర్ణీ శతాహ్వా చ లీఢం మాక్షికసర్పిషా,
గ్రహణీదీపనం శ్రేష్ఠం మారుతస్యానులోమనమ్. ౩౯
అతీసారజ్వరశ్వాసకామలాపాండుకాసనుత్,
బాలస్య సర్వరోగేషు పూజితం బలవర్ణదమ్. ౪౦

తా. పసుపు, దేవదారు, సరళదేవదారు, కరక్కాయలు, పెద్దములక, చిన్నములక, కోలపొన్న, సదాప, వీనిచూర్ణమును తేనె నెయ్యి వీనిలోకలిపి శిశువులకు నాకించిన జాఠరాగ్నిదీపనము వాతమున కనులోమగతియు కలుగును. అతిసారము, జ్వరము, శ్వాసము, కామల, పాండువు, కాసము వీనినిహరించును. ఇది బాలురకు సర్వరోగముల యందు ప్రశస్తము. బలవర్ణములను గలుగజేయును.

దంతోత్పత్తివలన జనించురోగములకు సమంగాదిఘృతము.

సమంగాధాతకీలోధ్రకుటన్నటబలాహ్వయైః,
మహాసహాక్షుద్రసహాక్షుద్రబిల్వశలాటుభిః. ౪౧
సకార్పాసీఫలైస్తోయే సాధితైస్సాధితం ఘృతమ్,
క్షీరమస్తుయుతం హంతి శీఘ్రం దంతోద్భవోద్భవాన్. ౪౨
వివిధా నామయా నేతద్వృద్ధకశ్యపనిర్మితమ్,

తా. మంజిష్టి, ఆరెపువ్వు, లొద్దుగు, దుండిలము, చిట్టాముట్టి, కాఉమినుములు, కాఉపెసలు, లేతమారేడుపిండెలు, ప్రత్తికాయలు వీనిని సమభాగములుగ నుదకములో వైచి చక్కగ కషాయముకాచి వడియగట్టి అందులో ఆవునెయ్యి ఆవుపాలు పెరుగు మీఁగడ వీనినిచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి శిశువులకు పానముచేయించిన దంతములు జనించుటవలనఁగలుగు నానావిధరోగములు కడుశీఘ్రముగ నివర్తించును. ఇది వృద్ధకశ్యపునిచే నిర్మించబడిన ఘృతము.

దంతోత్పత్తివలన జనించురోగములయం దౌషధనిషేధము.

దంతోద్భవేషు రోగేషు న బాలమతియంత్రయేత్. ౪౩
స్వయముపశామ్యంతి జాతదంతస్య యద్గదాః,

తా. బాలురకు దంతములు జనించునపుడు కలుగురోగములు ఆదంతములు చక్కగ జనించిన పిదప స్వయముగనే శమించును. కావున నీ రోగములయందు బాలురకు పథ్యభోజ నౌషధాదులను మిక్కిలి నిర్బంధముచే నిష్పింపం జనదు.

—— బాలురకు దివాస్వాపాదులచే జనించురోగములు. ——

అత్యహః స్వప్నశీతాంబుశ్లైష్మికస్తన్యసేవినః. ౪౪
శిశోః కఫేన రుద్ధేషు స్రోతస్సు రసవాహిషు,
అరోచకః ప్రతిశ్యాయో జ్వరః కాసశ్చ జాయతే. ౪౫
కుమారశ్శుష్యతి తతస్స్నిగ్ధశుక్లముఖేక్షణః,

తా. పగటియందు మిక్కటముగ నిద్రించుట, శీతోదకమును పానము చేయుట, శ్లేష్మదుష్టమైన చనుపాలనుత్రాగుట వీనివలన శిశువునకు రసాదులను వహించునట్టి స్రోతస్సులు కఫముచే నడ్డగింపఁబడి అరోచకము, పీనసము, జ్వరము, కాసము, ఇవి జనించి శిశువులయొక్క ముఖము, కండ్లు, ఇవి తెల్లగనై శరీరము శుష్కించును.

—— దివాస్వాపాదులవలన జనించురోగములకు సైంధవాదిచూర్ణము. ——

సైంధవవ్యోషశార్ఙ్గేష్టాపాఠాగిరికదంబకాః. ౪౬
శుష్యతో మధుసర్పిర్భ్యామరుచ్యాదిషు యోజయేత్,
అశోకరోహిణీయుక్తం పంచకోలం చ చూర్ణితమ్. ౪౭
బదరీధాతకీధాత్రీచూర్ణం వా సర్పిషా ప్లుతమ్,

తా. పైనచెప్పిన అరుచి మొదలగు రోగములయందు సైంధవలవణము, త్రికటుకములు, శార్ఙ్గేష్ట (అనగా కాకి దొండ), చిరుబొద్ది, అడవికడిమి, వీనిచూర్ణమును తేనె, ఆవునెయ్యి వీనిలోకలిపి యుపయోగించవలయును అశోకరోహిణి, పంచకోలములు వీని చూర్ణమునుగాని, రేగుపండ్లు, ఆరెపువ్వు, ఉసిరికపరుగు, వీని చూర్ణమునుగాని, నేతిలోకలిపి అరోచకాది రోగములయందు శిశువులకు నాకించవలయును.

—— బాలురకు స్రోతశ్శుద్ధికరౌషధము. ——

స్థిరాసచాద్వ్యాబృహతీకాకోలీపిప్పలీనతైః. ౪౮
నిచులోత్పలవర్షాభూభార్గీముస్తైశ్చ కార్షికైః,
సిద్ధం ప్రస్థార్ధమాజ్యస్య స్రోతసాం శోధనం పరమ్. ౪౯
సింహ్యాశ్వగంధాసురసాకణాగర్భం చ తద్గుణమ్,

తా. మయూరకుపోన్న, వస, పెద్దములక, చిన్నములక, కాకోళి పిప్పళ్లు, గ్రంథితగరము, నీరుప్రబ్బలి నల్లకలువ, గలిజేరు, గంటుభారంగి, తుంగముస్తలు వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి అర్థప్రస్థపరిమితమైన యావు నేతిలో కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి యిప్పించిన బాలురకు స్రోతస్సులు శుద్ధమగును. మఱియు, ములక, పెన్నేరుగడ్డ, తులసి, పిప్పళ్లు వీనికల్కమునుచేర్చి పక్వముచేయఁబడిన ఘృతము నిప్పించిన స్రోతస్సులు శుద్ధమగును.

బాలురకు శోషరోగహరఘృతము.

యష్ట్యాహ్వాపిప్పలీలోధ్రపద్మకోత్పలచందనైః. ౫౦
తాళీసశారిబాభ్యాం చ సాధితం శోషజిద్ఘృతమ్,

తా. యష్టిమధుకము, పిప్పళ్లు, లొద్దుగు, పద్మకము, నల్లకలువ, చందనము, తాళిసపత్రి, సుగంధిపాల, వీనికల్కమునుచేర్చి పక్వముచేయఁబడిన ఘృతము నిప్పించిన బాలురకు శోషరోగము హరించును.

బాలురకు పుష్టికర శృంగ్యాదిఘృతము

శృంగీమధూళికాభార్గీపిప్పలీదేవదారుభిః. ౫౧
అశ్వగంధాద్వికాకోళీరాస్నర్షభకజీవకైః,
శూర్పపర్ణీవిడంగైశ్చ కల్కైస్సాధితం ఘృతమ్. ౫౨
శశోత్తమాంగనిర్యూహే శుష్యతః పుష్టికృద్ఘృతమ్,

తా. కుందేలుశిరము నుదకములో వైచి కషాయముకాచి అందులో కర్కాటకశృంగి, చాగ, గంటుభారంగి, పిప్పళ్లు, దేవదారు, పెన్నేరుగడ్డ, కాకోళి, క్షీరకాకోళి, సన్నరాస్నము, ఋషభకము, జీవకము, కాఱుపెసలు, వాయువిడంగములు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలపి అందులో నొక ప్రస్థము ఆవునేతిని బోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి బాలునకిప్పించిన కృశించిన బాలురకు మిక్కుటముగ శరీరమునను పుష్టికలుగును.

బాలుర కభ్యంజనతైలము

వచావయస్థాతగరకాయస్థాచోరకైశ్శృతమ్. ౫౩
బస్తమూత్రసురాభ్యాం చ తైలమభ్యంజనే హితమ్,

తా. వస, ఉసిరికపరుగు, గ్రంథితగరము, కరక్కాయలు, కచోరమను గ్రంథ్యము, వీనినినూరి నువ్వుల నూనెలో కలిపి అందులో గొఱ్ఱెమూత్రము సురయను

మద్యము వీనినిబోసి విధిప్రకారము పక్వముచేసి బాలునకభ్యంజనము చేయించిన హితముకలుగును.

### లాక్షాదికతైలము

లాక్షారససమం తైలప్రస్థం మస్తు చతుర్గుణమ్. ౫౪
అశ్వగంధానిశాదారుకౌంతీకుష్ఠాబ్దచందనైః,
సమూర్వారోహిణీరాస్నాశతాహ్వామధుకైస్సమైః. ౫౫
సిద్ధం లాక్షాదికం నామ తైలమభ్యంజనాదిదమ్,
బల్యం జ్వరక్షయోన్మాదశ్వాసాపస్మారవాతనుత్. ౫౬
యక్షరాక్షసభూతఘ్నం గర్భిణీనాం చ శస్యతే,

తా. లక్కరసము (1) ప్రస్థము, నువ్వులనూనె, (1) ప్రస్థము, పెరుగుమీఁగడ (4) ప్రస్థములు వీనినొకటిగఁజేర్చి అందులో పెన్నేరుగడ్డ, పసుపు, దేవదారు, రేణుకలు, చెంగల్వకోష్టు, తుంగముస్తలు, చందనము, చాగ, కటుకరోహిణి, సన్నరాస్నము, సదాప, అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కలిపి తైలపాకవిధిగ పక్వము చేయవలయును. ఇది లాక్షాదికతైల మనఁబడును. దీని నభ్యంజనముచేసిన శరీరబలము వృద్ధియగును. జ్వరము, క్షయము, ఉన్మాదము, శ్వాసము, అపస్మారము, వాతరోగము, యక్షరాక్షసులబాధ ఇవి హరించును. ఇది గర్భిణులకును మిక్కిలి ప్రశస్తమైనది.

### కాసజ్వరాదులకు అతివిషాదిచూర్ణము.

మధునాఽతివిషాశృంగీపిప్పలీర్లేహయేచ్ఛిశుమ్. ౫౭
ఏకాం వాఽతివిషాం కాసజ్వరచ్ఛర్దిరుపద్రుతమ్,

తా. కాసము, జ్వరము, వాంతి వీనిచే పీడింపఁబడియుండు శిశువులకు అతివస, కాకటకశృంగి, పిప్పళ్లు వీనిచూర్ణమునుగాని, అతివసచూర్ణమును మాత్రము తేనెలో కలిపి నాకించవలయును.

పీతం పీతం వమతి యః స్తన్యం తం మధుసర్పిషా. ౫౮
ద్వివార్తాకీఫలరసం పంచకోలం చ లేహయేత్,
పిప్పలీపంచలవణం కృమిజిత్పారిభద్రకమ్. ౫౯
తద్వల్లిహ్యాత్తథా వ్యోషం మషీం వా రోమచర్మణామ్,
లాభతశ్శల్యకశ్వావిద్గోధర్క్షశిఖిజన్మనామ్. ౬౦

తా. చనుబాలను పానముచేసినపుడెల్ల వమనముచేయుచుండు శిశువునకు తేనె, నెయి వీనిలో చిన్నములక పండురసము, పెద్దములక పండురసము, పంచకోలములు

చూర్ణంబునుకలిపి నాకించవలయును. మఱియు, పిప్పళ్లు, పంచలవణములు, వాయు విడంగములు, వేము, త్రికటుకములు వీనిచూర్ణముసైనను, శల్యకమనుమృగము (ముండ్ల పంది), ఏదుమృగము, ఉడుము ఎలుగుబంటి, నెమలి వీనిరోమములను చర్మములను కాల్చి యాపుకినిగాని, తేనె, నెయ్యి వీనిలోకలిపి నాకించవలయును

## బాలురకు వమనహర ఖదిరాదిఘృతము.

ఖదిరార్జునతాళీసకుష్ఠచందనజే రసే,
సక్షీరం సాధితం సర్పిర్వమథుం వినియచ్ఛతి. ౬౧

తా. చండ్ర, మద్ది, తాళిసపత్రి, చెంగల్వకోష్టు, చందనము వీనికషాయములో ఆవుపాలు నెయ్యి వీనిని సమభాగములుగ చేర్చి పక్వముచేయఁబడిన ఘృతమును బాలురకు నిచ్చించిన వమనము శమించును.

## దంతములతోడ జనించుశిశువునకు శాంతికర్మ.

సదన్తో జాయతే యస్తు దంతాః ప్రాగ్యస్య చోత్తరాః,
కుర్వీత తస్మిన్నుత్పాతే శాంతికం చ ద్విజాతయే. ౬౨
దద్యాత్సదక్షిణం బాలంనైగమేషం చ పూజయేత్ *,

తా. శిశువు దంతములతోడ జనించినను లేక శిశువునకు తొలుత పైభాగమునందుండు నిగుళ్ళయందు దంతములు జనించినను అది యుత్పాతమనఁబడును. దీనియందు విధిప్రకారము శాంతికర్మనుచేయించి యాబాలుని దక్షిణతోడ బ్రాహ్మణునికి దానముచేసి నైగమేషమను గ్రహమును పూజింపవలయును.

## తాలుకంటకరోగోపద్రవములు.

తాలుమాంసే కఫః క్రుద్ధః కురుతే తాలుకంటకమ్. ౬౩

---

* శ్లో. హనుమూలగతో వాయు ర్దంతదేశాశ్రిగోచరః,
యదా శిశోః ప్రకుపితో నోత్తిష్ఠంతి తదా ద్విజాః.
రూక్షాశినో వాతికస్య చాలయత్యనిలస్సిరాః,
హన్వాశ్రయాః ప్రసుప్తస్య దంతైశ్శబ్దం కరోత్యతః.

తా. శిశువునకు కణతలయందుండు వాతము ఇగుళ్ళ నాశ్రయించి ప్రకోపించినయెడల దంతములు శీఘ్రముగ నంకురింపకుండును. రూక్షములుగనుండుపదార్థములను భుజించువాఁడును వాతప్రకృతిగలవాఁడునైన మనుజునికి వాతము ప్రకోపించి యా వాతము కణతల నాశ్రయించియుండుశిరలను నిద్రించునప్పుడు చలింపఁజేయును. అందువలన మనుజుఁడు దంతములచే కటకటయని శబ్దముచేయును అని కొన్ని గ్రంథములయం దధికపాఠము గన్పట్టుచున్నది.

తేన తాలుప్రదేశస్య నిమ్నతా మూర్ధ్ని జాయతే,
తాలుపాతః స్తనద్వేషః కృచ్ఛ్రాత్పానం శకృద్ద్రవమ్. ౬౪
తృడాస్యకంఠాక్షిరుజాగ్రీవాదుర్ధరతా వమిః,

తా. కఫము ప్రకోపించినదై లోదౌడమాంసమునందు తాలుకంటక మనురోగమును గలుగఁజేయును. అందువలన లోదౌడయందును శిరమునందును పల్లముగలుగుట, దవుడలు జారిపోవుట, చనుపాలయందు ద్వేషము, కడుకష్టముచే స్తన్యమును పానము చేయుట, ద్రవరూపముగ మలము వెడలుట, దప్పి, నోటియందు దురద, కంఠ్లనొప్పి, మెడసోలి వాలిపోవుట, వాంతియగుట, యీయుపద్రవములు గలుగును.

### తాలుకంటకరోగచికిత్స.

తత్రోత్క్షిప్య యవక్షారక్షౌద్రాభ్యాం ప్రతిసారయేత్. ౬౫
తాలు తద్వత్కణాశుంఠీగోశకృద్రససైంధవైః,

తా. తాలుకంటకరోగమునందు బాలురయొక్క లోదౌడను పైకెత్తి తేనెతో యవక్షారమును గలిపిగాని, పిప్పళ్లు, సొంటి, ఆవుపేడరసము, సైంధవలవణము వీని నొక్కటిగచేర్చిగాని రాచవలయును.

### తాలుకంటకరోగమునందు శృంగబేరాదిలేపనము.

శృంగబేరనిశాభృంగం కల్కితం వటపల్లవైః. ౬౬
బధ్వా గోశకృతా లిప్తం కుకూలే స్వేదయేత్తతః,
రసేన లింపేత్తాల్వాస్యం నేత్రే చ పరిషేచయేత్. ౬౭

తా. అల్లము, పసుపు, గుంటగలగర వీనిని చక్కగనూరి యుంటజేసి మఱ్ఱిచిగుళ్లయందుంచి దానికిపైని మఱ్ఱిచిగుళ్లనుమూసి కట్టి పైన ఆవుపేడనుపూసి కసుంపటిలో కాల్చి, యారసమునుపిండి దానిచే లోదౌడ నోరు వీనికి లేపనముచేసి నేత్రములను సేచనము చేయవలయును.

### తాలుకంటకరోగమునందు హరీతక్యాదికల్కము.

హరీతకీవచాకుష్ఠకల్కం మాక్షికసంయుతమ్,
పీత్వా కుమారః స్తన్యేన ముచ్యతే తాలుకంటకాత్. ౬౮

తా. కరక్కాయ, వస, చెంగల్వకోష్టు వీనిని కల్కముచేసి చనుపాలలోకలిపి అందులో కొంచెము తేనె చేర్చి శిశువునకు పానముచేయించిన తాలుకంటకరోగము నశించును.

శిశువునకు గుదమున జనించు వ్రణము

మలోపలేపాత్స్వేదాద్వా గుదే రక్తకఫోద్భవః,
తామ్రో వ్రణోఽంతఃకండూమాన్ జాయతే భూర్యుపద్రవః.
కేచిత్తం మాతృకాదోషం వదంత్యన్యేఽపి పూతనమ్,
పృష్ఠారుర్గుదకుండం చ కేచిచ్చ త మనామికమ్. 20

తా. గుదమునందు మలము అంటుకొనియుండుటవలనగాని, చెమటగలుగుట వలనగాని రొంపుపున్నయము దురద అధికోపద్రవములు వీనితోఁగూడియుండు వ్రణము జనించును. ఇది రక్తకఫములవలన కలుగును. దీనిని కొందఱు మాతృదోషమనియు, కొందఱు పూతనమనియు, కొందఱు పృష్ఠారువనియు, కొందఱు గుదకుండమనియు, కొందఱు అనామిక (పేరులేదని) మనియు వచింపుచున్నారు.

శిశువుకు గుదవ్రణచికిత్స.

తత్ర ధాత్ర్యాః పయశ్శోధ్యం పిత్తశ్లేష్మహరౌషధైః,

తా. ఈరోగమునందు తల్లియొక్క స్తన్యములను పిత్తశ్లేష్మహరములగు నౌషధములచే శుద్ధిచేయవలయును.

గుదకుట్టకవ్రణచికిత్స

శృతశీతం చ శీతాంబుయుక్తమంతరపానకమ్. 21
సక్షౌద్రతార్క్ష్యశైలేన వ్రణం తేన ప్రలేపయేత్,
త్రిఫలాబదరీప్లక్షత్వక్కాథపరిషేచితమ్. 22
కాసీసరోచనాతుత్థమనోహ్వాలరసాంజనైః,
లేపయేదమ్లపిష్టైర్వా చూర్ణితైర్వా వచూర్ణయేత్. 23
సుశ్లక్ష్ణైరథవా యష్టీశంఖసౌవీరకాంజనైః,
సారిబాశంఖనాభిభ్యామసనస్య త్వచాఽథవా. 24
రాగకండూత్కటే కుర్యాద్రక్తస్రావం జలౌకసా,
సర్వం చ పిత్తవ్రణజిచ్ఛస్యతే గుదకుట్టకే. 25

తా. గుదకుట్టకవ్రణముగల శిశువునకు కాఁచి చల్లారిన యుదకములో తేనె రసాంజనముకలిపిగాని పానకమునుగాని ఇప్పించవలయును. త్రిఫలములు, రేఁగుపట్ట, జువ్విపట్ట వీనికషాయములచే సేచనముచేసి మైశీతోదకముచే వ్రణమును కడుగవల

యును. లేక కాసీసము గోరోచనము, మయిలుతుత్తము, మణిశిల, హరిదళము, రసాంజనము వీనిని సమభాగములుగ గ్రహించి కలితోనూరి పైవ్రణమునకు లేపనముచేయవలయును. లేక పై కాసీసము మొదలగు ద్రవ్యములను నున్నగ చూర్ణముచేసి యాచూర్ణముగాని; అతిమధురము, శంఖము, సౌవీరాంజనము వీనిచూర్ణమునుగాని; సుగంధపాల, కనాభి (అనఁగా శంఖముయొక్క మధ్యప్రదేశము) వీనిచూర్ణమునుగాని, లేక వేగిస చూర్ణమునుగాని వ్రణమునకు లేపనముచేయవలయును పైవ్రణమునందు ఎఱుపు ము దురద ఇవి అధికముగ కలిగియుండినచో జలగలచే రక్తస్రావముచేయించి పిత్తమునకు చెప్పియుండు చికిత్సల నన్నిటిని చేయవలయును.

## బాలురకు మృద్భక్షణాజనితరోగచికిత్స.

పాఠావేల్లద్విరజనీముస్తభార్గీపునర్నవైః,
సబిల్వత్రిఫలావ్యోషైస్సర్పిర్వ్యక్షిప్తకాళీయుతైశ్శృతమ్. ౭౬
లిహానో మాత్రయా రోగైర్ముచ్యతే మృత్తికోద్భవైః,

తా. శిశువులు మట్టిని భక్షించుటవలన జనించినరోగములయందు చిరుబొద్ది, వాయువిడంగములు, పసుపు, మ్రానిపసుపు, తుంగముస్తలు, గంటుభారంగి, గలిజేరు, మారేడు, త్రికటుకములు, తేలుమణిచెట్టు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నేతిలో కలిపి విధిప్రకారము పక్వముచేసి తగినపరిమాణముగ నాకించిన ఆరోగ్యము హరించును.

## శిశువునకు ఔషధప్రయోగక్రమము.

వ్యాధేర్యద్యస్య భైషజ్యం స్తనస్తేన ప్రలేపితః,
స్థితో ముహూర్తం ధాత్రోను పీతస్తం తం జయేద్గదమ్. ౭౭

తా. ఏరోగమునకేయౌషధము చెప్పఁబడియున్నదో యాయౌషధమును తల్లిస్తన లేపనముచేసి రెండుగడియలుంచి పిదప కడిగి యాస్తనములను శిశువులకు పానము చేయించిన రోగము నివర్తించును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
రెండవ అధ్యాయము ముగిసినది



శ్రీ ర స్తు.

# తృతీయాధ్యాయము.

అవ బాలురకు గ్రహములు సోకుటవలనను పలుతెఱంగుల రోగములుజనించును. కావున నట్టిరోగములకు చికిత్సలను తెలియపరచుటకై బాలగ్రహ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్న యది:—

## బాలగ్రహప్రతిషేధాధ్యాయము.

సూ. అథాతో బాలగ్రహప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

బాలామయప్రతిషేధాధ్యాయనిరూపణానంతరము బాలగ్రహములు సోఁకుట వలన జనించు నుపద్రవములను తచ్చికిత్సలను వివరించునట్టి బాలగ్రహప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### బాలగ్రహభేదము.

పురా గుహస్య రక్షార్థం నిర్మితాశ్శూలపాణినా,
మనుష్యవిగ్రహాః పంచ, సప్త స్త్రీవిగ్రహాః గ్రహాః. ౧
స్కందో విశాఖో మేషాఖ్యశ్శ్వగ్రహః పితృసంజ్ఞితః,
శకునిః పూతనా శీతపూతనా దృష్టిపూతనా. ౨
ముఖమండలికా తద్వ ద్రేవతీ శుష్కరేవతీ,

తొల్లి మహాదేవునిచే కుమారస్వామి రక్షణార్థమై స్కంద, విశాఖ, మేషాఖ్య, శ్వగ్రహ, పితృసంజ్ఞిత అను నైదు పురుషగ్రహంబులును, శకుని, పూతన, శీతపూతన, దృష్టిపూతన, ముఖమండలిక, రేవతి, శుష్కరేవతి అను నేడు స్త్రీగ్రహంబులును సృజింపఁబడినవి.

### బాలగ్రహ గ్రహణపూర్వరూపములు

తేషాం గ్రహిష్యతాం రూపం ప్రతతం రోదనం జ్వరః. 

పైస్కంధాదిగ్రహంబులు సోఁకినటువంటి బాలునకు సదా రోదనము జ్వరము గలుగును

## బాలగ్రహగృహీత సామాన్యలక్షణము.

సామాన్యం రూపముత్త్రాసజృంభాభ్రూక్షేపదీనతాః,
ఫేనస్రావోర్ధ్వదృష్ట్యోష్ఠదంతదంశప్రజాగరాః. ౪
రోదనం కూజనం స్తన్యవిద్వేషస్స్వరవైకృతమ్,
నఖైరకస్మాత్పరితస్స్వధాత్ర్యంగవిలేఖనమ్. ౫

బాలునకు గ్రహములు సోఁకినచో ఉలికిపడుట, ఆవులింతలుకలుగుట, కనుబొమలు నిక్కబొడిచికొనియుండుట, దీనతను జెందుట, నోటియందు నురుగుపడలుట, పైచూపుగలుగుట, పెదవులుకొరకికొనుట, పండ్లుకొరకుట, నిద్రపట్టకుండుట, ఏడ్చుట, వికారముగకూయుట, చనుపాలయందు ద్వేషముకలుగుట, కంఠస్వరము వికారముగనుండుట, తనశరీరమును తల్లిశరీరమును గోళ్లచేగీరుట ఈలక్షణములు కలిగియుండును.

## స్కందగ్రహగృహీతశిశులక్షణము.

తత్రైకనయనస్రావీ శిరో విక్షిపతే ముహుః,
హతైకపక్షః స్తబ్ధాంగస్సస్వేదో నతకంధరః. ౬
దంతఖాదీ స్తనద్వేషీ త్రస్యన్ రోదితి విస్వరః,
వక్రవక్త్రో వమేల్లాలాం భృశమూర్ధ్వం నిరీక్షతే. ౭
వసాసృగ్గంధిరుద్విగ్నో బద్ధముష్టిశకృచ్ఛిశుః,
చలితైకాక్షిగండభ్రూస్సంరక్తోభయలోచనః. ౮
స్కందార్తస్తేన వైకల్యం మరణం వా భవేద్ధ్రువమ్,

పైగ్రహములలో స్కందగ్రహము సోఁకినచో శిశువునకు ఒకనేత్రమునందు నీరుకారుట, శిరమును పలుమారు కదలించుట, ఒకపార్శ్వమున శక్తిలేకుండుట, అవయవములు స్తబ్ధముగనగుట, చెమటపట్టుట, మెడవంగియుండుట, పండ్లుకొరకుట, చనుపాలయందు ద్వేషముకలుగుట, అకస్మాత్తుగ నులికిపడి వికారస్వరముతోనేడ్చుట, నోరు వంకరగుట, జొల్లుకారుట, మిక్కుటముగ నూర్ధ్వదృష్టిగలుగుట, శరీరమునందు క్రొవ్వు రక్తము వీనితోతుల్యమైన వాసనగలుగుట, వణఁకుట, పిడికిలి గట్టిగపట్టుకొనుట, మలబంధముగలుగుట, ఒకపార్శ్వమునందలి నేత్రము కణత కనుబొమ యివిచలించుట, రెండుకండ్లును ఎఱ్ఱనగుట ఈలక్షణములుకలుగును. అట్టిశిశువునకు అంగవైకల్యముగాని మరణముగాని నిస్సంశయముగ గలుగును.

## విశాఖగ్రహగృహీతబాలలక్షణము.

సంజ్ఞానాశో ముహుః కేశలుంఛనం కంధరానతిః.
వినమ్య జృంభమాణస్య శకృన్మూత్రప్రవర్తనమ్,
ఫేనోద్వమనమూర్ధ్వేక్షా హస్తభ్రూపాదనర్తనమ్ 10
స్తనస్వజిహ్వాసందంశసంరంభజ్వరజాగరాః,
పూయశోణితగంధశ్చ స్కందాపస్మారలక్షణమ్. 11

శిశువునకు విశాఖగ్రహము సోకినపో ప్రజ్ఞలేకుండుట, పలుమారు వెండ్రుకలను పీకికొనుట, మెడవంచుకొనుట, శరీరమును వంచుకొని యావులించునపుడు మలమూత్రములువెడలుట, నోటియందు నురుగువెడలుట, పైకిచూపుకలుగుట, హస్తములు పాదములు కనుబొమలు వీనిని పలుమారు కదలించుట, తల్లిస్తనమును తననాలుకను కొరుకుట, జ్వరవేగముగలుగుట, నిదురపట్టకుండుట, శరీరమునందు చీము రక్తము వీనితో తుల్యమయిన వాసనవేయుట ఈలక్షణములు కలిగియుండును. విశాఖ గ్రహమునకు స్కందాపస్మారమనియు నామాంతరము కలదు.

## మేషగ్రహగృహీతబాలలక్షణము

ఆధ్మానం పాణిపాదస్య స్పందనం ఫేననిర్వమః,
తృణ్ముష్టిబంధాతీసారస్వరదైన్యవివర్ణతాః. 12
కూజనం సతతం ఛర్దిః కాసహిధ్మాప్రజాగరాః,
ఓష్ఠదంశాంగసంకోచస్తంభబస్తామగంధతాః, 13
ఊర్ధ్వం నిరీక్ష్య హసనం మధ్యే వినమనం జ్వరః,
మూర్ఛైకనేత్రశోఫశ్చ నైగమేషగ్రహాకృతిః. 14

కడుపుబ్బరము, కాళ్లుచేతులను నోరును కదలించుట, నురుగుగా కక్కుట, దప్పికలుగుట, పిడికిలి గట్టిగాపట్టుకొనుట, అతిసారము, హీనస్వరము, వికారవర్ణము ఇవికలుగుట, కూతవేయుట, వాంతి, కాసము, ఎక్కిళ్ళు ఇవికలుగుట, నిద్రపట్టకయుండుట, పెదవులను కొరికికొనుట, అవయవములను ముడిచికొనుట, అవయవములు స్తబ్ధముగనగుట, గొర్రె అజీర్ణము వీనితో తుల్యమైన వాసనశరీరమునందుగలుగుట, పైనిచూచి నవ్వుట, నడుమువంగియుండుట, జ్వరము, మూర్ఛ, ఒకనేత్రమునందు వాపు ఈలక్షణములు మేషగ్రహముసోకిన శిశువునకు గలిగియుండును. ఈగ్రహములకు నైగమేషమని సహితము నామము కలదు.

శ్వగ్రహగృహీత బాలలక్షణము.

కంపో హృషితరోమత్వం స్వేదశ్చక్షుర్నిమీలనమ్,
బహిరాయామనం జిహ్వాదంశోఽంతఃకంఠకూజనమ్. ౧౫
ధావనం విట్సుగంధత్వం క్రోశనం శ్వానవచ్ఛ్వని,

బాలురకు శ్వగ్రహముసోఁకినచో వణఁకు గగుర్పాటు చెమట ఇవిగలుగుట, కండ్లుమూసికొనియుండుట, బాహ్యాయామవాతము కలుగుట, నాలుకను కొరికికొనుట, కంఠములోపల నొకవిధమైన ధ్వనికలుగుట, పరుగులిడుట, శరీరమునందు మలముతో తుల్యమైన వాసనకలుగుట, కుక్కవలె కూయుట ఈలక్షణములు కలుగును.

పితృగ్రహగృహీత బాలలక్షణము.

రోమహర్షో ముహుస్త్రాసస్సహసా రోదనం జ్వరః. ౧౬
కాసాతిసారవమథుజృంభాతృట్శవగంధతాః,
అంగేష్వాక్షేపవిక్షేపశోషస్తంభవివర్ణతాః. ౧౭
ముష్టిబంధస్స్రుతిశ్చాక్ష్ణో బాలస్య స్యుః పితృగ్రహే,

శిశువునకు పితృగ్రహము సోఁకినచో గగుర్పాటు కలుగుట, పలుమారు భయపడుట, కారణములేకయే యేడ్చుట, జ్వరము, కాసము, అతిసారము, వాంతి, ఆవులింత, దప్పి, శరీరమున శవగంధము ఇవి కలుగుట, అవయవములను చాచుట, ముడుచుట, శోష, స్తంభము, వికారవర్ణము, పిడికిలి గట్టిగాపట్టుట, నేత్రములయందు నీరుకారుట ఈలక్షణములు గలిగియుండును.

శకునిగ్రహగృహీత బాలలక్షణము

స్రస్తాంగత్వమతీసారో జిహ్వాతాలుగళే వ్రణాః. ౧౮
స్ఫోటాస్సదాహరుక్పాకాస్సంధిషు స్యుః పునఃపునః,
నిశ్యహ్ని ప్రవిలీయంతే పాకో వక్త్రే గుదేఽపివా. ౧౯
భయం శకునిగంధత్వం జ్వరశ్చ శకునిగ్రహే,

బాలునికి శకునిగ్రహము సోఁకినచో అంగములుజారుట, అతిసారము కలుగుట, నాలుక లోదౌడ కంఠము వీనియందు వ్రణముగలుగుట, శరీరసంధులయందు మంట, శూల, పాకము వీనితోఁ గూడియుండు పిటికలు పలుమారుజనించుట, పిటికలు రాత్రులయందు కనుపడి పగటియందు మరగిపోవుట, నోటియందును గుదమునందును వ్రణము జనించుట, భయపడుట, శరీరమునందు పక్షితో తుల్యమైనవాసనకలుగుట, జ్వరముకలుగుట ఈలక్షణములు కలిగియుండును.

### పూతనాగ్రహగృహీత బాలలక్షణము

పూతనాయాం వమిః కంపస్తంద్రా రాత్రౌ ప్రజాగరః. ౨౦
హిధ్మాధ్మానం శకృద్భేదః పిపాసా మూత్రనిగ్రహః,
ప్రస్తహృష్టాంగరోమత్వం కాకవత్పూతిగంధతా. ౨౧

బాలునకు పూతనాగ్రహము సోఁకినచో వాంతి వణఁకు రాత్రులయందు నిద్రాభంగము తంద్ర ఎక్కిళ్లు కడుపుబ్బరము మలబంధము దప్పి మూత్రప్రతిబంధము అంగములు జారిపోవుట గగుర్పాటు శరీరమున కాకిగాసన కలుగుట ఈలక్షణములు గలిగియుండును.

### శీతపూతనాగ్రహగృహీత బాలలక్షణము.

శీతపూతనయా కంపో రోదనం తిర్యగీక్షణమ్,
తృష్ణాంత్రకూజోఽతీసారో వసావద్విస్రగంధతా. ౨౨
పార్శ్వస్యైకస్య శీతత్వముష్ణత్వమపరస్య చ,

బాలునకు శీతపూతనాగ్రహము సోఁకినచో వణఁకుట, ఏడ్చుట, అడ్డముగ చూచుట, దప్పిగలుగుట, ప్రేగులఅఱచుట, విరేచనములగుట, శరీరమునందు క్రొవ్వువంటి దుర్గంధము ఇవి కలుగుట, శరీరమున నొకపార్శ్వము చల్లగ మఱియొకపార్శ్వము వేడిగ నుండుట ఈ లక్షణములు గలిగియుండును.

### అంధపూతనాగ్రహగృహీత బాలలక్షణము

అంధపూతనయా ఛర్దిః జ్వరః కాసోఽల్పవహ్నితా. ౨౩
వర్చసో భేదవైవర్ణ్యదౌర్గంధ్యాన్యంగశోషణమ్,
దృష్టిసాదోఽతిరుక్కండూపోథకీజన్మశూన్యతాః. ౨౪
హిధ్మోద్వేగస్తనద్వేషవైవర్ణ్యం స్వరతీక్ష్ణతా,
వేపథుర్మత్స్యగంధిత్వమథవా సామ్లగంధితా. ౨౫

దృష్టిపూతనాగ్రహము సోఁకిన శిశువునకు వాంతి జ్వరము కాసము అగ్నిమాంద్యంబును కలుగును. మఱియు వికారవర్ణదుర్గంధములతోడ భిన్నభిన్నముగ మలమువెడలుట, శరీరము శుష్కించుట, దృష్టికి శక్తి తగ్గుట, శరీరమునందు మిక్కుటముగ శూల, దురద, పోథకి ఇవి జనించుట, ప్రజ్ఞనశించుట, ఎక్కిళ్లు భయము స్తన్యమునందు ద్వేషము వికారవర్ణము క్రూరస్వరము వణఁకు ఇవి కలుగుట, శరీరమునందు మత్స్యగంధము గాని ఆమ్లగంధము గాని గలిగియుండుట యీలక్షణములు గలిగియుండును. దీనికి అంధపూతనయని పేరుకలదు.

### ముఖమండలికాగ్రహగృహీత శిశులక్షణము.

ముఖమండితయాం పాణిపాదస్య రమణీయతా,
సిరాభిరసితాభాభిరాచితోదరతా జ్వరః. ౨౬
అరోచకోఽంగగ్లపనం గోమూత్ర సమగంధతా,

శిశువునకు ముఖమండలి యను గ్రహము సోకినచో హస్తపాదము లందముగ ...డుట, కడుపు పైభాగమునందు నల్లనిసిరలు వ్యాపించియుండుట, జ్వరము అరో...మును కలుగుట, శరీరము కృశించుట, శరీరమున గోమూత్రముతో తుల్యమైన గంధ కలుగుట ఈలక్షణములు కలిగియుండును. ఈ గ్రహమును ముఖమండిత యనియు ...ప్పుదురు.

### రేవతీగ్రహగృహీత బాలలక్షణము.

రేవత్యాం శ్యావనీలత్వం కర్ణనాసాక్షిమర్దనమ్. ౨౭
కాసహిధ్మాక్షివిక్షేపవక్రవక్త్రత్వరక్తతాః,
బస్తగంధోజ్వరశ్శోషః పురీషం హారితం ద్రవమ్. ౨౮

రేవతీగ్రహముసోకిన బాలునికి శరీరమునందు కొంచెము తెల్లగను నల్లగను ...డువర్ణము, చెవులు ముక్కు కండ్లు వీనియందు నొప్పి, కాసము ఎక్కిళ్లు ఇవి జనిం...ట, కండ్లుతిరుగుట, నోరు వంకరగానగుట, శరీరమునందు ఎఱుపువర్ణము, గొఱ్ఱెతో ...ల్యమైనవాసనకలుగుట, జ్వరము శోషయుకలుగుట, మలము పచ్చవర్ణముగను ద్రవ...గను వెడలుట ఈలక్షణములు కలిగియుండును.

### శుష్కరేవతీగ్రహగ్రస్త బాలలక్షణము.

జాయతే శుష్కరేవత్యాం క్రమాత్సర్వాంగసంక్షయః,

బాలునికి శుష్కరేవతి యను గ్రహము సోకిన అన్ని యంగములు క్రమక్రమ...గ క్షయించుచుండును.

### బాలగ్రహోపసృష్టలక్షణము.

కేశశాతోఽన్నవిద్వేషస్స్వరదైన్యం వివర్ణతా. ౨౯
రోదనం గృధ్రగంధిత్వం దీర్ఘకాలానువర్తనమ్,
ఉదరే గ్రంథయో వృత్తా యస్య నానావిధం శకృత్. ౩౦
జిహ్వాయా నిమ్నతా మధ్యే శ్యావం తాలు చ తం త్యజేత్,

బాలగ్రహము సోకిన బాలునికి తలవెంట్రుక లూడుట, అన్నద్వేషము, దీన...రము, వికారవర్ణంబును కలుగుట, ఎల్లప్పుడు ఏడ్చుట, శరీరమున గ్రద్దవాసన వీచుట,

రోగము బహుకాల మనుసరించియుండుట, కడుపున గుండ్రనైన గ్రంథులు జనించుట, నానావిధములుగ మలముపెడలుట, నాలుక మధ్యప్రదేశమున పల్లమగుట, లోదౌడ నల్లగనగుట ఈ లక్షణములు కలిగియుండునేని యసాధ్యమగుటంజేసి చికిత్సయందు వర్జింపనలయును.

### అసాధ్యశుష్కరేవతీ గ్రహలక్షణము.

భుంజానోఽన్నం బహువిధం యో బాలః పరిహీయతే. 31
తృష్ణాగృహీతః క్షామాక్షో హంతి తం శుష్కరేవతీ,

ఏబాలుఁడు అనేకవిధములైన అన్నములను భుజింపుచుండియు కృశించి మిక్కిలి దప్పితోఁ గూడినవాఁడుగ దుర్బలములైన యింద్రియములు గలవాఁడుగ నుండునో యట్టిబాలుని శుష్కరేవతియనుగ్రహము చంపును.

### బాలగ్రహ గ్రహణకారణము.

హింసారత్యర్చనాకాంక్షా గ్రహగ్రహణకారణమ్. 32

జీవహింసయం దిచ్ఛ, కామము, పూజయందాసక్తి ఇవి గ్రహములు సోఁకుటకు కారణములు. (అనఁగా హింసించుటయం దిచ్ఛచేఁగాని సురతమునం దిచ్ఛచేఁగాని బలిమొదలగుపూజల గైకొనుటయం దిచ్ఛచేఁగాని మనుజులను గ్రహములుసోఁకును)

### హింసాత్మక గ్రహగృహీతలక్షణము.

తత్ర హింసాత్మకే బాలో మహాన్ స్రుతనాసికః,
క్షతజిహ్వః క్వణేద్బాఢమసుఖీ సాశ్రులోచనః. 33
దుర్వర్ణో హీనవచనః పూతిగంధిశ్చ జాయతే,
క్షామో మూత్రపురీషం స్వం మృద్నాతి న జుగుప్సతే. 34
హస్తౌ చోద్యమ్య సంరబ్ధో హంత్యాత్మానం తథా పరమ్,
తద్వచ్ఛస్త్రకాష్ఠాద్యైరగ్నిం వా దీప్తమావిశేత్. 35
అప్సు మజ్జేత్పతేత్కూపే కుర్యాదన్యచ్చ తద్విధమ్,
తృడ్దాహమోహాన్ పూయస్య ఛర్దనం చ ప్రవర్తయేత్. 36
రక్తం చ సర్వమార్గేభ్యో రిష్టోత్పత్తిశ్చ తం త్యజేత్,

హింసించుటయం దిచ్ఛగల గ్రహము బాలురకుగాని పెద్దవాండ్రకుగాని సోఁకినచో అట్టివారు చీమిడి కారుచుండు ముక్కు గలవారును, నాలుక లోపలి కీడ్చికొన

బడినవారును, కంఠమునందు నీరు కారుచుండువారును, మిక్కిలి యసౌఖ్యముగలవారును, వికారవర్ణము దీనవచనములు దుర్గంధంబును గలవారునగుదురు. వికారముగ నరచుట తన మూత్రపురీషములను అసహ్యతలేకయే చేతులతో బిసుకుట, మిక్కిలి యాగ్రహముతో హస్తముల పైకెత్తి తన్నుకొనుట, యితరుల నాయుధాదులచే ప్రహరించుట, జ్వలింపుచుండు అగ్నియందు ప్రవేశించుట, ఉదకములో మునుగుట, బావియందురుకుట, మిక్కుటముగ సాహసకృత్యముల నొనర్చుట, దప్పి, సర్వాంగతాపము, మూర్ఛకలుగుట, చీము, వాంతియగుట, స్రోతోమార్గములనుండి రక్తమువెడలుట యివి కలుగును. ఇట్టి అరిష్టసూచకములు కలిగియుండు వారికి చికిత్స జేయంజనదు.

### రతికామగ్రహగృహీతలక్షణము.

రహఃస్త్రీరతిసంలాపగంధస్రగ్భూషణప్రియః. ౩౭
హృష్టశ్శాంతశ్చ దుస్సాధ్యో రతికామేన పీడితః.

రతియం దాసక్తిగల గ్రహము సోకినయెడల మనుజుఁడు ఏకాంతముగ స్త్రీసంభోగము స్త్రీసంభాషణము మంచిగంధము పుష్పములు భూషణములు వీనియం దిచ్ఛగలవాఁడును, సంతోషము గలవాఁడును, శాంతిగలవాఁడునై యుండును. ఇది కష్టసాధ్యము.

### బలికామగ్రహ గృహీతలక్షణము.

దీనః పరిమృశే ద్వక్త్రం శుష్కోష్ఠగళతాలుకః. ౩౮
శంకితం వీక్షతే రౌతి ధ్యాయత్యాయాతి దీనతామ్,
అన్నమన్నాభిలాషేపి దత్తం నాతిబుభుక్షతే. ౩౯
గృహీతం బలికామేన తం విద్యాత్సుఖసాధనమ్.

బలియం దాసక్తిగల గ్రహము సోకినయెడల మనుజుఁడు దైన్యముగలవాఁడును పెదవులు కంఠము లోదౌడ ఇవి యెండిన వాఁడునై చేతితో నోటిని తుడుచుకొనును. బెదవి చూచును. కూఁతవేయును. చింతించును. దీనత్వమును బొందును. అన్నమునం దిచ్ఛగలిగి యుండునపు డన్నమిడిన భుజింపకుండును. ఇది సుఖసాధ్యము.

### హింసాత్మకాది గ్రహదోషచికిత్స

హంతుకామం జయేద్ధోమైస్సిద్ధమంత్రప్రవర్తితైః. ౪౦
ఇతరా తు యథాకామం రతిబల్యాదిదానతః,

హింసిరిచుటయను దిచ్ఛగల గ్రహమును సిద్ధమంత్రములతోఁ జేయఁబడిన హోమంబులచేతను రతికామ గ్రహమును సంభోగము చేతను, బలికామ గ్రహమును పూజాదులచేతను పరిహరింపవలయును. హింసించు గ్రహము మనుజులసోఁకిన నది చికిత్సయం దసాధ్యంబని పూర్వము చెప్పియుండినను

"తస్మాదాచర మోచ్ఛ్వాసా చ్చికిత్సేత్"

చరమశ్వాస పర్యంతము చికిత్స చేయవలయునని యష్టాంగసంగ్రహమునందు చెప్పియుండుటవలన నిచట దానికి చికిత్స చెప్పఁబడినది.

### సాధ్యబాలగ్రహ దోషచికిత్స.

అథ సాధ్యగ్రహం బాలం వివిక్తే శరణే స్థితమ్. ౪౧
త్రిరహ్నస్సిక్తసంమృష్టా సదాసన్నిహితానలే,
ప్రకీర్ణభూతికుసుమపత్రబీజాన్నసర్షపే. ౪౨
రక్షోఘ్నతైలజ్వలితప్రదీపహతపాప్మని,
వ్యవాయమద్యపిశితనివృత్తపరిచారకే ౪౩
పురాణసర్పిషాభ్యక్తం పరిషిక్తం సుఖాంబునా,
సాధితేన బలానింబవైజయంతీనృపద్రుమైః. ౪౪
పారిభద్రకకట్వంగజంబూవరుణకత్తృణైః,
కపోతవంకాపామార్గపాటలామధుశిగ్రుభిః. ౪౫
కాకజంఘామహాశ్వేతాకపిత్థక్షీరపాదపైః.
సకదంబకరంజైశ్చ ధూపం స్నాతస్య చాచరేత్. ౪౬
ద్వీపివ్యాఘ్రాహిసింహర్క్షచర్మభిర్ఘృతమిశ్రితైః,

బాలునికి సుఖసాధ్యమైనగ్రహము సోఁకినయెడల వానికి ప్రాఁతనేతితో నభ్యంగముచేయించి, చిట్టాముట్టి, వేము, తక్కిలి, రేల, బాడిదెము, పెనుమ్రాను, నేరేడు, ఉలిమిడి, కామంచిగడ్డి, సరస్వతియాకు, ఉత్తరేణి, కలిగొట్టు, ఎఱ్ఱమునగ, కాకిదొండ, పాలనేలగుమ్మడుగడ్డ, వెలగ, క్షీరివృక్షములు, కడిమి, క్రానుగు వీనినిచేర్చి కాచి సుఖోష్ణముగనుండు నుదకముచే స్నానము చేయించి పిదప మూడుపర్యాయములు అలికియూడ్వఁబడినదియు, పరిశుద్ధమైనదియు ఎల్లపుడుజ్వలింపుచుండు అగ్నిగలదియు,విభూతి పుష్పములు పత్రములు బీజములు అన్నము ఆవాలు ఇవి చల్లఁబడినదియు, రాక్షసులను హరించునట్టి తైలముచే ప్రకాశింపుచుండు దీపముగలదియు, మద్యమాంసమైథున దురా

చారములను వర్జించియుండు పరిచారకులతోఁ గూడినదియు నైన గృహమునందు అబాలుని కూర్చుండబెట్టి పెద్దపులి చిరుతపులి పాము సింహము ఎలుగుబంటి వీనిచర్మములను ఘృతముతో తడిపి ధూపము వేయవలయును.

## సర్వగ్రహపీడా హరధూపము.

పూతీదశాంగీసిద్ధార్థ వచాభల్లాతదీప్యకైః. ౪౭
సకుష్ఠై స్సఘృతై ర్ధూప స్సర్వగ్రహవిమోక్షణః,

కలుక్రానుగు, దశాంగి, (అనఁగా క్రిందిశ్లోకములో చెప్పియుండు వస మొదలగు పదిద్రవ్యములు) తెల్లావాలు, వస, జీడిగింజలు, ఓమము, చెంగల్వకోష్టు వీనిని నేతిలోతడిపి ధూపమువేసిన సర్వగ్రహబాధలు నివర్తించును.

## దశాంగ ధూపము.

వచాహింగువిడంగాని సైంధవం గజపిప్పలీ. ౪౮
పాఠాప్రతివిషావ్యోషం దశాంగః కశ్యపోదితః,

వస, ఇంగువ, వాయువిడంగములు, సైంధవలవణము, ఏనుఁగుపిప్పళ్లు, చిరుబొద్ది, అతివస, త్రికటుకములు వీని నేకముచేసి సర్వగ్రహములకు ధూపము వేయవలయును. ఇది కశ్యపునిచే చెప్పఁబడిన దశాంగధూపము. సర్వగ్రహ బాధలను నశింపఁజేయును.

## సర్వగ్రహదోషహర సర్షపాది ధూపము.

సర్షపా నింబపత్రాణి మూలమశ్వఖురా వచా. ౪౯
భూర్జపత్రం ఘృతం ధూపస్సర్వగ్రహనివారణః,

ఆవాలు, వేఁపాకు, వేఁపవేళ్లు, దింటెన, వస, భుజపత్రి, ఆవునెయ్యి వీని నొకటిగచేర్చి ధూపమువేసిన సకలగ్రహబాధలు నివర్తించును.

## బాలగ్రహదోషమునకు అనంతాదిఘృతము.

అనంతామ్రాస్థితగరం మరీచం మధురో గణః. ౫౦
సృగాలవిన్నా ముస్తా చ కల్కితై స్సైఘృతం పచేత్,
దశమూలరసక్షీరం యుక్తం తద్గ్రహాజిత్పరమ్. ౫౧

దూలగోవిల, మామిడిపప్పు, గ్రంథితగరము, మిరియాలు, మధురగణద్రవ్యములు, నక్కతోక పొన్న, తుంగముస్తలు వీనిని సమభాగములుగ గ్రహించి కల్క

ముచేసి దశమూల కషాయములో కలిపి అందులో ఆవుపాలు ఆవునెయ్యి చేర్చి ఘృత పాకవిధిగ పక్వముచేసి శిశువులకు పానముచేయించిన గ్రహబాధలు నిశ్శేషముగ నివర్తించును.

## బాలగ్రహదోషమునకు రాస్నాదిఘృతము.

రాస్నాద్వ్యంశుమతీవృద్ధపంచమూలవచాఘనాత్,
క్వాథే సర్పిః పచేత్పిష్టైస్సారిబావ్యోషచిత్రకైః. ౫౨

పాఠావిడంగమధుకపయస్యాహింగుదారుభిః,
సగ్రంథికైస్సేంద్రయవైశ్శిశోస్తత్సతతం హితమ్. ౫౩
సర్వరోగగ్రహహరం దీపనం బలవర్ణదమ్,

దుంపరాస్నము, ముయ్యాకు పొన్న, కోలపొన్న, మహాపంచమూలములు, వస, తుంగముస్తలు వీని కషాయములో ఆవునేతిని పోసి అందులో సుగంధిపాల త్రికటుకములు, చిత్రమూలము, చిరుబొద్ది, వాయువిడంగములు, యష్టిమధుకము, పిన్న మనుబాల, ఇంగువ, దేవదారు, గ్రంథితగరము, కొడిసె విత్తులు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి విధిప్రకారము పక్వముచేసి శిశువుల కిప్పించిన సమస్త రోగములు గ్రహబాధలు హరించును. అగ్నిదీపనము, బలము, శరీరవర్ణంబును కలుగును. సర్వకాలములయందు హితకరముగ నుండును.

## గ్రహదోషమునకు సారిబాది ఘృతము.

సారిబాసురభీబ్రాహ్మీశంఖినీకృష్ణసర్షపైః. ౫౪
వచాశ్వగంధా సురసాయుక్తైస్సర్పిర్విపాచయేత్,
తన్నాశయేద్గ్రహాన్ సర్వాన్ పానేనాభ్యంజనేన చ. ౫౫

సుగంధిపాల, అందుగు, సరస్వతియాకు, శంఖినీ, నల్లఆవాలు, వస, పెన్నేరుగడ్డ, తులసి వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవునేతిలో కలిపి పక్వముచేసి శిశువులకు పానాభ్యంజనములయం దుపయోగించిన గ్రహబాధలన్నియు శమించును.

## భూతగ్రహదోషములకు గోశృంగాది ధూపము.

గోశృంగలోమవాలాహినిర్మోకవృషదంశవిట్,
నింబపత్రాజ్యకటుకా మదనం బృహతీద్వయమ్. ౫౬
కార్పాసాస్థియవచ్ఛాగరోమదేవాహ్వసర్షపమ్,

మయూరపత్రశ్రీవాసం తుషకేషం సరాపఠమ్. ౫౭
మృద్భాండే బస్తమూత్రేణ భావితం శ్లక్ష్ణచూర్ణితమ్,
ధూపనార్థం హితం సర్వం భూతేషు విషమజ్వరే. ౫౮

ఆవుయొక్క కొమ్ము వెంట్రుకలు తోక, పాముకుబుసము, పిల్లివిష్ఠము, వేంపాకు, వేంపనూనె, కటుకరోహిణి, ప్రంగ, పెద్దములక, చిన్నములక, పత్తివిత్తులు, యవలు, గొఱ్ఱెవెంట్రుకలు, దేవదారు, ఆవాలు, నెమలిరెక్కలు, శ్రీవేష్టకము, ఉముక, మనుజుని తలవెండ్రుకలు, ఇంగువ వీనిని మట్టికుండలోవైచి అందులో గొఱ్ఱెమూత్రముబోసి భావనచేసి యెండించి సన్నగ చూర్ణముచేసి దానిని సకలభూత గ్రహబాధ, విషమజ్వరము వీనియందు ధూపము వేయవలయును.

## గ్రహదోషములకు బలిహోమాదులు.

ఘృతాని భూతవిద్యాయాం వక్ష్యంతే యాని తాని చ,
యుంజ్యాత్తథా బలిం హోమం స్నపనం మంత్రతంత్రవిత్. ౫౯

మంత్రతంత్రములను చక్కగ నెఱింగిన వైద్యుఁడు భూతప్రతిషేధాధ్యాయంబున వచించిన ఘృత, బలి, హోమ, స్నానములను శిశువులకు ప్రయోగించవలయును.

## గ్రహదోషహరస్నానము.

పూతీకరంజత్వక్పత్రం క్షీరిభ్యో బర్బరాదపి,
తుంబీవిశాలారలుకాశమీబిల్వకపిత్థకాః. ౬౦
ఉత్క్వాథ్య తోయం తద్రాత్రౌ బాలానాం స్నపనం శివమ్,

కాలుక్రానుగు, క్షీరివృక్షములు, కుక్కవాయింట వీనిపట్టలు ఆకులు, సొర, పెన్నపాపర, దుందిలము, జమ్మి, మారేడు, వెలగ వీనియాకులు; ఇటుల నీయోషధుల నుదకములోవైచి చక్కఁగకాచి సుఖోష్ణముగనుండు నా యుదకముచే బాలగ్రహము సోఁకిన శిశువులకు రాత్రులయందు స్నానముచేయించిన హితకరంబుగ నుండును.

## గ్రహదోషానుబంధచికిత్స.

అనుబంధాన్యథాకృచ్ఛ్రం గ్రహాపాయేప్యుపద్రవాన్. ౬౧
బాలామయనిషేధోక్తభేషజైస్సముపాచరేత్,

పైచికిత్సలచే గ్రహములు మాత్రము నివర్తించి వానిసంబంధమైన యుపద్రవములు అనుసరింపుచుండిన బాలామయప్రతిషేధాధ్యాయమునందు చెప్పఁబడిన యౌషధముల నాయారోగానుగుణముగ నిష్పింపవలయును.

ఇతి అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమున

మూఁడవ అధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# చ తు ర్థా ధ్యా య ము.

(భూతవిద్య) 3-వ అంగము.



అవ. మానవులకు స్కంధాది గ్రహములు సోఁకినచో జ్వరాద్యుపద్రవంబులు గుటంబోలె మనుజులకు భూతములుసోఁకిన పై జ్వరాద్యుపద్రవములు జనించును. గున భూతస్వరూపాదులను తెలియపరచుటకై భూతవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడు గుది.

## భూతవిజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

గా. అథాతో భూతవిజ్ఞాన మధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

బాలగ్రహ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము భూతగ్రహలక్షణములనుబో నట్టి భూతవిజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

భూతగృహీత పురుషలక్షణము.

లక్షయేత్ జ్ఞానవిజ్ఞానవాక్చేష్టాబలపౌరుషమ్,
పురుషేఽపౌరుషం యత్ర తత్ర భూతగ్రహం వదేత్. ౧

జ్ఞాన, విజ్ఞాన, వాక్య, వ్యాపార, బల, సామర్థ్యంబు లేమానవునికి ప్రకృతికి స్వత్వ్యస్తముగ నుండునో అట్టివానికి భూతగ్రహము సోఁకియున్నదని నిశ్చ వలయును.

దేవాదిభూతములు సోఁకిన పురుషులలక్షణము

భూతస్య రూపప్రకృతిభాషాగత్యాదిచేష్టితైః,
యస్యానుకారం కురుతే తేనావిష్టం తమాదిశేత్. ౨
సోఽష్టాదశవిధో దేవదానవాదివిభేదతః,

దేవదానవాది భేదంబులచే భూతగ్రహములు పదునెనిమిది విధములుగ నుండును. ఏభూతముయొక్క రూపము, స్వభావము, వచనము, గమనము మొదలగు నుజునికి గలిగి యుండునో యాభూతము సోఁకియున్నదని తెలియ నలయును.

దేవాదిభూతములు సోఁకుటకుకారణము.

హేతు స్తదనుపక్తౌ తు సద్యః పూర్వకృతోఽథవా. 3
ప్రజ్ఞాపరాధస్సుతరాం తేన కామాదిజన్మనా,
లుప్తధర్మవ్రతాచారః పూజ్యానప్యతివర్తతే. ౪
తంతథా భిన్నమర్యాదం పాప మాత్మోపఘాతినమ్,
దేవాదయోఽప్యనుఘ్నంతి గ్రహాశ్ఛిద్రప్రహారిణః. ౫
ఛిద్రంపాతక్రియారంభః పాకోఽనిష్టస్య కర్మణః,
ఏకస్య శూన్యేఽవస్థానం శ్మశానాదిషు వా నిశి. ౬
దిగ్వాసస్త్వం గురోర్నిందా రతే రవిధిసేవనమ్,
అశుచేర్దేవతార్చాది పరసూతకసంకరః. ౭
హోమమంత్రబలీజ్యానాం విగుణం పరికర్మ చ,
సమాసాద్దినచర్యాది ప్రోక్తాచారవ్యతిక్రమః. ౮

మనుజులీజన్మమునందైనను పూర్వజన్మమునందైనను బుద్ధిపూర్వకముగ నపరాధములు (పాపములు) చేయుటవలన నట్టివారిని దేవాదిగ్రహములు సోఁకును. అది యెట్లనిన:—మనుజుఁడు కామక్రోధాదులవలన బుద్ధిపూర్వకముగ పాపముచేసినచో ధర్మవ్రతాచారవిరహితుండై పెద్దలను తిరస్కరించువాఁడును, మర్యాదా రహితుండును పాపమును జేయువాఁడును, తనకుతానే కీడునుచేసికొనువాఁడును నగును. అట్టిమనుజునియందు సమయమును కనుపెట్టియుండు దేవాదిగ్రహములు ప్రవేశించును. తనచే పూర్వజన్మమునందుగాని, ఈ జన్మమునందుగాని బుద్ధిపూర్వకముగ చేయఁబడిన పాపములకు ఫలము కలుగుసమయమునందు మనుజుఁడు మరల పాపకృత్యములను చేయుట కారంభించును. ఇదియే ఛిద్రమనఁబడును. మఱియు రాత్రులయందు నిర్జనప్రదేశమునందుగాని, శ్మశానము మొదలగు దుష్టస్థలంబులయందుగాని యేకాకియైయుండుట, దిగంబరుఁడుగ నుండుట, గురువునునిందించుట, శాస్త్రవిరుద్ధముగ సురతము చేయుట, అశుద్ధతోడ దేవతల నారాధించుట, ఇతరులయొక్క సూతకములను తానుకలుపుకొనుట, శాస్త్రవిరుద్ధముగ హోమ, మంత్ర, బలి, పూజల నొనర్చుట, దినచర్యాధ్యాయ ధర్మశాస్త్రముల యందుఁ జెప్పఁబడియుండు ధర్మాచారముల ననుష్ఠించకుండుట యివి భూతములుసోఁకుటకు కారణంబులు.

భూతగ్రహణకాలము.

గృహ్ణంతి శుక్లప్రతిపత్త్రయోదశ్యో స్సురా నరమ్,

శుక్లత్రయోదశీకృష్ణద్వాదశ్యోర్దానవా గ్రహాః. ౯
గన్ధర్వాస్తు చతుర్దశ్యాం ద్వాదశ్యాం చోరగాః పునః,
పఞ్చమ్యాం శుక్లసప్తమ్యేకాదశ్యోస్తు ధనేశ్వరాః. ౧౦
శుక్లాష్టపంచమీపూర్ణమాసీషు బ్రహ్మరాక్షసాః,
కృష్ణే రక్షఃపిశాచాద్యా నవద్వాదశ పర్వసు. ౧౧
దశామావాస్యయోరష్ట నవమ్యోః పితరోఽపరే,
గురువృద్ధాదయః ప్రాయః కాలం సన్ధ్యాసు లక్షయేత్. ౧౨

దేవగ్రహములు శుద్ధపాడ్యమిత్రయోదశీ తిథులయందును, దానవగ్రహంబులు శుద్ధత్రయోదశి బహుళద్వాదశులయందును, గంధర్వగ్రహములు చతుర్దశీ ద్వాదశులయందును, సర్పగ్రహములు బహుళపంచమి శుద్ధసప్తములయందును, యక్షగ్రహములు ఏకాదశియందును, బ్రహ్మరాక్షసగ్రహములు శుద్ధాష్టమి పంచమి పూర్ణిమా తిథులయందును, రాక్షసపిశాచాది గ్రహములు బహుళనవమీ ద్వాదశీ అమావాస్యా పూర్ణిమలయందును, పితృగ్రహంబులు దశమి అమావాస్య అష్టమీనవమీ తిథులయందును, ఇతరములైన గురువృద్ధగ్రహములు అష్టమి నవమి తిథులయందును మనుజులను సోఁకును. మఱియు పైచెప్పిన గ్రహములన్నియు వాని వానికిచెప్పియుండు తిథులయందు సంధ్యాకాలముననే తఱుచుగసోఁకును.

## దేవగ్రహగృహీతలక్షణము.

ఫుల్లపద్మోపమముఖం సౌమ్యదృష్టి మకోపనమ్,
అల్పవాక్స్వేదవిణ్మూత్రం భోజనానభిలాషిణమ్. ౧౩
దేవద్విజాతిపరమం శుచిసంస్కృతవాదినమ్,
మీలయన్తం చిరా న్నేత్రే సురభిం వరదాయినమ్. ౧౪
శుక్లమాల్యాంబరసరిచ్ఛైలోచ్చభవనప్రియమ్,
అనిద్రమప్రధృష్యం చ విద్యాద్దేవవశీకృతమ్. ౧౫

వికసించిన తామరపుష్పమువంటి ముఖముగలవాఁడును, క్రూరదృష్టిలేక సౌమ్యదృష్టికలవాఁడును, కోపములేనివాఁడును, స్వల్పముగమాటలాడువాఁడును, చెమట మల మూత్రములు నివి స్వల్పముగ కలిగియుండు వాఁడును, ఆహారమునం దిచ్ఛలేనివాఁడును, దేవబ్రాహ్మణులయందు భక్తిగలవాఁడును, శుద్ధముగను సత్యముగను భాషించువాఁడును, చిరకాలము నేత్రములను తెరచికొని యుండువాఁడును, సుగంధమైన శరీరముగలవాఁడును, వరమునిచ్చువాఁడును, తెల్లనిపుష్పములు తెల్లనివస్త్రములు నదులు పర్వత

ములు ఉన్నతగృహములు వీనియందిచ్ఛగలవాఁడును, నిద్రారహితుండును, ఇతరులచే జయింపఁదగని వాఁడునునై యుండు మనుజుని దేవగ్రహము సోఁకియున్నదని తెలిసికొనవలయును.

### అసురగ్రహగృహీత లక్షణము.

జిహ్మదృష్టిం దురాత్మానం గురుదేవద్విజద్విషమ్,
నిర్భయం మానినం శూరం క్రోధనం వ్యవసాయినమ్. ౧౬
రుద్రస్కన్దో విశాఖోఽహ మిన్ద్రోఽహ మితివాదినమ్,
సురామాంసరుచిం విద్యా ద్దైత్యగ్రహగృహీతకమ్. ౧౭

కుటిలదృష్టిగలవాఁడును, దుర్బుద్ధిగలవాఁడును, దేవతాగురుబ్రాహ్మణుల ద్వేషించువాఁడును, భయములేనివాఁడును, మానము శౌర్యము కోపము ఉత్సాహము వీనితోఁ గూడియుండువాఁడును, నేనే ఇంద్రుఁడను నేనే సుబ్రహ్మణ్యుఁడను నేనే యీశ్వరుఁడను అని వాదించువాఁడును, మద్యమాంసములయం దధికేచ్ఛగలవాఁడునునైయుండు మనుజునియందు ఆసురగ్రహము ఆవహించియున్నదని తెలిసికొనవలయును.

### గంధర్వగ్రహగృహీత లక్షణము.

స్వాచారం సురభిం హృష్టం గీతనర్తనకారిణమ్,
స్నానోద్యానరుచిం రక్తవస్త్రమాల్యానులేపనమ్. ౧౮
శృంగారలీలాభిరతం గన్ధర్వాధ్యుషితం వదేత్,

గంధర్వగ్రహము సోఁకినమనుజుఁడు మంచియాచారముల నవలంబించువాఁడును, సుగంధ చందనాదులను ధరించువాఁడును, సంతోషసహితుండును, గానముచేయువాఁడును, నృత్యములను జేయువాఁడును, స్నానముచేయుటయందు ప్రీతికలవాఁడును, ఉద్యానవనమునం దిచ్ఛగలవాఁడును, ఎఱ్ఱనివస్త్రములు ఎఱ్ఱనిపుష్పములు ఎఱ్ఱనిచందనము వీనిని ధరించుటయం దధికప్రీతికలవాఁడును శృంగారలీలలయందాసక్తి కలవాఁడునై యుండును.

### ఉరగగ్రహగృహీత లక్షణము.

రక్తాక్షం క్రోధనం స్తబ్ధదృష్టిం వక్రగతిం చలమ్. ౧౯
శ్వసన్తమనిశం జిహ్వాలోలినం సృక్విణీలిహమ్,
ప్రియదుగ్ధగుడస్నానమధోవదనశాయినమ్. ౨౦
ఉరగాధిష్ఠితం విద్యాత్త్రస్యన్తం చాతపత్త్రతః,

ఎఱ్ఱని కన్నులుగలవాఁడును, మిక్కిలి కోపముగలవాఁడును, స్తబ్ధమైన దృష్టిగల డును, వంకరగ నడచువాఁడును, ఎల్లప్పుడు చలింపు స్వభావముగలవాఁడును, ఎల్ల మను పెద్దయూర్పు విడుచువాఁడును, పామువలె నాలుకనాడించువాఁడును, పెదవులను (గా పెదవులకొనలను) నాకువాఁడును, పాలు బెల్లము స్నానము వీనియందు ప్రీతి వాఁడును, బోర్లగిల పరుండువాఁడును, భయపడువాఁడును నగు మనుజుని ఉరగగ్ర హసోఁకినదని తెలిసికొనవలయును.

### యక్షగ్రహగృహీత లక్షణము.

విప్లుతం త్రస్తరక్తాక్షం శుభగంధం సుతేజసమ్. ౨౧
ప్రియనృత్యకథాగీతస్నానమాల్యానులేపనమ్,
మత్స్యమాంసరుచిం హృష్టం దుష్టం బలినమవ్యయమ్. ౨౨
చలితాగ్రకరం కస్మై కిందదామీతి వాదినమ్,
రహస్యభాషణం వైద్యద్విజాతిపరిభావినమ్. ౨౩
అల్పరోషం హృతగతం విద్యాద్యక్షగృహీతకమ్,

భయముతోఁగూడి యెఱ్ఱనగునుండు నేత్రములు గలవాఁడును, ప్రశస్తమైనవాసన తేజస్సునుగలవాఁడును, నృత్యము కథలు సంగీతము స్నానము పుష్పములు చంద మత్స్యము మాంసము వీనియందు ప్రీతిగలవాఁడును, సంతోష సమన్వితుండును, గలవాఁడును, నాశములేనివాఁడును, చేతివ్రేళ్లను పలుమారు ఆడించువాఁడును, ఎవ నినిత్తును అని పలుమారు చెప్పువాఁడును, రహస్యముగ భాషించువాఁడును, వైద్య బ్రాహ్మణులను తిరస్కరించువాఁడును, స్వల్పకోపము గలవాఁడునై యుండు మను యక్షగ్రహము సోఁకియున్నదని తెలియవలయును.

### బ్రహ్మరాక్షసగ్రహగృహీత లక్షణము.

హాస్యనృత్యప్రియం రౌద్రచేష్టం ఛిద్రప్రహారిణమ్. ౨౪
ఆక్రోశినం శీఘ్రగతిం దేవద్విజభిషగ్ద్విషమ్,
ఆత్మానం కాష్ఠశస్త్రాద్యైర్ఘ్నంతం భోశ్శబ్దవాదినమ్. ౨౫
శాస్త్రవేదపఠం విద్యాద్గృహీతం బ్రహ్మరాక్షసైః,

పరిహాసము నర్తనము వీనియందిచ్ఛగలవాఁడును, క్రూరవ్యాపారములను చేయు ను, సమయముజూచి ప్రహరించువాఁడును, కూఁత వేయువాఁడును, వేగముగ

నటించువాఁడును, దేవబ్రాహ్మణవైద్యులను ద్వేషించువాఁడును, ఆయుధాదులచే తనశరీర మును కొట్టుకొను వాఁడును, (ఓ) అని కేకలు వేయువాఁడును, వేద శాస్త్రములను పఠించువాఁడునునై యుండు మనుజుఁడు బ్రహ్మరాక్షస గ్రహపీడితుండని తెలిసికొన వలయును.

### రాక్షసగ్రహగృహీత లక్షణము.

సక్రోధదృష్టిం భృకుటీముద్వహంతం ససంభ్రమమ్. ౨౬
ప్రహరంతం ప్రధావంతం శబ్దం తం భైరవాననమ్,
అన్నాద్వినాపి బలినం నష్టనిద్రం నిశాచరమ్ ౨౭
నిర్లజ్జమశుచిం శూరం క్రూరం పరుషభాషిణమ్,
రోషణం రక్తమాల్యస్త్రీరక్తమద్యామిషప్రియమ్. ౨౮
దృష్ట్వా చ రక్తం మాంసం వా లిహానం దశనచ్ఛదౌ,
హసంతమన్నకాలే చ రాక్షసాధిష్ఠితం వదేత్. ౨౯

కోపదృష్టిగలవాఁడును, కనుబొమల నిట్రబొడిచికొని యుండు వాఁడును, సంభ్రమముగలవాఁడును, అకస్మాత్తుగ మనుజులను కొట్టువాఁడును, పరుగులిడువాఁడును, కూయువాఁడును, భయంకరముఖముగలవాఁడును, ఆహారములేకుండినను విశేషబలముగల వాఁడును, నిద్రాశూన్యుండును, రాత్రులయందుసంచరించువాఁడును, లజ్జారహితుండును, పరిశుద్ధిరహితుండును, శౌర్యవంతుండును, క్రూరముగ భాషించువాఁడును, కోపముగల వాఁడును, ఎఱ్ఱనిపుష్పములు స్త్రీలు రక్తము మద్యము వీనియందును మాంసమునందును ఇచ్ఛగలవాఁడును, రక్తమునుగాని మాంసమునుగాని చూచినపుడెల్ల తన నాలుకచే పెదవుల నాకువాఁడును, ఆహారకాలమునందు నవ్వువాఁడును నగు మనుజుని రాక్షసగ్రహము సోఁకియున్నదని తెలిసికొనవలయును.

### పిశాచగ్రహగృహీత లక్షణము.

అస్వస్థచిత్తం నైకత్ర తిష్ఠంతం పరిధావినమ్,
ఉచ్ఛిష్టనృత్యగాంధర్వహాసమద్యామిషప్రియమ్. ౩౦
నిర్భర్త్సనాద్దీనముఖం రుదంతమనిమిత్తతః,
నఖైర్లిఖంతమాత్మానం రూక్షధ్వస్తవపుస్స్వరమ్. ౩౧
ఆవేదయంతం దుఃఖాని సంబద్ధాబద్ధభాషిణమ్,
నష్టస్మృతిం శూన్యరతిం లోలం నగ్నం మలీమసమ్. ౩౨

రథ్యాచేలపరాధీనం తృణమాలావిభూషణమ్,
ఆరోహంతం చ కాష్ఠాశ్వం తథా సంకరకూటకమ్ 33
బహ్వాశినం పిశాచేన విజానీయాదధిష్ఠితమ్,

మనస్సునకు స్వస్థతలేకుండువాఁడును, ఒకచోనైన నిలువక పరువులిడువాఁడును, ఉచ్ఛిష్ట, నృత్య, సంగీత, హాస్య, మద్య, మాంసములయందు ప్రీతిగలవాఁడును, ఇతరులు తన్ను బెదరించుటవలన దైన్యమును జెందువాఁడును, కారణములేకయే రోదనము చేయువాఁడును, నిజనఖంబులచే తనశరీరమును గీచుకొనువాఁడును, రూక్షమైన శరీరము స్వరముగలవాఁడును, తనదుఃఖముల చెప్పుకొనువాఁడును, ఒకప్పుడు సందర్భరహితంబుగను మఱియొకప్పుడు సందర్భసహితంబుగను భాషించువాఁడును, జ్ఞాపకశక్తిలేకుండువాఁడును, నిర్జనప్రదేశమునందుండుట కాసక్తిగలవాఁడును, దిగంబరుండును, మాలిన్యముగలవాఁడును, ఎల్లపుడు వీథులయందు పడియుండు గుడ్డపేలికలను కట్టుకొనువాఁడును, తృణములను మాలగాధరించువాఁడును, కఱ్ఱతోచేయఁబడిన గుఱ్ఱము సంకరకూటము (అనఁగా మిట్టగా పోయఁబడినచెప్ప) వీనినెక్కువాఁడును, విశేషాహారమును భుజించువాఁడును నైయుండు మనుజుఁడు పిశాచగ్రహపీడితుఁడని తెలిసికొనవలయును.

ప్రేతగ్రహగృహీత లక్షణము.

ప్రేతాకృతిక్రియాగంధం భీతమాహారవిద్విషమ్. ౩౪
తృణచ్ఛిదం చ ప్రేతేన గృహీతం నరమాదిశేత్,

ప్రేతమునకు సమానమైనగంధము ఆకారము కృత్యమునుగలవాఁడును, భీతిజెందియుండువాఁడును, అన్నద్వేషముకలవాఁడును, తృణములను త్రుంచువాఁడును నైనమనుజుని ప్రేతగ్రహము సోఁకియున్నదని తెలిసికొనవలయును

కూశ్మాండగ్రహగృహీత లక్షణము

బహుప్రలాపం కృష్ణాస్యం ప్రవిలంబితయాయినమ్. ౩౫
శూనప్రలంబవృషణం కూశ్మాండాధిష్ఠితం వదేత్,

అధికముగ మాటలాడువాఁడును, నల్లని ముఖముగల్గువాఁడును, మెల్లగనడచువాఁడును, వృషణములుబ్బి వ్రేలాడుచుండువాఁడును నైయుండు మనుజునికి కూశ్మాండగ్రహము సోఁకియున్నదని యెఱుంగవలయును.

నిషాదగ్రహగృహీత లక్షణము

గృహీత్వా కాష్ఠలోష్టాది భ్రమంతం చీరవాససమ్. ౩౬

నగ్నం ధావంతముత్త్రస్తదృష్టిం తృణవిభూషణమ్,
శ్మశానశూన్యాయతనం రథ్యైక ద్రుమసేవినమ్. ౩౭
తిలాన్నమద్యమాంసేషు సతతం సక్తలోచనమ్,
నిషాదాధిష్ఠితం విద్యా ద్వదంతం పరుషాణి చ. ౩౮

మట్టిగడ్డలు, కట్టెలు వీనిని చేతులయందు ధరించుకొని సంచరించుట, నార చీరలంగట్టుట, పరుగులిడుట, ఒకపుడు దిగంబరుండుగనుండుట, భయముతోఁగూడిన దృష్టిగలిగియుండుట, తృణములను భూషణములుగా ధరించుట, శ్మశానాది శూన్య ప్రదేశంబులయందు వసించుట, వీధులయందలి చెట్లక్రిందనుండుట, నువ్వులయన్నము మద్యము మాంసము వీనియందభిలాష కలిగియుండుట, పరుషముగ భాషించుట ఈలక్షణములుగల మనుజుని నిషాదగ్రహము సోఁకియున్నదని తెలిసికొనవలయును.

ఔకిరణగ్రహగృహీత లక్షణము.

యాచంత ముదకం చాన్నం త్రస్తాలోహితలోచనమ్,
ఉగ్రవాక్యం చ జానీయాన్నరమౌకిరణార్దితమ్. ౩౯

అన్నోదకములను యాచించుట, అధైర్యముతోఁగూడిన యెఱ్ఱనికండ్లు కలిగియుండుట, క్రూరముగభాషించుట ఈలక్షణములుగల మనుజునియందు ఔకిరణగ్రహము ప్రవేశించియున్నదని తెలిసికొనవలయును.

వేతాళగ్రహగృహీత లక్షణము.

గంధమాల్యరతిం సత్యవాదినం పరివేపినమ్,
బహుచ్ఛిద్రం చ జానీయాద్వేతాళేన వశీకృతమ్. ౪౦

మంచిచందనము పుష్పహారములు వీనియం దనురాగము కలిగియుండుట, సత్యముగభాషించుట, వణఁకుట, విశేషముగ ఛిద్రములు కలిగియుండుట ఈ లక్షణములుగల మనుజుని వేతాళగ్రహము సోఁకియున్నదని తెలిసికొనవలయును.

పితృగ్రహగృహీత లక్షణము

అప్రసన్నదృశం దీనవదనం శుష్కతాలుకమ్,
చలన్నయనపక్ష్మాణం నిద్రాళుం మందపావకమ్. ౪౧
అపసవ్యపరీధానం తిలమాంసగుడప్రియమ్,
స్ఖలద్వాచం చ జానీయాత్పితృగ్రహవశీకృతమ్. ౪౨

కలకఁబారిన నేత్రములు దైన్యముతోఁ గూడియుండు ముఖము, శుష్కించిన తాలుప్రదేశము, చలింపుచుండు కంటిరెప్పలు, నిద్రించుస్వభావము, అగ్నిమాంద్యము, అపసవ్యముగ ధరించినవస్త్రము, నువ్వులు, మాంసము, బెల్లము వీనియందుప్రీతి, తడబడు మాటలు ఈ లక్షణములుగల మనుజుని, పితృగ్రహము సోఁకియున్నదని యూహించవలయును.

## గురువృద్ధాదిగ్రహగృహీత లక్షణము.

గురువృద్ధర్షిసిద్ధాభిశాపచింతానురూపతః,
వ్యాహారాహారచేష్టాభిర్యథాస్వం తద్గ్రహం వదేత్. ౪౩

గురువులు వృద్ధులు ఋషులు సిద్ధులు వీరియొక్క శాపాభిప్రాయముల కనుగుణముగ నెవనియొక్క యాహార వచన కృత్యములుండునో అట్టి మనుజునియందు పైచెప్పిన గురువు మొదలగుగ్రహములు ప్రవేశించియున్నవని తెలియవలయును.

## అసాధ్యభూత లక్షణము.

కుమారబృందానుగతం నగ్న ముద్ధతమూర్ధజమ్,
అస్వస్థమనసం దైర్ఘ్యకాలికం తం గ్రహం త్యజేత్. ౪౪

దిగంబరుండును, తలవెండ్రుకలు నిట్రబొడిచికొని యుండువాఁడును, స్వస్థత లేని మనస్సుకలవాఁడును, చిరకాలమనువర్తింపు గ్రహము కలిగియుండువాఁడును, బాల సమూహముచే నావరింపఁబడిన వాఁడును నగు మనుజునికి చికిత్సచేయఁజనదు. ఇది అసాధ్యము.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమున
నాలుగవ యధ్యాయము ముగిసెను.






శ్రీ ర స్తు.

# పంచమాధ్యాయము.

అవ. పూర్వాధ్యాయములో చెప్పియుండు దేవాదిభూతములు సోఁకుటవలన జనించు రోగములకు చికిత్సలను తెలియపఱచుటకై భూతప్రతిషేధమను నీయధ్యాయము చెప్పఁబడుచున్నయది —

## భూతప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో భూతప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

భూతవిజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము భూతోపద్రవంబులకు దగిన చికిత్సలనుబోధించునట్టి భూతప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

అహింసాత్మక భూతచికిత్స

భూతం జయే దహింసేచ్ఛం జపహోమబలివ్రతైః,
తపశ్శీలసమాధానజ్ఞానదానదయాదిభిః. ౧

మనుజులను హింసించుటయందిచ్ఛలేని భూతములను జపహోమ బలివ్రత తపస్సదాచార సాంత్వవచనజ్ఞాన దాన దయాదులచే చికిత్సజేయవలయును.

భూతపీడా హరయోగము.

హింగువ్యోషాలనేపాళీలశునార్కజటాజటాః,
అజలోమీ సగోలోమీ భూతకేశీ వచా లతా. ౨
కుక్కుటీ సర్పగంధాఖ్యా తిలాః కాలవిషాణికే,
వజ్రప్రోక్తా వయస్థా చ శృంగీ మోహనవల్ల్యపి. ౩
స్రోతోజాంజనరక్షోఘ్నం రక్షోఘ్నం చాన్యదౌషధమ్,
ఖరాశ్వాశ్వావిదుష్ట్రర్క్షగోధానకులశల్యకాః. ౪
ద్వీపిమార్జారగోసింహవ్యాఘ్రసాముద్రసత్వతః,

చర్మపిత్తద్విజనఖా వర్గేఽస్మిన్ సాధయేద్ఘృతమ్. ౫
పురాణమథవా తైలం నవం తత్పానసస్యయోః,
అభ్యంగే చ ప్రయోక్తవ్యమేషాం చూర్ణం చ ధూపనే. ౬
ఏభిశ్చ గుటికాం యుంజ్యాదంజనే సావపీడనే,
ప్రలేపే కల్కమేతేషాం క్వాథం చ పరిషేచనే. ౭
ప్రయోగోఽయం గ్రహోన్మాదాన్ సాపస్మారాన్నియమనయేత్,

ఇంగువ, త్రికటుకములు, హరిదళము, కస్తూరి, వెల్లుల్లి, జిల్లేడుకాడలు, జటామాంసి, అజలోమి (అనఁగాతులసి) తెల్లగరికె, నల్లవావిలి, వస, ప్రేంకణము,బూరుగు, సర్పాక్షి, నువ్వులు, కాకోళీ, క్షీరకాకోళీ, నల్లేరు, కరక్కాయలు, అతివస, మోహనవల్లి, స్రోతోంజనము, తెల్లావాలు, గుగ్గిలము, రాక్షసబాధలను తొలగించునట్టి యితరౌషధులు, ముండ్లపంది, గాడిదె, గుడ్లము, అడవిపంది, ఒంటె,యెలుగుబంటి,ఉడుము, ముంగిస, పులి, పిల్లి, ఆవు, సింహము, పెద్దపులి, జలజంతువులు వీనియొక్క చర్మము పిత్తము దంతములు గోళ్లు ఈద్రవ్యముల కల్కమును పాంతనేతిలోగాని కొత్తనువ్వుల నూనెలోగాని కలిపి పాకవిధిప్రకారము పక్వముచేసి దానిని స్నానాభ్యంజన నస్యముల యందు ప్రయోగించవలయును. పై ద్రవ్యముల నొకటిగజేర్చి చూర్ణముచేసి ధూపము వేయవలయును. పైచూర్ణములను గుటికలుచేసి అంజనము వేయవలయును. పైద్రవ్యములనునూరి కల్కముచేసి లేపనముచేయవలయును.పైద్రవ్యములనుదకములోవైచి చక్కఁగకాచి స్నానము చేయించవలయును. అట్లుపయోగించినచో భూతబాధ, ఉన్మాదము, అపస్మారము వీనిని పోగొట్టును.

## భూతోపద్రవమునకు నస్యాదులు.

గజాహ్వాపిప్పలీమూల వ్యోషామలకసర్షపాన్. ౮
గోధానకులమార్జారఋషపిత్తప్రపేషితాన్,
నావనాభ్యంగసేకేషు విదధీత గ్రహోపహాన్. ౯

ఏనుఁగుపిప్పళ్లు, పుష్కరమూలము, త్రికటుకములు, ఉసిరికె,ఆవాలు, ఈ ద్రవ్యములను ఉడుము, ముంగిస, పిల్లి, మత్స్యములు వీనిపిత్తములతో నూరి నస్యాభ్యంగపరిషేకములయం దుపయోగించిన గ్రహబాధలు నివర్తించును.

## సిద్ధార్థక ఘృతము.

సిద్ధార్థకవచాహింగుప్రియంగురజనీద్వయమ్,
మంజిష్ఠా శ్వేతకటభీ వచా శ్వేతాద్రికర్ణికా. ౧౦

నింబస్య పత్రం బీజం తు నక్తమాలశిరీషయోః,
సురాహ్వాం త్ర్యూషణం సర్పిర్గోమూత్రే త్రైశ్చతుర్గుణే. ౧౧
సిద్ధం సిద్ధార్థకం నామ పానే నస్యే ప్రయోజితమ్,
గ్రహాన్ సర్వా న్నిహంత్యాశు విశేషాదాసురాన్ గ్రహాన్. ౧౨
కృత్యాలక్ష్మీవిషోన్మాదజ్వరాపస్మారపాప్మ చ,
ఏభిరేవౌషధైర్బ స్తవారిణా కల్పితో గదః. ౧౩
పాననస్యాంజనాలేప తనుఘర్షణయోజితః,
గుణైః పూర్వవదుద్దిష్టో రాజద్వారే చ సిద్ధికృత్. ౧౪

తెల్లావాలు, వస, ఇంగువ, ప్రేంకణము, పసుపు, మ్రానిపసుపు, మంజిష్టి, తెల్లగురిగెంజలు, అతివస, తెల్లగినియ, వేఁపాకు, కానుగువిత్తులు, దిరిసనపువిత్తులు, దేవదారు, త్రికటుకములు వీనిని సమభాగములుగా గ్రహించి కల్కముచేసి ఆవునేతిలోకలిపి నేతికినాలుగింతలు గోమూత్రముపోసి ఘృతపాకవిధిగ పక్వముచేసిన నది సిద్ధార్థక ఘృతమనఁబడును. పాననస్యముల యందీఘృతము నుపయోగించిన సకలగ్రహబాధలు నివర్తించును. మఱియు నీఘృతసేవనమువలన అసురగ్రహములు, పిశాచము, అలక్ష్మి, విషము, ఉన్మాదము, జ్వరము, అపస్మారము, పాపము ఇవి పలాయనం బగును. పైతెల్లావాలు మొదలగు ద్రవ్యముల కల్కమును ఆవునేతిలో కలిపి అందులో నేతికి నాలుగింతలు గొఱ్ఱెమూత్రముపోసి విధిప్రకారము పక్వముచేసి పాననస్య అభ్యంజనలేపనములయందు ప్రయోగించిన గ్రహోపద్రవములు నివర్తించుటయే గాక రాజద్వారమున సహితము సిద్ధికలుగును.

భూతోపద్రవమునకు సిద్ధార్థకాది ఘుటికలు.

సిద్ధార్థకవ్యోషవచాశ్వగంధానిశాద్వయం హింగుపలాండుకందమ్, బీజం కరంజాత్కుసుమం శిరీషాత్ఫలంచ వల్కాశ్చ కపిత్థవృక్షాత్. ౧౫
సమాణిమంథం సనతం సకుష్ఠం స్యోనాకమూలం కిణిహీ సితా చ, బస్తస్య మూత్రేణ విభావితం తత్పిత్తేన గవ్యేన గుడాన్విదధ్యాత్. ౧౬
దుష్టవ్రణోన్మాదతమోనిశాంధానుద్బద్ధకాన్వారినిమగ్నదేహాన్, దిగ్ధాహతాన్ దర్పితసర్పదష్టాం స్తే సాధయంత్యాంజననస్యలేపైః. ౧౭

తెల్లావాలు, త్రికటుకములు, వస, పెన్నేరుగడ్డ, పసుపు, మ్రానిపసుపు, ఇంగువ వెల్లుల్లిగడ్డలు, క్రానుగవిత్తులు, దిరిసెనపుపూలు, దిరిసెనపువిత్తులు, శెలగపట్ట, సైంధవలవణము, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, దుందిలపువేళ్లు, తెల్లగినియ వీనిని సమభాగములుగ గ్రహించి గొఱ్ఱెమూత్రములో భావనచేసి ఆవుపిత్తముతో నూరి ఘుటికలుచేసి అంజన నస్యలేపనములయం దుపయోగించిన దుష్టవ్రణములు, ఉన్మాదము, రేచీకటి, బద్ధోదరము, సర్పవిషము మొదలగునవి నివర్తించును.

## భూతబాధాహరధూపము.

కార్పాసాస్థిమయూరపింఛబృహతీనిర్మాల్య పిండీతక,
త్వఙ్మాంసీవృషదంశవిట్తుషవచాకేశాహినిర్మోచనైః,
నాగేంద్రద్విజశృంగహింగుమరిచైస్తుల్యైః కృతం ధూపనం,
స్కంధోన్మాదపిశాచరాక్షససురావేశజ్వరఘ్నం పరం. ౧౮

పత్తివిత్తులు, నెమలియీకెలు, వాకుడు, శివనిర్మాల్యము, మ్రంగపట్ట, జటామాంసి, పిల్లివిష్ఠము, ఊముక, వస, మనుజుని తలవెండ్రుకలు, పాముకుబుసము, యేనుఁగుదంతము, ఇంగువ, మిరియాలు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి ధూపమువేసిన స్కందపైశాచ రాక్షస దేవగ్రహము సోఁకుటవలన జనించిన జ్వరము, ఉన్మాదంబును హరించును.

## భూతరావఘృతము.

దండకము. త్రికటుకదళకుంకుమగ్రంథికక్షారసింహీ నిశాదారుసిద్ధార్థయుగ్మాంబుశక్రాహ్వయైః, సితలశున ఫలత్రయోశీరతిక్తావచా తుత్థయష్టీబలా లోహితైలా శిలాపద్మకైః. దధితగరమధూక సారప్రియాహ్వ విషాఖ్యావిషాతార్క్ష్యశైలైస్సచవ్యామయైః కల్కితైః, ఘృతమనవమశేషమూత్రాంశసిద్ధం మతం భూతరావాహ్వయం పానతస్తద్గ్రహఘ్నం పరమ్. ౧౯

త్రికటుకములు, తమాలపత్రము, కుంకుమపువ్వు, మోడి, సర్జక్షారము, ములక, పసుపు, దేవదారు, ఆవాలు, తెల్లావాలు, కురువేరు, కొండిసెవిత్తులు, వెల్లుల్లి, త్రిఫలములు, వట్టివేరు, కటుకరోహిణి, వస, కర్పరీతుత్థము, యష్టిమధుకము, చిట్టాముట్టి, మంజిష్ట, ఏలకులు, మణిశిల, పద్మకము, పెరుగు, గ్రంథితగరము, మధూకసారము, (అనఁగా ఇప్పబంక) ప్రేంకణము, అతివస, కాకోళి, రసాంజనము, శిలాజతు, చవ్య

ము, చెంగల్వకోష్టు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి మూత్రవర్గములో చెప్పియుండు ఎనిమిదివిధములైన మూత్రములలోకలిపి అందులో ప్రాత ఆవునెయ్యిపోసి ఘృతపాకవిధిగ పాకముచేసిన నది భూతరావఘృతమనఁబడును. దీనిని పానముచేయించిన గ్రహబాధలన్నియు నివర్తించును.

### మహాభూతరావఘృతము.

దండకము. నతమధుక కరంజలాక్షా పటోలీసమంగా వచాపాటలీహింగు సిద్ధార్థసింహీనిశాయుగ్మతారోహిణీ, బదరకటు ఫలత్రికాకాండదారు కృమిఘ్నాజగంధామరాంకోల్లకోశాతకీశిగ్రునింబాంబు చేంద్రాహ్వయైః, గదశుకతరుపుష్పబీజోగ్రయష్ట్యద్రికర్ణీ నికుంభాగ్నిబిల్వైశ్చ సర్వైః కల్కితై ర్మూత్రవర్గేణ సిద్ధం ఘృతం, విధివినిహిత మాశు సర్వైః క్రమైర్యోజితం హంతి సర్వగ్రహోన్మాదకుష్ఠ జ్వరాం స్తన్మహాభూత రావం స్మృతమ్. ౨౦

గ్రంథితగరము, అతిమధురము, కానుగ, లక్క, చేఁదుపొట్ల, మంజిష్ఠ, వస, కలిగొట్టు, ఇంగువ, తెల్లావాలు, పెద్దములక, పసుపు, మ్రానిపసుపు, ప్రేంకణము, కటుకరోహిణి, రేఁగు, త్రికటుకములు, త్రిఫలములు, కాకాండము (అనగా హంసపాది లేక పెద్దవేము) దేవదారు, వాయువిడంగములు, వాయింట, తిప్పతీఁగె, ఊడుగు, చేఁదుబీర, మునగ, వేము, తుంగముస్తలు, కొడిసెవిత్తులు, చెంగల్వకోష్టు, దిరిసెనపువ్వులు, దిరిసెనపువిత్తులు, అతివస, తెల్లగినియ, నల్లతెగడ, చిత్రమూలము, మారేడు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలో కలిపి మూత్రవర్గములో చెప్పియుండు ఎనిమిది మూత్రములనుచేర్చి విధిప్రకారము పక్వము చేయవలయును. ఇది మహాభూతరావఘృతమని చెప్పఁబడును. దీనిని పానాభ్యంగనస్యాదులయం దుపయోగించిన సర్వగ్రహములు, ఉన్మాదము, కుష్టువు, జ్వరము ఇవి నిశ్శేషముగ హరించును.

### భూతములకు బలిపూజాదికాలము.

గ్రహా గృహ్ణాంతి యే యేషు తేషాం తేషు విశేషతః,
దినేషు బలిహోమాదీ న్ప్రయుంజీత చికిత్సకః. ౨౧

ఏగ్రహ మేతిథియందు మనుజుని సోకునో యా గ్రహమున కాతిథియందు వైద్యుఁడు బలిహోమ పూజాదులను చేయించవలయును.

భూతములకు సామాన్యబలిద్రవ్యములు

స్నానవస్త్రవసామాంసమద్యక్షీరగుడాది చ,
రోచతే యద్యదా స్తయేభ్య స్తేషామాహరే త్తదా. ౨౨
రత్నాని గంధమాల్యాని బీజాని మధుసర్పిషీ,
భక్ష్యాశ్చ సర్వే సర్వేషాం సామాన్యో విధిరిత్యయమ్. ౨౩

స్నానము, వస్త్రము, క్రొవ్వు, మాంసములు, మద్యములు, పాలు, బెల్లము మొదలగువానిలో నేగ్రహమున కేకాలమున కేది యిష్టముగనుండునో యాగ్రహమునకు దానిని ఆకాలమున నిప్పించవలయును. రత్నములు, గంధము, పుష్పములు, యవధాన్యాదులు, తేనె, నెయ్యి, పలుదెఱగులైన భక్ష్యములు. ఇవి సర్వగ్రహముల కిష్టమైన వస్తువులు. కావున వానినన్నిగ్రహములకును బలిగ నిప్పించవలయును.

దేవాదిభూతములకు బలిస్థానములు.

సురర్షిగురువృద్ధేభ్యస్సిద్ధేభ్యశ్చ సురాలయే,
దిశ్యుత్తరస్యాం తత్రాపి దేవాయోపహరేద్బలిమ్. ౨౪
పశ్చిమాయాం యథా కాలం దైత్యభూతాయ చత్వరే,
గంధర్వాయ గవాం మార్గే సవస్త్రాభరణం బలిమ్. ౨౫
పితృనాగగ్రహే నద్యాం నాగేభ్యః పూర్వదక్షిణే,
యక్షాయ యక్షాయతనే సరితోర్వా సమాగమే, ౨౬
చతుష్పథే రాక్షసాయ భీమేషు గహనేషు చ,
రక్షసాం దక్షిణస్యాం తు పూర్వస్యాం బ్రహ్మరక్షసామ్. ౨౭
శూన్యాలయే పిశాచాయ పశ్చిమాం దిశమాస్థితే,

దేవ, ఋషి, గురు, వృద్ధ, సిద్ధులకు దేవాలయంబులయందును, దేవగ్రహమునకు మాత్రము దేవాలయమునం దుత్తరపువైపునందును బలినొసంగవలయును. అసురులకు పశ్చిమమున నాల్గుమార్గంబులు కలియుస్థానంబునను, గంధర్వులకు గోవులు సంచరించునట్టి మార్గంబునను, పితృగ్రహములకు నదీతీరమునందును, నాగగ్రహములకు నదియందాగ్నేయ వైపునను, యక్షగ్రహములకు యక్షాలయమునను లేక రెండునదులు కలియుస్థానమునను, రాక్షసగ్రహమునకు నాలుగుమార్గములు కలియుస్థలంబునను, లేక భయంకరమైన వనములయందును, బ్రహ్మరాక్షస గ్రహములకు అడవిలో పూర్వదిశయందును, పైశాచగ్రహమునకు పశ్చిమదిక్కున శూన్యగృహమునందును, ఆయాగ్రహమునకుఁ జెప్పియుండు కాలములో బలినొసంగవలయును.

## దేవగ్రహ బలిద్రవ్యములు.

శుచిశుక్లాని మాల్యాని గంధాః క్షైరేయమోదనమ్. ౨౮
దధి చ్ఛత్రం చ ధవళం దేవానాం బలిరిష్యతే,

పరిశుద్ధంబులును, తెల్లనిరంగుగలవియునైన పుష్పములు, చందనము, క్షీరాన్నము, పెరుగు, తెల్లనిగొడుగు వీనిని దేవగ్రహములకు బలిగ నిప్పించవలయును.

## దేవగ్రహపీడాహర ఘృతము.

హింగుసర్షపషడ్గ్రంథావ్యోషైరర్ధపలోన్మితైః. ౨౯
చతుర్గుణే గవాం మూత్రే ఘృతప్రస్థం విపాచయేత్,
తత్పానావనాభ్యంగైర్దేవగ్రహవిమోక్షణమ్. ౩౦

ఇంగువ, ఆవాలు, వస, త్రికటుకములు వీనిని దినుసుకు ఒకటిన్నర పలముచొప్పున గ్రహించి కల్కముజేసి యొక ప్రస్థము ఆవునేతిలో కలిపి నాల్గు ప్రస్థములు గోమూత్రముచేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి యాఘృతముచే పాన, నస్య అభ్యంజనములనుచేయించిన దేవగ్రహబాధలు నివర్తించును.

## దేవగ్రహపీడాహరనస్యాంజనములు.

నస్యాంజనం వచాహింగులశునం బస్తవారిణా,

వస, ఇంగువ, వెల్లుల్లి వీనిని గొఱ్ఱెమూత్రముతోనూరి దేవగ్రహములు సోకియుండువారికి నస్యాంజనములను చేయించవలయును.

## దైత్యగ్రహ బలిద్రవ్యములు.

దైత్యే బలిర్బహుఫలస్సోశీరకమలోత్పలః. ౩౧

అసురగ్రహమునకు పెక్కుతెఱంగులైన ఫలములు. వట్టివేరు, తామరపువ్వు, నల్లకలువ వీనితోడ బలినొసంగవలయును.

## సర్పగ్రహ బలిద్రవ్యములు

నాగానాం సుమనోలాజాగుడాపూపగుడోదనైః,
పరమాన్నమధుక్షీరకృష్ణమృన్నాగకేసరైః. ౩౨
వచాపద్మపురోశీరరక్తోత్పలదళైర్బలిః,

సర్పగ్రహంబులకు పుష్పములు, వరిపేలాలు, బెల్లముతోజేసిన భక్ష్యములు, బెల్లముచేర్చిన యన్నము, పాయసము, తేనె, పాలు, నల్లమట్టి, నాగకేసరములు, వస, పద్మకము, గుగ్గిలము, వట్టివేరు, ఎఱ్ఱకలువ వీనితో బలి నిప్పించవలయును.

⟶ సర్వగ్రహబాధాహరనస్యాంజనములు. ⟵

శ్వేతపత్రం చ రోధ్రం చ తగరం నాగసర్షపాః. 33
శీతేన వారిణా పిష్టం నావనాంజనయో ర్హితమ్,

తెల్లతామరపువ్వు, లొద్దుగు, గ్రంథితగరము, ఆవాలు వీనిని శీతోదకముతో నూరి సర్వగ్రహము సోఁకియుండువారికి నస్యాంజనములను చేయించిన హితముకలుగును.

⟶ యక్షగ్రహ బలిద్రవ్యములు ⟵

యక్షాణాం క్షీరదధ్యాజ్యమిశ్రకోదనగుగ్గులుః. 3౪
దేవదార్యుత్పలం పద్మముశీరంవస్త్రకాంచనమ్,
హిరణ్యాం చ బలి ర్యోజ్యో

యక్షగ్రహములకు పాలు, పెరుగు, నెయ్యి ఇవి కలిపిన యన్నము, గుగ్గిలము, దేవదారు, నల్లకలువ, తామరపువ్వు, వట్టివేరు, మంచివస్త్రములు, బంగారు, వెండి వీనిని బలిగ నిప్పించవలయును.

⟶ యక్షబాధాహర నస్యాదులు. ⟵

మూత్రాజ్యక్షీరమేకతః. 3౫
సిద్ధం సమోన్మితం పాననావనాభ్యంజనే హితమ్,
హరీతకీ హరిద్రే ద్వే లశునో మరిచం వచా. 3౬
నింబపత్రం చ బస్తాంబుకల్కితం నావనాంజనమ్,

ఆవుపాలు, ఆవునెయ్యి, గోమూత్రము వీనిని సమభాగములుగ నేకముజేసి చక్కఁగకాచి పాన, నస్య, అభ్యంగములయందుపయోగించిన యక్షగ్రహబాధ నివర్తించును. మఱియు కరక్కాయలు, పసుపు, మ్రానిపసుపు, వెల్లుల్లి, మిరియాలు, వస, వేఁపాకు, వీనిని గొఱ్ఱెమూత్రములోనూరి కల్కముచేసి నస్యాంజనములను చేయించిన యక్షగ్రహబాధ నివర్తించును.

⟶ బ్రహ్మరాక్షస బలిద్రవ్యములు. ⟵

బ్రహ్మరక్షోబలిస్సిద్ధం యవానాం పూర్ణమాఢకమ్. 3౭
తోయస్య కుంభః పలలం ఛత్రం వస్త్రం విలేపనమ్,

బ్రహ్మరక్షస్సునకు యవాన్నముచే నిండింపఁబడినపాత్ర, నీళ్లనిండియుండు కుండ, మాంసము, గొడుగు, వస్త్రము, చందనము వీనిని బలిగనొసంగవలయును.

⟶ బ్రహ్మరాక్షసపీడాహర నస్యాదులు. ⟵

గాయత్రీవింశతిపలక్వాథేఽర్ధపలికైః పచేత్. 3౮

త్ర్యూషణత్రిఫలాహింగుషడ్గ్రంథామిశిసర్షపైః,
సనింబపత్రలశునైః కుడవాః సప్తసర్పిషః. ౩౯
గోమూత్రే త్రిగుణే పానస్యాభ్యంగేషు తద్ధితమ్,

త్రిఫలములు, త్రికటుకములు, ఇంగువ, వస, జటామాంసి, లేక సోఁపు, లేక ఆవాలు, వేఁపాకు, వెల్లుల్లి వీనిని ఒక్కొకటి అరపలముచొప్పున గ్రహించి కల్కము చేసి ఇరువదిపలముల చంద్రకషాయములో కలిపి అందులో ఏడు కుడవములు ఆవు నెయ్యి, నేతికి మూడింతలు గోమూత్రంబునుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి పానాభ్యంగ నస్యములయం దుపయోగించిన బ్రహ్మరాక్షసబాధ నివర్తించును.

## రాక్షసబలి ద్రవ్యములు.

రక్షసాం పలలం శుక్రం కుసుమం మిశ్రకౌదనమ్. ౪౦
బలిః పక్వామమాంసాని నిష్పావా రుధిరోక్షితాః,

రాక్షసగ్రహమునకు మాంసము, తెల్లనిపువ్వులు, మాంసముతో కలిపిన యన్నము, పక్వముచేయఁబడిన మాంసము, అపక్వముగనుండుమాంసము, రక్తములో తడిపిన అనుములు వీనిని బలిగ నొసంగవలయును.

## రాక్షసగ్రహబాధాహర నస్యాదులు.

నక్తమాలశిరీషత్వఙ్మూలపుష్పఫలానిచ. ౪౧
తద్వచ్చ కృష్ణపాటల్యా బిల్వమూలం కటుత్రికమ్,
హింగ్వింద్రయవసిద్ధార్థలశునామలకీఫలమ్. ౪౨
నావనాంజనయోర్యోజ్యో బస్తమూత్రహృతోగదః,
ఏభిరేవ ఘృతం సిద్ధం గవాం మూత్రే చతుర్గుణే. ౪౩
రక్షోగ్రహాన్ తారయతే పానాభ్యంజననావనైః,

క్రానుగు, దిరిసెనవృక్షము, నల్లకలిగొట్టుచెట్టు వీనియొక్క పట్టలు, వేళ్లు, పుష్పములు, ఫలములు, మారేడువేళ్లు, త్రికటుకములు, ఇందువ, కొడిసెవిత్తులు, తెల్లఆవాలు, వెల్లుల్లి, ఉసిరికపండ్లు వీనిని గొఱ్ఱెమూత్రముతో నూరి నస్యాంజనములు చేయించిన రాక్షసగ్రహబాధ తొలఁగును. మఱియు పైనిచెప్పిన క్రానుగు మొదలగు ద్రవ్యములను సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతియందుగలిపి అందులో నేతికి నాలుగింతలు గోమూత్రముచేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి పాననస్య అభ్యంజనములు జేయించిన రాక్షసగ్రహావేశ తొలఁగిపోవును.

పిశాచబలిద్రవ్యములు.

పిశాచానాం బలిశ్శీధు పిణ్యాకః పలలం దధి. ౪౪
మూలకం లవణం సర్పి స్సభూతోదనయావకమ్,

పిశాచగ్రహమునకు మద్యము, తెలికపిండి, మాంసము, పెరుగు, కందమూలములు, ఉప్పు, నెయ్యి, యవాన్నము, భూతోదనము (అనఁగా పెరుగు, పసుపు, వరిపేలపిండి, నువ్వులు ఇవికలిపిన యన్నము) వీనిని బలిగనొసంగవలయును.

పిశాచపీడాహర నస్యాదులు.

హరిద్రాద్వయమంజిష్ఠామిసిసైంధవనాగరమ్. ౪౫
హింగుప్రియంగుత్రికటురసోనత్రిఫలా వచా,
పాటలాశ్వేతకటభీశిరీషకుసుమైర్ఘృతమ్. ౪౬
గోమూత్రపాదికం సిద్ధం పానాభ్యంజనయోర్హితమ్,
బస్తాంబుపిష్టైస్తైరేవ యోజ్యమంజననావనమ్. ౪౭

పసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠి, జటామాంసి, లేక పిన్నసదాప, సైంధవలవణము, సొంటి, యింగువ, ప్రేంకణము, త్రికటుకములు, వెల్లుల్లి, త్రిఫలములు, వస, కలిగొట్టు, తెల్లగురిగింజలు, దిరిసెనపువ్వులు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నేతిలోకలిపి ఘృతమునకు నాల్గుభాగములు గోమూత్రముచేర్చి విధిప్రకారము పక్వముజేసి పానాభ్యంగములయం దుపయోగించిన పిశాచగ్రహము నివర్తించును. మఱియు పైనిచెప్పిన పసుపు మొదలగు ద్రవ్యములను గొఱ్ఱెమూత్రముతోనూరి పిశాచగ్రహముసోఁకియుండువారికి అంజననస్యములను జేయించిన హితముకలుగును.

దేవాదిగ్రహములకు తీక్ష్ణనస్యాదినిషేధము.

దేవర్షిపితృగంధర్వే తీక్ష్ణం నస్యాది వర్జయేత్,
సర్పిఃపానాది మృద్వస్మిన్ భైషజ్యమవచారయేత్. ౪౮
ఋతే పిశాచాన్సర్వేషు ప్రతికూలం చ నాచరేత్,
స వైద్యమాతురం ఘ్నన్తి క్రుద్ధా స్తే హి మహౌజసః. ౪౯

దేవ, ఋషి, పితృ, గంధర్వగ్రహములయందు తీక్ష్ణమైన నస్యాద్యౌషధములను వర్జించి మృదువైన ఘృతపానాద్యౌషధంబుల నిప్పించవలయును. మఱియు పైశాచగ్రహంబులుతప్ప తదితరగ్రహములయందు తీక్ష్ణమును, ఆగ్రహములకు విరుద్ధములునైన చికిత్సలను చేయఁజనదు. చేసినచో విశేషశక్తియుక్తంబులైన యాదేవాదిగ్రహములు కుపితంబులై రోగిని జంపుటయేగాక వైద్యునిగూడఁజంపును.

### సర్వగ్రహపీడలకు మంత్రజపము.

ఈశ్వరం ద్వాదశభుజం నాథమార్యావలోకితమ్,
సర్వవ్యాధిచికిత్సంతం జపన్ సర్వగ్రహాన్ జయేత్. ౫౦
తథోన్మాదానపస్మారానన్యం వా చిత్తవిప్లవమ్,
మహావిద్యాం చ మాయూరీం శుచిం తం శ్రావయేత్సదా. ౫౧
భూతేశం పూజయేత్ స్థాణుం ప్రమథాఖ్యాంశ్చ తద్గణాన్,
జపం సిద్ధాంశ్చ తన్మంత్రాన్ గ్రహాన్ సర్వానపోహతి. ౫౨

"ఈశ్వరంద్వాదశభుజమ్" అను మంత్రమును జపము చేయుచుండిన సర్వగ్రహ
ు, ఉన్మాదము, అపస్మారము, చిత్తభ్రమము ఇవియన్నియు మానును. మఱియు
ాములు సోఁకియుండువానికి స్నానాదులను చేయించి శుచిగనుండు వానికి మా
రీమహావిద్యను ఎల్లపుడు వినిపించవలయును. సర్వభూతంబుల కధిపతియైన పరమే
ు, ప్రమథాఖ్యచేవెలయు నీశ్వరగణంబులను పూజించి సకలసిద్ధిప్రదంబులైన పర
ర మహామంత్రములను జపించుచుండిన సర్వగ్రహబాధలు నశించును.

### భూతగ్రహములకు అపస్మారచికిత్స.

యచ్చానంతరయోః కించిద్వక్ష్యతేఽధ్యాయయోర్హితమ్,
యచ్చోక్తమిహ తత్సర్వం ప్రయుంజీత పరస్పరమ్. ౫౩

ఈయధ్యాయమునందు దేవగ్రహాదులకు ప్రత్యేకముగ చెప్పియుండు చికిత్సలను,
ాద ప్రతిషేధాధ్యాయమునందును, అపస్మారప్రతిషేధాధ్యాయమునందును చెప్పఁ
చికిత్సలను గ్రహములు సోఁకియుండువారికి చేయించవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ఐదవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# ష ష్ఠా ధ్యా య ము.



అవ. భూతప్రతిషేధాధ్యాయమున "యచ్చానంతరయోః కించిద్వక్ష్యతే ఽధ్యాయయోః శ్రితమ్." ఉన్మాదప్రతిషేధాధ్యాయములోను, అపస్మారప్రతిషేధాధ్యాయములోను చెప్పియుండు చికిత్సలను భూతగ్రహోపద్రవములకు చేయవలయునని చెప్పియుండుటవలన భూత ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము ఉన్మాదప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది.—

# ఉన్మాదప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాత ఉన్మాదప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,

ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

భూతప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము ఉన్మాదరోగచికిత్సలను తెలియపరచునట్టి ఉన్మాద ప్రతిషేధ మను నీ యధ్యాయమును వివరించెదము.

### షడ్విధోన్మాదములు.

ఉన్మాదాష్షట్ పృథగ్దోషనిచయాధివిషోద్భవాః,

వాతజము, పిత్తజము, శ్లేష్మజము, సన్నిపాతజము, ఆధిజము, విషజము, అని ఉన్మాదరోగములు ఆఱువిధంబులు.

### ఉన్మాదస్వరూపము

ఉన్మాదో నామ మనసో దోషైరున్మార్గగైర్మదః. ౧

ప్రకోపమును జెంది విరుద్ధమార్గమున సంచరించునట్టి వాతపిత్తశ్లేష్మములచే మనస్సునందు జనించిన మదము తిక్క ఉన్మాదరోగమని చెప్పఁబడును.

### షడ్విధోన్మాదసామాన్య లక్షణము.

శారీరమానసైర్దుష్టైరహితాదన్నపానతః,

వికృతాసాత్మ్యసమలాద్విషమాదుపయోగతః. ౨

విషమస్యాల్పసత్వస్య వ్యాధివేగ సముద్గమాత్,

క్షీణస్య చేష్టావైషమ్యాత్పూజ్యపూజావ్యతిక్రమాత్. 3

ఆధిభిశ్చిత్తవిభ్రంశాద్విషేణోపవిషేణ చ,
ఏభిర్విహీనసత్త్వస్య హృది దోషాః ప్రదూషితాః. ౪
ధియో విధాయ కాలుష్యం హత్వా మార్గాన్ మనోవహాన్,
ఉన్మాదం కుర్వతే తేన ధీవిజ్ఞానస్మృతిభ్రమాత్. ౫
దేహో దుఃఖసుఖభ్రష్టో భ్రష్టసారథివద్రథః,
భ్రమత్యచింతితారంభః

శారీరదోషము, మానసదోషము, అహితముగను విరుద్ధముగను అసాత్మ్యముగను విషమముగనునుండు నాహారపానములు; వ్యాధివేగము, విరుద్ధాచారము, సజ్జనావమానము, మనోవ్యాధి, విషోపవిషములు అనువానిచే మనుజునికి వాతాదిదోషములు హృదయమునందు దుష్టంబులై బుద్ధికిమాలిన్యమును కలుగంజేసి మనస్సును వహించునట్టి స్రోతోమార్గములను చెరచి ఉన్మాదరోగమును కలుగజేయును. దానిచే మనుజునికి బుద్ధి విజ్ఞానస్మృతులుచెడి శరీరము సుఖదుఃఖజ్ఞానరహితంబై సారథివిహీనంబైన రథముచందంబున విరుద్ధమార్గమున సంచరింపుచుండును. మఱియు నారోగి కృత్యాకృత్య వివేకశూన్యుండై యనుచిత కార్యములను చేయుటకు యత్నించును.

## వాతజోన్మాద లక్షణము.

తత్ర వాతాత్కృశాంగతా. ౬
అస్థానే రోదనాక్రోశహసితస్మితనర్తనమ్,
గీతవాదిత్రవాగంగవిక్షేపాస్ఫోటనాని చ. ౭
అసామ్నా వేణువీణాదిశబ్దానుకరణం ముహుః,
ఆస్యాత్ఫేనాగమోఽజస్రమటనం బహుభాషితా. ౮
అలంకారోఽనలంకారైరయానైర్గమనోద్యమః,
గృద్ధిరభ్యవహార్యేషు తల్లాభే చావమానతా. ౯
ఉత్పిండితారుణాక్షిత్వం జీర్ణే చాన్నే గదోద్భవః,

వాతదోషమువలన జనించిన ఉన్మాదరోగమునందు అంగములు కృశించుట, కారణములేకయే యేడ్చుట, కూఁతవేయుట, నవ్వుట, ఆడుట, పాడుట, వాద్యము వాయించుట, అవయవములు కదలించుట, ఆస్ఫోటనము, (అనఁగా భుజములనుతట్టుట) గర్వముతో పలుమారు పిల్లనగ్రోవినివీణనుబోలె శబ్దముజేయుట, నోటియందు నురుగువెడలుట, ఎల్లపుడు తిరుగుచుండుట, అధికముగ మాటలాడుట, అలంకారమునకు యోగ్యముకానివస్తువులచే నలంకారము జేసికొనుట, వాహనమునకు అర్హముకాని కాష్ఠాదుల

నెక్కి సంచరించుటకు యత్నించుట, అన్నాదులయందు మిక్కుటమైన యిచ్ఛకలుగుట, అన్నము దొరకినచో దానిని తిరస్కరించుట, కండ్లు ఎఱ్ఱనై నిక్కబొడుచుకొని యుండుట, అన్నము జీర్ణమైనపిదప రోగము ప్రకోపించుట ఈ లక్షణములు కలిగి యుండును.

—॰ పిత్తజోన్మాదలక్షణము. ॰—

పిత్తాత్సంతర్జనం క్రోధో ముష్టిలోష్టాద్యభిద్రవః. ౧౦
శీతచ్ఛాయోదకాకాంక్షా నగ్నత్వం పీతవర్ణతా,
అసత్యజ్వలనజ్వాలాతారకాదీపదర్శనమ్. ౧౧

పిత్తదోషమువలన జనించిన యున్మాదరోగమునందు బెదరించుట, కోపము, మట్టిగడ్డలు మొదలగువానినెత్తుకొని పరువిడుట, శీతలమైననీడ, ఉదకము వీనియందిచ్ఛ గలుగుట, దిగంబరుఁడుగనుండుట, శరీరము పసుపువర్ణముగనగుట, అగ్నిజ్వాల నక్షత్రములు దీపములు ఇవి లేకుండినను అవియుండునటుల కంటికగుపడుట ఈలక్షణము కలిగియుండును.

—॰ కఫజోన్మాదలక్షణము. ॰—

కఫాదరోచకశ్ఛర్దిరల్పేహాహారవాక్యతా,
స్త్రీకామతా రహఃప్రీతిర్లాలాసింఘాణకస్రుతిః. ౧౨
బైభత్స్యం శౌచవిద్వేషో నిద్రాశ్వయథురాననే,
ఉన్మాదో బలవాన్ రాత్రౌ భుక్తమాత్రే చ జాయతే. ౧౩

కఫదోషమువలన జనించిన యున్మాదరోగమునందు అరోచకము వాంతియుగలుగుట, సంచార ఆహార సంభాషణములు స్వల్పములుగనుండుట, స్త్రీలయందభిలాషజనించుట, ఏకాంతస్థలమునందు వసించుటకు ప్రీతిగలుగుట, జొల్లు, చీమిడికారుట, అసహ్యముగనుండుట, ఆహారమును ద్వేషించుట, విశేషముగనిద్రించుట, ముఖమునందు వాపు కలుగుట, రాత్రియందును భుజించినప్పుడును అధికముగ ఉన్మాదము ప్రకోపించుట, ఈలక్షణములు కలిగియుండును.

—॰ సన్నిపాతజోన్మాదలక్షణము. ॰—

సర్వాయతనసంస్థానసన్నిపాతే తదాత్మకమ్,
ఉన్మాదం దారుణం విద్యాత్తం భిషక్పరివర్జయేత్. ౧౪

సన్నిపాతమువలన జనించిన యున్మాదమునందు వాతాద్యున్మాదరోగములకు వేరువేరుగ చెప్పియుండు లక్షణము లన్నియు కలిగియుండును. ఇది మిగుల దారుణమైనది యగుటంజేసి చికిత్సయందు వర్జింపఁదగును.

మనోవ్యాధివలన జనించిన ఉన్మాదలక్షణము

ధనకాంతాదినాశేన దుస్సహేనాభిషంగవాన్,
పాండుర్దీనో ముహుర్ముహ్యన్ హాహేతి పరిదేవతే. ౧౫
రోదిత్యకస్మాన్మ్రియతే తద్గుణాన్ బహుమన్యతే,
శోకక్లిష్టమనా ధ్యాయన్ జాగరూకో విచేష్టతే. ౧౬

ధనము ప్రియురాలు మొదలగు తనకు మిక్కిలి ప్రియములగు వస్తువులు నాశనమగుటవలన జనించిన దుస్సహశోకముచే నున్మాదరోగము కలుగును. దానియందు మనుజుఁడు తెలుపువర్ణముగలవాఁడై దైన్యముతో పలుమారు మూర్ఛను జెందుచు హా యనియేడ్చుచునుండును. అకస్మాత్తుగ మరణమునుజెందును. అయిష్టవస్తువులగుణంబులను పలుమారు స్తుతించును. శోకముచే పీడింపఁబడిన మనస్సుగలవాఁడై చింతింపుచు నిద్రించకయే తిరుగుచుండును.

విషజోన్మాదలక్షణము.

విషేణ శ్యావవదనో నష్టచ్ఛాయాబలేంద్రియః,
వేగాంతరేపి సంభ్రాంతో రక్తాక్షస్తం వివర్జయేత్. ౧౭

విషసంబంధమువలన జనించిన ఉన్మాదరోగము గలవానికి ముఖము నలుపుబారియుండును. శరీరకాంతి బలము ఇంద్రియములునునశించును. భ్రమకలుగును. నేత్రము లెఱ్ఱగనగును. ఇట్టివానిని చికిత్సయందు వర్జింపవలయును.

వాతజోన్మాదచికిత్స.

అథానిలజ ఉన్మాదే స్నేహపానం ప్రయోజయేత్,
పూర్వ మావృతమార్గే తు సస్నేహం మృదు శోధనమ్. ౧౮

వాతమువలనజనించిన ఉన్మాదరోగికి తొలుత స్నేహపానమును చేయించవలయును. వాతమార్గము నడ్డగింపబడియుండినయెడల స్నేహముతో గూడినదిగను మృదువుగనునుండు విరేచనౌషధము నిప్పించవలయును.

కఫజపిత్తజోన్మాదచికిత్స.

కఫపిత్తభవే ఽప్యాదౌ వమనం సవిరేచనమ్,
స్నిగ్ధస్విన్నస్య వస్తిం చ శిరసస్సువిరేచనమ్. ౧౯
తథాస్య శుద్ధదేహస్య ప్రసాదం లభతే మనః,

కఫజోన్మాదము, పిత్తజోన్మాదము వీనియందు రోగికి స్నేహస్వేదకర్మలను చేయించి యథాక్రమముగ వమనవిరేచనంబుల నొసంగవలయును. (కఫజోన్మాదమున

వమనంబును, పిత్తజోన్మాదంబున విరేచనంబును జేయించవలెననుట) వస్తికర్మ శిరో విరేచనము వీనిని చేయించవలయును. ఇటుల చేయుటవలన శరీరము శుద్ధమై మనస్సు ప్రసన్నతనుజెందును.

"ఉన్మాదం స్నేహపానేన సర్వం పూర్వముపాచరేత్"

ఉన్మాదరోగము లన్నిటియందును తొలుత స్నేహపానము చేయించవలయును. అని చరకమునందు చెప్పియున్నది.

### ఉన్మాదరోగమున నస్యాంజనములు.

ఇత్థమప్యనువృత్తౌ తు తీక్ష్ణం నావనమంజనమ్. ౨౦
హర్షణాశ్వాసనోత్త్రాసభయతాడనతర్జనమ్,
అభ్యంగోద్వర్తనాలేపధూమాన్ పానం చ సర్పిషః. ౨౧
యుంజ్యాత్తాని హి శుద్ధస్య నయంతి ప్రకృతిం మనః,

పైచెప్పినప్రకారము చికిత్సచేసియు వాతజాద్యున్మాదరోగములు నివర్తించక యుండిన తీక్ష్ణమైన నస్యము అంజనము వీనిని ప్రయోగించవలయును. మఱియు సంతోషపఱచుట, సమాధానపఱచుట, ఉలికిపడునట్లుచేయుట, కొట్టుట, బెదరించుట, అభ్యంగము, నలుగు, లేపనములు, ధూమపానము, ఘృతపానము వీనిని చేయవలయును. ఇటుల జేసిన యారోగి మనస్సు స్వస్థతనుజెందును.

### ఉన్మాదరోగమునకు హింగ్వాదిఘృతము.

హింగుసౌవర్చలవ్యోషైః ద్విపలాంశైర్ఘృతాఢకమ్. ౨౨
సిద్ధం సమూత్రమున్మాదభూతాపస్మారనుత్పరమ్,

ఇంగువ, సౌవర్చలవణము, త్రికటుకములు వీనిని దినుసుకు రెండేసి పలముల చొప్పునగ్రహించి నూరి ఒక ఆఢకము ఆవునేతిలోకలిపి అందులో గోమూత్రముబోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానినిప్పించిన ఉన్మాదము, భూతబాధ, అపస్మారము ఇవి హరించును.

### బ్రాహ్మీఘృతము.

ద్వౌ ప్రస్థౌ స్వరసాద్బ్రాహ్మ్యా ఘృతప్రస్థం చ సాధితమ్. ౨౩
వ్యోషశ్యామాత్రివృద్దంతీశంఖపుష్పీనృపద్రుమైః,
ససప్తలాకృమిహరైః కల్కితైరక్షసమ్మితైః. ౨౪
పలవృద్ధ్యా ప్రయుంజీత పరం మాత్రాచతుష్పలమ్,
ఉన్మాదకుష్ఠాపస్మారహరం వంధ్యాసుతప్రదమ్. ౨౫
వాక్స్వరస్మృతిమేధాకృద్ధన్యం బ్రాహ్మీఘృతం స్మృతమ్,

మండూకబ్రహ్మి(సరస్వతియాకు) స్వరసము (2) ప్రస్థములు, ఆవునెయ్యి (1) ప్రస్థము వీని నేకముజేసి అందులో త్రికటుకములు, నల్లసుగంధిపాల, నల్లతెగడ, దంతివేళ్లు, శంఖపుష్పి, ఏల, సంబరేణు, వాయువిడంగములు వీనినిదినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి పక్వముచేసిన నది బ్రాహ్మీఘృతమనఁబడును. దీనిని మొదటిదినమున 1 పలము, 2 వ దినమున 2 పలములు, 3 వదినమున 3 పలములు, 4 వదినమున 4 పలములు నిప్పించి, 5 వదినము మొదలు 5 పలములచొప్పున నిప్పించుచుండిన ఉన్మాదము, కుష్ఠువు, అపస్మారంబును హరించును. గొడ్రాలు గర్భముధరించును. వాక్పటుత్వము, స్వరము, స్మృతి, మేధ వీనిని వృద్ధిపరచును. మిగుల ప్రశస్తమైనది.

### కల్యాణకఘృతము.

వరావిశాలాభద్రైలాదేవదార్వేలవాలుకైః. ౨౬
ద్విసారిబాద్విరజనీద్విస్థిరాఫలినీనతైః,
బృహతీకుష్ఠమంజిష్ఠానాగకేసరదాడిమైః. ౨౭
వేల్లతాళీసపత్త్రైలామాలతీముకుళోత్పలైః,
సదన్తీపద్మకహిమైః కర్షాంశైః సర్పిషః పచేత్. ౨౮
ప్రస్థం భూతగ్రహోన్మాదకాసాపస్మారపాప్మసు,
పాండుకండూవిషే శోషే మోహే మేహే గరే జ్వరే. ౨౯
అరేతస్యప్రజసి వా దైవోపహతచేతసి,
అమేధసి స్ఖలద్వాచి స్మృతికామేఽల్పపావకే. ౩౦
బల్యం మాంగల్యమాయుష్యం కాంతసౌభాగ్యపుష్టిదమ్,
కల్యాణకమిదం సర్పిశ్శ్రేష్ఠం పుంసవనేషు చ. ౩౧

త్రిఫలములు, పెద్దపాపర, పెద్దయేలకులు, దేవదారు, కూఁతురుబుడమ, (నాగదోస), సుగంధిపాల, నల్లసుగంధిపాల, పసుపు, మ్రానిపసుపు, ముయ్యాకుపొన్న, నక్కతోఁకపొన్న, ప్రేంకణము, గ్రంథితగరము, వ్రాకుడు, చెంగల్వకోష్ఠు, మంజిష్ఠ, నాగకేసరములు, దానిమ్మ, వాయువిడంగములు, తాళిసపత్రి, పిన్నయేలకులు, జాజిమొగ్గలు, నల్లకలువ, దంతి, పద్మకము, చందనము వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి నూరి ఒక ప్రస్థ మావునెయ్యిలోఁ జేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసిన నది కల్యాణక ఘృతమనబడును. భూతబాధ, గ్రహబాధ, ఉన్మాదము, కాసము, అపస్మారము, క్షయము, పాండువు, దురద, విషము, శోష, మోహము, ప్రమేహము, స్థావరవిషము, జ్వరము వీనియందును, రేతస్సు క్షయించినవారు, సంతానములేనివారు, చిత్తభ్రమ

ముగలవారు, బుద్ధిచెడినవారు, మాటలుతడబడియుండువారు, స్మృతినికోరువారు, జాతరాగ్ని స్వల్పముగనుండువారు, వీరికిని మిగుల శ్రేష్ఠంబు. బలము, ఆయుర్వృద్ధి, కాంతి, పుష్టి వీనిని గలుగజేయును. గొడ్రాలికి సంతానమును గలుగజేయును.

—౨ మహాకల్యాణకఘృతము. ౨—

ఏభ్యో ద్విసారివాదీని జలే పక్త్వైకవింశతిమ్,
రసే తస్మిన్ పచే త్సర్పిర్గృష్టిక్షీరచతుర్గుణమ్. ౩౨
వీరాద్విమేదాకాకోలీకపికచ్ఛూవిషాణిభిః,
శూర్పపర్ణీయుతై రేతన్మహాకల్యాణకం పరమ్. ౩౩
బృంహణం సన్నిపాతఘ్నం పూర్వస్మా దధికం గుణైః,

పూర్వశ్లోకములో చెప్పియుండు త్రిఫలములుమొదలునేడుద్రవ్యములనువర్జించి సుగంధిపాల మొదలగు (21) ద్రవ్యములను సమభాగములుగ నుదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి యాకషాయము (4) భాగములు, ఘృతము (1) భాగము, తొలియీాత ఆవుపాలు (4) భాగములు. ఇటులనేకముచేసి అందులో పిల్లిపీచర, మేద, మహామేద, కాకోలి, రేగటిమూలగోవిల, కర్కాటకశృంగి, పిల్లిపెసర వీనిని ప్రత్యేకము ఒక పలముచొప్పున గ్రహించి కల్కముచేసికలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసిన నదిమహాకల్యాణక ఘృతమనబడును. శరీరపుష్టిని గలుగజేయును. సన్నిపాతమునుపోకడచును. కల్యాణఘృతముకంటె విశేషగుణముగలది.

—౨ మహాపైశాచకఘృతము. ౨—

జటిలా పూతనా కేశీ చారటీ మర్కటీ వచా. ౩౪
త్రాయమాణా జయా వీరా చోరకః కటురోహిణీ,
కాయస్థా సూకరీ ఛత్రా అతిచ్ఛత్రా పలంకషా. ౩౫
మహాపురుషదంతా చ వయస్థా నాకులీద్వయమ్,
కటంభరా వృశ్చికాళీ శాలిపర్ణీ చ తైర్ఘృతమ్. ౩౬
సిద్ధం చాతుర్థికోన్మాదగ్రహాపస్మారనాశనమ్,
మహాపైశాచకం నామ ఘృతమేతద్యథా మృతమ్. ౩౭
బుద్ధిమేధాస్మృతికరం బాలానాం చాంగవర్ధనమ్,

జటామాంసి, కరక్కాయలు, గంధమాంసి, మునుగుదామర, దూలగోవిల, వస, కలుక్రానుగు, చిరుతక్కలి, కాకోళి, కచోరములు, కటుకరోహిణి, ఊసిరిక, వృద్ధదారుకము, దనియాలు, సదాప, లక్క, పిల్లిపీచర, క్షీరకాకోళీ, సర్పాక్షి, పెద్దసర్పాక్షి,

గొంతెమగోరు, తేలుకొండికట్టు, ముయ్యాకుపొన్న వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవునేతిలో కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసిన నదిమహాపైశాచకఘృతమనఁబడును. అమృతతుల్యమైనది. బుద్ధి, ధారణాశక్తి, స్మృతి వీనిని గలుగజేయును. బాలుర యంగములను వృద్ధిపరచును.

## ఉన్మాదహరవర్తి.

బ్రాహ్మీమైంద్రీం విడంగాని వ్యోషం హింగు జటాం మురాం.
రాస్నాం విశల్యాం లశునం విషఘ్నీం సురసాం వచామ్,
జ్యోతిష్మతీం నాగవిన్నామనంతాం సహరీతకీమ్. ౩౯
కాఞ్చీం చ హస్తిమూత్రేణ పిష్ట్వా చ్ఛాయావిశోషితా,
వర్తి ర్నస్యాంజనాలేపధూపై రున్మాదసూదనీ. ౪౦

మండూకబ్రహ్మి (సరస్వతియాకు), పిన్నపాపర, వాయువిడంగములు, త్రికటుకములు, ఇంగువ, జటామాంసి, మురయను గ్రంథ్యము, సన్నరాష్ట్రము, చెన్నచెర్లగడ్డ, వెల్లుల్లి, అతివస, తులసి, వస, మెరపుతీగె (మాల్కాంగిని), నాగదంతి, దూలగొండి, కరక్కాయలు, సౌరాష్ట్రికము (అనఁగా తువరిమన్ను), వీనిని సమభాగములుగ గ్రహించి ఏనుఁగ మూత్రముతో నూరి వర్తిచేసి నీడనెండించి దానిచే నస్యము అంజనము లేపము ధూపము వీనినిచేయించిన ఉన్మాదము హరించును.

## ఉన్మాదహరస్వేదాభ్యంగాదులు.

అవపీడాశ్చ వివిధాః సర్షపాః స్నేహసంయుతాః,
కటుతైలేన చాభ్యంగో ధ్మాపయేచ్చాస్య తద్రజః. ౪౧
సహింగు స్తీక్ష్ణధూమశ్చ సూత్రస్థానోదితో హితః,

నానావిధ అవపీడస్వేదములు, ఆవనూనెచే అభ్యంగము, ఆవాలచూర్ణమును గొట్టములోపోసి ముక్కులోనునిచి నోటితో ఊదుట, సూత్రస్థానములో చెప్పియుండు తీక్ష్ణధూమమును ఇంగువ సహితముగ ప్రయోగించుట వీనిని ఉన్మాదరోగమునందు చేయవలయును.

## ఉన్మాదరోగ హరధూపాదులు.

శృగాలశల్యకోలూకజలూకావృషబస్తజైః. ౪౨
మూత్రపిత్తశకృల్లోమనఖచర్మభిరాచరేత్,
ధూపధూమాంజనాభ్యంగప్రదేహాపరిషేచనమ్. ౪౩

నక్క, ముంగిసపంది, గుడ్లగూబ, రాత్రులయందుసంచరించు నొకవిధమైన పక్షి,

యొద్దు, గొబ్బి వీనియొక్క మూత్రము, పిత్తము మలము వెంట్రుకలు గోళ్లు చర్మము వీనిచేధూపము, అంజనము, అభ్యంగము, పట్లు, పరిషేకము వీనిని ఉన్మాదరోగమునందు చేయించవలయును.

వాతశ్లేష్మోన్మాదమునకు ధూపము.

ధూపయేత్సతతం చైనం శ్వగోమత్స్యైస్తు పూతిభిః,
వాతశ్లేష్మాత్మకే ప్రాయః

వాతశ్లేష్మమువలన జనించిన యున్మాదరోగమునందు దుర్గంధముతోఁ గూడి యుండు కుక్కమాంసము గోమాంసము మత్స్యములు వీనిచేత ధూపము వేయవలయును.

పిత్తోన్మాద చికిత్స.

పైత్తికే తు ప్రశస్యతే. ౮౮
తిక్తకం జీవనీయం చ సర్పిః స్నేహాశ్చ మిశ్రకః,
శిశిరాణ్యన్నపానాని మధురాణి లఘూని చ. ౮౯
విధ్యేచ్ఛిరాం యథోక్తాం వా తృప్తం మేద్యామిషస్య వా,
నివాతే శాయయేదేవం ముచ్యతే మతివిభ్రమాత్. ౯౦

పిత్తమువలనజనించిన యున్మాదమునందు తిక్తకఘృతము, జీవనీయ ఘృతము, యమకస్నేహము వీనిని నిప్పించవలయును. శీతముగను మధురరసముగలవిగను లఘువుగను నుండు నన్నపానాదుల నిప్పించవలయును. మఱియు సిరావిద్ధ్యాయములోఁ జెప్పి యుండు ప్రకారము సిరను వేధించవలయును. మదకరమైన మాంసమును తృప్తిగ భుజింపఁజేసి యాయున్మాదరోగిని గాలిలేనిస్థలములోఁ బరుండునటుల చేయవలయును. ఇటు లచేసిన బుద్ధిభ్రమము నివర్తించును.

ఉన్మాదశమనోపాయము

ప్రక్షిప్యాఽసలిలే కూపే శోషయేద్వా బుభుక్షయా,
ఆశ్వాసయేత్సుహృత్తంవా వాక్యైర్ధర్మార్థసంహితైః. ౯౧
బ్రూయాదిష్టవినాశం వా దర్శయేదద్భుతాని వా,
బద్ధం సర్షపతైలాక్తం న్యస్తం చోత్తానమాతపే. ౯౨
కపికచ్ఛ్వాఽథవా తప్తైర్లోహైస్తైలజలైస్స్పృశేత్,
కశాభిస్తాడయిత్వా వా బద్ధం శ్వభ్రే వినిక్షిపేత్. ౯౩
అథవా వీతశస్త్రాశ్మజనే సంతమసే గృహే,
సర్పేణోద్ధృతదంష్ట్రేణ దాంతైస్సింహైర్గజైశ్చ తమ్. ౯౪

అథవా రాజపురుషా బహిర్నీత్వా సుసంయతమ్,
భాపయేయుర్వధేనైనం తర్జయంతో నృపాజ్ఞయా. ౫౧
దేహదుఃఖభయేభ్యో హి పరం ప్రాణభయం మతమ్,
తేన యాతి శమం తస్య సర్వతో విప్లుతం మనః. ౫౨
సిద్ధాక్రియా ప్రయోజ్యేయం దేశకాలాద్యపేక్షయా,

ఉన్మాదరోగిని ఉదకములేనిబావిలోఁ ద్రోసి ఆఁకలిచేతశుష్కించునటుల చేయవలయును. లేక స్నేహితులు ధర్మార్థసహితముగనుండు వచనములచే సమాధాన పరచవలయును. లేక యిష్టద్రవ్యబంధు వినాశమును చెప్పవలయును. లేక ఆశ్చర్యములనుచూపించవలయును. లేక ఆవాలనూనెను శరీరమునకు లేపనముచేసి కదలకుండునటుల కట్టి యెండలో వెలికిలపరుండునటుల చేయవలయును. లేక దురదగొండియాకును శరీరముపై రాచవలయును. లేక ఇనుము నెఱ్ఱగకాల్చి శరీరమునకు తాకించవలయును. నూనెనుగానిఉదకమునుగాని చక్కఁగకాచి శరీరముపై పోసెదమని చెప్పవలయును. లేక కొరడాచే కొట్టి కదలకుండాకట్టి పల్లములో త్రోయవలయును. లేక ఆయుధము, రాయి, జనము ఇవి లేకుండునదియు, చీఁకటిగ నుండునదియునైన గృహములో త్రోయవలయును. లేకకోరలుతీసినపాముచేతను, శిక్షచేస్వాధీనములుగనుండుసింహముచేతను, ఏనుఁగుచేతను, బెదరించవలయును. లేక రాజభటులు బైటికితీసికొనిపోయి అవయవములను కదలకకట్టి రాజు నిన్నుచంపునటుల ఉత్తరవు చేసెనని చెప్పి నిన్నుచంపెదమని బెదరించవలెను ఇటులచేసిన శరీరదుఃఖ భయములకన్న ప్రాణభయము ప్రబలముగనుండుటవలన రోగిమనస్సు మిగులభయపడి స్వస్థతను జెందును. పైచెప్పిన చికిత్సలను దేశకాల బలాదుల ననుసరించి చేయవలయును.

ఆదిజోన్మాద సమనోపాయము.

ఇష్టద్రవ్యవినాశాత్తు మనో యస్యోపహన్యతే. ౫౩
తస్య తత్సదృశప్రాప్తిసాంత్వాశ్వాసైశ్శమం నయేత్,

మనుజునకిష్టద్రవ్యములు నశించుటవలన మనస్సుచెడి ఉన్మాదరోగముకలుగును. అట్టివానికి మరల నాద్రవ్యాదులనుగాని వానికిసమములైన వస్తువులనుగాని లభింపఁజేయవలయును. ప్రియవచనములచే సమాధానము చెప్పవలయును. ఇటులజేసిన యాయున్మాదరోగము శమించును.

కామాదిజోన్మాదశమనోపాయము.

కామశోకభయక్రోధహర్షేర్ష్యాలోభసంభవాన్. ౫౪
పరస్పరప్రతిద్వంద్వైరేభిరేవ శమం నయేత్,

కామము శోకము భయము కోపము సంతోషము అసూయ లోభము వీనివలన జనించిన యున్మాదమును పరస్పరవిరుద్ధములైన పైకామాదులచే (అనఁగా కామముచే జనించిన యున్మాదమును శోకభయాదులచేతను, శోకభయాదులవలన జనించిన యున్మాదమును కామాదులచేతను) శమింపఁజేయవలయును.

## భూతజోన్మాదచికిత్స

భూతానుబంధమీక్షేత ప్రోక్తలింగాధికాకృతిమ్. ౫౫
యద్యున్మాదే తతః కుర్యాద్భూతనిర్దిష్టమౌషధమ్,

నిదానోపద్రవాదులు వాతజాద్యున్మాదములకు చెప్పియుండు లక్షణములకంటె ఉన్మాదరోగమున నధికముగనుండినచో నది దేవాదిభూతసంబంధమువలన జనించినదని తెలిసికొని దానికిభూతప్రతిషేధాధ్యాయములో చెప్పియుండుచికిత్సలను చేయవలయును.

## భూతజోన్మాదమున బలిదానము.

బలిం చ దద్యాత్పలలం యావకం సక్తుపిండికామ్. ౫౬
స్నిగ్ధం మధురమాహారం తండులాన్ రుధిరోక్షితాన్,
పక్వామకాని మాంసాని సురామైరేయమాసవమ్. ౫౭
అతిముక్తస్య పుష్పాణి జాత్యాస్సహచరస్య చ,
చతుష్పథే గవాం తీర్థే నదీనాం సంగమేషు చ. ౫౮

దేవాదిభూతములవలన జనించిన యున్మాదమునందు మాంసము యావకాన్నము వరిపేలపిండియుంటలు, స్నిగ్ధముగను మధురముగను ఉండునన్నము, రక్తములో తడుపఁబడిన బియ్యములు,పాకము చేయఁబడినవియు పచ్చివిగనుండునవియు నైన మాంసములు, సురామైరేయము ఆసవము అనుమద్యములు, మల్లెపూలు జాజిపూలు గోరింటపూలు ఈ వస్తువులను నలుత్రోవలు కలయుస్థలమునందును ఆవులు సంచరించునట్టి మార్గమునందును రెండునదులుచేరు ప్రదేశమునందును బలి నొసంగవలయును.

## ఉన్మాదానుత్పత్తికారణము

నివృత్తామిషమద్యో యో హితాశీ ప్రయతశ్శుచిః,
నిజాగంతుభిరున్మాదైస్సత్త్వవాన్న స యుజ్యతే. ౫౯

మద్యమాంసములను వర్జించినవాఁడును, హితాహారములను భుజించువాఁడును, జితేంద్రియుఁడును, పరిశుద్ధుఁడును, సత్త్వగుణముగలవాఁడు నైన మనుజునియందు పూర్వోక్తములైన యున్మాదరోగము లెప్పుడును జనింపనేరవు.

### ఉన్మాదనివృత్తిలక్షణము.

ప్రసాద ఇంద్రియార్థానాం బుద్ధ్యాత్మమనసాం తథా,
ధాతూనాం ప్రకృతిస్థత్వం విగతోన్మాదలక్షణమ్. ౬౦

చక్షురాదీంద్రియములు బుద్ధి మనస్సు ఇవి ప్రసన్నములుగనుండుట, వాతాధి దోషములును రసరక్తాదిధాతువులును, స్వభావముగనుండుట ఇవి యున్మాదరోగశమన లక్షణంబులు.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ఆఱవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# స ప్త మా ధ్యా య ము.

అవ. ఉన్మాదాపస్మారరోగములకు చికిత్సలు సమానములుగ నుండుటంజేసి ఉన్మాదప్రతిషేధాధ్యాయ నిరూపణానంతర మపస్మారప్రతిషేధాధ్యాయము చెప్పఁబడు చున్నయది.—

# అపస్మారప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతోఽపస్మారప్రతిషేధం వ్యాఖ్యాస్యామః
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ఉన్మాదప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము అపస్మారరోగచికిత్సలను బోధించునట్టి అపస్మారప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

అపస్మార సంప్రాప్తిలక్షణము.

స్మృత్యపాయోహ్యపస్మారస్స హి సత్త్వాభిసంప్లవాత్,
జాయతేఽభిహతే చిత్తే చింతాశోకభయాదిభిః. ౧
ఉన్మాదవత్ప్రకుపితైశ్చిత్తదేహగతైర్మలైః,
హతే సత్త్వే హృది వ్యాప్తే సంజ్ఞావాహిషు ఖేషు చ. ౨
తమో విశన్మూఢమతిః బీభత్సాః కురుతే క్రియాః,
దంతాన్ ఖాదన్ వమన్ ఫేనం హస్తౌ పాదౌ చ విక్షిపన్. ౩
పశ్యన్నసంతి రూపాణి ప్రస్ఖలన్ పతతి క్షితౌ,
విజిహ్మాక్షిభ్రువో దోషవేగేఽతీతే విబుధ్యతే. ౪
కాలాంతరేణ స పునశ్చైవమేవ విచేష్టతే,

స్మృతినశించుట అపస్మారమనఁబడును. ఉన్మాదరోగమువలె శారీరమానసదోషంబులు ప్రకోపించి సత్వగుణమునుచెరచి హృదయమును, సంజ్ఞావాహిస్రోతస్సులను వ్యాపించినయెడల మనుజునికి చింత శోకము భయము మొదలగువానిచే చిత్తము వ్యాకులతనుజెంది బుద్ధి సత్వగుణంబును నశించును. అందువలన నపస్మారరోగము జనించును. అది జనించినతోడనే మనుజుఁడు మోహమునుజెంది జ్ఞానశూన్యుఁడై నింద్యితంబు

లగు కృత్యములను జేయుటయేగాక పండ్లను కటకటకొరుకుచు నురుగునుకక్కుచు హస్త పాదములను విదలించుచు అసత్యంబులైన రూపంబులను జూచుచు ముడిచికొనియుండు నేత్రములు కనుబొమలును గలవాఁడై భూమింబడును. దోషవేగము శమించినతోడనే పూర్వమువలె స్వభావమును జెందును. కొంతకాలము గడచినపిదప మరల నిటులనే మూర్ఛావికారములను జెందును.

చతుర్విధాపస్మారలక్షణము

అపస్మార శ్చతుర్భేదో వాతాద్యై ర్నిచయేన తు. ౫

అపస్మారము వాతజము పైత్తజము శ్లేష్మజము సన్నిపాతము అని నాల్గువిధములుగ నుండును.

అపస్మారపూర్వరూపలక్షణము.

రూపముత్పిత్సమానేఽస్మిన్ హృత్కంపశ్శూన్యతా భ్రమః,
తమసో దర్శనం ధ్యానం భ్రూవ్యుదాసోఽక్షివైకృతమ్. ౬
అశబ్దశ్రవణం స్వేదో లాలాసింఘాణకస్రుతిః,
అవిపాకోఽరుచిర్మూర్ఛా కుక్ష్యాటోపో బలక్షయః. ౭
నిద్రానాశోఽఙ్గమర్దస్తృట్ స్వప్నే గానం సనర్తనమ్,
పానం మద్యస్య తైలస్య తయోరేవ చ మేహనమ్. ౮

రొమ్మువణఁకుట, ఏమియు దెలియకుండుట, భ్రమించుట, చీఁకటిగ్రమ్ముట, చింతపడుట, కనుబొమలు నేత్రములు నివి వికారమునుజెందుట, శబ్దము వినకుండుట, చెమటపట్టుట, జొల్లు, చీమిడియుకారుట, భుజించినయాహారము జీర్ణముకాకుండుట, అరుచికలుగుట, మూర్ఛవచ్చుట, కడుపునందు గడబుడయని శబ్దమగుట, బలము క్షయించుట, నిదుర లేకుండుట, సర్వాంగములయందు నొప్పికలుగుట, దప్పి జనించుట, స్వప్నమునందుసంకీర్తనమును లొనర్చుటయేగాక మద్యపాన తైలపానములనుచేయుట, స్వప్నమునందు మద్యతైలములు మూత్రమువెంట వెడలుట ఇవి అపస్మారరోగముకల్గుటకుముందు జనించు పూర్వరూపంబులు.

వాతజాపస్మారలక్షణము.

తత్ర వాతాత్స్ఫురత్సక్థి ప్రపతంశ్చ ముహుర్ముహుః,
అపస్మరతి సంజ్ఞాం చ లభతే విస్వరం రుదన్. ౯
ఉత్పిండితాక్షశ్శ్వసితి ఫేనం వమతి కంపతే,
ఆవిధ్యతి శిరోదంతాన్ దశత్యాధ్మాతకంధరః. ౧౦

పరీతో విక్షిపత్యంగం విషమం వినతాంగుళిః,
రూక్షశ్యావారుణాక్షిత్వఙ్నఖాస్యః కృష్ణమీక్షతే.　　౧౧
చపలం పరుషం రూపం విరూపం వికృతాననమ్,

వాతజాపస్మారరోగమునందు తొడలు అదురుట, పలుమారు భూమిపైఁబడి మూర్ఛనుజెందుట, మరల వికారస్వరముతో నేడ్చుట, ప్రజ్ఞనుజెందుట, నేత్రములు నిట్రబొడిచికొనియుండుట, నిట్టూర్పువిడుచుట, నోటియందు నురుగుకారుట, వణఁకుట ఈ లక్షణములతోఁగూడ మైమరచును. మఱియు నీరోగి శిరమును భూమిపై కొట్టికొనును. పండ్లుకొరుకును, మెడయుబ్బి యుండువాఁడై నలుప్రక్కల యవయవముల విదిలించును. వంకరగనుండు వేళ్లుగలవాఁడుగ నేత్రములు చర్మము నఖములు ముఖము ఇవి రూక్షములుగ నల్లగనుండువాఁడుగ నగును. నల్లగ క్రూరముగ చంచలముగ వికారముఖముతోఁగూడినదిగ వికారరూపము గలదిగనుండు నాకార మతనికంటి కగపడును.

## పిత్తజాపస్మారలక్షణము

అపస్మరతి పిత్తేన ముహుస్సజ్ఞాం చ విందతి.　　౧౨
పీతఫేనాక్షివక్త్రత్వగాస్ఫాలయతి మేదినీమ్,
భైరవాదీప్తరుషితరూపదర్శీ తృషాన్వితః.　　౧౩

పిత్తమువలన జనించిన యపస్మారమునందు పలుమారు మూర్ఛనుజెంది మరల ప్రజ్ఞనుజెందుట, నురుగు నేత్రములు ముఖము చర్మము ఇవి పసుపువర్ణముగనుండుట, భూమిని చేతులతోఁ గొట్టుట, క్రూరముగ రూక్షగనుండురూపము కంటికగుపడుట, మిక్కిలి దప్పి ఈలక్షణములు కలిగియుండును.

## కఫజాపస్మారలక్షణము

కఫాచ్చిరేణ గ్రహణం చిరేణైవ విబోధనమ్,
చేష్టాల్పా భూయసీ లాలా శుక్లనేత్రనఖాస్యతా.　　౧౪
శుక్లాభరూపదర్శిత్వం

చిరకాలముమీఁద మూర్ఛగలుగుట, ఆమూర్ఛ చిరకాలముమీఁద నివర్తించుట, హస్తపాదాదులను కొంచెముగ కదలించుట, విశేషముగ జొల్లుకారుట, నేత్రములు గోళ్లు ముఖము ఇవి తెల్లగనుండుట, తెలుపువర్ణముతోఁ గూడినరూపము కంటికగుపడుట ఈలక్షణములు కఫజాపస్మారమునందు జనించును.

## సన్నిపాతాపస్మారలక్షణము

సర్వలింగం తు వర్జయేత్,

సన్నిపాతమువలన జనించిన యపస్మారమునందు వాతజాద్యపస్మారములకు వేరు వేరుగ చెప్పియుండు లక్షణములన్నియు కలిగియుండును. ఇది అసాధ్యమగుటవలన చికిత్సయందు వర్జింపఁదగినది.

## అపస్మారసామాన్యచికిత్స.

అథావృతానాం ధీచిత్తహృత్ఖానాం ప్రాక్ప్రబోధనమ్. ౧౫
తీక్ష్ణైః కుర్యా దపస్మారే కర్మభి ర్వమనాదిభిః,

పైనిచెప్పిన చొప్పున నపస్మారరోగస్వరూపములను గుర్తెఱిఁగి దోషములచే నావరింపఁబడియుండు బుద్ధి మనస్సు హృదయము స్రోతస్సులు వీనిని తీక్ష్ణములుగనుండు వమనవిరేచనాదికర్మలచే శుద్ధిపఱచవలయును.

## వాతాద్యపస్మారచికిత్స.

వాతికం వస్తిభూయిష్ఠైః పైత్తం ప్రాయో విరేచనైః. ౧౬
శ్లైష్మికం వమనప్రాయైరపస్మారముపాచరేత్,

వాతజాపస్మారమును వస్తికర్మలచేతను, పిత్తజాపస్మారమును విరేచనములచేతను, శ్లేష్మజాపస్మారమును వమనంబులచేతను ప్రాయికముగ చికిత్సజేయవలయును.

## అపస్మారమునకు సంశమనయోగములు.

సర్వతస్తు విశుద్ధస్య సమ్యగాశ్వాసితస్య చ. ౧౭
అపస్మారవిమోక్షార్థం యోగాన్ సంశమనాన్ శృణు,

పైనిచెప్పినవిధంబున వాతజాద్యపస్మారరోగము గలవానికి వస్తివిరేచన వమనాది కర్మలను ఆయారోగానుగుణముగను, యథాక్రమముగను చేయించి పేయాదికాంజికముల భుజింపఁజేసి పిదప అపస్మారరోగము శమించుటకై ఉత్తరత్ర చెప్పంబడు ఘృతపానాదుల నొసంగవలయును.

## పంచగవ్యఘృతము

గోమయస్వరసక్షీరదధిమూత్రైశ్శృతం హవిః. ౧౮
అపస్మారజ్వరోన్మాదకామాలాంతకరం పిబేత్,

ఆవుయొక్క పేడరసము పాలు పెరుగు మూత్రము నెయ్యి వీనిని సమభాగములుగ చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయవలయును. ఇది పంచగవ్యఘృతమనఁబడును. దీనిసేవనవలన అపస్మారము జ్వరము ఉన్మాదము కామలయు హరించును.

## మహాపంచగవ్యఘృతము.

ద్విపంచమూలీత్రిఫలా ద్వినిశాకుటజత్వచః. ౧౯
సప్తపర్ణమపామార్గం నీలినీం కటురోహిణీమ్,
శమ్యాకపుష్కరజటాఫల్గుమూలదురాలభాః. ౨౦
ద్విపలాన్సలిలద్రోణే పక్త్వా పాదావశేషితే,
శార్ఙ్గీపాఠాఢకీకుంభనికుంభవ్యోషరోహిషైః. ౨౧
మూర్వాభూతీకభూనింబశ్రేయసీసారిబాద్వయైః,
మదయంత్యగ్నిచుళైరక్షాంశైస్సర్పిషః పచేత్. ౨౨
ప్రస్థం తద్వద్ధ్రవైః పూర్వైః పంచగవ్య మిదం మహత్,
జ్వరాపస్మారజఠరభగందరహరం పరమ్. ౨౩
శోఫార్శఃకామలాపాండుగుల్మకాసగ్రహాపహమ్,

దశమూలములు, త్రిఫలములు, పసుపు, మ్రానిపసుపు, కొడిసెపట్ట, ఏడాకులపొన్న, ఉత్తరేణి, నీలిచెట్టు, కటుకరోహిణి, రేల, పుష్కరమూలము, జటామాంసి, బ్రహ్మమేడివేళ్ళు, రేఁగటిదూలగోవిల వీనిని దినుసుకు రెండుపలములచొప్పున గ్రహించి ద్రోణప్రమాణ ముదకములోవైచి నాల్గవ భాగము మిగులునటుల కషాయముకాచి అందులో గంటుభారంగి, చిరుబొద్ది, కందులు, తెగడ, నల్లతెగడ, త్రికటుకములు, కామంచిగడ్డి, చాగ, చిప్పగడ్డి, నేలవేము, కరక్కాయలు, సుగంధిపాల, నల్లసుగంధిపాల, చిత్రమూలము, మదయంతి(అనఁగా మల్లె), నీరుప్రబ్బలి వీనిని దినుసుకు కర్ష ప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి ఆవునెయ్యి, గోమయరసము, ఆవుపాలు, ఆవుపెరుగు, గోమూత్రము వీనిని దినుసుకు ఒకప్రస్థముచొప్పున చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసిన నది మహాపంచగవ్య ఘృతమనఁబడును. జ్వరము, అపస్మారము, ఉదరరోగము, భగందరము, శోఫ, అర్శస్సు, కామిల, పాండురోగము, గుల్మము, కాసము, గ్రహబాధ వీనిని నిశ్శేషముగ పోకడచును.

## అపస్మారరోగమునకు బ్రాహ్మ్యాదిఘృతము.

బ్రాహ్మీస్వరసవచాకుష్ఠశంఖపుష్పీశృతం ఘృతమ్. ౨౪
పురాణం మేధ్యమున్మాదాలక్ష్మ్యపస్మారపాప్మజిత్,

ప్రాఁతదియైన ఆవునేతిలో సరస్వతియాకురసము, వస, చెంగల్వకోష్టు, శంఖపుష్పి వీనినిచేర్చి విధిప్రకారము పక్వముచేసి యిప్పించిన ఉన్మాదరోగము, అపస్మారరోగము, అలక్ష్మి ఇవి తొలఁగును. ధారణాశక్తి గలుగును.

### అపస్మారమునకు జీవనీయఘృతము.

తైలప్రస్థం ఘృతప్రస్థం జీవనీయైః పలోన్మితైః. ౨౫
క్షీరద్రోణే పచేత్సిద్ధమపస్మారవిమోక్షణమ్,

నువ్వులనూనె ఒకప్రస్థము, ఆవునెయ్యి ఒకప్రస్థము, జీవనీయ గణద్రవ్యచూర్ణము దినుసుకు ఒకపలము వీనిని ద్రోణప్రమాణముగల ఆవుపాలలో చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యిప్పించిన అపస్మారరోగము హరించును.

### అపస్మారమునకు కాశ్మర్యఘృతము.

కంసే క్షీరేక్షురసయోః కాశ్మర్యేఽష్టగుణే రసే. ౨౬
కార్షికైర్జీవనీయైశ్చ సర్పిషః ప్రస్థం విపాచయేత్,
వాతపిత్తోద్భవం క్షిప్రమపస్మారం నిహంతి తత్. ౨౭

చెఱకురసము ఒక ఆఢకము, ఆవుపాలు ఒక ఆఢకము, నేలగుమ్మడు రసము ఎనిమిదిప్రస్థములు, ఆవునెయ్యి ఒకప్రస్థము, ఇటుల నీద్రవ్యముల నొకటిగచేర్చి అందులో జీవనీయగణద్రవ్యములను దినుసుకుకర్షప్రమాణముచొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి పానముచేయించిన వాతపిత్తమువలన జనించిన అపస్మారరోగ మతిశీఘ్రముగ హరించును.

### అపస్మార హరక్షీరము.

తద్వత్కాశవిదారీక్షుకుశక్వాథశృతం పయః,

కాశగడ్డి, నేలగుమ్మడుగడ్డ, చెరకు, కుశగడ్డి వీనిని సమభాగములుగ నుదకములో వైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందులో ఆవుపాలుచేర్చి చక్కగ కాచి పానముచేయించిన అపస్మారరోగము హరించును.

### అపస్మారమునకు కూశ్మాండఘృతము.

కూశ్మాండస్వరసే సర్పిరష్టాదశగుణే శృతమ్. ౨౮
యష్టీకల్కమపస్మారహరం ధీవాక్స్వరప్రదమ్,

గుమ్మడురసము ఎనిమిది ప్రస్థములు, ఆవునెయ్యి ఒకప్రస్థము ఇటుల నీరెండు ద్రవ్యముల నొకటిగచేర్చి అందులో అతిమధురకల్కమును కలిపి విధిప్రకారము పక్వముచేసి యిప్పించిన అపస్మారరోగము శీఘ్రముగ హరించుటయేగాక ప్రశస్తమయిన బుద్ధి, వాక్కు, కంఠస్వరము ఇవి స్ఫుటములుగ నగును.

### అపస్మారమునకు నస్యము.

కపిలానాం గవాం పిత్తం నావనం పరమం హితమ్. ౨౯

శ్వసృగాలబిడాలానాం సింహాదీనాం చ పూజితమ్,

కపిలవర్ణముగల ఆవుయొక్క పిత్తముచే నస్యముచేయించిన అపస్మారరోగికి మిగుల హితముకలుగును. మఱియు కుక్క నక్క పిల్లి సింహము వీనిపిత్తములు అపస్మారరోగులకు నస్యకర్మయందు కడుశ్రేష్ఠములు.

### అపస్మారమునకు నస్యాభ్యంగతైలము.

గోధానకులనాగానాం పృషభర్క్షగవామపి. ౩౦
పిత్తేషు సాధితం తైలం నస్యేఽభ్యంగే చ శస్యతే,

అపస్మారరోగులకు ఉడుము, ముంగిస, సర్పము, ఎద్దు, ఆవు, ఎలుగుబంటి వీని పిత్తములను నువ్వులనూనెలోవైచి కాచి నస్యాభ్యంగములయందు ప్రయోగించవలయును.

### అపస్మారమునకు త్రిఫలాదితైలము.

త్రిఫలావ్యోషపీతద్రుయవక్షారఫణిజ్జకైః. ౩౧
శ్యామాపామార్గకారంజబీజైస్తైలం విపాచితమ్,
బస్తమూత్రే హితం నస్యం చూర్ణం వా ధ్మాపయేద్భిషక్. ౩౨

నువ్వులనూనె ఒకభాగము, గొఱ్ఱెమూత్రము నాలుగుభాగములు వీనిని ఒకటిగా కలిపి అందులో నల్లసుగంధిపాల, ఉత్తరేణి, కానుగువిత్తులు, త్రిఫలములు, త్రికటుములు, దేవదారు, యవక్షారము, మరువము వీనిని సమభాగములుగ గ్రహించి కల్కము చేసి కలిపి తైలపాకవిధానంబున పక్వముచేసి అపస్మారరోగికి నస్యము చేయించినను లేక ఈ త్రిఫలాదిద్రవ్యచూర్ణమును గొట్టములో నుంచి ఉన్మాదాపస్మార రోగులయొక్క నాసికాద్వారములయందు ప్రధమనముచేసినను హితముకలుగును.

### అపస్మారహరధూమము.

నకులోలూకమార్జారగృధ్రకీటాహికాకజైః,
తుండైః పక్షైః పురీషైశ్చ ధూమమస్య ప్రయోజయేత్. 33

ముంగిస గుడ్లగూబ, పిల్లి వీనిమలములు, గుడ్లగూబ, గద్ద, కాకి వీనిముక్కులు, ఱెక్కలు, పాముకుబుసము వీనిని గ్రహించి అపస్మారరోగికి ధూపమువేసిన హితముకలుగును.

### అపస్మారహరలశునాదిప్రయోగము.

శీలయేత్తైలలశునం పయసా వా శతావరీమ్,
బ్రాహ్మీరసం కుష్ఠరసం వచాం వా మధుసంయుతామ్. ౩౪

వెల్లుల్లిని నూనెలోఁ గలిపిగాని, పిల్లిపీచరను పాలలోఁ గలిపిగాని, సరస్వతియాకురసమును చెంగల్వకోష్టుకషాయమునఁ గూర్చిగాని, వసను తేనెలోఁ గలిపిగాని ప్రతిదినము సేవించిన అపస్మారము శాంతపడును.

## అపస్మారరోగమునందు రసాయనప్రయోగము.

సమం క్రుద్ధైరపస్మారో దోషైశ్శారీరమానసైః,
యజ్జాయతే యతశ్చైష మహామర్మసమాశ్రయః. 3౫
తస్మాద్రసాయనైరేనం దుశ్చికిత్స్యముపాచరేత్,
తదార్తం ఛాగ్నితోయాదేః విషమాత్పాలయేత్సదా. 3౬

అపస్మారరోగము ఏకకాలంబున ప్రకోపించిన శారీరమానసదోషంబు లన్నింటివలన జనించినదగుటంజేసియు గొప్పమర్మమగు హృదయము నాశ్రయించియుండుటంజేసియు అది మిగుల కష్టసాధ్యమైనదిగ నుండును. కావున నాయపస్మారరోగమును రసాయనములచేత చికిత్స చేయఁదగియును మఱియు నారోగముగలవానిని నిప్పు నీళ్లు మొదలగువానివలన ముప్పు కలుగనీయక జాగరూకతతోడ సదా రక్షింపుచుండవలయును.

## అపస్మారరోగవిముక్తుని కుత్సాహకరికల్పనము.

ముక్తం మనోవికారేణ త్వమిత్థం కృతవానితి,
న బ్రూయాద్విషయైరిష్టైః క్లిష్టం చేతోఽస్య బృంహయేత్. 3౭

పైనివచించిన చికిత్సాగులచే నపస్మారరోగము జనించి మనోవికారరహితుఁడుగ నుండు నారోగితోడ నీవు పూర్వము నిందనీయకృత్యంబులను జేసినావని చెప్పక ప్రియముగను మనోహరంబుగను నుండు విషయంబులంజెప్పి వానిమనస్సున నుత్సాహము కలుగఁజేయవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ఏడవయధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

# అష్టమాధ్యాయము.

ఊర్ధ్వాంగచికిత్స, (శాలాక్యతంత్రము) 4-వ అంగము.

అవ. హృదయమనెడి మహామర్మస్థానమును జేరి ప్రకోపించియుండు వాతాది దోషములచే అపస్మారరోగము కలిగెడివిధంబున శిరమనెడి మహామర్మస్థానమును జేరి ప్రకోపించియుండు వాతాదిదోషములచే ఊర్ధ్వాంగరోగములు (అనఁగా మెడకొంకులకు పైభాగమున కలుగురోగములు) జనించుచున్నయవి. కావున అపస్మార ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతర మూర్ధ్వాంగరోగములకు చికిత్సాగలను వచింపుట కుపక్రమించి వానిలో ప్రధానమైన నేత్రరోగములకు తొలుత చికిత్సలం జెప్పుటకై వర్త్మరోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది. ఈయూర్ధ్వాంగచికిత్స యేశాలాక్యతంత్ర మనఁబడును —

## వర్త్మరోగ విజ్ఞానీయాధ్యాయప్రారంభము.

సూ. అథాతో వర్త్మరోగవిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతి స్మాహురాత్రేయాదయో మహర్షయః.

అపస్మారప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము వర్త్మరోగములను తెలియఁజేయుచునట్టి వర్త్మరోగవిజ్ఞానీయమను నీయధ్యాయమును వివరించెదము. (వర్త్మరోగమనఁగా కంటిరెప్పలయందు జనించురోగములు.)

### నేత్రరోగనిదానము సంప్రాప్తి.

సర్వరోగనిదానోక్తైరహితైః కుపితా మలాః,
అచక్షుష్యైర్విశేషేణ ప్రాయః పిత్తానుసారిణః. ౧
సిరాభిరూర్ధ్వం ప్రసృతాః నేత్రావయవమాశ్రితాః,
వర్త్మసంధిం సితం కృష్ణం దృష్టిం వా సర్వమక్షివా. ౨
రోగాన్ కుర్యుః

నిదానస్థానమందలి సర్వరోగనిదానాధ్యాయంబున "త్రికోషణ కషాయామ్ల" "పిత్తంకట్వమ్లతీక్ష్ణోష్ణ" "స్వాద్వమ్లలవణస్నిగ్ధ" అను శ్లోకములచే వివరింపఁబడినవియు, నేత్రములకు మిక్కిలి అహితకరములైనవియునైన ఆహారవిహారాదులచే వాతాది దోషములు ప్రకోపించి తఱచుగ పిత్తముతోఁగూడి సిరామార్గమూలంబున మనుజుని మెడక్రొంకులకు పైభాగమునవ్యాపించి నేత్రములయొక్క అవయవములగువర్త్మను (అనఁగా రెప్పను) గాని, సంధినిగాని, తెల్లగుడ్డునుగాని, నల్లగుడ్డునుగాని, దృష్టినిగాని, లేక కండ్లంతటనుగాని, యాశ్రయించి రోగములను కలుగజేయును.

### కృచ్ఛ్రోన్మీలరోగము.

చల స్తత్ర ప్రాప్య వర్త్మాశ్రయా స్సిరాః,
సుప్తోత్థితస్య కురుతే వర్త్మ స్తంభం సవేదనమ్. ౩
పాంసుపూర్ణాభనేత్రత్వం కృచ్ఛ్రోన్మీలనమశ్రుచ,
విమర్దనాత్స్వాచ్చ శమః కృచ్ఛ్రోన్మీలం వదంతి తమ్. ౪

ప్రకోపించినవాతము కంటిరెప్పల కాధారముగనుండు సిరలనుజేరి నిద్రించిలేచిన వానికి కండ్లలోశూల, వర్త్మస్తంభము, (అనఁగా రెప్పలు స్తబ్ధములుగనగుట) నేత్రములయందు ఇసుక నిండియుండురీతిగ మెరమెరలాడుచుండుట, కండ్లను కడుకష్టముచే తెరచుట, నయనంబులయందు నీరుకారుట మొదలగునుపద్రవములను కలుగంజేయును. నేత్రములను నలుఁపుటవలన నొప్పిశమించును. దీనిని కృచ్ఛ్రోన్మీలన నేత్రరోగమని ఋషులు వచింపుదురు.

### నిమేషరోగము.

చాలయన్ వర్త్మనీ వాయు ర్నిమేషోన్మేషణం ముహుః,
కరోత్యరుజ్నిమేషో౽సౌ

వాతము ప్రకోపించి కంటిరెప్పలను కదలించుచు నొప్పిలేకయే తెరచుట మూయుట అనుకృత్యములను పలుమారుచేయుచుండును. దీనికి నిమేషరోగ మని పేరుగలదు

### వాతహతరోగము.

వర్త్మ యత్తు నిమీల్యతే. ౫
విముక్తసంధి నిశ్చేష్టం హీనం వాతహతం హి తత్,

ప్రకోపించినవాతము రెప్పలను సంధిలోనుండి జారినదిగను చలనము లేకుండునదిగనుజేసి మరల రెప్పలను మూయునటులఁజేయును. దీనిని ఋషులు వాతహతరోగమని వచించెదరు.

## కుంభిరోగము.

కృష్ణాః పిత్తేన బహ్వ్యోఽంతర్వర్త్మ కుంభీకబీజవత్. ६
ఆధ్మాయంతే పునర్భిన్నాః పిటికాః కుంభిసంజ్ఞితాః,

పిత్తముచే నల్లగ కుంభీకవిత్తులతో (నేపాళపువిత్తులతో) తుల్యములుగనుండు నేకపిటికలు రెప్పలోపల జనించును. వానిని భేదించిన మరల నవి యుబ్బుచుండును. నికి కుంభియని పేరుగలదు.

## పిత్తోత్క్లిష్టరోగము.

సదాహక్లేదనిస్తోదం రక్తాభం స్పర్శనాక్షమమ్. ८
పిత్తేన జాయతే వర్త్మ పిత్తోత్క్లిష్టముశంతి తత్,

పిత్తముచే కంటిరెప్ప మంట పోట్లు నీనితోఁగూడినదిగను, ఎఱ్ఱగను తాఁకిన క్కిలి యుపద్రవముజేయుఁదిగను నుండును. దీనిని పిత్తోత్క్లిష్టమను నేత్రరోగమని చించెదరు.

## పక్ష్మశాతరోగము.

కరోతి కండూం దాహం చ పిత్తం పక్ష్మాంతమాస్థితమ్. ౯
పక్ష్మణాం శాతనం చాను పక్ష్మశాతం వదంతి తమ్,

పిత్తము ప్రకోపమునుజెంది రెప్పవెంట్రుకల మధ్యభాగమునంజేరి దురదను మం ను కలుగఁజేయుచు రెప్పవెంట్రుకల నూడునటులజేయును. దీనిని పక్ష్మశాతరోగ నియెదరు.

## పోతకీరోగము

పోథక్యః పిటికాశ్శ్వేతాస్సర్షపాభా ఘనాః కఫాత్. ౯
శోఫోపదేహరుక్కండూపిచ్ఛిలాశ్రుసమన్వితాః,

కఫమువలన రెప్పలలోపల తెల్లఁగ ఆఁవగింజలంత పరిమాణముకలవిగ గట్టిగ వాపు ల దురద జిగటగనుండు కంటినీరు వీనితోఁగూడినవిగనుండు పిటికలు జనించును. ని పోథకీయనియెదరు.

## కఫోత్క్లిష్టరోగము.

కఫోత్క్లిష్టం భవేద్వర్త్మ స్తంభక్లేదోపదేహవత్. ౧౦

కఫమువలన రెప్పలు స్తబ్ధములుగ నీరుకారునవిగ నొప్పితోఁగూడినవిగ నగును. కి కఫోత్క్లిష్టమని పేరు.

## లగణరోగము.

గ్రంథిః పాండురరుక్పాకః కండూమాన్ కఠినః కఫాత్,
కోలమాత్రస్స లగణః కించిదల్పస్తతోఽపివా. ౧౧

రెప్పలయందు తెలుపువర్ణము గలదియు, శూల పాకము ఇవి లేనిదియు, దురదతోఁ గూడినదియు, కఠినస్పర్శము కలదియు, రేఁగుగింజంత లేక కొంచెము తక్కువగ ప్రమాణముగలదియు నైన గ్రంథి కఫమువలన జనించును. ఇది లగణమని చెప్పఁబడును.

## ఉత్సంగపిటికారోగము.

రక్తా రక్తేన పిటికా స్తత్తుల్యాపిటికాచితాః,
ఉత్సంగాఖ్యాః

రక్తదోషముచే ఎఱుపువర్ణముగలవియు అనేకపిటికలతోఁ గూడినవియు నైన పిటికలు రెప్పపైభాగమునందు జనించును. దీనికి ఉత్సంగపిటికారోగమని పేరుగలదు.

## ఉత్క్లిష్టరోగము.

తథోత్క్లిష్టం రాజిమ త్స్పర్శనాక్షమమ్. ౧౨

రెప్పలయందు రక్తదోషముచే రేఖలతోఁగూడినవియు, తాఁకిన నొప్పిగలవియు నైన పిటికలు జనించును. ఇది ఉత్క్లిష్టమనఁబడును.

## వర్త్మార్శోరోగము.

అర్శోఽధిమాంసం వర్త్మాన్తః స్తబ్ధం స్నిగ్ధం సదాహరుక్,
రక్తం రక్తేన తత్స్రావి ఛిన్నం ఛిన్నం చ వర్ధతే. ౧౩

రక్తదోషముచే కంటిరెప్పలలోపల మధ్యభాగమున అధికమాంసము జనించును. ఇది యెఱ్ఱగను స్తబ్ధముగను మంట శూల వీనితోఁగూడినదిగను రక్తస్రావము కలదిగను నగును. దీనిని ఛేదించిన మరల వృద్ధిఁజెందుచుండును. దీనికి వర్త్మార్శస్సు అనిపేరు.

## అంజనరోగము

మధ్యే వా వర్త్మనోఽన్తే వా కండూషా రుగ్వతి స్థిరా,
ముద్గమాత్రాసృజా తామ్రా పిటికాంజననామికా. ౧౪

రక్తదోషముచే కంటిరెప్పల నడుమఁగాని కొసలయందుఁగాని దురద, మంట, శూలయుగలదియు, కఠినస్పర్శము గలదియు, పెసలగింజంత ప్రమాణముగలదియు, ఎఱ్ఱగనుండునదియు నైనపిటిక జనించును. దీనికి అంజనమని పేరుగలదు.

## ⊸ బిసవర్త్మరోగము. ⊷

దోషైర్వర్త్మబహిశ్శూనం యదంతస్సూక్ష్మఖాచితమ్,
సస్రావమంతరుదకబిసాభం బిసవర్త్మతత్. ౧౫

వాతాదిదోషములచే కంటిరెప్పలు పైభాగమున నుబ్బినవిగను సూక్ష్మములగు రంధ్రములతోఁగూడినవిగను రక్తస్రావముగలవిగను కంటియందు నీరుకమ్ముకొని యుండునవిగను నగును. దీనికి బిసవర్త్మమను పేరుగలదు.

## ⊸ ఉత్క్లిష్టవర్త్మరోగము. ⊷

యద్వర్త్మోత్క్లిష్టముత్క్లిష్టమకస్మాన్మ్లానతా మియాత్,
రక్తదోషత్రయోత్క్లేశాద్వదంత్యుత్క్లిష్టవర్త్మతత్. ౧౬

రక్తదోషము వాతాదిదోషత్రయము వీనివలన కంటిరెప్పలు దుష్టమై కారణము లేకనే వాడిపోవును. ఇది ఉత్క్లిష్టవర్త్మయనఁబడును.

## ⊸ శ్యావవర్త్మరోగము. ⊷

శ్యావవర్త్మ మలైస్సర్వైశ్శ్యావం రుక్క్లేదశోఫవత్,

రక్తదోషము వాతాదిదోషత్రయము వీనివలన కంటిరెప్పలు నలుపువర్ణముగలవి నొప్పి, ఉదకస్రావము వాపు వీనితోఁ గూడినవిగనునగును దీనికి శ్యావవర్త్మ పేరుగలదు.

## ⊸ క్లిష్టవర్త్మరోగము. ⊷

క్లిష్టాఖ్యవర్త్మనీ క్లిష్టే కండూశ్వయథురాగిణీ. ౧౭

కంటిరెప్పలు ఒకటితోనొకటి యంటుకొని దురద వాపు ఎరుపువర్ణము వీనితోఁ గూడినవిగనగును. దీనికి క్లిష్టవర్త్మయని పేరుగలదు.

## ⊸ సికతావర్త్మరోగము. ⊷

వర్త్మనోఽంతః ఖరా రూక్షాః పిటికాస్సికతోపమాః,
సికతావర్త్మ

కంటిరెప్పలలో మధ్యప్రదేశమున నిసుకంతప్రమాణముగలవియు, కఠిన స్పర్శ గూడినవియు, సూక్ష్మములుగనుండునవియునైన పిటికలు జనించును. ఇది సికతావర్త్మ మనఁబడును.

## ⊸ కర్దమవర్త్మరోగము. ⊷

కృష్ణం తు కర్దమం కర్దమోపమమ్. ౧౮

కంటిరెప్ప బురదవలె నల్లగనుండిన కర్దమవర్త్మమనఁబడును.

## బహళరోగము.

బహళం బహళైర్మాంసైః సవర్ణైశ్చీయతే సమైః,

రెప్పలకుపైభాగముగ రెప్పలతో సమానవర్ణముగల మాంసము మిక్కుటముగవృద్ధి బెందుచుండును. దీనికి బహళమని పేరుగలది.

## కుకూణకరోగము

కుకూణకశ్శిశోరేవ దంతోత్పత్తినిమిత్తజః. ౧౯

స్యాత్తేన శిశురుచ్ఛూనతామ్రాక్షో వీక్షణాక్షమః.

స వర్త్మశూలపైచ్ఛిల్యకర్ణనాసాక్షిమర్దనః. ౨౦

కుకూణకమను వర్త్మరోగముగలదు. ఇది శిశువులకుమాత్రము దంతోత్పత్తికాలమున జనించును. ఈ రోగముచే శిశువునకు నేత్రములయందు చెఱుపువర్ణము,వాపు.చూచుటకు శక్తిలేకుండుట, రెప్పలయందునొప్పి, చెవులు, ముక్కు, నేత్రములు వీనియందు పోట్లు ఈయుపద్రవములు కలుగును.

## పక్ష్మోపరోధరోగము.

పక్ష్మోపరోధే సంకోచో వర్త్మనాం జాయతే తథా,

ఖరతాంతర్ముఖత్వం చ లోమ్నామన్యాని వా పునః. ౨౧

కంటకైరివ తీక్ష్ణాగ్రైర్ఘృష్టం తైరక్షి సూయతే,

ఉష్యతే చానిలాదిద్విడల్పాహశ్శాంతిరుద్ధృతైః. ౨౨

పక్ష్మోపరోధమను వర్త్మరోగముగలదు. దీనియందు కంటిరెప్పలు సంకోచమును జెందును. రెప్పవెండ్రుకలు కఠినములుగ గ్రుడ్డుకభిముఖములుగ నుండును. లేక వేరె రెప్పవెండ్రుకలు జనించును. రోగస్వభావమువలన ముండ్లవలె వాడిగల్గియుండు నావెండ్రుకలు కండ్లలోభాగమున గ్రుచ్చుకొనియుండును. దానంజేసి కండ్లలోవిశేషముగ మంటయు పోటునుకల్గి గాలిని యోరువలేక ఎండను నిప్పును చూడజాలకుండును. ఆ వెండ్రుకలను పెరికివేసిన కొన్నిదినములలో నారోగము శమించును.

## అలజీరోగము.

కనీనికే బహిర్వర్త్మ కఠినో గ్రంథిరున్నతః,

తామ్రః పక్వోఽస్రపూయస్రుదలజ్యాధ్మాయతే ముహుః. ౨౩

కంటిరెప్పల వెలుపటిభాగమునందు కఠినముగను ఉన్నతముగను ఎఱ్ఱగను వుండెడిదిగను రక్తము చీము వీనిని స్రవించునదిగనునుండు గ్రంథిజనించును. దీనికి అలజియని పేరుగలదు. ఈ గ్రంథియందు పలుమారు చీము రక్తము స్రవించును పలుమారు ఉబ్బు కనుండును.

## అర్బుదరోగము.

వర్త్మాన్తర్మాంసపిండాభశ్శ్వయథుర్గ్రథితోఽరుజః,
సారాగస్సోఽర్బుదో దోషైర్విషమో బాహ్యతశ్చలః. ౨౪

రక్తదోషముతోఁ గూడియుండు వాతాదిత్రిదోషములచే కంటిరెప్పలను లోభాగమునయుంటగను, నొప్పిలేనిదిగను, వెలుపల చలించునదిగను, మాంసపిండమునంటి యాకారముగలదిగను విషమముగనుండు వాపు జనించును. దీనికి అర్బుదమను పేరుగలదు.

## రెప్పలయందు జనించు రోగములసంఖ్య

చతుర్వింశతిరిత్యేతే వ్యాధయో వర్త్మసంశ్రయాః,

ఈ గ్రంథకర్తయగు వాగ్భటాచార్యుఁడు ఇరువదినాల్గు వర్త్మగతరోగములఁ జెప్పెరి. మాధవకరుఁడు "వర్త్మజాస్త్వేకవింశతిః" అని యిరువదియొక వర్త్మగతరోగములఁజెప్పెను. రోగముల నామములయందు ఈ మతములతో పరస్పరభేదము గానఁబడుచున్నది. అయినను ఆయా రోగలక్షణములయందు మాత్రము విశేషముగ మార్పు గానఁబడదు. విజ్ఞులు గమనించెదరుగాక! పైజెప్పిన ప్రకారము ఇరువదినాలుగురోగములు కంటిరెప్పలయందు జనించును.

## వర్త్మరోగసాధ్యాసాధ్యములు.

ఆద్యోఽత్ర భేషజైస్సాధ్యో ద్వౌ తతోఽర్శశ్చ వర్జయేత్. ౨౫
పక్ష్మోపరోధో యాప్యస్స్యాచ్ఛేషాన్ శస్త్రేణ సాధయేత్,

పైజెప్పిన ఇరువదినాలుగు వర్త్మరోగములలో కృచ్ఛ్రోన్మీలనమను పేరుగల మొదటిరోగమును ఔషధములచే చికిత్సజేసి సాధింపఁదగియుండును. నిమేషము, వాతహతము, అర్శస్సు ఇవి అసాధ్యంబులగుటవలన చికిత్సయందు వర్జింపఁదగినవి. పక్ష్మోపరోధమను రోగము యాప్యముగనుండును. తక్కిన పందొమ్మిది వర్త్మరోగములను శస్త్రముచే చికిత్సజేయనగును.

## వర్త్మరోగములయందు శస్త్రచికిత్సాక్రమము.

కుట్టయేత్పక్ష్మసదనం ఛింద్యాత్తేష్వపి చార్బుదమ్. ౨౬
భింద్యాల్లగణకుంభీకాబిసోత్సంగాఞ్జనాలజీః,
పోథకీశ్యావసికతాశ్లిష్టోత్క్లిష్టచతుష్టయమ్. ౨౭

సకర్దమంసబహాళం విలిఖేత్సకుకూణకమ్.

శస్త్రముచే సాధింపఁదగిన పందొమ్మిది వర్త్మరోగములలో పక్ష్మసదనమః రోగమును సూచీకూర్చమను శస్త్రముచే పొడవవలయును. అర్బుదరోగమును వృద్ధిపత్రాదిశస్త్రముచే ఛేదింపవలయును. లగణము, కుంభీకము, బిసము, ఉత్సంగము, అంజనమః అలజి ఈరోగములను వ్రీహిముఖమను శస్త్రముచే ఛేదింపవలయును. పోథకీ, శ్యావము సికతా, క్లిష్టము, పిత్తోత్క్లిష్టము, కఫోత్క్లిష్టము, రక్తోత్క్లిష్టము, ఉత్క్లిష్టవర్త్మ, కర్దషము, బహాలము, కుకూణకము వీనిని శస్త్రముచే గీచవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును

ఎనిమిదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# న వ మా ధ్యా య ము.



అవ. వర్త్మరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము పై రోగములకు చికి
ను తెలియపరచుటకై వర్త్మరోగప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## వర్త్మరోగ ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో వర్త్మరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహు రాత్రేయాదయో మహర్షయః.

వర్త్మరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము కంటిరెప్పలయందు బుట్టు
గులకు చికిత్సలను వివరించునట్టి వర్త్మరోగ ప్రతిషేధమును నీయధ్యాయమును
ఁచెదము.

### కృచ్ఛ్రోన్మీల నేత్రరోగచికిత్స.

కృచ్ఛ్రోన్మీలే పురాణాజ్యం ద్రాక్షాకల్కాంబుసాధితమ్,
ససితం యోజయేత్స్నిగ్ధం నస్యధూమాంజనాది చ. ౧

కృచ్ఛ్రోన్మీలమను వర్త్మరోగమునందు ద్రాక్షపండు కల్కకషాయములలో ప్రాఁ
కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి అందులో నేతికి సమభాగముగ పంచదారను
ప్రయోగించుటయేగాక స్నిగ్ధమైన నస్యధూమ అంజనాదులను ప్రయోగించ
ను.

### కుంభీకావర్త్మరోగచికిత్స.

కుంభీకావర్త్మ లిఖితం సైంధవప్రతిసారితమ్,
యష్టీధాత్రీపటోలీనాం క్వాథేన పరిషేచయేత్. ౨

కుంభీకా వర్త్మరోగమును వృద్ధిపత్రము మున్నగు శస్త్రములచే గీచవలయును.
అమునందు సైంధవలవణచూర్ణముచే ప్రతిసారణముజేసి యష్టిమధుకము, ఉసిరిక,
నిని సమభాగములుగచేర్చి కాచఁబడిన కషాయముచే తడుపవలెను.

## వర్త్మరోగమునకు శస్త్రలేఖనక్రమము.

నివాతేఽధిష్ఠితస్యాప్తైశ్శుద్ధస్యోత్తానశాయినః,
బహిః కోష్ణాంబుతప్తేన స్వేదితం వర్త్మ వాససా. ౩
నిర్భుజ్య వస్త్రాంతరితం వామాంగుష్ఠాంగులీధృతమ్,
నస్రంసతే చలతి వా వర్త్మైవం సర్వతస్తతః. ౪
మండలాగ్రేణ తత్తిర్యక్ కృత్వా శస్త్రపదాంకితమ్,
లిఖేత్తేనైవ పత్రైర్వా శాకశేఫాలిజాదిజైః. ౫
ఫేనేన తోయరాశేర్వా పిచునా ప్రమృజన్నసృక్,
స్థితే రక్తే సులిఖితం సక్షౌద్రైః ప్రతిసారయేత్. ౬
యథాస్వముక్తైరను చ ప్రక్షాళ్యోష్ణేన వారిణా,
ఘృతేనాసిక్తమభ్యక్తం బధ్నీయాన్మధుసర్పిషా. ౭
ఊర్ధ్వాధః కర్ణయోర్దత్వా పిండీం చ యవసక్తుభిః,
ద్వితీయేఽహని ముక్తస్య పరిషేకం యథాయథమ్ ౮
కుర్యాత్ చతుర్థే నస్యాదీన్ ముంచేదేవాహ్ని పంచమే,

వర్త్మరోగముగలవానికి వమనవిరేచనాది కర్మలనుచేయించి గాలిలేని ప్రదేశములో వెలికిలపరుండబెట్టి ఆప్తులచే నిటు నటు కదలనియ్యక పట్టుకొను నటులంజేసి సుఖోష్ణమైనయుదకములో తడిపిన వస్త్రముచే కంటిరెప్పలకుపైని స్వేదకర్మను చేయించవలయును. పిదప కంటిరెప్పకదలక యెడమబొటనవ్రేలిచే పట్టుకొని రెప్పను వెలికిలనుండునట్లు తెరచి మండలాగ్రమను శస్త్రముచేఁగాని ఛేకాకు మున్నగు గరుకులుకల ఆకులచేఁగాని, సముద్రపునురుగుచేఁగాని అడ్డముగగీచి పత్తిచే రక్తమును తుడవవలయును. గీచిన ప్రదేశములో రక్తము మరలస్రవింపక యుండిన లేఖనకర్మ చక్కఁగచేయఁబడినదని (అనఁగా గీయఁబడినదని) తెలిసికొని ఆయారోగానుగుణముగ సైంధవాదిద్రవ్యములను తేనెలోకలిపి ప్రతిసారణముజేయించి పిదప సుఖోష్ణముగ నుండునుదకముచేకడిగి గీచినస్థలమునందు నేతినిపోసి తేనె, నెయ్యి వీని నొకటిగచేర్చి పైనరాచి చెవులకు ఊర్ధ్వాధోభాగములయందు యవలసత్తుపిండి యుంటలనునిచి వస్త్రముచే చక్కఁగ కట్టవలయును. రెండవదినమున కట్టువిడిచి రెప్పలకుపై నాయారోగములకు చెప్పియుండు నౌషధములచే పరిషేకముచేయించి ముందువలె నాలవదినమున నస్యాదులను ప్రయోగించవలయును ఆయిదవదినమున కట్టును ఇప్పివేయవలయును.

## సులిఖితవర్త్మలక్షణము.

సమం నఖనిభం శోఫకండూఘర్షాద్యపీడితమ్. ౯
విద్యాత్సులిఖితం వర్త్మ లిఖే ద్భూయో విపర్యయే,

రెప్పలు క్రిందపైనిజారక సమములుగను, గోళ్లతోసదృశమైన యాకారములు గలవిగను, దురద, నొప్పి ఇవి లేకుండునవిగనునుండిన చక్కఁగ లేఖనకర్మచేయఁబడిన దని తెలిసికొనవలయును. పైనిచెప్పినప్రకారములేకుండినచో మఱల లేఖనకర్మను చేయవలయును.

## అతిలేఖనోపద్రవచికిత్సలు.

రుక్పక్ష్మవర్త్మ సదనం స్రంసనాదతిలేఖనాత్. ౧౦
స్నేహస్వేదాదిక స్తస్మిన్నిష్టో వాతహరః క్రమః,

అతిలేఖనము (అనఁగా అధికముగగీచుట) వలన శూలగలుగుట, రెప్పవెండ్రుకలు గాడుట, రెప్పలు జారిపోవుట ఈ యుపద్రవములు కలుగును. దీనికి వాతహరములైన స్నేహస్వేదాది చికిత్సలను చేయవలయును.

## వర్త్మరోగమున నేత్రసేచనము.

అభ్యజ్య నవనీతేన శ్వేతరోధ్రం ప్రలేపయేత్. ౧౧
ఏరండమూలకల్కేన పుటపాకే పచే త్తతః,
స్విన్నం ప్రక్షాళితం శుష్కం చూర్ణితం పోటలీకృతమ్. ౧౨
స్త్రియాః క్షీరే ఛగల్యా వా మృదితం నేత్రసేచనమ్,

తెల్లలొద్దుగుపుష్పమునను ఆవువెన్నను రాచి ఆముదపు వేళ్లనునూరి పూసి పుటపాకమువేసి పక్వమైన పిదప దానినెత్తుకొని చక్కఁగకడిగి యెండించి చూర్ణముచేసి వస్త్రగాలితమొనర్చి యాచూర్ణమును చనుపాలలోఁగాని గొఱ్ఱెపాలలోఁగానివైచి కలియఁబిసికినేత్రములను సేచనము చేయవలయును.

## అతిలేఖనోపద్రవమునకు సేచనము.

శాలితండులకల్కేన లిప్తం తద్వత్పరిష్కృతమ్. ౧౩
కుర్యాన్నేత్రేఽతిలిఖితే మృదితం దధిమస్తునా,
కేవలేనాపి వా సేకం మస్తునా జాంగలాశినః. ౧౪

కంటిరెప్పలయందు లేఖనకర్మయధికముగ ప్రయోగించబడిన యెడల తెల్లలొద్దుగ పుష్పమునకు వెన్నచరిమి దానికి సంబావు బియ్యమును చక్కఁగనూరి పూసి పుట

పాకముచేయించి పక్వమైన దానినెత్తి కడిగి యెండించి చూర్ణముచేసి వస్త్రగాలిత మొనర్చి పెఱుగుమీఁది మీఁగడలోఁ గలిపి నేత్రములను సేచనమును చేయవలయును. లేక యా నేత్రరోగికి జాంగలదేశజంతుమాంసమును భుజింపఁజేసి వానికంటికి పెఱుగుమీఁది మీఁగడచే సేచనము చేయవలయును.

### వర్త్మపిటికాభేదనము.

పిటికాం వ్రీహివక్త్రేణ భిత్వా తు కఠినోన్నతామ్,
నిష్పీడయేదనువిధిః పరిశేషస్తు పూర్వవత్. ౧౪

రెప్పలకుపైని కఠినముగను ఉన్నతముగను నుండుపిటికను వ్రీహివక్త్రమను శస్త్రముచే భేదించి దానిలోనుండు కల్మషము బైలువెడలునటుల పిసికి పూర్వము చెప్పియుండు ప్రకారము లేపనబంధప్రక్షాళన సేచనాదికర్మలను చేయించవలయును.

లేఖనే భేదనే చాయం క్రమ స్సర్వత్ర వర్త్మని,

రెప్పలయందు లేఖనభేదనకర్మల చేయునపుడు పైచెప్పిన క్రమముల ననుసరించవలయును.

### పిత్తోత్క్లిష్ట రక్తోత్క్లిష్ట వర్త్మరోగచికిత్స.

పిత్తాస్రోత్క్లిష్టయోస్స్వాదుస్కంధసిద్ధేన సర్పిషా. ౧౫
సిరావిమోక్షస్స్నిగ్ధస్య త్రివృచ్ఛ్రేష్ఠం విరేచనమ్,
లిఖితే స్రుతరక్తే చ వర్త్మని క్షాళనం హితమ్. ౧౬
యష్టీకషాయ స్సేకస్తు క్షీరం చందనసాధితమ్,

పిత్తోత్క్లిష్టము, రక్తోత్క్లిష్టము అను వర్త్మరోగములయందు ఆరోగికి మధురగణద్రవ్యములతో పక్వముచేయఁబడిన ఘృతముచే స్నేహకర్మను జేయించి రెప్పలయందలి సిరను వేధించవలయును. తెగడ, త్రిఫలములు వీనిచే విరేచనమును జేయించవలయును. రెప్పలయందు లేఖనకర్మనుచేయించి రక్తము స్రవించినపిదప దానిని అతిమధురకషాయముచే కడిగి చందనమువైచి కాఁచఁబడిన యావుపాలచే సేచనమును చేయవలయును.

### పక్ష్మశాతనవర్త్మరోగచికిత్స.

పక్ష్మణాం సదనే సూచ్యా రోమకూపాన్వికుట్టయేత్. ౧౭
గ్రాహయేద్వా జలౌకోభిః పయసేక్షురసేన వా,
వమనం నావనం సర్పిశ్శృతం మధురశీతలైః. ౧౮

పక్ష్మశాతరోగమున రెప్పవెండ్రుక లూడిపడినచో రోమకూపములను సూదిచే పొడవవలయును. లేక జలగలచే రక్తమును పీల్చునటుల చేయవలయును. లేక ఆవుపాలతోఁగాని చెఱుకురసముతోఁగాని వమనము చేయించి మధురముగను శీతలముగను నుండు ద్రాక్షపండు మొదలగువానినిచేర్చి పక్వముచేయఁబడిన ఘృతముచే నస్యమును ప్రయోగించిన హితము కలుగును.

—పక్ష్మశాతరోగమునకంజనము.—

సంచూర్ణ్య పుష్పకాసీసం భావయేత్సురసారసైః,
తామ్రే దశాహం పరమం పక్ష్మశాతే తదంజనమ్. ౨౦

పుష్పకాసీసమును చక్కఁగ చూర్ణముచేసి తామ్రపాత్రయందునిచి అందులో తులసిరసముబోసి పదిదినములు భావనచేసి దానిచే కంటికి కాటుకవేసిన రెప్పవెండ్రుక లూడుట మానును. ఇది శ్రేష్ఠమైన అంజనము.

—పోథకీరోగచికిత్స.—

పోథకీర్లిఖితాశ్శుంఠీసైంధవ ప్రతిసారితాః,
ఉష్ణాంబుక్షాళితాస్సించేత్ఖదిరాఢకిశిగ్రుభిః. ౨౧
అప్సిద్ధైర్ద్వినిశాశ్రేష్ఠా మధుకైర్వా సమాక్షికైః,

పోథకియను వర్త్మరోగమును వృద్ధిపత్రము మొదలగు శస్త్రములచే గీచి శుంఠి సైంధవలవణము వీని చూర్ణముచే ప్రతిసారణము చేయించి ఉష్ణోదకముచే కడిగి చండ్ర, కందులు, మునగ వీనిని ఉదకములోవైచి చక్కఁగ కాఁచి యాకషాయముచేఁ గాని, పసుపు, మ్రానిపసుపు, త్రిఫలములు, అతిమధురము వీని నుదకములోవైచి చక్కఁగ కాఁచి కొంచెము తేనచేర్చి దానిచేఁగాని సేచనము చేయవలయును.

—కఫోత్క్లిష్టవర్త్మరోగచికిత్స.—

కఫోత్క్లిష్టే విలిఖితే సక్షౌద్రైః ప్రతిసారణమ్.
సూక్ష్మైస్సైంధవకాసీసమనోహ్వాకణతార్క్ష్యజైః, ౨౨
వమనాంజననస్యాది సర్వం చ కఫజిద్ధితమ్. ౨౩

కఫోత్క్లిష్టమను వర్త్మరోగమును శస్త్రముచే ఛేదించి సైంధవలవణము, కాసీసము, మణిశిల, పిప్పళ్లు, రసాంజనము వీనిని నున్నగ చూర్ణముజేసి అందు కొంచెము తేనెజేర్చి దానిచే ప్రతిసారణముచేసిన హితముకలుగును. మరియు నీరోగమున కఫహారములైన వమనము, అంజనము, నస్యము మొదలగువానిని చేయవలయును.

### లగణవర్త్మరోగచికిత్స.

కర్తవ్యం లగణేప్యేతదశాంతావగ్నినా దహేత్,

కఫోత్క్లిష్టరోగమునకు చెప్పియుండునటుల లగణమను వర్త్మరోగమును చికిత్స జేయవలెను. ఇటులజేసియు నారోగము శమింపకయుండిన దానిని అగ్నిచే కాల్చవలయును.

### కుకూణకరోగచికిత్స.

కుకూణే ఖదిరశ్రేష్ఠానింబపత్రైశ్శృతం ఘృతమ్. ౨౪
పీత్వా ధాత్రీచమేత్కృష్ణాయష్టీసర్షపసైంధవైః,
అభయాపిప్పలీద్రాక్షాక్వాథేనైనాం విరేచయేత్. ౨౫

శిశువులకు కుకూణకరోగముకలిగిన దానికి చంద్ర, త్రిఫలములు, వేపాకు వీనిని ఆవునేతిలోవైచి కాచి యిప్పించి పిదప పిప్పళ్లు, యష్టిమధుకము, ఆవాలు, సైంధవలవణము వీనిచే వమనము చేయించి కరక్కాయలు, పిప్పళ్లు, ద్రాక్ష వీనిని సమభాగములుగ వైచికాచిన కషాయముచే విరేచనము చేయించవలయును.

### కుకూణకరోగమునందు ధాత్రీస్తనాలేపము.

ముస్తాద్విరజనీకృష్ణాకల్కేనాలేపయేత్ స్తనౌ,
ధూపయేత్సర్షపైస్సాజ్యైః

కుకూణకరోగమునందు తుంగముస్తలు, పసుపు, మ్రానిపసుపు, పిప్పళ్లు వీనిని నూరి దాదిస్తనములకు లేపనయముజేయించి ఆవాలను నేతిలోతడిపి నిప్పులోవైచి స్తనములకు ధూపము వేయవలయును.

### కుకూణకరోగమునందు దాదికి ముస్తాదికషాయపానము.

శుద్ధాం క్వాథం చ పాయయేత్. ౨౬
పటోలముస్తమృద్వీకాగుడూచీత్రిఫలోద్భవమ్,

కుకూణకరోగమునందు వమనవిరేచనాదులచే శుద్ధము జేయఁబడిన శరీరముగల దాదికి పొట్ల, తుంగముస్తలు, ద్రాక్ష, తిప్పతీఁగె, త్రిఫలములు వీనికషాయమునుపానము చేయించవలయును.

### కుకూణకరోగమునందు శిశునేత్రమునకు లేఖనకర్మ.

శిశోస్తు లిఖితం వర్త్మస్రుతాసృగ్వాంబుజన్మభిః. ౨౭
ధాత్ర్యశ్మంతకజంబూత్థపత్రక్వాథేన సేచయేత్,

కుకూణకరోగమునందు శిశువుయొక్క రెప్పలను శస్త్రముచే మెల్లగ గీరిగాని జలగలచే రక్తమోక్షణము చేయించిగాని, ఉసిరిక, అశ్మంతకము (కొండపిండిచెట్టు) నేరేడు వీనియాకుల కషాయముచే సేచనము చేయవలయును.

### శిశువులకు వమనావశ్యకత్వము.

ప్రాయః క్షీరఘృతాశిత్వాద్బాలానాం శ్లేష్మజా గదాః. ౨౮
తస్మాద్వమనమేవాగ్రే సర్వవ్యాధిషు పూజితమ్,

బాలురు పాలు నెయ్యి వీనిని విశేషముగ సదా భుజించుటవలన వారికి తఱచుగ కఫరోగములు కలుగును. కావున బాలురకుజనించు సర్వవ్యాధులయందును తొలుత వమనముచేయించుట మిక్కిలి ప్రశస్తము.

### కుకూణకరోగమునందు బాలురకు వమనౌషధము

సింధూత్థకృష్ణాపామార్గబీజాజ్యస్తన్యమాక్షికమ్. ౨౯
చూర్ణో వచాయాస్సక్షౌద్రో మదనం మధుకాన్వితమ్,
క్షీరం క్షీరాన్నమన్నం చ భజతః క్రమశశ్శిశోః. ౩౦
వమనం సర్వరోగేషు విశేషేణ కుకూణకే,
సప్తలారససిద్ధాజ్యం యోజ్యంచోభయశోధనమ్. ౩౧

పాలుత్రాగుచుండు శిశువునకు సైంధవలవణము, పిప్పళ్లు, ఉత్తరేణివిత్తులు వీని చూర్ణములను నెయ్యి చనుబాలు తేనె వీనిలోకలిపి యిప్పించిన వమనంబగును. పాలు, అన్నము వీనిని భుజించుచుండు శిశువునకు వస చూర్ణమును తేనెలోకలిపి యిచ్చి వమనము చేయించవలయును. అన్నమునుమాత్రము భుజించుచుండు శిశువునకు అతిమధురము, మంగపండు వీనిచూర్ణములచే వమనము చేయించవలయును. బాలురకు సర్వరోగములయందును వమనముచేయించుట శ్రేష్ఠము. కుకూణకరోగమునందు శిశువులకు వమనముచేయించుట మిక్కిలి హితకరము. కుకూణకరోగముగల శిశువునకు విర్గజాజీరసములో ఆవునేతినికలిపి కాచి పానముచేయించిన వమన విరేచనంబు లగును.

### కుకూణకరోగమునందు వర్తి.

ద్వినిశారోధ్రయష్ట్యాహ్వరోహిణీనింబపల్లవైః,
కుకూణకే హితా వర్తిః పిష్టైః స్తామ్రరజోన్వితైః. ౩౨
క్షీరక్షౌద్రఘృతోపేతం దగ్ధం వా లోహితం రజః,

పసుపు, మ్రానిపసుపు, లొద్దుగు, అతిమధురము, కటుకరోహిణి, వేపచిగుళ్లు, రాగిరావిపట్టడి వీనిని ఉదకముతో చక్కఁగనూరి వర్తిజేసి ప్రయోగించినను, లేక ఇనుపరాపొడి చూర్ణమును పాలు, తేనె, నెయ్యి వీనిలో తడిపి నిప్పులోకాల్చి ప్రయోగించినను కుకూణకరోగము శమించును.

### కుకూణపోథకీరోగములకు వర్తి.

ఏలారసోనకతకశంఖోషణఫణిజ్జకైః. 33
వర్తిః కుకూణపోథక్యోస్సురాపిష్టైశ్చ కట్ఫలైః,

ఏలకులు, వెల్లుల్లి, చిల్లగింజలు, శంఖము, మిరియాలు, మరువము, పెద్దమేకు వీనిని సురయను మద్యముతోనూరి వర్తిజేసి కుకూణకము పోథకీ ఈరోగములయందు ప్రయోగించిన హితముకల్గును.

### పక్ష్మోపరోధవర్త్మరోగచికిత్స.

పక్ష్మరోధే ప్రవృద్ధేషు శుద్ధదేహస్య రోమసు. 34
ఉత్సృజ్య ద్వౌ భ్రువోఽధస్తాద్భాగౌ భాగం చ పక్ష్మతః,
యవమాత్రం యవాకారం తిర్యక్ఛిత్వార్ద్రవాససా. 35
అపనేయమసృక్తస్మిన్నల్పీభవతి శోణితే,
సీవ్యేత్కుటిలయా సూచ్యా ముద్గమాత్రాంతరైః పదైః. 36
బద్ధ్వా లలాటే పట్టం చ తత్ర సీవనసూత్రకమ్,
నాతిగాఢశ్లథం సూచ్యా నిక్షిపేదథ యోజయేత్. 37
మధుసర్పిః కబళికాం న చాస్మిన్ బంధమాచరేత్,
న్యగ్రోధాదికషాయైశ్చ సక్షీరైస్సేచయేద్రుజి. 38
పంచమే దివసే సూత్రమపనీయావచూర్ణయేత్,
గైరికేణ వ్రణం యుంజ్యాత్తీక్ష్ణం నస్యాంజనాది చ. 39

పక్ష్మరోధమను వర్త్మరోగమునందు రెప్పవెంట్రుకలు వృద్ధిజెందియుండినచో ఆరోగికి వమనవిరేచనంబులను చేయించి కనుబొమలకు క్రింద రెండుభాగములును రెప్పవెండ్రుకలకుపైన ఒక భాగమునువదలి యవప్రమాణము రెప్పలను అడ్డముగ శస్త్రముచే ఛేదించి తడిగుడ్డచే రక్తమునుతుడవవలయును. రక్తమునిలిచినపిదప వంకరగనుండు సూదిచే ఆరెప్పలనుపట్టి దారముతోనుండు నాసూదిని నుదుటియందుకట్టి యుంచఁబడిన వస్త్రఖండమునందు మిక్కిలి బిగుతును వదులుగానుండునట్లు పట్టియుంచవలయును.

పిదప తేనె ఘృతము వీనికబళములను ప్రయోగించవలయును. దీనిపై కట్టుగట్టకూడదు. నొప్పిగలిగినచో న్యగ్రోధాదిగణద్రవ్యకషాయములో నావుపాలుకలిపి సేచనముచేయవలయును. ఐదవ దినమునందు ఆకట్టుదారమును తీసివైచి యావ్రణమునకు కావిరాయి చూర్ణముచే అవచూర్ణముచేయించి తీక్ష్ణమైన నస్యము అంజనము మొదలగువానిని ప్రయోగించవలయును.

## బాహ్యాలజ్యాదివర్త్మరోగచికిత్స.

దహేదశాంతౌ నిష్కృజ్య వర్త్మదోషాశ్రయాం వలీమ్,
సందంశేనాధికం పక్ష్మ హృత్వా తస్యాశ్రయం దహేత్. ౪౦
సూచ్యగ్రేణాగ్నివర్ణేన దాహో బాహ్యాలజేః పునః,
భిన్నస్య క్షారవహ్నిభ్యాం సుచ్ఛిన్నస్యార్బుదస్య చ. ౪౧

పైనిచెప్పిన విధమున చికిత్సచేసియు పక్ష్మోపరోధరోగము శమింపకయుండినచో వర్త్మరోగమునకు స్థానముగనుండు ప్రదేశమును నిప్పుచే కాల్చవలయును. రెప్పవెండ్రుక లధికముగ వృద్ధిజెందియుండినచో వానిని సందంశమను శస్త్రముచే (చిమటాచేత) తీసివైచి వానిస్థానమును అగ్నితప్తమైన సూదికొనచే కాల్చవలయును. బాహ్యాలజీరోగమును శస్త్రముచే భేదించి అగ్నిచేకాల్చవలయును. అర్బుదరోగమునుఛేదించి క్షారముల చేతను అగ్నిచేతను కాల్చవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును తొమ్మిదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ద శ మా ధ్యా య ము.

ఇక కనురెప్పల నాశ్రయించినరోగముల చికిత్సను జెప్పినపిదప రెప్పలకుసమీపమున నుండు సంధి సితాసితభాగముల నాశ్రయించి జనించురోగములజెప్పుటకై వర్త్మరోగ చికిత్సాధ్యాయానంతరముసంధిసితాసితరోగవిజ్ఞానీయాధ్యాయము జెప్పఁబడుచున్నవి:—

## సంధి సితాసితరోగవిజ్ఞానీయాధ్యాయప్రారంభము.

సూ. అథాత స్సంధిసితాసితరోగవిజ్ఞానీయమధ్యాయం,

వ్యాఖ్యాస్యామః, ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వర్త్మరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము రెప్పలసంధి, కంటితెల్లగ్రుడ్డు, నల్లగ్రుడ్డు వీనియందలి రోగములను తెలియపరచునట్టి సంధిసితాసితవిజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

### సంధిగతరోగములుతొమ్మిది. అందు జలస్రావరోగలక్షణము.

వాయుః క్రుద్ధ స్సిరాః ప్రాప్య జలాభం జలవాహినీః,

అశ్రుస్రావయతే వర్త్మశుక్లసంధేః కనీనికాత్. ౧

తేన నేత్రం సరుగ్రాగశోఫం స్యాత్సజలాస్రవః,

వాతము ప్రకోపించి జలమునువహించునట్టి సిరలనుజేరి కనురెప్పలకును తెల్లగ్రుడ్డునకు నడుమనుండు సంధిస్థానమునందుండి ఉదకమువంటి నీరును స్రవింపఁజేయును. దీనిచే నేత్రములయందు శూల ఎఱుపువర్ణము వాపు ఈయుపద్రవములు జనించును.

### కఫజజలస్రావరోగము.

కఫాత్కఫస్రవే శ్వేతం పిచ్ఛిలం బహళం స్రవేత్. ౨

కఫదోషమువలన కంటియందు తెల్లగను జిగటగను అధికముగను నుండు నీరు స్రవించును.

### ఉపనాహరోగము.

కఫేన శోఫ స్తీక్ష్ణాగ్రః క్షారబుద్బుదకోపమః,

పృథుమూలబలస్స్నిగ్ధస్సవర్ణమృదుపిచ్ఛిలః. ౩

మహానపాకఃకండూమానుపనాహస్సు నీరుజః,

నేత్రమునందు శ్లేష్మదోషముచే తీక్ష్ణముగను నీరుబుగ్గవంటిదిగను పెద్దదిగను జిగటగను మృదువుగను దురదతోఁ గూడినదిగను నొప్పిలేనిదిగను నుండు వాపుజనించును. ఇది యుపనాహ రోగమనఁబడును.

## రక్తస్రావరోగము.

రక్తాద్రక్తస్రవే తామ్రం బహూష్ణం చాశ్రు సంస్రవేత్. ౪

కంటియందు రక్తదోషము వలన రక్తవర్ణము గలదియు ఉష్ణముగనుండు నదియు నైన నీరుకారును. ఇది రక్తస్రావరోగ మనఁబడును.

## పర్వణీరోగము.

వర్త్మసంధ్యాశ్రయా శుక్లే పిటికా దాహశూలినీ,
తామ్రా ముద్గోపమా భిన్నా రక్తం స్రవతి పర్వణీ. ౫

రక్తదోషమువలన కంటితెల్లగుడ్డునందు రెప్పలసంధుల నాశ్రయించినదియు, మంట శూల వీనితోఁ గూడినదియు, ఎఱుపువర్ణము గలదియు, పెసరగింజంత ప్రమాణముగలదియు నైన పిటిక బొబ్బజనించును. దీనిని ఛేదించిన రక్తము స్రవించును. ఇది పర్వణీరోగ మనఁబడును.

## పూయస్రావరోగము.

పూయాస్రావే మలాస్సాస్రవర్త్మసంధేః కనీనికాత్,
స్రావయంతి ముహుః పూయం సాస్రత్వఙ్మాంసపాకతః. ౬

వాతాదిదోషములు ప్రకోపించి రక్తముతోఁగూడి చర్మరక్తమాంసములను పాకంచేసి రెప్పసంధుల నాశ్రయించి నల్లగ్రుడ్డునుండి పలుమారు చీమును స్రవింపఁజేయును. దీనికి పూయస్రావమను పేరుగలదు.

## పూయాలసరోగము.

పూయాలసో వ్రణస్సూక్ష్మశ్శోఫసంరంభపూర్వకః,
కనీనసంధావాధ్మాయీ పూయాస్రావీ సవేదనః. ౭

నల్లగ్రుడ్డు సంధియందు నుబ్బుగలదిగను, చీమును స్రవింపఁ జేయునదిగను, నొప్పితోఁ గూడినదిగను, చిన్నదిగను వాపుగలదిగను నుండు వ్రణము జనించును. ఇది పూయాలస మనఁబడును.

## అలజీరోగము.

కనీనస్యాంతరలజీ శోఫో రుక్తోదదాహవాన్,

నల్లగ్రుడ్డు మధ్యమునందు నొప్పి పోట్లు మంట వీనితోఁగూడిన వాపు జనించును. ఇది అలజి అని చెప్పఁబడును.

క్రిమిగ్రంథిరోగము.

అపాంగే వా కనీనే వా కండూషాపక్ష్మపోటవాన్. ౮
పూయస్రావీ క్రిమిగ్రంథి ర్గ్రథిక్రిమియుతోఽర్తిమాన్,

కడకంటియందు గాని నల్లగ్రుడ్డుయందు గాని దురద, మంట, ఱెప్పయందు పోట్లు, చీముకారుట, నొప్పి, క్రిములు వీనితోఁ గూడియుండు గ్రంథిజనించును. ఇది క్రిమిగ్రంథి యని చెప్పఁబడును.

వర్త్మసంధిగత రోగ సాధ్యాసాధ్యములు.

ఉపనాహక్రిమిగ్రంథపూయాలసకపర్వణీః ౯
శస్త్రేణ సాధయేత్పంచసాలజీ నాస్రవాంస్త్యజేత్,

ఉపనాహము క్రిమిగ్రంథి పూయాలసకము పర్వణి అనునాల్గుసంధిరోగములను శస్త్రము కర్మచే సాధింపం దగియుండును. జలస్రావము కఫస్రావము రక్తస్రావము పూయస్రావము అలజి అను నీయైదురోగములను చికిత్సయందు వర్జింపవలయును. ఇటుల నేత్రసంధులయందుండు తొమ్మిది రోగములు చెప్పఁబడినవి.

తెల్లగ్రుడ్డునగల్గు రోగములు పదిమూఁడు. అందు శుక్తికారోగము.

పిత్తం కుర్యాత్సితే బిందూనసితశ్యావపీతకాన్. ౧౦
మలాక్తాదర్శతుల్యం వా సర్వం శుక్లం సదాహరుక్,
రోగోఽయం శుక్తికాసంజ్ఞస్సశకృద్భేజ తృడ్జ్వరః. ౧౧

పిత్తము తెల్లగ్రుడ్డునందు నల్లగను, శ్యావవర్ణము గలవిగను, పసుపువర్ణము గలవిగను నుండుబిందువులను చుక్కలుగనుకలుగఁజేయును. లేక కంటిలో తెల్లగనుండు ప్రదేశమంతయు మురికితగిలిన అద్దమువలె మలినముగ జేయును. దీనికి శుక్తికారోగమని పేరు గలదు.మంట, నొప్పి, దప్పి, జ్వరము ఇవి కలిగియుండును.మలము ఉండలుగవెడలును.

శుక్లార్మరోగము

కఫాచ్ఛుక్లే సమం శ్వేతం చిరవృద్ధ్యధిమాంసకమ్,
శు.క్లార్మ

తెల్లగ్రుడ్డునందు సమముగను, తెలుపువర్ణముగలదిగను, చిరకాల ...ండు అధిక మాంసము జనించును. ఇది శుక్లార్మమనఁ

## బలాసగ్రథితరోగము.

శోఫస్త్వరుజస్సవర్ణో బహళో మృదుః. ౧౨
గురు స్స్నిగ్ధోఽంబుబింద్వాభో బలాసగ్రథితం స్మృతమ్,

కఫమువలన నొప్పిలేనిదిగను, సమానవర్ణముగలదిగను, పెద్దదిగను, మృదువుగను, గురువుగను, నున్నగను, జలబిందువుతో తుల్యముగ నుండు వాపు తెల్లగ్రుడ్డునందు జనించును. ఇది బలాసగ్రథితమని ఋషులచే చెప్పఁబడును.

## పిష్టకార్మరోగము.

బిందుభిః పిష్టధవళై రుత్సన్నైః పిష్టకం వదేత్. ౧౩

కఫదోషమువలన తెల్లగ్రుడ్డునందు పిండివలెనుండు తెల్లనిబిందువులు జనించును. ఇది పిష్టకార్మ మనఁబడును.

## సిరోత్పాతరోగము.

రక్తరాజీతతం శుక్లముష్యతే యత్సవేదనమ్,
అశోఫాశ్రూపలేపం చ సిరోత్పాతస్సశోణితాత్. ౧౪

రక్తదోషమువలన తెల్లగ్రుడ్డు ఎఱ్ఱరేఖలతో వ్యాపించినదిగను, మంటయు నొప్పియు గలదిగను, వాపు కంటినీరు ఇవి లేనిదిగను నుండును. ఇది సిరోత్పాతమని చెప్పఁబడును.

## సిరాహర్షరోగము.

ఉపేక్షితస్సిరోత్పాతో రాజీస్తా ఏవ వర్ధయన్,
కుర్యాదస్రం సిరాహర్షం తేనాక్ష్యుద్వీక్షణాక్షమమ్. ౧౫

పైచెప్పిన సిరోత్పాతరోగమునకు చికిత్సజేయక యుపేక్షించినచో నారోగమువలన కంటిగ్రుడ్డునందు జనించియుండు నెఱ్ఱనిరేఖలు వృద్ధిజెంది కంటినుండి విశేషముగ నీరువెడలును. ఇది సిరాహర్షమని చెప్పఁబడును. ఈ రోగముచే నేత్రములయందు గల దృష్టిశక్తియు నశించును.

## సిరాజాలరోగము.

సిరాజాలే సిరాజాలం బృహద్రక్తం ఘనోన్నతమ్,

కంటి తెల్లగ్రుడ్డునందలి సిరలు ఎఱ్ఱగను కఠినములుగను ఉన్నతములుగను పెద్దవిగను నుండును. దీనికి సిరాజాలమను పేరుకలదు.

## శోణితార్మరోగము.

శోణితార్మ సమం శ్లక్ష్ణం పద్మాభమధిమాంసకమ్. ౧౬

సముముగను నున్నగను తామరపువ్వువంటిదిగను నుండు అధికమాంసము కంటితెల్ల గ్రుడ్డునందు జనించును. ఇది శోణితార్మమని చెప్పఁబడును.

### అర్జునరోగము.

నీరుక్ స్లక్ష్ణో ఽర్జునం బిందుశ్శశలోహితలోహితః,

కంటితెల్లగ్రుడ్డునందు కుందేటిరక్తమువలె ఎఱ్ఱగను నున్నగను నొప్పిలేనిదిగను నుండు బిందువు జనించును. దీనిని అర్జునమనియెదరు

### ప్రస్తార్యర్మరోగము.

మృద్వాశువృద్ధ్యరుఙ్మాంసం ప్రస్తారి శ్యావలోహితమ్. ౧౭
ప్రస్తార్యర్మ మలైస్సాస్రైః

తెల్లగ్రుడ్డంతయు వ్యాపించునదిగను, శీఘ్రముగ వృద్ధిజెందునదిగను, నలుపు ఎరుపు వర్ణములు కలదిగను, నొప్పిలేనిదిగను, నిర్మలమైన నీరును వెడలింపఁజేయునదిగను నుండు మాంసము రక్తముతోఁగూడిన త్రిదోషములచే జనించును. దీనిని ప్రస్తార్యర్మయని చెప్పుదురు.

### స్నాయ్వర్మరోగము.

స్నాయ్వర్మ స్నాయుసన్నిభమ్,

తెల్లగ్రుడ్డుపై సన్ననినరములవలె మాంసపు పొర వ్యాపించియున్న నయ్యది స్నాయ్వర్మ మనఁబడును.

దీనిలక్షణము తన్త్రాన్తరమున నిట్లు చెప్పఁబడినది:—"ప్రస్తారిణో ఽర్మణస్స్రావం నిరుణద్ధియదానిలః, వినాస్రావం హి శుష్కం తత్ స్నాయ్వర్మేతి ప్రకీర్తితమ్" ఈశ్లోకముచేత ప్రస్తార్యర్మమను రోగము కంటనీరు స్రవించక వాతముచే నడ్డగింపఁబడి సన్న నినరములఁబోలె మాంసపు పొర తెల్లగ్రుడ్డుపైవ్యాపించిన నదియే స్నాయ్వర్మమని యునది. మాధకకరండును దీని కనుగుణముగ "స్థిరా ప్రస్తాది మాంసాఢ్యం శుష్కం స్నాయ్వర్మ" అని చెప్పెను.

### అధిమాంసార్మరోగము.

శుక్లాసృక్పిండవచ్ఛ్యావం యన్మాంసం బహళం పృథు. ౧౮
అధిమాంసార్మ తత్

తెల్లగ్రుడ్డునందు తెల్లగను కొంచెము నలుపువర్ణముగలదిగను పెద్దదిగను గడ్డకట్టియుండు రక్తమువలెను నుండు మాంసపిండము జనించును, ఇది అధిమాంసార్మ మనఁబడును.

### సిరాజపిటికారోగము.

దాహఘర్షవంత్యస్సిరాన్వృతాః,
కృష్ణాసన్నాస్సిరాసంజ్ఞాః పిటికాస్సర్షపోపమాః. ౧౯

మంట నొప్పిగలవియు, సిరలచే కప్పఁబడినవియు, ఆవగింజంత ప్రమాణముగలవియునైన పిటికలు నల్లగ్రుడ్డుకు సమీపమున తెల్లగ్రుడ్డుపై కలుగును. దీనికి సిరాపిటికలని పేరు.

### శుక్తిసిరాహర్షాదిరోగ చికిత్సాక్రమము.

శుక్తిహర్షసిరోత్పాత పిష్టకగ్రథితార్జునమ్,
సాధయే దౌషధై ష్షట్కం శేషం శస్త్రేణ సప్తకమ్. ౨౦
నవోత్థం తదపి ద్రవ్యైః

పైనచెప్పినప్రకారము కంటితెల్లగ్రుడ్డునందు పదుమూఁడు రోగములు కలుగును. వానిలో శుక్తిక, సిరాహర్షము, సిరోత్పాతము, పిష్టకార్మము, బిలాసగ్రథితము, అర్జునము అను నీ యారురోగములును ఔషధములచే సాధింపఁదగి యుండును. తక్కిన శుక్లార్మము, సిరాజాలము, శోణితార్మము, ప్రస్తార్యర్మము, స్నాయ్వర్మము, అధిమాంసార్మము, సిరాజపిటిక అను నీయేడురోగములును శస్త్రకర్మచే సాధింపఁదగి యుండును. ఈయేడును జనించినతోడనే చికిత్సజేసినయెడ నౌషధములచే సాధింపఁదగియుండును. ఇత్తెఱంగున శుక్లగతరోగములు పదుమూఁడు చెప్పఁబడినవి.

### అర్మరోగచికిత్స.

అర్మోక్తం యచ్చ పంచధా,
తచ్ఛేద్య మసితప్రాప్తం మాంసస్నావసిరావృతమ్. ౨౧
చర్మోద్దాలవదుచ్ఛ్రాయి దృష్టిప్రాప్తం చ వర్జయేత్,

పైనచెప్పియుండు శుక్లార్మ శోణితార్మ ప్రస్తార్యర్మ స్నావార్మ అధిమాంసార్మములను ఐదు అర్మరోగములను శస్త్రముచే ఛేదించి చికిత్స చేయవలయును. మాంస స్నాయు సిరలతో వ్యాప్తమై చర్మమును ఛేదించునట్లు నల్లగ్రుడ్డున జనించురోగములైదు. అందు పొడవుగను నల్లగ్రుడ్డునందుండునదిగను నుండు అర్మరోగములు దృష్టి జేరియుండు అర్మరోగములు. ఈరెండురోగములు అసాధ్యంబు లగుటవలన చికిత్సయందు వర్జింపఁదగినవి. వీనిని శస్త్రముచే చికిత్సఁజేయఁజనదు.

### క్షతశుక్రకరోగలక్షణము

పిత్తం కృష్ణేఽథవా దృష్టౌ శుక్రం తోదాశ్రురాగవత్. ౨౨
ఛిత్త్వా త్వచం జనయతి తేన స్యాత్కృష్ణమండలమ్,
పక్వజంబూనిభం కించిన్నిమ్నం చ క్షతశుక్రకమ్. ౨౩
తత్కృచ్ఛ్రసాధ్యం యాప్యం తు ద్వితీయ పటలవ్యధాత్,
తత్ర తోదాదిబాహుళ్యం సూచీవిద్ధాభకృష్ణతా. ౨౪
తృతీయపటలచ్ఛేదాదసాధ్యం నిచితం వ్రణైః,

పిత్తము ప్రకుపితమై నేత్రములయందలి మొదటిపటలమును ఛేదించుకొని పోట్లు నీరుకారుట యెఱుపువర్ణము వీనితోఁగూడియుండు శుక్రమును నల్లగ్రుడ్డునందుగాని దృష్టియందుగాని కలుగజేయును. దీనిచేత నల్లగ్రుడ్డు పండిన నేరేడుపండుతో తుల్యముగను నడుమ పల్లముగను నగును. ఇది క్షతశుక్రమనఁబడును. ఇది కష్టసాధ్యము. పిత్తము రెండవపటలమును భేదించినచో నల్లగ్రుడ్డునందు పోట్లు మంట నొప్పి మొదలగు నుపద్రవములు విశేషముగ కలుగును నడుమ సూదితో పొడిచినట్లు నల్లగనుండును. పోటునుకల్గును. ఇది యాప్యము. మూఁడవపటలమును ఛేదించినచో నల్లగ్రుడ్డునందు విశేషముగ వ్రణములు కలిగియుండును. ఇది అసాధ్యము.

క్షతశుక్రమనగ వ్రణముతోఁగూడిన శుక్లమని యర్థము. ఇయ్యది ఒకటి, రెండు, మూఁడుపటలముల నాశ్రయించియుండుటచే మూడుతెఱంగులు అవియే పైని వివరింపఁబడినవి.

### శుద్ధశుక్రరోగలక్షణము.

శంఖశుక్రం కఫాచ్ఛ్వేతం నాతిరుక్ఛుద్ధశుక్రకమ్. ౨౫

తెల్లగ్రుడ్డుమధ్యమున కఫదోషముచే కొంచెము నల్లగను శంఖమువలె తెల్లగను కొద్దియుపద్రవములు కలదిగనునుండు శుక్రము (తెల్లనిచుక్క) జనించును. ఇది శుద్ధశుక్రమనఁబడును. శుద్ధశుక్రమన వ్రణముచేతఁ జనించు శుక్లము యెఱుంగునది.

### అజకారోగలక్షణము.

ఆతామ్రపిచ్ఛిలాస్రస్రుదాతామ్రపిటికాతిరుక్,
అజావిట్సదృశోచ్ఛ్రాయకార్ష్ణ్యా వర్జ్యాస్రజాజకా. ౨౬

నల్లగ్రుడ్డు రక్తదోషముచే కొంచె మెఱుపువర్ణముగను జిగటగను నుండు రక్తస్రవింపఁజేయునదియు, ఎఱ్ఱని పిటికలతోఁగూడినదియు విశేషముగ నొప్పి

గలదియు మేఁకపింటికలతో సమానమైన పొడవు నలుపువర్ణము గలదియు నగును. ఇది అజకా యనఁబడును. ఇది చికిత్సయం దసాధ్యము.

సిరాశుక్లరోగలక్షణము

సిరాశుక్రం మలైస్సాస్రైస్సజుష్టం కృష్ణమండలమ్,
సతోదదాహతామ్రాభిస్సిరాభిరవతన్యతే, ౨౭
అనిమిత్తోష్ణశీతాచ్ఛనువాస్రస్రుక్ప త త్త్యజేత్,

వాతాదిత్రిదోషములు దుష్టంబులై రక్తముతోఁగూడి నల్లగుడ్డునందు సిరాశుక్రమను రోగమును కలుగఁజేయును. దీనిచే నల్లగుడ్డు పోట్లు మంట యెఱుపువర్ణము గలతోఁగూడిన సిరలతో కప్పఁబడియుండును. కారణములేకయే యొకానొకపుడు చల్లగ ఒకపుడు వేడిగను ఒకపుడు తేటగను మఱియొకపుడు చిక్కగను నుండు నీరు నల్లగుడ్డునుండి స్రవించును. ఇది యసాధ్యమగుట వలన చికిత్సయందు వర్జింపదగినది.

పాకాత్యయము, అసాధ్యశుక్రరోగములు.

దోషైస్సాస్రైస్సకృత్కృష్ణంనీయతే శుక్లరూపతామ్. ౨౮
ధవళాభ్రోపలిప్తాభం నిష్పావార్ధదళాకృతి,
అతితీవ్రరుజారాగదాహశ్వయథుపీడితమ్. ౨౯
పాకాత్యయేన తచ్ఛుక్రం వర్జయేత్తీవ్రవేదనమ్,
యస్య వా లింగనాశోఽంతశ్శ్యావం యద్వా సలోహితమ్. ౩౦
అత్యుత్సేధావగాఢం వా సాశ్రునాడీవ్రణావృతమ్,
పురాణం విషమం మధ్యే విచ్ఛిన్నం యచ్చ శుక్రకమ్. ౩౧

రక్తముతోఁ గూడియుండు వాతాది త్రిదోషములచే నల్లగుడ్డు తెల్లగను, తెల్లమేఘముచే కప్పఁబడినటులుండినదిగను, అనపపప్పువంటి యాకారము కలదిగను, మైననొప్పి యెఱుపువర్ణము మంట వాపు వీనితోఁ గూడినదిగను నుండును. అధికమువలన మిక్కిలి యుపద్రవమును కలుగజేయును. ఇయ్యది అక్షిపాకాత్యయ మనఁను. దీనిని చికిత్సయందు వర్జింపవలయును.

మఱియు దృష్టినశింపఁజేయు శుక్రరోగము, లోన నలుపువర్ణముగలదియు, లేకవర్ణము గలదియు నగు శుక్రరోగము నడుమ మిక్కిలి యున్నతముగగాని పల్లముగయుండు శుక్రరోగము రక్తముతోఁగూడియుండు నాడీవ్రణముగల శుక్రరోగ ఒక సంవత్సరమునకు పైఁబడినదిగ వికారమైన యాకారముగలదిగ నడుమ విచ్ఛి

న్నముగ నుండు శుక్రరోగము. ఈ శుక్రరోగములను చికిత్సయందు వర్జింపవలయును.

మఱియు అక్షిపాకాత్యయమును మాధవకారుఁడు ఇట్లుచెప్పెను:—

"శ్వేతస్సమాక్రామతి సర్వతోహి దోషేణ యస్యాసిత మణ్డలం చ, తమక్షిపాకాత్యయ మక్షిరోగం సర్వాత్మకం వర్జయితవ్య మాహుః" ఈశ్లోకమునకు పైమూలమునకును అర్థభేదములేదు.

### నల్లగ్రుడ్డునందుజనించు రోగములసంఖ్య.

పంచేత్యుక్తా గదాః కృష్ణే సాధ్యాసాధ్యవిభాగతః,

పైనచెప్పినప్రకారము నల్లగ్రుడ్డునందు జనించునట్టి ఐదుశుక్రరోగములు సాధ్యాసాధ్య విభాగములతోడ జెప్పఁబడినవి.

క్షతశుక్రము, శుద్ధశుక్రము, అజకాజాతము, సిరాశుక్రము, అక్షిపాకాత్యయము నని నల్లగ్రుడ్డున జనించురోగము లైదుగ నెఱుంగునది.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదియవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ఏకాదశాధ్యాయము.



అవ. సంధిసితాసితరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము అట్టిరోగముల చికిత్సలతెలియపరచుటకై సంధిసితారోగప్రతిషేధాధ్యాయముచెప్పఁబడుచున్నయది:—

## సంధిసితాసితరోగప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాత స్సంధిసితాసితరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

సంధిసితాసితరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము నేత్రములయందుగల సంధి, తెల్లగ్రుడ్డు నల్లగ్రుడ్డు వీనియందుజనించెడు రోగములకు చికిత్సలను వివరించుటకై సంధిసితాసితరోగప్రతిషేధమును నీ యధ్యాయమును వివరించెదము.

### ఉపనాహరోగచికిత్స

శ్లో. ఉపనాహం భిషక్స్విన్నం భిన్నం వ్రీహిముఖేన చ,
లేఖయే న్మండలాగ్రేణ తత శ్చ ప్రతిసారయేత్. ౧
పిప్పలీక్షౌద్రసింధూత్థైర్బధ్నీయాత్పూర్వవ త్తతః,
పటోలపత్రామలకక్వాథేనాశ్చ్యోతయేచ్చ తమ్. ౨

వైద్యుఁడుఉపనాహమను సంధిగతనేత్రరోగమునకు సుఖోష్ణోదకములో తడిపి వస్త్రఖండముచే స్వేదకర్మనుచేయించి పిదప దానిని వ్రీహిముఖమను శస్త్రముచే ంచి మండలాగ్రమను శస్త్రముచే గీచవలయును. పిప్పళ్లు, సైంధవలవణము వీనిచూర్ణ ్ తేనెనుకలిపి దానిచే ప్రతిసారణము చేయించవలయును. పిదప వర్త్మరోగము చెప్పియుండునటుల సుఖోష్ణోదకముచే కడిగి ఘృతమును తడిపె తేనె ఘృతము చరిమి చెవులయొక్క ఊర్ధ్వాధోభాగములయందు యవలపిండి యుంటలనునిచి కట్టి పొట్లాను ఉసిరిక వీనినిచేర్చి కాచిన కషాయముచే ఆశ్చ్యోతనము చేయించ యును. జలస్రావము కఫస్రావము అను సంధిరోగము లసాధ్య ములగుటవలన వానికి గ్రకారుఁడు చికిత్సలను చెప్పలేదు.

## పర్వణీరోగచికిత్స.

పర్వణీం బడిశేనాత్తాం బాహ్యాసంధిత్రిభాగతః,
వృద్ధిపత్రేణ వర్ధ్యాఽర్ధే స్యాదశ్రుగతిరన్యథా. ౩
చికిత్సాచార్మవత్క్షౌద్రసైంధవప్రతిసారితా,

పర్వణియను సంధిరోగమును వెలుపలనుండు సంధికి పైని బడిశమను శస్త్రము చే పట్టుకొని వృద్ధిపత్రమను శస్త్రముతో మధ్యభాగమున ఛేదించవలయును. పైనగాని క్రిందఁగాని ఛేదించినచో విశేషముగ నీరుస్రవించును. మఱియు తేనె, సైంధవలవణము వీనిచే ప్రతిసారణము చేయించి అర్మరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## పూయాలసరోగచికిత్స.

పూయాలసే సిరాం విద్ధ్వా తత స్తముపనాహయేత్. ౪
కుర్వీత చాక్షిపాకోక్తం సర్వం కర్మ యథావిధి,

పూయాలసరోగమునందు సిరనువేధించి ఉపనాహస్వేదమును చేయించి అక్షిపాకరోగమునకు చెప్పియుండు చికిత్సలనన్నిటిని విధిప్రకారము చేయవలయును.

## పూయాలసకరోగమునకు చూర్ణాంజనము

సైంధవార్ద్రకకాసీసలోహతామ్రైస్సుచూర్ణితైః. ౫
చూర్ణాంజనం ప్రయుంజీత సక్షౌద్రైర్వా రసక్రియామ్,

పూయాలసక రోగమునందు సైంధవలవణము, అల్లము, కాసీసము, ఉక్కు, రాగి వీనిని చక్కఁగచూర్ణముచేసి చూర్ణాంజనమును ప్రయోగించవలయును. లేక పై సైంధవలవణము మొదలగు వానిచూర్ణములను తేనెలో కలిపి రసక్రియను ప్రయోగించవలయును.

## క్రిమిగ్రంథిరోగచికిత్స.

క్రిమిగ్రంథిం కరీషేణ స్విన్నం భిత్వా విలిఖ్య చ. ౬
త్రిఫలాక్షౌద్రకాసీససైంధవైః ప్రతిసారయేత్,

క్రిమిగ్రంథిరోగమునుభేదించి గోమయాదులచే స్వేదకర్మను చేయించి దానిని వ్రీహిముఖము మొదలగుశస్త్రములచే గీచి పిదప త్రిఫలములు, తేనె, కాసీసము, సైంధవలవణము వీనితోడ ప్రతిసారణమును చేయించవలయును.

### శుక్తిరోగచికిత్స

పిత్తాభిష్యందవచ్ఛుక్తిం

శుక్తియను రోగమునందు పిత్తాభిష్యందరోగమునకు చెప్పియుండు చికిత్సలనే చేయవలయును.

### బలాసగ్రథిత పిష్టకరోగచికిత్స

బలాసాహ్వయపిష్టకౌ. ౭
కఫాభిష్యందవన్మత్వా సిరాఃవ్యధముపాచరేత్,
బీజపూరరసాక్తం చ వ్యోషకట్ఫలమంజనమ్. ౮

బలాసగ్రథితము పిష్టకము ఈ రోగములయందు సిరావేధను వర్జించి కఫాభిష్యందరోగమునకు చెప్పిన తక్కిన చికిత్సలను చేయవలయును త్రికటుకములు, పెద్దలేపు వీనిని మాదీఫలరసముతో చాది అంజనము వేయవలయును.

### బలాసగ్రథితరోగముల కంజనము.

జాతీముకుళసింధూత్థదేవదారుమహౌషధైః,
పిష్టైః పిప్రసన్నయా వర్తిశ్శోఫకండూఘ్నమంజనమ్. ౯

జాజిమొగ్గలు, సైంధవలవణము, దేవదారు, శుంఠి వీనిని ప్రసన్నయను మద్యముతోనూరి కణికలుచేసి చాది నేత్రముల కంజనము వేసికొనిన శోఫ దురద హరించును.

### సిరోత్పాతాదిచికిత్స.

రక్తస్యందవదుత్పాతహర్షజాలార్జునక్రియా,

సిరోత్పాతము, సిరాహర్షము, సిరాజాలము, అర్జునము అను నేత్రరోగములందు రక్తస్యందరోగమునకు చెప్పిన చికిత్సలను చేయవలయును.

### సిరోత్పాతాదిరోగముల కంజనము.

సిరోత్పాతే విశేషేణ ఘృతమాక్షికమంజనమ్. ౧౦
సిరాహర్షే తు మధునా శ్లక్ష్ణఘృష్టం రసాంజనమ్,
అర్జునే శర్కరామస్తు క్షౌద్రైరాశ్చ్యోతనం హితమ్. ౧౧
స్ఫటికః కుంకుమం శంఖో మధుకో మధునాంజనమ్,
మధునా చాంజనం శంఖః ఫేనో వా సితయా సహ. ౧౨

సిరోత్పాతరోగమునందు ఘృతము, తేనె వీనినొకటిగచేర్చి నేత్రములకు అంజనము వేయవలయును. సిరాహర్షరోగమునందు రసాంజనమును తేనెతోచాది అంజనమువేయవలయును. అర్జునరోగమునందు పంచదార పెరుగు మీఁదిమీఁగడ తేనె వీని నొకటిగచేర్చి ఆశ్చ్యోతనమును ప్రయోగించవలయును. లేక స్ఫటికము, కుంకుమపువ్వు, శంఖము, అతిమధురము వీనిని తేనెతోచాదిగాని, లేక సౌవీరాంజనమును తేనెతో చాదిగాని, శంఖమును, లేక సముద్రపు నురుగును చాది పంచదారలో కలిపిగాని నేత్రములకు అంజనము వేయవలయును.

### అర్మరోగచికిత్స

అర్మోక్తం పంచధా తత్తు తనుధూమావిలం చ యత్,
రక్తం దధినిభం యచ్చ శుక్రవత్తస్య భేషజమ్. ౧౩

అయిదువిధములగు అర్మరోగములలో కొంచెముగనుండునదియు, పొగవలె కలకబారియుండునదియు, కొంచెము రక్తవర్ణముగలదియు, పెరుగుతో సమానవర్ణముగలదియునైన అర్మరోగమునందు శుక్రరోగమునకు చెప్పియుండుచికిత్సలను చేయవలయును.

### అర్మరోగమునందు శస్త్రచికిత్స.

ఉత్తానస్యేతరత్స్విన్నం ససింధూత్థేన చాంజితమ్,
రసేన బీజపూరస్య నిమీల్యాక్షి విమర్దయేత్. ౧౪
ఇత్థం సంరోషితాక్షస్య ప్రచలేఽర్మాధిమాంసకే,
ధృతస్య నిశ్చలం మూర్ధ్ని వర్త్మనోశ్చ విశేషతః. ౧౫
అపాంగమీక్షమాణస్య వృద్ధేఽర్మణి కనీనకాత్,
వలీ స్యాద్యత్ర తత్రార్మ బడిశేనావలంబితమ్. ౧౬
నాత్యాయతం ముచుండ్యా వా సూచ్యా సూత్రేణ వా తతః,
సమంతాన్మండలాగ్రేణ మోచయేదథ మోక్షికమ్. ౧౭
కనీనకముపానీయ చతుర్భాగావశేషితమ్,
ఛింద్యాత్కనీనకే రక్షేద్వాహినీ శ్చాశ్రువాహినీః. ౧౮
కనీనకవ్యధాదశ్రు నాడీచాక్ష్ణి ప్రవర్తతే,
వృద్ధేఽర్మణి తథాపాంగాత్పశ్యతోఽస్య కనీనకాత్. ౧౯

అర్మమను నేత్రరోగముగలవానిని వెల్లికిలపరుండబెట్టి ఒకనేత్రమునకు స్వేదకర్మనుచేయించి సైంధవలవణమును మాదీఫలరసముతోచాది అంజనమువేసి కంటిని మూయునటులచేసి చక్కఁగ నలపవలయును. ఇటులచేయుటచే కలఁకబారియుండు నేత్రమునందు

అధిమాంసమును అర్మరోగము చలించును. పిదప ఆరోగియొక్క శిరము కంటిరెప్పలు వీనిని పట్టుకొని కడకంటితో చూచునటులజేసిన వళి (అనఁగా ముడత) బడుస్థలమునందుం డెడి యా అర్మరోగమును బడిశమను శస్త్రముచే పట్టి కొంచె మీడ్చి ముచుండియను నాయుధముచేతగాని సూదిచేతగాని సూత్రముచేతగాని మండలాగ్రమను శస్త్రముచేత గాని నల్లగ్రుడ్డు కపాయముకలుగనియ్యక ఛేదించవలయును. కంటిసిరను వహించునట్టి సిరలయందు గాయముతగలక కాపాడవలయును. అశ్రువాహినీసిరలకు గాయముతగిలిన కండ్లయందు నెల్లపుడు నీరు కారుచుండును. అర్మరోగము కడకంటియందు వృద్ధిజెంది యుండిన నారోగిని నల్లగ్రుడ్డును చూచునటులజేసి ఆరోగమును ఛేదింపవలయును.

## అర్మరోగమునందు సేకాదిక్రమము.

సమ్యక్ఛిన్నం మధువ్యోష సైంధవప్రతిసారితమ్,
ఉష్ణేన సర్పిషాఽసిక్తమభ్యక్తం మధుసర్పిషా. ౨౦
బధ్నీయాత్సేచయేన్ముక్త్వా తృతీయాదిదినేషు చ,
కరంజబీజసిద్ధేన క్షీరేణ క్వథితైస్తథా. ౨౧
సక్షౌద్రైర్ద్వినిశాలోధ్రపటోలీయష్టికింశుకైః,
కురంటముకుళోపేతైర్భూంచేదేవాహ్ని సప్తమే. ౨౨

పైనిచెప్పినప్రకారము అర్మరోగమును చక్కఁగ ఛేదించి తేనె త్రికటుకములు వీనిచే ప్రతిసారణమునుచేయించి సుఖోష్ణముగనుండు నేతిని లేపనముచేసి తేనె నెయ్యి వీనినొకటిగచేర్చి చరిమి కట్టుగట్టవలయును. మూఁడవదినమునంను కట్టునువిడిచి క్రానుగు విత్తులతో కాఁచఁబడిన యావుపాలచేతను, పసుపు, మ్రానిపసుపు, లొద్దుగు, పొట్ల, అతి మధురము, మోదుగు, గోరింటమొగ్గలు వీని నుదకములోవైచి చక్కఁగ కాఁచి చల్లార్చి అందులో కొంచెము తేనెకలిపి దానిచేతను సేకముచేయించవలయును. పిదప కట్టుగట్టి యేడవ దినమునందు కట్టును విడువవలయును.

## హీనాతిచ్ఛేదరోగచికిత్స.

సమ్యక్ఛిన్నే భవేత్స్వాస్థ్యం హీనాతిచ్ఛేదజాన్ గదాన్,
సేకాంజనప్రభృతిభిర్జయేల్లేఖనబృంహణైః. ౨౩

రోగికి అర్మరోగము చక్కఁగ ఛేదింపఁబడియుండినచో స్వస్థత కలుగును. హీన ముగగాని అధికముగగాని ఛేదింపఁబడినచో రోగికి అనేకరోగములు కలుగును; కావున వానికి సేకము అంజనము లేఖనము బృంహణము మొదలగు చికిత్సలను జేయవలయును.

### శుక్లార్మాదిరోగములకంజనము.

సితా * మనశ్శిలైలేయలవణోత్తమనాగరమ్,
అర్ధకర్షోన్మితం తార్క్ష్యం పలార్ధం చ మధుప్లుతమ్. ౨౪
అంజనం శ్లేష్మతిమిరపిల్లశుక్లార్మశోషజిత్,

పంచదార, మణిశిల, ఏలకులు, సైంధవలవణము, శుంఠి ఇవి దినుసుకు అర్ధకర్షము, రసాంజనము అర్ధపలము, ఇటుల వీనిని గ్రహించి నూరి తేనెలో కలిపి కండ్లకు అంజనము వేసిన శ్లేష్మజతిమిరము, పిల్లము, శుక్లార్మ ఈరోగములు హరించును.

### తిమిరరోగమునకు లేఖనాంజనము.

త్రిఫలైకతమద్రవ్యత్వచం పానీయకల్కితామ్. ౨౫
శరావపిహితాం దగ్ధ్వా కపాలే చూర్ణయేత్తతః,
పృథక్శేషౌషధరసైః పృథగేవ చ భావితా. ౨౬
సా మషీ శోషితా పేష్యా భూయో ద్విలవణాన్వితా,
త్రీణ్యేతాన్యంజనాన్యాహ లేఖనాని పరం నిమిః. ౨౭

కరకతాండ్రయుసిరికలలో నేదైననొక ద్రవ్యముయొక్క బెరడును ఉదకముతో నూరి దానిని చిల్లపెంకులోనుంచి పైన మూకుడుమూసి చక్కఁగ కాల్చి యామసిని యెత్తి చూర్ణముచేసి తక్కిన రెండు ద్రవ్యములయొక్క రసములచే ప్రత్యేక ప్రత్యేకముగ భావనచేసి యెండించి దానిని సైంధవలవణము కాచలవణము వీనితోడ చక్కఁగ నూరవలయును. ఇటులనే తాడికాయ, ఉసిరిక వీనిని పైప్రకారము చేయవలయును. ఈ మూడు లేఖనాంజనములు తిమిరరోగమును విశేషముగ పోగొట్టును. అని నిమి చెప్పెను.

### సిరాజాలరోగచికిత్స.

సిరాజాలే సిరాయాస్తు కఠినా లేఖనౌషధైః,
న సిధ్యంత్యర్మవత్తాసాం పిటికానాం చ సాధనమ్. ౨౮

సిరాజాలరోగమునందు కఠినమైనసిరలు లేఖనౌషధములచే శమింపకయుండిన వానికి అర్మరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### శుక్రరోగచికిత్స.

దోషానురోధాచ్ఛుక్రేషు స్నిగ్ధరూక్షం వరాఘృతమ్,
తిక్తమూర్ధ్వమసృక్స్రావో రేకసేకాది చేష్యతే. ౨౯

* మనశ్శిలాశైలః మనశ్శిలా చైలా.

శుక్రరోగములయం దాయాదోషానుగుణముగ ఒకపుడు రూక్షగను మఱియొక పుడు స్నిగ్ధముగను త్రిఫలఘృతమును ప్రయోగించవలయును. మఱియు నారోగమునకు తిక్తకఘృతము నిప్పించుటయేగాక రక్తస్రావము విరేచనము సేకము మొదలగువానిని చేయవలయును.

## క్షతశుక్రరోగచికిత్స

త్రిస్త్రివృద్వారిణా పక్వం క్షతశుక్రే ఘృతం పిబేత్,
సిరయాను హరేద్రక్తం జలౌకోభిశ్చ లోచనాత్. ౩౦
సిద్ధేనోత్పలకాకోళీద్రాక్షాయష్టివిదారిభిః,
ససితేనాజపయసా సేచనం సలిలేన వా. ౩౧
రాగాశ్రువేదనాశాంతౌ పరం లేఖనమంజనమ్,

క్షతశుక్రరోగమునందు తెగడకషాయముతో మూఁడు పర్యాయములు పక్వము చేయఁబడిన ఘృతమును పానము చేయించవలయును. సిరను వేధించిగాని జలగలచేగాని కంటియందుండి దుష్టరక్తమును తీయవలయును. నల్లకలువ, కాకోళి, ద్రాక్ష, అతిమధురము నేలగుమ్మడు వీనితో పక్వముచేయఁబడినదియు, పంచదార చేర్చబడినదియు నైన మేకపాలచేగాని, లేక పైనల్లకలువ మొదలగువానిగూర్చి కాచఁబడిన యుదకముతోఁ గాని సేచనము చేయించవలయును. ఇటులచేసియు కండ్లయందు ఎఱుపువర్ణము నీరు కారుట నొప్పి ఇవి శమించకయుండినచో లేఖనకారిగనుండు నంజనమును ప్రయోగించవలయును.

## క్షతశుక్రహరవర్తి.

వర్తయో జాతిముకుళలాక్షాగైరికచందనైః. ౩౨
ప్రసాదయంతి పిత్తాస్రం ఘ్నంతి చ క్షతశుక్రకమ్,

జాజిమొగ్గలు, లక్క, కావిరాయి, చందనము వీనిని నూరి కణికలుజేసి చాది అంనమువేసిన పిత్తరక్తము క్షతశుక్రంబును హరించును.

## క్షతశుక్రమునకు దంతవర్తి.

దంతైర్దంతివరాహోష్ట్రగవాశ్వాజఖరోద్భవైః. ౩౩
సశంఖమౌక్తికాంభోధిఫేనైర్మరిచపాదికైః,
క్షతశుక్రమపి వ్యాపి దంతవర్తిర్నివర్తయేత్. ౩౪

ఏనుఁగు, పంది, ఒంటె, ఆవు, గుఱ్ఱము, మేఁక, గాడిద, వీనిదంతములు, శంఖు, ముత్యములు, సముద్రపునురుగు, వీనికి నాల్గవభాగము, మిరియాలు, వీనినన్నిటి

నొకటిగచేర్చి నూరి కణికలుజేసిన నది దంతవర్తి యనఁబడును. ఇది నేత్రములయందు వ్యాపింపియుంచు క్షతశుక్రము శుద్ధశుక్రము అనురోగములను పోగొట్టును.

శుక్రరోగమునకు తమాలపత్త్రాదివర్తి.

తమాలపత్త్రం గోదంతశంఖఫేనోఽస్థిగార్ధభమ్,
తామ్రం చ వర్తిమూత్రేణ సర్వశుక్రకనాశినీ. 3౫

కానుగచెట్టుఆకు ఆవుదంతములు శంఖము సముద్రపునురుగు గాడిదె యెముకలు రాగి వీని నావుమూత్రముతో కలిపి చక్కఁగ నూరి కణికచేసి దానిని ప్రయోగించిన శుక్రరోగములన్నియు హరించును.

సర్వశుక్రహరాంజనము.

రత్నాని దంతాశ్శృంగాణి ధాతవస్త్ర్యూషణం త్రుటిః,
కరంజబీజం లశునో వ్రణసాది చ భేషజమ్. 3౬
సవ్రణావ్రణగంభీరత్వక్స్థశుక్రఘ్నమంజనమ్,

ముత్యములు మున్నగు రత్నములు, ఏనుఁగు, మొదలగువాని దంతములు, మేఁక మొదలగువానికొమ్ములు, కావిరాయి మొదలగు ధాతువులు, త్రికటుకములు, ఏలకులు, క్రానుగవిత్తులు, వెల్లుల్లి, స్వర్ణక్షీరి మొదలగు వ్రణహరౌషధులు, వీనినేకముచేసి నూరి అంజనమువేసిన వ్రణముతోఁగూడినదియులేక వ్రణములేనిదియు లోఁతుగనుండునదియు లేక చర్మములోనుండునదియు నైన శుక్రములన్నియు హరించును.

గంభీరశుక్రరోగచికిత్స.

నిమ్నమున్నమయే త్స్నేహపానస్యరసాంజనైః. 3౭
సరుజం నీరుజం తృప్తిపుటపాకేన శుక్రకమ్,

గంభీరమైన (మిక్కిలి లోతునపుట్టిన) శుక్రరోగమును స్నేహపానస్య రసాంజనములచేతను, నొప్పికలదియు నొప్పిలేనిదియునైన శుక్రరోగమును తర్పణపుటపాకములచేతను చికిత్సచేయవలెను.

శుద్ధశుక్రరోగచికిత్స.

శుద్ధశుక్రే నిశాయష్టీసారిబాశాబరాంభసా. 3౮
సేచనం రోధ్రపోటల్యా కోష్ణాంభోమగ్నయాఽథవా,

శుద్ధశుక్రరోగమునకు పసుపు, అతిమధురము, నల్లసుగంధిపాల, తెల్లలొద్దుగు వీనిని నైచికాఁచిన కషాయముచే సేచనము జేయించినను లేక తెల్లలొద్దుగును,వస్త్రంఖం

డములో మూటగట్టి యామూటను ఉదకములోవైచి చక్కగ కాచి దానిచే ఒత్తడము వేయించినను హితముకలుగును.

## శుక్రరోగమునకు మహానీలఘుటికలు.

బృహతీమూలయష్ట్యాహ్వాతామ్రసైంధవనాగరైః. ३౯
ధాత్రీఫలాంబునా పిష్టైర్లేపితం తామ్రభాజనమ్,
యవాజ్యామలకీపత్రైర్బహుశోధూపయేత్తతః. ४०
తత్ర కుర్వీత గుటికాస్తా జలక్షౌద్రపేషితాః,
మహానీలా ఇతి ఖ్యాతాశ్శుద్ధశుక్రహరాః పరమ్. ४౧

పెద్దములకవేళ్లు, అతిమధురము, రాగిపొడి, సైంధవలవణము, శుంఠి వీనిని చక్కగ చూర్ణముచేసి ఉసిరికాయలరసముతోనైనను కషాయముతోనైనను నూరి తామ్రపాత్రకు లేపనముచేసి దానికి యవలు నెయ్యి ఉసిరికయాకు వీనిచే పలుమారు ధూపమువేయవలయును. పిదప దానినెత్తి ఉదకము తేనె వీనితోనూరి ఘుటికలు చేయవలయును ఇవి మహానీలఘుటిక లనఁబడును. శుద్ధ శుక్రరోగమును పోకడచును.

## కఠినశుక్రరోగచికిత్స.

స్థిరే శుక్రే ఘనే చాస్య బహుశోఽపహరేదసృక్,
శిరఃకాయవిరేకాంశ్చ పుటపాకాంశ్చ భూరిశః. ४౨
కుర్యాన్మరిచవైదేహీశిరీషఫలసైంధవైః,
ఘర్షణం త్రిఫలాక్వాథపీతేన లవణేన వా. ४३

కంటిశుక్రరోగము గట్టిగను స్థిరముగనుండిన నట్టిరోగికి పలుమారు రక్తమోక్షణము చేయించి శిరోవిరేచనము శరీరవిరేచనము పుటపాకములు వీనిని పలుమారుచేయించవలయును. మఱియు నాశుక్రరోగమును మిరియాలు, పిప్పళ్లు, దిరిసనపువిత్తులు, సైంధవలవణము వీనిని చూర్ణముచేసి రుద్దవలయును. లేక త్రిఫలకషాయము భావనజేయబడిన సైంధలవణచూర్ణమును రుద్దవలయును.

## కఠినశుక్రరోగమున కంజనయోగములు.

కుర్యాదంజనయోగో వా శ్లోకార్ధగదితావిమౌ,
శంఖకోలాస్థికతకద్రాక్షామధుకమాక్షికైః. ४४
సురాదంతార్ణవమలైశ్శిరీషకుసుమాన్వితైః,

పైనిచెప్పియుండు కఠిన శుక్రరోగమునకు శంఖము, రేగువిత్తులు, చిల్లగింజలు, ద్రాక్షపండు, అతిమధురము, తేనె వీనిని నూరి రుద్దవలయును. మఱియు సురయనుమద్యము, ఏనుఁగుదంతము, సముద్రపునుఱుఁగు, దిరిసనపువ్వు వీనిని నూరి రుద్దవలయును.

## శుక్రరోగహరాంజనము.

ధాత్రీఫణిజ్జకరసే క్షారో లాంగలికోద్భవః. ౪౭
ఉషితశ్శోషితశ్చూర్ణశ్శుక్రహర్షణమంజనమ్,
ముద్గా వా నిస్తుషాః పిష్టాశ్శంఖక్షౌద్రసమాయుతాః. ౪౮
సారో మధూకాన్మధునామజ్జా వాఽక్షాత్సమాక్షికా,

చెక్క చెర్లగడ్డను కాల్చి యాబూడిదెను ఉసిరికపండు, మరువము వీనిరసములలో నానబెట్టి రెండించి చూర్ణముచేసి దానిని అంజనము వేసిన శుక్రరోగము హరించును. పొట్టుతీసిన పెసలు, శంఖము, తేనె వీనినొకటిగచేర్చి నూరి శుక్రరోగమున కంజనము వేయవలయును. లేక అతిమధురసారములో తేనెచేర్చి అంజనము వేయవలయును. తాడి గుజ్జును తేనెలో కలిపి అంజనము వేయవలయును.

## హృష్టశుక్రహరవర్తి.

గోఖురాశ్వోష్ట్రదశనాశ్శంఖః ఫేనస్సముద్రజః. ౪౯
వర్తిరర్జునతోయేన హృష్టశుక్రకనాశినీ,

ఆవు, గాడిదె, గుఱ్ఱము, ఒంటె, వీనిదంతములు, శంఖము, సముద్రపునుఱుగు వీనిని మద్దికషాయముతో నూరి కణికజేసి ప్రయోగించిన శుక్రరోగము హరించును.

## ఉత్పన్నశుక్రాదిచికిత్స.

ఉత్పనం వా సశల్యం వా శుక్రం వాలాదిభిర్లిఖేత్. ౫౦

పొడవుగగాని శల్యముతోగూడిగానియుండు శుక్లరోగమును వెంట్రుకలచే నైనను లేకావు మున్నగువానిచే నైనను గీరవలయును.

## సిరాశుక్రరోగచికిత్స.

సిరాశుక్రే త్వదృష్టిఘ్నే చికిత్సా వ్రణశుక్రవత్,

దృష్టికి చెరుపును గలుగజేయకుండు సిరాశుక్రరోగమునకు వ్రణశుక్రమునకు చెప్పియుండు చికిత్సను చేయవలయును.

## శుక్రరోగమునకు పుండ్రాద్యంజనము.

పుండ్రయష్ట్యాహ్వాకాకోలీ సింహీలోహనిశాంజనమ్. ౫౧
కల్కితం ఛాగదుగ్ధేన సఘృతైర్ధూపితం యవైః,

ధాత్రీపత్రైశ్చ పర్యాయాద్వర్తిర్నేత్రాంజనం పరమ్. ౫౦

పుండ్రము (అనగా పువ్వులగురువెంద), యష్టిమధుకము, కాకోలి, ప్రాకుడు, ఉసుక లేక కృష్ణాగరు, పసుపు, రసాంజనము వీనిని మేకపాలతో నూరి దానికి నేతిలో తడుపబడిన యవలతోను ఉసిరియాకులతోను ధూపము వేయించి కణికలుజేసి నేత్రముల కంజనము వేసిన మిక్కిలి హితము కలుగును.

## అజకారోగచికిత్స

అశాంతావర్మవచ్ఛస్త్రమజకాఖ్యే చ యోజయేత్,

అజకమను నేత్రరోగము సామాన్య చికిత్సలచే శమింపకయుండిన అర్మరోగము నకు చెప్పియుండు శస్త్రచికిత్సను ప్రయోగించవలయును.

## అసాధ్యాజకారోగశమనోపాయము.

అజకాంరూమసాధ్యాయాం శుక్రే౽న్యత్ర చ తద్విధైః. ౫౧
వేదనోపశమం స్నేహపానాసృక్స్రవణాదిభిః,
కుర్యాద్బీభత్సతాం జేతుం శుక్రస్యోత్సేధసాధనమ్. ౫౨

అసాధ్యమైన అజక నేత్రరోగమునకును తదితరములైన యసాధ్యశుక్రరోగములకును స్నేహపాన రక్తమోక్షణాదులచే చికిత్సచేసి ఉపద్రవములను శమింపచేయవలయును. మఱియు నానేత్రరోగములలో కలుగువికారములను పోగొట్టుటకు తగినచికిత్సలను చేయవలయును.

## అసాధ్యశుక్రదోషహరాంజనము.

నారికేళాస్థిభల్లాతతాలవంశకరీరజమ్,
భస్మాద్భిః స్రావయేత్తాభిర్భావయేత్కరభాస్థిజమ్. ౫౩
చూర్ణం శుక్రేష్వసాధ్యేషు తద్వైవర్ణ్యఘ్న మంజనమ్,
సాధ్యేషు సాధనాయాలమిదమేవ చ శీలితమ్. ౫౪

టెంకాయచిప్పలు, జీడిగింజలు, తాటిచిగుళ్లు, వెదురుమొలక వీనిని నిప్పులో చక్కగ కాల్చి యాభస్మము నుదకములోవైచి చక్కగ కలియబెట్టి వడియగట్టి యాయుదకమునందు ఒంటెయెముకలచూర్ణమును భావనజేసి అసాధ్యశుక్రరోగముల కంజనము వేసిన నేత్రమునందు వికారవర్ణము శమించును సాధ్యముగనుండు దృష్టిరోగములయందును నీయంజనమును వేయుచుండిన నవి నివర్తించును.

## అజకరోగమున శస్త్రచికిత్స

అజకాం పార్శ్వతో విద్ధ్వా సూచ్యా విస్రావ్య చోదకమ్,
సమం ప్రపీడ్యాంగుష్ఠేన వసార్ద్రేణానుపూరయేత్. ౫౫

వ్రణం గోమాంసచూర్ణేన బద్ధం బద్ధం విముచ్య చ,
సప్తరాత్రాద్వ్రణే రూఢే కృష్ణభాగే సమే స్థిరే. ౨౬
స్నేహాంజనం చ కర్తవ్యం నస్యం చ క్షీరసర్పిషా,
తథాపి పునరాధ్మానే భేదచ్ఛేదాదికాం క్రియామ్. ౨౭
యుక్త్యా కుర్యాద్యథా నాతిచ్ఛేదేన స్యాన్నిమజ్జనమ్,

అజకరోగమునకు పక్కన సూదిచేపొడిచి చెడ్డనీరును వెడలింపఁజేసి చేతిబొటన వ్రేలికి కొవ్వును బూసికొని దానిని యావ్రేలిచే పిసికి యావ్రణములో గోమాంస చూర్ణమును నిండించి గట్టుగట్టవలయును. ఇటుల పలుమారు చేయుచుండవలయును. ఈ ప్రకారమేడుదినములుచేసిన వ్రణము శమించి నల్లగ్రుడ్డు సమముగను స్థిరముగను నగును. అట్టిసమయమున స్నేహాంజనమును, పాలు నెయ్యి వీనితో నస్యమునుచేయించవలయును. ఈరీతిగ చికిత్సజేసియు నల్లగ్రుడ్డు మరల యుబ్బియుండిన దృష్టికి నాశము కలుగకుండు నటుల ఛేదభేదాది చికిత్సలను గ్రుడ్డు బొత్తుగ చెడకుండునట్లు యుక్తిచే జేయవలయును

శుక్రరోగమున ఘృతపానాద్యావశ్యకము

నిత్యం చ శుక్రేషు ఘృతం యథా స్వం
పానే చ నస్యే చ ఘృతం విదధ్యాత్,
న హీయతే లబ్ధబలా తథాంత
స్తీక్ష్ణాంజనైర్దృక్సతతం ప్రయుక్తైః. ౨౮

శుక్రరోగములకు ఆయారోగమునకు తగినయౌషధులతో పక్వము జేయఁబడిన ఘృతమును పాన నస్యసేచనాదులయందు ప్రయోగించవలయును. ఇటులజేసిన ఘృత పానసేచనాదులచే దృష్టికి బలముకలిగి రోగనివృత్త్యర్థము ప్రయోగించఁబడిన తీక్ష్ణాంజ నాదులచే దృష్టికి హాని కలుగకుండును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదునొకండవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ద్వా ద శా ధ్యా య ము.



అవ. సంధిసితాసితరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము దృష్టిరోగముల్లను నిరూపించుటకై దృష్టిరోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## దృష్టిరోగవిజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో దృష్టిరోగవిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

సంధిసితాసితరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము దృష్టిలో జనించురోగములను తెలియపరచునట్టి దృష్టిరోగవిజ్ఞానీయమను నీయధ్యాయమును వివరించెదము.

### తిమిరరోగ లక్షణము.

సిరానుసారిణి మలే ప్రథమం పటలం శ్రితే,
అవ్యక్త మీక్షతే రూపం వ్యక్తమప్యనిమిత్తతః. ౧
ప్రాప్తే ద్వితీయం పటలమభూతమపి పశ్యతి,
భూతం తు యత్నాదాసన్నం దూరే సూక్ష్మం చ నేక్షతే. ౨
దూరాంతికస్థం రూపం చ విపర్యాసేన మన్యతే,
దోషే మండలసంస్థానే మండలానీవ పశ్యతి. ౩
ద్విధైకం దృష్టి మధ్యస్థే బహుధా బహుధా స్థితే,
దృష్టేరభ్యంతరగతే హ్రస్వవృద్ధవిపర్యయమ్. ౪
నాంతికస్థమధస్సంస్థే దూరగం నోపరిస్థితమ్,
పార్శ్వే పశ్యేన్న పార్శ్వస్థే తిమిరాఖ్యోఽయ మామయః. ౫

వాతపిత్తకఫములలో నేదైన నొకదోషము సిరలనాశ్రయించి నేత్రమునందలి ప్రథమపటలమును జేరినచో అవ్యక్తముగ (సూక్ష్మముగ) నుండురూపము కంటికి కనుపడును. స్పష్టముగనుండురూప మొకానొకపుడు కారణములేకయే కంటి కగుపడును.

దోషము నేత్రమునందలి రెండవపటలము నాశ్రయించి యుండినచో అసత్యముగ (అనఁగా లేకుండునట్టి) వస్తువుకూడ కంటికగుపడును. వాస్తవముగ నుండువస్తువు కడుప్రయత్నముచే కనుపడును. సూక్ష్మమయినవస్తువు సమీపమునందుండినపుడుమాత్రమే కనుపడును. దూరమునందుండిన కనుపడ నేరదు. మఱియు దూరములోనుండువస్తువు సమీపమునందుండునటులను, సమీపమునందుండునది దూరముగనుండునటులను కనుపడును. దోషము గుండ్రముగ రెండవపటలమునాశ్రయించియుండినచో వస్తువులన్నియు గుండ్రముగ కనుపడును. దోషము దృష్టిమధ్యము నాశ్రయించియుండినచో ఒకేవస్తువు రెండు వస్తువులుగ కనుపడును. దోషము దృష్టియందు బహుప్రకారములుగ వ్యాపించియుండినచో ఒకేవస్తువు అనేకవస్తువులవలె కనుబడును. దోషము దృష్టియొక్క లోభాగము నాశ్రయించియుండినచో చిన్నదిగనుండువస్తువు పెద్దదిగను పెద్దదిగనుండువస్తువు చిన్నదిగను కనఁబడును. దోషము దృష్టియొక్క క్రిందిభాగము నాశ్రయించియుండినచో సమీపములోనుండు వస్తువు కనుపడజాలదు. పైభాగము నాశ్రయించియుండినచో దూరములోనుండు వస్తువు కడుపడకయుండును. పార్శ్వముల నాశ్రయించియుండినచో పార్శ్వములోనుండువస్తువు లగపడవు. ఇవియన్నియు తిమిరరోగభేదము లనఁబడును.

### కాచరోగ లక్షణము.

ప్రాప్నోతి కాచతాం దోషే తృతీయపటలాశ్రితే,
తేనోర్ధ్వ మీక్షతే నాధ స్తనుచేలావృతోపమమ్. ౬
యథావర్ణం చ రజ్యేత దృష్టిర్హీయేత చ క్రమాత్,
తథాప్యుపేక్షమాణస్య చతుర్థం పటలంగతః. ౭
లింగనాశం మలః కుర్వ న్ఛాదయేద్దృష్టిమండలమ్,

దోషము నేత్రమునందు మూడవపటలము నాశ్రయించియుండినచో కాచరోగమేజనించును. దీనిచేత నూర్ధ్వభాగమునందలి వస్తువు కనుపడును. అధోభాగమునందలి వస్తువులు కనుపడవు. మఱియు దృష్టి సన్నగనుండువస్త్రముచే కప్పఁబడియుండు నటులనుండును. ఆయాదోషానుగుణమైనవర్ణము దృష్టికిఁ గలుగును. క్రమక్రమముగ దృష్టికి శక్తి తగ్గును. మఱియు దోషము నేత్రములయందలి మూడవపటలము నాశ్రయించి కాచరోగమును కలుగఁజేయునపుడును చికిత్సచేయక యుపేక్షించిన యాదోషము మూడవ పటలమునువదలి నాల్గవపటలమునుజేరి దృష్టిని నశింపఁజేయుచు దృష్టిమండలమును మూసివేయును.

[ఇచ్చట నీవిషయము నెఱుంగునది:— "పంచభూతాత్మికా దృష్టిః మసూరార్ధదలోన్మితః" అను వచనప్రమాణముచే నల్లగ్రుడ్డునడుమ చిరుసెనగగింజలో నర్ధభాగము

వంటి పరిమితియు ఆకృతియుకల్గి పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతముల సారాంశమైనరూపముగల్గి పాంచభౌతికప్రపంచమునందలి రూపముల గ్రహించుశక్తి కల్గిన అవయవవిశేషము దృష్టియని తెలిసెడి. దీనినే కన్నాపయని లోకమున జెప్పెదరు.

అట్టిదృష్టియందు అంతరభాగములు నాల్గుకలవు. అయ్యవి పటలములనిచెప్పఁబడును. అవి యొక్కొకటి దృష్టి పరిమితిలో నైదవభాగమంత పరిమాణముకల్గియుండును. అందొకపటలము తేజస్సునకును జలమునకును ఆధారమైన త్వకు నాశ్రయించియుండును. ఇంకొకటి మాంసము నాశ్రయించియుండును. మూడవది మేదస్సునాశ్రయించియుండును. ఇంకొకటి అస్థి నాశ్రయించియుండును. ఈవిషయమును సుశ్రుతాచార్యు లిట్లుపదేశించిరి:—“తేజోజలాశ్రితంబాహ్యంతేష్వన్యత్పిశితాశ్రితమ్, మేదస్తృతీయంపటలం ఆశ్రితం త్వస్థిచాపరమ్, పఞ్చమాంశ సమందృష్టేః తేషాం బాహుల్యమిష్యతే”

మరియు—“దృష్టే రన్తరమాద్యంతు పటలం సమభిద్రుతాః, ఏకైకమను పద్యన్తే పర్యాయా త్పటలాన్తరమ్” అను విదేహుని వాక్యప్రకారము మిథ్యాహారవిహారములచే ప్రకుపితములైన వాత-పిత్త-కఫ-రక్తములను నాల్గుదోషములు దృష్టి లోభాగమునంగల నాల్గవపటలమును తొలుతఁజేరి చికిత్సఁజేయక యుపేక్షించినచో నానాట క్రముముగ తక్కిన పటలములతో నొక్కొకదానియందును వ్యాపించును. దానంజేసి దృష్టి (చూపు)యందు మార్పుకల్గుచుండును. అట్టి దృష్టిదోషమునకు సామాన్యముగ తిమిరరోగమనిపేరు. అట్టిభేదములే పైశ్లోకములచేతను ‘ప్రాప్నోతి కాచతాం’ ఇవి మున్నగు శ్లోకములచేతను గ్రంథకర్తవివరించెను.

[మరియు:—వాతాదిదోషమును నాల్గు దృష్టియందలి మొదటిరెండుపటములఁజేరినచో తిమిరరోగ మనఁబడును. మూడవపటలమున జేరినపుడు కల్గురోగము కాచమనఁబడును. నాల్గవరోగమునఁ జేరినపుడు లింగనాశమనఁబడును. ఇయ్యవి మూడును వాతాది దోషభేదములచే నొక్కొకటి భేదములు కల్గియుండును. అందు తిమిర-కాచ-లింగనాశములకు వేరుగ సామాన్యలక్షణములు— “సిరానుసారిణి సుతే...ఘాదయేద్దృష్టి మండలమ్” అనుగ్రంథముచే జెప్పఁబడెను. ఆరోగముల మూడింటి విశేషలక్షణములు-“తత్ర వాతేన తిమిరే” అని యుపక్రమించి చెప్పబడెను.]

వాతజతిమిరకాచలింగనాశరోగలక్షణములు.

తత్ర వాతేన తిమిరే వ్యావిద్ధమివ పశ్యతి. ౧
చలావిలారుణాభాసం ప్రసన్నంచేక్షతే ముహుః,
జాలాని కేశాన్మశకా రశ్మీంశ్చోపేక్షతేఽత్ర చ. ౨
కాచీభూతే దృగరుణా పశ్యత్యాస్యమనాసికమ్,

చంద్రదీపాద్యనేకత్వం వక్రమృజ్వపి మన్యతే. ౧౦
వృద్ధః కాచో దృశం కుర్యా ద్రజోధూమావృతామివ,
స్పష్టారుణాభాం విస్తీర్ణాం సూక్ష్మాం వా హతదర్శనామ్. ౧౧
స లింగనాశో-

పైనిచెప్పిన తిమిరరోగములలో వాతమువలన జనించిన తిమిరరోగమునందు వస్తువులన్నియు వ్యావిద్ధములుగను (అనఁగా వంకరగను) చంచలములుగను కలఁకఁబారినదిగను ఎఱ్ఱగను ఒకపుడు నిర్మలముగను కనుపడును. జాలము వెంద్రుకలు దోమలు సూర్యరశ్మి ఇవి పలుమారు కంటికగపడును. దీనిని చికిత్సచేయక యుపేక్షించినచో కాచరోగము జనించును. ఆకాచరోగమునందు దృష్టి యెఱ్ఱగనగును. ముఖము నాసికారహితముగ కనుపడును. చంద్రుఁడు దీపము మొదలగునవి అనేకములుగను, వంకరగ నుండునట్లును వంకరలేనట్లుగను కనుపడును. కాచము వృద్ధిజెందినయెడల దృష్టి దుమ్ము పొగ వీనిచే కప్పఁబడియుండు నటులను ఎఱ్ఱగను విస్తీర్ణముగను సూక్ష్మముగను దర్శనశక్తిరహితముగను నగును. ఇది వాతజలింగ నాశమనఁబడును. "లింగ్యతే అనేన లింగనాశః" అను వ్యుత్పత్తిచే జ్ఞానమునకు సాధనమైన చూపు లింగనాశమనఁబడును.

గంభీరదృష్టి లక్షణము.

వాతే తు సంకోచయతి దృక్సిరాః,
దృఙ్మండలం విశత్యంతర్గంభీరా దృగసౌ స్మృతా. ౧౨

ప్రకోపించిన వాతము సిరలనాశ్రయించి దృష్టిలోనుండు సిరలను సంకుచితంబులుగజేయును. దీనిచేత దృష్టిమండలము లోభాగమునుజెందును. ఇది గంభీరదృష్టియని ఋషులచే చెప్పఁబడును.

పిత్తజతిమిరకాచలింగనాశలక్షణములు.

పిత్తజే తిమిరే విద్యుత్ఖద్యోతోద్యోతదీపితమ్,
శిఖితిత్తిరిపిచ్ఛాభం ప్రాయో నీలం చ పశ్యతి. ౧౩
కాచే దృ క్కాచనీలాభా తాదృగేవ చ పశ్యతి.
అర్కేందుపరివేషాగ్ని మరీచీంద్రధనూంషి చ. ౧౪
భృంగనీలా నిరాలోకా దృక్స్నిగ్ధా లింగనాశతః,

పిత్తమువలన జనించిన తిమిరరోగమునందు మెఱుము సూర్యుఁడు వీనిప్రకాశముచేత తళుకుగ వస్తువులు కప్పఁబడినటులను, నెమలి తిత్తిరిపక్షి వీనిరెక్కలవలెను, నల్లగను కనుపడును. దీనిని చికిత్సింపకయుండిన కాచరోగము కలుగును. కాచరోగమున దృష్టి నల్లపూసలవంటి కాంతిగలదిగ నగును. ఇంద్రసూర్యపరివేషములు అగ్నిజ్వాలలు

ఇంద్రధనుస్సు నివి యన్నియు నల్లపూసలవలె కనుపడును. కాచరోగము వృద్ధిజెంది నచో దృష్టినశించును. దీనివలన దృష్టి తుమ్మెదవలె నల్లగను, దృష్టిశక్తిలేనిదగను స్నిగ్ధముగ నగును. ఇది పైత్తిక లింగనాశము.

## హ్రస్వదృష్టి పిత్తవిదగ్ధదృష్టిలక్షణములు.

దృష్టిః పిత్తేన హ్రస్వాఖ్యా సా హ్రస్వా హ్రస్వదర్శనా. ౧౫
భవేత్పిత్తవిదగ్ధాఖ్యా పీతా పీతాభదర్శనా,

పిత్తదోషముచే దృష్టి చిన్నదిగను స్వల్పచూపు గలదిగను ఉండును. ఇది హ్రస్వదృష్టి యనఁబడును. మఱియు పిత్తముచే దృష్టి పసుపువర్ణముగలదియు వస్తువులను పసుపువంటివర్ణముగ గ్రహించునదియునై యుండును. ఇది పిత్తవిదగ్ధయని చెప్పఁబడును.

## కఫజతిమిరకాచ లింగనాశలక్షణములు.

కఫేన తిమిరే ప్రాయ స్స్నిగ్ధం శ్వేతం చ పశ్యతి. ౧౬
శంఖేందుకుందకుసుమైః కుముదైరివ చాచితమ్,
కాచే తు నిష్ప్రభేంద్వర్క ప్రదీపాద్యైరివాచితమ్. ౧౭
సితాభా సా చ దృష్టి స్స్యా ల్లింగనాశే తు లక్ష్యతే,
మూర్తః కఫో దృష్టిగత స్స్నిగ్ధో దర్శననాశనః. ౧౮
బిందుర్జలస్యేవ చలః పద్మినీపుటసంస్థితః,
ఉష్ణే సంకోచమాయాతి ఛాయాయాం పరిసర్పతి. ౧౯
శంఖకుందేందుకుముదస్ఫటికోపమశుక్లిమా,

కఫమువలన తిమిరరోగము జనించినచో రూపము స్నిగ్ధముగను, తెల్లగను, శంఖము చంద్రుఁడు మొల్లపువ్వు తెల్లకలువ వీనిచే కప్పఁబడియుండునటులను కనుపడును. దీనికి చికిత్సచేయకుండినచో కఫము మూఁడవపటలమునజేరి కాచరోగము జనించును. దానియందు వస్తువులు కాంతిరహితములైన చంద్రసూర్య దీపాదులచే కప్పఁబడినటుల కనుపడును. కఫజలింగ నాశమున దృష్టి తెల్లగనగును. కఫము గట్టిగ ఉంటగ పరిణమించి దృష్టిమధ్యమును జెంది దృష్టిని నశింపఁజేసి తామరాకు నడుమనుండు జలబిందువువలె చలించుచుండును. మఱియు నాకఫము ఎండయందు సంకోచమును జెందుచు నీడయందు ప్రసరించుచు శంఖము మొల్లపువ్వు చంద్రుఁడు తెల్లకలువ స్ఫటికము వీనివలె తెల్లగనుండును.

## రక్తజతిమిరలింగనాశలక్షణములు.

రక్తేన తిమిరే రక్తం తమోభూతం చ పశ్యతి, ౨౦

కాచేన రక్తా కృష్ణా వా దృష్టి స్తాదృక్చ పశ్యతి,
లింగనాశేఽపి తాదృగ్ద్రు జ్ఞేః ప్రభా హతదర్శనా. ౨౧

రక్తదోషమువలన జనించిన తిమిరరోగమునందు వస్తువులు ఎఱ్ఱగను చీఁకటిగ్రమ్మి నటులను కనుపడును. దీనికి చికిత్సచేయకుండిన నారక్తము మూఁడవపటలమున జేరి యా రోగము కాచముగ పరిణమించును. దీనియందు దృష్టి యెఱ్ఱగగాని నల్లగగాని యగును. వస్తువులు ఎఱ్ఱగగాని నల్లగగాని కనుపడును. దీని నుపేక్షించినచో రక్తము నాల్గవపటలమునజేరి లింగనాశమును గల్గించును. అట్టి రక్తజలింగనాశమున దృష్టి యెఱ్ఱగగాని నల్లగగాని కాంతిరహితంబై దర్శనశక్తి లేనిదిగ నగును.

## సంసర్గసన్నిపాతజ తిమిరాదిరోగలక్షణములు.

సంసర్గసన్నిపాతేషు విద్యాత్సంకీర్ణలక్షణాన్,
తిమిరాదీనకస్మాచ్చ తైస్స్యాద్వ్యక్తాకులేక్షణమ్. ౨౨
తిమిరే శేషయోర్దృష్టౌ చిత్రో రాగః ప్రజాయతే,

సంసర్గసన్నిపాతమువలన జనించిన తిమిర కాచ లింగనాశ రోగములయందు వాతాదిజనిత తిమిరాది రోగములకు వేరువేర జెప్పిన లక్షణములన్నియు కలిసియుండును. వానిచే దృష్టి యొకానొకపుడు కలఁకఁబారినదియు మఱియొకపుడు నిర్మలముగ నుండునదియు నగును. సంసర్గసన్నిపాతమువలన జనించిన కాచ లింగ నాశరోగములయందు దృష్టిలో విచిత్రమైన యెఱుపువర్ణము కలిగియుండును.

## నకులాంధ్య లక్షణము.

ద్యోత్యతే నకులస్యేవ యస్య దృఙ్నిచితా మలైః. ౨౩
నకులాంధస్స తత్రాహ్నా చిత్రం పశ్యతి నో నిశి,

మనుజునియొక్క దృష్టి వాతాదిదోషములచే వ్యాపింపఁబడి ముంగిస నేత్రమువలె జ్వలింపుచుండును. అట్టిమనుజుని నకులాంధుఁడని చెప్పుదురు. వానికి పగటియందు రూపములు విచిత్రములుగ కనుపడును. రాత్రులయందు రూపములే కనుపడవు.

## దోషాంధ లక్షణము

అర్కేఽస్తమస్తకన్యస్తగభస్తౌ స్తంభతాం గతాః. ౨౪
స్థగయంతి దృశం దోషా దోషాంధస్స గదోఽపరః,
దివాకరకరస్పృష్టా భ్రష్టా దృష్టిపథాన్మలాః. ౨౫
విలీనలీనా యచ్ఛంతి వ్యక్తమత్రాహ్ని దర్శనమ్,

సూర్యుఁడస్తమించినచో దోషములు స్తబ్ధములై దృష్టినిగప్పును. అట్టిరోగము దోషాంధమని చెప్పబడును. ఆరోగము గలవానికి దృష్టి నాశ్రయించియుండు దోష

ములు పగటియందు సూర్యకిరణసంబంధముచే కరిగి దృష్టిలోనుండి జారిపోవును. అందు వలన పగటియందు రూపములు ప్రకాశముగ కనుపడును. దీనినే రేజీకటియని లోకమున జెప్పెదరు.

ఉష్ణవిదగ్ధదృష్టి లక్షణము.

ఉష్ణతప్తస్య సహసా శీతవారినిమజ్జనాత్. ౨౬
త్రిదోషరక్తసంపృక్తో యాత్యూష్మోర్ధ్వం తతోఽక్షిణీ,
దాహోష్మే మలినం శుక్లమహన్యావిలదర్శనమ్. ౨౭
రాత్రౌ చాంధ్యం చ జాయేత విదగ్ధోష్ణేన సా స్మృతా,

ఎండలో డస్సిన మనుజుండు తోడనే శీతోదకములో స్నానము చేయుట వలన ఉష్ణము త్రిదోషరక్తములతోఁజేరి కంటియందు ప్రవేశించును. దానివలన నేత్రముల యందు మంట, తాపమును కలుగును. తెల్లగ్రుడ్డు కలఁకఁబారియుండును. పగటియందు వస్తువులు దుమ్ముచే కప్పఁబడినటుల కనుపడును. రాత్రులయందు గ్రుడ్డితనము కలుగును. దీనికి ఉష్ణవిదగ్ధ దృష్టియని పేరు.

విదగ్ధామ్లదృష్టి లక్షణము

భృశమమ్లాశనాద్దోషైస్సాస్రైర్యా దృష్టిరాచితా. ౨౮
సక్లేదకండూకలుషా విదగ్ధామ్లేన సా స్మృతా,

మిక్కుటముగ పులుసును భుజించుటవలన వాతాదిదోషములు ప్రకోపించి రక్తముతోఁజేరి దృష్టినికప్పికొనును. అందువలన దృష్టి నీరుకారుట దురద వీనితోఁగూడినదియు కలఁకబారినదియు నగును. దీనికి అమ్లవిదగ్ధదృష్టియని పేరు.

ధూమరరోగ లక్షణము.

శోకజ్వరశిరోరోగ సంతప్తస్యానిలాదయః. ౨౯
ధూమావిలాం ధూమదర్శాం దృశం కుర్యుస్సధూమరః,

శోకము జ్వరము తలనొప్పి వీనిచే పీడింపఁబడియుండు మనుజునికి వాతాదిదోషములు ప్రకోపించి దృష్టిని పొగవలె కలఁకఁబారినదిగ జేసి దృష్టిశక్తిని నశింపఁజేయును. దీనిచేత వస్తువులు పొగకమ్మినటుల కనుపడును. ఇది ధూమరరోగమనఁబడును.

ఔపసర్గికలింగనాశ లక్షణము.

సహసైవాల్పసత్వస్య పశ్యతో రూప మద్భుతమ్. ౩౦
భాస్వరం భాస్కరాదిం వా వాతాద్యా నయనాశ్రితాః,
కుర్వంతి తేజస్సంశోష్య దృష్టిం ముషితదర్శనామ్. ౩౧

వైడూర్యవర్ణాం స్తిమితాం ప్రకృతిస్థామివాన్యథామ్,
ఔపసర్గికఇత్యేష లింగనాశః.

దుర్బలుఁడుగనుండు మనుజుఁడు బలాత్కారముగ ఆశ్చర్యకరమైన రూపమును, లేక మిగుల ప్రకాశము గలరూపమును, లేక చంద్రసూర్యాది తేజస్సులను చూచినచో వానికి వాతాదిదోషములు ప్రకోపించి నేత్రముల నాశ్రయించి తేజస్సును మాన్పి దృష్టిని చెఁచుట యేగాక వైడూర్యముతో సమానవర్ణముగలదిగను స్తబ్ధముగను పీడారహితముగను జేయును దీనికి ఔపసర్గికలింగనాశమని పేరు.

## సాధ్యాసాధ్యయాప్యదృష్టిరోగములు.

అత్రవర్జయేత్. 32

వినా కఫా ల్లిఙ్గనాశాన్ గంభీరాం హ్రస్వజామపి,
షట్కాచా నకులాంధశ్చ యాప్యాశ్శేషాం స్తుసాధయేత్. 33
ద్వాదశేతి గదా దృష్టౌ నిర్దిష్టాస్సప్తవింశతిః,

పైనచెప్పిన నేత్రరోగములలో వాత, పిత్త, సంసర్గ, సన్నిపాత, రక్తజనితలింగనాశరోగములు; ఔపసర్గిక లింగనాశరోగము; హ్రస్వదృష్టి; గంభీరదృష్టి ఇవి అసాధ్యంబు లగుటవలన వానిని చికిత్సయందు వర్జింపవలయును. వాతజ, పిత్తజ, కఫజ, రక్తజ, సంసర్గజ, సన్నిపాతజ కాచరోగములు, నకులాంధరోగము నీయేడురోగములు యాప్యంబులు. వాతజ, పిత్తజ; కఫజ, రక్తజ, సంసర్గజ, సన్నిపాతజ తిమిరరోగములు, కఫజ లింగనాశము, పిత్తవిదగ్ధరోగము, దోషాంధము, ఉష్ణవిదగ్ధము, విదగ్ధామ్లము, ధూమరము అను పండ్రెండు నేత్రరోగములు సుఖసాధ్యంబులు. ఇటుల దృష్టిమండలము నాశ్రయించియుండు ఇరువదియేడు రోగములు చెప్పఁబడినవి.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పండ్రెండవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# త్రయోదశాధ్యాయము.



అవ. దృష్టిరోగవిజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము దృష్టిరోగములలో జేరిన రోగములను చికిత్సలను తెలియపఱచుటకై తిమిరరోగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది. (కాచాదిరోగముల చికిత్సలును ఈయధ్యాయముననే చెప్పఁబడును లింగనాశరోగములచికిత్సలు బాహుళ్యముగ నుండుటంజేసి ఆట్టి చికిత్సలకై ప్రత్యేకముగ లింగనాశప్రతిషేధాధ్యాయము దీనివెంటనే చెప్పఁబడును):—

## తిమిరరోగ ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

౧. అథాత స్తిమిరరోగ ప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

దృష్టిరోగ విజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము తిమిరరోగచికిత్సలను తెలియపఱచుటకు గాను తిమిరరోగప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

తిమిరరోగచికిత్సావశ్యకత్వము.

తిమిరం కాచతాం యాతి కాచోఽప్యాన్ధ్య ముపేక్షయా,
నేత్రరోగే ష్వతో ఘోరం తిమిరం సాధయే ద్ద్రుతమ్. ౧

తిమిరరోగమునకు చికిత్సచేయక యుపేక్షించినయెడ కాచరోగముగ పరిణమించును. దానికి చికిత్సచేయకుండిన గ్రుడ్డితనము కలుగును. కావున నేత్రరోగములయందు దారుణమైన తిమిరరోగమునకు శీఘ్రముగ చికిత్సచేయవలెను.

తిమిరరోగమునకు జీవంత్యాదిఘృతము.

తులాం పచేత జీవంత్యా ద్రోణేఽపాం పాదశేషితే,
తత్క్వాథే ద్విగుణం క్షీరం ఘృతప్రస్థం విపాచయేత్. ౨
ప్రపౌండరీకకాకోలీపిప్పలీలోధ్రసైంధవైః,
శతాహ్వామధుకద్రాక్షాసితాదారుఫలత్రయైః. ౩
కార్షికై ర్నిశి తత్పీతం తిమిరాపహరం పరమ్,

ద్రాక్షాచందనమంజిష్ఠాకాకోలీద్వయజీవకైః. ౪
సితాశతావరీమేతాపుండ్రాహ్వామధుకోత్పలైః,
పచే జ్జీర్ణం ఘృతప్రస్థం సమక్షీరం పిచూన్మితైః. ౫
హంతి తత్కాచతిమిరరక్తరాజీశిరోరుజః,

పిన్నమనుబాల నూరుపలములను ద్రోణప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో ఘృతము ఒక ప్రస్థము, ఆవుపాలు రెండు ప్రస్థములు కలిపి ప్రపౌండరీకము (కర్పూరపుబెండ), కాకోళి, పిప్పళ్లు, గొద్దుగు, సైంధవలవణము, సదాప, అతిమధురము, ద్రాక్ష, పంచదార, దేవదారుచెక్క, త్రిఫలములు వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి నూరి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిని రాత్రులయందు పానముచేయించిన తిమిరరోగములు నిశ్శేషముగ హరించును. మఱియు ద్రాక్ష, చందనము, మంజిష్ఠ, కాకోళి, క్షీరకాకోళి, జీవకము, సితా (అనఁగా పంచదార), పిల్లిపీఁచర, మేద, పుండ్రాహ్వము (అనఁగా పువ్వుల గురివెంద), అతిమధురము, నల్లకలువ వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి నూరి ఒకప్రస్థము ప్రాతఆవునేతిలో కలిపి అందులో ఒకప్రస్థము ఆవుపాలుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి స్నానముచేయించిన కాచము, తిమిరరోగము, రక్తరాజి (యెఱ్ఱనిరేఖలు), తలనొప్పి ఈరోగములు హరించును.

### పటోలాద్యఘృతము.

పటోలనింబకటుకాదార్వీ సేవ్యవరావృషమ్. ౬
సధన్వయాసత్రాయంతీపర్పటం పాలికం పృథక్,
ప్రస్థమామలకానాం చ క్వాథయేన్నల్వణేఽంభసి. ౭
తదాఢకేఽర్ధపలికైః పిష్టైః ప్రస్థం ఘృతాత్పచేత్,
ముస్తభూనింబయష్ట్యాహ్వ కుటజోదీచ్యచందనైః. ౮
సపిప్పలీకైస్తత్సర్పిర్ఘ్రాణకర్ణాస్యరోగజిత్,
విద్రధిజ్వరదుష్టార్శోవిసర్పాపచికుష్ఠనుత్. ౯
విశేషాచ్ఛుక్రతిమిరనక్తాంధ్యోష్ణాస్రదాహనుత్,

చేదుపొట్ల, వేము, కటుకరోహిణి, మ్రానిపసుపు, వట్టివేరు, త్రిఫలములు, అడ్డసరము, రేఁగటిమాలగోవిల, కలుక్రానుగు, పర్పాటకము ఇవి దినుసుకు ఒకపలము. ఉసిరికవరుగుఒక ప్రస్థము, ఇటుల వీనిని గ్రహించి ద్రోణప్రమాణ ముదకములోవైచి

వక్కఁగకాఁచి అఢకప్రమాణ మాకషాయమునెత్తుకొని అందులో తురగముస్తలు; వేల వేము, అతిమధురము, కొడిసె, కురువేరు, చందనము, పిప్పళ్లు ఇవి దినుసుకు అరపలము చొప్పునగ్రహించి నూరి కలిపి దానిలో ఒకప్రస్థ మావునేతినిచేర్చి విధిప్రకారము పక్వ ముచేసి పానముచేయించిన విద్రధి, జ్వరము, దుష్టవ్రణములు, విసర్పము, అపచి, కుష్టు వు, ముఖరోగములు, నాసికారోగములు, కర్ణరోగములు ఇవి నివర్తించును. ఇది పటో లాద్యఘృత మనఁబడును. ఈఘృతము శుక్రము, తిమిరము, రేచీఁకటి, ఉష్ణవిదగ్ధము, అమ్లవిదగ్ధము, కండ్లుమంట అను నీనేత్రరోగములను నిశ్శేషముగ పోకడచును.

## త్రిఫలాఘృతము.

త్రిఫలాష్టపలం క్వాథ్యం పాదశేషం జలాఢకే. ౧౦
తేన తుల్యపయస్కేన త్రిఫలాపలకల్కవాన్,
అర్ధప్రస్థో ఘృతాత్సిద్ధస్సితయా మాక్షికేణ వా. ౧౧
యుక్తం పిబేత్తత్తిమిరీ తద్యుక్తం వా వరారసమ్,

త్రిఫలములు ఎనిమిదిపలములను ఆఢకప్రమాణ ముదకములోవైచి పాదావశేష ముగ కషాయముకాచి దానికి సమముగ ఆవుపాలనుచేర్చి అందులో త్రిఫలకల్కము ఒకపలము ఆవునెయ్యి అర్ధప్రస్థముకలిపి విధిప్రకారము పక్వముచేసి అందులో పంచ దారచేర్చిగాని, తేనెచేర్చిగాని తిమిరరోగికి పానము చేయించవలయును. ఇది త్రిఫలా ఘృత మనఁబడును. ఈఘృతమును త్రిఫలకషాయములోకలిపి దోషమూహ్యాదుల వను సరిం తిమిరరోగికి పానము చేయించవలయును.

## మహాత్రైఫలఘృతము

యష్టీమధుద్వికాకోలీవ్యాఘ్రీకృష్ణామృతోత్పలైః. ౧౨
పాలికైస్ససితాద్రాక్షై ర్ఘృతప్రస్థం పచేత్సమైః,
అజాక్షీరవరావాసా మార్కవస్వరసైః పృథక్. ౧౩
మహాత్రైఫలమిత్యేతత్పరం దృష్టివికారజిత్,

మేఁకపాలు ఒకప్రస్థము, త్రిఫలకషాయము ఒకప్రస్థము, అడ్డసరస్వరసము ఒక ప్రస్థము, గుంటగలగరస్వరసము ఒకప్రస్థము, ఆవునెయ్యి ఒకప్రస్థము ఇటుల వీనినేకము చేసి అందులో అతిమధురము, కాకోళి, క్షీరకాకోళి, వాకుఁడు, పిప్పళ్లు, తిప్పతీఁగె, కల్లకలువ, పంచదార, ద్రాక్ష వీనిని దినుసుకు ఒకపలముచొప్పున గ్రహించి నూరి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది మహాత్రైఫలఘృత మనఁబడును. ఈఘృతము దృష్టిరోగమును నిశ్శేషముగ పోకడచును.

## తిమిరరోగమున త్రిఫలోపయోగము.

త్రైఫలేనాథ హవిషా లిహన్త్రిఫలాం నిశి. ౧౪
యష్టీమధుకసంయుక్తాం మధునా చ పరిప్లుతామ్,
మాసమేకం హితాహారః పిబన్నామలకోదకమ్. ౧౫
సౌపర్ణం లభతే చక్షురిత్యాహ భగవాన్నిమిః,

త్రిఫలాఘృతములో త్రిఫలములు, అతిమధురము వీనిని చూర్ణముచేసి కలిపి అందులో తేనెబోసి దానిని ఒక మాసమువరకు రాత్రులయందు సేవింపుచు హితాహారములను భుజింపుచు ఉసిరికకషాయమును పానము చేయుచునుండిన గరుడునివంటి దూరదృష్టి నేత్రములను కలుగునని త్రికాలజ్ఞానసంపన్నుఁడైన నిమిచక్రవర్తిచెప్పెను.

తాప్యాయో హేమయష్ట్యాహ్వ సితాజీర్ణాజ్యమాక్షికైః. ౧౬
సంయోజితా యథాకామం తిమిరఘ్నీ వరావరా,

ధాతుమాక్షికము, ఉక్కు, బంగారు, అతిమధురము, పంచదార, ప్రాతనెయ్యి, తేనె వీనితోడ త్రిఫలములు న్యాయాదోషానుగుణముగ సేవించిన తిమిరరోగమును హరించును.

## తిమిరరోగికి త్రిఫలకషాయపానము.

సఘృతం వా వరాక్వాథం శీలయే త్తిమిరామయీ. ౧౭
అపూపసూపసక్తూన్ వా త్రిఫలాచూర్ణసంయుతాన్,

తిమిరరోగముగలవాఁడు త్రిఫలకషాయములో నెయ్యినికలిపి పానముచేయవలయును; లేక భక్ష్యము పప్పుసత్తుపిండి వీనిలో త్రిఫలముల చూర్ణమునుకలిపి భక్షింపవలయును.

## తిమిరరోగికి త్రిఫలపాయసాద్యుపయోగము

పాయసం వా వరాయుక్తం శీతం సమధుశర్కరమ్. ౧౮
ప్రాత ర్భక్తస్య వా పూర్వమద్యాత్పథ్యాం పృథక్ పృథక్,
మృద్వీకాం శర్కరాక్షౌద్రైస్సతతం తిమిరాతురః. ౧౯

తిమిరరోగముగలవాఁడు ప్రాతఃకాలమునందు పాయసములో త్రిఫలములు, తేనె, శర్కర వీనినిచేర్చి పాయసము చల్లారినపిదప భుజింపవలయును; లేక యాహారమునకు

యందు కరక్కాయనుగాని ద్రాక్షనుగాని శర్కర, తేనె వీనితోడ వెవ్వేరుగ ప్రతిదినము సేవించుచుండవలయును.

## తిమిరరోగహరచూర్ణాంజనము.

స్రోతోజాంశాం శ్చతుష్షష్టిం తామ్రాయోరూప్యకాంచనైః,
యుక్తాన్ ప్రత్యేకమేకాంశై రంధమూషోదరస్థితాన్. ౨౦
ధ్మాపయిత్వా సమావృత్తం తత స్తచ్చ నిషేచయేత్,
రసస్కంధకషాయేషు సప్తకృత్వః పృథక్పృథక్. ౨౧
వైడూర్యముక్తాశంఖానాం త్రిభిర్భాగై ర్యుతం తతః,
చూర్ణాంజనం ప్రయుంజీతతత్సర్వాం తిమిరాపహమ్. ౨౨

సౌవీరాంజనము (సుర్మారాయి) అరువదినాల్గు భాగములు, రాగి, ఉక్కు, వెండి, బంగారు ఇవి ప్రత్యేక మొక్కొకభాగము, ఇటుల వీనిని మూసలోనుంచి కరిగించి మధుకాదిగణ ద్రవ్యకషాయములో నొక్కొక కషాయమున వేరువేరుగ ముంచవలయును. ఇటుల ఏడు పర్యాయములు చేయవలయును. పిదప దానిలో (స్రోతోంజనాదులలో) వైడూర్యము, ముత్యములు, శంఖము వీనిని దినుసు కొకభాగముచొప్పున చేర్చి చక్కగ చూర్ణము చేయవలయును. ఇది చూర్ణాంజన మనఁబడును. దీనిని ప్రయోగించిన తిమిర రోగములన్నియు నివర్తించును.

## తిమిరార్మాది నేత్రరోగహరాంజనము.

మాంసీత్రిజాతకాయఃకుంకుమనీలోత్పలాభయాతుత్థైః,
సితకాచశంఖఫేనకమరిచాంజన పిప్పలీమధుకైః. ౨౩
చంద్రేఽశ్వినీసనాథే సుచూర్ణితై రంజయేద్యుగళమక్ష్ణోః,
తిమిరార్మరక్తరాజీకండూకాచాదిశమమిచ్ఛన్. ౨౪

తిమిరము, అర్మము, రక్తరాజి, దురద, కాచము మొదలగు నేత్రరోగములను తొలఁగింపఁగోరునట్టి కిచ్ఛగలవారు, జటామాంసి, త్రిజాతకములు, ఉక్కు, కుంకుమ పువ్వు, నల్లకలువ, కరక్కాయలు, మైలుతుత్థము, సితకాచము (అనఁగా తెల్లగాజు), శంఖము, సముద్రపు నురుగు, మిరియాలు, సౌవీరాంజనము, పిప్పళ్లు, అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణము చేసి యుంచుకొని చంద్రుఁడు అశ్వినీ నక్షత్రములో ప్రవేశించియుండుకాలమునందు నేత్రముల కంజనము వేయుంచుకొనవలయును.

## కఫజ తిమిరరోగహరాంజనము.

మరిచవరలవణభాగౌ భాగౌ ద్వౌ కణసముద్రఫేనాభ్యామ్,
సౌవీరభాగనవకం చిత్రాయాం చూర్ణితం కఫామయజిత్. ౨

మిరియాలు, సైంధవలవణము ఇవి రెండేసిభాగములు; పిప్పళ్లు, సముద్రపునుర ఇవి రెండేసిభాగములు; సౌవీరాంజనము తొమ్మిదిభాగములు నిటుల వీనిని నొక్కటిఁ జేర్చి చిత్రానక్షత్రమునాఁడు చక్కఁగ చూర్ణముచేసి అంజనమువేసికొనిన కఫజ తిమిర రోగము హరించును.

## దృష్టిప్రసాదనాంజనము.

ద్రాక్షామృణాళిస్వరసే క్షీరమద్యవసాసు చ,
పృథగ్దివ్యాప్సుస్రోతోజం సప్తకృత్వో నిషేచయేత్. ౨

తచ్చూర్ణితం స్థితం శంఖే దృక్ప్రసాదనమంజనమ్,
శస్తం సర్వాక్షిరోగేషు విదేహపతినిర్మితమ్. ౨

ద్రాక్షస్వరసము, తామరతూండ్ల స్వరసము, ఆవుపాలు, మద్యము, క్రొవ్వు, దివ్యోదకము వీనిలో సౌవీరాంజనమును ప్రత్యేకప్రత్యేకముగ నేడుమార్లు భావనచేసి (నిప్పు కాచి పైచెప్పిన రసములలో ముంచునదిభావన) చక్కఁగచూర్ణించి శంఖములో నుంచుకొనవలయును. ఈయంజనము నేత్రములకు విశేషశక్తిని నైర్మల్యమునుకలుగఁజేయును నేత్రరోగములయందు దన్నిఁటియందును మిగుల శ్రేష్ఠము. ఇది నిమిచక్రవర్తి నిర్మితము

## భాస్కర చూర్ణము.

నిర్దగ్ధం బాదరాంగారైస్తుత్థం చేత్థం నిషేచితమ్,
క్రమాదజాపయస్సర్పిః క్షౌద్రే తస్మాత్పలద్వయమ్. ౨

కార్షికైస్తాప్యమరిచస్రోతోజకటుకానతైః,
పటురోధ్రశిలాపథ్యాకర్పూరైలాంజనఫేనకైః. ౨

యుక్తం పలేన యష్ట్యాశ్చ మూషాంతర్ధ్మాతచూర్ణితమ్,
హంతికాచార్మనక్తాంధ్యరక్తరాజీస్సుశీలితః. 3

చూర్ణో విశేషాత్తిమిరం భాస్కరోభాస్కరో యథా,

రేఁగుకట్టెలనిప్పులో మైలుతుత్తమును కాల్చి మేఁకపాలు, ఆవునెయ్యి, తే వీనిలో క్రమముగ ముంచవలయును. ఇటుల నేడుపర్యాయములు శుద్ధిచేసిన మైలుత త్తము రెండుపలములు, స్వర్ణమాక్షికము, మిరియాలు, స్రోతోంజనము, కటుకరోహిణి

గ్రంథితగరము, సైంధవలవణము, లొద్దుగు, మణిశిల, కరక్కాయలు, పిప్పళ్లు, ఏలకులు, సౌవీరాంజనము, సముద్రపునురుగు ఇవి దినుసు కొకకర్షము ; యష్టిమధుకము ఒక పలము ఇటుల వీనినన్నిఁటిని మూసలోనిడి కాల్చి గ్రహించి చక్కఁగ చూర్ణము చేయవలయును. దీనిని భాస్కరచూర్ణమని చెప్పుదురు. ఇది సూర్యుఁడంధకారమునునశిం పఁజేయుభంగి తిమిరరోగమును నశింపఁజేయును. మఱియు కాచము, అర్మము, రేచీఁకటి, రక్తరేఖలు అను నేత్రరోగములును శమించును.

### తిమిరాంతకాంజనము.

త్రింశద్భాగా భుజంగస్య గంధపాషాణపంచకమ్. ౩౧
శుల్బతారకయోర్ద్వౌ ద్వౌ వంగస్యైకోఽంజనాత్త్రయమ్,
అంధమూషీకృతం ధ్మాతం పక్వం విమలమంజనమ్. ౩౨
తిమిరాంతకరం లోకే ద్వితీయ ఇవ భాస్కరః,

సీసము ముప్పది భాగములు, గంధపాషాణము ఐదు భాగములు, రాగి రెండుభాగములు, తాళకము రెండు భాగములు, వంగము ఒక భాగము, సౌవీరాంజనము మూడు భాగములు వీని నొకటిగచేర్చి మూసములోనిడి కరిగించి చూర్ణముచేసి అంజనము వేయవలయును ఇది సూర్యుఁడంధకారమును పోకడచుచందంబున తిమిరరోగమును పోకడచును. దీనిని తిమిరాంతక మనియెదరు.

### తుత్థాంజనము.

గోమూత్రేచ్ఛగణరసే ఽమ్లకాంజికే చ స్త్రీస్తన్యేహవిషివిషే చ మాక్షికే చ, యత్తుత్థం జ్వలితమనేకశో నిషిక్తం తత్కుర్యాద్గరుడసమం నరస్య చక్షుః. ౩౩

మైలుతుత్తమును నిప్పులో చక్కఁగకాల్చి గోమూత్రము, ఆవుపేఁడ రసము, పులికడుగు, చనుబాలు, ఆవునెయ్యి, వసనాభి, తేనె వీనియందు క్రమముగ ముంచవలయును ఇటుల ఏడు పర్యాయములు ముంచి శుద్ధిచేయఁబడిన మైలుతుత్తమును అంజనము చేసిన మనుజునికి గరుడునితో సమమైన దృష్టిశక్తి గలుగును.

### అంజనశలాకా.

శ్రేష్ఠాజలం భృంగరసం సవిషాజ్యమజాపయః,
యష్టీరసం చ యత్సీసం సప్తకృత్వః పృథక్పృథక్. ౩౪
తప్తం తప్తం పాయితం తచ్ఛలాకా నేత్రే యుక్తా సాంజనా

నంజనా వా, తైమిర్యార్మస్రావపైచ్ఛిల్యపైల్లం కండూంజాడ్యం రక్తరాజీం చ హంతి. ౩౫

సీసమును కరిగించి త్రిఫలకషాయము, గుంటగలగరాకు స్వరసము, వసనాభి, ఆవునెయ్యి, మేకపాలు, అతిమధుర స్వరసము వీనిలో ప్రతిదానియందు ముంచవలయును. ఇటుల ఏడుపర్యాయములుచేసి యాసీసముచే శలాకను చేయవలయును. దానిని అంజనసహితముగగాని అంజనరహితముగగాని నేత్రములలో ప్రయోగించిన తిమిరము, అర్మరోగములు, స్రావము, పైచ్ఛిల్యము, పిల్లరోగము, దురద-జాడ్యము (అనఁగా దృష్టికి శక్తితగ్గియుండుట) రక్తరేఖలు అను నేత్రరోగముల హరించును.

## దృష్టిశక్తికరాంజనము.

రసేంద్రభుజగౌ తుల్యౌ తయో స్తుల్యమథాంజనమ్,
ఈషత్కర్పూరసంయుక్తమంజనం నయనామృతమ్. ౩౬
యో గృధ్ర స్తరుణరవిప్రకాశగల్ల స్తస్యాస్యం సమయ
మృతస్య గోశకృద్భిః, నిర్దగ్ధం సమఘృతమంజనం చ పేష్యం
యోగోఽయం నయనబలం కరోతి గార్ధ్రమ్. ౩౭

శుద్ధిజేసినరసము,శుద్ధిజేసిన సీసము ఇవి సమభాగములు; ఈ రెంటికిని సమభాగము సౌవీరాంజనము. ఇటుల వీనినేకముచేసి అందులో పదునాఱవభాగము పచ్చకర్పూరమును జేర్చి నూరి కంటికి అంజనమువేసిన మిగుల హితముకలుగును. తిమిరరోగము హరించును. మఱియు బాలసూర్యునితో సమమైన కాంతిగల చెక్కిళ్లతోఁ గూడియుండునదియు, యుక్తకాలములో మృతిజెందినదియు నైన గద్దముఖమును గ్రహించి యెరుపిడకలలో నునిచి కాల్చి యాభస్మములో నెయ్యి, సౌవీరాంజనము వీనిని సమభాగములుగ చేర్చి చక్కఁగ చూర్ణముచేసి కంటి కంజనమువేసిన గద్దతో సమమైన దృష్టిశక్తి కలుగును.

కృష్ణసర్పవదనే సహవిష్కందగ్ధ మంజనమనిస్సృత
ధూమమ్, చూర్ణితం నళదపత్రవిమిశ్రం భిన్నతారమపి
రక్షతిచక్షుః. ౩౮

నేతిలో సౌవీరాంజనమునుకలిపి కృష్ణసర్పముయొక్క నోటియందిడి పొగ బైలు వెడలకుండునటుల నేపిడకలతోకాల్చి దానితోడ జటామాంసి యాకునుచేర్చి చూర్ణముచేసి నేత్రముల కంజనమువేసిన నేత్రమందలి నల్లగ్రుడ్డునకు భిన్నము కలిగియుండినను అది చక్కఁబడును.

### కుక్కుటవిష్ఠాంజనము.

కృష్ణం సర్పం మృతం న్యస్య చతురశ్చాపి వృశ్చికాన్,
క్షీరకుంభే త్రిసప్తాహం క్లేదయిత్వాథ మంథయేత్. ౩౯
తత్ర యన్నవనీతం స్యాత్తత్పుష్ణీయా త్తేన కుక్కుటమ్,
అంధ స్తస్య పురీషేణ ప్రేక్షతే ధ్రువ మంజనాత్. ౪౦

మట్టికుండలో ఆవుపాలనుబోసి యందులో స్వయముగ చచ్చిన కృష్ణసర్పము నొకదానిని, నాల్గుతేళ్లను వైచి చక్కఁగ మూసి ఇరువదియొకదినములవరకుంచి పిదప దానిని చక్కఁగ చిలికి వెన్నయెత్తి ఆవెన్నను కోడికితినిపించి యాకోడియొక్క విష్ఠ ముచే నేత్రముల కంజనము వేసిన గ్రుడ్డివానికిఁగూడ నిస్సంశయముగ దృష్టికలుగును.

### దృష్టిశక్తికరరసక్రియ.

కృష్ణసర్పవసాశంఖః కతకాత్ఫలమంజనమ్,
రసక్రియేయమచిరాదంధానాం దర్శనప్రదా. ౪౧

కృష్ణసర్పముయొక్క క్రొవ్వు, శంఖము, చిల్లగింజలు, సౌవీరాంజనము వీని నొకటిగచేర్చి నూరి చేసిన రసక్రియను అంజనముఁజేసిన గ్రుడ్డివానికిఁగూడ అతిశీఘ్రముగ దృష్టిని కలుగఁజేయును.

### అప్రతిసారాంజనము.

మరిచాని దశార్ధపిచు స్తాప్యాత్తుత్థాత్పలం పిచుర్యష్ట్యాః,
క్షీరార్ద్రదగ్ధ మంజనమప్రతిసారాఖ్యముత్తమం తిమిరే. ౪౨

మిరియాలు పది, స్వర్ణమాక్షికము అర్ధకర్షము, మైలుతుత్తము ఒకపలము, అతిమధురము ఒకకర్షము వీనిని ఆవుపాలలో తడిపి చక్కఁగకాల్చి అంజనము వేయవలయును. ఇది అప్రతిసారాంజన మనఁబడును. తిమిరరోగము నందు మిగుల ప్రశస్తమైనది.

### తిమిరరోగమునకు అక్షబీజాది గుటికలు.

అక్షబీజమరిచామలకత్వక్తుత్థయష్టిమధుకై *ర్జలపిష్టైః,
ఛాయయైవ గుటికాః పరిశుష్కా నాశయంతి తిమిరాణ్యచిరేణ.

---

* స్సమపిష్టైః.

తాడివిత్తులు, మిరియాలు, ఉసిరికపరుగు, మైలుతుత్తము, అతిమధురము వీని సమభాగములుగ గ్రహించి యుదకముతో చక్కఁగనూరి గుళికలుజేసి నీడ నెండించి దాని నంజనమువేసిన తిమిరరోగ మతిశీఘ్రముగ నివర్తించును.

—— షణ్మాక్షికయోగము. ——

మరిచామలకజలోద్భవతుత్థాంజనతాప్యధాతుభిః క్రమవృద్ధైః,

షణ్మాక్షిక ఇతి యోగ స్తిమిరార్మక్లేదకాచకండూహంతా. ౮

మిరియాలు ఒకభాగము, ఉసిరికపరుగు రెండుభాగములు, జలోద్భవము (అనఁగ తెల్లతామర) మూఁడుభాగములు, మైలుతుత్తము నాల్గుభాగములు, సౌవీరాంజనవ ఐదుభాగములు, స్వర్ణమాక్షికము ఆరుభాగములు నిటుల నీద్రవ్యములను గ్రహించి నూరి అంజనము వేయవలయును. ఇది షణ్మాక్షికయోగ మనఁబడును. తిమిరరోగమ అర్మము, జలస్రావము, కాచము, దురద వీనిని పోఁగొట్టును.

—— రత్నాది చూర్ణాంజనము. ——

రత్నాని రూప్యం స్ఫటికం సువర్ణం

స్రోతోంజనం తామ్రమయస్సశంఖమ్,

కుచందనం లోహితగైరికం చ

చూర్ణాంజనం సర్వదృగామయఘ్నమ్. ౮

వజ్రాదిరత్నములు, వెండి, స్ఫటికము, బంగారు, సౌవీరాంజనము, రాగి, ఉక్కు శంఖము, రక్తచందనము, కుంకుమపువ్వు, కావిరాయి వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేయవలయును. దీనిని చూర్ణాంజన మనియెదరు. ఇది నేత్రరోగము లన్నిటిని పోఁగొట్టును.

—— దృష్టిబలకరనస్యము. ——

తిలతైల మక్షతైలం భృంగస్వరసోఽసనాచ్చ నిర్యూహః,

ఆయసపాత్రవిపక్వం కరోతి దృష్టేర్బలం నస్యమ్. ౮౯

నువ్వులనూనె, తాడినూనె, గుంటగలగరాకు స్వరసము, వేగిసకషాయము వీని సమభాగములుగ గ్రహించి యినుపపాత్రలోబోసి చక్కఁగ పాకముచేసి దానిచే నస్యము చేయించిన దృష్టికి విశేషబలము కలుగును.

—— తిమిరరోగమున స్నేహపాన రక్తమోక్షణాదులు. ——

దోషానురోధేన చ నైకశ స్తం స్నేహస్రవిస్రావణ రేకనస్యైః,

ఉపాచరేదంజనమూర్ధవస్తివస్తిక్రియాతర్పణలేపసేకైః. ౮

తిమిరరోగమును ఆయాదోషానుగుణముగ స్నేహపానము, రక్తమోక్షణము, విరేచనము, నస్యము, సూత్రస్థానములో గండూషాది విధ్యధ్యాయములో చెప్పియుండు మూర్ధవస్తి, వస్తివిధ్యధ్యాయములో చెప్పియుండు నిరూహాదివస్తువులు, లేపము, సేకము వీనిచే ప్రయత్నముతో చికిత్సింపవలయును. చికిత్స చేయనగును.

సామాన్యం సాధనమిదం ప్రతిదోష మతశ్శృణు,

ఇటుల తిమిరరోగముల కన్నిఁటికి సాధారణముగ చికిత్సలు చెప్పఁబడినవి. వాతాదిదోషములచే జనించిన తిమిరాది నేత్రరోగములకు నాయా దోషానుగుణముగ విశేష చికిత్స లిఁక చెప్పఁబడును.

### వాతజ తిమిరరోగచికిత్స

వాతజే తిమిరే తత్ర దశమూలాంభసా ఘృతమ్. ౪౮
క్షీరే చతుర్గుణే శ్రేష్ఠాకల్కపక్వం పిబేత్తతః,
త్రిఫలాపంచమూలానాం కషాయం క్షీరసంయుతమ్. ౪౯
ఏరండతైలసంయుక్తం యోజయేచ్చ విరేచనమ్,

వాతప్రకోపమున కల్గిన తిమిరరోగమునందు దశమూలముల కషాయములో ఒక ప్రస్థము ఆవునెయ్యి, నాల్గుప్రస్థములు ఆవుపాలు, త్రిఫలముల కల్కము వీనినిచేర్చి విధిప్రకారము పక్వముచేసి పానము చేయించవలయును. పిదప త్రిఫలములు పంచమూలములు వీని కషాయములో ఆవుపాలు, ఆముదముచేర్చి విరేచనమున కిప్పించవలయును.

### జీవంతీతైలము

సమూల *జాలజీవంతీతులాం ద్రోణేఽంభసః పచేత్. ౫౦
అష్టభాగస్థితే తస్మింస్తైలప్రస్థం పయస్సమమ్,
జలాత్రితయజీవంతీవరీమూలైః పలోన్మితైః. ౫౧
యష్టీపలైశ్చతుర్భిశ్చ లోహపాత్రే విపాచయేత్,
లోహ ఏవ స్థితం మాసం నావనాదూర్ధ్వజత్రుజాన్. ౫౨
వాతపిత్తామయాన్ హంతి తద్విశేషాద్దృగామయాన్,
కేశాస్యకంధరాస్కంధ పుష్టిలావణ్యకాంతిదమ్. ౫౩

మనుబాలచెట్టును సమూలముగ నూరు పలములు గ్రహించి ద్రోణప్రమాణ ముదకములో వైచి ఎనిమిదవభాగము మిగులునటుల కషాయముకాచి అందులో ఒక ప్రస్థము నువ్వులనూనె, ఒక ప్రస్థము ఆవుపాలును పోసి, చిట్టాముట్టి, పేరాముట్టి, జిబిలిక, మను

* జాతీ.

పాల, పిల్లిపీచరవేళ్లు ఇవి దినుసు కొక్కొకపలము, అతిమధురము నాల్గుపలములు వీనిని నూరి కలిపి యినుపపాత్రలో విధిప్రకారము పక్వముచేసి యినుపపాత్రలో నొక మాసమువరకు ఉంచి పిదప నస్యముచేయించిన మెడకొంకులకు పైభాగమునందు జనించు నట్టి రోగములన్నియు హరించును. వాతపిత్తాదులవలన జనించు నేత్రరోగముల నన్నిఁటిని విశేషముగఁ బోఁగొట్టును. తలవెండ్రుకలు వృద్ధిజెంది నల్లగనగును. మెడ, భుజ, శిరము వీనికి పుష్టికలుగును. శరీరమునకు కాంతి లావణ్యము కలుగును.

### జత్రూర్ధ్వరోగములకు ఏరండాదితైలము.

సిత్తైరండజటాసింహీఫలదారువచానతైః,
ఘోషయా బిల్వమూలైశ్చ తైలం పక్వం పయోఽన్వితమ్. ౫౪
నస్యం సర్వోర్ధ్వజత్రూత్థవాతశ్లేష్మామయార్తిజిత్,

తెల్లాముదపువేళ్లు, వాకుడుపండ్లు, దేవదారుచెక్క, వస, గ్రంథితగరము, ముఱుగుదామర, మారేడువేళ్లు వీనిని నూరి నువ్వులనూనెలో చేర్చి నూనెకుసమము ఆవుపాలనుకలిపి విధిప్రకారము పక్వముచేసి నస్యము చేయించిన వాతశ్లేష్మములవలన మెడకొంకులకు పైభాగమునందు జనించిన రోగములన్నియు నశించును.

### తిమిరరోగమునకు వ్యాఘ్రివసాద్యంజనము.

వసాంజనేచ వైయాఘ్రీ వారాహీ వా ప్రశస్యతే. ౫౫
గృధ్రాహికుక్కుటోత్థా వా మధుకేనాన్వితా పృథక్,

తిమిరరోగమునందు కండ్లకు పెద్దపులికొవ్వునుగాని, పందికొవ్వునుగాని అంజనము వేయవలయును. లేక గ్రద్ద, పాము, కోడి వీనికొవ్వులను వేరువేరుగ అతిమధురముతోఁచేర్చి నేత్రముల కంజనమువేసిన హితముకలుగును.

### సౌవీరాంజనోపయోగక్రమము.

ప్రత్యంజనేచ స్రోతోంజం రసక్షీరఘృతే క్రమాత్. ౫౬
నిషిక్తం పూర్వవద్యోజ్యం తిమిరఘ్నమనుత్తమమ్,

సౌవీరాంజనమును మాంసరసము క్షీరము ఘృతము వీనిలో క్రమముగముంచి అంజనయోగము లన్నిఁటియందును చేర్చవలయును. ఇటులచేసిన తిమిరరోగము హరించును.

### తిమిరరోగమున తర్పణచికిత్స.

న చే దేవం శమం యాతి తతస్తర్పణ మాచరేత్. ౫౭

పైనిచెప్పిన ప్రకారము చికిత్సలనుచేసినను వాతజతిమిరరోగము శమింపకయుండిన తర్పణచికిత్సలను చేయవలయును.

వాతజతిమిరరోగమునకు తర్పణౌషధము.

శతాహ్వా కుష్ఠనలదకాకోలీద్వయయష్టిభిః,
ప్రపౌండరీకసరళపిప్పలీదేవదారుభిః. ౫౮
సర్పిరష్టగుణక్షీరం పక్వం తర్పణముత్తమమ్,

సదాప, చెంగల్వకోష్టు, వట్టివేరు, కాకోళి, క్షీరకాకోళి, అతిమధురము, కర్పూరపుబెండ, సరళదేవదారు, పిప్పళ్లు, దేవదారు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవునెయ్యిలోకలిపి నేతి కెనిమిదింత లావుపాలుపోసి విధిప్రకారము పక్వముచేసిన నది శ్రేష్ఠమైన తర్పణౌషధ మనఁబడును.

ప్రకారాంతరతర్పణౌషధము.

మేదసస్తద్వదైణేయాద్దుగ్ధసిద్ధాత్సముద్ధృతాత్. ౫౯
ఉద్ధృతం సాధితం తేజో మధుకోశీరచందనైః,
శ్వావిచ్ఛల్యకగోధానాం దక్షతిత్తిరిబర్హిణామ్. ౬౦
పృథక్పృథగనేనైవ విధినా కల్పయేద్వసామ్,

ఆవుపాలలో జింకక్రొవ్వును కలిపి చక్కఁగకాఁచి యాపాలలోనుండి నెయ్యితీసి ఆనేతిలో అతిమధురము, వట్టివేరు, చందనము వీనిని సమభాగములుగ నూరి చేర్చి విధిప్రకారము పక్వముచేసిన నదితర్పణౌషధములలో మిగులశ్రేష్ఠముగనుండును. అడవిపంది, ముండ్లపంది, ఉడుము, కోడి, తిత్తిరిపక్షి, నెమలి వీనిక్రొవ్వులను ప్రత్యేక ప్రత్యేకముగ ఆవుపాలలోకలిపి కాచి దానిలోనుండితీసిన ఘృతమునందు అతిమధురము, వట్టివేరు, చందనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కలిపి పక్వముచేసి తర్పణౌషధమును ప్రయోగించవలయును.

వాతజతిమిరరోగమునకు పుటపాకనిరూహవస్త్యాదులు.

ప్రసాదనం స్నేహనం చ పుటపాకం ప్రయోజయేత్. ౬౧
వాతపీనసవచ్చాత్ర నిరూహం సానువాసనమ్,

వాతజతిమిరరోగమునకు సూత్రస్థానములో తర్పణపుటపాకవిధ్యధ్యాయములో చెప్పియుండు ప్రసాదన, స్నేహన, పుటపాకములను వాతజ తిమిరరోగమునందు ప్రయోగించవలయును. మఱియు వాతపీనసమునకు చెప్పియుండునట్టుల నిరూహానువాసన వస్తికర్మలను చేయవలయును.

పిత్తజతిమిరరోగచికిత్స.

పిత్తజే తిమిరే సర్పిర్జీవనీయఫలత్రయైః. ౬౦
విపాచితం పాయయిత్వా స్నిగ్ధస్య వ్యధయేత్సిరామ్,

పిత్తమువలన జనించిన తిమిరరోగముకలవానికి జీవనీయగణద్రవ్యములు, త్రిఫలములు వీనిని నూరి ఆవునేతిలోకలిపి పక్వముచేయఁబడిన ఘృతమును పానముచేయించి పిదప స్నేహకర్మనుచేయించి సిరలను వేధించవలయును.

పిత్తజతిమిరరోగమున విరేచనము

శర్కరైలాత్రివృచ్చూర్ణైర్మధుయుక్తైర్విరేచయేత్. ౬౧

పిత్తజతిమిరరోగమున పంచదార, ఏలకులు, తెల్లతెగడచూర్ణము వీనినొకటిగచేర్చి తేనెలోకలిపి విరేచనమున కొసంగవలయును.

పిత్తజతిమిరరోగమున సేకలేపాదులు

సుశీతాన్ సేకలేపాదీన్యుంజ్యాన్నేత్రాస్యమూర్ధసు,

పిత్తజతిమిరరోగముగలవానికి నేత్రములు, ముఖము, శిరము వీనియందు మిక్కిలి చల్లగనుండు సేకము, లేపము మొదలగువానిని ప్రయోగించవలయును.

పిత్తజతిమిరరోగహరాంజనము.

సారిబా పద్మకోశీర ముక్తాశాబరచందనైః. ౬౨
వర్తిశ్శస్తాంజనే చూర్ణస్తథా పత్రోత్పలాంజనైః,
సనాగపుష్పకర్పూరయష్ట్యాహ్వస్వర్ణగైరికైః. ౬౩

పిత్తమువలన జనించిన తిమిరరోగమునకు నల్లసుగంధిపాల, పద్మకము, వట్టివేరు, ముత్యములు, తెల్లలొద్దుగు, చందనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కణికచేసి చాది అంజనమువేసినను, పైద్రవ్యములను చూర్ణముచేసి అంజనమువేసినను, ఆకుపత్రి, నల్లకలువ, సౌవీరాంజనము, నాగకేసరములు, పచ్చకర్పూరము, అతిమధురము, కావిరాయి వీనిని చూర్ణముచేసి అంజనమువేసినను హితముకలుగును.

పిత్తజతిమిరరోగమున సౌవీరాద్యంజనము.

సౌవీరాంజనతుత్థకశృంగీ ధాత్రీఫలస్ఫటికకర్పూరమ్, పంచాంశం
పంచాంశం త్ర్యంశ మష్టైకాంశమంజనం తిమిరఘ్నమ్. ౬౪

సౌవీరాంజనము ఐదు భాగములు, మైలుతుత్తము ఐదు భాగములు, కర్కాటక శృంగి మూఁడుభాగములు, ఉసిరికపండ్లు మూఁడుభాగములు, పచ్చకర్పూరము ఒక భాగము వీని నొకటిగచేర్చి చూర్ణముచేసి అంజనమువేసిన పిత్తజతిమిరరోగము హరించును.

## పిత్తజతిమిరరోగమునకు నస్యము.

నస్యం చాజ్యం శృతం క్షీరజీవనీయసితోత్పలైః,

ఆవునెయ్యి ఒక భాగము, ఆవుపాలు నాలుగు భాగములు వీని నేకముజేసి అందులో జీవనీయగణద్రవ్యములు, తెల్లకలువ వీనిని సమభాగములుగ గ్రహించి నూరికలిపి విధిప్రకారము పక్వముచేసి పిత్తజతిమిరరోగము కలవారికి నస్యము చేయించవలయును.

## కఫజతిమిరరోగచికిత్స

శ్లేష్మోద్భవేఽమృతాక్వాథవరాకణశృతం ఘృతమ్. ౬౭
విధ్యేత్సిరాం పీతవతో దద్యాచ్చాను విరేచనమ్,
క్వాథం పూగాభయాశుంఠీకృష్ణాకుంభనికుంభజమ్. ౬౮

కఫమువలనజనించిన తిమిరరోగమునకు తిప్పతీఁగెకషాయములో ఆవునెయ్యికలిపి అందులో త్రిఫలములు, పిప్పళ్ళు వీనినినూరి కలిపి విధిప్రకారము పక్వముచేయఁబడిన యాఘృతమును పానముచేయించి పిదప సిరలను వేధింపఁబడినయేగాక పోకలు, కరక్కాయలు, శుంఠి, పిప్పళ్లు, తెగడ, దంతివేళ్లు వీనిని సమభాగములుగచేర్చి కాఁచిన కషాయమును విరేచనార్థము నొసంగవలయును.

## కఫజతిమిరరోగమునకు నస్యము.

శ్రీబేరదారుద్వినిశాకృష్ణాకల్కైః పయోన్వితైః,
ద్విపంచమూలనిర్యూహే తైలం పక్వం చ నావనమ్. ౬౯

శ్లేష్మజతిమిరరోగమునకు దశమూలకషాయములో నువ్వులనూనె ఆవుపాలు వీనిని సమభాగములుగ పోసి అందులో కురువేరు, దేవదారు, పసుపు, మ్రానిపసుపు, పిప్పళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కలిపి విధిప్రకారము పక్వము చేయఁబడిన తైలముచే నస్యము చేయించవలయును.

## విమలాకోకిలావర్తులు.

శంఖప్రియంగునేపాళీకటుత్రికఫలత్రికైః,
దృగ్గదమలాయ విమలా వర్తిస్స్రోతో కిలాఘనః. ౭౦

కృష్ణలోహరజోవ్యోషసైంధవత్రిఫలాంజనైః,

శంఖము, త్రేంకణము, నేపాళి (అనఁగ మణిశిల), త్రికటుకములు, త్రిఫలములు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి వర్తి (అనఁగా కణిక) చేయవలయును. దీనికి విమలావర్తియని పేరు. ఉక్కురాపొడి, త్రికటుకములు, సైంధలవణము, త్రిఫలములు, సౌవీరాంజనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి వర్తిచేయవలయును. దీనికి కోకిలావర్తియని పేరు. ఈరెండువర్తులను దృష్టికి నిర్మలత్వము కన్నులకంజనము చేసినచో కలుగును.

## తిమిరశుక్రరోగహరవర్తి.

శశగోఖరసింహోష్ట్రద్విజా లాలాటమస్థిచ. 20
శ్వేతగోవాలమరిచశంఖచందనఫేనకమ్,
పిష్టం స్తన్యాజదుగ్ధాభ్యాం వర్తిస్తిమిరశుక్రజిత్. 21

కుందేలు, ఆవు, గాడిదె, సింహము, ఒంటె వీనియొక్క దంతములు, వాని నుదుటిలోనుండు నెముకలు, తెల్లఆవుతోఁక వెండ్రుకలు, మిరియాలు, శంఖము, చందనము, సముద్రపునురుగు వీనిని స్త్రీచనుబాలు, మేఁకపాలు వీనితోనూరి వర్తిజేసి ప్రయోగించిన తిమిరరోగము శుక్రరోగము ఇవి హరించును.

## రక్తజతిమిరరోగచికిత్స

రక్తజే పిత్తవత్సిద్ధిశ్శీతైశ్చాస్రం ప్రసాదయేత్,

రక్తజతిమిరరోగమునకు పిత్తజతిమిరరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. శీతవీర్య శీతస్పర్శములుగల అన్న, పాన, ఔషధ, సేక, లేపాదులచే రక్తమును శుద్ధి పరచవలయును.

అంజనం ఫేనకర్పూరశ్వేతకాంచనచందనైః. 23

సముద్రపునురుగు, పచ్చకర్పూరము, తెల్లకాంచనము, చందనము వీనిని సమభాగములుగనూరి రక్తజతిమిరరోగముల కంజనమువేయవలయును (ఈయోగము ప్రాచీనకోశాంతరములయందు గనపట్టుచున్నయది)

## రక్తజతిమిరరోగహరాంజనము.

ద్రాక్షయా నళదరోధ్రయష్టిభిశ్శంఖతామ్రహిమపద్మపద్మకైః,
ఉత్పలైశ్ఛగలదుగ్ధవర్తిభిరస్రజం తిమిరమాశునశ్యతి. 24

ద్రాక్షపండు, వట్టివేరు, లొద్దుగు, అతిమధురము, శంఖము, రాగి, చందనము, తామరపువ్వు, పద్మకము, నల్లకలువ వీనిని సమభాగములుగ గ్రహించి గొఱ్ఱెపాలతో నూరి వర్తిజేసి ప్రయోగించిన రక్తజతిమిరరోగము శీఘ్రముగ నశించును.

## సంసర్గసన్నిపాతజ తిమిరరోగచికిత్స.

సంసర్గసన్నిపాతోత్థే యథాదోషోదయం క్రియా,

సంసర్గసన్నిపాతజనితంబులైన తిమిరరోగములయం దాయాదోష ప్రకోపాను గుణముగ పైనిచెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## సన్నిపాతజ తిమిరరోగమునకు నస్యము.

సిద్ధం మధూకక్రిమిజిన్మరిచామరదారుభిః. ౭౫

సక్షీరం నావనం తైలం పిష్టైర్లేపో ముఖస్య చ,

యష్టిమధుకము, వాయువిడంగములు, మిరియాలు, దేవదారు వీనిని సమభాగ ములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి దానికి సమముగ ఆవుపాలు చేర్చి విధిప్రకారము పక్వముచేసి యాతైలముచే నస్యము చేయించవలయును. పైయష్టి మధుకాదిద్రవ్యముల నుదకముతోనూరి ముఖమునకు లేపనముచేసిన హితముగనుండును.

## సన్నిపాతజ తిమిరరోగమునకు శిరోవస్తినస్యములు.

నతనీలోత్పలానంతాయష్ట్యాహ్వసునిషణ్ణకైః. ౭౬

సాధితం నావనే తైలం శిరోవస్తౌ చ శస్యతే,

గ్రంథితగరము, నల్లకలువ, తిప్పతీఁగె, లేక దురదగొండి, అతిమధురము, చక్ర వర్తికూర వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలోకలిపి విధిప్రకారము పక్వముచేసి యాతైలముచే నస్యము, శిరోవస్తి వీనినిచేసిన సన్నిపాతజ తిమిరరోగము శమించును.

## సన్నిపాతజ తిమిరరోగమున కంజనము.

దద్యాదుశీరనిర్యూహే చూర్ణితం కణసైంధవమ్. ౭౭

తచ్ఛృతం సఘృతం భూయః పచేత్క్షౌద్రం ఘనే క్షిపేత్,

శీతేచాస్మిన్ హితమిదం సర్వజే తిమిరేఽంజనమ్. ౭౮

వట్టివేరుకషాయములో పిప్పళ్లు, సైంధవలవణము వీనిని సమభాగములుగ గ్రహిం చి చూర్ణముచేసి కలిపి పాకముచేసి పైకషాయము పక్వముగునపుడు దించుకొని

అందులో ఆవునెయ్యినిచేర్చి గట్టిగనగువరకు మరల పాకముచేసిదించుకొని చల్లారినపిదప అందులో తేనెనుచేర్చి కండ్లకు అంజనమువేయవలయును. ఇది సన్నిపాతజ తిమిరరోగమునందు మిక్కిలి హితకరమైన యంజనము.

సన్నిపాతజ తిమిరరోగహరాంజనము.

అస్థీని మజ్జపూర్ణాని సత్వానాం రాత్రిచారిణామ్,
స్రోతోజాంజనయుక్తాని వహత్యంభసి వాసయేత్. ౨౯
మాసం వింశతిరాత్రం వా తతశ్చోద్ధృత్య శోషయేత్,
సమేషశృంగీపుష్పాణి సయష్ట్యాహ్వాని తాని తు. ౩౦
చూర్ణితాన్యంజనం శ్రేష్ఠం తిమిరే సాన్నిపాతికే,

రాత్రులయందు సంచరించునట్టి జంతువులయొక్క యెముకలను, మజ్జసహితముగ గ్రహించి అందులో సౌవీరాంజనమునుచేర్చి ఆయెముకలను ప్రవహించునట్టి యుదకములో నొకమాసముగాని ఇరువది దినములుగాని యుంచి పిదప దానినెత్తి చూర్ణము చేసి ఒద్దిపువ్వులు, అతిమధురము ఈరెండువస్తువులను చూర్ణముచేసి పైయెముకల చూర్ణములో కలిపి సన్నిపాతజతిమిరరోగమునకు అంజనము వేయవలయును. ఇది మిగుల శ్రేష్ఠమైన యంజనము.

కాచరోగచికిత్స.

కాచేఽప్యేషా క్రియా ముక్త్వా సిరాం యంత్రనిపీడితాః. ౩౧
ఆంధ్యాయస్యుర్మలా దద్యాత్స్రావ్యే రక్తే జలౌకసః,

కాచరోగమునందును పైనిచెప్పిన చికిత్సల నన్నిటిని చేయఁదగునుకాని సిరలను మాత్రము వేధింపంజనదు. వేధించినచో యంత్రముచే పీడింపఁబడిన వాతాది దోషములు గ్రుడ్డితనమును కలుగఁజేయును. రక్తస్రావము జేయవలసిన యెడల జలగలచే రక్తమును తీయవలయును.

కాచరోగమున కంజనము.

గుడః ఫేనోఽంజనం కృష్ణా మరిచం కుంకుమాద్రజః. ౩౨
రసక్రియేయం సక్షౌద్రా కాచయాపన మంజనం,

బెల్లము, సముద్రపునురుగు, సౌవీరాంజనము, పిప్పళ్లు, మిరియాలు, కుంకుమపువ్వు వీనిని చూర్ణముచేసి తేనెలోకలిపి చేయఁబడిన రసక్రియ కాచరోగమును పోఁగొట్టును.

### సన్నిపాతజనకులాంధ్యరోగచికిత్స.

నకులాంధ్యే త్రిదోషోత్థే త్రైమిర్యవిహితో విధిః. ౮౩

త్రిదోషములవలనకలిగిన నకులాంధ్యరోగమునకు త్రిదోషజనిత తిమిరరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### నిశాంధ్యరోగమున కంజనము.

రసక్రియాఘృతక్షౌద్ర గోమయస్వరసద్రుతైః,
తార్క్ష్యగైరికతాళీసైర్నిశాంధ్యే హితమంజనమ్. ౮౪
దధ్నా విఘృష్టం మరిచం రాత్ర్యాంధ్యేఽంజనముత్తమమ్,

రసాంజనము, కావిఱాయి, తాళిసపత్రి వీనిని ఆవునెయ్యి, తేనె, ఆవుపేఁడ రసము వీనితోనూరి చేయఁబడిన రసక్రియను నిశాంధ్యరోగముకలవారి కంజనమువేసిన హితము కలుగును. మిరియాలను పెరుగుతోచాది అంజనము వేసిన రేచీఁకటి నివర్తించును. ఇది రేచీఁకటిగలవారికి శ్రేష్ఠమైన అంజనము.

### నిశాంధ్యమునకువర్తి.

కరంజికోత్పలస్వర్ణగైరికాంభోజకేసరైః. ౮౫
పిష్టైర్గోమయతోయేన వర్తిర్దోషాంధ్యనాశినీ,
అజామూత్రేణ వా కౌంతీ కృష్ణా స్రోతోజసైంధవైః. ౮౬
కాలానుసారీత్రికటుత్రిఫలాలమనశ్శిలాః,
సఫేనాశ్ఛాగదుగ్ధేన రాత్ర్యంధ్యే వర్తయో హితాః. ౮౭

కానుగు, నల్లకలువ, స్వర్ణగైరికము, తామరకేసరములు వీనిని ఆవుపేఁడ రసముతో నూరి వర్తిజేసి ప్రయోగించినను, రేణుకలు, పిప్పళ్లు, సౌవీరాంజనము, సైంధవలవణము వీనిని మేఁకమూత్రముతోనూరి వర్తిజేసి ప్రయోగించినను కాలానుసారి త్రికటుకములు, త్రిఫలములు, హరిదళము, మణిశిల, సముద్రపునురుగు వీనిని మేఁకపాలతో నూరి వర్తిచేసి ప్రయోగించినను రేచీఁకటి హరించును.

### రాత్ర్యంధ్యమున కంజనము.

సన్నివేశ్య యకృన్మధ్యే పిప్పలీ రదహన్పచేత్,
తాశ్శుష్కా మధునా ఘృష్టా నిశాంధ్యే శ్రేష్ఠమంజనమ్. ౮౮

యకృత్తను మాంసపిండమునను నడుమ పిప్పళ్లనుంచి ఆపిప్పళ్లను నిప్పు తగుల నియ్యక పక్వముచేసి యెండించి ఆపిప్పళ్లను తేనెలోచాచి కంట్లకు అంజనమువేసిన రేచీఁకటి నివర్తించును.

## నిశాంధ్యమున యకృద్భక్షణము

ఖాదేచ్ఛప్లీహయకృతీ మాహిషే తైలసర్పిషా,

బఱ్ఱెయొక్క ప్లీహము యకృత్తు అను మాంసఖండములను నువ్వులనూనె, నెయి వీనిలో కలిపి రేచీకటిగలవాఁడు భక్షింపవలయును.

## నిశాంధ్యరోగమున జీవంత్యాదిపల్లవాద్యుపయోగము.

ఘృతే సిద్ధాని జీవంత్యాః పల్లవాని చ భక్షయేత్. ౮౯

తథాతిముక్తకైరండశేఫాల్యాభీరుజాని చ,

భృష్టం ఘృతం కుంభయోనేః పత్త్రైః పానే చ పూజితమ్. ౯౦

మనుబాలచిగుళ్లనుగాని, పువ్వులగురువింద, ఆముదపుచెట్టు, నల్లవావిలి, పిల్లిపీచర వీనిచిగుళ్లనుగాని ఆవునేతిలో పక్వముచేసి నిశాంధ్యరోగికి ఇప్పించవలయును. అవిసియాకుతో కాఁచఁబడిన ఘృతము నిశాంధ్యరోగులకు పానమునందు ప్రశస్తము.

## ధూమరాదినేత్రరోగచికిత్స.

ధూమరాఖ్యామ్లపిత్తోష్ణవిదాహే జీర్ణసర్పిషా,

స్నిగ్ధం విరేచయేచ్ఛీతైశ్శీతైర్దిహ్యాచ్చ సర్వతః. ౯౧

ధూమరము, ఆమ్లవిదగ్ధా, పిత్తవిదగ్ధా, ఉష్ణవిదగ్ధా అను నేత్రరోగములు గల వారికి ప్రాఁతనేతితో నస్యంజనము చేయించి స్నిగ్ధశరీరుఁడుగానుండువానికి శీతవీర్యముగల యౌషధములతో విరేచనము చేయించవలయును. శీతవీర్యౌషధములను నూరి లేపనము చేయించవలయును.

## ధూమరాదిరోగములయందు రసక్రియాంజనములు.

గోశకృద్రసదుగ్ధాజ్యైర్ద్విపక్వం శస్యతే ఽఞ్జనమ్,

స్వర్ణగైరికతాళీసచూర్ణావాపా రసక్రియా. ౯౨

ఆవుపేఁడరసము, ఆవుపాలు, ఆవునెయ్యి వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగచేర్చి పక్వముచేయఁబడిన అంజనము, స్వర్ణగైరికము, తాళిసపత్రిచూర్ణము వీని ప్రతివాపముతోఁ గూడియుండు రసక్రియ యివి ధూమరము మొదలగు దృష్టిరోగములయందు హితకరమైనవి.

## ధూమరాదిరోగముల కంజనము.

మేదాశాబరకానంతామంజిష్ఠాదార్వియష్టిభిః,

క్షీరాష్టాంశం ఘృతం పక్వం సతైలం నావనం హితమ్. ౯౩

మేధ, తెల్లలొద్దుగు, తిప్పతీఁగె, మంజిష్ఠి, మ్రానిపసుపు, అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవునేతిలో కలిపి నేతికిసమముగ నువ్వులనూనె, నేతి కెనిమిదిభాగములు ఆవుపాలునుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి నస్యముచేయించిన ధూమరాది నేత్రరోగములు శమించును.

## ధూమరాదిరోగములయందు సిరావేధము.

తర్పణం క్షీరసర్పిస్స్యా దశాన్యతి సిరావ్యధః,

పైనిచెప్పినచికిత్సలను చేసియు ఆమ్లవిదగ్ధాది దృష్టిరోగములు శమింపకయుండి నచో ఆవుపాలలో తీయఁబడిన ఘృతముచే తర్పణ చికిత్సలనుచేసి పిదప సిరలను వేధిం చవలయును.

## చింతాదిజనిత నేత్రరోగచికిత్స.

చింతాభిఘాతభీశోకరౌక్ష్యాత్సోత్కటకాసనాత్. ౯౪
విరేకనస్యవమనపుటపాకాదివిభ్రమాత్,
విదగ్ధాహారవమనాత్క్షుత్తృష్ణాదివిధారణాత్. ౯౫
అక్షిరోగావసానాచ్చ పశ్యేత్తిమిరరోగివత్,
యథాస్వం తత్ర యుంజీత దోషాదీన్ వీక్ష్య భేషజమ్. ౯౬

చింత, అభిఘాతము, భయము, శోకము, రూక్షత, విషమముగ కూర్చుండుట వీనివలనను; విరేచనము, నస్యము, వమనము, పుటపాకము వీని నధికముగచేయించుకొనుట వలనను; అపక్వాన్నమును భుజించుటవలనను; వమనమువలనను; ఆఁకలి, దప్పి, మలమూత్రాది వేగములు వీని నడ్డగించుటవలనను జనించిన నేత్రరోగములకు తిమిరరోగలక్షణములు కలిగియుండును. కావున వానికి దోష, దూష్య, దేశ, బలసాత్మ్యాదుల పర్యాలోచించి చికిత్సలను చేయవలయును.

## అభిఘాతజదృష్టిరోగచికిత్స

సూర్యోపరాగానలవిద్యుదాది
విలోకనేనోపహతేక్షణస్య,
సంతర్పణం స్నిగ్ధహిమాది కార్యం
తథాంజనం హేమఘృతేన ఘృష్టమ్. ౯౭

సూర్యగ్రహణము, నిప్పు, మెఱుపు మొదలగు తేజోవిశేషములను విశేషముగ చూచుటవలన నేత్రేంద్రియమునకు అభిఘాతము కలుగును. అట్టి నేత్రేంద్రియమునకు

స్నిగ్ధముగను శీతముగనునుండు సంతర్పణ చికిత్సలను చేయవలయును. బంగారునుఱావు సేతి లోచాది అంజనము వేయవలయును.

నేత్రరక్షణావశ్యకత్వము.

చక్షూరక్షాయాం సర్వకాలం మనుష్యై
ర్యత్నః కర్తవ్యో జీవితే యావదిచ్ఛా,
వ్యర్థోలోకో౽యం తుల్యరాత్రిందివానాం
పుంసామంధానాం విద్యమానే౽పి విత్తే. ౯౮

రేయింబగలు సమముగనుండు నంధులకు విశేషధనము కలిగినను, ఈప్రపంచము నిష్ప్రయోజనము. కావున మనుజుఁడు జీవించియుండువఱకు నేత్రములను రక్షించుట యందు నెల్లప్పుడును యత్నము చేయవలయును.

నేత్రరక్షణోపాయములు.

త్రిఫలా రుధిరస్రుతిర్విశుద్ధిర్మనసో నిర్వృతిరంజనం చ
నస్యమ్, శకునాశనతా సపాదపూజా ఘృతపానం చ
సదైవ నేత్రరక్షా. ౯౯
అహితా దశనాత్సదా నివృత్తి ర్భృశభాస్వచ్చలసూక్ష్మ
వీక్షణాచ్చ, మునినా నిమినోపదిష్ట మేతత్పరమం రక్షణ
మీక్షణస్య పుంసామ్. ౧౦౦

త్రిఫలోపయోగము, రక్తస్రావము, వమనవిరేచనంబులగు శోధనౌషధములు, మనస్సంతోషము, అంజనము, నస్యము, పక్షులమాంసమును భుజించుట, పాదములకు తైలాది లేపనములను చేయుట, విశేషముగ ఘృతమును సేవించుట ఇవి నేత్రరక్షణమునకు సాధకంబులు. మఱియు నెల్లప్పుడు అహితాహారమును భుజించకుండుట, మిక్కిలి ప్రకాశము కలదిగను చంచలముగను సూక్ష్మముగను నుండువస్తువులను చూడకుండుట ఇవి మనుజులకు నేత్రరక్షమునందు ముఖ్యసాధనమని నిమిచక్రవర్తి చెప్పియున్నాఁడు.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదుమూఁడవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# చతుర్దశాధ్యాయము.



అవ. తిమిరప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము లింగనాశరోగచికిత్సలను తెలియపఱచుటకై లింగనాశప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది.—

## లింగనాశ ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో లింగనాశప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

తిమిర ప్రతిషేధాధ్యాయనిరూపణానంతరము లింగనాశమను నేత్రరోగములకు చికిత్సలను తెలియపఱచునట్టి లింగనాశ ప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### లింగనాశరోగచికిత్స.

విధ్యేత్సుజాతం నిష్ప్రక్షం లింగనాశం కఫోద్భవమ్,
ఆవర్తక్యాదిభిష్షడ్భిర్వివర్జితముపద్రవైః. ౧

సంపూర్ణముగ జనించినదిగను, గట్టిగను, దర్శనశక్తి రహితముగను, ఇఁకచెప్పఁబోయెడు ఆవర్తికి మొదలగు ఆరు ఉపద్రవములు లేనిదిగను, కఫమువలన జనించినదిగను నుండు లింగనాశరోగమును సిరావ్యధనముచేయవలెను. కఫజలింగనాశముతప్ప యితర లింగనాశరోగము లసాధ్యం బగుటవలన వానిని వేధింపఁజనదు.

### శ్లేష్మజలింగనాశరోగస్వరూపము.

సోఽసంజాతో హి విషమో దధిమస్తునిభస్తనుః,
శలాకయావకృష్టోఽపి పునరూర్ధ్వం ప్రపద్యతే. ౨
కరోతి వేదనాం తీవ్రాం దృష్టిం చ స్థగయేత్పునః
శ్లేష్మలైః పూర్యతే చాశు సోఽన్యైస్సోపద్రవశ్చిరాత్. ౩



సంపూర్ణముగ జనింపకుండు లింగనాశరోగము విషమాకారముఁగల్లదిగను, పెరుగు మీఁదిమీఁగడతో సదృశముగను పల్చనగను నుండును. శలాకచేత నీడ్చిన మరల పైభాగ

మును జేరును. దారుణమైననొప్పిని గలుగఁజేయును దానిని వేధించినను మరల దృష్టిని ఆవరించును. శ్లేష్మకర ఆహారములచే శీఘ్రముగ వృద్ధిజెందును. విరుద్ధాహారంబులచే సుస్రవములను కలుగఁజేయును. మెల్లమెల్లఁగ వృద్ధిజెందును.

శ్లైష్మికో లింగనాశో హి సితత్వాచ్ఛ్లేష్మణస్సితః,
తస్యాన్యదోషాభిభవాద్భవత్యానీలతా గదః. ౪

శ్లేష్మము తెలుపువర్ణముగలది యగుటచే శ్లేష్మమువలన జనించిన లింగనాశరోగము తెల్లగనేయుండును. దానికి వాతాదిదోషములయొక్క సంబంధము కలిగినయెడల ఆరోగము కొంచెము నల్లగనగును.

ఆవర్తకీదృష్టిలక్షణము.

తత్రావర్తచలా దృష్టిరావర్తక్యరుణాసితా,

నీళ్లసుడివలె చలింపుచుండునదియు, ఎఱ్ఱగ,తెల్లగ నుండునదియు నైన దృష్టి ఆవర్తకియనఁబడును.

శర్కరా రాజీమతీదృష్టిలక్షణములు.

శర్కరార్కపయోలేశనిచితేవ ఘునాతి చ. ౫
రాజీమతీ దృజ్నిచితా శాలిశూకాభరాజిభిః,

జిల్లేడుపాలచుక్కలు నిండియుండునటులను గట్టిగను నుండు దృష్టి శర్కరా యనఁబడును. వడ్లగింజముల్లువలె సన్నముగనుండు రేఖలతో వ్యాపించియుండు దృష్టి రాజీమతి యనఁబడును.

ఛిన్నాంశుక దృష్టిలక్షణము.

విషమచ్ఛిన్నదగ్ధాభా సరుక్ఛిన్నాంశుకా స్మృతా. ౬

వికారాకారము నొప్పి గలదిగను, ఛేదించఁబడినటులను, కాల్చఁబడినటులను నుండు దృష్టి ఛిన్నాంశుకయనఁబడును.

చంద్రకీదృష్టిలక్షణము.

దృష్టిః కాంస్యసమచ్ఛాయా చంద్రకీ చంద్రకాకృతిః,

చంద్రకీయను దృష్టి కంచుతో సమానమైనకాంతి గలదిగను, నెమలిపురికన్నుతో (అనఁగా నెమలిరెక్కలలో నుండుకన్నుతో) సమానాకారము కలదిగను నుండును.

## ఛత్త్రకీలక్షణము.

ఛత్త్రాభా నైకవర్ణా చ ఛత్త్రకీ నామ నీలికా. ౭

గొడుగువలెనుండునదియు, నానావిధవర్ణములతోఁగూడినదియునగు దృష్టి, ఛత్త్రకీ యనఁబడును.

## అవేధ్యలింగనాశరోగములు.

న విధ్యేదసిరాహ్వానాం నదృక్పీనసకాసినామ్,
నాజీర్ణభీరువమితశిరఃకర్ణాక్షిశూలినామ్. ౮

సిరావేధకవర్జ్యులు- పీనసము, కాసము, అజీర్ణము, శిరోరోగము, కర్ణరోగము, నేత్రరోగము- ఈరోగములుఁగలవారు; భయమును జెందియుండువారు; వాంతిచేయువారు వీరలకు జనించియుండు లింగనాశరోగమును వేధింపంజనదు.

## లింగనాశరోగమున శస్త్రచికిత్సాక్రమము.

అథ సాధారణే కాలే శుద్ధసంభోజితాత్మనః,
దేశే ప్రకాశే పూర్వాహ్ణే భిషగ్జానూచ్చపీఠగః ౯
యంత్రితస్యోపవిష్టస్య స్విన్నాక్షస్య ముఖానిలైః,
అంగుష్ఠమృదితే నేత్రే దృష్టే దృష్ట్యుత్ప్లుతంమలమ్. ౧౦
స్వనాసాం ప్రేక్షమాణస్య నిష్కంపం మూర్ధ్ని ధారితే,
కృష్ణాదర్ధాంగుళం ముక్త్వా తదర్ధార్ధమపాంగతః. ౧౧
తర్జనీమధ్యమాంగుష్ఠైశ్శలాకాం నిశ్చలం ధృతామ్,
* దైవచ్ఛిద్రం నయేత్పార్శ్వాదూర్ధ్వమామంథయన్నివ. ౧౨
సవ్యం దక్షిణహస్తేన నేత్రం సవ్యేనచేతరత్,

వైద్యుఁడు సాధారణ సమశీతోష్ణమైనకాలమునందు (అనఁగా శ్రావణాదిమాసములయందు) పూర్వాహ్ణమున వెలుతురుగనుండు ప్రదేశములో మోకాలంత పొడవుగల యాసనముపైకూర్చుండి స్వస్తివాచనము జేయించికొనినవాఁడును, వమన విరేచనంబులచే శుద్ధమైన శరీరముగలవాఁడును, చక్కఁగ నాహారమును భుజించినవాఁడును నైన నేత్రరోగిని ఎదుట కదలక కూర్చుండబెట్టుకొని వాని నేత్రములకు తననోటిగాలిచే స్వేదకర్మనుచేయించి పిదప నేత్రమును చేతిబొటనవ్రేలిచే నలిపినచో దృష్టియందలి

* నైనచ్ఛిద్రం నయేన్నాథ ఊర్ధ్వం వా। మంథయన్నివ.

రోగము పైభాగమునకుఁజేరును. అపుడు వైద్యుఁడారోగమునుచూచి యారోగిని తన ముక్కును రెప్పపాటులేకుండ జూచుకొనియుండునటులఁజేసి వానిశిరమును కదలకుండు నటుల ఇతరులచే పట్టుకొమ్మని నల్లగ్రుడ్డుకు సమీపమున అర్ధాంగుళము యంగులమును, కడకంటికి ప్రక్కన పరకయంగులమును వదలి తర్జనీమధ్యమాంగుష్ఠములచే శలాకను గట్టిగపట్టుకొని దైవచ్ఛిద్రమునకుపక్కన వేధించవలయును. ఎడమకన్నును కుడిచేతితో ను కుడికన్నును ఎడమచేతితోను జాగరూకతతో వేధించవలయును.

## సువిద్ధనేత్రలక్షణము.

విధ్యేత్ సువిద్ధే శబ్దస్స్యాదరుక్చాంబులవస్రుతిః. ౧౩
సాంత్వయన్నాతురం చాను నేత్రం స్తన్యేన సేచయేత్,
శలాకాయాస్తతోఽగ్రేణ నిర్లిఖేన్నేత్రమండలమ్. ౧౪
అబాధమానశ్శనకైర్నాసాం ప్రతినుదం స్తతః,
ఉత్సుంచనాచ్చాపహారేద్దృష్టిమండలగం కఫమ్, ౧౫
స్థిరే దోషే చలే వాపి స్వేదయే దక్షి బాహ్యతః,
అథ దృష్టేషు రూపేషు శలాకామాహరే చ్ఛనైః. ౧౬
ఘృతాప్లుతం పిచుం దత్త్వా బద్ధాక్షం శాయయేత్తతః,
విద్ధాదన్యేన పార్శ్వేన తముత్తానం ద్వయోర్వ్యధే. ౧౭
నివాతే శయనేఽభ్యక్తశిరఃపాదం హితే రతమ్,

నేత్రము చక్కఁగ వేధించఁబడినచో నొప్పిలేకుండును. ఒకవిధమైన శబ్దము కలుగును. జలబిందువులు స్రవించును. అట్టిసమయమున రోగిని వైద్యుఁడు ప్రియమైన మాటలచే నూరడింపుచు చనుబాలచే కన్నునుతడిపి శలాకకొనచే దృష్టిమండలమును నొప్పికలుగక గీచి మెల్లగ దృష్టిమండలములోనుండు కఫమును నాసికాసమీపమునకు తీసికొనివచ్చి వెలిపరచవలయును. దోషము చంచలముగను, లేక స్థిరముగను నుండినచో ఆ నేత్రమునకు వెలుపల స్వేదకర్మను చేయించవలయును. వస్తువులు రోగినేత్రములకు కనుపడినచో మెల్లగ శలాకను బైటికితీసివేసి నేతిలో తడుపఁబడిన పత్తిని కంటిలోనునిచి దృఢమైన వస్త్రఖండముచే కట్టి గాలిలేకుండు స్థలములో వేధింపకయుండుపార్శ్వము చే పరుండునటుల చేయవలయును. రెండుకండ్లను వేధించినచో వెలికిలపరుండునటుల చేయవలయును. అట్టిసమయమున శిరము పాదములు వీనికి ఘృతాదులచే నభ్యంజనము చేయించవలయును.

### లింగనాశరోగచికిత్సయందు వర్జింపఁదగినవి.

క్షువథుం కాసముద్గారం ష్ఠీవనం పానమంభసః. ౧౮
అధోముఖస్థితిం స్నానం దంతధావనభక్షణమ్,
సప్తాహం నాచరేత్స్నేహపీతవచ్చాత్ర యంత్రణా. ౧౯

తుమ్ముట, దగ్గుట, తేనుపులు విడుచుట, కారి యుమియుట, నీరుత్రాగుట, తల వంచుకొని కూర్చుండుట, స్నానముచేయుట, పండ్లుతోముకొనుట, భుజించుట వీనిని సిరావేధను చేయించుకొనిన నేత్రరోగి ఏడుదినములవఱకు వర్జింపవలయును. స్నేహపానము చేసినవానికి చెప్పియుండు పథ్యములను చేయవలయును.

### లింగనాశరోగమునందు వేధనానంతరకర్తవ్యము.

శక్తితో లంఘయేత్సేకో రుజి కోష్ణేన సర్పిషా,
సవ్యోషామలకం వాట్యమశ్నీయాత్సఘృతం ద్రవమ్. ౨౦
విలేపీం వా త్ర్యహాచ్చాస్య క్వాథైర్మక్త్వాక్షి సేచయేత్,
వాతఘ్నైః సప్తమేత్వహ్ని సర్వథైవాక్షి మోచయేత్. ౨౧

నేత్రమును వేధించికొనినవానికి శక్త్యనుసారముగ లంఘనము చేయించవలయును. నేత్రములయందు నొప్పికలిగినచో కొంచెము ఉష్ణముగనుండు నేతితో కంటికి సేకము చేయించి త్రికటుకములు, ఉసిరికపరుగు ఇవి చేర్చఁబడినదియు, ద్రవముగనుండునదియు, ఘృతముచేర్చఁబడినదియునైన వాట్యమునుగాని విలేపియనుగంజినిగాని మూఁడుదినముల వఱకు తిప్పించవలయును. పిదప కంటి కట్టునువిడిచి వాతహరమైన కషాయములచే సేచనముచేసి మరల కంటికి కట్టుగట్టి యేడుదినములవఱకుంచి పిమ్మట కట్టునువిడిచి వేయవలయును.

### లింగనాశరోగికి సూక్ష్మాదిరూపదర్శననిషేధము.

* యంత్రణా మనురుధ్యేత దృష్టేః స్థైర్యాలాభతః,
రూపాణి సూక్ష్మదీప్తాని సహసా నావలోకయేత్. ౨౨

దృష్టికి స్థిరత్వము, బలముకలుగువఱకు పథ్యముగనుండవలయును. బలముకలిగిన పిదపనైనను అతిసూక్ష్మముగను అధికప్రకాశముగను నుండు వస్తువులను బలవంతముగ చూడఁజనదు.

---

* "కల్కితా స్సఘృతా దూర్వా యంత్రణా మనురుధ్యతే, దృష్టే రాప్యాయనం కుర్యా ద్దృష్టే రా స్థైర్యలాభతః" అని పాఠాంతరము.

### లింగనాశరోగికి అహితాహారాదిజనితరోగము.

శోఫరాగరుజాదీనామధిమంథస్య చోద్భవః,
అహితైర్వ్యధదోషాచ్చ యథాస్వం తానుపాచరేత్, ౨౩

అహితాహారవిహారములవలనను, వేధదోషమువలనను కంటియందు వాపు, ఎఱుపు వర్ణము, నొప్పి, అధిమంథము ఈ మొదలగురోగములు జనించును. దీనియందు దోషానుగుణముగ చికిత్సలను చేయవలయును.

### లింగనాశరోగికి దూర్వాదిముఖాలేపము.

కల్కితా స్సఘృతా దూర్వా యవగైరికసారిబాః,
ముఖాలేపే ప్రయోక్తవ్యా రుజారాగోపశాంతయే. ౨౪
ససర్షపాస్తిలాస్తద్వన్మాతులుంగరసాప్లుతాః,
పయస్యాసారిబానంతామంజిష్ఠామధుయష్టిభిః. ౨౫
అజాక్షీరయుతైర్లేపస్సుఖోష్ణశ్శర్మకృత్పరమ్,

లింగనాశరోగికి అహితాహారవిహారాదులచే కంటియందునొప్పి ఎఱుపువర్ణము కలిగియుండిన నవి శమించుటకై గరికె, యవలు, కావిరాయి, సుగంధిపాల వీనిని నూరి ఆవునెయ్యిలోకలిపి ముఖమునకు లేపనము చేయవలయును. మఱియు నువ్వులు, ఆవాలు వీనిని సమముగ గ్రహించి నూరి మాదీఫలరసములో కలిపి ముఖమునకు లేపనము చేసిన కంటినొప్పి ఎఱుపువర్ణము ఇవి శమించును. మనుబాల, నల్లసుగంధపాల, తిప్పతీఁగె, మంజిష్టి, అతిమధురము వీనిని నూరి మేఁకపాలలోకలిపి యుడికించి సుఖోష్ణముగ ముఖమునకు లేపనముచేసిన నేత్రరోగికి మిక్కిలి సుఖముకలుగును.

### లింగనాశరోగికి ఆశ్చ్యోతనము.

రోధ్రసైంధవమృద్వీకామధుకై శ్ఛాగలం పయః. ౨౬
శృతమాశ్చ్యోతనం యోజ్యం రుజారాగవినాశనమ్,
మధుకోత్పలకుష్ఠైర్వా ద్రాక్షాలాక్షాసితాన్వితైః. ౨౭
వాతఘ్నసిద్ధే పయసి శృతం సర్పిశ్చతుర్గుణే,
పద్మకాదిప్రతీవాపం సర్వకర్మసు శస్యతే. ౨౮

లొద్దుగు, సైంధవలవణము, ద్రాక్ష, అతిమధురము వీనిని మేఁకపాలలోవైచి చక్కఁగకాఁచి యాపాలచే ఆశ్చ్యోతనము చేయించినను, అతిమధురము, నల్లకలువ,

చెంగల్వకోష్టు, ద్రాక్ష,లక్క, పంచదార వీనిని సమభాగములుగ గ్రహించి నూరి మేక పాలలో కలిపి చక్కఁగ కాఁచి ఆశ్చ్యోతనము చేయించినను, లింగనాశరోగికి అహితాహారవిహారాదులచే జనించిననొప్పి, ఎఱుపువర్ణము ఇవి శమించును. వాతహరద్రవ్యములతో కాఁచఁబడిన ఆవుపాలు నాలుగు భాగములు, ఆవునెయ్యి ఒకభాగము వీని నొకటిగచేర్చి అందులో పద్మకాదిద్రవ్యముల కల్కములనుకలిపి చక్కఁగ కాఁచిన నది ఆశ్చ్యోతనాది సర్వకృత్యములయందును మిగుల శ్రేష్ఠముగనుండును.

### లింగనాశరోగమున సిరామోక్షణము.

సిరాం తథానుపశమే స్నిగ్ధస్విన్నస్య మోక్షయేత్,
మంథోక్తాం చ క్రియాం కుర్యాద్వ్యధేరూఢేఽంజనంమృదు. ౨౯

పైచెప్పినవిధంబున చికిత్సలంజేసియు కంటినొప్పి ఎఱుపువర్ణము ఇవి శమింపకయుండిన స్నేహస్వేదకర్మలను చేయించి సిరలను వేధించుటయేగాక మంథరోగమునకు చెప్పియుండు చికిత్సలను గూడ చేయవలయును. వేధించినవ్రణము శమించినయెడల మృదువైన యంజనము వేయవలయును.

### లింగనాశరోగమునందు వర్తి.

ఆఢకీమూలమరిచహరితాలరసాంజనైః,
విద్ధేఽక్ష్ణి సగుడావర్తిర్యోజ్యా దివ్యాంబుపేషితా. ౩౦

కందివేళ్లు, మిరియాలు, హరిదళము, రసాంజనము వీనిని సమభాగములుగ గ్రహించి దివ్యోదకముతో చక్కఁగ నూరి అందులో బెల్లముకలిపి కణికజేసి చాది నేత్రమునందు ప్రయోగించిన హితముకలుగును.

### లింగనాశరోగమున పిండాంజనము.

జాతీశిరీషధవమేష విషాణిపుష్ప
వైడూర్యమౌక్తిక ఫలంపయసానుపిష్టమ్,
ఆజేనతామ్రమమునా ప్రతను ప్రదిగ్ధం
సప్తాహతః పునరిదం పయసైవ పిష్టమ్. ౩౧
పిండాంజనం హితమనాతపశుష్కమక్ష్ణి
విద్ధే ప్రసాద జననం బలకృచ్చ దృష్టేః,
స్రోతోజవిద్రుమశిలాంబుధిఫేనతీక్ష్ణై
ర్వస్త్యైనతుల్యముదితం గుణకల్పనాభిః. ౩౨

జాజిపువ్వు, దిరిసెనపు పువ్వు, ధవవృక్షపుష్పము, ఒద్దిపువ్వు, వైఢూర్యము, ముత్యములు వీనిని సమభాగములుగ గ్రహించి మేఁకపాలతో చక్కఁగానూరి తామ్రపాత్రను లఘువుగపట్టించి ఏడుదినము లుంచవలయును. పిదప తామ్రపాత్రకు లేపనముచేసియుండుదానినెత్తి మేఁకపాలతోనూరి యుంటజేసి నీడనెండించిన నది పిండాంజన మనఁబడును. ఈపిండాంజనమును వేధించిన నేత్రములకంజనము వేసిన దృష్టికి నైర్మల్యము బలము కలుగును. మఱియు సౌవీరాంజనము, పగడము, మణిశిల, సముద్రపునురుగు వీనిని సమభాగములుగ గ్రహించి మేఁకపాలతోనూరి పిండాంజనముజేసి నేత్రములకంజనము వేసిన దృష్టికి బలము నైర్మల్యాదులును కలుగును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదునాల్గవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# పంచదశాధ్యాయము.

అవ. లింగనాశ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము సర్వాక్షిరోగ విజ్ఞానీ
్యాయము చెప్పఁబడుచున్నయది:—

## ర్వాక్షిరోగ విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

౧. అథాత స్సర్వాక్షిరోగవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

లింగనాశ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము నేత్రములయందంతట జనిం
్గములను తెలియపరమనట్టి సర్వాక్షిరోగ విజ్ఞానీయమను నీ యధ్యాయమును వివ
్ము.

[కన్నులయందలి తెల్లగుడ్డు నల్లగుడ్డు దృష్టిభాగము కనురెప్పలు మున్నగు నే
మము లన్నిఁటియందును సమకాలమున వ్యాపించురోగములు సర్వాక్షిరోగములు
్ కన్నులలో నీరుగారుటయే ప్రధానముగ నైనది యభిష్యన్దరోగము. అయ్యా
మిథ్యాహార విహారములంజేసి ప్రకుపితములైన వాతాదిదోషములచే గల్గును. ఈ
ష్యన్దరోగము తక్కిన నేత్రరోగముల కన్నిఁటికిని ప్రధానకారణ మగును. ఈవిష
మ సుశ్రుతాచార్యుఁ డిట్లుచెప్పెను:— "ప్రాయేణ సర్వేనయ నామయా స్తే భవ
ష్యన్ద నిమిత్తమూలాః" అట్టియభిష్యన్దరోగము లీక్రింద వివరింపఁబడును.]

వాతాభిష్యందలక్షణము.

వాతేన నేత్రేఽభిష్యందే నాసానాహోఽల్పశోఫతా,
శంఖాక్షిభ్రూలలాటస్య తోదస్ఫురణభేదనమ్. ౧
శుష్కాల్పదూషికాశీతమచ్ఛ మశ్రుచలా రుజః,
నిమేషోన్మేషనం కృచ్ఛ్రా జ్జంతూనామివ సర్పణమ్. ౨
అక్ష్యాధ్మాతమివాభాతి సూక్ష్మైః శల్యైరివాచితమ్,
స్నిగ్ధోష్ణైశ్చోపశమనం.

నేత్రములయందు వాతమువలన నభిష్యందరోగము జనించియుండినయెడల
. ఉబ్బుట ; కండ్లయందు కొంచెము వాపుకలుగుట ; కణతలు, నేత్రములు,

కనుబొమలు, నుదురు వీనియందు పోట్లు, అదురు, భేదనము కలుగుట ; నేత్రముల యందు స్వల్పముగను ఎండినదిగను నుండు పుసిజనించుట ; కండ్లనుండి చల్లగ నిర్మలముగ నీరుకారుట ; నొప్పికలుగుట ; కడుకష్టముమీఁద కండ్లనుమూయుట తెరుచుట కంటిలో జంతువులు చలించువట్లు గుల గుల లాడుట, కండ్లు ఉబ్బియుండునటులను సూక్ష్మముగ నుండు శల్యములతో వ్యాపించినటులను, ఇసుక కూరినట్లు మెరమెరలాడు చుండుట, స్నిగ్ధముగను, ఉష్ణముగను నుండు చికిత్సలచే పైయుపద్రవములు కొంచెముగ శమించుట ఈ లక్షణములు కలిగియుండును. దీనిని కంటికలకలని లోకమున చెప్పెదరు.

## అధిమంథరోగలక్షణము.

సో భిష్యంద ఉపేక్షితః. 3

అధిమంథో భవేత్తత్ర కర్ణయోర్నదనం భ్రమః,
అరణ్యేవచ మథ్యంతే లలాటాక్షిభ్రువాదయః. ४

పైనచెప్పిన వాతాభిష్యందరోగమునను చికిత్సచేయక యుపేక్షించిన అధిమంథరోగము కలుగును. ఈరోగమునందు చెవులలో మోత, భ్రమకలుగుట, నుదురు, కనుబొమలు, నేత్రములు, కణతలు మొదలగు స్థలములయందు అరణుల మథించిన విధముగ బాధకల్గుట. ఈ యుపద్రవములు కలుగును.

## హతాధిమంథలక్షణము.

హతాధిమంథస్సోఽపి స్యాత్ప్రమాదాత్తేన వేదనాః,
అనేకరూపా జాయంతే వ్రణో దృష్టౌ చ దృష్టిహా. ౫

పై అధిమంథరోగమునకు చికిత్స చేయనియెడల హతాధిమంథమను నేత్రరోగము జనించును. ఈ రోగమువలన నేత్రములయందు అనేక విధోపద్రవములును దృష్టికి హానిని కలుగఁజేయు వ్రణములును కలుగును.

## అన్యతోవాతరోగ లక్షణము.

మన్యాక్షిశంఖతో వాయురన్యతో వా ప్రవర్తయేత్,
వ్యథాం తీవ్రామపైచ్ఛిల్యరాగశోఫం విలోచనమ్. ౬
సంకోచయతి పర్యశ్రు సోఽన్యతోవాతసంజ్ఞితః,

వాతము, మెడ, కండ్లు, కణతలు వీనియందుగాని, ఇతరస్థలముల యందుగాని, తీవ్రమైన బాధలను కలుగఁజేయును. కంటియందు ఎఱుపువర్ణము, వాపు, మిక్కుటముగ జలస్రావము వీనిని కలుగఁజేసి నేత్రములను సంకోచింపఁజేయును. దీనికి అన్యతోవాతమని పేరుకలదు.

## వాతవిపర్యయరోగలక్షణము.

తద్వన్నేత్రం భవేజ్జిహ్మమూనం వాతవిపర్యయే, ౭

ఆన్యతోవాతరోగలక్షణములు కలుగుటయేగాక నేత్రము వంకరగను తగ్గినదిగను నుండుట ఈ లక్షణములు వాతవిపర్యయరోగమునకు కలిగియుండును.

## పిత్తాభిష్యందలక్షణము.

దాహో ధూమాయనం శోఫశ్శ్యావతా వర్త్మనో బహిః,
అంతఃక్లేదోఽశ్రు పీతోష్ణం రాగః పీతాభదర్శనమ్. ౮
క్షారోక్షితక్షతాక్షిత్వం పిత్తాభిష్యందలక్షణమ్,

కండ్లయందు మంటగలుగుట, కండ్లనుండి పొగ వెడలునట్లుండుట, నేత్రముల యందు వాపుకలుగుట, రెప్పలకు వెలుపల శ్యావవర్ణముగను, పసుపువర్ణముగను, వేడిగను నుండునీరుకారుట, అంతఃక్లేదము, ఎఱుపువర్ణము, వస్తువులు పసుపువర్ణముగ కనుపడుట, కంటిలో బూడిదె నిండియుండునట్లుండుట, దృష్టిశక్తి తగ్గియుండుట ఈలక్షణములు పిత్తాభిష్యందరోగమునకు కలిగియుండును.

## పిత్తాధిమంథరోగలక్షణము.

జ్వలదంగారకీర్ణాభం యకృత్పిండసమప్రభమ్. ౯
అధిమంథే భవేన్నేత్రం-

పిత్తమువలన జనించిన అధిమంథ నేత్రరోగమున నేత్రము రగులుచుండు కట్టెవలెను, యకృత్తనుమాంసపిండముతో తుల్యమైన కాంతికలదిగను నుండును.

## కఫాభిష్యందలక్షణము.

స్యందే తు కఫసంభవే,
జాడ్యం శోఫో మహాన్కండూ ర్నిద్రాన్నానభినందనమ్. ౧౦
సాంద్రస్నిగ్ధబహుశ్వేతపిచ్ఛావద్దూషికాశ్రుతా,

కఫదోషమువలన నేత్రములయం దభిష్యందరోగము జనించియుండినచో కండ్లయందు జడత్వము, అధికమైనవాపు, దురదయు కలుగును. నిద్రాహారములయం దిచ్ఛలేకుండును. దట్టముగను, జిగటగను, అధికముగను, తెలుపువర్ణముగలదిగను నుండు పుసి, నీరు ఇవి కలుగును.

## కఫాధిమంథలక్షణము.

అధిమంథే నతం కృష్ణమున్నతం శుక్లమండలమ్. ౧౧
ప్రసేకో నాసికాధ్మానం పాంసుపూర్ణమివేక్షణమ్,

కఫమువలన జనించిన యధిమంథరోగమునందు నల్లగ్రుడ్డు లోనికిపోవును. తెల్లగ్రుడ్డు ఉన్నతముగనుండును. నీరుకారును. ముక్కు ఉబ్బును. నేత్రములయందు ధూళి నిండియుండునటులుండును.

### రక్తాభిష్యందరోగలక్షణము.

రక్తాశ్రురాజీదూషీకశుక్లమండలదర్శనమ్. ౧౨
రక్తస్యందేన నయనం సపిత్తస్యందలక్షణమ్,

రక్తమువలన జనించిన యభిష్యందరోగమునందు కంటినుండి యెఱ్ఱని నీరుకారును. ఎఱుపువర్ణముగలరేఖలు, ఎఱ్ఱనిపుసి, తెల్లగ్రుడ్డునందు ఎఱుపువర్ణము పిత్తాభిష్యందమునకు చెప్పినలక్షణములును కలిగియుండును.

### రక్తాధిమంథరోగలక్షణము.

మంథేఽక్షి తామ్రపర్యంతముత్పాటనసమానరుక్. ౧౩
రాగేణ బంధూకనిభం తామ్యతి స్పర్శనాక్షమమ్,
అసృఙ్నిమగ్నారిష్టాభం కృష్ణ మగ్న్యాభదర్శనమ్. ౧౪

నేత్రములకొనలయందు దెరుపువర్ణము, కండ్లుపెల్లగిలిపోవునటుల వేదన, నేత్రములయందు బంధూకపుష్పము (మంకెనపువ్వు)వలె నెఱ్ఱనివర్ణము, తాఁకిన సహించకుండుట, నల్లగ్రుడ్డు రక్తములోమునిగిన వేఁపగింజవలె నుండుట, వస్తువులు నిప్పువలె నెఱ్ఱగ నగుపడుట ఇట్టిలక్షణములు రక్తమువలన జనించిన యధిమంథరోగమున కలుగును.

### అధిమంథసామాన్యలక్షణము.

అధిమంథా యథాస్వం చ సర్వే స్యందాధికవ్యథాః,
శంఖదంతకపోలేషు కపాలేచాతిరుక్కరాః. ౧౫

పైనిచెప్పిన అధిమంథరోగము లన్నిఁటియందు వాతాద్యభిష్యందాదిరోగముల కన్న తీవ్రమైన యుపద్రవములు, కణతలు, దంతములు, దౌడ, కపాలము వీనియందు మిక్కుటమైన శూల ఇవి కలుగును.

### శుష్కాక్షిపాకరోగలక్షణము.

వాతపిత్తోత్తరం ఘర్షతోదభేదోపదేహవత్,
రూక్షదారుణవర్త్మాక్షికృచ్ఛ్రోన్మీలనమీలనమ్. ౨౩
వికూణనం విశుష్కత్వం శీతేచ్ఛాశూలపాకవత్,
ఉక్తశ్శుష్కాక్షిపాకోఽయం.

వాతపిత్తాధిక్యమువలన నేత్రములయందు పోట్లుకలుగుట, చీల్చబడినటుల నుపద్రవము కలుగుట, ఱెప్పలు రూక్షగను వికారముగను ఉండుట, నేత్రములను కడుకష్టముచే తెరచుట, మూయుట, నేత్రములు శుష్కమును సంకోచమును జెందుట, శీతవస్తువులయం దిచ్ఛకలుగుట, కండ్లయందుశూల పాకముకలుగుట ఇట్టియుపద్రవములుగల రోగమును శుష్కాక్షిపాకరోగ మనియెదరు.

## సశోథరోగలక్షణము.

సశోథస్స్యాత్త్రిభిర్దుష్టైః. ౧౭
సరక్తైస్తత్ర శోథోఽతిరుగ్దాహష్ఠీవనాదిమాన్,
పక్వోదుంబరసంకాశం జాయతే శుక్లమండలమ్. ౧౮
అశ్రూష్ణశీతవిశదపిచ్ఛిలాచ్ఛఘనం ముహుః,

నేత్రములయందు వాతాదిత్రిదోషములు రక్తముతోఁగూడి సశోథమను రోగమును కలుగఁజేయును. దీనియందు వాపు, విశేషమైననొప్పి, మంటకలుగును. నోటియందు కఫమువెడలును. కంటియందలి తెల్లగ్రుడ్డు పండిన మేడిపండువలె నగును. కంటినీరు ఉష్ణముగ, శీతముగ, నిర్మలముగ, జిగటగ, తేటగ, దట్టముగ పలుమారు వెడలుచుండును.

## అల్పశోథరోగలక్షణము.

అల్పశోథేఽల్పశోథస్తు పాకోఽన్యైర్లక్షణైస్తథా. ౧౯
అక్షిపాకాత్యయే శోఫ స్సంరంభః కలుషాశ్రుతా,
కఫోపదిగ్ధమసితం సితం ప్రక్లేదరాగవత్. ౨౦
దాహో దర్శనసంరోధో వేదనాశ్చానవస్థితాః,

అల్పశోథమగురోగమునందు నేత్రములలోఁ గొంచెము వాపు, సశోథరోగమునను చెప్పియుండులక్షణములును కలుగును. అక్షిపాకాత్యయమను రోగమున వాపు, నొప్పి, కంటియందలి నీరు కలఁకజెందుట ఈలక్షణములు కలుగును. నల్లగ్రుడ్డు కఫముచే నాసరింపఁబడియుండును. తెల్లగ్రుడ్డును నొప్పి, యెఱుపువర్ణము కలుగును. మఱియు నేత్రములయందు మంట, చూపులేకపోవుట, బహువిధములైన యుపద్రవములు కలుగును.

## అమ్లోషిత రోగలక్షణము.

అమ్లేనాన్నేనోఽమ్లతాం నీతః పిత్తరక్తోల్బణైర్దుష్టైః. ౨౧
సిరాభి ర్నేత్ర మారూఢః కరోతి శ్యావలోహితమ్,
సశోఫదాహపాకాశ్రు భృశంచావిలదర్శనమ్. ౨౨
అమ్లోషితోఽయం.

వాతాదిత్రిదోషములు పిత్తరక్తాధిక్యముతోఁగూడి భుజించిన యాహారరసమును ఆమ్లముగఁజేయును అట్టి యాహారరసము రసవాహినియైన స్రోతోమార్గమూలంబున నేత్రములనుఁజేరి నేత్రములయందు ఎఱుపువర్ణము, నలుపువర్ణము, వాపు, మంట, పాకము, ఉదకస్రావము మొదలగువానిని కలుగఁజేయును. నేత్రములు కలఁకఁబారియుండును. ఇది అమ్లోషితరోగ మనఁబడును.

## సర్వాక్షిరోగసంఖ్య.

ఇత్యుక్తా గదా షోడశసర్వగాః,

ఇటుల నేత్రములయందంతట వ్యాపించియుండునట్టి పదునారు నేత్రరోగములు చెప్పఁబడియె.

## అసాధ్యదృష్టిరోగములు.

హతాధిమంథమే తేషు సాక్షిపాకాత్యయం త్యజేత్. ౨౩

పైనిచెప్పిన పదునారురోగములలో హతాధిమంథము, అక్షిపాకాత్యయము ఇవి అసాధ్యములగుటచే చికిత్సయందు వర్జింపవలయును.

## అధిమంథరోగకాలనియమము.

వాతోద్భూతః పంచరాత్రేణ దృష్టిం
సప్తాహేన శ్లేష్మజాతోఽధిమంథః,
రక్తోత్పన్నో హంతి తద్వత్త్రిరాత్రా
న్మిథ్యాచారాత్ పైత్తికస్సద్య ఏవ. ౨౪

అహితాహారాదులచే వాతమువలన జనించిన అధిమంథరోగము ఐదుదినములలోను పిత్తమువలన జనించిన అధిమంథరోగము తత్క్షణమునందును, శ్లేష్మమువలన జనించిన అధిమంథము ఏడుదినములలోను, రక్తమువలన జనించిన అధిమంథరోగము మూఁడుదినములలోను, దృష్టికి విఘాతమును కలుగఁజేయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదునైదవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# షోడ శా ధ్యా య ము.

అవ. సర్వాక్షిరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము నేత్రంబులయందంతట జనించు అభిష్యందాదిరోగంబులకు చికిత్సలను విశదీకరించుటకై సర్వాక్షిరోగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది —

# సర్వాక్షిరోగ ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాత స్సర్వాక్షిరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహాస్మాహు రాత్రేయాదయో మహర్షయః.

సర్వాక్షిరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము సర్వాక్షిరోగములకు చికిత్సలను తెలియపరచునట్టి సర్వాక్షిరోగ ప్రతిషేధమును నీయధ్యాయమును వివరించెదము.

## అభిష్యందరోగసామాన్యచికిత్స.

ప్రాగ్రూప ఏవ స్యందేషు తీక్ష్ణగండూషనావనమ్,
కారయే దుపవాసం చ కోపాదన్యత్ర వాతజాత్. ౧

అభిష్యందమను నేత్రరోగమునకు పూర్వరూపములు కనఁబడునప్పుడే తీక్ష్ణమైన గండూషము, నస్యము, ఉపవాసము వీనిని చేయించవలయును అయితే వాతప్రకోపమువలన జనించిన యభిష్యందరోగములకు మాత్రము పైయుపవాసాదులను చేయఁజనదు.

## వాతజాద్యభిష్యందరోగమునకు బిడాలకప్రయోగము.

దాహోపదేహరాగాశ్రుశోఫశాంత్యై బిడాలకమ్,
కుర్యాత్సర్వత్ర పత్త్రైలామరిచస్వర్ణగైరికైః. ౨
సరసాంజనయష్ట్యాహ్వానతచందనసైంధవైః,
సైంధవం నాగరం తార్క్ష్యంభృష్టం మండేన సర్పిషః. ౩
వాతజే ఘృతభృష్టం వా యోజ్యం శాబరదేశజమ్,

మాంసీపద్మకకాకోలీయష్ట్యాహ్వైః పిత్తరక్తయోః. ౪
మనోహ్వాఫలినీశుణ్ఠ్రైః కఫే సర్వైస్తు సర్వజే,

వాతాద్యభిష్యందరోగము లన్నిఁటియందును కంఠ్యమందు మంట, ఉపదేహము (అనఁగా ఉబ్బు) ఎఱుపువర్ణము, ఉదకస్రావము, వాపు ఇవి నివర్తించుటకై ఆనుపత్రి, ఏలకులు, మిరియాలు, బంగారువర్ణముగల జేగురుబాయి, రసాంజనము, అతిమధురము, గ్రంథితగరము, చందనము, సైంధవలవణము వీనిచే బిడాలకమును (అనఁగా అంజనమును) ప్రయోగించవలయును. వాతజాభిష్యందరోగమునకు సైంధవలవణము, శుంఠి, రసాంజనము వీనిని నేతిమీగడతో వేయించిగాని, నేతిలో తెల్లలొద్దుగను వేయించిగాని అంజనము వేయవలయును. పిత్తరక్తమువలన కలిగిన అభిష్యందరోగములయందు జటామాంసి, పద్మకము, కాకోళి, అతిమధురము వీనితోడను; కఫజాభిష్యందరోగమునందు మణిశిల, త్రికంకణము, తేనె వీనితోడను; సన్నిపాతజాభిష్యందరోగమునకు పైన చెప్పిన యౌషధము లన్నిఁటితోడను బిడాలకమును ప్రయోగించవలయును.

## అభిష్యందరోగమునకు అవగుంఠనము.

సితమరిచభాగమేకం చతుర్మనోహ్వాం ద్విరష్టశాబరకమ్,
సంచూర్ణ్య వస్త్రబద్ధం ప్రకుపితమాత్రేఽవకుంఠనం నేత్రే. ౫

తెల్లమిరియాలు ఒకభాగము, మణిశిల నాల్గుభాగములు, తెల్లలొద్దుగ పదునారు భాగములు వీని నొకటిగచేర్చి నున్నగ చూర్ణముచేసి సన్నివస్త్రములో మూటకట్టి ప్రకోపించియుండు నేత్రమునకు అవకుంఠనము (అనఁగా ఆమూటను కంటిపై గ్రమ్మియుండునట్లు నునిచి వదులుగ కట్టుగట్టుట) చేయించిన హితము కలుగును.

## అభిష్యందరోగమునకు కుళుత్థచూర్ణోపయోగము.

ఆరణ్యాశ్ఛగణరసే పటావబద్ధా
స్సుస్విన్నా నఖవితుషీకృతాః కుళుత్థాః,
తచ్చూర్ణం సకృదవచూర్ణనాన్నిశీథే
నేత్రాణాం విధమతి సద్య ఏవ కోపమ్. ౬

అడవియులవలను వస్త్రములో మూటగట్టి ఆవుపేడ రసమునందు యావిరిచే నుడికించి దానినెత్తి గోళ్లచే పైపట్టును తీసివైచి యెండించి చూర్ణముచేసి దానినొక పర్యాయము అర్ధరాత్రియందు నేత్రములయం దంజనముగా ప్రయోగించిన అభిష్యందరోగము శమించును.

## నేత్రరోగములకు ఘోషాదిచూర్ణధారణము.

ఘోషాభయాతుత్థకయష్టిరోధ్రై
ర్ముఖ్యాతీ సుసూక్ష్మైశ్శ్లక్ష్ణవస్త్రబద్ధైః,
తామ్రస్థధాన్యామ్లనిమగ్నమూర్తి
రార్తిం జయత్యక్షిణినైకరూపామ్. ౭

ఘోషా, [అనఁగా గొట్టిచెట్టు] కరక్కాయలు, మైలుతుత్తము, అతిమధురము, లొద్దుగు వీని నొకటిగచేర్చి సన్నగ చూర్ణముచేసి సన్ననిగుడ్డలో వదులుగ నుండునట్లు మూటగట్టి తామ్రపాత్రలో కలినిబోసి అందులో ఆమూటనుముంచి నేత్రములయందు ధరింపఁజేసిన పలుతెఱంగులైన నేత్రరోగములు హరించును.

## అభిష్యందరోగమునకు సేకము

షోడశభిస్సలిలపలైః ఫలత్రికపలం కటంకటేర్యాః సిద్ధమ్,
సేకోఽష్టభాగశిష్టః క్షౌద్రయుతస్సర్వదోషకుపితే నేత్రే. ౮

ఒకపలము త్రిఫలము మ్రానిపసుపును పదునారుపలముల యుదకములోవైచి ఎనిమిదవ భాగము మిగులునటుల చక్కఁగ కషాయముకాఁచి కొంచెము తేనెకలిపి సర్వదోషములచే కుపితంబైన నేత్రమునందు సేకముచేయించిన హితముకలుగును.

## నేత్రరోగమునకు శిగ్రురసోపయోగము.

వాతపిత్తకఫసన్నిపాతజాం
నేత్రయోర్బహువిధామపివ్యథామ్,
శీఘ్రమేవ జయతి ప్రయోజిత
శ్శిగ్రుపల్లవ రసః సమాక్షికః. ౯

మనగచిగుళ్లరసములో తేనెకలిపి నేత్రమునందు ప్రయోగించిన వాతపిత్తకఫ సన్నిపాతముల వలన జనించిన పలుతెఱంగులైన నేత్రోపద్రవములు శీఘ్రముగ శమించును.

## వాతాభిష్యందమునకు ఏరండమూలక్షీరోపయోగము.

తరుణమురుబూకపత్రంమూలంచ విభిద్య సిద్ధమాజే క్షీరే,
వాతాభిష్యందరుజం సద్యో వినిహంతి సక్తుపిండికాచోష్ణా. ౧౦

ఆముదపుచెట్టుయొక్క లేఁతచిగుళ్లవేళ్లను నలియఁగొట్టి మేకపాలలో చేర్చి చక్కఁగ కాఁచి ప్రయోగించినను, లేక దోషాద్యనుగుణముగ సత్తుపిండియుండలను ఉష్ణముగ ప్రయోగించినను, వాతాభిష్యందబాధలు హరించును.

### వాతాభిష్యందరోగమున ఆశ్చ్యోతనము.

ఆశ్చ్యోతనం మారుతజే క్వాథో బిల్వాదిభిర్హితః,
కోష్ణస్సైరండజటాబృహతీమధుశిగ్రుభిః. ౧౧
హ్రీబేరవక్రశార్ఙ్గేష్టోదుంబరత్వక్షు సాధితమ్,
సాంభసా పయసాఽజేన శూలాశ్చ్యోతనముత్తమమ్. ౧౨
మంజిష్ఠారజనీలాక్షాద్రాక్షర్ద్ధిమధుకోత్పలైః,
క్వాథస్సశర్కరశ్శీతస్సేచనం రక్తపిత్తజిత్. ౧౩

వాతాభిష్యందరోగమున బిల్వాదిగణద్రవ్యములు, ఆముదపువేళ్లు, పెద్దములక, ఎఱ్ఱమునగ వీనిని ఉదకములోవైచి చక్కఁగకాఁచి సుఖోష్ణముగ ఆశ్చ్యోతనము చేయించిన హితము కలుగును. కురువేరు, గ్రంథితగరము, శార్ఙ్గేష్ట, [అనఁగా క్రానుగు] మేడిపట్ట వీని నుదకములోవైచి చక్కఁగకాఁచి మేఁకపాలను కలిపి ఆశ్చ్యోతనమును చేయించిన కంటిపోటు శమించును. మంజిష్ఠి, పసుపు, లక్క, ద్రాక్షపండు, అతిమధురము, ఇప్పపట్ట, నల్లకలువ వీని నుదకములోవైచి చక్కఁగ కాఁచి అందులో పంచదారచేర్చి చల్లార్చి సేచనము చేయించిన రక్తపిత్తములచే కల్గిన నేత్రరోగములు హరించును.

### రక్తపిత్తజాభిష్యందరోగమునకు కశేర్వాదిప్రయోగము.

కశేరుయష్ట్యాహ్వరజస్తాంతవే శిథిలం స్థితమ్,
అప్సు దివ్యాసు నిహితం హితం స్యందేఽస్రపిత్తజే. ౧౪

తుంగముస్తలు, అతిమధురము వీనిచూర్ణమును సన్ననివస్త్రములో వదులుగ మూటగట్టి దివ్యోదకములో నుంచి నేత్రములపై ధరింపఁజేసిన రక్తపిత్తములవలన జనించిన యభిష్యందరోగము శమించును.

### రక్తపిత్తజాభిష్యందమునకు పుండ్రాదిధారణము.

పుండ్రయష్టీనిశామూర్వీ ప్లుతాస్తన్యే సశర్కరే,
ఛాగదుగ్ధేఽథ వా దాహరుగ్రాగాశ్రునివర్తనీ. ౧౫

చెఱుకు లేక తెల్లతామరపువ్వు, అతిమధురము, పసుపు వీనిని నలియఁగొట్టి మూటగట్టి శర్కరసహితముగనుండు చనుబాలలోనైనను, మేఁకపాలలోగాని ముంచి నేత్రములపై ధరింపఁజేసిన మంట, నొప్పి, ఎఱుపువర్ణము, అశ్రుస్రావము నివర్తించును.

పిత్తరక్తజాభిష్యందమునకు రోధ్రాదిప్రయోగము.

శ్వేతరోధ్రం సమధుకం ఘృతభృష్టం సుచూర్ణితమ్,
వస్త్రస్థం స్తన్యమృదితం పిత్తరక్తాభిఘాతజిత్. ౧౬

తెల్లలొద్దుగు, అతిమధురము వీనిని నేతిలో వేయించి చూర్ణముచేసి వస్త్రములో మూటగట్టి చనుపాలలోముంచి పిసికి నేత్రములయందు ప్రయోగించిన పిత్తరక్తములచేతను, అభిఘాతముచేతను జనించిన నేత్రరోగము శమించును.

కఫజాభిష్యందమున కాశ్చ్యోతనము

నాగరత్రిఫలానింబవాసారోధ్రరసం కఫే,
కోష్ణమాశ్చ్యోతనం-

శుంఠి, త్రిఫలములు, వేము, అడ్డసరము, లొద్దుగు వీనిరసములచే సుఖోష్ణముగ ఆశ్చ్యోతనము చేయించిన కఫజ నేత్రరోగము శమించును.

సన్నిపాతాభిష్యందమున కాశ్చ్యోతనము.

మిశ్రైర్భేషజైస్సాన్నిపాతికే. ౧౭

సన్నిపాతజాభిష్యందరోగమునకు పైనిచెప్పిన వాతాద్యభిష్యందరోగములకు వేరువేరుగజెప్పిన యౌషధముల నొకటిగ కలిపి చికిత్సలను చేయవలయును.

వాతజాద్యభిష్యందములకు రక్తస్రావము.

సర్పిః పురాణం పవనే పిత్తే శర్కరయాన్వితమ్,
వ్యోషసిద్ధం కఫే పీత్వా యవక్షారావచూర్ణితమ్. ౧౮
స్రావయేద్రుధిరం భూయస్తతఃస్నిగ్ధం విరేచయేత్,

వాతమువలన జనించిన నేత్రరోగమునకు పాతనెయ్యి, పిత్తమువలన జనించిన నేత్రరోగమునకు శర్కర చేర్పఁబడిన నెయ్యి, శ్లేష్మమువలన జనించిన నేత్రరోగమునకు త్రికటుకములతో కాచఁబడిననెయ్యి ఈమూఁడువిధములైన ఘృతములను యవక్షారచూర్ణములో కలిపి పానముచేయించి రక్తస్రావమును చేయించవలయును. పిదప స్నేహకర్మనొనర్చి విరేచనౌషధము నిప్పించవలయును.

అభిష్యందశూలహరలేపనము.

ఆనూపవేసవారేణ శిరోవదనలేపనమ్. ౧౯
ఉష్ణేన శూలే దాహే తు పయస్సర్పిర్యుతైర్హిమైః,
తిమిరప్రతిషేధం చ వీక్ష్య యుంజ్యాద్యథాయథమ్. ౨౦

అభిష్యందరోగికి నేత్రములయందు నొప్పికలిగినచో అనూపదేశజంతువులమాంసముయొక్క వేసవారమును కొంచెము వేడిగ శిరమునకును ముఖమునకును లేపనము చేయవలయును. అటులచేయుటచే మంటగలిగినచో శీతవీర్యద్రవ్యములను నూరి అందులో ఆవుపాలు, నెయ్యి కలిపి కంటిపై లేపనము చేయవలయును. మఱియు అభిష్యందరోగములయందు తిమిరరోగములకు చెప్పినయౌషధముల నాయారోగానుగుణముగ నొసంగవలయును.

## అధిమంథరోగచికిత్స.

అయమేవవిధిస్సర్వో మంథాదిష్వపి శస్యతే,

పైనిచెప్పిన చికిత్సలన్నిఁటిని మంథాదిరోగములయందును చేయవలయు. (వాతాభిష్యందమునకుఁ జెప్పినచికిత్సలను వాతాధిమంథమునకును, పిత్తాభిష్యందమునకుఁ జెప్పిన చికిత్సలు పిత్తాధిమంథమునకును, ఇటులనే తక్కిన కఫజ సంసర్గజ సన్నిపాతజాధిమంథములకును ఆయాయభిష్యంద చికిత్సలను వరుసగ చేయవలెననుట.)

## అధిమంథరోగమునందు దాహకర్మ

అశాంతౌ సర్వథా మంథే భ్రువోరుపరి దాహయేత్ ౨౧

పైనిచెప్పియుండు ప్రకారము చికిత్సచేసినను అది మంథరోగము శమించకయుండిన కనుబొమలను పైన దాహకర్మను చేయించవలయును.

## వాతనేత్రరోగహరవర్తి

రూప్యం రూక్షేణ గోదధ్నా లింపేన్నీలత్వమాగతే,

శుష్కే తు మస్తునా వర్తిర్వాతాఖ్యామయనాశినీ. ౨౨

ఆవుపెరుగును వెండిపాత్రకుపూసి ఆపెరుగు యెండి నల్లగనైనపిదప దానిని మెత్తి పెరుగుమీదిమీగడలో చేర్చి కణికజేసి ప్రయోగించిన వాతమువలన జనించిన అభిష్యంద నేత్రరోగము హరించును.

## పిత్తరక్తనేత్రరోగహరవర్తి.

సుమనఃకోరకాః శంఖస్త్రిఫలా మధుకం బలా,

పిత్తరక్తాపహా వర్తిః పిష్టా దివ్యేన వారిణా. ౨౩

జాజిమొగ్గలు, శంఖము, త్రిఫలములు, అతిమధురము, చిట్టాముట్టి వీనిని దివ్యోదకముతోనూరి వర్తిజేసి నేత్రములకు ప్రయోగించిన పిత్తరక్తములచే గల్గిన నేత్రరోగము హరించును

## శ్లేష్మనేత్రరోగహరవర్తి

సైంధవం త్రిఫలా వ్యోషం శంఖనాభిస్సముద్రజః,

ఫేనశ్శైలేయకం సర్జో వర్తిశ్శ్లేష్మాక్షిరోగనుత్. ౧౪

సైంధవలవణము, త్రిఫలములు, త్రికటుకములు, శంఖముయొక్క మధ్యభాగము, సముద్రపునురుగు, శిలాజిత్తు, సర్జరసము వీనిని నూరి వత్తిజేసి ప్రయోగించిన శ్లేష్మము వలన జనించిన యభిష్యంద నేత్రరోగములు హరించును.

## అభిష్యందరోగములకు పాశుపతయోగము.

ప్రపౌండరీకం యష్ట్యాహ్వాం దార్వీం చాష్టపలం పచేత్,
జలద్రోణే రసే పూతే పునః పక్వే ఘనే క్షిపేత్. ౧౫
పుష్పాంజనాద్దశపలం కర్షం చ మరిచాత్తతః,
కృతశ్చూర్ణోథవా వర్తిస్సర్వాభిష్యందసంభవాన్. ౧౬
హంతి రాగరుజాఘర్షాన్ సద్యో దృష్టిం ప్రసాదయేత్,
అయం పాశుపతో యోగో రహస్యం భిషజాం పరమ్. ౧౭

ప్రపౌండరీకము (కస్తూరపుబెండ), అతిమధురము, మ్రానిపసుపు వీనిని దినుసుకు ఎనిమిదిపలములచొప్పున గ్రహించి ద్రోణప్రమాణ ముదకములోవైచి చక్కగ కాచి వడియగట్టి మరల పొయిమీఁదబెట్టి కాచి యిగిరినపిమ్మట అందులో పుష్పాంజనము పదిపలములు, మిరియాలు ఒకకర్షముచేర్చి పక్వముచేయవలయును. పిదప దానినెత్తి చూర్ణముచేసి యాచూర్ణమునుగాని, దానిచే చేయఁబడిన వర్తిని (కణికను)గాని నేత్రములయందు ప్రయోగించిన అభిష్యందరోగములవలన నేత్రములయందు జనించిన యెరుపు వర్ణము, నొప్పి, మెరమెరలాడుట మొదలగునవి శమించుటయేగాక తత్క్షణమే దృష్టికి నైర్మల్యము కలుగును. ఇది పాశుపతయోగమనఁబడును. ఇది వైద్యులకు మిగుల రహస్యమైన యోగము.

## శుష్కాక్షిపాకరోగచికిత్స

శుష్కాక్షిపాకే హవిషః పానమక్ష్ణోశ్చ తర్పణమ్,
ఘృతేన జీవనీయేన నస్యం తైలేన చాణునా. ౧౮
పరిషేకో హితశ్చాత్ర పయః కోష్ణం ససైంధవమ్,

శుష్కాక్షిపాకరోగమునకు ఘృతపానమును, జీవనీయగణద్రవ్యములతో పక్వము చేయఁబడిన ఘృతముచే నేత్రములకు తర్పణచికిత్సలను, అణుతైలముచే నస్యమును చేయించవలయును. మఱియు ఆవుపాలను చక్కఁగా కాచి సుఖోష్ణమగనుండునపుడందు సైంధవలవణమునుచేర్చి పరిషేకమునుచేయించిన నేత్రములకు హితముకలుగును.

### శుష్కాక్షిపాకరోగ హరాంజనము

సర్పిష్యుక్తం స్తన్యపిష్టమంజనం హి మహౌషధమ్. ౨౯
వసా చానూపసత్త్వోత్థా కించిత్సైంధవనాగరా,
ఘృతాక్తాక్ష దర్పణే ఘృష్టాః కేశాన్మల్లకసంపుటే. ౩౦
దగ్ధ్వాజ్యపిష్టాలోహస్థా సా మషీ శ్రేష్ఠమంజనమ్,

శుంఠిని చనుపాలతో నూరి అందులో ఆవునేతిని చేర్చి కండ్లకంజనము వేసినను, లేక అనూపదేశజంతువులయొక్క కొవ్వులో శుంఠి, సైంధవలవణము వీనిచూర్ణములను కొంచెముగాచేర్చి దానిచే యంజనము వేసినను శుష్కాక్షిపాకరోగము మానును. మఱియు మనుజుని తలవెండ్రుకలను ఆవునేతిలో తడిపి అద్దముపై చాది మల్లకసంపుటములో (గుడ్డుచే చేయఁబడిన సంపుటమున)నునిచి కాల్చి యామసినిగ్రహించి ఆవునేతిలోకలిపి లోహపాత్రలో నుంచుకొని యంజనము వేసిన శుష్కాక్షిపాకరోగము హరించును.

### సశోఫాల్పశోఫచికిత్స

సశోఫే చాల్పశోఫే చ స్నిగ్ధస్య వ్యధయేత్సిరామ్. ౩౧
రేకః స్నిగ్ధైః పునర్ద్రాక్షాపథ్యాక్వాథత్రివృద్ఘృతైః,

సశోఫము అల్పశోఫము అను నేత్రరోగములయందు రోగికి స్నేహకర్మను చేయించి సిరలను వేధించి పిదప ద్రాక్ష, కరక్కాయలకషాయము, తెగడను చేర్చి కాఁచబడిన ఘృతము వీనిచే విరేచనమునకొసంగవలయును.

### సశోఫాదిరోగశూలహరసేకము

శ్వేతరోధ్రం ఘృతభృష్టం చూర్ణితం తాంతవస్థితమ్. ౩౨
ఉష్ణాంబునా విమృదితం సేకశ్శూలహరః పరమ్,
దార్వీప్రపౌండరీకస్య క్వాథో వా౽౽శ్చ్యోతనే హితః. ౩౩

తెల్లలొద్దుగను నేతిలో వేయించి చూర్ణము చేసి గుడ్డలో మూటగట్టి ఉష్ణోదకములోముంచి పిసికి సేకము చేయించిన సశోఫాల్పశోఫనేత్రరోగశూలలు హరించును. సశోఫాల్పశోఫరోగములయందు మ్రానిపసుపు ప్రపౌండరీకము (కూవరపుబెండ) వీని కషాయముతో నాశ్చ్యోతనమును చేయించిన సౌఖ్యము కలుగును.

సంధావాంశ్చ ప్రయుంజీత ఘర్షరాగాశ్రురుగ్ఘరాన్,

నేత్రరోగములయందు నొప్పి యెరుపుపర్ణము ఉదకస్రావము వీనిని శమింపఁజేయుటకై యిఁకఁ జెప్పఁబోయెడు సంధానయోగములను ప్రయోగించవలయును.

## నేత్రరోగములకు సంధావయోగములు

తామ్రేలోహే మూత్రఘృష్టం ప్రయుక్తం
నేత్రే సర్పిర్ధూపితం వేదనాఘ్నమ్,
తామ్రేఘృష్టో గవ్యదధ్నస్సరో వా
యుక్తః కృష్ణాసైంధవాభ్యాం వరిష్ఠః. ३४

ఇనుపపాత్రలో కొంచెము గోమూత్రమునుబోసి తామ్రపాత్రతోరుద్ది దానికి
ౘనేతితో ధూపమువేసి గ్రహించి నేత్రములకంజనమువేసినను, లేక తామ్రపాత్రలో
ౘపెరుగుమీఁది మీగడను వేసి మఱియొక తామ్రపాత్రతోరుద్ది పిప్పళ్లు, సైంధవలవ
ము వీనిచూర్ణమును చేర్చి నేత్రములయం దంజనమువేసినను నొప్పి మొదలగు నుప
ద్రవములు హరించును. ఇది మిక్కిలి శ్రేష్ఠమైన సంధావము.

## శంఖసంధావము.

శంఖం తామ్రే స్తన్యఘృష్టం ఘృతాక్తై
శ్శమ్యాః పత్రైర్ధూపితం తద్యవైశ్చ,
నేత్రే యుక్తం హంతి సంధావసంజ్ఞం
క్షిప్రం ఘర్షం వేదనాం చాతితీవ్రామ్. ३५

తామ్రపాత్రలో చనుపాలనుబోసి శంఖముచే రుద్ది దానికి నేతిలో తడపఁబడిన
జమ్మియాకులతోడను జమ్మివిత్తులతోడను ధూపమువేసి నేత్రములకంజనమువేసిన దారుణ
మైన నొప్పి మొదలగు నుపద్రవములు శీఘ్రముగశమించును. ఇది సంధావమనఁబడును.

## ఉదుంబరఫలసంధావము.

ఉదుంబరఫలం లోహఘృష్టం స్తన్యేన ధూపితమ్,
సాజ్యైశ్శమీచ్ఛదైర్దాహశూలరాగాశ్రుహర్షజిత్. ३౬

లోహపాత్రయందు చనుబాలతో మేడిపండును రుద్ది ఘృతములో తడపఁబడిన
జమ్మియాకులతోడ ధూపమువేసి నేత్రముల కంజనము వేసిన మంట, నొప్పి, యెరు
పెక్కుము, ఉదకస్రావము మొదలగు నుపద్రవములు శమించును.

## శిగ్రుపల్లవ సంధావము

శిగ్రుపల్లవనిర్యాసస్సుఘృష్టస్తామ్రసంపుటే,
ఘృతేన ధూపితో హంతి శోఫఘర్షాశ్రువేదనాః. ३७

మునగ చిగుళ్లరసమును తామ్రపాత్రలో బోసి మఱియొక తామ్రపాత్రతో
బాగారుద్ది ఘృతముతో ధూపమువేసి నేత్రముల కంజనమువేసిన వాపు, మెరమెర
మంట, ఉదకస్రావము, నొప్పియు హరించును.

మృత్కపాలాదిసంధానము.

తిలాంభసా మృత్కపాలం కాంస్యే ఘృష్టం సుధూపితమ్,
నింబపత్రై ర్ఘృతాభ్యక్తైర్ఘర్షశూలాశ్రురాగజిత్. ౩౮

కంచుపాత్రలో నువ్వులను వేసి యుదకముబోసి కుండపెంకులతో రుద్ది దానికి నేతిలో తడుపఁబడిన వేపాకుతో ధూపము వేసి నేత్రములకు అంజనము వేసిన ఘర్షము మెరమెరలాడుట, నీరుకారుట, ఎరుపువర్ణము ఇవి హరించును.

సంధావప్రయోగానంతరకర్తవ్యము.

సంధావేనాంజితే నేత్రే విగతౌషధవేదనే,
స్తన్యేనాశ్చ్యోతనం కార్యం త్రిః పరం నాంజయేచ్చ తైః. ౩౯

పైనిచెప్పిన సంధావయోగములచే నేత్రముల కంజనము వేసిన నొప్పి శమించును. పిదప నేత్రములకు చనుబాలచే ఆశ్చ్యోతనమును చేయింపవలయును. పై సంధావములచే మూఁడుపర్యాయములకు పైన అంజనము వేయఁజనదు.

నేత్రరోగమునకు తాళీపాదిగుటికలు

తాళీసపత్రచపలానతలోహరజోంజనైః,
జాతీముకుళకాసీససైంధవైర్మూత్రపేషితైః. ౪౦
తామ్రమాలిప్య సప్తాహం ధారయేత్పేషయేత్తతః,
మూత్రేణైవాను గుటికాః కుర్యాచ్ఛాయావిశోషితాః. ౪౧
తాస్తన్యఘృష్టా ఘర్షాశ్రుశోఫకండూవినాశనాః,

తాళిసపత్రి, పిప్పళ్లు, గ్రంథితగరము, ఉక్కురాపొడి, సౌవీరాంజనము, జాజిమొగ్గలు, కాసీసము, సైంధవలవణము వీనిని సమభాగములుఁగ గ్రహించి గోమూత్రముతో చక్కఁగనూరి తామ్రపాత్రకు బూసి యేడుదినములుంచి పిదప దానినెత్తి గోమూత్రముతో నూరి గుటికలుచేసి నీడనెండించి చనుబాలతో రుద్ది కంటి కంజనము వేసిన మెరమెరలాడుట, నీరుకారుట, వాపు, దురద యివి హరించును.

నేత్రరోగమునకు వ్యాఘ్ర్యాదికల్కము.

వ్యాఘ్రీత్వఙ్మధుకం తామ్రరజోఽజాక్షీరకల్కితమ్. ౪౨
శమ్యామలకపత్రాజ్యధూపితం శోఫరుక్ప్రణుత్,

ప్రామడుపట్ట, అతిమధురము, రాగిరాపొడి వీనిని మేకపాలతో చక్కఁగ నూరి దానికి జమ్మియాకు, ఉసిరికయాకు వీనిని నేతిలోతడిపి ధూపము వేసి పిదప దానిచే నేత్రముల కంజనము వేసిన వాపు, శూల హరించును.

## అమ్లోషితరోగచికిత్స.

అమ్లోషితే ప్రయుంజీత పిత్తాభిష్యందసాధనమ్. ౪౩

అమ్లోషిత నేత్రరోగమునకు పిత్తాభిష్యందరోగమునకుఁ జెప్పిన చికిత్సలను చేయవలయును.

## పిల్లరోగచికిత్స.

ఉత్క్లిష్టాః కఫపిత్తాస్రనిచయోత్థాః కుకూణకః,
పక్ష్మోపరోధశుష్కాక్షిపాకః పూయాలసో బిసః. ౪౪
పోథక్యమ్లోషితోల్పాఖ్యాంస్యందమంథా వినానిలాత్,
ఏతేఽష్టాదశ పిల్లాఖ్యా దీర్ఘకాలానుబంధినః. ౪౫
చికిత్సా పృథగేతేషాం స్వాంస్వముక్తాథ వక్ష్యతే,
పిల్లీభూతేషు సామాన్యాత్.

కఫ, పిత్త, రక్త, సన్నిపాతములచే వేరువేరజనించిన ఉత్క్లిష్టనేత్రరోగములు నాల్గు, కుకూణకము, పక్ష్మోపరోధము, శుష్కాక్షిపాకము, పూయాలసము, బిసము, పోథకి, అమ్లోషితము, అల్పశోఫము, పిత్తాభిష్యందము, కఫాభిష్యందము, రక్తాభిష్యందము, పిత్తాదిమంథము, కఫాధిమంథము, రక్తాధిమంథము ఈపదునెనిమిదిరోగములు ప్రత్యేకముగగాని, మిశ్రముముగగాని నేత్రములయందు చిరకాల మనువర్తింపుచుండిన పిల్లమను పేరుగల నేత్రరోగముగా పరిణమించును. పైనిచెప్పిన యుత్క్లిష్టాదిరోగములకు ప్రత్యేకప్రత్యేకముగ ఆయాదోషానుగుణముగ చికిత్సలు జెప్పఁబడియుండినను పిల్లరోగముగనైయుండు యారోగములకు చికిత్స లిఁక సామాన్యముగ చెప్పఁబడును.

## పిల్లరోగసామాన్యచికిత్స.

అథ పిల్లాక్షిరోగిణః. ౪౬
స్నిగ్ధస్య చ్ఛర్దితవతః స్సిరావిద్ధహృతాస్రుజః,
విరిక్తస్య చ వర్త్మానునిర్లిఖేదావిశుద్ధితః. ౪౭

పిల్లమను నేత్రరోగము కలవానికి స్నేహస్వేదకర్మలు, వమనము, సిరావేధము, రక్తమోక్షణము, విరేచనము వీనిని యథాక్రమముగ చేయించి పిల్లరోగము శమించువరకు కంటి ఱెప్పను పలుమారు శస్త్రముచే గీచుచుండవలయును.

## పిల్లరోగమునకు తుత్థకాదిలేపనము.

తుత్థకస్య పలం శ్వేతమరిచానిచ వింశతిః,

త్రింశతా కాంజికపలైః పిష్ట్వా తామ్రే నిధాపయేత్. ౪౮
పిల్లానపిల్లాన్ కురుతే బహువర్షోత్థితానపి,
తత్సేకేనోపదేహాంస్తు కండూశోఫాంశ్చ నాశయేత్. ౪౯

మైలుతుత్థము ఒక పలము, తెల్లమిరియాలు ఇరువది వీనిని ముప్పదిపలములు పులికడుగుతో నూరి తామ్రపాత్రలో నుంచుకొని దానిచే నేత్రములను సేకము చేయించిన బహుసంవత్సరములుగ జనించియుండు పిల్లరోగములు, ఉపదేహము, దురద, వాపు ఇవి నశించును.

### పిల్లరోగహరాంజనము.

కరంజబీజం సురసం సుమనఃకోరకాణి చ,
సంక్షుద్య సాధయేత్క్వాథే పూతే తత్ర రసక్రియా. ౫౦
అంజనం పిల్లభైషజ్యం పక్ష్మణాం చ ప్రరోహణమ్,

కానుగవిత్తులు, తులసి, జాజిమొగ్గలు వీనిని నలియఁగొట్టి ఉదకములో వైచి చక్కఁగ కషాయము కాఁచి వడియగట్టి అందు రసక్రియను జేసి అంజనము వేసిన పిల్లరోగము మానును. ఊడిపోయినరెప్ప వెండ్రుకలు మరల మొలుచును.

### పిల్లరోగమునకు రసాంజనాద్యంజనము.

రసాంజనం సర్జరసో *రీతిపుష్పం మనశ్శిలా. ౫౧
సముద్రఫేనం లవణం గైరికం మరిచాని చ,
అంజనంమధునా పిష్టం క్లేదకండూఘ్నముత్తమమ్. ౫౨
అభయారసపిష్టం వా తగరం పిల్లనాశనమ్,
భావితం బస్తమూత్రేణ సస్నేహం దేవదారు చ. ౫౩

రసాంజనము, సర్జరసము, పుష్పాంజనము, మణిశిల, సముద్రపు నురుగు, సైంధవలవణము, కావిరాయి, మిరియాలు వీనిని తేనెతో నూరి యంజనము వేసిన అశ్రుస్రావము, దురదయు హరించును. ఇది ఉత్తమమైన యంజనము. కరక్కాయకషాయముతో గ్రంథితగరమును నూరి అంజనము వేసినను, లేక గొఱ్ఱెమూత్రములో దేవదారు చెక్కను భావనచేసి నూరి అందులో ఘృతాదిస్నేహములను కలిపి యంజనము వేసినను పిల్లరోగము హరించును.

---

* జాతీపుష్పం.

## పిల్లరోగహరవర్తి.

సైంధవ త్రిఫలా కృష్ణా కటుకా శంఖనాభయః,
సతామ్రరజసో వర్తిః పిల్లశుక్రకనాశినీ. ౫౪

సైంధవలవణము, త్రిఫలములు, పిప్పళ్లు, కటుకరోహిణి, శంఖముయొక్కభాగము, రాగిరాపాడి వీనినినూరి వర్తిజేసి యంజనము వేసిన పిల్లరోగము శుక్రరోగము హరించును.

## పిల్లరోగమునకు పుష్పకాసీసచూర్ణోపయోగము.

పుష్పకాసీసచూర్ణోవా సురసారసభావితః,
తామ్రే దశాహం తత్త్వైల్యపక్ష్మశాతజిదంజనమ్. ౫౫

పుష్పకాసీసములు చూర్ణముచేసి తామ్రపాత్రలోనైచి తులసిరసముబోసి పదినములు నానబెట్టి పిదప అంజనము వేసిన పిల్లరోగము రెప్పవెండ్రుకలూడుట ఇవి హరించును.

## పిల్లరోగమునకు హరితాళాదిచూర్ణము.

అలం చ సౌవీరకమంజనం చ
తాభ్యాం సమం తామ్రరజశ్చ సూక్ష్మమ్,
పిల్లేషు రోమాణి నిషేవితో౽సౌ
చూర్ణఃకరోత్యేకశలాకయాపి. ౫౬

హరిదళము, సౌవీరాంజనము యివి సమభాగములు, వీనికిసమము రాగిరాపాడి, వీనొకటిగచేర్చి చక్కగ చూర్ణముచేసి దానిని నొక్కశలాకచే యంజనమువేసిన పిల్లరోగము నివర్తించి రెప్పవెండ్రుకలు చక్కగ మొలుచును.

## పిల్లరోగహరమషి.

లాక్షానిర్గుండీభృంగదార్వీరసేన
శ్రేష్ఠం కార్పాసం భావితం సప్తకృత్వః,
దీపః ప్రజ్వాల్యస్సర్పిషా తత్సముత్థా
శ్రేష్ఠాపిల్లానాం రోపణార్థే మషీ సా. ౫౭

లక్క, నల్లవావిలియాకు, గుంటగలగర, మ్రానిపసుపు వీనిరసములలో నేడు ర్యాయములు పత్తిని భావనచేసి వత్తిజేసి నేతిలోతడిపి దీపము వెలిగించి దానిలో

జనించిన మసిని యంజనమువేసిన పిల్లరోగముశమించి ఱెప్పవెండ్రుకలు చక్కఁగ మొలుచును.

## పిల్లరోగమునకు రక్తమోక్షణాదులు.

వర్త్మావలేఖం బహుశ స్తద్వచ్ఛోణిత మోక్షణమ్,
పునః పునర్విరేకం చ నిత్యమాశ్చ్యోతనాంజనమ్. ౫౮
నావనం ధూమపానం చ పిల్లరోగాతురో భజేత్,
పూయాలసే త్వశాంతేంతర్దాహస్సూక్ష్మశలాకయా. ౫౯

పిల్లరోగముగలవాఁడు ఱెప్పలను పలుమారు గీచుకొనుటయేగాక రక్తమోక్షణము విరేచనము ఆశ్చ్యోతనము అంజనము నస్యము ధూమపానము వీనిని పలుమారు చేయించుకొనవలయును. ఇట్లు చేసినను పిల్లరోగముగా పరిణమించిన పూయాలస రోగము నివర్తించకుండిన సూక్ష్మశలాకచే కంటిలోపల దాహకర్మను చేయించుకొనవలయును.

## నేత్రరోగసంఖ్య.

చతుర్నవతి రిత్యక్ష్ణో ర్హేతులక్షణసాధనైః,
పరస్పరమసంకీర్ణాః కార్త్స్న్యేన గదితా గదాః. ౬౦

ఇత్తెఱంగున తొంబదినాల్గు నేత్రరోగములు వానివాని నిదానలక్షణములతోడను, చికిత్సలతోడను పూర్తిగఁ జెప్పఁబడినవి.

మఱియు సుశ్రుతాచార్యుండు-'షట్సప్తతిర్నేత్రరోగాః సంగ్రహేణ ప్రకీర్తితాః' అని నేత్రరోగములు డెబ్బదియాఱుగ పరిగణనముచేసి ప్రత్యేకలక్షణాదుల వివరించెను. వాగ్భటాచార్యుఁడు మఱికొన్ని నేత్రరోగములఁగనిపెట్టి వానినన్నిఁటినిజేర్చి తొంబదినాల్గని పరిగణనముచేసి వానిలక్షణచికిత్సాదుల వివరించెనని విజ్ఞులు గమనించెదరుగాఁత?

## నేత్రహితకరాహారాదులు.

సర్వదా చ నిషేవేత స్వస్థోపి నయనప్రియః,
పురాణయవగోధూమ శాలిషష్టికకోద్రవాన్. ౬౧
ముద్గాదీన్ కఫపిత్తఘ్నాన్ భూరిసర్పిః పరిప్లుతాన్,
శాకం చైవం విధం మాంసం జాంగలం దాడిమంసితామ్. ౬౨
సైంధవం త్రిఫలాం ద్రాక్షాం వారి పానే చ నాభసమ్,

ఆతపత్రం పదత్రాణం విధివద్దోషశోధనమ్. ౬౩

నేత్రసంరక్షణమును దిచ్ఛగలమనుజుఁడు రోగరహితుఁడుగ నుండినను పాతదిగ
ండు యవలు గోధుమలు రొట్టసంబాధాన్యము ముప్పదిదినములకు ఫలించెడు ధాన్య
ు, కొఱ్ఱలు, పెసలు, కఫపిత్తములను పోఁగొట్టునట్టి ద్రవ్యములు వీనిని విశేషముగ
వునేతిలో సేవింపవలయును. మఱియు కఫపిత్తహరములైన శాకములు, జాంగలమాం
ము, దానిమ్మ, పంచదార, సైంధవలవణము, త్రిఫలములు, ద్రాక్ష, ఆకాశోదకము
నిసేవించుచును; గొడుగును, పాదరక్షలును ధరించుచును విధ్యుక్తప్రకారము శోధన
కిత్సను సర్వదా సేవించుచుండవలయును.

## నేత్రరోగికి వర్జనీయములు.

వర్జయేద్వేగసంరోధమజీర్ణాధ్యశనాని చ,
శోకక్రోధదివాస్వప్ననిశాజాగరణాని చ ౬౪
విదాహి విష్టంభకరం యచ్చేహాహారభేషజమ్,

మలమూత్రాదివేగముల నడ్డగించుట, అజీర్ణముగనుండునపుడు భుజించుట, భు
చినతోడనే మరల భుజించుట, శోకము కోపము పగటియందు నిద్రించుట, రాత్రు
యందు నిద్రించకుండుట, అజీర్ణకారిగ మలబంధకారిగనుండు ఆహారౌషధములను
ంచుట వీనిని నేత్రరోగము గలవారును నేత్రరక్షణమును గోరువారును వర్జింప
యును.

## పాదాభ్యంజనాద్యావశ్యకత్వము.

ద్వే పాదమధ్యే పృథు సన్నివేశే
సిరే గతే తే బహుధా చ నేత్రే,
తా మ్రక్షణోద్వర్తనలేపనాదీన్
పాదప్రయుక్తాన్నయనం నయంతి. ౬౫
మలోష్ణసంఘట్టనపీడనాద్యై
స్తా దూషయంతే నయనానిదుష్టాః,
భజేత్సదా దృష్టిహితాని తస్మా
దుపానదభ్యంజనధావనాని. ౬౬

పాదముల (అరికాళ్ల) మధ్య ప్రదేశమున లావుగనుండు రెండు సిరలు గలవు. ఆ పాదములలో నుండి నేత్రములను తలుచుగ వ్యాపించియుండును. కావున పాదములకు చేయు తైలాభ్యంజనము నలుగు లేపనము మొదలగువానిని పైసిరలు నేత్రములకు కొంపోవుచున్నయవి. మఱియు పాదములయందు మలము ఉష్ణమైన వస్తువులు పీడ మొదలగునవి సంబంధించినచో పైసిరలు దుష్టంబులై నేత్రములకు చెరుపును కలుగఁజేయును. కావున దృష్టికి హితకరములైన పాదరక్షలు ధరించుట పాదాభ్యంజనము చేసికొనుట, కాళ్లనుచక్కఁగ కడిగికొనుట వీని నెల్లపుడు చేయుచుండవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
పదునాఱవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# సప్తదశాధ్యాయము.

అవ. అక్షిరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము నేత్రములకు సమీపమున నుండు కర్ణములలో జనించు రోగములను తెలియపఱచుటకై కర్ణరోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నది:—

## కర్ణరోగ విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతః కర్ణరోగవిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

సర్వాక్షిరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము శాలాక్యతంత్రములోనికర్ణములలో జనించురోగములను తెలియఁబఱచునట్టి కర్ణరోగవిజ్ఞానీయమను నీయధ్యాయమును వివరించెదము.

### వాతజకర్ణరోగలక్షణము.

ప్రతిశ్యాయజలక్రీడాకర్ణకండూయనైర్మరుత్,
మిథ్యాయోగేన శబ్దస్య కుపితోఽన్యైశ్చ కోపనైః. ౧
ప్రాప్య శ్రోత్రసిరాః కుర్యాచ్ఛూలం స్రోతసి వేగవత్,
అర్ధావభేదకం స్తంభం శిశిరానభినందనమ్ ౨
చిరాచ్చ పాకం పక్వం తు లసీకామల్పశస్స్రవేత్,
శ్రోత్రం శూన్య మకస్మాచ్చ స్యాత్సంచారవిచారవత్. ౩

పీనసరోగము, జలక్రీడ వీనిచేతను చెవులలోపల పుల్లమొదలగువానిచే గోఁకికొనుటచేతను, ధ్వనియొక్క మిథ్యాయోగముచేతను, వాతప్రకోపకరములైన యితరహేతువులచేతను, వాతము ప్రకోపించి చెవులయందలి సిరలనుజేరి కర్ణరంధ్రములయందు వ్రమైన శూలను కలుగఁజేయును. మఱియు అర్ధావభేదకము శిరోరోగము కర్ణస్తంభము శీతలవస్తువులయందు ద్వేషము చిరకాలముమీఁద వ్రణము వీనిని కలుగఁజేయును,

దానినుండి కొంచెముకొంచెముగా లసీకా (అనఁగా పులినీరు) స్రవించును. చెవులు వినిపించకయే యుండును. ఒకప్పుడు వినుచును మరియొకప్పుడు వినకయు నుండును.

### పిత్తజకర్ణరోగలక్షణము.

శూలం పిత్తాత్సదాహోషా శీతేచ్ఛాశ్వయథుం జ్వరమ్,
ఆశుపాకం ప్రపక్వం చ సపీతలసికాస్రుతిమ్. ౮
సా లసీకా స్పృశేద్యద్యత్తత్తత్పాకముపైతి చ,

పిత్తప్రకోపముచే చెవులయందు పోటు, మంట, తాపము, శీతవస్తువులయందిచ్ఛ, వాపు, జ్వరము, శీఘ్రముగ పుండగుట యివి కలుగును. చెవులలో వ్రణము పండియుండినచో కొంచెము పసుపువర్ణముగల పులినీరు స్రవించును. ఈనీరు శరీరమున తగిలినచోట్లయందెల్ల వ్రణమగును.

### కఫజకర్ణరోగలక్షణము.

కఫాచ్ఛిరో హనుగ్రీవా గౌరవం మందతా రుజః. ౯
కండూః శ్వయథురుష్ణేచ్ఛా పాకాచ్ఛ్వేతఘనా స్రుతిః,

కఫప్రకోపమువలన జనించిన కర్ణరోగమున శిరము, దవుడలు, మెడ ఇవి బరువుగనుండును. నొప్పి కొంచెముగ నుండును. చెవులయందు దురద వాపుకలుగును. ఉష్ణవస్తువులయందిచ్ఛ జనించును. రోగము పండినచో చెవులలోనుండి తెల్లగ గట్టిగనుండు చీముకారును.

### రక్తజకర్ణరోగలక్షణము.

కరోతి శ్రవణే శూలమభిఘాతాదిదూషితమ్. ౧౦
రక్తం పిత్తసమానార్తిం కించిద్వాఽధికలక్షణమ్,

దెబ్బలు మొదలగు నభిఘాతములచే చెవులయందలి రక్తము దుష్టంబై చెవులయందు నొప్పిని పిత్తజకర్ణరోగమునకు చెప్పియుండు నుపద్రవములను స్వల్పముగగాని అధికముగ గాని కలుగఁజేయును.

### సన్నిపాతజకర్ణరోగలక్షణము.

శూలం సముదితైర్దోషైస్సశోఫజ్వరతీవ్రరుక్. ౧౧
పర్యాయాదుష్ణశీతేచ్ఛం జాయతే శ్రుతిజాడ్యవత్,
పక్వం సితాసితారక్తఘనపూయప్రవాహి చ. ౧౨

సన్నిపాతదోషమువలన జనించిన కర్ణరోగమునందు వాపు, జ్వరము, అధికమైన నొప్పి, ఒకపుడుష్ణమునం దిచ్ఛ, మఱియొకపుడు శీతమునందిచ్ఛ, చెవులలో చీముకారు ట ఈలక్షణములు కలుగును. పైకర్ణరోగము పండినచో తెల్లగ, నల్లగ, యెఱ్ఱగ గట్టిగ నుండు చీము స్రవించును.

కర్ణనాదరోగములు.

శబ్దవాహిసిరాసంస్థే శృణోతి పవనే ముహుః,
నాదానకస్మాద్వివిధాన్ కర్ణనాదం వదంతి తమ్. ౯

వాతము శబ్దమును వహించునట్టి సిరలను చేరినచో చెవులకు పలువిధములైనశబ్దము కస్మాత్తుగ (శబ్దము లేకున్నను) వినఁబడును. దీనిని కర్ణనాదరోగ మనియెదరు.

బధిరలక్షణము.

శ్లేష్మణానుగతో వాయుర్నాదో వా సముపేక్షితః,
ఉచ్చైః కృచ్ఛ్రాచ్ఛ్రుతిం కుర్యాద్బధిరత్వం క్రమేణ చ. ౧౦

శ్లేష్మముతోఁగూడి యుండు వాతమునకు గాని, కర్ణనాదరోగమునకు గాని, చికిత్సచేయక యుపేక్షించినచో చెవులకు కడుకష్టముమీఁద శబ్దము వినఁబడును. క్రమ క్రమముగ చెవిటితనము కలుగును.

ప్రతీనాహరోగలక్షణము.

వాతేన శోషితశ్శ్లేష్మా స్రోతో లింపేత్తతో భవేత్,
రుగ్గౌరవం పిధానం చ సప్రతీనాహసంజ్ఞితః. ౧౧

శ్లేష్మము వాతముచే శోషింపఁబడినదై కర్ణద్వారములయం దంటికొనును. దాని న చెవులయందు నొప్పి గురుత్వము చెవులు అడచికొనియుండుట మొదలగునవి కలు ను. ఇది ప్రతీనాహరోగ మనఁబడును.

కండూశోఫరోగలక్షణము.

కండూశోఫౌ కఫాచ్ఛ్రోత్రే స్థిరౌ తత్సంజ్ఞయా స్మృతౌ,

దురద వాపు ఇవి కఫమువలన చెవులయందు స్థిరముగనుండును ఇది కండూశోఫ గ మనఁబడును.

పూతికర్ణరోగలక్షణము.

కఫో విదగ్ధః పిత్తేన సరుజం నీరుజం త్వపి. ౧౨
ఘనపూతిబహుక్లేదం కురుతే పూతికర్ణకమ్,

కఫము పిత్తముతోఁగూడినదై నొప్పితోడగాని నొప్పిలేకగాని గట్టిగను దుర్గంధయుక్తముగను నుండు గుబిలిని కలుగఁజేయును. దీనికి పూతికర్ణమను పేరుకలదు.

## క్రిమికర్ణరోగలక్షణము.

వాతాదిదూషితం శ్రోత్రం మాంసాసృక్క్లేదజాం రుజమ్. ౧౩
ఖాదంతో జంతవః కుర్యుస్తీవ్రాం స క్రిమికర్ణకః,

వాతాదులచే దూషితంబైన చెవులయందు క్రిములు జనించి చెవులను తినుచు మాంసరక్తక్లేదములవలన తీవ్రమైన వేదనలను కలుగఁజేయును. దీనికి క్రిమికర్ణకమను పేరుకలదు.

## కర్ణవిద్రధిరోగలక్షణము.

శ్రోత్రకండూయనాజ్జాతే క్షతే స్యాత్పూర్వలక్షణః. ౧౪
విద్రధిః పూర్వవచ్చాన్యః-

చెవులలో జనించెడు దురదను పోఁగొట్టుకొనుటకై పుల్లలు మొదలగువానిచే చెవులలో గీరికొనుటవలన గాయముజనించి దానియందు పైక్రిమికర్ణమునకు చెప్పియుండు లక్షణములు కలుగును. దానికి కర్ణవిద్రధియను పేరు.

"యశ్శోఫో బహిరంతర్వామహామూలో మహారుజః,
వృత్తః స్యాదాయతో యో వా స్మృతః షోఢా స విద్రధిః."

పెద్దవేరుగలదిగను, అధికముగ నొప్పితో గూడినదిగను, గుండ్రముగను, లేక నిడివిగను ఉండు వాపు చెవులలోపలగాని వెలుపలగాని జనించును. ఇది విద్రధియనఁబడునని నిదానస్థానమున జెప్పఁబడెను. అట్టి విద్రధి లక్షణములు కల్గి పైజెప్పిన రీతిగ విద్రధరోగము కల్గునని భావము.

## కర్ణశోఫరోగలక్షణము.

శోఫోఽర్శోఽర్బుదమీరితమ్,
తేషు రుక్పూతికర్ణత్వం బధిరత్వం చ జాయతే. ౧౫

కర్ణార్శస్సు కర్ణార్బుదము అను రోగములయందు చెవులలో శూల దుర్గంధము చెవిటితనము కలుగును.

"అర్శోధిమాంసం వర్త్మాంతస్తబ్ధం స్నిగ్ధం సదాహరుక్,
రక్తం రక్తేన తత్స్రావి భిన్నంభిన్నం వివర్ధతే.
వర్త్మాంతర్మాంసపిండాభశ్శ్వయథుర్గ్రథితో రుజః,
సాస్రైస్స్యాదర్బుదో దోషైర్విషమో బాహ్యతశ్చలః."

రక్తదోషముచే చెవులయొక్క లోభాగమునందలి మాంసముపై రక్తము యివి స్తబ్ధతనొంది మంట శూలవీనితోఁగూడి యుంటగట్టియుండును. దానిలోనుండి రక్తము స్రవింపుచుండును. దీనిని భేదించిన మరల వృద్ధిఁజెందుచుండును. ఇది కర్ణార్శస్సనఁబడును. కర్ణద్వారమున మాంసపిండమువంటి వాపు జనించి నొప్పిలేక చలించుచు నుండును. ఇది కర్ణార్బుద మనఁబడునని కర్ణార్శః కర్ణార్బుద లక్షణంబులు తంత్రాంతరమున జెప్పఁబడియున్నవి.

### కూచికర్ణరోగలక్షణము.

గర్భేఽనిలాత్సంకుచితా శష్కులీ కూచికర్ణకః,

చెవితమ్మె లోభాగమున వాతప్రకోపమువలన ముడిచికొనియుండును. ఇది కూచికర్ణకమని చెప్పఁబడును.

### కర్ణపిప్పలీరోగలక్షణము.

ఏకో నీరుగనేకో వా గర్భే మాంసాంకురస్థిరః. ౧౬

పిప్పలీ పిప్పలీమానః.

చెవి లోభాగమున పిప్పలితో సమానాకారముగలదియు, గట్టిగనుండునదియు, నొప్పిలేనిదియునైన మాంసాంకురము ఒకటిగాని అనేకములుగాని జనించును. దీనికి కర్ణపిప్పలియని పేరుకలదు.

### కర్ణవిదారికారోగలక్షణము.

సన్నిపాతాద్విదారికా,

సవర్ణస్సరుజ స్తబ్ధశ్శ్వయథుస్స ఉపేక్షితః. ౧౭

కటుతైలనిభం పక్వస్స్రవేత్కృచ్ఛ్రేణ రోహతి,

సంకోచయతి రూఢా చ సా ధ్రువం కర్ణశష్కులీమ్. ౧౮

త్రిదోషముల సన్నిపాతమువలన చెవి లోభాగమునందు నొప్పితోఁగూడినదియు, స్తబ్ధముగనుండునదియు, చెవితో సమానవర్ణముగలదియు నగు వాపుజనించును. ఇది కర్ణవిదారిక యనఁబడును. దీనికి చికిత్సచేయక యుపేక్షించిన యది పండి ఆవనూనెవంటి దుష్టరక్తమును స్రవింపఁజేయును. ఇది కష్టములతోడనే జనించును. జనించినతోడనే నిస్సంశయముగ కర్ణపాళి సంకోచమును జెందును.

### పాలీశోషరోగలక్షణము.

సిరాస్థః కురుతే వాయుః పాలీశోషం తదాహ్వయమ్,

వాతము కర్ణసిరల నాశ్రయించి కర్ణపాలిని శుష్కింపఁజేయును. దీనికి పాలీశోషయను పేరుగలదు.

తంత్రికారోగలక్షణము.

కృశా దృఢా చ తంత్రీవత్పాలీ వాతేన తంత్రికా. ౧౯

వాతదోషముచే కర్ణపాళి తంతివలె సన్నగ గట్టిగ నగును. ఇది తంత్రికయని చెప్పఁబడును.

పరిపోటరోగలక్షణము.

సుకుమారే చిరోత్సర్గాత్సహసైవ ప్రవర్ధితే,
కర్ణే శోఫస్సరుక్పాల్యామరుణః పరిపోటవాన్. ౨౦
పరిపోటస్సపవనాత్.

మృదువైన కర్ణమునందలి పాళీప్రదేశమును సూది మొదలగువానిచే పొడిచి యాద్వారమును శీఘ్రముగ పెంచుటకు యత్నించినయెడల వాతము ప్రకోపించి పాళీలయందు నొప్పిగలదిగను, ఎఱ్ఱగను, పగుళ్లుగలదిగనుండు వాపును కలుగఁజేయును. ఇది పరిపోటరోగ మనఁబడును.

ఉత్పాతకర్ణరోగలక్షణము.

ఉత్పాతః పిత్తశోణితాత్,
గుర్వాభరణభారాద్యైశ్శ్యావో రుగ్దాహపాకవాన్. ౨౧
శ్వయథుః స్ఫోటపిటికా రాగోషాక్లేదసంయుతః,

చెవులయందు బరువైన యాభరణములను ధరించుటవలన పిత్తరక్తము ప్రకోపించి చెవులయందు నొప్పి, మంట, పాకము, స్ఫోటకము, పిటికలు, యెరుపు వర్ణము, తాపము, జలస్రావము వీనితోఁగూడిన వాపును కలుగఁజేయును. ఇది ఉత్పాత మనఁబడును.

ఉన్మంథకర్ణరోగలక్షణము.

పాల్యాం శోఫోఽనిలకఫాత్సర్వతో నిర్వ్యథః స్థిరః. ౨౨
స్తబ్ధస్సవర్ణః కండూమానున్మంథో గల్లిరశ్చ సః,

వాతకఫములవలన కర్ణపాలీలయందు నొప్పిలేనిదిగను స్థిరముగను స్తబ్ధముగను పాళితో సమానవర్ణముగలదిగను దురదతోఁగూడినదిగ నుండు వాపుజనించును. ఇది ఉన్మంథమనియు గల్లిరమనియు చెప్పఁబడును.

దుఃఖవర్ధన కర్ణరోగలక్షణము.

దుర్వ్యాద్ధే వర్ధితే కర్ణే సకండూదాహపాకరుక్. ౨౩
శ్వయథుస్సన్నిపాతోత్థస్సనామ్నా దుఃఖవర్ధనః,

చెవులను కుట్టుతగనిస్థలమున కుట్టి యాద్వారమును పెంచినచో వాతాదిత్రిదోషములు ప్రకోపించి దురద, మంట, పాకము, శూల వీనితోఁగూడిన వాపును కలుఁగఁజేయును. ఇది దుఃఖవర్ధనమని చెప్పఁబడును.

లేహ్యాఖ్యకర్ణరోగలక్షణము.

కఫాసృక్క్రిమిజాసూక్ష్మాస్సకండూక్లేదవేదనాః. ౨౪
లేహ్యాఖ్యాః పిటికాస్తా హి లిహ్యుః పాళీముపేక్షితాః,

కఫరక్తక్రిములవలన జనించినవియు సూక్ష్మముగనుండునవియు దురద, జలస్రావము, నొప్పి వీనితోఁగూడినవియు నగు పిటికలు కర్ణపాళియందు జనించును. దీనికి లేహ్యయని పేరు. దీనిని చికిత్సజేయక యుపేక్షించిన పాళీప్రదేశమునంతయు నానాటికి భక్షించును.

సాధ్యాసాధ్యకర్ణరోగములు

పిప్పలీ సర్వజం శూలం విదారీ కూచికర్ణకః. ౨౫
ఏషామసాధ్యా యాప్యైకా తంత్రికాన్యాంస్తు సాధయేత్,
పంచవింశతిరిత్యుక్తాః కర్ణరోగా విభాగతః. ౨౬

పైనిచెప్పిన కర్ణరోగములలో కర్ణపిప్పలి, సన్నిపాతశూల, విదారికా, కూచికర్ణికా అను నాల్గుకర్ణరోగములు చికిత్సయం దసాధ్యంబులు. తంత్రికయను కర్ణరోగము యాప్యము. తక్కినకర్ణరోగములు చికిత్సయందు సుఖసాధ్యంబులు. ఇటుల లక్షణభేదములతో నిరువదియైదు కర్ణరోగములు నిరూపింపంబడియె.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదునేడవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# అష్టాదశాధ్యాయము.

అవ. కర్ణరోగవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము అట్టికర్ణరోగములకుఁ దగిన చికిత్సలను విశదీకరించుటకై కర్ణరోగప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## కర్ణరోగప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతః కర్ణరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

కర్ణరోగవిజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము కర్ణరోగచికిత్సలను తెలియఁపరచునట్టి కర్ణరోగప్రతిషేధమును నీయధ్యాయమును వివరించెదము.

### వాతజకర్ణరోగచికిత్స.

కర్ణశూలే పవనజే పిబే ద్రాత్రౌ రసాశితః,
వాతఘ్నసాధితం సర్పిః కర్ణం స్విన్నం చ పూరయేత్. ౧
పత్రాణాం పృథగశ్వత్థబిల్వార్కైరండజన్మనామ్,
తైలసింధూత్థదిగ్ధానాం స్విన్నానాం పుటపాకతః. ౨
రసైః కవోష్ణైస్తద్వచ్చ మూలకస్యారళోరపి,

వాతమువలన జనించిన కర్ణశూలయందు రోగికి మాంసరసముతో అన్నమును భుజింపఁజేసి వాతహరద్రవ్యములతో పక్వము చేయఁబడినఘృతమును రాత్రులయందు పానముచేయించవలయును. మఱియు కర్ణములకు స్వేదకర్మనుచేయించి రావి, మారేడు, జిల్లేడు, ఆముదపుచెట్టు వీనియాకులకు నువ్వులనూనె సైంధవలవణము వీనిని నొక్కటిగా కలిపి పట్టించి ప్రత్యేకప్రత్యేకముగ పుటపాకంబిడి కొంచెముష్ణముగనుండునపు డారసమును చెవులలో పోయవలయును. ఇటులనే ముల్లంగియాకురసమును, కోలపొన్నాకు రసమును చెవులలో పోయవలయును.

### కర్ణరోగమునకు మహాస్నేహము.

గణే వాతహరేఽమ్లేషు మూత్రేషు చ విపాచితః. 3
మహాస్నేహో ద్రుతం హంతి సుతీవ్రామపి వేదనామ్,

పులికడుగు, మూత్రవర్గములు వీనిలో వాతహరగణద్రవ్యముల కల్కమును కలిపి పక్వము జేయఁబడిన మహాస్నేహమును చెవిలోబోసిన దారుణమైన కర్ణశూలలు హరించును. (నూనె, నెయ్యి, క్రొవ్వు, ఊమూఁడునొకటిగకూడిన నది మహాస్నేహ మనఁబడును.)

వాతజకర్ణశూలలకు పంచమూలస్నేహము.

మహతః పంచమూలస్య కాష్ఠాత్క్షౌమేణ వేష్టితాత్. ౪
తైలసిక్తాత్ప్రదీప్తాగ్రాత్స్నేహస్సద్యో రుజాపహః,
యోజ్యశ్చైవం భద్రకాష్ఠాత్కుష్ఠాత్కాష్ఠాచ్చ సారళాత్. ౫

మహాపంచమూలములకాడలకు తెల్లపట్టునుచుట్టి దానిని నువ్వులనూనెలో తడిపి దీపమునవెలిగించి అందుండి స్రవించెడునూనెను చెవులలోపోసిన కర్ణశూల యాక్షణమునసే హరించును. దేవదారుచెక్కలకును, చెంగల్వకోష్టుకాడలకును, సరళదేవదారు చెక్కలకును పైఁజెప్పినరీతిగ తెల్లపట్టునుచుట్టి నువ్వులనూనెలో తడిపి దీపమువెలిగించి దానినుండి స్రవించెడు తైలమును చెవులలోపోసిన నప్పుడే వాతజకర్ణశూలలుమానును.

వాతవ్యాధిప్రతిశ్యాయవిహితం హితమత్ర చ,

వాతరోగములకును పీనసరోగములకును చెప్పియుండు చికిత్సల నన్నిఁటిని వాతజకర్ణరోగములకును చేయవలయును.

వాతజకర్ణరోగికి వర్జ్యంబులు.

రసార్ద్ర వయేచ్ఛిస్నానం శీతాంభః పానమహ్న్యపి. ౬

వాతమువలన జనించిన కర్ణరోగముగలవాఁడు శిరస్నానము, శీతోదకపానము వీనినెల్లపుడు వర్జింపవలయును.

పిత్తజకర్ణరోగచికిత్స.

పిత్తశూలే సితాయుక్తఘృతస్నిగ్ధం విరేచయేత్,
ద్రాక్షాయష్టిశృతం స్తన్యం శస్యతే కర్ణపూరణమ్. ౭

పిత్తమువలన జనించిన కర్ణశూలయందు పంచదార చేర్చఁబడినఘృతముచే స్నిగ్ధశరీరునకు విరేచనము చేయించవలెను. ద్రాక్ష, అతిమధురము వీనిని చనుబాలలో వైచి కాచి కర్ణములయందు పోయవలయును.

పిత్తజకర్ణరోగమునకు యష్టిమధుకాదితైలము.

యష్ట్యనంతాహిమోశీరకాకోలీరోధ్రజీవకైః,
మృణాళబిసమంజిష్ఠాసారిబాభిశ్చ సాధయేత్. ౮

యష్టీమధురసప్రస్థం క్షీరద్విప్రస్థసంయుతమ్,
తైలస్య కుడవం నస్యపూరణాభ్యంజనైరిదమ్. ౯
నిహంతి శూలదాహోష్మాః కేవలం క్షౌద్రమేవ వా,

అతిమధురము కషాయము ఒకప్రస్థము,ఆవుపాలు రెండుప్రస్థములు,నువ్వులనూనె ఒకకుడవము ఇటుల వీని నేకముచేసి అందులో అతిమధురము, తిప్పతీగె, చందనము, వట్టివేరు, కాకోళి, లొద్దుగ, జీవకము, తామరతూండ్లు, తామరగడ్డలు, మంజిష్ఠ, నల్లసుగంధిపాల వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి యాతైలమును నస్యమునందును కర్ణపూరణమునందును అభ్యంజనమునందును ఉపయోగించిన కర్ణముల యందలి శూలలు, మంట, తాపము హరించును. తేనెను మాత్రమునైనను చెవులలో బోసిన చెవులలోని నొప్పి హరించును.

పిత్తజకర్ణశూలకు యష్ట్యాదిలేపము.

యష్ట్యాదిభిశ్చ సఘృతైః కర్ణౌ దిహ్యాత్సమంతతః. ౧౦

పైశ్లోకములో చెప్పియుండు యష్టిమధుకము మొదలగు ద్రవ్యములను నూరి నేతిలో కలిపి చెవికి నలుప్రక్కలయందును లేపము చేసిన కర్ణశూలలు హరించును.

కఫజకర్ణరోగచికిత్స.

వామయేత్పిప్పలీసిద్ధసర్పిస్స్నిగ్ధం కఫోద్భవే,
ధూమనావనగండూషస్వేదాన్ కుర్యాత్కఫాపహాన్. ౧౧

కఫమువలన జనించిన కర్ణశూలయందు పిప్పళ్లనువైచి కాచిన ఘృతముచే యభ్యంజనము చేయించి పిదప వమనమున కొసంగవలయును. కఫహరములైన ధూమపాన నస్య గండూష స్వేదకర్మలను చేయించవలయును.

కఫజకర్ణరోగమునకు లశునాదిపూరణము.

లశునార్ద్రకశిగ్రూణాం సురంగ్యా మూలకస్య చ,
కదళ్యాః స్వరసః శ్రేష్ఠః కదుష్ణః కర్ణపూరణే. ౧౨

కఫమువలన జనించిన కర్ణరోగమునందు వెల్లుల్లి, అల్లము, మునగ, తులసి, ముల్లంగి, అరటిగడ్డ వీనిరసమును ప్రత్యేకప్రత్యేకముగ వెచ్చజేసి సుఖోష్ణముగ చెవులయందు పోయవలయును.

కఫజకర్ణరోగమునకు స్నుహ్యాకాండరసము.

అర్కాంకురానమ్లపిష్టాంస్తైలాక్తాన్ లవణాన్వితాన్,

సన్నిధాయ స్నుహీకాండే కోరితే తచ్ఛదావృతాః. ౧౩
స్వేదయేత్పుటపాకేన సరసస్స్యాలజిత్పరమ్,

జిల్లేడుచిగుళ్లను కలితో నూరి అందులో నువ్వులనూనె, సైంధవలవణము చేర్చి దానిని జెముడుకాడలను పట్టించి జెముడాకులచే పొట్లముగట్టి, పుటపాకమువేసి యా రసమును సుఖోష్ణముగ చెవులలో బోసిన శూలలు హరించును.

కఫజకర్ణశూలలకు బీజపూరాదిరసము.

రసేన బీజపూరస్య కపిత్థస్య చ పూరయేత్. ౧౪
సూక్తేన పూరయిత్వా వా ఫేనేనాన్వవచూర్ణయేత్,

మాదీఫలరసమును గాని వెలగపండురసమును గాని చెవిలో పోసిన శూలలు హరించును. లేక కలిని చెవిలో బోసి సముద్రపు నురుగు చూర్ణమును వేసిన శూలలు హరించును.

కఫజకర్ణశూలలకు సర్షపాదితైలము.

అజావిమూత్రవంశత్వక్సిద్ధం తైలం చ పూరణమ్. ౧౫
సిద్ధం వా సార్షపం తైలం హింగుతుంబురునాగరైః,

మేకమూత్రము, గొఱ్ఱెమూత్రము, వెదురుపట్ట వీనిని నువ్వులనూనెలో చేర్చి కాచి యాతైలమును గాని, ఇంగువ, దనియాలు, శుంఠి వీనిని ఆవనూనెలో వైచి కాచి దానినిగాని చెవులయందు బోసిన కర్ణశూలలు హరించును.

రక్తజకర్ణరోగచికిత్స.

రక్తజే పిత్తవత్కార్యం సిరాం చాశు విమోక్షయేత్. ౧౬

రక్తదోషమువలన జనించిన కర్ణరోగమునకు పిత్తజకర్ణశూలకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. శీఘ్రముగ సిరను వేధించవలయును.

పూయవహకర్ణరోగచికిత్స.

పక్వే పూయవహే కర్ణే ధూమగండూషనావనమ్,
యుంజ్యాన్నాడీవిధానం చ దుష్టవ్రణహరం చయత్. ౧౭

చెవిలో పుండు పక్వమై చీముకారుచున్నయెడ ధూమము, గండూషము, నస్యము, నాడీవేధము, దుష్టవ్రణహరములైన చికిత్సలు వీనిని చేయించవలయును.

పూయస్రావకర్ణరోగచికిత్స.

స్రోతః ప్రమృజ్య దిగ్ధం తు ద్వా కాలా పిచువర్తిభిః,

పూరయేద్ధూపయిత్వా తు మాక్షికేణ ప్రపూరయేత్. ౧౮
సురసాదిగణక్వాథఫాణితాక్తాం చ యోజయేత్,
పిచువర్తిం సుసూక్ష్మైశ్చ తచ్చూర్ణైరవచూర్ణయేత్. ౧౯

శూలక్లేదగురుత్వానాం విధిరేష నివర్తకః,

చీము స్రవించునట్టి కర్ణరోగమునందు కర్ణరంధ్రములను పత్తివత్తిచే తుడిచి సాయంప్రాతఃకాలములయందు గుగ్గిలమును ధూపమువేసి చెవులలో తేనెను పోయవలయును. పత్తివత్తిని సురసాదిగణకషాయములో తడిపి దానికి ఖండశర్కర చూర్ణమును పట్టించి ప్రయోగించవలయును. సురసాదిగణద్రవ్యములను చక్కఁగా చూర్ణము చేసి రంధ్రములలో వేయవలయును. ఇట్టుల చేసిన కర్ణములయందలి శూలలు స్రావము గురుత్వము హరించును.

### పూయస్రావమునకు ప్రియంగ్వాదితైలము.

ప్రియంగుమధుకాంబష్ఠాధాతక్యుత్పలపర్ణిభిః. ౨౦
మంజిష్ఠాలోధ్రలాక్షాభిః కపిత్థస్య రసేన చ,
పచేత్తైలం తదా స్రావం నిగృహ్ణాత్యాశు పూరణాత్. ౨౧

ప్రేంకణము, అతిమధురము, పాటచెట్టు, ఆరెపువ్వు, నల్లకలువ, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, మంజిష్ఠ, లొద్దుగు, లక్క వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి అందులో వెలగరసమును చేర్చి విధిప్రకారము పక్వముచేసి చెవిలో బోసిన చీము స్రవించుట శీఘ్రముగా మానును.

### కర్ణనాదబాధిర్యచికిత్స.

నాదబాధిర్యయోః కుర్యాద్వాతశూలోక్తమౌషధమ్,
శ్లేష్మానుబంధే శ్లేష్మాణం ప్రాగ్జయేద్వమనాదిభిః. ౨౨

కర్ణనాదము బాధిర్యము యీరోగములయందు వాతజకర్ణశూలకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును పైరోగములలో శ్లేష్మము కలిసియుండినచో తొలుత వమనాదికర్మలచే శ్లేష్మమును పోఁగొట్టి పిదప పైచికిత్సలను చేయవలయును.

### కర్ణనాదహరతైలము.

ఏరండశిగ్రువరుణమూలకాత్పత్రజే రసే,

చతుర్గుణే పచేత్తైలం క్షీరే చాష్టగుణోన్మితే. ౨౩
యష్ట్యాహ్వాక్షీరకాకోలీకల్కయుక్తం నిహంతి తత్,
నాదబాధిర్యశూలాని నావనాభ్యంగపూరణైః. ౨౪

ఆముదపుచెట్టు, మునగ, ఉలిమిరి, ముల్లంగి వీనియొక్కరసము నాల్గుభాగములు, ఆవుపాలు ఎనిమిదిభాగములు, నువ్వులనూనె యొకభాగము యిట్టుల నీద్రవ్యముల నేకముజేసి యందులో అతిమధురము, క్షీరకాకోలి ఈరెంటిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి తైలవిధిప్రకారము పాకము చేయవలయును. పిదప నాతైలముచే నస్యాభ్యంగ కర్ణపూరణములం జేయించిన కర్ణనాదము చెవిటితనమును శూలను హరించును.

### కర్ణనాదమునకు వచాదితైలము.

పక్వం ప్రతివిషాహింగుమిసిత్వక్స్వర్జికోషణైః,
సమూత్రైః పూరణాత్తైలం రుక్స్రావశ్రుతినాదనుత్. ౨౫

అతివస, ఇంగువ, జటామాంసి, లవంగపట్ట, సర్జక్షారము, పిప్పళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి అందులో కలినిపోసి విధిప్రకారము పక్వము చేయఁబడిన తైలమును చెవిలోఁబోసిన నొప్పి చీముకారుట చెవియందు ఘోష ఇవి హరించును.

### కర్ణనాదమునకు సర్షపతైలము.

కర్ణనాదే హితం తైలం సర్షపోత్థం చ పూరణే,

ఆవాలనూనెను చెవిలోబోసిన కర్ణనాదరోగము హరించును.

### క్షారతైలము.

శుష్కమూలకఖండానాం క్షారో హింగుమహౌషధమ్. ౨౬
శతపుష్పావచాకుష్ఠదారుశిగ్రురసాంజనమ్,
సౌవర్చలయవక్షారస్వర్జికోద్భిదసైంధవమ్. ౨౭
భూర్జగ్రంథిబిడం ముస్తా మధుసూక్తం చతుర్గుణమ్,
మాతులుంగరసస్తద్వత్కదళీస్వరసశ్చ తైః. ౨౮
పక్వం తైలం జయత్యాశు సుకృచ్ఛ్రానపి పూరణాత్,
కండూం క్లేదం చ బాధిర్యం పూతికర్ణం చ రుక్క్రిమీన్. ౨౯
క్షారతైలమిదం శ్రేష్ఠం ముఖదంతామయేషు చ,

ఎండిన ముల్లంగిగెడ్డను తునకలుజేసి నిప్పులో కాల్చి యాబూడిద, ఇంగువ, శుంఠి, సదాప, అతివస, చెంగల్వకోష్టు, దేవదారు, మునగ, రసాంజనము, సౌవర్చలవణము, యవక్షారము, సర్జక్షారము, సముద్రలవణము, సైంధవలవణము, భుజపత్రి, గ్రంథితగరము, బిడాలవణము, తుంగముస్తలు యివి సమభాగములు, తేనెకలిపిన కలి, మాదీఫలరసము, అరిటిగెడ్డరసము యివి దినుసుకు నాల్గుభాగములు, నువ్వులనూనె, ఒకభాగము యిట్టుల వీనినొకటిగఁజేర్చి తైలపాకవిధిగ పక్వముజేసిన నిది క్షారతైలమనఁబడును. ముఖరోగమునందును దంతరోగములయందును కడుశ్రేష్ఠంబైనది. దీనిని చెవులలో బోసికొనిన చెవుడు, గురద, చీముకారుట, పూతికర్ణము, శూల, క్రిములు, దారుణమైన కర్ణరోగములను నివర్తించును.

కర్ణరోగమునకు రక్తమోక్షణము.

అథ సుప్తావివ స్యాతాం కర్ణౌ రక్తం హరేత్తతః. 30

చెవులు శబ్దగ్రహణరహితములుగ నిద్రించునట్టుల నుండినయెడ అట్టిసమయమున రక్తమోక్షణమున చేయించవలయును.

కర్ణరోగమున వమనము.

సశోఫక్లేదయోర్మంద స్రుతేర్వమనమాచరేత్,

చెవులయందును వాపును చెమ్మయుకల్గి స్వల్పమున నీరుగారుచున్నయెడ వమనము చేయించుట యుక్తము.

వర్జనీయబాధిర్యము

బాధిర్యం వర్జయేద్బాలవృద్ధయో శ్చిరజం చ యత్. 31

బాలురకును వృద్ధులకును జనించియుండు చెవుడును చిరకాలముగనుండు చెవుడును చికిత్సయందు వర్జింపవలయును.

ప్రతినాహరోగచికిత్స.

ప్రతినాహే పరిక్లేద్య స్నేహస్వేదైర్విశోధయేత్,
కర్ణశోధనకేనాను కర్ణౌ తైలస్య పూరయేత్. 32
ససూక్తసైంధవమధోర్మాతులుంగరసస్య వా,
శోధనాద్రూక్షతోత్పత్తౌ ఘృతమండస్య పూరణమ్. 33

ప్రతినాహరోగమునందు కర్ణములకు స్నేహస్వేదములను చేయించి కర్ణశోధనచిమ్మన (గ్రోలి) యంత్రముచే కర్ణద్వారములను శుద్ధిచేసి నువ్వులనూనెలోగాని మాదీ

ఫలరసములో గాని తేనె, సైంధవలవణము, కలి వీనినికలిపి చెవినిండునటుల పోయవల యును. ఇటుల చేయుటచే రూక్షగలిగినచో నేతిమీగడను చెవిలో పోయవలయును.

—— మలపూర్ణకర్ణాదిచికిత్స ——

క్రమోఽయం మలపూర్ణేపి కర్ణే కండ్వాం కఫాపహామ్;
నస్యాదితద్వచ్ఛోఫేఽపి కటూష్ణైశ్చాత్ర లేపనమ్. ౩౪

చెవిలో గుబిలినిండియుండినచో ప్రతినాహరోగమునకు చెప్పియుండు చికిత్స లను, చెవులలో దురద కలిగియుండినచో కఫహరచికిత్సలును వాపుకలిగియుండినచో తొలుత కఫహరచికిత్సలను, పిదప కారముగ ఉష్ణముగనుండు ద్రవ్యములచే ప్రలేపన ము చేయవలయును.

—— పూతిక్రిమికర్ణ కర్ణవిద్రధిచికిత్స. ——

కర్ణస్రావోదితం కుర్యాత్పూతిక్రిమికకర్ణయోః,
పూరణం కటుతైలేన విశేషాత్క్రిమికర్ణకే. ౩౫
వమిపూర్వా హితా కర్ణవిద్రధౌవిద్రధిక్రియా,

పూతికర్ణము క్రిమికర్ణము వీనికి కర్ణస్రావరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. క్రిమికర్ణరోగమునందు చెవులలో విశేషముగ కటుతైలమును పోయ వలయును. కర్ణవిద్రధిరోగికి తొలుత వమనమునకిప్పించి పిదప విద్రధిరోగమునకుచెప్పి యుండు చికిత్సలను చేయవలయును.

—— క్షతవిద్రధచికిత్స. ——

పిత్తోత్థకర్ణశూలోక్తం కర్తవ్యం క్షతవిద్రధౌ. ౩౬

క్షతవిద్రధిరోగమునకు పిత్తజకర్ణశూలకు చెప్పియుండు చికిత్సలను చేయ వలయును.

—— కర్ణార్శశ్చికిత్స. ——

అర్శోఽర్బుదేషు నాసావత్-

కర్ణార్శస్సు కర్ణార్బుదము యీరోగములకు నాసికారోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

—— కర్ణవిదారికాచికిత్స. ——

ఆమా కర్ణవిదారికా,
కర్ణవిద్రధివత్సాధ్యా యథాదోషోదయేన చ. ౩౭

కర్ణవిదారికయను రోగము పండక యుండునపుడు కర్ణవిద్రధికి చెప్పియుండు చికిత్సలను దోషప్రకోపానుగుణముగ చేయించవలయును.

### పాళీశోషచికిత్స

పాళీశోషే ఽనిలశ్రోత్రశూలవన్నస్య లేపనమ్,
స్వేదం చ కుర్యాత్స్విన్నాం చ పాళీ ముద్వర్తయే త్తిలైః. ౩౮
ప్రియాళ * బీజయష్ట్యాహ్వాహయగంధాయవాన్వితైః,
తతః పుష్టికరై స్స్నేహైరభ్యంగం నిత్యమాచరేత్. ౩౯

పాళీశోష రోగమునకు వాతజకర్ణశూలలకు జెప్పియుండునటుల నస్యలేప స్వేద కర్మలను జేయించి నువ్వులు, చారపప్పు, అతిమధురము, పెన్నేరుగడ్డ, యవలు వీనిని నూరి నలుగు పెట్టి పిదప పుష్టికరములగు స్నేహములచే ప్రతినిత్య మభ్యంజనము చేయించవలయును.

### కర్ణశోషమునకు పుష్టికరతైలము.

శతావరీ వాజిగంధాపయస్యైరండజీవకైః,
తైలం విపక్వం సక్షీరం పాళీనాం పుష్టికృత్పరమ్. ౪౦

పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, మునుబాల, ఆముదపువిత్తులు, జీవకము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి నూనెకు నాలుగింత లావుపాలను చేర్చి తైలపాకవిధిగ పక్వము చేయవలయును. ఈతైలము కర్ణపాళులకు విశేషముగ పుష్టిని కలుగఁజేయును

### కర్ణపాళీవృద్ధికరతైలము

కల్కేన జీవనీయేన తైలం పయసి పాచితమ్,
ఆనూపమాంసక్వాథే చ పాళీపోషణవర్ధనమ్. ౪౧

అనూపదేశజంతు మాంసకషాయములో జీవనీయ ద్రవ్యకల్కమునుజేర్చి నువ్వుల నూనె నూనెకు నాలుగింతలావుపాలు కలిపి విధిప్రకారము పక్వముచేసిన యాతైలము కర్ణపాళులకు పుష్టిని కలుగఁజేయుటయే గాక వృద్ధిని జేయును.

### క్షీణకర్ణపాళీచ్ఛేదము.

పాళీం ఛిత్వాఽతిసంక్షీణాం శేషాం సంధాయ పోషయేత్,

మిక్కుటముగ క్షయించియుండు కర్ణపాళినిఛేదించి క్షయించకుండు పాళి నొకటిగ చేర్చి వృద్ధిచేయవలెను.

---

* మజ్జా.

### యాప్యకర్ణరోగములు.

యాప్యేవం తంత్రికాఖ్యాపి పరిపోటేఽప్యయం విధిః. ౪౨

తంత్రిక, పరిపోటము అను నీ కర్ణరోగములు యాప్యంబులు.

### కర్ణోత్పాతచికిత్స.

ఉత్పాతే శీతలై ర్లేపో జలౌకోహృతశోణితే,

కర్ణోత్పాతరోగమున జలగలచే రక్తమోక్షణము చేసి శీతద్రవ్యములచే లేపనము చేయవలయును.

### ఉత్పాతకర్ణరోగమునకు జంబ్వాదితైలము.

జంబ్వామ్రపల్లవబలాయష్టీరోధ్రతిలోత్పలైః. ౪౩

సధాన్యామ్లైస్సమంజిష్ఠైస్సకదంబైస్ససారిబైః,

సిద్ధమభ్యంజనం తైలం విసర్పోక్తఘృతాని చ. ౪౪

ఉత్పాతమను కర్ణరోగమునకు నేరేడుచిగుళ్లు, మామిడిచిగుళ్లు, చిట్టాముట్టి, అతిమధురము, లొద్దుగు, నువ్వులు, నల్లకలువ, పులికడుగు, మంజిష్ఠ, కడిమి, సుగంధిపాల వీనిని సమభాగములుగ గ్రహించి నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వము చేయఁబడిన తైలముతో నభ్యంజనమును విసర్పరోగమున జెప్పియుండు ఘృతపానమును చేయించవలయును.

### ఉన్మంథరోగచికిత్స.

ఉన్మంథే ఽభ్యంజనం తైలం గోధాకర్కటవసాన్వితమ్,

తాలపత్రాశ్వగంధార్కవాకుచీతిలసైంధవైః. ౪౫

సురసాలాంగలీభ్యాం చ సిద్ధం తీక్ష్ణం చ నావనమ్.

ఎలుకచెవియాకు లేక తాటియాకులు, పెన్నేరుగడ్డ, జిల్లేడు, బావంచివిత్తులు, నువ్వులు, సైంధవలవణము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి ఉడుము, యండ్రకాయ వీని క్రొవ్వులను చేర్చి పక్వముచేసి ఉన్మంథరోగికి అభ్యంజనము చేయించవలయును. మఱియు తులసి, చన్నచర్లగడ్డ వీనిని నువ్వులనూనెలో వైచి కాచి యాతైలముచే తీక్ష్ణనస్యమును చేయించవలయును

### దుర్వ్యధకర్ణరోగచికిత్స.

దుర్వ్యధే ఽశ్మంతజంబ్వామ్రపత్రక్వాథేన సేచితమ్. ౪౬

తైలేన పాళీం స్వభ్యక్తాం సుశ్లక్ష్ణైరవచూర్ణయేత్,

చూర్ణై ర్మధూకమంజిష్ఠాప్రపుండ్రాహ్వానిశోద్భవైః. ౪౭
లాక్షావిడంగసిద్ధం చ తైలమభ్యంజనే హితమ్,

కొండపండి, నేరేడు, మామిడి వీనియాకుల కషాయములతో కర్ణపాళికి సేచనము, నువ్వులనూనెచే నభ్యంజనమును చేయించి అతిమధురము, మంజిష్ఠ, ప్రపౌండరీకము, (కర్పూరపుబెండ,) పసుపు వీనిచూర్ణమును పైకి పట్టించవలయును. లక్క, వాయువిడంగములు వీనితో కాచఁబడిన తైలముచే నభ్యంజనము చేయించవలయును.

## పరిలేహిక కర్ణరోగచికిత్స.

స్విన్నాం గోమయజైః పిండై ర్బహుశః పరిలేహికామ్. ౪౮
విడంగసారై రాలింపేదురభీమూత్రకల్కితైః,
కౌటజేంగుదకారంజబీజశమ్యాకవల్కలైః. ౪౯
అథ వా ఽభ్యంజనేత్తై ర్వా కటుతైలం విపాచయేత్,
సనింబపత్రమరిచమదనై ర్లేహికావ్రణే. ౫౦

పరిలేహికయను కర్ణరోగమునకు ఆవుపేడయుండలచే పలుమారు స్వేదకర్మలను జేయించి (పచ్చి పేడను నిప్పుచ వేడిచేసి యాపేడచే సుఖోష్ణముగ కాపడముఁబెట్టుట) ఆడగొఱ్ఱెమూత్రముతో వాయువిడంగములు నూరి లేపనము చేయవలయును. లేక కొడిసెవిత్తులు, గారవిత్తులు, కానుగవిత్తులు, రేలబెరడు వీనిని ఆడగొఱ్ఱె మూత్రముతో నూరి లేపనము చేయవలయును. లేక పైకొడిసెవిత్తులు మొదలగువానితోడను వేపాకు, మిరియాలు, మ్రంగపండు వీనితోడను తైలమును పక్వముచేసి యాకటుతైలముచే పరిలేహికవ్రణమునకు లేపనము చేయించవలయును.

## సద్యశ్ఛిన్నకర్ణచికిత్స.

ఛిన్నం తు కర్ణం శుద్ధస్య బంధమాలోచ్య యౌగికమ్,
శుద్ధాస్రం లాగయేల్లగ్నే సద్యశ్ఛిన్నే విశోధనమ్. ౫౧

దెబ్బలు మొదలగు వానిచే కర్ణపాళి ఛేదింపఁబడినచో రక్తమును బైలువెడలనియ్యక చక్కఁగ పర్యాలోచించి యౌగికబంధమును కట్టునుకట్టి విరేచనాది శోధనకర్మలను చేయించవలయును.

## కర్ణరోగశస్త్రచికిత్స

అథ గ్రథిత్వా కేశాంతం కృత్వా ఛ్ఛేదనలేఖనమ్,
నివేశ్య సంధిం సుషమం న నిమ్నం న సమున్నతమ్. ౫౨
అభ్యజ్య మధుసర్పిర్భ్యాం పిచుప్లోతావకుంఠితమ్,

సూత్రేణాగాఢశిథిలం బధ్వా చూర్ణైరవాకిరేత్. ౫౩

శోణితస్థాపనైర్వ్రణ్యమాచారం చాదిశేత్తతః,

సప్తాహాదామతైలాక్తం శనైరపనయేత్పిచుమ్. ౫౪

సురూఢం జాతరోమాణం శ్లిష్టసంధిసమస్థిరమ్,

సువర్ణ్ణాణం సురాగం చ శనైః కర్ణం వివర్ధయేత్. ౫౫

తలవెండ్రుకల నొకటిగచేర్చి కట్టి చెవులను వేధించి దోషమును వెలిపఱచి మరల చెవిని హెచ్చుతక్కువ లేక సముముగచేర్చి తేనె నెయ్యి వీనినిబూసి ఖండవస్త్రమును జుట్టి నూలుతో మిగులగట్టిగ మిగులవదులుగ లేక కట్టుకట్టవలయును. వ్రణమునుశమింపఁ జేయునట్టి యష్టిమధుక గైరికాచూర్ణములను బూసి వ్రణములయందు హితమైన అన్నపానాదుల నిప్పించవలయును. ఏడు దినములపైని పైవస్త్రఖండమునకు నువ్వులనూనెనుబూసి మెల్లమెల్లగ తీసివేయవలయును. చెవులయందు వ్రణము శమించి వెండ్రుకలు మొలిచి సంధిసరిగాచేరి గట్టిగనై శరీరముతో తుల్యమైనవర్ణము గలిగియుండిన పిదపమెల్లమెల్లగ యాకర్ణమును వృద్ధిజేయవలయును.

### కర్ణవర్ధనతైలము.

జలశూకస్స్వయంగుప్తా రజన్యౌ బృహతీద్వయమ్,

అశ్వగంధాబలాహస్తిపిప్పలీగౌరసర్షపాః. ౫౬

మూలం కోశాతకా * శ్వఘ్నరూపికాసప్తపర్ణజమ్,

ఛుఛుందరీకాలమృతాగృహం మధుకరీకృతమ్ ౫౭

జంతూకా జలజన్మాచ తథా శాబరకందకమ్,

ఏభిః కల్కైః ఖరం పక్వం సతైలం మాహిషం ఘృతమ్. ౫౮

హస్త్యశ్వమూత్రేణ పరమభ్యంగాత్కర్ణవర్ధనమ్,

నాచు,(అనఁగా పాచి) దూలగొండి, పసుపు. మ్రానిపసుపు, చిన్నములక, పెద్దము క, పెన్నేరుగడ్డ. చిట్టాముట్టి,ఏనుగుపిప్పళ్ళు, తెల్లావాలు, బీర, గన్నేరు,జిల్లేడు, ఏడా లపొన్న వీనివేళ్ళు యుక్తకాలములో స్వయముగ మృతిజెందిన చుంచెలుక, తుమ్మెదల కట్టఁబడిన మట్టిగూడు,జంతూకా (అనఁగా లక్క,జలగలు, పెల్లుల్లిగడ్డలు వీనిని సమ గములుగ గ్రహించి నూరి బఱ్ఱెనేతిలో కలిపి అందులో యేనుగమూత్రము గుఱ్ఱపు త్రము నువ్వులనూనె వీనిని కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి ఖరపాకముగ దించు ని యభ్యంజనము చేసిన చెవులు వృద్ధిజెందును.

---

* శ్వత్థ.

## నాసికాచ్ఛేదచికిత్స

అథ కుర్యాద్వయస్థస్య ఛిన్నాం శుద్ధస్య నాసికామ్. ౫౯
ఛింద్యాన్నాసా సమం పత్త్రంతత్తుల్యం తత్ కపోలతః,
త్వఙ్మాంసం నాసికాసన్నే రక్షంస్తత్తనుతాం నయేత్. ౬౦
సీవ్యేద్గండం తతస్సూచ్యా సేవిన్యా పిచుయుక్తయా,
నాసాచ్ఛేదే చ లిఖితే పరివర్త్యోపరి త్వచమ్. ౬౧
కపోలబంధం సందధ్యాత్సీవ్యేన్నాసాం చ యత్నతః,
నాడీభ్యాముత్క్షిపేదంతస్సుఖోచ్ఛ్వాసప్రవృత్తయే. ౬౨
ఆమతైలేన సిక్త్వా తు పతంగమధుకాంజనైః,
శోణితస్థాపనైశ్చాన్యైస్సుశ్లక్ష్ణైరవచూర్ణయేత్. ౬౩
తతో మధుఘృతాభ్యక్తం బధ్వా చారికమాదిశేత్,
జ్ఞాత్వావస్థాంతరం కుర్యాత్సద్యోవ్రణవిధింతతః. ౬౪
ఛింద్యాద్రూఢేఽధికం మాంసం నాసోపాంతే చ చర్మవత్,
సీవ్యేత్తతశ్చ సుశ్లక్ష్ణం హీనం సంవర్ధయేత్పునః. ౬౫

యౌవనవయస్సుకలవాఁడును శుద్ధశరీరముకలవాఁడునైన మనుజునికి ముక్కు తెగిపోయినచో ముక్కుకు సమముగ నేదైననొక పత్రమునుఛేదించి యాపత్రమునకు సమముగ చెక్కిళ్లలో ముక్కునకు సమీపప్రదేశమునందుండు చర్మమాంసముల కపాయము కలుగనియ్యక ఛేదించి యచట యాపత్రమునునిచి పిచువుతోఁగూడియుండు సేవని యనుసూదిచే చెక్కిళ్లను కుట్టవలయును. పిదప తెగిపోయిన ముక్కును వంకరలేక కోసి దానిపై చెక్కిళ్లలోనుంచి యెత్తిన చర్మమునునిచి మిగుల ప్రయత్నముతో కుట్టవలయును. పిదప శ్వాసము బైలువెడలుటకై కుట్టినచర్మమునకు లోప్రదేశమున సన్నగనుండు వెదురు బద్దలనునిచి కొంచెము పైకెత్తవలయును. పిదప పచ్చివిగనుండు నువ్వులనూనెను పైచర్మమునకు చరిమి రక్తచందనము, యష్టిమధుకము, సౌవీరాంజనము వీనిచూర్ణముచేతను రక్తమును నిలుపునట్టి సూత్రస్థానమునందు సిరావ్యధవిధ్యధ్యాయములో చెప్పియుండు ద్రవ్యముల చూర్ణములచేతను అవచూర్ణమును ప్రయోగించి తేనె ఆవునెయ్యి వీని నేకముచేసి పూసి వస్త్రఖండముచే కట్టి స్నేహవిధ్యధ్యాయములో చెప్పియుండు ఆహారాదులను యిప్పించవలయును. అవస్థా విశేషమును తెలిసికొని సద్యోవ్రణప్రతిషేధమునకు జెప్పియుండు చికిత్సలను చేయువలయును. వ్రణము శమిం

చిన పిదప నాసికాసమీపమునందు స్వభావమునకంటె అధికముగ వృద్ధిజెందియుండు చర్మమాంసములను ఛేదించి మరల కుట్టవలయును. చర్మమాంసములు వృద్ధిజెందక త్రగ్గియుండినచో తైలాదులచే దానిని వృద్ధినొందింపవలెను.

### సద్యశ్ఛిన్న నాసికాచికిత్స.

నివేశితే యథా న్యాసం సద్య శ్ఛేదేఽప్యయం విధిః,

ముక్కు తెగినయెడల నాసికను ముందువలె స్వస్థానమునం దునిచి పైచెప్పిన ప్రకారము చికిత్సలను చేయవలయును.

### ఛిన్నోష్ఠచికిత్స

నాడీయోగాద్వినౌష్ఠస్య నాసాసంధానవద్విధిః. ౬౬

పెదవులుతెగినచో నాసాచ్ఛేదచికిత్సలోజెప్పిన నాడీయోగముతక్క తక్కిన నాసాచ్ఛేదచికిత్సావిధానముల జేయునది.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పదునెనిమిదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ఏకోనవింశాధ్యాయము.



అవ. కర్ణరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము ప్రతిజ్ఞానుసారముగ నాసారోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## నాసారోగ విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో నాసారోగవిజ్ఞానీయం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

కర్ణరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము నాసికయందు జనించురోగములను తెలియపఱచునట్టి నాసారోగవిజ్ఞానీయమను నీయధ్యాయమును వివరించెదము.

### పీనసరోగోత్పత్తి.

అవశ్యాయానిలరజోభాష్యాతిస్వప్నజాగరైః,
నీచాత్యుచ్చోపధానేన పీతేనాన్యేన వారిణా. ౧
అత్యంబుపానరమణఛర్దిబాష్పగ్రహాదిభిః,
రుద్ధా వాతోల్బణా దోషాః నాసాయాం స్త్యానతాం గతాః. ౨
జనయంతి ప్రతిశ్యాయం వర్ధమానం క్షయప్రదమ్,

మంచు గాలి దుమ్ము వీనిలో తిరుగులాడుటవలనను అధికముగ మాటలాడుటవలనను విశేషముగనిద్రించుటవలనను రాత్రులయందు నిద్రించకుండుటవలనను మిక్కిలి యెత్తులేనిదియు లేక కడుయెత్తుగనుండునదియునైన తలగడమీద శిరము నుంచుకొనుటవలనను అన్యదేశజలమును పానముచేయుటవలనను ఉదకము నధికముగ త్రాగుటవలనను మిక్కుటముగ స్త్రీసంభోగము చేయుటవలనను వమన దుఃఖముల నణచికొనుటవలనను త్రిదోషములు ప్రకోపించి వాతాధిక్యముతోగూడి ముక్కునందుజేరి గట్టిగనై పీనసరోగమును కలుగజేయును దీనికి చికిత్సచేయకయుపేక్షించినచో క్షయరోగము పుట్టును.

పీనస సామాన్యలక్షణము తంత్రాన్తరమున నిట్లు చెప్పబడెను:—

“మస్తులుఙ్గోచిత శ్లేష్మా యదా పిత్తాద్విదహ్యతే, తదా స్పృక్పిచ్ఛిలం నాసా బహుసింహానకం స్రవేత్, సకణ్డూదాహపాకంచ తంతు విద్యాద్ధి పీనసమ్” (శిరమునం

దలి మెదడునకు తగిన శ్లేష్మము పిత్తముచే దపింపబడినయెడ రక్తముతోఁగూడి పిచ్ఛిలంబైన శ్లేష్మము నాసారంధ్రములనుండి యెడతెక స్రవించును. అట్టియెడ దురదయు మంటయు కల్గి పుండగును. దీనిని పీనసమనియెదరు. అనిభావము.)

వాతజపీనసరోగలక్షణము.

తత్ర వాతాత్ప్రతిశ్యాయే ముఖశోషో భృశం క్షువః. 3
ఘ్రాణోపరోధనిస్తోదదంతశంఖశిరోవ్యథాః;
కీటకా ఇవ సర్పంతి మన్యతే పరితో భ్రువౌ. ౪
స్వరసాదశ్చిరాత్పాకశ్శిశిరాచ్ఛకఫస్రుతిః,

వాతమువలన జనించిన పీనసరోగమునందు నోరెండుట, మిక్కిలి తుమ్ములు గలుగుట, ముక్కడచికొనుట, ముక్కులోఁ పోట్లుకలుగుట, దంతములు కణతలు శిరము వీనియందు నొప్పికలుగుట, కనుబొమలకు నలుప్రక్కల క్రిములు సంచరించునటు లుండుట, స్వరహానికలుగుట, చల్లగ స్వచ్ఛముగనుండు కఫము వెడలుట, చిరకాలముమీద పాకమును జెందుట ఇవి కలిగియుండును.

పిత్తజపీనసరోగలక్షణము.

పిత్తాత్తృష్ణాజ్వరఘ్రాణపిటకాసంభవభ్రమాః. ౫
నాసాగ్రపాకో రూక్షోష్ణస్తామ్రపీతకఫస్రుతిః,

పిత్తమువలన జనించిన పీనసరోగమున దప్పి జ్వరము ముక్కునందు పొక్కులు భ్రమముక్కుకొనయందు వ్రణముజనించును. మఱియు నెఱ్ఱగ పచ్చగ ఉష్ణముగ రూక్షముగనుండు కఫమువెడలును.

కఫజపీనసరోగలక్షణము.

కఫాత్కాసోఽరుచిశ్శ్వాసో వమథుర్గాత్రగౌరవమ్. ౬
మాధుర్యం వదనే కండూస్స్నిగ్ధశుక్లఘనా స్రుతిః,

కఫమువలన జనించిన పీనసరోగమున కాసము, అరుచి, శ్వాసము, వాంతి, శరీర గురుత్వము నోటియందు మాధుర్యము శరీరమునందు దురద తెల్లగ గట్టిగ స్నిగ్ధముగనుండు కఫమువెడలుట ఈలక్షణములు కలిగియుండును.

సన్నిపాతజపీనసలక్షణము.

సర్వజో లక్షణైస్సర్వైరకస్మాద్వృద్ధిశాంతిమాన్. ౭

త్రిదోషమువలన జనించిన పీనసరోగమునందు పైవాతాదులకు వేరువేరజెప్పిన పీనసరోగలక్షణములన్నియును కలిగియుండును. అవి అకారణముగనే వృద్ధిజెంది మరల శమించును.

### రక్తజపీనసలక్షణము.

దుష్టం నాసాసిరాః ప్రాప్య ప్రతిశ్యాయం కరోత్యసృక్,
ఉరసస్సుప్తతా తామ్రనేత్రత్వం శ్వాసపూతితా. ౮
కండూః శ్రోత్రాక్షినాసాసు పిత్తోక్తం చాత్ర లక్షణమ్,

రక్తము దుష్టమై నాసికయందలి సిరలనుజేరి పీనసరోగమును కలుగజేయును. దీనియందు రొమ్మునొప్పి నేత్రములయందు యెఱుపువర్ణము దుర్గంధయుక్తమైన శ్వాసము, చెవులు, నేత్రములు, ముక్కు వీనియందు దురద, పిత్తజ పీనసమునకు చెప్పియుండు లక్షణములు కలిగియుండును.

### దుష్టపీనసరోగలక్షణము.

సర్వ ఏవ ప్రతిశ్యాయా దుష్టతాం యాంత్యుపేక్షితాః. ౯
యథోక్తోపద్రవాధిక్యాత్స సర్వేంద్రియతాపనః,
సాగ్నిసాదజ్వరశ్వాసకాసోరఃపార్శ్వవేదనః. ౧౦
కుప్యత్యకస్మాద్బహుశో ముఖదౌర్గంధ్యశోఫకృత్,
నాసికాక్లేదసంశోషశుద్ధిరోధకరో ముహుః. ౧౧
పూయోపమా సితా రక్తగ్రథితా శ్లేష్మసంస్రుతిః,
మూర్ఛంతి చాత్ర కృమయో దీర్ఘస్నిగ్ధసితాణవః. ౧౨

పైనచెప్పిన పీనసరోగములకు చికిత్సజేయక యుపేక్షించిన యవి దుష్టంబులగును. అపుడధికోపద్రవములు చక్షురాదింద్రియములయందు విశేషతాపము, అగ్నిమాంద్యము, జ్వరము, శ్వాసము, కాసము, రొమ్మునొప్పి, పక్కశూలలు కలుగును. ఇది దుష్టపీనసమనబడును. కారణములేకయే పలుమారు వృద్ధిజెందును. మఱియు దీనిలో నోటియందు దౌర్గంధ్యము వాపుకలుగును. ముక్కులయందు చీమిడికారును. నాసికయందును నాసికాద్వారము లడచికొనును. చీముపలె తెలుపువర్ణముగలదిగ రక్తముతో గూడినదిగనుండు శ్లేష్మస్రావము కలుగును. నిడుపుగ నున్నగ తెల్లగ అణువువలెనుండు నవిగనుండు క్రిములు విశేషముగ జనించును.

### పక్వపీనసరోగలక్షణము.

పక్వలింగాని తేష్వంగలాఘవం క్షవథోశ్శమః,
శ్లేష్మా సచిక్కణః పీతో జ్ఞానం చ రసగంధయోః. ౧౩

శరీరము లఘువుగనుండుట, కాసము శమించియుండుట, పసుపువర్ణముగ గట్టిగ నుండు శ్లేష్మము వెడలుట, రసగంధజ్ఞానముగలుగుట ఈలక్షణములు పక్వముజెందిన పీనసరోగమునందు కలిగియుండును.

### క్షవథురోగలక్షణము.

తీక్ష్ణఘ్రాణోపయోగార్కరశ్మిసూత్రతృణాదిభిః,
వాతకోపిభిరన్యైర్వా నాసికాతరుణాస్థని. ౧౪
విఘట్టితే ౽నిలః క్రుద్ధో రుద్ధశ్శృంగాటకం వ్రజేత్,
నివృత్తః కురుతే౽త్యర్థం క్షవథుం స భృశం క్షవః. ౧౫

కారముగనుండు మిరియాలు మొదలగువాని నాఘ్రాణించుట, సూర్యరశ్మి నూలు తృణము మొదలగునవి, వాతప్రకోపకరములైన వస్తువులు వీనిసంబంధము నాసిక యందలి తరుణాస్థికి కలిగినచో వాతము ప్రకోపమునుజెంది అడ్డగింపబడి శృంగాటకాస్థిని చేరచును. అది మరలి వచ్చునపుడు మిక్కుటముగ తుమ్ములను కలుగజేయును. క్షవథువనబడును.

### నాసికాశోషరోగలక్షణము.

శోషయేన్నాసికాస్రోతః కఫం చ కురుతే౽నిలః,
శూకపూర్ణాభనాసాత్వం కృచ్ఛ్రాదుచ్ఛ్వసనం తతః. ౧౬
స్మృతో౽సౌ నాసికాశోషః-

వాతము ప్రకోపించి నాసికాద్వారమును కఫమును శోషింపజేయును. దానివలన నాసికమునందు ముండ్లుండునటు లుండును. కడుకష్టముమీద శ్వాసమువెడలును. ఇది నాసికాశోషమని చెప్పఁబడును.

### నాసానాహరోగలక్షణము.

నాసానాహే తు జాయతే,
నద్ధత్వమివ నాసాయాః శ్లేష్మరుద్ధేన వాయునా. ౧౭
నిశ్వాసోచ్ఛ్వాససంరోధాత్స్రోతసీ సంవృతే ఇవ,

నాసానాహరోగము జనించియుండిన యెడల ముక్కు బంధించినట్లుండును. ఘముతో వ్యాప్తంబైన వాతముచే నిశ్వాసోచ్ఛ్వాసములు నడ్డగింపబడుటవలన నాసికా ద్వారములు మూయబడినట్లుండును.

### ఘ్రాణపాకరోగలక్షణము.

పచేన్నాసాపుటే పిత్తం త్వఙ్మాంసం దాహశూలవత్. ౧౮
స ఘ్రాణపాకః.

పిత్తము నాసికాద్వారమునందలి చర్మమాంసములను పాకము జేయును. దాని వలన నాసికమునందు మంటశూలలు కలుగును. ఇది ఘ్రాణపాక మనఁబడును.

### ఘ్రాణస్రావరోగలక్షణము.

స్రావస్తు తత్సంజ్ఞశ్శ్లేష్మసంభవః,
అచ్ఛో జలోపమోஉజస్రం విశేషాన్నిశి జాయతే. ౧౯

ముక్కులో శ్లేష్మమువలన స్వచ్ఛముగ ఉదకముతో తుల్యముగ నుండుస్రావ మెల్లప్పుడు కలుగును. ఇది విశేషముగ రాత్రులయందు కలుగును. దీనికి ఘ్రాణస్రావ మను పేరుగలదు.

### ప్రవృద్ధపీనసలక్షణము.

కఫః ప్రవృద్ధో నాసాయాం రుద్ధ్వా స్రోతాంస్యపీనసమ్,
కుర్యాత్సఘుర్ఘురం శ్వాసం పీనసాధికవేదనమ్. ౨౦
అవేరివ స్రవత్యస్య ప్రక్లిన్నా తేన నాసికా,
అజస్రం పిచ్ఛిలం పీతం పక్వం సింఘాణకం ఘనమ్. ౨౧

కఫము నాసికమునందు వృద్ధిజెంది స్రోతస్సుల నడ్డగించి పీనసరోగమునకంటె నధికములగు నుపద్రవములు కలదియు గుఱ్ఱుగుఱ్ఱుమను శబ్దముతో గూడినదియునగు శ్వాసమును కలుగజేయును. మేకముక్కులో కారుచుండునట్లు చీమిడి జిగటగ పసుపు వర్ణముగ పక్వముగ గట్టిగ నెల్లప్పుడు కారుచుండును.

### దీప్తిరోగలక్షణము.

రక్తేన నాసాదగ్ధేన బాహ్యాంతస్స్పర్శనాసహా,
భవేద్ధూమోపమోచ్ఛ్వాసా సా దీప్తిర్దహతీవచ. ౨౨

దుష్టరక్తముచే నాసికము బాహ్యాభ్యంతరముల స్పర్శను సహించలేనిదిగ పొగ వలెనుండు శ్వాసముతో గూడినదిగ నుండును. దీనికి దీప్తియని పేరుగలదు.

### పూతినాసరోగలక్షణము.

తాలుమూలేమలైర్దుష్టైర్మారుతో ముఖనాసికాత్,
శ్లేష్మా చ పూతిర్నిర్గచ్ఛేత్పూతినాసం వదంతి తమ్. ౨౩

తాలు (లోదౌడ) మూలప్రదేశమునందు దుష్టంబులైయుండు వాతాది దోషములచే నోటివలన దుర్గంధయుక్తమైన కఫము నాసికాద్వారమున దుర్గంధయుక్తమైన వాతము వెడలును, దీనిని పూతినాసరోగ మనియెదరు.

## పూయరక్తరోగలక్షణము.

నిచయాదభిఘాతాద్వా పూయాసృఙ్నాసికా స్రవేత్.
తత్పూయరక్తమాఖ్యాతం శిరోదాహరుజాకరమ్. ౨౪

సన్నిపాతమువలన గాని అభిఘాతమువలనగాని చీముతో గూడియుండు రక్తము నాసికయందుండి స్రవించును. ఇది పూయరక్తరోగమని జెప్పబడును. ఈరోగమువలన శిరమునందు నొప్పి మంట కలుగును.

## పుటకరోగలక్షణము.

పిత్తశ్లేష్మావరుద్ధోఽంతర్నాసాయాం శోషయేన్మరుత్,
కఫం సశుష్కపుటతాం ప్రాప్నోతి పుటకంతు తత్. ౨౫

వాతము పిత్తశ్లేష్మములచే నడ్డగింపబడి నాసిక లోభాగమునందలి కఫమును శోషింపజేయును. ఆకఫము యెండి యుంటగనగును. దీనిని పుటకమనియెదరు.

## నాసికార్శాదిలక్షము.

అర్శో ఽర్బుదాని విభజేద్దోషలింగైర్యథాయథమ్,
సర్వేషు కృచ్ఛ్రాదుచ్ఛ్వసనం పీనసః ప్రతతం క్షుతః. ౨౬
సానునాసికవాదిత్వం పూతినాసశ్శిరోవ్యథా,

నాసికార్శస్సులను నాసికార్బుదములను వాతాదిదోష లక్షణంబులచే వాని వానిభేదములను తెలిసికొనవలయును. నాసికార్శ నాశికార్బుద రోగములయందు కడు గష్టముమీద శ్వాసమువెడలును. పీనసము ఎల్లప్పుడు కాసము ముక్కుతో మాటలాడుట నాసికయందు దుర్గంధము తలనొప్పి యివి కలిగియుండును.

## యాప్యపీనసము.

అష్టాదశానామిత్యేషాం యాపయేద్దుష్టపీనసమ్. ౨౭

పైనచెప్పిన పదునెనిమిది పీనసరోగములలో దుష్టపీనసమును రోగ మసాధ్యం బగుటవలన యాప్యంబుగనుండును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
పందొమ్మిదవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# వింశాధ్యాయము.

అవ. నాసారోగవిజ్ఞానీయధ్యాయ నిరూపణానంతరము వాని చికిత్సలను తెలియ పఱచుటకై నాసారోగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

# నాసారోగప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో నాసారోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

నాసారోగవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము నాసికాద్వారములందు జనించెడి పీనసాది రోగచికిత్సలను తెలియఁజేయునట్టి నాసికారోగ ప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

## పీనసరోగ సామాన్యచికిత్స.

సర్వేషు పీనసేష్వాదౌ నివాతాగారగో భవేత్,
స్నేహన స్వేదవమనధూమగండూషధారణమ్. ౧
వాసో గురూష్ణం శిరసస్సుఘనం పరివేష్టనమ్,
లఘ్వమ్లలవణం స్నిగ్ధముష్ణం భోజనమద్రవమ్. ౨
ధన్వమాంసగుడక్షీరచణకత్రికటూత్కటమ్,
యవగోధూమభూయిష్ఠం దధిదాడిమసాధితమ్. ౩
బాలమూలకజో యూషః కులుత్థోత్థశ్చ పూజితః,
కవోష్ణం దశమూలాంబు జీర్ణాం వా వారుణీం పిబేత్. ౪
జిఘ్రేచ్చోరక తర్కారీవచాజాజ్యుపకుంచికాః,

పీనసరోగము లన్నిఁటియందును తొలుత రోగిని గాలిలేని గృహములో నుండునటుల చేయవలయును. మఱియు వానికి స్నేహపానము స్వేదకర్మము వమనము ధూమ

పానము గండూషధారణము వీనిని చేయించవలయును. గురువుగను ఉష్ణముగను నుండు పట్టువస్త్రములు శాలువలు వీనిని శిరమునకు గట్టిగ చుట్టుకొనునటుల చేయవలయును. ఉప్పు, పులుసు స్వల్పముగ చేర్చఁబడినదియు ఘృతాదిస్నేహములతోఁ గూడినదియు ద్రవముకానిదియు ఉష్ణముగనుండునదియు నైన భోజనము నిప్పించవలయును. జాంగల దేశమాంసము, బెల్లము, ఆవుపాలు, సెనగలు, త్రికటుకములు యివి అధికముగ చేర్చఁబడిన యవాన్నములను గోధూమాన్నములను పెరుగు దానిమ్మపండు వీనితోఁ బక్వము చేయఁబడిన శాకములను, లేతముల్లంగికట్టును ఉలవలకట్టును ఇప్పించవలయును. సుఖోష్ణముగనుండు దశమూలకషాయమునుగాని పాతదిగనుండు వారుణియను మద్యమునుగాని పానము చేయించవలయును. కచోరములు, తక్కాలి, వస, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ వీని నాఘ్రాణింపఁ జేయవలయును.

## పీనసరోగమునకు వ్యోషాదిగుటికలు.

వ్యోషతాళీసచవికాతిత్తిడీకామ్లవేతసమ్. ౫
సాగ్నిజాజీద్విపలికా త్వగేలాపత్రపాదికమ్,
జీర్ణాద్గుడాత్తులార్ధేన పక్వేన వటకీకృతమ్. ౬
పీనసశ్వాసకాసఘ్నం రుచిస్వరకరం పరమ్,

త్రికటుకములు, తాళిసపత్రి, చవ్యము, చింతపండు, పుల్లప్రబ్బలి, చిత్రమూలము, జీలకఱ్ఱ యివి దినుసుకు రెండుపలములు. లవంగపట్ట, ఏలకలు, జాపత్రి యివి దినుసుకు ఒకపలము. వీనిని ఏబదిపలముల పాతబెల్లముతో పక్వముచేసి గుటికలు చేయవలయును. ఇది పీనసము, శ్వాసము, కాసము వీనిని పోఁగొట్టును. రుచిని పుట్టించును. కంఠస్వరమును చక్కపరచును.

## పీనసరోగమునందు ధూమపానము.

శతాహ్వా త్వగ్బలామూలం శ్యోనాకైరండబిల్వజమ్. ౭
సారగ్వధం పిబేద్ధూమం వసాజ్యమదనాన్వితమ్,
అథవా సఘృతాన్ సక్తూన్ కృత్వా మల్లకసంపుటే. ౮

సదాప, లవంగపట్ట, చిట్టాముట్టి, దుండిలపువేళ్లు, ఆముదపుచెట్టువేళ్లు, మారేడువేళ్లు, రేలవేళ్లు, క్రొవ్వు, ఆవునెయ్యి, మ్రంగపండు వీనిని నిప్పులోవైచి యాధూమమును పీల్చవలెను. లేక గుడ్డ సంపుటమునందు నేతితోచ సక్తుపలను చేర్చి యాధూమమును పానము చేయించవలయును.

పీనసరోగమునందు వర్జనీయములు.

త్యజేత్స్నానం శుచం క్రోధం భృశం శయ్యాం హిమం జలమ్

పీనసరోగము గలవాఁడు శిరస్స్నానము, శోకము, కోపము, విశేషనిద్ర, శీతోకము వీనిని వర్జింపవలయును.

వాతపీనసచికిత్స.

పిబేద్వాతప్రతిశ్యాయే సర్పిర్వాతఘ్నసాధితమ్.
పటుపంచకసిద్ధంవా విదార్యాదిగణేన వా,
స్వేదనస్యాదికాం కుర్యాత్ చికిత్సామర్దితోదితామ్. ౧౦

వాతమువలన జనించిన పీనసరోగమునందు వాతహరములగు సన్నరాష్ట్రము మొదలయిన ద్రవ్యములతో పక్వము చేయఁబడిన ఘృతమునుగాని, లేక సైంధవలవణము మొదలగు నైదువిధములయిన లవణములతో పక్వము చేయఁబడిన ఘృతమునుగాని విదార్యాది గణద్రవ్యములతో పక్వముచేయఁబడిన ఘృతమును గాని పానము చేయించవలయును. అర్దితవాతమునకు చెప్పఁబడుఁడు స్వేదము నస్యము మొదలగుచికిత్సలను చేయించవలయును.

పిత్తజరక్తజపీనసరోగచికిత్స

పిత్తరక్తోత్థయోః పేయం సర్పిర్మధురకైశ్శృతమ్,
పరిషేకాన్ ప్రదేహాంశ్చ శీతైః కుర్వీత శీతలాన్. ౧౧

పిత్తమువలన జనించిన పీనసరోగమునఁదును రక్తమువలన కలిగిన పీనసరోగమునందును మధురద్రవ్యములతో పక్వముచేయఁబడిన ఘృతము పానము చేయించవలయును. శీతవీర్యముగల ద్రవ్యములతో పరిషేకప్రదేహములను చేయించవలయును.

పిత్తజాదిపీనసములకు నావనతైలము.

ధవత్వక్త్రిఫలాశ్యామాశ్రీపర్ణీయష్టి *బిల్వకైః,
క్షీరే దశగుణే తైలం నావనం సనిశైః పచేత్. ౧౨

నువ్వులనూనె యొకభాగము దానికి పదింతలు ఆవుపాలు వీని నొకటిగచేర్చి దానిలో చండ్రపట్ట, త్రిఫలములు, నల్లసుగంధిపాల, తక్కోడ పీల్చనలెను. అతిమధురము, మారేడు, పసపు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి పిత్తజ రక్తజ పీనసరోగములయందు నస్యము చేయించవలయును.

---

* తిల్వకైః.

—॥ కఫజపీనసచికిత్స ॥—

కఫజే లంఘనం లేపః శిరసో గౌరసర్షపైః,
సక్షారం వా ఘృతం పీత్వా వమేత్పిప్పైస్తు నావనమ్. ౧౩

బస్తాంబునా పటువ్యోష వేల్లవత్సకజీరకైః,

కఫమువలన జనించిన పీనసరోగములకు లంఘనము వేయించవలయును. తెల్ల ఆవాలను నూరి శిరమునకు పట్టు వేయవలయును. ఆవునెయ్యిలో యవక్షారమును చేర్చి వమనము చేయించవలయును. త్రికటుకములు, సైంధవలవణము, వాయువిడంగములు, కొడిసెవిత్తులు, జీలకఱ్ఱ వీనిని గొఱ్ఱెమూత్రముతో నూరి నస్యముచేయించవలయును.

—॥ సన్నిపాతపీనసచికిత్స. ॥—

కటుతీక్ష్ణఘృతైర్నస్యైః కబలైస్సర్వజం జయేత్. ౧౪

సన్నిపాతమువలన జనించిన పీనసరోగమునకు కటువుగ తీక్ష్ణముగనుండు ఘృతమును, పానమునకును, నస్యమునకును, కబలగ్రహమునకును ఉపయోగించవలెను.

—॥ దుష్టపీనస శమనోపాయము ॥—

యక్ష్మక్రిమిక్రమం కుర్వన్ యాపయేద్దుష్టపీనసమ్,

దుష్టపీనసరోగమునకు యక్ష్మరోగ చికిత్సలు క్రిమిరోగచికిత్సలు చేయించిన తత్కాలమునకు మాత్రము శమనము నొందును. ఇది యాప్యంబగుటవలన నిశ్శేషముగ నివర్తింపనేరదు.

—॥ దుష్టపీనసహరవర్తి. ॥—

వ్యోషోరుబూకక్రిమిజిద్దారుమాద్రీగదేంగుదమ్. ౧౫
వార్తాకబీజం త్రివృతా సిద్ధార్థః పూతిమత్స్యకః,
అగ్నిమంథస్య పుష్పాణి పీలుశిగ్రుఫలాని చ. ౧౬
అశ్వవిడ్రసమూత్రాభ్యాం హస్తిమూత్రేణ చైకతః.
క్షౌమగర్భాం కృతాం వర్తిం ధూమంఘ్రాణాస్యతః పిబేత్. ౧౭

త్రికటుకములు, ఆముదపువిత్తులు, వాయువిడంగములు, దేవదారు, అతివస, చెంగల్వకోష్టు, గారెపండు, వంగవిత్తులు, తెగడ, తెల్లావాలు, పూతిమత్స్యకము (అనఁగా క్రొమ్ముగు), కూరనెల్లిపూలు, గోఁగువిత్తులు, మునగవిత్తులు వీనిని గుఱ్ఱపు విష్ఠ*సము గుఱ్ఱ

పుమాత్రము పేనుగుమాత్రము వీనితోనూరి తెల్లపట్టుగుడ్డలోనుంచి వర్తిజేసి యావర్తి ధూమమును నోటిచేతను ముక్కుచేతను పీల్చునట్లు చేయించవలయును.

క్షవథురోగచికిత్స.

క్షవథౌ పుటపాకాఖ్యే తీక్ష్ణైః ప్రధమనం హితమ్,

క్షవథు (తుమ్ముల) రోగమునందును, పుటపాకరోగమునందును తీక్ష్ణములగు ద్రవ్యముల చూర్ణముజేసి నాసారంధ్రములచే పీలువవలెను.

క్షవథురోగమునకునస్యము.

శుంఠీకుష్ఠకణావేల్ల ద్రాక్షాకల్కకషాయవత్. ౧౮

సాధితం తైలమాజ్యం వా నస్యం క్షవపుటప్రణుత్,

శుంఠి, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, వాయువిడంగములు, ద్రాక్ష వీనికల్కకషాయములలో నువ్వులనూనెను గాని ఆవునేతిని గాని కలిపి పక్వముచేసి నస్యము చేయించిన క్షవ పుటపాకరోగములు హరించును.

నాసాశోషరోగచికిత్స.

నాసాశోషే బలాతైలం పానాదౌ భోజనం రసైః. ౧౯

స్నిగ్ధో ధూమస్తథా స్వేదో నాసానాహేఽప్యయం విధిః,

నాసాశోషరోగమునందు బలాతైలమును పాననస్యాదులయందుపయోగించవలయును. మాంసరసముతో నాహారము నిప్పించవలయును. స్నిగ్ధమైన ధూమపాన స్వేదకర్మలను చేయించవలయును. నాసానాహరోగమునందును ఈచికిత్సలనే చేయించవలయును.

నాసాపాకాదిరోగచికిత్స.

పాకే దీప్తౌ చ పిత్తఘ్నం తీక్ష్ణం నస్యాది సంస్రుతౌ. ౨౦

నాసాపాకము దీప్తి అను నీరోగములయందు పిత్తహరచికిత్సలను చేయించవలయును. నాసాస్రావమునందు తీక్ష్ణనస్యాదులను చేయించవలయును.

పూతినాసాదిరోగచికిత్స.

కఫపీనసవత్పూతినాసాపీనసయోః క్రియా,

పూతినాస పీనసరోగములయందు కఫజపీనసమునకు చెప్పియుండు చికిత్సలను చేయించవలయును.

పూతినాసాదిరోగములకు నస్యము.

లాక్షాకరంజమరిచ వేల్లహింగుకణాగుడైః. ౨౧

అవిమూత్రద్రుతైర్నస్యం కారయే ద్వమనే కృతే,

పైపూతినాస పీనసరోగములయందు వమనముచేయించి లక్క, క్రానుగు, మిరియాలు, వాయువిడంగములు, ఇంగువ, పిప్పళ్లు, బెల్లము వీనిని మేకమూత్రముతో నూరి నస్యము చేయించవలయును.

—౦ పూతినాసాదిరోగములకు శిగ్రుబీజాదినస్యతైలము. ౦—

శిగ్రుసింహీనికుంభానాం బీజైస్సవ్యోషసైంధవైః. ౨౨

సవేల్లసురసైస్తైలం నావనం పరమం హితమ్,

మునగవిత్తులు, వ్రాకుడువిత్తులు, దంతివిత్తులు, త్రికటుకములు, సైంధవలవణము, వాయువిడంగములు, తులసి వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వుల నూనెలో కలిపి పక్వముచేసి నస్యముచేయించిన పూతినాస పీనసరోగములుహరించును.

—౦ పూయరక్తరోగచికిత్స. ౦—

పూయరక్తే నవే కుర్యాద్రక్తపీనసవత్క్రియామ్. ౨౩

అతిప్రవృద్ధే నాడీవత్-

పూయరక్త రోగమపుడే జనించినదిగనుండిన రక్తపీనసమునకు చెప్పియుండు నటుల చికిత్సచేయవలయును. పైరోగము జనించి బహుకాలమై వృద్ధిజెందియుండిన నాడీవ్రణమునకు చెప్పియుండు చికిత్సను చేయవలయును.

—౦ నాసార్శోఽర్బుదచికిత్స. ౦—

దగ్ధేష్వర్శోఽర్బుదేషు చ,

నికుంభకుంభసింధూత్థమనోహ్వాలవణాగ్నికైః. ౨౪

కల్కైస్తైర్ఘృతమధ్వక్తాం ఘ్రాణే వర్తిం ప్రవేశయేత్,

శిగ్ర్వాదినావనం చాత్ర పూతినాసోఽపి తం భజేత్. ౨౫

నాసార్శస్సురోగములందును నాసార్బుదరోగములయందును దాహకర్మను చేయించి దంతివేళ్లు, తెల్లతెగడ, సైంధవలవణము, మణిశిల, హరిదళము, పిప్పళ్లు, చిత్రమూలము అనువానిని నూరి వర్తిచేసి నెయ్యి, తేనె వీనిలో తడిపి నాసికాద్వారములయందు ప్రవేశింపజేయవలయును. పూతినాసరోగముగలవానికిని శిగ్ర్వాదినస్యమును చేయించవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదియవయధ్యాయము ముగిసెను.

—౦౦—

శ్రీ ర స్తు.

# ఏకవింశాధ్యాయము.

అవ. నాసారోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము ముఖరోగములను తెలియపఱచునట్టి ముఖరోగ విజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## ముఖరోగ విజ్ఞానీయాధ్యాయప్రారంభము.

సూ. అథాతో ముఖరోగవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

నాసారోగ ప్రతిషేధాధ్యాయము చెప్పినపిదప ముఖములో (అనఁగా నోటిలో) జనించు రోగములను తెలియపఱచునట్టి ముఖరోగవిజ్ఞాన మను నీయధ్యాయమును వివరించెదము.

ముఖమనః—"ఓష్ఠప్రభృతి ప్రాక్కాకలకాన్ముఖమ్" అను ప్రమాణమునుబట్టి పెదవులు మొదలు కుత్తుక కంఠమువరకుంగల అవయవమునకు ముఖమని పేరు. అట్టి ముఖమున పెదవులు దంతములు దంతమూలములు తావ్రలు మున్నగు నవయవములం గల్గు రోగములు ముఖరోగములు. అట్టిరోగము లీయధ్యాయమున వేరువేరలక్షణములతో వివరింపఁబడును.

### ముఖరోగోత్పత్తికారణము.

మత్స్యమాహిషవారాహపిశితామకమూలకమ్,
మాషసూపదధిక్షీరసూక్తేక్షురసఫాణితమ్. ౧
అవాక్ఛయ్యాం చ భజతో ద్విషతో దంతధావనమ్,
ధూమచ్ఛర్దనగండూషానుచితం చ సిరావ్యధమ్. ౨
క్రుద్ధాః శ్లేష్మోల్బణా దోషాః కుర్వంత్యంతర్ముఖే గదాన్,

మత్స్యములు ఎనుము పంది వీనిమాంసములు, పచ్చిముల్లంగి ఉద్దిపప్పు పెరుగు పాలు కలి చేయఁబడినసూపము చెఱుకురసము ఖండశర్కర వీనిని భుజించువారుగను బోర్ల పరుండువారుగను దంతధావనమును చేయనివారుగను ధూమపానము వమనకర్మ గండూషము సిరావేదము వీనిని చేయించుకొనకయుండువారుగను ఉండుమనుజులకు వాతాదిదోషములు కుపితంబులై శ్లేష్మాధిక్యముతోఁగూడి నోటిలోపల పలుతెఱంగు

లైన రోగములను కలుగఁజేయును. ముఖరోగములలో ఓష్ఠజరోగములు పదునొకండు. అందు:—

### ఖండౌష్ఠరోగలక్షణము.

తత్ర ఖండౌష్ఠ ఇత్యుక్తో వాతేనోష్ఠో ద్విధా కృతః. ౩

వాతము పెదవులనడుమ రెండుగాఁజీల్చును. ఇది ఖండౌష్ఠరోగమనఁబడును.

### వాతజౌష్ఠరోగలక్షణము.

ఓష్ఠకోపే తు పవనాత్ స్తబ్ధా వోష్ఠౌ మహారుజా,
దార్యేతే పరిపాట్యేతే పరుషాసితకర్కశౌ. ౪

వాతమువలన ఓష్ఠకోపమను రోగము జనించును. దీనియందు పెదవులు స్తబ్ధముగను మిక్కిలినొప్పితోఁ గూడినవిగను రూక్షగను నల్లగను కఠినముగను చీల్చఁబడినటుల మితిలేనినొప్పితోఁగూడినవిగను అగును.

### పిత్తజౌష్ఠరోగలక్షణము.

పిత్తాత్తీక్ష్ణాసహా పీతౌ సర్షపాకృతిభి శ్చితౌ,
పిటకాభి ర్బహుక్లేదావాశుపాకౌ.

పిత్తమువలన పెదవులు కారముగల వస్తువులను సహింపనుండునవిగను పసుపువర్ణము కలవిగను ఆవాలవంటి పిటకలతో వ్యాపించినవిగను అధికస్రావముతో గూడినవిగను శీఘ్రముగ పాకము జెందునవిగను అగును.

### కఫజౌష్ఠరోగలక్షణము.

కఫాత్పునః. ౫
శీతాసహౌ గురూ శూనౌ సవర్ణపిటికాచితౌ,

కఫమువలన పెదవులు శీతవస్తువులను సహింపకుండునవిగను బరువుగను ఉబ్బినవిగను పెదవులతో సమానవర్ణముగల పిటకలు గలవిగను అగును.

### సన్నిపాతజౌష్ఠరోగలక్షణము.

సన్నిపాతా దనేకాభౌ దుర్గంధస్రావపిచ్ఛిలౌ. ౬
అకస్మాన్మ్లానసంశూనరుజౌ విషమపాకినౌ,

సన్నిపాతమువలన జనించిన ఓష్ఠరోగమునందు పెదవులు నానావర్ణములుగల పిటకలతో నిండియుండునవిగను దుర్గంధస్రావము కలవిగను జిగటగనుండు నవిగను అకస్మాత్తుగ వాడుట ఉబ్బుట నొప్పి వీనితోఁగూడినవిగను విషమమైన వ్రణములు కలవిగను అగును.

## రక్తజౌష్ఠరోగలక్షణము.

రక్తోపసృష్టౌ రుధిరం స్రవతశ్శోణితప్రభౌ. ౭
ఖర్జూరసదృశం చాత్ర క్షీణే రక్తే ర్బుదం భవేత్,

రక్తదోషముచే పెదవులు రక్తస్రావముతోఁ గూడినవిగను రక్తమువలె నెఱుపు వర్ణము గలవిగను అగును. రక్తము క్షీణించినచో ఖర్జూరపుపండువంటి యాకారముగల అర్బుదము పెదవులయందు జనించును.

## మాంసజౌష్ఠరోగలక్షణము.

మాంసపిండోపమౌ మాంసా
త్స్యాతాం మూర్ఛత్క్రిమీక్రమాత్. ౮

మాంసదోషముచే పెదవులు మాంసపిండమువంటి యాకారముగలవిగను క్రిములు విశేషముగ వృద్ధిజెంది యుండునవిగను అగును.

## మేదోజౌష్ఠరోగలక్షణము.

తైలాభశ్వయథుక్లేదౌ సకండ్వౌ మేదసా మృదూ,

మేదోదోషమువలన పెదవులు నువ్వులనూనెవంటి కాంతిగలవిగను వాపు దురద స్రావము వీనితోఁగూడినవిగను మృదువుగను అగును.

## క్షతజౌష్ఠరోగలక్షణము.

క్షతజావదీర్యేతే పాట్యేతే చాసకృత్పునః. ౯
గ్రథితౌ చ పునస్స్యాతాం కండూలౌ దశనచ్ఛదౌ;

గాయమువలన పెదవులు చీల్చఁబడినటులను పలుమారు బద్దలుచేయఁబడినటులను గడ్డలు కట్టియుండునవిగను దురదతో గూడినవిగను అగును.

## జలార్బుదరోగలక్షణము.

జలబుద్బుదవద్వాతకఫాదోష్ఠే జలార్బుదమ్. ౧౦

వాతకఫములవలన నీరుబుగ్గవంటి యాకారముగల జలార్బుదమను రోగము పెదవులయందు కలుగును. ఇటుల పదునొకండు రోగములు పెదవులయందు జనించును.

## గండాలజీరోగలక్షణము.

గండాలజీ స్థిరశ్శోఫో గండేదాహజ్వరాన్వితః,

మంట జ్వరము వీనితోఁగూడినదియు స్థిరముగనుండునదియునగు వాపు చెక్కిళ్లయందు జనించును. ఇది గండాలజి యనఁబడును. ఇది యొకటి గండస్థానమున జనించు ముఖరోగము.

దంతరోగములు పది. అందు:—

## శీతదంతరోగలక్షణము.

వాతాదుష్ణసహా దంతాశ్శీతస్పర్శాధికవ్యథాః. ౧౧
దాల్యంత ఇవ శూలేన శీతాఖ్యో దాలనశ్చ సః,

వాతముచే దంతములు ఉష్ణస్పర్శను సహించునవిగను శీతస్పర్శమువలన అధికోపద్రవములు గలవిగను చీల్చఁబడినటుల మిక్కిలి శూలగలవిగను అగును. ఇది శీతదంతమనియు దాళనమనియు చెప్పఁబడును.

## దంతహర్షరోగలక్షణము.

దంతహర్షే ప్రవాతామ్లశీతభక్ష్యాక్షమా ద్విజాః ౧౨
భవం త్యమ్లాశనేనైవ సరుజాశ్చలితా ఇవ,

దంతములు పెనుగాలి స్పర్శను నోర్చకుండునవిగ పుల్లగను చల్లగను ఉండువస్తువుల భక్షణమును సహించకుండునవిగ పుల్లనివస్తువులను భుజించుటవలన నొప్పితోగూడి చలించునటులుండునవిగ నుండును. ఇది దంతహర్షరోగ మనఁబడును.

## దంతభేదరోగలక్షణము.

దంతభేదే ద్విజాస్తోదభేదరుక్స్ఫుటనాన్వితాః. ౧3

పండ్లయందు పోట్లు బద్దలుచేయఁబడినటుల వేదన నొప్పి పగుళ్లు ఇవి కలుగును. ఇది దంత భేదమనఁబడును.

## దంతచాలనరోగలక్షణము.

చాలశ్చలద్భిర్దశనైర్భక్షణాదధికవ్యథైః,

దంతచాలనమనురోగమునందు దంతములు చలించుచుండును. ఆహారాదులను భుజించుటవలన దంతములయందు అధికపీడకలుగును.

## కరాళరోగలక్షణము.

కరాళస్తుకరాళానాం దశనానాం సముద్భవః. ౧౪

కరాళరోగమునందు వికారముగను క్రొత్తగను దంతములు జనించును.

## అధిదంతరోగలక్షణము.

దంతాధికోఽధిదంతాఖ్య స్స చోక్తః ఖలు వర్ధనః,
జాయతే జాయమానేఽతిరుగ్జాతే తత్ర శామ్యతి. ౧౫

అధిదంతమను రోగమునందు దంతము అధికముగ జనించును. అవి జనించునపుడు దంతములయందు మిక్కిలి శూలకలిగి జనించినతోడనే శమించును. ఇది వర్ధనరోగమని యు అధిదన్తమనియుఁ జెప్పఁబడును.

దంతశర్కరారోగలక్షణము.

అథావనాన్మలో దంతే కఫో వా వాతశోషితః,
పూతిగంధః స్థిరీభూతశ్శర్కరా సోఽప్యుపేక్షితః. ౧౬

దంతధావనము చేయకుండుటవలన దంతిములయందలి మలముగాని కఫముగాని వాతముచే శోషింపఁబడి దుర్గంధయుక్తంబై గట్టిగనగును. దీనికి చికిత్సచేయకుండిన యది శర్కరారోగముగ నగును.

కపాలికారోగలక్షణము.

శాతయత్యణుశో దంతాత్కపాలాని కపాలికా,

కపాలికయను దంతరోగమునందు దంతమునందుండి అణువులవలె కొంచెకొంచెముగ కపాలములు (పంటిచెక్కలు) ఊడును.

శ్యావరోగలక్షణము.

శ్యావశ్శ్యావత్వమాయాతా రక్తపిత్తానిలైర్ద్విజాః. ౧౭

రక్తపిత్తవాతిములచే దంతములు శ్యావవర్ణమును జెందును. ఇది శ్యావదంతరోగమనఁబడును.

క్రిమిదంతరోగలక్షణము.

సమూలం దంతమాశ్రిత్య దోషైరుల్బణమారుతైః,
శోషితే మజ్జ్ఞి సుషిరే దంతేఽన్నమలపూరితే. ౧౮
పూతిత్వాత్క్రిమయస్సూక్ష్మా జాయంతే జాయతే తతః,
అహేతు తీవ్రార్తిశమస్ససంరంభోఽసితశ్చలః. ౧౯
ప్రభూతపూయరక్తస్తు స చోక్తః క్రిమిదంతకః,

వాతాధిక్యముతోఁగూడియుండు దోషములు దంతమూలములను దంతములను ఆశ్రయించి అచటనుండుమజ్జను శోషింపఁజేయును. అందువలన దంతములయందు ద్వారములు కలుగును. ఆద్వారములయం దన్నమలములు నిండి దుర్గంధయుక్తముగ నగుట వలన నందలిసూక్ష్మంబులైన క్రిములు జనించును. అందువలన కారణము లేకయే దంత ములయందు మిక్కిలి యుపద్రవములు జనించి యకస్మాత్తుగ శమించును. మఱియు నొప్పి

తోఁ గూడినదిగను నల్లగను చంచలముగను చీము రక్తము స్రవించునదిగను నగును. ఇది క్రిమిదంతరోగమని చెప్పఁబడును. ఇటుల దంతరోగములు పది చెప్పఁబడినవి.

దంతమాంసాశ్రయరోగములు పదిమూఁడు. అందు:—

### శీతాదరోగలక్షణము.

శ్లేష్మరక్తేన పూతీని వహంత్యస్రమహేతుకమ్. ౨౦
శీర్యంతే దంతమాంసాని మృదుక్లిన్నాసితాని చ,
శీతాదో౽సౌ.

శ్లేష్మరక్తమువలన దంతమాంసములు దుర్గంధియుక్తముగను కారణములేకయే రక్తమును స్రవింపఁజేయునదిగను మృదువుగను క్లేదయుక్తముగను నల్లగను నగును. మఱియు దంతములు రాలిపడును. ఇది శీతాదమని చెప్పఁబడును.

### ఉపకుశరోగలక్షణము.

ఉపకుశః పాకః పిత్తాసృగుద్భవః. ౨౧
దంతమాంసాని దహ్యంతే రక్తాన్యుత్సేధవంత్యతః,
కండూమంతి స్రవంత్యస్రమాధ్మాయంతే౽సృజి స్థితే. ౨౨
చలా మందరుజో దంతాః పూతివక్త్రం చ జాయతే,

పిత్తరక్తముచే దంతమాంసములయందు పాకము (అనఁగా వ్రణము) జనించును. దీనికి ఉపకుశమని పేరు. దీనియందు దంతమాంసములు మంటకలవిగను రక్తవర్ణములుగను పొడవుగను, దురదరక్తస్రావము కలవిగను నగును. రక్తము స్రవించకుండిన పైదంతమాంసము లుబ్బును. దంతములు చలించునవిగ కొంచెము నొప్పితోఁగూడినవిగ నగును. నోటియందు దుర్గంధము జనించును.

### దంతపుప్పుటరోగలక్షణము.

దంతయోస్త్రిషు వా శోఫో బదరాస్థినిభో ఘనః. ౨౩
కఫాస్రాత్తీవ్రరుక్శీఘ్రం పచ్యతే దంతపుప్పుటః,

రెండు లేక మూఁడు దంతములయందు రేగుపండుతో సమానముగను గట్టిగను మిక్కిలి నొప్పితోఁగూడినదిగను ఉండు వాపు శ్లేష్మరక్తమువలన జనించి శీఘ్రముగ పాకమును జెందును. దీనికి దంతపుప్పుటమని పేరు.

### దంతవిద్రధిరోగలక్షణము.

దంతమాంసే మలైస్సాస్రైర్బాహ్యాంతశ్శ్వయథుర్గురుః. ౨౪
సరుగ్దాహస్స్రవేద్భిన్నః పూయాస్రం దంతవిద్రధిః,

రక్తముతో గూడియుండు వాతాది దోషత్రయంబులచే దంతమాంసమున బాహ్యాభ్యంతరములయందు పెద్దదియు శూల మంట వీనితోఁగూడినదియు నైనవాపు జనించును. అది పగిలినయెడల దానినుండి దుర్గంధయుక్తమైన చీము రక్తము స్రవించును. ఇది దంతవిద్రధి యని చెప్పఁబడును.

## సుషిరరోగలక్షణము.

శ్వయథుర్దంతమూలేషు రుజావాన్ పిత్తరక్తజః. ౨౫
లాలాస్రావీ స సుషిరో దంతమాంసప్రశాతనః,

దంతమూలములయందు పిత్తరక్తముచే సుషిరమనుపేరు గలవాపు కలుగును. ఆ రోగమునందు దంతమూలములలో నొప్పి కలుగును. జొల్లు కారును. ఇది దంతమాంసముల నూడిపడునటుల జేయును.

## మహాసుషిరరోగలక్షణము.

ససన్నిపాతజ్వరవాన్ సపూయరుధిరస్రుతిః. ౨౬
మహాసుషిర ఇత్యుక్తో విశీర్ణద్విజబంధనః,

పిత్తరక్తముచే సన్నిపాతజ్వరముతో గూడినదిగ రక్తము చీము వీనిని స్రవింపఁజేయునదిగనుండు మహాసుషిర మనువాపు దంతమూలములయందు జనించును. దంతబంధములను చెఱుచును.

## అధిమాంసరోగలక్షణము.

దంతాంతే కీలవచ్ఛోఫో హానుకర్ణరుజాకరః. ౨౭
ప్రతిహంత్యభ్యవహృతిం శ్లేష్మణా సోఽధిమాంసకః,

శ్లేష్మదోషముచే దవడలు చెవులు వీనియందు విశేషముగ నొప్పిని గలుగఁజేయునట్టి శంకువలె నుండువాపు దంతమధ్యభాగంబున జనించును. ఇందువలన ఆహారమును భుజించుటకు వీలుపడదు. దీనిని అధిమాంసకమని చెప్పుదురు.

## విదర్భరోగలక్షణము.

ఘృష్టేషు దంతమాంసేషు సంరంభో జాయతే మహాన్. ౨౮
యస్మింశ్చలంతి దంతాశ్చ స విదర్భో ఽభిఘాతజః,

దంతకాష్ఠాదులచే దంతములను గట్టిగ తోమికొనుటవలన దంతమాంసమునందు అభిఘాతము కలుగును. దానిచే మిక్కిలి నొప్పితోగూడిన వాపుకలిగి దంతములను చలింపఁజేయును. దీనికి విదర్భమను పేరుగలదు.

గతిరోగలక్షణము

దంతమాంసాశ్రితాన్ రోగాన్ యస్సాధ్యానప్యుపేక్షతే. ౨౯
అంతస్తస్యాస్రవన్ దోషస్సూక్ష్మాం సంజనయేద్గతిమ్,
పూయం ముహుస్సా స్రవతి త్వగ్మాంసాస్థిప్రభేదినీ. ౩౦
తాః పునః పంచవిజ్ఞేయా లక్షణై స్సైర్యథోదితైః,

దంతమాంసములయందు జనించి యుండు రోగములు సుఖసాధ్యములుగ నుండినను వానికిఁ దగిన చికిత్సజేయక యుపేక్షించినచో నాదోషము దంతమాంసమునకు లోప్రదేశమునఁ బ్రవేశించి సూక్ష్మమైన రంధ్రములను కలుగఁజేయును. దానినుండి పలుమారు చీము స్రవించును. దంతమాంసాదులను పగులగొట్టును. దీనిని గతిరోగమని వచింతురు. ఇది అయిదువిధములుగ నుండును. వానిలక్షణములను వాతాదిదోషములచే తెలిసికొనవలయును. ఇటుల పదిమూఁడురోగములు దంతమూలములయందు జనించును.

జిహ్వాగతరోగము లారు. అందు:—

వాతజజిహ్వారోగలక్షణము.

శాకపత్రఖరా సుప్తా స్ఫుటితా వాతదూషితా: ౩౧
జిహ్వా-

వాతముచే దూషింపఁబడిన నాలుక టేకాకువలె కఠినస్పర్శము గలదిగను రసజ్ఞానరహితముగను పగిలినదిగను ఉండును.

పిత్తజజిహ్వారోగలక్షణము.

పిత్తాత్సదాహోషా రక్తైర్మాంసాంకురైశ్చితా,

పిత్తముచే దూషింపఁబడిన నాలుకయందు మిక్కిలి తాపము మంట కలుగును. ఎఱ్ఱగనుండు మాంసాంకురములతో నిండియుండును.

కఫజజిహ్వారోగలక్షణము.

శాల్మలీకంటకాభైస్తు కఫేన బహలా గురుః. ౩౨

కఫదూషితమైన నాలుక బూరుగముండ్లవలె నుండు మాంసాంకురములతో వ్యాప్తంబుగ గురుత్వము గలదిగ నుండును.

అలసరోగలక్షణము

కఫపిత్తా దధశ్శోఫో జిహ్వాస్తంభకృదున్నతః,
మత్స్యగంధిర్భవేత్పక్వస్సోఽలసో మాంసశాతనః. ౩౩

కఫపిత్తమువలన నాలుక క్రిందిభాగమునందు పొడవుగ నాలుకను స్తంభింపఁజేయునదిగనుండు జిహ్వాలస మనువాపు జనించును. ఇది పండినచో దీనియందు మత్స్య

ముతో తుల్యమైన దుర్గంధము కలుగును. ఇది నాలుకయందలి మాంసము నూడిపడున టులఁ జేయును.

## అధిజిహ్వారోగలక్షణము.

ప్రబంధనేఽధో జిహ్వాయాశ్శ్వోఫో జిహ్వాగ్రసన్నిభః,
సాంకురః కఫపిత్తాస్రై ర్లాలోషా స్తంభవాన్ ఖరః. 34
అధిజిహ్వాస్సరుక్కంఠతూర్వాక్యాహారవిఘాతకృత్,

జిహ్వామూలమున నాలుకకు క్రిందిభాగమునందు నాలుకకొనతో సమానమైనదియు మాంసాంకురములు కలదియు జొల్లు, శూల, దురద, మంట, స్తబ్ధత్వము, కఠిన స్పర్శము యివి కలదియునైన అధిజిహ్వ యనువాపు కఫపిత్తరక్తములచే జనించును. ఇయ్యది సంభాషణము ఆహారము వీనిని ప్రతిబంధించును.

## ఉపజిహ్వారోగలక్షణము.

తాదృగేవోపజిహ్వాస్తు జిహ్వాయా ఉపరి స్థితః. 35

నాలుకకు పైభాగమున అధిజిహ్వారోగమునకు చెప్పియుండు లక్షణములు గలవాపు జనించును. ఇది ఉపజిహ్వారోగ మనఁబడును. ఇటుల ఆరురోగములు నాలుకయందు పుట్టును.

తాలుగతరోగము లెనిమిది. అందు:—

## తాలుపిటకారోగలక్షణము.

తాలుమాంసేఽనిలాద్దుష్టే పిటికాస్సరుజః ఖరాః,
బహ్వ్యో ఘనాః స్రావయుక్తా స్తా స్తాలుపిటికాస్స్మృతాః. 36

లోదవుడ మాంసము వాతముచే దూషింపఁబడి నొప్పి కఠినస్పర్శము గట్టిగనుండు స్రావము వీనితో గూడినవిగనుండు అనేకపిటకలుగల తాలుపిటకారోగము లోదవడ మాంసమునందు జనించును.

## గళశుండికారోగలక్షణము.

తాలుమూలే కఫాత్సాస్రాన్మత్స్యవస్తినిభో మృదుః,
ప్రలంబః పిచ్ఛిలశ్శ్వోఫో నాసయాహారమీరయన్. 37
కంఠోపరోధ తృట్కాసవమికృద్గళశుండికా,

రక్తముతో గూడిన శ్లేష్మమువలన లోదౌడ మూలప్రదేశమునందు మత్స్యము యొక్క మత్స్యమును వస్తినిబోలె సమానముగ వ్రేలాడుచుండునదిగ జిగటగ మృదువుగనుండు గళశుండిక యనువాపు జనించును. ఇది భుజించిన యాహారములను ముక్కు

ద్వారమునుండి బైటికి స్రవించును. ఈరోగము కలవానికి గొంతడచికొనును. దప్పి, దగ్గు, వాంతియు కలుగును.

## తాలుసంహతిరోగలక్షణము.

తాలుమధ్యే నిరుజ్మాంసం సంహతం తాలుసంహతిః. ౩౮

శ్లేష్మరక్తములవలన లోదౌడ మధ్యప్రదేశమున నొప్పిలేని మాంసపిండము జనించును. ఇది తాలుసంహతి యని చెప్పఁబడును.

## తాల్వర్బుదరోగలక్షణము.

పద్మాకృతిస్తాలుమధ్యే రక్తాశ్వ్వయథురర్బుదమ్,

దుష్టరక్తమువలన లోదౌడ మధ్యమునందు తామరపుష్పమంటి యాకారముగల అర్బుద మనువాపు జనించును.

## కచ్ఛపతాలుపుప్పుటరోగలక్షణములు.

కచ్ఛపః కచ్ఛపాకార శ్చిరవృద్ధిః కఫాదరుక్. ౩౯

కోలాభశ్శ్లేష్మమేదోభ్యాం పుప్పుటో నీరుజః స్థిరః,

దుష్టమైన కఫమువలన లోదౌడయందు తాబేటి యాకారము గలదియు ఉపద్రవము లేనిదియు చిరకాలముమీఁద వృద్ధిజెందునదియునైన తాలుకచ్ఛప మను వాపుజనించును. దుష్టంబులైన శ్లేష్మమేదస్సులవలన రేగుపండువలె నుండునదియు స్థిరముగనుండునదియు నొప్పిలేనిదియునగు పుప్పుట మనువాపు జనించును.

## తాలుపాకరోగలక్షణము.

పిత్తేన పాకః పాకాఖ్యః పూయాస్రావీ మహారుజః. ౪౦

దుష్టముగనుండు పిత్తముచే లోదౌడయందు చీమును స్రవింపఁజేయునదియు అధికముగ నుపద్రవములతోఁ గూడినదియునైన పాకము (అనఁగా వ్రణము) జనించును. ఇది తాలుపాక మనఁబడును.

## తాలుశోషరోగలక్షణము.

వాతపిత్తజ్వరాయాసై స్తాలుశోష స్తదాహ్వయః,

వాతపిత్తజ్వరము, ఆయాసము వీనిచే లోదౌడ ద్రవము లేకుండును. ఇది తాలుశోష మనఁబడును. ఇటుల ఎనిమిదిరోగములు తాలుప్రదేశమున జనించును.

గళరోగములు పదునెనిమిది. అందు:—

## రోహిణీరోగలక్షణము.

జిహ్వాప్రబంధజాః కంఠే దారుణా మార్గరోధినః. ౪౧
మాంసాంకురాశ్శీఘ్రచయా రోహిణీ శీఘ్రకారిణీ,

కంఠప్రదేశమునందలి జిహ్వామూలములో దారుణమైన మాంసాంకురములు జనించి యవి శీఘ్రముగ వృద్ధిజెంది కంఠమార్గము నడ్డగించును. ఇది రోహిణీరోగమని చెప్పఁబడును. శీఘ్రముగ రోగిని జంపును.

## వాతజరోహిణీరోగలక్షణము.

కంఠాస్యశోషకృద్వాతాత్సాహనుశ్రోత్రరుక్కరీ. ౪౨

వాతమువలన జనించిన రోహిణీరోగమునందు కంఠము నోరు యెండిపోవును. చెక్కిళ్లు, చెవులు వీనియందు శూలకలుగును.

## పిత్తజరోహిణీరోగలక్షణము.

పిత్తా జ్జ్వరోషాతృణ్మోహకంఠధూమాయనాన్వితా,
క్షిప్రజాక్షిప్రపాకాతిరాగిణీ స్పర్శనాసహా. ౪౩

పిత్తమువలన జనించిన రోహిణీరోగమునందు జ్వరము, తాపము, దప్పి, మూర్ఛ, కంఠమునందు పొగవెడలునట్లుపద్రవము శూల మిక్కిలి యెరుపువర్ణము ఇవి కలుగును. శీఘ్రముగ జనించి పాకమును జెందును. స్పర్శమును సహించకుండును.

## కఫజరోహిణీరోగలక్షణము.

కఫేన పిచ్ఛిలా పాండుః-

దుష్టకఫముచే జనించిన రోహిణీరోగము జిగటగ తెలుపువర్ణముగ నుండును.

## రక్తజరోహిణీలక్షణము.

అసృజా స్ఫోటకాచితా,
తప్తాంగారనిభా కర్ణరుక్కరీ పిత్తజాకృతిః. ౪౪

దుష్టరక్తముచే జనించిన రోహిణీరోగము పిటకలతో వ్యాప్తంబుగ జ్వలింపుచుండు కొఱవితో సమానవర్ణముగలదిగ చెవులలో నొప్పిని కలుగఁజేయునదిగ నుండును. మఱియు దీనియందు పిత్తజరోహిణికి జెప్పియుండు లక్షణములును కలుగును.

## సన్నిపాతజరోహిణీరోగలక్షణము.

గంభీరపాకా నిచయాత్సర్వలింగసమన్వితా,

సన్నిపాతమువలన జనించిన రోహిణీరోగము గంభీరపాకము గలదిగ వాతాదిరోహిణీ రోగములకు వేరువేర చెప్పియుండు లక్షణము లన్నిఁటితో గూడినదిగ నుండును.

## కంఠశాలూకలక్షణము.

దోషైః కఫోల్బణైశ్శోఫః కోలవద్గ్రథితోన్నతః. ౨౫
శూకకంటకవత్కంఠే శాలూకో మార్గరోధనః,

కఫాధిక్యముతో గూడియుండు వాతాది దోషములచే కంఠమునందు రేగుపండంత ప్రమాణముగలదిగ నుంటగట్టి యుండునదిగ పొడవుగ వరిముండ్లవలె కంఠమార్గము నడ్డగించునదిగనుండు కంఠశాలూకమను వాపు జనించును.

## బృందరోగలక్షణము.

బృందో వృత్తోన్నతో దాహజ్వరకృద్గళపార్శ్వగః. ౨౬

కఫాధిక్యముతో గూడియుండు వాతాదిదోషముల వలన గొంతుక ప్రక్కన గుండ్రముగ పొడవుగనుండు వాపు జనించును. ఇది బృందమని పలుఁగును. సర్వాంగ తాపము జ్వరము వీనిని కలుగఁజేయును.

## తుండికేరికాలక్షణము.

హనుసంధ్యాశ్రితః కంఠే కార్పాసీఫలసన్నిభః,
పిచ్ఛిలో మందరుక్శోఫః కఠినస్తుండికేరికా. ౨౭

కంఠమున చెక్కిళ్లసంధి ప్రదేశమునందు పత్తివిత్తులతో సమానాకారము గలదిగ జిగటగ కొంచెము నొప్పిగలదిగ గట్టిగనుండు తుండికేరకయను వాపు జనించును.

## గళౌఘరోగలక్షణము.

బాహ్యాంతశ్శ్వయథుర్ఘోరో గళమార్గార్గళోపమః,
గళౌఘో మూర్ధగురుతా తంద్రాలాలాజ్వరప్రదః. ౨౮

కంఠమున బాహ్యాభ్యంతరములయందు దారుణమును కంఠమార్గమును గడియవలె నడ్డగించునదియు నైన వాపు జనించును. ఇది గళౌఘరోగమని చెప్పఁబడును. దీని యందు శిరోగురుత్వము, తంద్ర, జొల్లు, జ్వరము కలుగును.

## వలయరోగలక్షణము.

వలయం నాతిరుక్శోఫస్తద్వదేవాయతోన్నతః,

స్వల్పశూలతో గూడినదిగ పొడవుగ నిడుపుగ నుండు వలయమను వాపు కంఠ మునందు జనించును. గళౌఘమునకు చెప్పియుండు నుపద్రవములతో గూడియుండును.

## గళాయుగరోగలక్షణము.

మాంసకీలో గళే దోషైరేకోఽనేకోఽథ వాఽల్పరుక్. ४८
కృచ్ఛ్రోచ్ఛ్వాసాభ్యవహృతిః పృథుమూలో గళాయుకః,

దుష్టంబులైన వాతాదిదోషములచే స్వల్పశూలతో గూడియుండు మాంసాంకుర మొకటియైనను, లేక అనేకములైన మాంసాంకురములైనను కంఠప్రదేశమున జనించును. ఇది అధోభాగమున లావుగనుండును. ఈరోగమునందు బహుకష్టముచే శ్వాసము వెడలును. బహుకష్టము మీఁద ఆహారము లోనికిఁబోవును. ఈరోగమునకు గళాయుక మను నామముకలదు.

## శతఘ్నీరోగలక్షణము.

భూరిమాంసాంకురవృతా తీవ్రతృడ్జ్వరమూర్ధరుక్. ४०
శతఘ్నీనిచితా వర్తిశ్శతఘ్నీవాఽతిరుక్కరీ,

అనేక మాంసాంకురములతో వ్యాపించినదిగ దారుణమైన దప్పి, జ్వరము, తల నొప్పి వీనిని కలుగఁజేయునదిగ నుండు వర్తి (అనఁగా వాపు) కంఠమునందు జనించును. ఇది శతఘ్నియను పేరంబఱఁగును. సన్నిపాతమువలన జనించును. శతఘ్ని (ఫిరంగి) శస్త్ర ముచందంబున మిక్కిలి యుపద్రవమును కలుగఁజేయును.

## కంఠవిద్రధిరోగలక్షణము.

వ్యాప్తసర్వగళశ్శీఘ్రజన్మపాకో మహారుజః. ४०
పూతిపూయనిభస్రావీ శ్వయథుర్గళవిద్రధిః,

జనించిన తత్క్షణంబున పాకమును జెంది అధికోపద్రవములతో కంఠమునందంతట వ్యాపించి దుర్గంధయుక్తమైన చీమువలె మలమును స్రవించునట్టి వాపు కంఠము నందు జనించును. ఇది కంఠవిద్రధి యనఁబడును.

## గళార్బుదరోగలక్షణము.

జిహ్వావసానే కంఠాదావపాకం శ్వయథుం మలాః. ४౨
జనయంతి స్థిరం రక్తం నీరుజం తద్గళార్బుదమ్,

ప్రకోపించిన వాతాదిదోషంబులు నాలుకకొనయందు గాని కంఠమూలమునందు గాని పాకరహితముగ గట్టిగ ఎఱ్ఱగ ఉపద్రవరహితముగ నుండు వాపును గలుగఁజేయును. దీనిని గళార్బుదమని యందురు.

### గళగండరోగలక్షణము.

పవనశ్లేష్మమేదోభి ర్గళగండో భవేద్బహిః ౫౩
వర్ధమానస్సకాలేన ముష్కవల్లంబతే నిరుక్,

దుష్టంబులైన వాతశ్లేష్మమేదస్సులవలన కంఠమునకు వెలుపల (మెడయందు) గళగండమనురోగము జనించును. ఇది నానాటికి వృద్ధిజెందుచు ఉపద్రవరహితమై వృషణమువలె మెడయందు వ్రేలాడుచుండును.

### వాతజగళగండరోగలక్షణము.

కృష్ణోఽరుణో వా తోదాఢ్యస్సవాతాత్కృష్ణరాజిమాన్. ౫౪
వృద్ధస్తాలుగళే శోషం కుర్యాచ్చ విరసాస్యతామ్,

వాతమువలన పుట్టిన గళగండము నల్లగ లేక యెఱ్ఱగ పోట్లతో గూడినదిగ నల్లని రేఖలు నిండియుండునదిగ నుండును. ఇది వృద్ధిజెంది లోదౌడ కంఠము వీనియందు శోషను కలుగఁజేసి నోటిని విరసముగ జేయును.

### కఫజగళగండరోగలక్షణము.

స్థిర స్సవర్ణః కండూమాన్ శీతస్పర్శో గురుః కఫాత్. ౫౫
వృద్ధ స్తాలుగళే లేపం కుర్యాచ్చ మధురాస్యతామ్,

ప్రకోపించి యుండు కఫమువలన జనించిన గళగండము గట్టిగ కంఠముతో సమానవర్ణము గలదిగ దురదకలదిగ శీతస్పర్శము గలదిగ గురువుగ నుండును. ఇది వృద్ధి జెందినదై లోదౌడ కంఠము వీనియందు లేపమును గలుగఁజేయును.

### మేదోగళగండలక్షణము.

మేదసః శ్లేష్మవద్ధానివృద్ధ్యో స్సోఽనువిధీయతే. ౫౬
దేహం వృద్ధశ్చ కురుతే గళే శబ్దం స్వరేఽల్పతామ్,

వృద్ధిజెందిన మేదస్సువలన జనించిన గళగండరోగమునందు కఫజగళగండమునకు చెప్పియుండు లక్షణములన్నియు నుండును. మఱియు నా మేదోగళగండరోగమునందు శరీరము వృద్ధిజెందిన వృద్ధియు క్షయించిన క్షయమును వృద్ధిజెందునపుడు కంఠమున నొకవిధమైన శబ్దమును స్వరమునకు హానియును కలుగును.

### వాతజస్వరఘ్నరోగలక్షణము.

శ్లేష్మరుద్ధానిలగతిశ్శుష్కకంఠో హతస్వరః. ౫౭
తామ్యన్ ప్రసక్తం శ్వసితి యేన స స్వరహానిలాత్,

దుష్టంబైన శ్లేష్మముచే వాతమార్గ మడ్డగింపఁబడిన అందువలన కంఠము శుష్కించి స్వరహీనతనొంది కడుకష్టముతో రోగి శ్వాసమును విడుచును. ఇది వాతజ స్వరఘ్నరోగమని పలుఁగును. ఇటుల పదునెనిమిదిరోగములు కంఠమునందు జనించును.

నోటిలోజనించురోగము లెనిమిది, అందు:—

### ముఖపాకరోగలక్షణము.

కరోతి వదనస్యాంతర్వ్రణాన్ సర్వసరోఽనిలః. ౫౮
సంచారిణోఽరుణాన్ రూక్షానోష్ఠౌ తామ్రౌ చలత్వచౌ,
జిహ్వా శీతాసహా గుర్వీ స్ఫుటితాకంటకాచితా. ౫౯
వివృణోతి చ కృచ్ఛ్రేణ ముఖం పాకో ముఖస్య చః,

శరీరమందంతట సంచరించునట్టి వాతము నోటిలోపల నెఱ్ఱగ రూక్షముగ ప్రసరించునదిగ నుండు వ్రణములను కలుగఁజేయును. దానివలన పెదవులు రొఱ్ఱగనగును. పెదవిపైచర్మమూడును. నాలుక శీతస్పర్శమును సహించకుండునదిగ పగిలినదిగ ముండ్లు బారినదిగ లావుగ నగును. ఇది ముఖపాకరోగ మనఁబడును. దీనియందు రోగి నోటిని కడుకష్టముతో తెరుచును.

### ఊర్ధ్వగదరోగలక్షణము.

అధః ప్రతిహతో వాయురర్శో గుల్మకఫాదిభిః. ౬౦
యాత్యూర్ధ్వం వక్త్రదౌర్గంధ్యం కుర్వన్నూర్ధ్వగద స్తు సః,

అర్శస్సు గుల్మము కఫము మొదలగువానిచే వాతము అధోభాగమునం దడ్డగింపఁబడి నోటియందు దుర్గంధమును కలుగఁజేయుచు నూర్ధ్వభాగమును జేరును. దీనిని ఊర్ధ్వగదమని వచించెదరు.

### పిత్తజముఖపాకరోగలక్షణము.

ముఖస్య పిత్తజే పాకే దాహోషే తిక్తవక్త్రతా. ౬౧
క్షారోక్షితక్షతసమా వ్రణాః.

పిత్తజముఖపాకరోగమునందు సర్వాంగతాపము మంట నోటియందు చేదు వ్రణమునందుప్పుతగిలిన నట్టియుపద్రవములుగల వ్రణములు జనించును.

### రక్తజముఖపాకలక్షణము.

తద్వచ్చ రక్తజే,

దుష్టర క్తమువలన జనించిన ముఖపాకరోగమునందు పి త్తజ ముఖపాకమునకు చెప్పినలక్షణములు కలిగియుండును.

### కఫజముఖపాకరోగలక్షణము.

కఫజే మధురాస్యత్వం కండూమ త్పిచ్ఛిలా వ్రణాః. ౬౨

కఫజముఖపాకమునందు నోటియందు తీపురసము జిగట దురదతోగూడినదిగ నుండువ్రణములు జనించును.

### ముఖార్బుదరోగలక్షణము.

అంతః కపోలమాశ్రిత్య శ్యావపాండు కఫోర్బుదమ్,
కుర్యా త్తత్పాటితం ఛిన్నం మృదితం చ వివర్ధ తే. ౬౩

కఫమువృద్ధిజెంది దవుడలోభాగము నాశ్రయించి కొంచెము నల్లగ తెల్లగనుండు అర్బుదరోగమును కలుగఁజేయును. దీనిని ఛేదించినను మర్దించినను మరల వృద్ధిజెందుచునుండును.

### సన్నిపాతముఖపాకరోగలక్షణము.

ముఖపాకో భవేత్సాస్రై స్సర్వై స్సర్వాకృతిర్మలైః,

ర క్తముతోగూడియుండు వాతాదిదోషములచే జనించిన ముఖపాకరోగమునందు వాతాదిముఖపాకలక్షణంబులన్నియు కలుగును.

### పూతివక్త్రరోగలక్షణము.

పూత్యాస్యతా చ తై రేవ దంతకాష్ఠాదివిద్విషః. ౬౪

దంతకాష్ఠాదులచే దంతశుద్ధిని జేయకుండువానికి వాతాది త్రిదోషప్రకోపము వలన నోటియందు దుర్గంధము కలుగును.

### ముఖరోగసంఖ్య.

ఓష్ఠే గండే ద్విజే మూలే జిహ్వాయాం తాలుకే గళే,
వక్త్రే సర్వత్ర చేత్యుక్తాః పంచస ప్తతి రామయాః. ౬౫
ఏకాద శైకో దశ చ త్రయోదశ తథా చ షట్,
అష్టా వష్టాదశాష్టౌ చ క్రమాత్.

పెదవియందు 11, చెక్కిళ్లయందు 1, దంతములయందు 10, దంతమూలములయందు 13, నాలుకయందు 6, లోదవడయందు 8, కంఠమునందు 18, నోటిలోపల 8, టుల నోటియందంతట 75 రోగములు జెప్పఁబడినవి.

## అసాధ్యముఖరోగములు.

తేష్వనుపక్రమాః. ౬౬

కరాళో మాంసరక్తోష్ఠా వర్బుదాని జలాద్వినా,
కచ్ఛప స్తాలుపిటకాగళౌఘస్సుషిరో మహాన్. ౬౭
స్వరఘ్నోర్ధ్వగదః శ్యావ శ్శతఘ్నీవలయాలసాః,
నాడ్యోష్ఠకోపో నిచయా ద్రక్తా త్సర్వైశ్చ రోహిణీ. ౬౮
దశనే స్ఫుటితే దంతభేదః పక్వోపజిహ్వికా,
గళగండస్స్వరభ్రంశః కృచ్ఛ్రోచ్ఛ్వాసో ఽతివత్సరః. ౬౯
యాప్యస్తుహర్షో భేదశ్చ శేషాన్ శస్త్రౌషధైర్జయేత్,

పైజెప్పఁబడిన డెబ్బదియైదు ముఖరోగములలో కరాళము, మాంసజోష్ఠరోగము, రక్తజోష్ఠరోగము, జలార్బుదము తప్ప యితర అర్బుద రోగములు, కచ్ఛపము, తాలుపిటక, గళౌఘము, మహాసుషిరము స్వరఘ్నమను కంఠరోగము ఊర్ధ్వగదమను వక్త్రరోగము శ్యావరోగము శతఘ్నీవలయమను కంఠరోగములు అలసము అధజిహ్వము అను జిహ్వారోగములు, సన్నిపాతనాడీ దంతమూలరోగములు, సన్నిపాతజోష్ఠకోపము, రక్తజరోహిణి సన్నిపాతజరోహిణి దంతభేదము, పక్వోపజిహ్వికా గళగండము, స్వరభ్రంశము, ఒకసంవత్సరమునకు పైఁబడిన కృఛ్రోచ్ఛ్వాసము యివి చికిత్సయందసాధ్యంబులు. దంతహర్షము దంతభేదము ఈరెండును యాప్యంబులు. తక్కిన ముఖరోగములను క్రిందియధ్యాయమున నాయారోగములకు చెప్పియుండు ప్రకారము శస్త్రము ఔషధము వీనిచే చికిత్స జేయనగును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదియొకటవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ద్వావింశాధ్యాయము.



అవ. ముఖరోగవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము ముఖరోగ చికిత్సలం దెలుపు ముఖరోగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడు చున్నయది:—

## ముఖరోగప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో ముఖరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ముఖరోగవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము నోటిలో జనించునట్టి రోగములకు చికిత్సలను తెలియపఱచునట్టి ముఖరోగ ప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### ఖండోష్ఠరోగచికిత్స

ఖండౌష్ఠస్య విలిఖ్యాస్త్రే స్యూత్వా వ్రణవదాచరేత్,

ఖండోష్ఠమను రోగముగలవానికి స్నేహస్వేదకర్మలను చేయించి పెదవికొసలను శస్త్రముచేగీరి వానినొకటిగా చేర్చి తెల్లపట్టుదారముచేకుట్టి సద్యోవ్రణమునకుచెప్పియుండునటుల నూరుపర్యాయములు కడిగిన నేతిని (శతధౌతఘృతమును) పూసి వ్రణమునకు పైని కబళికను ప్రయోగించి చికిత్స జేయనగును.

### ఖండోష్ఠరోగమున యష్టిమధుకాదితైలము.

యష్టీ జ్యోతిష్మతీ రోధ్రశ్రావణీశారిబోత్పలైః. ౧
పటోల్యా కాకమాచ్యా చ తైలమభ్యంజనం పచేత్,

అతిమధురము, జ్యోతిష్మతి మెరపుతీఁగె (మాల్కాంగిని) లొద్దుగు, బోడతరము, నల్లసుగంధిపాల, నల్లకలువపాట్ల, కామంచి వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి తైలపాకవిధిగ వండి ఖండోష్ఠరోగమునకు పూయవలయును.

### ఖండోష్ఠరోగమునకు నస్యతైలము.

నస్యం చ తైలం వాతఘ్నమధురస్కంధసాధితమ్. ౨

ఖండోష్ఠరోగమునందు వాతహరద్రవ్యములు మధురవర్గద్రవ్యములు వీనితో పక్వముచేయఁబడిన తైలముచే నస్యమును చేయించవలయును.

వాతోష్ఠరోగలక్షణమునకు మహాస్నేహము.

మహాస్నేహేన వాతౌష్ఠే సిద్ధేనాక్తః పిచుర్హితః,
దేవధూపమధూచ్ఛిష్టగుగ్గుల్వమరదారుభిః. 3

వాతమువలన జనించిన ఓష్ఠరోగమునందు సర్జరసము, మైనము, గుగ్గిలము, దేవదారు అనువానిని మహాస్నేహములో కలిపి పక్వముచేసి అందులో ప్రత్తిని తడిపి పెదవిపై వేయవలయును. (ఘృతము, మజ్జ, వసా, తైలము ఈ నాల్గింటి నొకటిగాచేర్చిన మహాస్నేహమందురు.)

వాతోష్ఠరోగప్రతిసారణము.

యష్ట్యాహ్వ చూర్ణయుక్తేన తేనైవ ప్రతిసారణమ్,

వాతోష్ఠరోగమునందు అతిమధురమును చూర్ణముజేసి పైచెప్పిన మహాస్నేహముతోచేర్చి ప్రతిసారణము చేయించవలయును.

వాతోష్ఠరోగమునకు స్వేదనస్యములు.

నాడ్యోష్ఠం స్వేదయేద్దుగ్ధసిద్ధైరేరండపల్లవైః. ౪

ఖండౌష్ఠవిహితం నస్యం తస్య మూర్ధ్ని చ తర్పణమ్,

వాతోష్ఠరోగమునకును ఆవుపాలలో ఆముదపుచిగుళ్లను వైచి చక్కఁగ కాచి నాడిచే స్వేదకర్మను చేయించి ఖండోష్ఠరోగమునకు చెప్పియుండు నస్యములను శిరోభ్యంగమును చేయవలయును.

పిత్తాభిఘాతోష్ఠచికిత్స.

పిత్తాభిఘాతజావోష్ఠౌ జలౌకోభిరుపాచరేత్. ౫
రోధ్రసర్జరసక్షౌద్రమధుకైః ప్రతిసారణమ్,
గుడూచీయష్టిపత్తంగసిద్ధమభ్యంజనే ఘృతమ్. ౬
పిత్తవిద్రధివచ్చాత్ర క్రియా.

పిత్తజోష్ఠరోగము అభిఘాతజోష్ఠరోగము ఈ రోగములకు జలగలచే రక్తస్రావమును చేయించి లొద్దుగ, సర్జరసము, తేనె, అతిమధురము వీనిచే ప్రతిసారణము; తిప్పతీగె, అతిమధురము, రక్తచందనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవు

నేతిలో కలిపి సిద్ధముచేయఁబడిన ఘృతముచే నశ్యాంజనములు పిత్తవిద్రధిరోగమునకు చెప్పినటుల చికిత్సలను చేయవలయును.

### ―రక్తజోష్ఠరోగచికిత్స.―

శోణితే ఽపి చ,

ఇదమేవ భవేత్కార్యం కర్మ-

దుష్టరక్తమువలన జనించిన ఓష్ఠరోగమునందు పిత్తాభిఘాతజోష్ఠములకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### ―కఫజోష్ఠచికిత్స.―

ఓష్ఠే తు కఫోత్తరే. ౭

పాఠాక్షారమధువ్యోషైర్హృతాస్రే ప్రతిసారణమ్,
ధూమనావనగండూషాః ప్రయోజ్యాశ్చ కఫచ్ఛిదః. ౮

కఫజోష్ఠరోగమునకు తొలుత రక్తమోక్షణమును చేయించి పిదప చిరుబొద్ది, సర్జక్షారము, తేనె, త్రికటుకములు వీనిచే ప్రతిసారణమును కఫహరములైన ధూమపాననస్యగండూషములను చేయించవలయును.

### ―మేదోజోష్ఠరోగచికిత్స.―

స్విన్నం భిన్నం విమేదస్కం దహేన్మేదోజమగ్నినా,
ప్రియంగురోధ్రత్రిఫలామాక్షికైః ప్రతిసారయేత్. ౯

మేదస్సువలన జనించిన ఓష్ఠరోగమునందు స్వేదకర్మను చేయించి యారోగమును చీల్చి లోననుండు మేదస్సును తీసివేసి నిప్పుచేకాల్చి పిదప ప్రేంకణము, లొద్దుగు, త్రిఫలములు, తేనె వీనితో ప్రతిసారణము చేయించవలయును.

### ―జలార్బుదరోగచికిత్స.―

సక్షౌద్రా ఘర్షణం తీక్ష్ణా భిన్నశుద్ధే జలార్బుదే,
అవగాఢేఽతివృద్ధే వా క్షారోఽగ్నిర్వా ప్రతిక్రియా. ౧౦

జలార్బుదరోగమునం దారోగమును భేదించి శుద్ధమైన పిదప పిప్పళ్లు, మిరియాలు మొదలగు తీక్ష్ణద్రవ్యములను తేనెలో చాది ఆరోగమునకు పైనిరుద్దవలయు. ఆరోగము లోపలికి దిగియుండినను లేక వృద్ధిజెందియుండినను దానిని క్షారముచే గాని నిప్పుచే గాని కాల్చవలయును.

### గండాలజీచికిత్స.

ఆమాద్యవస్థాస్వలజీం గండే శోఫవదాచరేత్,

కపాలమునందు జనించిన అలజీరోగము అపక్వముగనుండు నపుడు దానికి శోఫరోగమునకు చెప్పియుండు నటుల చికిత్స చేయవలెను.

### శీతదంతచికిత్స

స్విన్నస్య శీతదంతస్య పాళీం విలిఖితాం దహేత్. ౧౧
తైలేన ప్రతిసార్యా చ సక్షౌద్రఘనసైంధవైః,
దాడిమత్వగ్వరాతార్క్ష్యకాంతాజంబ్వస్థినాగరైః. ౧౨
కబళః క్షీరిణాం క్వాథైరణుతైలం చ నావనమ్,

శీతదంతమను రోగమునందు స్వేదకర్మను చేయించి వ్రీహిముఖమను శస్త్రముచే దంతపాళిని ఛేదించి నువ్వులనూనెచే కాల్చనలయును దానిమ్మబెరడు, త్రిఫలములు, రసాంజనము, నేరేడువిత్తులు, శుంఠి, సైంధవలవణము, తుంగముస్తలు, తేనె అనువానితో ప్రతిసారణమును చేయించవలయును. క్షీరివృక్షకషాయములచే కబళమును అణుతైలముచే నస్యమును చేయించవలయును.

### దంతహర్షభేదచికిత్స.

దంతహర్షే తథా భేదే సర్వా వాతహరా క్రియా. ౧౩
తిలయష్టీమధుశ్శృతం క్షీరం గండూషధారణమ్,

దంతభేదము, దంతహర్షము అను నీరోగములయందు వాతహర చికిత్సల నన్నింటిని చేసి నువ్వులు, అతిమధురము వీనితో కాచఁబడిన ఆవుపాలచే గండూషమును ధరింపఁజేయవలయును.

### దంతచాలరోగచికిత్స.

సస్నేహం దశమూలాంబు గండూషః ప్రచలద్ద్విజే. ౧౪
తుత్థరోధ్రకణాశ్రేష్ఠాపత్తంగపటుఘర్షణమ్,
స్నిగ్ధాశ్చైలాల్యా యథావస్థం నస్యాన్నకబళాదయః. ౧౫

దంతములు చలించుచుండిన దశమూలకషాయములో నువ్వులనూనెను చేర్చి గండూషమును చేయించవలయును. మైలుతుత్తము, లొద్దుగు, పిప్పళ్లు, త్రిఫలములు, పత్తంగము (అనఁగా రక్తచందనము) సైంధవలవణము వీనిని చక్కఁగ చూర్ణము చేసి

దంతములపై రుద్దవలయును. మఱియు స్నిగ్ధముగనుండు నస్యము, అన్నము, కబళము మొదలగువాని నాయాయవస్థానుగుణముగ పలుమారు చేయుచుండవలయును.

## అధిదంతరోగచికిత్స.

అధిదంతకమాలిప్తం యదా క్షారేణ జర్జరమ్,
కృమిదంతమివోత్పాట్య తద్వచ్చోపచరేత్తదా. ౧౬
అనవస్థితరక్తేన చ దగ్ధే వ్రణ ఇవక్రియా,

అధిదంతరోగమునందు నాదంతములకు సర్జక్షారమును లేపనముచేసి శిథిలము నొంది యుండునపుడు దానిని కృమిదంతమువలె పెరికి చికిత్స జేయవలయును. అధి దంతమును పీకునపుడు నాస్థానమునందు రక్తము విశేషముగ స్రవించిన నాస్థానమును నిప్పుచేకాల్చి పిదప వ్రణమునకు చెప్పియుండునటుల చికిత్స చేయవలయును.

## దంతశర్కరారోగచికిత్స.

అహింసన్దంతమూలాని దంతేభ్యశ్శర్కరాం హరేత్. ౧౭
క్షారచూర్ణైర్మధుయుతైస్తతశ్చప్రతిసారయేత్,

దంతశర్కరరోగమున దంతమూలములకు బాధ కలుగనీయక కడుజాగరూకతతో దంతములయం దుండు శర్కరను దంతలేఖనక శస్త్రముచే తీసివేసి క్షారచూర్ణములో తేనెను కలిపి ప్రతిసారణము చేయించవలయును.

## కపాలికారోగచికిత్స

కపాలికాయామప్యేవం హర్షోక్తం చ సమాచరేత్. ౧౮

కపాలికయను దంతరోగమునందు దంతశర్కర, దంతహర్షము అనురోగములకు చెప్పియుండు చికిత్సలనన్నిటిని చేయవలయును.

## కృమిదంతరోగచికిత్స.

జయేద్విస్రావణైస్స్విన్నమచలం క్రిమిదంతకమ్,
స్నిగ్ధైశ్చాలేపగండూషనస్యాహారైశ్చలాపహైః. ౧౯
గుడేన పూర్ణం సుషిరం మధూచ్ఛిష్టేన వా దహేత్,
సప్తదార్కక్షీరాభ్యాం పూరణం కృమిశూలజిత్. ౨౦

కృమిదంత రోగమునందు దంతములు చలింపక యుండిన యెడల వానిస్వేద కర్మను చేయించి రక్తమోక్షణమును చేయవలయును. పిదప స్నిగ్ధముగ వాతహరములుగనుండు లేపనము గండూషము నస్యము ఆహారము వీనిని చేయించవలయును.

మఱియు దంతద్వారముల యందు బెల్లమునుగాని మైనమునుగాని నిండించి నిప్పులా కాల్చఁబడిన కుజ్జశలాకచే కాల్చవలయును. లేక ఏడాకులపొన్న పాలనుగాని జిల్లేడు పాలనుగాని యాదంతద్వారముల యందు నిండించిన కృమిశూలలు హరించును.

కృమిదంతశూలహరచికిత్స

హింగుకట్ఫలకాసీసస్వర్జికాకుష్ఠవేల్లజమ్,
రజో రుజం జయత్యాశు వస్త్రస్థం దశనే ధృతమ్. ౨౧

ఇంగువ, జేకు, పుష్పకాసీసము, అన్నభేది, స్వర్జికాక్షారము, చెంగల్వకోష్టు మిరియాలు వీని చూర్ణమును వస్త్రములో మూటగట్టి దంతములకుపైన నుంచుకొనిన కృమిశూలలు శమించును.

కృమిదంతమునకు గండూషము.

గండూషం ధారయేత్తైలమేభిరేవ చ సాధితమ్,
క్వాథైర్వా యుక్తమేరండద్వివ్యాఘ్రీభూకదంబజైః. ౨౨

పైచెప్పిన యింగువ మొదలగు ద్రవ్యములతో సిద్ధముచేయఁబడిన తైలముచే రోగికి గండూషమును చేయించవలయును. లేక ఆముదపుచెట్టు, ములక, పెద్దములక, నేలకడిమి అనువానిని యుదకములోవైచి కషాయముకాచి దానిని నువ్వులనూనెలోకలిపి గండూషమును ధరింపఁజేయువలయును.

శూలయుక్తదంతోత్పాటనము.

క్రియాయోగైర్బహువిధైరిత్యశాంతరుజంభృశమ్,
దృఢమప్యుద్ధరేద్దంతం పూర్వం మూలాద్విమోక్షితమ్. ౨౩
సందంశకేన లఘునా దంతనిర్ఘాతనేన వా,
తైలం సయష్ట్యాహ్వారజో గండూషో మధునా తతః. ౨౪

పైచెప్పిన యనేకవిధ చికిత్సలనుజేసినను ఆకృమిదంత శూల శమించక యుండిన నాదంతము చలించకయుండినను దానిని సందంశకమను యంత్రముచేతగాని దంతనిర్ఘాతమను యంత్రముచేత గాని తీసివైచి వానికి యష్టిమధుకచూర్ణము చేర్చఁబడిన తైలమునుగాని తేనెనుగాని గండూషమునందు ధరింపఁజేయవలయును.

దంతశూలహరనస్యము.

తతో విదారియష్ట్యాహ్వాశృంగాటకకశేరుభిః,
తైలం దశగుణక్షీరం సిద్ధం యుంజీత నావనమ్. ౨౫

నేలగుమ్మడు, అతిమధురము, నమ్మదుంప, తుంగముస్తలు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి నూనెకు బదింత లావుపాలను చేర్చి తైలపాకవిధిగవండి నస్యము చేయించిన దంతశూలలు హరించును.

## దంతోత్పాటన నిషేధము.

కృశదుర్బలవృద్ధానాం వాతార్తానాం చ నోద్ధరేత్,
నోద్ధరే చ్చోత్తరం దంతం బహ్వాకద్రవకృద్ధి సః. ౨౬
ఏషామప్యుద్ధలతైఃస్నిగ్ధస్స్వాదుశ్శీతః క్రమో హితః,

కృశులు, దుర్బలులు, వృద్ధులు, వాతరోగ పీడితులు, వీరల దంతములను శస్త్రముచే పీకంజనదు. మఱియు పైభాగమునందుండు దంతములను ఎప్పుడును ఊడదీయం దగదు. వానిని తీసివేసినచో అధికోపద్రవములు కలుగును. దంతముల పెరికినతోడనే స్నిగ్ధముగ, శీతముగ, మధురముగ నుండు చికిత్సలను చేయవలయును.

## శీతాదరోగచికిత్స.

విస్రావితాస్రే శీతాదే నష్టోద్రైః ప్రతిసారణమ్. ౨౭
ముస్తార్జునత్వక్త్రిఫలాఫలినీతార్క్ష్యనాగరైః,
తత్కాథః కబళో నస్యం తైలం మధురసాధితమ్. ౨౮

శీతాదరోగమునందు రక్తస్రావమును చేయించి తుంగముస్తలు, మద్దిపట్ట, త్రిఫలములు, ప్రేంకణము, రసాంజనము, శుంఠి వీని చూర్ణములో తేనెను గలిపి ప్రతిసారణమును చేయించవలయును. పైతుంగముస్తలు మొదలగువాని కషాయముచే కాఁచి కబళధారణమును మధురద్రవ్యములతో సిద్ధము చేయఁబడిన తైలముచే నస్యమును చేయించవలయును.

## ఉపకుశరోగచికిత్స.

దంతమాంసాన్యుపకుశే స్విన్నాన్యుష్ణాంబుధారణైః,
మండలాగ్రేణ శాకాదిపత్రైర్వా బహుశో లిఖేత్. ౨౯
తతశ్చ ప్రతిసార్యాణి ఘృతమండమధుద్రుతైః,
లాక్షాప్రియంగుపత్తంగలవణోత్తమగైరికైః. ౩౦
సకుష్ఠశుంఠీమరిచయష్టీమధురసాంజనైః,
సుఖోష్ణో ఘృతమండోఽనుతైలం వా కబళగ్రహః. ౩౧
ఘృతం చ మధురైస్సిద్ధం హితం కబళనస్యయోః,

ఉపకుశరోగమునందు దంతమాంసములకు సుఖోష్ణముగనుండు ఉదకముచే ; ధూపధారణమును స్వేదకర్మను చేయించి మండలాగ్రమను శస్త్రముచే గాని శాక మున్నగు గఱకులు కల ఆకులచేగాని దంతమాంసములను పలుమారుగీరి లత్తుక, చిత్రమ లము, ప్రేంకణము, పత్తంగము, (రక్తచందనము) సైంధవలవణము, కావిరాయి, చె ల్వకోష్టు, సొంటి, మిరియాలు, అతిమధురము, రసాంజనము అనువానిని నేతిమీగ తేనె వీనిలో పక్వముచేసి ప్రతిసారణమును చేయించవలయును. పిదప సుఖోష్ణమ నుండు నేతిమీగడచే గాని నువ్వులనూనెచే గాని కబళధారణమును చేయించ యును. మఱియు మధురౌషధ కల్కములతో పక్వముచేయఁబడిన ఘృతముచే క మును నస్యమును జేసిన హితము కలుగును.

## దంతపుప్పుటచికిత్స.

దంతపుప్పుటకే స్విన్నచ్ఛిన్నభిన్నవిలేఖితే. 3

యష్ట్యాహ్వస్వర్జికాశుంఠీసైంధవైః ప్రతిసారణమ్,

దంతపుప్పుట రోగమునందు దంతములకు స్వేదకర్మను చేయించి ఛేదన భేద లేఖనంబులంజేసి పిదప అతిమధురము, సర్జక్షారము, సొంటి, సైంధవలవణము అ వానిచే ప్రతిసారణమును జేయవలెను.

## దంతవిద్రధిచికిత్స.

విద్రధౌ కటుతీక్ష్ణోష్ణరూక్షైః కబళలేపనమ్. 3

ఘర్షణం కటుకాకుష్ఠవృశ్చికాలీయవోద్భవైః,

రక్షేత్పాకం హిమైః పక్వం పాట్యే దాహ్యోఽవగాఢకః. 3

దంతవిద్రధిరోగమునందు కారముగ, తీక్ష్ణముగ, ఉష్ణముగ, రూక్షముగనుం కటుకరోహిణి, చెంగల్వకోష్టు, తేలుమణివిత్తులు అనువానిచే కబళము లేపనము ఘ ణము వీనిని యొనర్పవలయును. శీతవీర్యముగల యౌషధముచే దంతవిద్రధిపాకము జెందకుండునటుల రక్షింపవలయును. పక్వమైన దంతవిద్రధిని శస్త్రముచే ఛేదింపవ యును. లోపలికి దిగియుండుదానిని అగ్నిచే కాల్చవలయును.

## సుషిరరోగచికిత్స.

సౌషిరే ఛిన్నలిఖితే సక్షౌద్రైః ప్రతిసారణమ్,

రోధ్రముస్తామిశిశ్రేష్ఠాతార్క్ష్యపత్తంగకింశుకైః. 3

సకట్ఫలైః కషాయైశ్చ తేషాం గండూష ఇష్యతే,

యష్టీరోధ్రోత్పలానంతాశారిబాగరుచందనైః. 3

సగైరికసితాపుండ్రైస్సిద్ధం తైలం చ నావనమ్,

సౌషిరము రోగమునకు ఛేదనలేఖనంబులంజేసి పిదప లొద్దుగు, తుంగము స్తలు, జటామాంసి, త్రిఫలములు, రసాంజనము, పత్తంగము, మోదుగు, (రక్తచందనము,) శేకు అనువాని చూర్ణములో తేనెను కలిపి ప్రతిసారణమును జేయవలయును. శైలొద్దుగు మొదలగు ద్రవ్యముల కషాయముచే గండూషమును జేయించవలయును. అతిమధురము, లొద్దుగు, నల్లకలువ, తిప్పతీగె, లేక దూలగోవిల, నల్లసుగంధిపాల, అగరుచెక్క, చందనము, కావిరాయి, పంచదార, పుండ్రము అనువాని కల్కముతో సిద్ధము జేయఁబడిన తైలముచే నస్యము జేయించవలయును.

## —అధిమాంసకరోగచికిత్స.—

ఛిత్వాధిమాంసకం చూర్ణైస్సక్షౌద్రైః ప్రతిసారయేత్. ౩౭

వచా తేజోవతీపాఠాస్వర్జికాయవశూకజైః,
పటోలనింబత్రిఫలాకషాయః కబళో హితః. ౩౮

అధిమాంసకమను దంతరోగమును శస్త్రముచే ఛేదించి పిమ్మట వస, మెరపుతీఁగె (మాల్కంగిని) చిరుబొద్ది, సర్జక్షారము యవక్షారము అనువాని చూర్ణములో తేనెనుకలిపి ప్రతిసారణమును జేయించవలయును. పొట్ల, వేము, త్రిఫలములు అనువాని కషాయముచే కబళమును చేయించవలయును.

## —విదర్భరోగచికిత్స.—

విదర్భే దంతమూలాని మండలాగ్రేణ శోధయేత్,
క్షారం యుంజ్యాత్తతో నస్యం గండూషాది చ శీతలమ్. ౩౯

విదర్భరోగమున దంతమూలమును మండలాగ్ర శస్త్రముచే ఛేదించి సర్జక్షారమును ప్రయోగించవలయును. పిదప శీతవీర్య ద్రవ్యములతో సిద్ధముచేయఁబడిన నస్యగండూషములను జేయవలయును.

## —నాడీరోగచికిత్స—

సంశోధ్యోభయతః కాయం శిరశ్చోపచరే త్తతః,
నాడీం దంతానుగాం దంతం సముద్ధృత్యాగ్నినా దహేత్. ౪౦
కుబ్జాం నైకగతిం పూర్ణాం మదనేన గుడేన వా,
ధావనం జాతిమదనఖదిరస్వాదుకంటకైః. ౪౧
క్షీరివృక్షాంబుగండూషో నస్యం తైలం చ తత్కృతమ్,

దంతవిదగ్ధరోగమునందు వమనవిరేచనంబులను జేయించి విరేచన నస్యముచే శిరమును శోధించి దంతసమీపమున నుండు నాడికి చికిత్సచేయవలయును. మఱియు నాదంతమును పెరికివేసి అచట బెల్లమును గాని మృంగపండును గాని యుంచి నిప్పుచే కాల్చవలయును. జాజి, మృంగ, చంద్ర, ఏనుగుపల్లేరు అనువానిచే దంతధావనమును చేయవలయును. క్షీరివృక్షకషాయముతో గండూషమును క్షీరివృక్ష కషాయముతో సిద్ధము చేయఁబడిన తైలముచే నస్యమును ప్రయోగించవలయును. అత్తి, రావి, జువ్వి, అనునవి క్షీరివృక్షములు.

వాతజజిహ్వాకంటకరోగచికిత్స.

కుర్యాద్వాతోష్ఠకోపోక్తం కంటకేష్వనిలాత్మసు. ౪౨
జిహ్వాయాం-

వాతజ జిహ్వాకంటకరోగమున వాతజోష్ఠకోప రోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

పిత్తజజిహ్వాకంటకరోగచికిత్స.

పిత్తజా తేషు ఘృష్టేషు రుధిరే స్రుతే,
ప్రతిసారణగండూషనావనం మధురైర్హితమ్. ౪౩

పిత్తమువలన జనించిన జిహ్వారోగమునందు నాలుకమలమును గీచి రక్తస్రావమును చేయించి మధురౌషధములతో ప్రతిసారణమును గండూషమును నస్యమును ప్రయోగించవలయును.

కఫజజిహ్వాకంటకరోగచికిత్స.

తీక్ష్ణైః కఫోత్థేష్వప్యేవం సర్షత్రూష్యషణాదిభిః,

కఫజ జిహ్వాకంటకరోగమునందు నాకంటకములను గీచివేసి రక్తమోక్షణము చేయించి తీక్ష్ణముగనుండు ఆవాలు, త్రికటుకములు మొదలగువానిచే ప్రతిసారణ గండూష నస్యములను ప్రయోగించవలయును.

జిహ్వాలసరోగచికిత్స.

నవే జిహ్వాలసే ఽప్యేవం తం తు శస్త్రేణ న స్పృశేత్. ౪౪

జిహ్వాలసకరోగము క్రొత్తగనుండునపుడు పైచెప్పిన ప్రకారము తీక్ష్ణౌషధములచే ప్రతిసారణ గండూషాదులను చేయించవలెను. శస్త్రముచే దానిని చికిత్స జేయంజనదు.

### అధిజిహ్వాకారోగచికిత్స.

ఉన్నమ్య జిహ్వామాకృష్టాం బడిశేనాధిజిహ్వికామ్,
ఛేదయేన్మండలాగ్రేణ తీక్ష్ణోష్ణైర్ఘర్షణాది చ. ౪౫

అధిజిహ్వాకనాలుకను పైకెత్తి దానిక్రిందనుండు అధిజిహ్వాకరోగమును బడిశ
మను యంత్రముచే నీడ్చిపట్టుకొని మండలాగ్రమను శస్త్రముచే ఛేదించి తీక్ష్ణముగ
ష్ణముగనుండు నౌషధములచే ఘర్షణాదులను ప్రయోగించవలయును.

### ఉపజిహ్వాచికిత్స.

ఉపజిహ్వాం పరిస్రావ్య యవక్షారేణ ఘర్షయేత్,

ఉపజిహ్వాకను లేకాకు నున్నగు గఱుకులుగల ఆకులచేనైనను, శస్త్రముచేనైనను,
ంగుళి శస్త్రముచేనైనను ఛేదించి దుష్టరక్తాదుల స్రవింపఁజేసి దానిపై యవక్షారము
చి రుద్దవలెను.

### గళశుండికాచికిత్స.

కఫఘ్నై శ్శుండికా సాధ్యా నస్యగండూషఘర్షణైః. ౪౬

శుండికారోగమునందు కఫహరమైన నస్యము గండూషము ఘర్షణము అను నీచికి
లను జేయవలయును.

### గళశుండికయందు శస్త్రచికిత్స.

*ఏర్వారుబీజప్రతిమం వృద్ధాయామసిరాతతమ్,
అగ్రే నివిష్టం జిహ్వాయాః బడిశాద్యవలంబితమ్. ౪౭
ఛేదయేన్మండలాగ్రేణ నాత్యగ్రే న చ మూలతః,
ఛేదేఽత్యసృక్షయాన్మృత్యుర్హీనే వ్యాధిర్వివర్ధతే. ౪౮

గళశుండికారోగము వృద్ధిజెందియుండిన నాలుక కొనయందలి నల్లగను, నిడుపు
నక్కదోసవిత్తులవలెను నుండు యీ గళశుండికను బడిశాది శస్త్రములచే నీడ్చి
కొని మండలాగ్రమనుశస్త్రముచే ఛేదింపవలయును. అటుల ఛేదించునప్పుడు మిక్కిలి
యందుగాని మిక్కిలిమూలమునందుగాని ఛేదింపఁగూడదు. మిక్కిలి మూలమునందు
చిన విశేషముగ రక్తము క్షయించి మరణము కలుగును. మిక్కిలి కొనలయందు
చిన పైరోగము మరల వృద్ధిజెందును.

### గళశుండికయందు మరిచాదిఘర్షణము.

మరిచాతివిషాపాఠావచాకుష్ఠకుటన్నటైః,

---

* ఉర్వారుబీజ.

ఛిన్నాయాం సపటుక్షౌద్రైర్ఘర్షణం కబళః పునః. ౪౯
కటుకాతివిషాపాఠా నింబరాస్నావచాంబుభిః,

గళశుండికారోగమును చక్కగ ఛేదించి పిదప మిరియాలు, అతివస, చిరుబొద్ది, వస, చెంగల్వకోష్టు, దుందిలము, సైంధవలవణము అనువానిని చూర్ణముచేసి అందులో తేనెను చేర్చి ఛేదించి వ్రణముపై నుంచి రుద్దవలయును. కటుకరోహిణి, అతివస, వేము, సన్నరాస్నము, వస అనువాని కషాయముచే కబళమును జేయించవలయును.

### తాలుసంహత్యాదిచికిత్స.

సంఘాతే పుప్పుటే కూర్మే విలిఖ్యైవం సమాచరేత్. ౫౦

దంతసంహతి, దంతపుప్పుటము, దంతకచ్ఛపము అనురోగములను పై గళశుండికారోగమునకు చెప్పియుండునటుల శస్త్రముచే ఛేదించి చికిత్సలను జేయవలయును.

### అపక్వతాలుపాకచికిత్స.

అపక్వే తాలుపాకే తు కాసీసక్షౌద్రతార్క్ష్యజైః,
ఘర్షణం కబళశ్శీతకషాయమధురౌషధైః. ౫౧

తాలుపాకరోగము పక్వము కాకుండుటకు పూర్వము దానికి పుష్పకాసీసము, తేనె, రసాంజనము అనువానిచే ఘర్షణమును శీతముగ వగరుగ మధురముగనుండు నౌషధములచే కబళమును జేయించవలయును.

### పక్వతాలుపాకచికిత్స

పక్వేఽష్టాపదవద్భిన్నే తీక్ష్ణోష్ణైః ప్రతిసారణమ్,
వృషనింబపటోలాద్యైస్తిక్తైః కబళధారణమ్. ౫౨

తాలుపాకరోగము పక్వమై యుండినయెడల దానిని మండలాగ్రమను శస్త్రముచే అష్టాపదమువలె ఛేదించి తీక్ష్ణముగ నుష్ణముగనుండు నౌషధములచే ప్రతిసారణమును ప్రయోగించవలయును. పిదప అడ్డసరము, వేము, చేదుపొట్ల, జాజిగన్నేరు, తిప్పతీగె, కటుకరోహిణి, పసుపు, మ్రానిపసుపు, వేపచిగుళ్లు, వ్రాకుడు మొదలగు తిక్తద్రవ్యముల కషాయముల చేతను మధుతైలముచేతను కబళధారణమును జేయించవలయును.

### తాలుశోషచికిత్స.

తాలుశోషే త్వతృష్ణస్య సర్పిరుత్తరభక్తికమ్,

కణాశుంఠీశృతంపానమమ్లైర్గండూషధారణమ్. ౫౩

ధన్వమాంసరసాఃస్నిగ్ధాః క్షీరసర్పిశ్చ నావనమ్,

తాలుశోష రోగముగలవానికి దప్పిలేకుండిన ఉత్తరభక్తికమైన ఘృతమును పిప్పళ్లు శుంఠి వీనితో కాచఁబడిన యుదకపానమును, కలి మొదలగు పుల్లని ద్రవ్యములచే గండూషధారణమును ఘృతాది జాంగలదేశ జంతుమాంస రసపానమును, ఆవుపాలు, నెయ్యి వీనిచే నస్యమును జేయించవలయును.

## కంఠరోగచికిత్స.

కంఠరోగే ష్వసృఙ్మోక్షస్తీక్ష్ణైర్నస్యాది కర్మ చ. ౫౪

క్వాథః పానం చ దార్వీత్వఙ్నింబతార్క్ష్యకళింగజః,

హరీతకీకషాయో వా పేయో మాక్షికసంయుతః. ౫౫

కంఠరోగములయందు రక్తమోక్షణమును తీక్ష్ణముగనుండు ద్రవ్యములచే నస్య గండూషాదులును, మ్రానిపసుపు, లవంగపట్ట, వేము, రసాంజనము, కొడిశవిత్తులు అనువాని కషాయపానమును, లేక తేనెను జేర్చిన కరక్కాయల కషాయపానమును జేయించవలయును.

## కంఠరోగమునందు కబళాదిధారణము.

శ్రేష్ఠాద్వ్యోషయవక్షారదార్వీద్వీపిరసాంజనైః,
సపాఠా తేజనీనింబైస్సూక్తగోమూత్రసాధితైః. ౫౬
కబళో గుటికా చాత్ర కల్పితా ప్రతిసారణమ్,

కంఠరోగములకు త్రిఫలములు, త్రికటుకములు, యవక్షారము, మ్రానిపసుపు, వ్రాకుఁడు,రసాంజనము, చిరుబొద్ది, మెరపుగెఁగె, వేము అనువానిని పులికడుగు, గోమూత్రము వీనిలోఁచేర్చి చక్కఁగ కాఁచి దానిచే కబళధారణమును జేయించవలయును. పైత్రిఫలాదిద్రవ్యముల పైకషాయముతో నూరి గుటికలు చేసి ప్రతిసారణము జేయించవలయును.

## కంఠశూలహరలేపము.

నిచులం కటభీముస్తం దేవదారుమహౌషధమ్. ౫౭

వచా దంతీ చ మూర్వా చ లేపఃకోష్ణోఽర్తిశోథహా,

నీరుప్రబ్బలి, నల్లగినియ, తుంగముస్తలు, దేవదారు, శుంఠి, వస, దంతిచెట్టు చాగ అనువానిని నూరి సుఖోష్ణముగ లేపనము జేసిన కంఠమునందుగల, నొప్పి, వా హరించును.

వాతరోహిణీచికిత్స.

అథాంతర్బాహ్యతః స్విన్నాం వాతరోహిణికాం లిఖేత్. ౫౮
అంగులీశస్త్రకేణాశు పటుయుక్తనఖేన వా,
పంచమూలాంబుకబళస్తైలం గండూషనావనమ్. ౫౯

వాతజరోహిణిరోగము కలవాని యొక్క బాహ్యాభ్యంతరములకు స్వేదకర్మను చేయించి అంగుళి శస్త్రముచే గాని సైంధవలవణముతో గూడియుండు నఖముచే గాని శీఘ్రముగ ఛేదింపవలయును. పంచమూల కషాయముచే కబళమును, నువ్వులనూనెచే నస్యమును గండూషమును జేయించవలయును.

పిత్తరోహిణీచికిత్స.

విస్రావ్య పిత్తసంభూతాం సితాక్షౌద్రప్రియంగుభిః,
ఘృష్టే త్సరోధ్రపత్తంగైః కబళః క్వథితైశ్చ తైః. ౬౦
ద్రాక్షాపరూషకక్వాథో హితశ్చ కబళగ్రహే,

పిత్తమువలన జనించిన రోహిణీరోగమును ఛేదించి అందులోనుండు దుష్టరక్తమును వెలిపఱచి పంచదార, తేనె, ప్రేంకణము, లొద్దుగు, పత్తంగము (అనఁగా రక్త చందనము) వీనిని నూరి రుద్దవలయును. పైపంచదార మున్నగు ద్రవ్యములను ఉదకములో వైచి కాచిన కషాయము చేతను, ద్రాక్షపండు, పేరీత వీని కషాయము చేతను కబళధారణము చేయించవలయును.

రక్తజరోహిణీచికిత్స.

ఉపాచరే దేవమేవ ప్రత్యాఖ్యాయాస్రసంభవామ్. ౬౧

రక్తమువలన కలిగిన రోహిణీరోగ మసాధ్యమగుటంజేసి దానిని చికిత్సయందు వర్జింపవలయును. అయినను దానిని పిత్తజరోహిణికి చెప్పియుండునటుల చికిత్స చేయవలెను.

కఫజరోహిణీచికిత్స.

సాగారధూమైః కటుకైః కఫజాం ప్రతిసారయేత్,
నస్యగండూషయోస్తైలం సాధితం చ ప్రశస్యతే. ౬౨
అపామార్గఫలశ్వేతాదంతీజంతుఘ్నసైంధవైః,

కఫమువలన జనించిన రోహిణీరోగమునందు కరుధూపము కటువర్గములో చెప్పి
ండు ద్రవ్యములు వీనినినూరి ప్రతిసారణమును చేయించవలయును. ఉత్తరేణి
ంలు, శ్వేతా (అనఁగా విష్ణుక్రాంతము) దంతి, వాయువిడంగములు, సైంధవలవణము
ి సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి చక్కఁగకాఁచి కఫజరో
శియందు నస్యగండూషములను చేయించవలయును.

## బృందశాలూకాదిచికిత్స.

తద్వచ్చ బృందశాలూకతుండికేరీగిలాయుషు. ౬౩

బృందము, శాలూకము, తుండికేరీ, గిలాయు అను నీరోగములయందు కఫజ
ాణీరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## కంఠవిద్రధిచికిత్స.

విద్రధౌ స్రావితే శ్రేష్ఠా రోచనాతార్క్ష్యగైరికైః,
సరోధ్రపటుపత్తంగకణైర్గండూషఘర్షణే. ౬౪

విద్రధిరోగమును వస్త్రముచే ఛేదించి రక్తమును స్రవింపఁజేసి పిదప త్రిఫల
, గోరోచనము, రసాంజనము, కావిరాయి, లొద్దుగు, సైంధవలవణము, రక్తచం
ు, పిప్పళ్లు వీని నుదకములో వైచి చక్కఁగ కాఁచి గండూషమును చేయించవల
ు. మఱియు పై ద్రవ్యములను నూరి రోగముమీఁద రుద్దవలయును.

## వాతజగళగండచికిత్స.

గళగండః పవనజస్స్విన్నో విస్రుతశోణితః.
తిలైర్బీజైశ్చలట్వోమాప్రియాళశణసంభవైః. ౬౫
ఉపనాహ్యో వ్రణే రూఢే ప్రలేప్యశ్చ పునః పునః,
శిగ్రుతిల్వకతర్కారీగజకృష్ణాపునర్నవైః. ౬౬
కాలామృతార్కమూలైశ్చ పుష్పైశ్చ కరహాటజైః;
పక్వైషికాన్వితైః పిష్టైస్సురయా కాంజికేన వా. ౬౭

వాతమువలన బుట్టిన గళగండరోగమునకు స్వేదకర్మ రక్తస్రావము వీనినిచేయించి
ునూనె, కుసుంబవిత్తులు, క్రానుగు, అగిసివిత్తులు, ప్రేంకణపు విత్తులు, జనప
వీనిచే నుపనాహస్వేదము నొనర్పవలయును. వ్రణము కొంచెము శమించిన
ునగ, తిల్వకమను గ్రంథ్యము, తక్కెడ, ఏనుగుపిప్పళ్లు, తెల్లగలిజేరు, పెద్దనీలి
ిప్పతీగవేళ్లు, జిల్లేడువేళ్లు, తామరపువ్వు లేక మంగపువ్వు, తెల్లతెగడ వీనిని

సురయను మద్యముతోఁగాని, పులికడుగుతోఁగాని నూరి పలుమారు లేపనము చేయించ వలయును.

వాతజగళగండమునకు గుడూచ్యాదితైలము.

గుడూచీనింబకుటజహంసపాదీబలాద్వయైః,
సాధితం పాయయేత్తైలం సకృష్ణాదేవదారుభిః. ౬౮

తిప్పతీఁగె, వేము, కొడిసె, హంసపాది, చిట్టాముట్టి, పేరాముట్టి, పిప్పళ్లు, దేవదారు వీని కల్కముతోఁ పక్వముచేయఁబడిన తైలమును గళగండరోగికి పానము చేయించవలయును.

కఫజగళగండచికిత్స.

కర్తవ్యం కఫజే ఽప్యేతత్స్వేదవిమ్లాపనేత్వతి,
కఫముచేకలిగిన గళగండరోగమునందు వాతజ గళగండరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయుటయేగాక స్వేదకర్మ, విమ్లాపనము (అనఁగా మర్దించుట) వీనిని విశేషముగ చేయించవలయును.

కఫజగళగండహరలేపము.

లేపోఽజగంధాతివిషావిశల్యాసవిషాణికాః. ౬౯
గుంజాలాబుశుకాహ్వైశ్చ పలాశక్షారకల్కితాః,

వాయింట, అతివస, తెలువఁణి, ఒద్ది, గురిగింజ, అనుగు, శుకాహ్వము వీనిని మోదుగుక్షార కషాయముతోఁనూరి కఫజ గళగండమునకు లేపనము చేయవలయును.

కఫజగళగండమునకు తైలపానము

మూత్రశృతం హగక్షారం పక్త్వా కోద్రవభుక్పిబేత్. ౭౦
సాధితం వత్సకాద్యైర్వా తైలం సపటువంచకైః,
కఫఘ్నాంధూమవమననావనాదీంశ్చ శీలయేత్. ౭౧

హరక్షారం (అనఁగా తూడిహరక్షారమును) గోమూత్రములోవైచి చక్కఁగ వండి యాక్షారము నుదకములో కలిపి కఫజగళగండరోగికి పానముచేయించి కొఱ్ఱలయన్నమును పథ్యముగ నిప్పించవలయును. మఱియు వత్సకాదిగణద్రవ్యములు లవణపంచకము వీనితోఁ పక్వముచేయఁబడిన తైలమును పానముచేయించవలయును. కఫహరములగు ధూమపాన వమనౌషధ నస్యగంఢూషధారణములను పలుమారు చేయుచుండవలయును.

### మేదోజగళగండచికిత్స.

మేదోభవే సిరాం విద్ధ్వైత్కఫఘ్నం చ విధిం భజేత్,
అసనాదిరజశ్చైనం ప్రాతర్మూత్రేణ పాయయేత్. ౭౨

మేదోజ గళగండరోగమునందు సిరను వేధించి కఫహారములగు చికిత్సలను చేయించవలయును. అసనాదిగణద్రవ్యచూర్ణములను గోమూత్రములో కలిపి ప్రాతఃకాలమునందు పానము చేయించవలయును.

అశాంతౌ పాటయిత్వా చ సర్వాన్ వ్రణవదాచరేత్,

పైచెప్పినప్రకారము చికిత్సచేసినను మేదోజ గళగండరోగము నివర్తింపకయుండిన దానిని శస్త్రముచే ఛేదించి వ్రణచికిత్సల నన్నిఁటిని చేయవలయును.

### ముఖపాకరోగచికిత్స

ముఖపాకేషు సక్షౌద్రాః ప్రయోజ్యా ముఖధావనాః. ౭౩
క్వథితాస్త్రిఫలాపాఠామృద్వీకాజాజిపల్లవాః,
నిష్ఠేవ్యా భక్షయిత్వా వా కుబేరాదిగణో ఽథవా, ౭౪

ముఖపాకరోగములయందు త్రిఫలములు, చిరుబొద్ది, ద్రాక్ష, జాజిచిగుళ్లు వీనిని ఉదకములో వైచి చక్కఁగ కాఁచి యాకషాయములో తేనెను చేర్చి దానిచే నోటిని కడగవలయును. లేక పైత్రిఫలాదులనుగాని కుబేరాదిగణద్రవ్యములనుగాని చక్కఁగ నమిలి యుమియవలయును.

### ముఖపాకమునందు ప్రతిసారణాదులు.

ముఖపాకేఽనిలాత్కృష్ణాపట్వేలాః ప్రతిసారణమ్,
తైలం వాతహరైస్సిద్ధం హితం కబళనస్యయోః. ౭౫

వాతమువలన జనించిన ముఖపాకరోగమునందు పిప్పళ్లు సైంధవలవణము, ఏలకలు వీనిని ప్రతిసారణమునం దుపయోగించవలయును. వాతహారద్రవ్యములతో పక్వము చేయఁబడిన తైలముచే కబళనస్యములను చేయించవలయును.

### పిత్తరక్తచికిత్స.

పిత్తాస్రే రక్తపిత్తఘ్నః కఫఘ్నశ్చ కఫే విధిః,

పిత్తరక్తమువలన జనించిన ముఖపాకమున రక్తపిత్తచికిత్సలను కఫమువలన కలిగిన ముఖపాకమున కఫహార చికిత్సలను చేయవలయును.

### పిత్తరక్తపిటకాచికిత్స.

లిఖేచ్ఛాకాదిపత్త్రైశ్చ పిటకాః కఠినా స్థిరాః. ౭౬

శేకాకు మున్నగువానిచే కఠినముగ స్థిరముగనుండు పిటకలను ఛేదించవలయును.

### సన్నిపాతముఖపాకచికిత్స.

యథా దోషోదయం కుర్యా త్సన్నిపాతే చికిత్సితమ్,

సన్నిపాతజ ముఖపాకరోగమునందు వాతాదిదోషప్రకోపా ద్యనుగుణముగ చికిత్సలను చేయవలయును.

### అర్బుదరోగచికిత్స.

నవేర్బుదేత్వసంవృద్ధే ఛేదితే ప్రతిసారణమ్. ౭౭

స్వర్జికానాగరక్షౌద్రైః క్వాథో గండూష ఇష్యతే,

గుడూచీనింబకల్కోత్థో మధుతైలసమన్వితః. ౭౮

యవాన్నభు క్తీక్ష్ణతైలనస్యాభ్యంగాం స్తథాచరేత్,

అర్బుదరోగము క్రొత్తదిగ వృద్ధిజెందనిదిగనుండిన దానిని శస్త్రముచే ఛేదించి స్వర్జక్షారము, శుంఠి వీనిచూర్ణములో తేనెనుకలిపి ప్రతిసారణము చేయించవలయును. తిప్పతీఁగె, వేపపట్ట వీనికషాయములో తేనెను నువ్వులనూనెను కలిపి గండూషమును చేయించవలయును. యవాన్నమును భుజింపఁజేయవలయును. తీక్ష్ణముగనుండు తైలముచే నస్యాభ్యంగములను చేయించవలయును.

### పూతివదనరోగచికిత్స.

వమితే పూతివదనే ధూమ స్తీక్ష్ణస్సనావనః. ౭౯

సమంగాధాతకీలోధ్రఫలినీపద్మకైర్జలమ్,

ధావనం వదనస్యాంతశ్చూర్ణైతైరవచూర్ణనమ్. ౮౦

శీతాదోపకుశోక్తంచ నావనాది చ శీలయేత్,

పూతిముఖమను రోగము కలవానికి వమనము చేయించి తీక్ష్ణముగనుండు ధూమపానమును నస్యమును చేయించవలయును. మంజిష్ఠ, ఆరెపువ్వు, లొద్దుగు, ప్రేంకణము, పద్మకము వీనికషాయముతో నోరును కడగవలయును. పైమంజిష్ఠాది ద్రవ్యములను చూర్ణముచేసి నోటియందు రుద్దవలయును. శీతాదము, ఉపకుశము అనురోగములకు చెప్పియుండు నస్య గండూషములనుగూడ చేయించవలయును.

### ముఖదోషహరత్రిఫలాదిగుటికలు.

ఫలత్రయద్వీపికిరాతతిక్తయష్ట్యాహ్వాసిద్ధార్థకటుత్రికాణి,
ముస్తాహరిద్రాద్వయయావశూకవృక్షామ్ల కామ్లా గ్రిమవేతసాశ్చ.
అశ్వత్థజంబ్వామ్రధనంజయత్వక్త్వక్చాహిమారాఖ్యఖదిరస్యసారః,
క్వాథేన తేషాం ఘనతాంగతేనతచ్చూర్ణయుక్తాగుటికావిధేయాః.
తా ధారితాఘ్నంతి ముఖేననిత్యం
కంఠౌష్ఠతాల్వాదిగదాన్ సుకృచ్ఛ్రాన్,
విశేషతో రోహిణికాస్య శోష
గంధాన్ విదేహాధిపతిప్రణీతాః. ౮౩

త్రిఫలములు, చిత్రమూలము, నేలవేము, అతిమధురము, తెల్లావాలు, త్రికటుకములు, తుంగముస్తలు, పసుపు, మ్రానిపసుపు, యవక్షారము, చింతపండు, పుల్లప్రబ్బలి, ...విపట్ట, నేరేడుపట్ట, మామిడిపట్ట, మద్దిపట్ట, తుమ్మపట్ట, చంద్రబంక వీనిని ఉదకములో వైచి చక్కగ కషాయము కాచి గట్టిగనగునపుడు పై త్రిఫలములు మొదలగు వస్తువుల చూర్ణమునుచేర్చి గుటికలు చేయవలయును. ఆగుటికలను నోటిలో ధరించుటలజేసిన కంఠము, పెదవులు, లోదౌడ మొదలగు స్థలములలో జనించినవియు మిగుల దారుణముగ నుండునవియు నగు ముఖరోగము లన్నియు నశించును. విశేషముగ రోహిణి, ఆస్యశోషము, పూతిగంధము మొదలగు రోగములు హరించును. ఇవి నిమిక్రవర్తిచే నిర్మింపఁబడినవి.

### ఖదిరాదితైలము.

ఖదిరతులామంబుఘటే పక్త్వా తోయేన తేన పిష్టైశ్చ,
చందనజోంగకకుంకుమపరిపేలవబాలకోశీరైః. ౮౪
సురతరురోధ్రద్రాక్షామంజిష్ఠాచోచపద్మకవిడంగైః,
స్పృక్కానతనఖకట్ఫలసూక్ష్మైలాధ్యామకైస్సపత్రాంగైః. ౮౫
తైలప్రస్థం విపచేత్కర్షాంశైః పాననస్యగండూషైస్తత్,
హత్వాస్యే సర్వగదాన్ జనయతి గాఢం దృశం శ్రుతిం
చ వారాహీమ్. ౮౬. ఉద్వర్తితం చ ప్రపున్నాటరోధ్ర
దార్వీభిరభ్యక్తమనేన వక్త్రమ్, నిర్వ్యంగనీలీముఖదూషి
కాదిసంజాయతే చంద్రసమానకాంతి. ౮౭

నూరుపలముల చంద్రపట్టను ద్రోణప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగ కషాయము కాచి యాకషాయముతో చందనము, నల్లఅగరు, కుంకుమపువ్వు, తుంగ ముస్తలు, కురువేరు, వట్టివేరు, దేవదారుచెక్క, లొద్దుగు, ద్రాక్ష, మంజిష్ఠ, లవంగపట్ట, పద్మకము, వాయువిడంగములు, స్పృక్కయను గ్రంథ్యము, గ్రంథితగరము, నఖముచిప్ప, గుగ్గుడుచేక, పిన్నయేలకులు, ధ్యామకము, రక్తచందనము వీనిని కర్షప్రమాణము చొప్పున గ్రహించి నూరి కల్కముచేసి ఒకప్రస్థము నువ్వులనూనెలోకలిపి విధిప్రకారము పక్వము చేయవలయును. ఈతైలమును పాన నస్య గండూషములయందుపయోగించిన నది నోటిలోజనించురోగములన్నిటిని హరింపజేసి గద్దతో తుల్యమైన దృష్టిశక్తిని పందితో తుల్యమైన శ్రవణశక్తిని కలుగఁజేయును. మఱియు నీతైలముచే ముఖమున కభ్యంజనముచేయించి తగిరిశ, లొద్దుగు, మ్రానిపసుపు వీనిని నూరి నలుగుపెట్టిన ముఖమునందు మచ్చ, నీలి, ముఖదూషికా మొదలగు దోషములు నివర్తించి చంద్రునితో తుల్యమైన కాంతికలుగును.

### ముఖరోగమునకు సహచరఘృతము

పలశతం బాణాత్తోయఘటే పక్త్వా రసేఽస్మింశ్చ పలార్ధికైః,
ఖదిరజంబూయష్ట్యానంతామ్రరహిమారసీలోత్పలాన్వితైః. ౮౮
తైలప్రస్థం పాచయేచ్ఛ్లక్ష్ణపిష్టై రేభిర్ధార్యం ధారితం తన్ముఖేన,
రోగాన్ సర్వాన్ హంతి వక్త్రే విశేషాత్
స్థైర్యం ధత్తే దంతపఙ్క్తేశ్చలాయాః. ౮౯

ద్రోణప్రమాణ ముదకములో నూరుపలముల నల్లగోరింటనువైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో చండ్ర, నేరేడు, అతిమధురము, తిప్పతీఁగె, తుమ్మ, మామిడి, తీన్నిషట్టలు, నల్లకలువ ఈ యోషధులు దినుసుకు అరపలముచొప్పున గ్రహించి కల్కముచేసి పైకషాయములో కలిపి ఒకప్రస్థము నువ్వులనూనెబోసి తైలపాకవిధిగ పక్వముచేసి నోటిలో ధరించిన నోటియందు జనించు రోగములన్నియు నివర్తించును. చలించుచుండు దంతములకు విశేషముగ బలముకలుగును.

### ముఖరోగమునకు ఖదిరసారాదిగుటికలు.

ఖదిరసారాద్వేతులే పచేద్వల్కాత్తులాం చారిమేదసః,
ఘటచతుష్కేపాదశేషే ఽస్మిన్ పూతేపునః క్వాథనాద్ఘనే. ౯౦
ఆక్షికం క్షిపేత్సుసూక్ష్మం రజః సేవ్యాంబుపత్తంగగైరికమ్,

చందనద్వయరోధ్రపుండ్రాహ్వాయష్ట్యాహ్వాలాక్షాంజనద్వయమ్.
ధాతకీకట్ఫలద్వినిశాత్రిఫలాచతుర్జాతజోంగకమ్,
ముస్తమంజిష్ఠాన్యగ్రోధప్రరోహామాంసీయ వాసకమ్. ౯౨
పద్మకై లేయసమంగాశ్చ శీతే తస్మిం స్తథా పాలికాం పృథక్,
జాతీపత్త్రికాం సజాతీఫలాం సహలవంగకంకోల్లకామ్. ౯౩
స్ఫటికశుభ్రసురభికర్పూరకుడవం చ తత్రావపేత్తతః,
కారయేద్గుటికాస్సదా చైతా ధార్యా ముఖే తద్గదాపహాః. ౯౪

నాల్గుద్రోణము లుదకములో ఖదిరసారము (కాచు) రెండునూర్లు పలములు నల్లతుమ్మపట్ట నూరుపలములు వైచి పాదావశేషముగ కషాయము కాచి వడియగట్టి మరల నాకషాయమును పొయిమీఁదబెట్టి కాచి చిక్కగయైనపిదప అందులో వట్టివేరు, సరువేరు, రక్తచందనము, గైరికము, చందనము, పీతచందనము, లొద్దుగు, ప్రపౌండరీకము, అతిమధురము, లత్తుక, రసాంజనము, సౌవీరాంజనము, ఆరెపువ్వు, పేము, పసుపు, మ్రానిపసుపు, త్రిఫలములు, చతుర్జాతకములు, నల్లఅగరు, తుంగముస్తలు,మంజిష్ఠ, మఱ్ఱియూడలు, జటామాంసి, రేగటిదూలగోవిల, పద్మకము, ఏలకులు, చిట్టాముట్టి వీనిని వేనుకకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి చూర్ణముచేసి కలిపి చల్లారినపిదప దానిలో జాపత్రి, జాజికాయ, లవంగములు, తక్కోలములు యివి ఒక్కొక్క పలమును స్ఫటికమువలె తెల్లనైన పచ్చకర్పూరము ఒకకుడవముచేర్చి గుటికలుచేసి నోటియందెల్లపుడు ధరించుచుండిన ముఖరోగములన్నియు నివర్తించును.



## అరిమేదోఘృతము.

క్వాథౌషధవ్యత్యయయోజనేన
తైలం పచేత్కల్పనయా ఽనయైవ,
సర్వాస్యరోగోద్ధృతయే తదాహు
ర్దంతస్థిరత్వే త్విదమేవముఖ్యమ్. ౯౫

నాల్గుద్రోణ ముదకములో నల్లతుమ్మపట్ట రెండునందలపలములు కాచు నూరుపలములు వీనినివైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో పూర్వయోగములో చెప్పియుండు వట్టివేరు మొదలగు ద్రవ్యముల కల్కమునుచేర్చి నువ్వులనూనెను బోసి విధిప్రకారము పక్వముచేసి యాతైలమును నోటిలో ధరింపవలయును. ఈతైలము నోటిలోజనించు రోగములన్నింటిని పోఁగొట్టుటయందును దంతములకు స్థైర్యమును గలుగజేయుటయందును ముఖ్యమైనదని ఋషులు వచింపుచున్నారు.

### ఖదిరగుటికాదిఫలము.

ఖదిరేణైతా గుటికా స్తైలమిదం చారిమేదసా ప్రథితమ్,
అనుశీలయన్ ప్రతిదినం *స్వస్థోపి దృఢద్విజో భవతి. ౯౬

పూర్వశ్లోకములో చెప్పినచొప్పున చంద్రగుటికలు నల్లతుమ్మతైలము వీనిని ప్రతిదినము స్వస్థశరీరులుకూడ సేవించిన విశేషముగ దంతములకు దృఢత్వము కలుగును.

### ముఖరోగహారకకబళధారణము.

క్షుద్రాగుడూచీ సుమనఃప్రవాళ
దార్వీయవాస త్రిఫలాకషాయః,
క్షౌద్రేణ యుక్తః కబళగ్రహోఽయం
సర్వామయాన్ వక్త్రగతాన్నిహంతి. ౯౭

వాకుడు, తిప్పతీఁగె, జాజి వీనిచిగుళ్లు, మ్రానిపసుపు, రేగటిదూల, గోవిల, త్రిఫలములు వీనిని సమభాగములుగ గ్రహించి కాచినకషాయములో తేనెను కలిపి కబళము చేయించిన నోటిరోగములన్నియు నివర్తించును.

### దంతశూలాదిహరపాఠాదిచూర్ణము.

పాఠాదార్వీత్వక్కుష్ఠముస్తాసమంగా
తిక్తాపీతాంగారోధ్రతేజోవతీనాం,
చూర్ణస్సక్షౌద్రో దంతమాంసార్తి
కండూపాకస్రావాణాం నాశనో ఘర్షణేన. ౯౮

చిరుబొద్ది, మ్రానిపసుపు, లవంగపట్ట, చెంగల్వకోష్టు, తుంగముస్తలు, మంజిష్ఠ, కటుకరోహిణి, పీతాంగా (అనఁగా ప్రేంకణము), లొద్దుగు, జ్యోతిష్మతి ఈయోషధులను చక్కఁగ చూర్ణముచేసి ఆచూర్ణమున తేనెను కలిపి దంతములను తోముకొనిన దంతమాంసములయందలి నొప్పి, దురద, పాకము, స్రావము హరించును.

### ముఖరోగాదులకు కాలకచూర్ణము.

గృహధూమతార్క్ష్యపాఠావ్యోషక్షారాగ్న్యయోవరాతేజోహ్వాః,
ముఖదంతగళవికారే సక్షౌద్రః కాలకోవిధార్యశ్చూర్ణః. ౯౯

కరిధూపము, రసాంజనము, చిరుబొద్ది, త్రికటుకములు, సర్జక్షారము, చిత్రమూలము, ఉక్కు, త్రిఫలములు, జ్యోతిష్మతి వీనిని సమభాగములుగ గ్రహించి చక్కఁగ

* వృద్ధోపి.

చూర్ణముచేసిన యది కాలకచూర్ణ మనఁబడును. దీనిని తేనెతో కలిపి ముఖరోగము, దంతరోగము, కంఠరోగము వీనియందు నోటిలో ధరింపవలయును.

### దంతాదిరోగములకు పీతకచూర్ణము.

దార్వీత్వక్సింధూద్భవమనశ్శిలాయావశూకహరితాలైః,
ధార్యః పీతకచూర్ణో దంతాస్యగళామయే సమధ్వాజ్యః. ౧౦౦

మ్రానిపసుపు, లవంగపట్ట, సైంధవలవణము, మణిశిల, యవక్షారము, హరిదళము వీనిని సమభాగములుగ గ్రహించి చక్కఁగ చూర్ణము చేసిన నది పీతకచూర్ణ మనఁబడును. దీనిని తేనె, నెయ్యి వీనితోడఁగూర్చి నోటిలోధరించిన ముఖరోగము, కంఠరోగము హరించును.

### కంఠరోగహరగుటికలు.

ద్విక్షారధూమవరాపంచపటువ్యోషవేల్లగిరితార్క్ష్యైః,
గోమూత్రేణ విపక్వా గళామయఘ్నీ రసక్రిగుటికా. ౧౦౧

సర్జక్షారము,యవక్షారము,కరిదూపము, పంచలవణములు, త్రికటుకములు, వాయువిడంగములు, శిలాజతు, రసాంజనము వీనిని గోమూత్రములో వైచి పక్వముచేసి గుటికలుచేసి సేవించిన కంఠరోగము హరించును.

### ముఖరోగహరహరీతకీ.

గోమూత్రక్వథనవిలీలవిగ్రహాణాం
పథ్యానాం జలమిసికుష్ఠభావితానామ్,
అత్తారం నరమణవోపి వక్త్రరోగాః
శ్రోతారం నృపమివ న స్పృశం త్యనర్థాః. ౧౦౨

కషాయమువలె చక్కఁగ కాచఁబడిన గోమూత్రములో కరక్కాయను నానబెట్టి పిదప నాకరక్కాయను కురువేరు, సదాప, చంగల్వకోష్టు వీనికషాయములలో భావనచేసి భుజించువానికి "మంత్రి చెప్పిన హితోక్తులను ఆకర్ణించు భూమీశునికి నాపదలు కలుగకుండు నట్లు" నోటిలో రోగములు కలుగకుండును.

### ముఖపాకహరకషాయము.

సప్తచ్ఛదోశీర పటోలముస్త
హరీతకీతిక్తకరోహిణీభిః,
యష్ట్యాహ్వరాజద్రుమచందనైశ్చ
క్వాథం పిబేత్పాకహరంముఖస్య. ౧౦౩

శ్రీ ర స్తు.

# త్రయోవింశాధ్యాయము.

అవ. ముఖరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము శిరోరోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## శిరోరోగ విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

సూ. అథాత శ్శిరోరోగవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ముఖరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము శిరమునందు జనించురోగములను తెలియపఱచునట్టి శిరోరోగవిజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

### శిరోరోగకారణము.

ధూమాతపతుషారాంబుక్రీడాతిస్వప్నజాగరైః,
ఉత్స్వేదాధిపురోవాతబాష్పనిగ్రహరోదనైః. ౧
అత్యంబుమద్యపానేన క్రిమిభి ర్వేగధారణైః,
ఉపధానమృజాభ్యంగ ద్వేషాధః ప్రతతేక్షణైః. ౨
అసాత్మ్యగంధదుష్టామభాష్యాద్యై శ్చ శిరోగతాః,
జనయంత్యామయాన్ దోషాః-

పొగ, ఎండ, మంచు వీనియందుండుట, ఉదకమున విశేషముగ విహరించుట, అధికముగ నిద్రించుట, విశేషముగ రాత్రులయందు నిదుర మేలుకొనియుండుట, దేహమందలి చెమటను విశేషముగతీయుట, తూర్పుగాలియందు సంచరించుట, శోకము నడ్డగించుట, విశేషముగ నేడ్చుట, ఉదకమునుగాని మద్యమునుగాని పరిమితికి మించిత్రాగుట, శిరమున క్రిములుజనించుట, మలమూత్రాదివేగముల నడ్డగించుట, తలగడలేక పరుండుట, శరీరమునందు మురికిని తోమికొనకయుండుట, అభ్యంజనమును చేయించుకొనకయుండుట, అతిసూక్ష్మమును లేక అధికప్రకాశము నైన వస్తువులను విశేషముగ చూచుట, అసాత్మ్యముగ నుండుగంధముల నాఘ్రాణించుట, జీర్ణము కాకుండుట, బిగ్గరగ మాటలాడుట, ఇవి మున్నగు కారణములచే శిరము నాశ్రయించియుండు

వాతాదిదోషములు ప్రకోపమునుజెంది శిరమునందు దారుణమైన రోగములను కలుగఁ జేయును.

## వాతజశిరోభితాపలక్షణము.

తత్ర మారుతకోపతః. ౩

నిస్తుద్యేతేభృశం శంఖౌ ఘాటా సంభిద్యతే తథా,
భ్రువోర్మధ్యం లలాటంచ పతతీవాతివేదనమ్. ౪
బాధ్యేతే స్వనతఃశ్రోత్రేనిష్కృష్యేత ఇవాక్షిణీ,
ఘూర్ణతీవ శిరస్సర్వం సంధిభ్య ఇవ ముచ్యతే. ౫
స్ఫురత్యతిసిరాజాలం కందరాహనుసంగ్రహః,
ప్రకాశాసహతా ఘ్రాణస్రావోఽకస్మాద్వ్యథాశమౌ. ౬
మార్దవం మర్దనస్నేహస్వేదబంధైశ్చ జాయతే,
శిరస్తాపోయమ్-

వాతప్రకోపమువలన కణతలలో పొడుచునట్లు మిక్కిలి యుపద్రవము కలు
ను. మెడచీలువఁబడునటులుండును. కనుబొమల మధ్యప్రదేశము, నుదురు యివి పడి
వునటుల మిక్కిలి శూలతో గూడియుండును. బిగ్గరైనమాటలు ఘోషము వీనిని
నుటవలన చెవులయందు బాధకలుగును. నేత్రములు పెఁకఁబడినటుల విశేషముగ నొ
తో గూడియుండును. శిరము తిరుగునటులను సంధులయందుండి పడిపోవునటుల నుం
ను. శిరమునందలి నరములు విశేషముగ నదురుచుండును. గొంతు దవుడలు యీడ్చి
నినట్లుండును. వెలుతురుచూచిన బాధకలుగును. ముక్కులోనుండి నీరు కారుచుండు
. అకస్మాత్తుగ శిరమునందు శూలలు జనించి స్వయముగనే శమించును. శిరమును
ర్దించుటవలనను ఘృతాదిస్నేహములను లేపనము చేసికొనుటవలనను స్వేదకర్మను
యించుకొనుటవలన వస్త్రాగులచే గట్టిగ శిరమును కట్టికొనుటవలనను నొప్పి కొంచెము
మంచును. ఇది శిరస్తాపమని చెప్పఁబడును.

## అర్ధావభేదకశిరోరోగలక్షణము.

అర్ధేతు మూర్ధ్నస్సోఽర్ధావభేదకః. ౭

పక్షాత్కుప్యతి మాసాద్వా స్వయమేవ చ శామ్యతి,
అతివృద్ధస్తు నయనం శ్రవణం వా వినాశయేత్. ౮

పైచెప్పియుండు వాతజశిరోరోగము శిరమునం దొకపార్శ్వమునందు మాత్రము
ంచియుండిన నది అర్ధావభేదక మనఁబడును ఇది పదునైదు దినముల కొకపర్యాయ

ముగాని మాసమున కొకపర్యాయముగాని విశేషముగ ప్రకోపించి స్వయముగనే శమిం చును. ఈ అర్ధావభేదకము మిక్కుటముగ వృద్ధిజెందినచో నేత్రములనుగాని చెవులనుగాని నశింపఁజేయును.

పిత్తజశిరోభితాపలక్షణము.

శిరోఽభితాపే పిత్తోత్థే శిరోధూమాయనం జ్వరః,
స్వేదోఽక్షిదహనం మూర్ఛా నిశి శీతైశ్చ మార్దవమ్. ౯

పిత్తప్రకోపమువలన జనించిన శిరోరోగమున శిరమునందు పొగ వెడలునటుల ఉండును. మఱియు జ్వరము, చెమట, కంటియందు మంట, మూర్ఛ, రాత్రులయందు శీతవస్తువులసేవనచేతను నుపద్రవములు కొంచెము శమించియుండుట యిట్టిలక్షణము కలిగియుండును.

కఫజశిరోభితాపలక్షణము.

అరుచిః కఫజే మూర్ధ్నో గురుస్తిమితశీతతా,
సిరానిష్పందతాలస్యం రుఙ్మందాహ్న్యధికా నిశి. ౧
తంద్రాశూనాక్షికూటత్వం కర్ణకండూయనే వమిః,

కఫప్రకోపమువలన జనించిన శిరోరోగమునందు అరుచి, శిరము బరువుగ స్త ముగ చల్లగనుండుట, సిరలు చలించకయుండుట ఆలస్యము మధ్యాహ్నమున స్వల్పముగను రాత్రులయం దధికముగ శిరమునందు నొప్పికలుగుట తంద్ర కంటిఱెప్ప లుబ్బియుండుట చెవులయందు దురద, వాంతి ఇవి కలుగును.

రక్తజశిరోభితాపలక్షణము.

రక్తాత్పిత్తాధికరుజః-

దుష్టరక్తమువలన జనించి శిరోరోగమునందు పిత్తజశిరోరోగమునకు జెప్పియుండు లక్షణములు కలిగియుండుటయేగాక అధికముగ నుపద్రవములును కల్గును.

సన్నిపాతజశిరోభితాపలక్షణము.

సర్వైస్స్యాత్సర్వలక్షణః. ౧

సన్నిపాతమువలన జనించిన శిరోరోగమునందు వాతజాది శిరోరోగ లక్షణములన్నియుఁ బుట్టును.

### క్రిమిజశిరోభితాపలక్షణము.

సంకీర్ణై ర్భోజనై ర్మూర్ధ్ని క్లేదితే రుధిరామిషే,
కోపితే సన్నిపాతే చ జాయంతే మూర్ధ్ని జంతవః. ౧౨
శిరస స్తే పిబంతోఽస్రం ఘోరాః కుర్వంతి వేదనాః,
చిత్తవిభ్రంశజననీర్జ్వరః కాసో బలక్షయః. ౧౩
రౌక్ష్యశోఫే వ్యధచ్ఛేదదాహస్ఫుటనపూతితాః,
కపాలే తాలుశిరసోః కండూశ్శోషప్రమీలకః. ౧౪
తామ్రాచ్ఛసింఘాణకతా కర్ణనాదశ్చ జంతుజే,

సంకీర్ణాహారములచేత శిరమునందలి రక్తమాంసములు దుష్టంబులై సన్నిపాతదోషము ప్రకోపించుటవలన శిరమునందు క్రిములుజనించును. ఆ క్రిములు శిరమునందలి రక్తమును పుండునుచేయుచు, దారుణమును మనస్సునకు మోహమును కలుగఁజేయునదియునైన యుపద్రవములను కలుగఁజేయును. ఇది జంతుజశిరోరోగమనఁబడును. మఱియు ఃరోగమునందు జ్వరము,కాసము, బలక్షయము, రూక్షత, వాపు, శిరమునందు కొట్టఁబడినటులను ఛేదింపఁబడినటులను నొప్పి, దుర్గంధము, సర్వాంగతాపము, కపాలము, లోౌడ, శిరము వీనియందు దురద, శోష, తంద్ర, ఎఱ్ఱగ, తేటగ, చీమిడికారుట, చెవులయందు ధ్వని ఇవి జనించియుండును.

### శిరఃకంపరోగలక్షణము.

వాతోల్బణాశ్శిరఃకంపం తత్సంజ్ఞం కుర్వతే మలాః. ౧౫

వాతాధిక్యముతో గూడియుండుదోషములు శిరమునందు వణఁకును కలుగఁజేయును. దీనిని శిరఃకంపరోగమనియెదరు.

### శంఖకశిరోరోగలక్షణము.

పిత్తప్రధానై ర్వాతాద్యైశ్శంఖే శోఫస్సశోణితైః,
తీవ్రదాహరుజారాగప్రలాపజ్వరతృడ్భ్రమాః. ౧౬
తిక్తాస్యః పీతవదనః క్షిప్రకారీ స శంఖకః,
త్రిరాత్రాజ్జీవితం హంతి సిధ్యత్యప్యాశు సాధితః. ౧౭

పిత్తాధిక్యముతోగూడియుండు వాతాదిదోషములు రక్తముతోఁగూడి కణతలయందు వాపు, సర్వాంగతాపము, నొప్పి, యెఱుపునర్ణము, కలవరింతలు, జ్వరము,

దప్పి, భ్రమము, నోరుచేదుగనుండుట, ముఖము పసుపుబారియుండుట, ఇట్టి యుపద్రవములను కలుగఁజేయును. ఇది శంఖకమనఁబడును. దీనికి చికిత్సజేయకుండినమూఁడుదినములలో రోగినిజంపును. శీఘ్రముగ చికిత్సజేసిన నొకానొకప్పుడు రోగి జీవించినను జీవించును.

### సూర్యావర్తశిరోరోగలక్షణము.

పిత్తానుబద్ధశ్శంఖాక్షిభ్రూలలాటేషు మారుతః,
రుజం సస్పందనాం కుర్యాదనుసూర్యోదయోదయామ్. ౧౮
ఆమధ్యాహ్నం వివర్ధిష్ణుః క్షుద్వతస్సా విశేషతః,
అవ్యవస్థితశీతోష్ణసుఖా శామ్యత్యతః పరమ్. ౧౯
సూర్యావర్తస్స ఇత్యుక్తా దశ రోగాశ్శిరోగతాః,

వాతము పిత్తముతోఁగూడి కణతలు, నేత్రములు, కనుబొమలు, నుదురు వీనియందు మిక్కిలి శూలనుకలుగఁజేయును. ఆశూల సూర్యోదయమునజనించి మధ్యాహ్నమువఱకు క్రమముగవృద్ధిజెంది ఆకలితోఁగూడియుండునప్పుడు మఱియు విశేషముగ వృద్ధిజెంది పిదప స్వయముగనే శమించును. ఇది సూర్యావర్తమనఁబడును. ఈరోగమునందు ఒకప్పుడు శీతోపచారముచేతను, ఒకప్పుడు ఉష్ణోపచారముచేతను ఇంచుక సుఖము వ్యవస్థలేకకలుగును. ఇటుల శిరము నాశ్రయించి జనించు పదిరోగములు చెప్పఁబడినవి.

### కపాలరోగములు.

శిరస్యేవం చ వక్ష్యంతే కపాలే వ్యాధయో నవ. ౨౦

శిరమునందలి కపాలమునజనించు తొంబదిరోగములిఁక జెప్పఁబడును.

### ఉపశీర్షకరోగలక్షణము.

కపాలే పవనే దుష్టే గర్భస్థస్యాపి జాయతే,
సవర్ణో నీరుజశ్శోఫస్తం విద్యాదుపశీర్షకమ్. ౨౧

శిరఃకపాలమునందలి వాతము దుష్టంబైయుండినచో నొప్పిలేనిదియు శరీరముతో సమానవర్ణముగలదియునగు వాపు కపాలమునందు జనించును. ఇది ఉపశీర్షకరోగమని తెలిసికొనవలయును. ఈరోగము గర్భమునుండుశిశువునకును ఒకసమయమున సంభవించును.

### కపాలపిటకార్బుదరోగలక్షణము.

యథా దోషోదయం బ్రూయాత్పిటకార్బుదవిద్రధీన్,

కపాలమునందు పిటకలు, అర్బుదము, విద్రధి అనురోగములు జనించును. అవి వాతాదులలో నేదోషమువలన జనించునో ఆదోషలక్షణములు వానికి కలిగియుండునని తెలిసికొనవలయును.

అరూంషికారోగలక్షణము.

కపాలే క్లేదబహులాః పిత్తాసృక్శ్లేష్మజంతుభిః. ౨౧
కంగుసిద్ధార్థకనిభాః పిటికాస్స్యురరూంషికాః.

పిత్తరక్తము, శ్లేష్మము, క్రిములు వీనిచే కపాలమునందు కొఱ్ఱలు, తెల్లావాలు వీనికి సమానాకారములు గలవిగ విశేషస్రావము కలవిగనుండు పిటకలు జనించును. ఇవి అరూంషిక యనఁబడును.

దారుణకరోగలక్షణము.

కండూకేశచ్యుతిస్వాపరౌక్ష్యకృత్స్ఫుటనం త్వచః, ౨౩
సుసూక్ష్మం కఫవాతాభ్యాం వింద్యాద్దారుణకం తు తత్,

దురద, వెండ్రుకలూడుట, స్పర్శజ్ఞానము లేకుండుట, రూక్షత వీనిని కలుగఁజేయునదియు మిక్కిలి సూక్ష్మముగ నుండునదియునైన చర్మస్ఫుటనము (అనఁగా చర్మపు పగుళ్లు) కపాలమునందు కఫవాతము వలన జనించును. ఇది దారుణకరోగమనఁబడును.

ఇంద్రలుప్తరోగలక్షణము.

రోమకూపానుగం పిత్తం వాతేన సహమూర్ఛితమ్. ౨౪
ప్రచ్యావయతి రోమాణి తతశ్శ్లేష్మా సశోణితః,
రోమకూపాన్ రుణద్ధ్యస్య తేనాన్యేషామసంభవః. ౨౫
తదింద్రలుప్తం రూఢ్యాం చ ప్రాహుశ్చాచేతి చాపరే,

పిత్తము వాతముతోఁగూడి వృద్ధిజెంది రోమకూపములను జేరి రోమముల నూడునటుల జేయును. పిదప శ్లేష్మము రక్తముతో గూడి వృద్ధిజెందినదై రోమకూపముల నడ్డగించును. ఈకారణము చేత మరల వెండ్రుకలు మొలవకుండును. దీనిని ఇంద్రలుప్తరోగ మనియెదరు.—ఇతరాచార్యు లీరోగమును రూఢివాచకముగ చాచ యని చెప్పెదరు.

ఖలతిరోగలక్షణము.

ఖలతేరపి జన్మైవం సదనం తత్ర తు క్రమాత్. ౨౬

ఇంద్రలుప్తరోగము జనించునటులనే ఖలతిరోగము (అనఁగా బట్టతల) కలుగును. అయితే ఇంద్రలుప్త రోగమునందు వెండ్రుకలన్నియు నేకకాలమున నూడిపోవును. ఖలతిరోగమునందు వెండ్రుకలు క్రమక్రమముగ నూడిపోవును.

## వాతాదిఖలతిరోగలక్షణము.

సా వాతాదగ్నిదగ్ధాభా పిత్తా *త్స్విన్నసిరావృతా,
కఫాద్ఘనత్వగ్వర్ణాంశ్చ యథాస్వం నిర్దిశేత్త్వచి. ౨౭
దోషైస్సర్వాకృతిస్సర్వైరసాధ్యా సా నఖప్రభా,
దగ్ధాగ్నినేవ నిర్లోమా సదాహా యా చ జాయతే. ౨౮

వాతమువలన జనించిన ఖలతిరోగము నిప్పుచే కాల్పఁబడినటులను వాతమునకు చెప్పియుండు వర్ణముతో గూడినదిగను నుండును. పిత్తమువలన జనించిన ఖలతిరోగము సన్ననిసిరలతో వ్యాప్తంబుగ పిత్తవర్ణము గలదిగ నుండును. కఫమువలన జనించిన ఖలతిరోగము చర్మము గట్టిగ నుండునదిగ కఫవర్ణము గలదిగ నుండును. సన్నిపాతమువలన జనించిన ఖలతిరోగమునందు వాతజాది ఖలతిరోగ లక్షణము లన్నియు కలిగి యుండును. నఖముతో తుల్యమైన కాంతికలదిగ నుండును. ఇదిఅసాధ్యము నిప్పుచే కాల్పఁబడి నటులను రోమ రహితముగను మంటతో గూడినదిగ నుండు ఖలతిరోగము అసాధ్యము.

## పలితరోగలక్షణము.

శోకశ్రమక్రోధకృతశ్శరీరోష్మా శిరోగతః,
కేశాన్ సదోషః పచతి పలితం సంభవత్యతః. ౨౯

శోకము ఆయాసము కోపము వీనివలన కలిగిన శరీరమునందలి యుష్ణము శిరమును జేరి వాతాదిదోషములతోఁ గూడి తలవెండ్రుకలను పాకము జేయును. దానివలన తలవెండ్రుకలు తెల్లగ నగును. ఇది పలితమని చెప్పఁబడును.

## వాతాదిపలితరోగలక్షణము.

తద్వాతాత్స్ఫుటితం శ్యావం ఖరం రూక్షం బలప్రభమ్,
పిత్తాత్సదాహం పీతాభం కఫాత్స్నిగ్ధం వివృద్ధిమత్. ౩౦
స్థూలం సశుక్లం సర్వైస్తు విద్యాద్వ్యామిశ్రలక్షణమ్,

* త్స్విత.

వాతమువలన జనించిన పలితరోగమునందు వెండ్రుకలు పగిలినవిగ శ్యామవర్ణము కలవిగ కఠినముగ రూక్షగ ఉదకముతో తుల్యమైన కాంతి కలవిగ నుండును. పిత్తమువలన జనించిన పలితరోగమునందు వెండ్రుకలు పసుపువర్ణము కలవిగ మంటతో గూడినవిగ నుండును. కఫజ పలితరోగమునందు వెండ్రుకలు స్నిగ్ధముగ వృద్ధిజెందునవిగ లావుగ మిక్కిలి తెల్లగనుండును. సన్నిపాతజపలితమునందు వాతజ పలితాదిరోగ లక్షణము లన్నియు నుండును.

### శిరశ్శూలజపలితలక్షణము.

శిరోరుజోద్భవం చాన్యద్వివర్ణం స్పర్శనాసహమ్. ౩౧

పలితరోగము శిరశ్శూలవలన జనించును. ఇది వికారవర్ణము కలదిగ తాఁకినచో నొప్పిని కలుగఁజేయునదిగ నుండును.

### అసాధ్యశిరోరోగలక్షణము.

అసాధ్యా సన్నిపాతేన ఖలతిః పలితాని చ,

సన్నిపాతమువలన జనించిన ఖలతిరోగ పలితరోగములు అసాధ్యములు.

శరీరపరిణామోత్థాన్యపేక్షంతే రసాయనమ్. ౩౨

మనుజునికి ముసలితనమున పలితరోగము జనించినచో వానికి రసాయనము నిప్పించవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదిమూఁడవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# చతుర్వింశాధ్యాయము.

శిరోరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము శిరోరోగ చికిత్సల దెలుపు శిరోరోగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## శిరోరోగ ప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతశ్శిరోరోగ ప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

శిరోరోగ విజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము శిరోరోగ చికిత్సలను తెలియఁబఱచునట్టి శిరోరోగ ప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### వాతజశిరోభితాపచికిత్స

శిరోఽభితాపేఽనిలజే వాతవ్యాధివిధిం చరేత్,
ఘృతాభ్యక్తశిరా రాత్రౌ పిబేదుష్ణపయోనుపః. ౧
మాషాన్ముద్గాన్ కుళుత్థాన్వా తద్వత్ఖాదేద్ఘృతాన్వితాన్,
తైలం తిలానాం కల్కం వా క్షీరేణ సహపాయయేత్. ౨
పిండోపనాహస్వేదాశ్చ మాంసధాన్యకృతాహితాః,
వాతఘ్నదశమూలాదిసిద్ధక్షీరేణ సేచనమ్. ౩
స్నిగ్ధం నస్యం తథా ధూమశ్శిరశ్శ్రవణతర్పణమ్,

వాతమువలన జనించిన శిరోరోగము కలవానికి వాతవ్యాధులకుఁజెప్పిన చికిత్సలను చేయుటయేగాక ఘృతముచే శిరమున కభ్యంజనము చేయించి రాత్రులయందు ఘృతమును కొంచెము వేడిగనుండు ఆవుపాలను పానము చేయించవలయును. మఱియు ఉద్దులనుగాని, పెసలనుగాని, ఉలవలనుగాని పాకముచేసి వానిని ఘృతములోచేర్చి భక్షింపఁజేసి ఆవుపాలను సుఖోష్ణముగ పానము చేయించవలయును. నువ్వుల నూనెనుగాని, తెలికపిండినిగాని ఆవుపాలతోడ పానము చేయించవలయును. మాంసము ధాన్యములు వీనితో బక్వము చేయఁబడిన పిండస్వేదమును ఉపనాహస్వేదమును చేయించవలెను. వాతహరములగు దశమూలాది ద్రవ్యములతో కాచఁబడిన ఆవుపాలచే సేచ

నముచేయుట హితకరము. స్నిగ్ధముగనుండు నస్యము, ధూపము, హితము శిరస్సును చెవులనుకు తర్పణచికిత్స చేయించవలయును.

— వాతజశిరోభితాపమునకు నస్యము. —

వరణాదౌ గణే క్షుణ్ణే క్షీరమర్ధోదకం పచేత్. ౪
క్షీరావశిష్టం తచ్ఛీతం మథిత్వా సారమాహరేత్,
తతో మధురకైస్సిద్ధం నస్యం తత్పూజితం హవిః. ౫
వర్గేఽత్ర పక్వం క్షీరే చ పేయం సర్పిస్సశర్కరమ్,

వరణాదిగణద్రవ్యములను సమభాగములుగ గ్రహించి నలియఁగొట్టి ఆవుపాలలో చేర్చి పాలకు సగము నీళ్లుబోసి పాలుమాత్రము మిగులునటుల కాఁచి యది చల్లారిన పిదప చిలికి వెన్నతీసి కాఁచి దానిలో మధురద్రవ్యములనుచేర్చి పక్వముచేసి యాఘృతముచే వాతజశిరోరోగముకలవానికి నస్యము చేయించవలయును. ఇది మిగుల శ్రేష్ఠమైన నస్యము. మఱియు వరణాదిగణద్రవ్యములతో కాఁచఁబడిన యావుపాలలో నేతినితీసి దానిలో శర్కరనుకలిపి పానముచేయించవలయును.

— ఊర్ధ్వగరోగహరనస్యము. —

కార్పాసమజ్జాత్వఙ్మస్తాసుమనఃకోరకాణి చ. ౬
నస్యముష్ణాంబుపిష్టాని సర్వమూర్ధ్వరుజాపహమ్,

పత్తివిత్తులపప్పు, లవంగపట్ట, తుంగముస్తలు, జాజిమొగ్గలు వీని నుష్ణోదకముతో నూరి నస్యముచేయించిన మెడకొంకులకు పైభాగమున జనించునొప్పి శమించును.

— పిత్తరక్తజశిరోభితాపచికిత్స. —

శర్కరాకుంకుమశృతం ఘృతం పిత్తాసృగన్వయే. ౭
ప్రలేపస్సఘృతైః కుష్ఠకుటిలోత్పలచందనైః,
వాతోద్రేకభయాద్రక్తం న చాస్మిన్నవసేచయేత్. ౮
ఇత్యశాంతౌ చలే దాహః కఫే చోష్ణం యథోదితమ్,

పిత్తరక్తజనితశిరోరోగమునకు పంచదార, కుంకుమపువ్వు వీనినిచేర్చి కాఁచఁబడిన ఘృతమును పానముచేయించవలయును. చెంగల్వకోష్టు, గ్రంథితగరము, నల్లకలువ, చందనము వీనిని నూరి నేతిలోకలిపి పట్టువేయవలయును. ఈరోగమునందు రక్తమోక్షణము చేయించిన వాతము ప్రకోపించును. గావున రక్తమోక్షణము చేయుంజనదు. పై చెప్పినప్రకారము చికిత్సఁజేసినను వాతము శమింపకుండిన దాహకర్మను కఫము, శమింపకుండిన నుష్ణమైన చికిత్సలను చేయవలయును.

## అర్ధావభేదకరోగచికిత్స.

అర్ధావభేదకేఽప్యేషా యథా దోషాన్వయాత్ క్రియా. ౬

అర్ధావభేదకమను శిరోరోగము కలవానికి పైచెప్పిన చికిత్సలను ఆయా దోషా: నుగుణముగ చేయవలయును

## అర్ధావభేదకరోగమున నస్యాదులు

శిరీషబీజాపామార్గమూలం నస్యం బిడాన్వితమ్,
స్థిరారసో వా లేపే తు ప్రపున్నాటోఽమ్లకల్కితః. ౧౦

అర్ధావభేదకరోగమునందు దిరిసెనపువిత్తులు ఉత్తరేణువేళ్లు వీనిని నూరి బిడలవణములుచేర్చి నస్యము చేయించవలయును; లేక ముయ్యాకుపొన్నకషాయముతో నస్యము చేయించవలయును. తగిరిసవిత్తులను పులికడుగుతో నూరి పట్టువేయవలయును.

## సూర్యావర్తరోగచికిత్స.

సూర్యావర్తే తు తస్మింస్తు సిరయాఽపహరేదసృక్,

సూర్యావర్తరోగమునందు పైచికిత్సలను చేయుటయేగాక సిరలను వేధించి రక్తము తీయవలయును.

## పిత్తజశిరోభితాపచికిత్స.

శిరోభితాపే పిత్తోత్థే స్నిగ్ధస్య వ్యధయేత్సిరామ్. ౧౧
శీతా శ్శిరోముఖాలేపసేకశోధనవస్తయః,
జీవనీయశ్శృతే క్షీరసర్పిషీ పాననస్యయోః. ౧౨

పిత్తమువలన జనించిన శిరోరోగమునందు స్నేహకర్మనుచేయించి సిరను వేధించవలయును. శిరము ముఖము వీనికి శీతములగునందు లేపసేకములను శోధనవస్తికర్మలను చేయించవలయును. జీవనీయగణద్రవ్యములతో కాచబడిన యావుపాలు, ఆవునెయ్యి వీనిని పాననస్యములయందుపయోగించవలయును.

## రక్తజశిరోభితాపచికిత్స.

కర్తవ్యం రక్తజేఽప్యేతత్ప్రత్యాఖ్యాయ చ శంఖకే,

రక్తమువలన జనించిన శిరోభితాపమునకు పైచికిత్సలనే చేయవలయును. శంఖకరోగము అసాధ్యముగనుండినను శమించుట కష్టమనిచెప్పి దానికి పైచికిత్సలనే చేయవలయును.

—శ్లేష్మజశిరోభితాపచికిత్స.—

శ్లేష్మాభితాపే జీర్ణాజ్యస్నేహితః కటుకై ర్వమేత్. ౧౩
స్వేదప్రలేపనస్యాద్యాగ్రూక్షతీక్ష్ణోష్ణభేషజైః,
శస్యంతే చోపవాసోఽత్ర నిచయే మిశ్రమాచరేత్. ౧౪

శ్లేష్మమువలన జనించిన శిరోరోగమునను పాతనేతితో నస్యంజనము చేయించి కటుద్రవ్యములతో వమనము చేయించవలయును. రూక్షగను తీక్ష్ణముగను ఉష్ణముగను యుండు ద్రవ్యములచే స్వేదకర్మను ప్రలేపనస్యాదులను చేయించవలయును. ఈరోగము కలవానికి లంఘనము వేయుట మిక్కిలి హితకరము. సన్నిపాతశిరోరోగమునను పై చికిత్సలన్నిటిని మిశ్రముముగ చేయగలయును.

—క్రిమిజశిరోభితాపచికిత్స.—

కృమిజే శోణితం నస్యం తేన మూర్ఛంతి జంతవః,
మత్తాశ్శోణితగంధేన నిర్యాంతి ఘ్రాణవక్త్రయోః. ౧౫
సుతీక్ష్ణనస్యధూమాభ్యాం కుర్యాన్నిర్హరణం తతః,

క్రిములవలన జనించిన శిరోరోగమునను రక్తముచే నస్యము చేయించిన దానిచే క్రిములు వృద్ధిజెంది రక్తగంధముచే మదించి ముక్కునుండియు, నోటినుండియు ఆ క్రిములు బైలువెడలును. పిదప నిటకచెప్పఁబోయెడు తీక్ష్ణధూమనస్యములను చేయించిన క్రిములు నశింపును.

—క్రిమిజశిరోభితాపమునకు నస్యము.—

విడంగస్వర్జికాదంతీహింగుగోమూత్రసాధితమ్. ౧౬
కటునింబేంగుదీపీలుతైలం నస్యం పృథక్పృథక్;
అజామూత్రద్రుతం నస్యే కృమిజిత్కృమిజిత్పరమ్. ౧౭

వాయువిడంగములు, సజ్జాక్షారము, దంతి, ఇంగువ, గోమూత్రము వీనితోడ యావనూనెను, వేపనూనెను, ఇంగుప (అనఁగా గార) నూనెను, గోగునూనెను వీనిని వేర్వేరుగ పక్వముచేసి ప్రత్యేకప్రత్యేకముగ నస్యముచేయించినను, వాయువిడంగములను మేకపాలతో నూరి నస్యముచేయించినను క్రిములు నిశ్శేషముగ హరించును.

—క్రిమిజశిరోరోగమున ధూమపానము.—

పూతిమత్స్యయుతైః కుర్యాద్ధూమం నావనభేషజైః,

నస్యౌషధములలో దుర్గంధయుక్తమగు మత్స్యమును చేర్చి ధూపము వేయవలయును.

### క్రిమిజశిరోరోగమున రక్తమోక్షణనిషేధము.

కృమిభిః పీతరక్తత్వాద్రక్తమత్ర న నిర్హరేత్. ౧౮

క్రిములవలన జనించిన శిరోరోగము గలవానియొక్క రక్తమును క్రిములు విశేషముగ పానము జేసియుండుటవలన అట్టివానికి రక్తమోక్షణము చేయించంజనదు. క్రిములు త్రాగుటచేతనే రక్తము క్షీణించియుండును. అట్టియెడ రక్తమోక్షణము చేయించినచో రక్తము బొత్తుగనశించును. కావున రక్తమోక్షము చేయుంజనదని భావము.

### శిరఃకంపరోగచికిత్స.

వాతాభితాపవిహితః కంపే దాహాద్వినా క్రమః,

కంపరోగమున వాతజశిరోరోగమునకుఁ జెప్పియుండు చికిత్సలలో దాహకర్మదక్క తక్కిన చికిత్సలన్నిఁటిని చేయవలయును.

### ఉపశీర్షకరోగచికిత్స.

నవే జన్మోత్తరం జాతే యోజయేదుపశీర్షకే. ౧౯

వాతవ్యాధిక్రియాం పక్వే కర్ణవిద్రధిచోదితమ్,

శిశువు పుట్టినపిదప నాశిశువుకు ఉపశీర్షకరోగము కలిగినతోడనే దానికి వాతవ్యాధికిచెప్పియుండు చికిత్సలను చేయవలయును. పైరోగము పక్వమైయుండినచో విద్రధిరోగమునకుఁ జెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### శిరోవిద్రధ్యాదిచికిత్స.

ఆమపక్వే యథాయోగ్యం విద్రధీపిటికార్బుదే. ౨౦

అపక్వముగ లేక పక్వముగనుండు విద్రధి, పిటక, అర్బుదము యీరోగము లయఁదాయాదోషానుగుణముగ చికిత్సలను చేయవలయును.

### అరూంషికారోగచికిత్స.

అరూంషికాం జలౌకోభిర్హృతాస్రాం నింబవారిణా,

సిక్తాం ప్రభూతలవణైర్లింపేదశ్వశకృద్రసైః. ౨౧

పటోలనింబపత్రైర్వా సహరిద్రైస్సుకల్కితైః,

గోమూత్రజీర్ణపిణ్యాకకృకవాకుమలైరపి. ౨౨

కపాలభృష్టం కుష్ఠం వా చూర్ణితం తైలసంయుతం,

రూంషికాలేపనం కండూక్లేదదాహార్తినాశనమ్. ౨౩

అరూంషికారోగమునందు జలగలచే రక్తమునుతీసి వేపాకు కషాయముచే సేచనము చేయించి గుఱ్ఱపుపింటికలరసములో లవణమును విశేషముగ చేర్చి లేపనము చేయవలయును; లేక చేదుపొట్ల, వేపాకు, పసుపు వీనిని చక్కగ నూరిగాని, పాత తెలికపిండి, కోడివిష్ఠ వీనిని గోమూత్రముతో నూరిగాని, అరూంషిక రోగమునకు లేపనము చేయవలయును. చెంగల్వకోష్టును చూర్ణముచేసి కుండపెంకులోవేయించి నువ్వులనూనెలో కలిపి అరూంషికారోగమునకు లేపనము చేసిన దురద, క్లేదము, మంట, నొప్పి హరించును.

## అరూంషికారోగహరాభ్యంజనము.

మాలతీచిత్రకాశ్వఘ్నన క్తమాలప్రసాధితమ్,
వచారూంషికయోస్తైలమభ్యంగః క్షురఘృష్టయోః. ౨౮

వచా (అనగా ఇంద్రలుప్తము), అరూంషికా వీనిని మంగలకత్తిచే గొరచి జాజి, చిత్రమూలము, గన్నేరు, కలుగానుగు వీనిని చేర్చి కాచిన తైలమును రుద్దవలయును.

## అరూంషికారోగమున శిరశ్శోధనము.

అశాంతౌ శిరసశ్శుద్ధ్యై యతేత వమనాదిభిః,

పైచెప్పిన ప్రకారపు చికిత్సజేసినను అరూంషికరోగము శమింపకయుండిన వమనాదికర్మలచే శిరసును శుద్ధిచేయవలయును.

## దారుణకరోగచికిత్స.

విధ్యేచ్ఛిరాం దారుణకే లాలాట్యాం శీలయేన్నృజామ్. ౨౯
నావనం మూర్ధ్నివస్తిం చ లేపయేచ్చ సమాక్షికైః,
ప్రియాళబీజమధుకకుష్ఠమాషైస్ససర్షపైః. ౨౬
లాక్షాశమ్యాకపత్రైడగజధాత్రీఫలైస్తథా,
కోరదూషతృణక్షారవారిప్రక్షాళనం హితమ్. ౨౭

మనుజునికి దారుణకరోగము కలిగినచో వాని నుదురులోనుండు సిరను వేధించవలయును. శిరశ్శుద్ధి, శిరోవస్తి, నస్యము వీనిని పలుమారు చేయించవలయును. మొరలిపప్పు (చారపప్పు), అతిమధురము, చెంగల్వకోష్టు, ఉద్దులు, ఆవాలు వీనిని నూరి అందు తేనెకలిపి లేపనము చేయవలయును. లత్తుక, రేలాకు, తగిరిసవిత్తులు, ఉసిరికపండ్లు వీనిని నూరి తేనెలోకలిపి లేపనము చేయించవలయును. కొఱ్ఱగడ్డిని నిప్పులోకాల్చి యాబూడిద నుదకములో కలిపి దానిచే కడగవలయును.

### ఇంద్రలుప్తరోగచికిత్స

ఇంద్రలుప్తే యథాసన్నం సిరాం విధ్వా ప్రలేపయేత్,
ప్రచ్ఛాయ గాఢం కాసీసమనోహ్వాతుత్థకోషణైః. ౨౭
వన్యామరతరుభ్యాం వా గుంజామూలఫలై స్తథా,
తథా లాంగలికామూలైః కరవీరరసేన వా. ౨౮
సక్షౌద్రక్షుద్రవార్తాకస్వరసేనరసేన వా,
ధత్తూరకస్య పత్రాణాం భల్లాతకరసేన వా. ౩౦
అథవా మాక్షికహవి స్తిలపుష్పత్రికంటకైః,
తైలాక్తాహ స్తిదంతస్య మషీ వా చౌషధం పరమ్. ౩౧

ఇంద్రలుప్తరోగమునందు సమీపమున నుండు సిరను వేధించి యాప్రదేశమున శస్త్రముచే కొంచెము ఛేదించి కాసీసము, మణిశిల, మైలుతుత్తము, పిప్పళ్లు వీనిని నూరి లేపనము చేయించవలయును. అడవికంద, దేవదారు వీనినిగాని, గురిగింజవేళ్లు గురిగింజలు వీనినిగాని, చన్నచర్లగడ్డను గాని నూరి లేపనము చేయవలయును. మఱియు గన్నేరు రసముతోగాని, చిన్నములక రసములో తేనెను కలిపిగాని, ఉమ్మెత్తాకురసముతోగాని, జీడిగింజల రసముతోగాని, నువ్వుపూలు, పల్లేరు వీనినినూరి తేనె, నెయ్యి వీనినిచేర్చి దానిచేగాని లేపనముచేయించవలయును. మఱియు ఏనుగుదంతమును నిప్పులో కాల్చి యామసిని నువ్వులనూనెలో కలిపి లేపనము చేయించవలయును. ఇది యింద్రలుప్తరోగమునకు మిక్కిలి శ్రేష్ఠౌషధము.

### శుక్లరోమోత్పత్తిచికిత్స.

శుక్లరోమోద్గమే తద్వన్మషీ మేషవిషాణజా,

శిరమున తెల్లవెండ్రుకలు మొలిచినచో మేకకొమ్మును నిప్పులో కాల్చి యామసిని నువ్వులనూనెలో కలిపి శిరమునకు లేపనము చేయవలయును.

### ఇంద్రలుప్తరోగికి స్నాననిషేధము.

వర్జయే ద్వారిణాం సేకం యావద్రోమసముద్భవః. ౩౨

ఇంద్రలుప్తరోగి శిరములో వెండ్రుకలు మొలుచునంతవఱకు స్నానమును వర్జింపవలయును.

### ఖలత్యాదిరోగచికిత్స.

ఖలతే పలితే వల్యాం హరిల్లోమ్ని చ శోధితమ్,
నస్యవక్త్రశిరోభ్యంగప్రదేహైస్సముపాచరేత్. ౩

ఖలతి (అనఁగా బట్టతల) పలితము (అనఁగా వెండ్రుకలు నెరయుట) వలి, హరి
ల్లోమము (వెండ్రుకలు పచ్చగనుండుట) అను రోగములు కలవానికి వమనవిరేచనాదుల
కిప్పించి నస్యము జేయించుటయేగాక ముఖము శిరము వీనికి అభ్యంగమును ప్రదేహము
(అనఁగా పట్టును) చేయించవలయును.

ఖలత్యాదిరోగములయందు నస్యము.

సిద్ధం తైలం బృహత్యాద్యైర్జీవనీయైశ్చ నావనమ్,
మాసం వా నింబజం తైలం క్షీరభుక్నావయేద్యతిః. ౩౮

పైఖలత్యాదిరోగములు గలవానికి బృహత్యాదిగణద్రవ్యములు జీవనీయగణద్రవ్య
ములు వీనితో పక్వముచేయఁబడిన తైలముచే నస్యము చేయించవలయును. లేక వేప
నూనెను ఒక మాసమువఱకు నస్యముచేయించుచు నారోగిని పాలను త్రాగునటులను స్త్రీ
సంభోగము చేయకుండునటులను చేయవలయును.

పలితరోగచికిత్స.

నీలీశిరీషకోరంటభృంగస్వరసభావితమ్,
శేల్వక్షతిలరామాణాం బీజంకాకాండకీసమమ్. ౩౫
పిష్ట్వా ఽజపయసా లోహాల్లిప్తాదర్కాంశుతాపితాత్,
తైలం శృతం క్షీరభుజో నావనాత్పలితాంతకృత్. ౩౬

విరిగి, తాడి, సురుగుడు పేసవిత్తులు, నువ్వులు కాకాంఢకీ (అనఁగా చెప్పుతట్ట)
వీనిని నీలి, దిరిసెనము, గోరింట, గుంటగలగర వీనిస్వరసములలో భావనచేసి మేకపాలతో
నూరి ఇనుప పాత్రకు బూసి యెండలోనుంచినచో నందుండి తైలము స్రవించును.
ఆతైలము దీసి పలితరోగముగలవానికి నస్యము చేయించి ఆవుపాలను త్రాగునటులజేసిన
పలితరోగము హరించును.

పలితరోగమునకు నస్యము.

క్షీరాత్సహచరాద్భృంగరజసస్స్వరసాద్రసాత్,
ప్రస్థైస్తైలస్య కుడవస్సిద్ధో యష్టిపలాన్వితః. ౩౭

నస్యం తైలోద్భవే భాండే శృంగే మేషస్య వా స్థితః,

ఆవుపాలు ఒక ప్రస్థము, గోరింటరసము ఒక ప్రస్థము, గుంటగలగరరసము ఒక
ప్రస్థము, తులసీరసము ఒక ప్రస్థము, నువ్వులనూనె ఒక కుడవము, యిటుల వీనినేకము
చేసి ఒక పలము అతిమధురమును చేర్చి తైలపాకవిధిగ పక్వముచేసి రాతిపాత్రలో గాని
మేక కొమ్ములో గాని నుంచుకొని నస్యము చేయించిన పలితరోగము హరించును.

### పలితరోగహరలేపము.

క్షీరేణ శ్లక్ష్ణపిష్టౌ వా దుగ్ధికాకరవీరకౌ. ౩౮
ఉత్పాట్య పలితం దేయౌ వాశయే పలితాపహౌ,

పిన్నపాల, గన్నేరు వీనిని ఆవుపాలతో మెత్తగనూరి దానిని నెరసినవెండ్రుకల నూడతీసి యాస్థలమునకు లేపనముజేసిన పలితరోగము హరించును.

### పలితరోగమునకు ప్రియాళ్వాదిలేపము.

క్షీరం ప్రియాళ్వం యష్ట్యాహ్వాం జీవనీయో గణ స్తిలాః. ౩౯
కృష్ణాః ప్రలేపో వక్త్రస్య హరిల్లోమవలీహితః,

చారపప్పు, అతిమధురము, జీవనీయ గణ ద్రవ్యములు, నల్ల నువ్వులు వీనిని ఆవు పాలతోనూరి ముఖమునకు లేపనముచేసిన ఇంద్రలుప్తము పలితము హరించును.

### కేశవృద్ధికరలేపము.

తిలాస్సామలకాః పద్మకింజల్కం మధుకం మధు. ౪౦
బృంహయేచ్చ రజేచ్చైత త్కేశాన్మూర్ధ్నప్రలేపనాత్,

నువ్వులు, ఉసిరికపండ్లు, తామరకేసరము, అతిమధురము, తేనె వీని నొకటిగచేర్చి చక్కఁగనూరి శిరమునకు లేపనముచేసిన తలవెండ్రుకలు నల్లనిరంగుతో వృద్ధిజెందును.

### కేశవృద్ధికి జటామాంస్యాదిలేపము.

మాంసీ కుష్ఠం తిలాః కృష్ణాస్సారిబా నీలముత్పలమ్. ౪౧
క్షౌద్రం చ క్షీరపిష్టాని కేశసంవర్ధనం పరమ్,

జటామాంసి, చెంగల్వకోష్టు, నల్లనువ్వులు, నల్లసుగంధిపాల, నల్లకలువ వీనిని ఆవుపాలతోనూరి అందులో క్షౌద్రమను తేనెనుచేర్చి శిరమునకు లేపనముచేసిన వెండ్రుకలు విశేషముగ వృద్ధిజెందును.

### పలితరోగమునకు అయశ్చూర్ణాదిలేపము.

అయోరజో భృంగరజ స్త్రిఫలా కృష్ణమృత్తికా. ౪౨
స్థితమిక్షురసే మాసం సమూలం పలితం రజేత్,

ఉక్కురాపొడి, గుంటగలగరచూర్ణము, త్రిఫలము, నల్లమట్టి వీనిని చెఱకురసములో నొకమాసమునానఁబెట్టి పలితరోగమునకు లేపనముచేసిన నది నిశ్శేషముగ హరించును. వెండ్రుకలు నల్లన పడును,

### పలితమునకు మాషాదిలేపము.

మాషకోద్రవధాన్యాన్యాని త్రిదినోషితా. ౪౩
లోహశుక్లోత్కటా పిష్టా బలాకామపి రంజయేత్,

ఉద్దులు, కొఱ్ఱలు వీనిని పులికడుగులో వైచి గంజికాచి మూఁడుదినములు పులియబెట్టి దానిలో నినుపచిట్టెమును నూరి కొంగపై పూసినను అది నల్లగనగును; కావున శిరమునకుఁబూసిన పలితరోగము నిస్సంశయముగ హరించి వెండ్రుకలు నల్లఁబడును.

### శిరోరోగహరప్రపౌండరీకాదితైలము.

ప్రపౌండరీకమధుకపిప్పలీచందనోత్పలైః. ౪౪
సిద్ధం ధాత్రీరసే తైలం నస్యేనాభ్యంజనేన చ,
సర్వాన్మూర్ధగదాన్ హంతి పలితాని చ శీలితమ్. ౪౫

ఉసిరికపండ్లరసము, నువ్వులనూనె వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగ చేర్చి యందులో ప్రపౌండరీకము (కస్తూరపు బెండ), అతిమధురము, పిప్పళ్లు, చందనము, నల్లకలువ వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి దానిని నస్యాభ్యంగములయం దుపయోగించిన శిరోరోగములన్నియు హరించుటయేగాక పలితరోగము సహితము నివర్తించును.

### జత్రూర్ధ్వరోగహరనస్యము.

వరీజీవంతినిర్యాసపయోభిర్యమకం పచేత్,
జీవనీయైశ్చ తన్నస్యం సర్వజత్రూర్ధ్వరోగజిత్ *. ౪౬

పిల్లిపీచర, మనుబాల వీనికషాయము, ఆవుపాలు, యమకస్నేహము వీని నొకటిగచేర్చి యందు జీవనీయగణద్రవ్యముల కల్కమును కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి నస్యము చేయించిన మెడకొంకులకు పైభాగమునందు జనించు రోగములన్నియు నివర్తించును.

నెయ్యి, నూనె, క్రొవ్వు, ఈమూఁడు స్నేహద్రవ్యములతో రెండు స్నేహద్రవ్యములుచేరిన నయ్యది యమకస్నేహ మనఁబడును.

---

* శ్లో. మధూకయష్టి క్రిమిజిద్విశ్వాశ్వైం గైశ్శృతం హవిః,
షడ్బిందునామ తన్నస్యం సర్వమూర్ధామయాపహమ్.

అతిమధురము, వాయువిడంగములు, శుంఠి, గుంటగలగర వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలో కలిపి విధిప్రకారము పక్వముచేసిన నది షడ్బిందుఘృత మనఁబడును. దీనిని నస్యము చేయించిన శిరోరోగములన్నియు హరించునని ప్రాచీనకోశములయం దధికపాఠము కనఁబడుచున్నయది.

### మాయూరఘృతము.

మయూరం పక్షపిత్తాంత్ర పాదవిట్తుండవర్జితమ్,
దశమూలబలారాస్నామధుకైస్త్రిపలైర్యుతమ్. ౪౭
జలే పక్త్వా ఘృతప్రస్థం తస్మిన్ క్షీరసమం పచేత్,
కల్కితైర్మధురద్రవ్యైస్సర్వజత్రూర్ధ్వరోగజిత్. ౪౮
తదభ్యాసీకృతం పానవస్త్యభ్యంజననావనైః,

ఱెక్కలు, పిత్తము, నరములు, కాళ్లు, మలము, ముక్కు వీని నెత్తివేసిన నెమలి మాంసము, దశమూలములు, చిట్టాముట్టి, సన్నరాస్నము, అతిమధురము వీనిని దినుసుకు మూఁడుపలములచొప్పున నుదకములో వైచి చక్కఁగ కషాయము కాచి అందులో ఒకప్రస్థ మావునెయ్యి, ఒకప్రస్థ మావుపాలనుఁ బోసి మధురగణద్రవ్యకల్కమును చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది మాయూరఘృత మనఁబడును. దీనిని పానవస్తి అభ్యంజననస్యములయం దుపయోగించుకొనుచుండిన మెడకొంకులకు పైభాగమున జనించు రోగములన్నియు హరించును.

### మహామాయూరఘృతము.

ఏతేనైవ కషాయేణ ఘృతప్రస్థం విపాచయేత్. ౪౯
చతుర్గుణేన పయసా కల్కైరేభిశ్చ కార్షికైః,
జీవంతీత్రిఫలామేదామృద్వీకాద్విపరూషకైః. ౫౦
సమంగాచవికాభార్గీకాశ్మరీకర్కటాహ్వయైః,
ఆత్మగుప్తామహామేదాతాలఖర్జూరమస్తకైః. ౫౧
మృణాళబిసఖర్జూరయష్టీమధుకజీవకైః,
శతావరీవిదారీక్షుబృహతీసారిబాయుగైః. ౫౨
దూర్వాశ్వ దంష్ట్రర్షభకశృంగాటకకశేరుకైః,
రాస్నాస్థిరాతామలకీసూక్ష్మైలాశఠిపౌష్కరైః. ౫౩
పునర్నవాతవక్షీరీకాకోళీధన్వయాసకైః,
మధూకాక్షోటవాతామముంజాతాభిషుకైరపి. ౫౪
మహామాయూరమిత్యేతన్మాయూరాదధికం గుణైః,

ధాత్వింద్రియస్వరభ్రంశశ్వాసకాసార్దితాపహమ్. ౧౫౫
యోన్యసృక్ఛుక్రదోషేషు శస్తం వంధ్యాసుతప్రదమ్,

పైచెప్పినవిధంబున గ్రహింపఁబడిన నెమలిమాంసము, దశమూలములు మొద లగువాని కషాయములో ఒకప్రస్థ మావునెయ్యిని నాల్గుప్రస్థ మావుపాలను చేర్చి పిన్నమనుబాల, త్రిఫలములు, మేద, ద్రాక్ష, చిట్టీతపండు, పెద్దయీతపండు, మంజిష్ట, చవ్యము, గంటుభారంగి, పెద్దగుమ్ముడు, కర్కాటకశృంగి, మురదగొండి, మహామేద, పిండఖర్జూరము, తుంగముస్తలు, తామరతూడు, తామరగడ్డలు, ఖర్జూరము, అతిమధురము, జీవకము, పిల్లిపీచర, తెల్లనేలగుమ్ముడు, చెరుకు, వ్రామడు, సుగంధిపాల, నల్లసుగంధిపాల, గరికె, పల్లేరు, ఋషభకము, పరికెగడ్డ, నమ్మదుంప, దుంపరాష్నము, ముయ్యాకుపొన్న, నేలయుసిరిక, పిన్నఏలకులు, కచోరములు, పుష్కరమూలము, గలిజేరు, అక్షోటము, బాదాము, తవక్షీరి, కాకోళి, రేగటిమూలగోవిల, ముంజాతమను పుష్పశాకము, అభిషుకము వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. ఇది మహామాయూరఘృత మనఁబడును. దీనిని పానవస్యాదులయం దుపయోగించిన ధాతుక్షయము, ఇంద్రియదౌర్బల్యము, స్వరభంగము, శ్వాసము, కాసము, అర్దితవాతము హరించును. గొడ్రాలికి సంతానము కలుగును. ఇది యోనిరోగము, శుక్లశోణితదోషము వీనియందు శ్రేష్ఠమైన యౌషధము. మాయూరఘృతముకంటె విశేషగుణము కలది.

ఆఖుభిః కర్కటైర్హంసైః శశైశ్చేతి ప్రకల్పయేత్. ౧౫౬

ఎలుక, యండ్రకాయ, హంస, కుందేలు వీనిమాంసములతో ప్రత్యేకప్రత్యేకముగ పైమహామాయూరఘృతమునకు చెప్పియుండు ప్రకారము ఘృతమును పక్వముచేసి సేవించిన మహామాయూరఘృతమునకు చెప్పియుండు గుణములు కలుగును.

## జత్రూర్ధ్వరోగసంఖ్య.

జత్రూర్ధ్వజానాం వ్యాధీనామేకత్రింశచ్ఛతద్వయమ్,
పరస్పర మసంకీర్ణంవిస్తరేణ ప్రకాశితమ్. ౧౫౭

ఇటుల మెడకొండలపై జనించు రోగములు, రెండునందలు ముప్పది యొకటియు విస్తారముగ చెప్పఁబడినవి.

## జత్రూర్ధ్వరోగ చికిత్సావశ్యకత్వము.

ఊర్ధ్వమూల మధశ్శాఖమృషయః పురుషం విదుః,
మూలప్రహారిణస్తస్మాద్రోగాన్ శీఘ్రతరం జయేత్. ౧౫౮

మనుజునియొక్క శరీరమునకు పై భాగమునందు వేళ్లును. క్రిందిభాగమునందు శాఖలు నుండునని ఋషులు చెప్పెదరు. కావున అట్టి ప్రదానాంగమైన జత్రూర్ధ్వ భాగమున జనించురోగములు శరీరమున కాధారముల నశింపఁజేయును. కావున మెడకు పైభాగమున జనించురోగముల నుపేక్షింపక అతిశీఘ్రముగ చికిత్స జేయవలెనని భావము.

### శిరోరక్షణావశ్యకత్వము.

సర్వేంద్రియాణి యేనాస్మిన్ ప్రాణా యేన చ సంశ్రితాః,
తేన తస్యోత్తమాంగస్య రక్షాయామాదృతో భవేత్. ౫౯

చక్షురాదిసకలేంద్రియములు ప్రాణములు. ఇవి శిరమును ముఖ్యముగ నాశ్రయించియుండును. కావున నట్టిశిరమును రక్షించుటయందు మనుజుఁడు మిక్కిలి ప్రయత్నముగలవాఁడుగ నుండవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదినాల్గవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# పంచవింశాధ్యాయము.

(శల్యతంత్రము) 5-వ అంగము.

శిరోరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము వ్రణవిజ్ఞానీయ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది.—

## వ్రణవిజ్ఞానీయప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాఽతో వ్రణవిజ్ఞానీయప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

శిరోరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము వ్రణభేదలక్షణములను వాని చికిత్సలను తెలియపఱచునట్టి వ్రణవిజ్ఞానీయప్రతిషేధ మనునీయధ్యాయమును వివరించెదము.

### వ్రణద్వైవిధ్యము.

వ్రణో ద్విధా నిజాగంతుదుష్టశుద్ధవిభేదతః,
నిజో దోషైశ్శరీరోత్థైరాగంతుర్బాహ్యహేతుజః. ౧

దోషైరధిష్ఠితో దుష్టశ్శుద్ధస్తైరనధిష్ఠితః,

నిజము ఆగంతుకము ననియు, దుష్టము శుద్ధము అనియు, వ్రణములు ద్వివిధములుగ నుండును. వానిలో శరీరమందలి దుష్టవాతాదిదోషంబులచే జనించినది నిజవ్రణమనియు, అభిఘాతాదిబాహ్యకారణములచే జనించినది ఆగంతుక మనియు, దుష్టవాతాదిదోషంబులతోఁ గూడియుండునది దుష్టవ్రణమనియు, దుష్టవాతాదిసంబంధము లేకుండునది శుద్ధవ్రణ మనియు తెలిసికొనవలయును.

### దుష్టవ్రణలక్షణములు.

సంవృతత్వం వివృతతా కాఠిన్యం మృదుతాపి వా. ౨
అత్యుత్సన్నావసన్నత్వమతౌష్ణ్యమతిశీతతా,
రక్తత్వం పాండుతా కార్ష్ణ్యం పూతిపూయపరిస్రుతిః. ౩
పూతిమాంససిరాస్నాయుచ్ఛన్నతోత్సంగితాఽతిరుక్,

సంరంభదాహశ్వయథుకండ్వాదిభిరుపద్రుతః. ४
దీర్ఘకాలానుబంధశ్చ విద్యాద్దుష్టవ్రణాకృతిమ్,

మూయఁబడియుండుట, లేక విశేషముగ తెరవఁబడియుండుట, మిక్కిలి కఠినముగనైనను, మృదువుగనైన నుండుట, మిక్కిలి ఉబ్బియుండునదిగ, లేక లోన ప్రవేశించినదిగ నుండుట, అత్యుష్ణముగ, లేక యతిశీతముగ నుండుట, మిక్కిలి యెఱ్ఱగాని తెల్లగగాని నల్లగగాని యుండుట, దుర్గంధయుక్తమగు చీముకారుట, మాంసము, సిరలు, నరములు, దుర్గంధయుక్తంబులై యుబ్బి వ్రణద్వారమును మూసికొని యుండుట, అధికముగ నొప్పి, వాపు, మంట, దురద మొదలగు నుపద్రవములు కలిగియుండుట, దీర్ఘకాల మనువర్తించుచుండుట, ఇవి దుష్టవ్రణములని యెఱుఁగవలయును.

## పంచదశవ్రణభేదములు.

స పంచదశధా దోషైస్సరక్తైః.

వాతజము, పిత్తజము, శ్లేష్మజము, వాతపిత్తజము, వాతశ్లేష్మజము, పిత్తశ్లేష్మజము, సన్నిపాతజము, వాతరక్తజము, పిత్తరక్తజము, శ్లేష్మరక్తజము, వాతపిత్తరక్తజము, వాతశ్లేష్మరక్తజము, పిత్తశ్లేష్మరక్తజము, సన్నిపాతరక్తజము, రక్తజము అని వ్రణములు పదిహేనువిధములుగ నుండును.

## వాతజవ్రణలక్షణము.

తత్ర మారుతాత్. ५
శ్యావః కృష్ణో ఽరుణో భస్మకపోతాస్థినిభోఽపి చ,
మస్తుమాంసపులాకాంబుతుల్యతన్వల్పసంస్రుతిః. ౬
నిర్మాంసస్తోదభేదాఢ్యో రూక్షశ్చటచటాయతే,

వాతమువలన జనించినవ్రణము శ్యావవర్ణముగను, నల్లగను, యెఱ్ఱగను, పావురపిట్టరెక్కతో తుల్యముగను, పెరుగుమీఁది మీఁగడ, మాంసముగడిగిన నీళ్లు, కూటినీళ్లు వీనితో సదృశమైన స్రావముగలదిగను, మాంసరహితముగను, పోట్లు, నొప్పిగలదిగను, రూక్షముగను, చటచటయను శబ్దముగలదిగను నుండును.

## పిత్తజవ్రణలక్షణము.

పిత్తేన క్షిప్రజః పీతో నీలః కపిలపింగళః. ౭
మూత్రకింశుకభస్మాంబుతైలాంభోష్ణబహుస్రుతిః,
క్షారోక్షితక్షతసమవ్యథో రాగోష్మపాకవాన్. ౮

పిత్తమువలన జనించినవ్రణము శీఘ్రముగ వృద్ధిఁజెందును. పసుపువర్ణము, నీల వర్ణము, కపిలవర్ణము, పింగళవర్ణము గలదిగ నుండును. గోమూత్రము, మోదుగుపువ్వు, భస్మమును కలిపిన యుదకము, నువ్వులనూనె, ఉదకము వీనితో తుల్యముగను, ఉష్ణముగను, అధికముగను ఉండు స్రావము గలదిగ నుండును. వ్రణములో నుష్ణతగలిగిన నెట్టియుపద్రవము కలుగునో యట్టి యుపద్రవమును రెండుపువర్ణమును కల్గి వేడిసెగ పొక్కులు కల్గియుండును.

### కఫజవ్రణలక్షణము.

కఫేన పాండుః కండూమాన్ బహుశ్వేతఘనస్రుతిః,

స్థూలౌష్ఠః కఠినస్స్నాయుసిరాజాలస్తతోల్పరుక్. ౯

కఫమువలన జనించినవ్రణము తెల్లగను దురదతోఁ గూడినదిగను తెల్లగ గట్టిగ నుండు అధికస్రావము గలదిగను, లావుగనుండు నోష్ఠము కలదిగను, కఠినముగను, నరములచేతను, సిరలచేతను, వ్యాప్తంబుగను, స్వల్పముగ నొప్పితోఁ గూడినదిగను నుండును.

### రక్తజవ్రణలక్షణము.

ప్రవాళరక్తో రక్తేన సరక్తం పూయముద్గిరేత్,

వాజిస్థానసమో గంధే యుక్తో లింగైశ్చ పైత్తికైః. ౧౦

రక్తమువలన జనించినవ్రణము పగడమువలె నెఱ్ఱగనుండును. రక్తముతోఁడ చీము నుస్రవించును. గుఱ్ఱపుశాలయందు కల్గువాసన కలిగియుండును. పిత్తజవ్రణలక్షణములతోఁ గూడియుండును.

### సంసర్గసన్నిపాతజవ్రణలక్షణము.

ద్వాభ్యాం త్రిభిశ్చ సర్వైశ్చ విద్యాల్లక్షణసంకరాత్,

ద్వంద్వదోషమువలన జనించిన వ్రణమునందు ద్వంద్వదోషలక్షణములు కలుగును. సన్నిపాతమువలన జనించు వ్రణమునందు పై వాతాదివ్రణలక్షణములన్నియు కలిసియుండును.

### శుద్ధవ్రణలక్షణము.

జిహ్వాప్రభోమృదుశ్శ్లక్ష్ణశ్శ్యావౌష్ఠపిటకస్సమః. ౧౧

కించిదున్నతమధ్యో వా వ్రణశ్శుద్ధో౽నుపద్రవః,

నాలుకతో తుల్యమైన కాంతిగలదియు మృదువైనదియు సన్నగనుండునదియు అంచులయందు నల్లని పిటకలుగలదియు నడుమ కొంచెము పొడవుగ నుండునదియు నొప్పిలేనిదియు నైన వ్రణము శుద్ధమైనదని తెలిసికొనవలయును.

## వ్రణస్థానములు.

త్వగామిషసిరాస్నాయుసంధ్యస్థీని వ్రణాశయాః. ౧౨
కోష్ఠో మర్మ చ తాన్యష్టౌదుస్సాధ్యాన్యుత్తరోత్తరమ్,

చర్మము మాంసము సిరలు స్నాయువులు యెముకలు సంధులు కోష్ఠము మర్మము అను నీ ఎనిమిది యంగములు వ్రణములకు స్థానంబులుగ నుండును వీనిలో జనించినవ్రణములు నొకదానికంటె నొకటి మిక్కిలి కష్టసాధ్యము.

## సుఖసాధ్యవ్రణలక్షణము.

సుసాధ్యస్సత్వమాంసాగ్నివయోబలవతి వ్రణః. ౧౩
వృత్తో దీర్ఘ స్త్రిపుటకశ్చతురస్రాకృతిశ్చ యః,
తథా స్ఫిక్పాయుమేఢ్రోష్ఠపృష్ఠాంతర్వక్త్రగండయోః. ౧౪

శరీరబలము, మాంసపుష్టి, జాఠరాగ్నిదీపనము ఇవి గల మానవునికి జనించిన వ్రణము, వయస్సుగల మనుజునికి జనించిన వ్రణము, గుండ్రముగ నిడుపుగ త్రికోణాకారముగ చచ్చౌకముగ నుండువ్రణము, పిఱుదులు గుదము శిశ్నము పెదవులు వీపు నోరు, కపోలములు వీనియందు జనించినవ్రణము ఇవి సుఖసాధ్యంబులు.

## కష్టసాధ్యవ్రణలక్షణము.

కృచ్ఛ్రసాధ్యోఽక్షిదశననాసికాపాంగనాభిషు,
సేవనీజఠరశ్రోత్ర పార్శ్వకక్షా స్తనేషు చ. ౧౫
ఫేనపూయానిలవహా శ్శల్యవానూర్ధ్వనిర్వమీ,
భగందరోఽంతర్వదన స్తథా కట్యస్థిసం శ్రితః. ౧౬
కుష్ఠినాం విషజుష్టానాంశోషిణాం మధుమేహినామ్,
వ్రణాః కృచ్ఛ్రేణ సిధ్యంతి యేషాం చ స్యుర్వ్రణే వ్రణాః. ౧౭

నేత్రములు దంతములు నాసికము కడకండ్లు నాభి సంధులు ఉదరము చెవులు పార్శ్వములు చంకలు స్తనములు వీనియందు జనించినవ్రణము కష్టసాధ్యము. మఱియు నురుగు చీము వాతము వీనిని వహించునట్టి వ్రణము, శల్యయుక్త మగువ్రణము, ఊర్ధ్వముఖముగ నుండువ్రణము, లోన ముఖము గల భగందరము నడుమునందలి యస్థినాశ్రయించియుండు వ్రణము, కుష్ఠరోగము గలవారలకును విషసంబంధము గలవారలకును క్షయరోగికిని మధుమేహరోగికిని జనించియుండువ్రణములు నివి కష్టసాధ్యంబులు ఒకవ్రణమునకు పై మఱియొకవ్రణము జనించిన నదియు నసాధ్యము.

## అసాధ్య వ్రణలక్షణములు.

నైవ సిద్ధ్యంతి వీసర్పజ్వరాతీసారకాసినామ్,
పిపాసూనామనిద్రాణాం శ్వాసినామవిపాకినామ్. ౧౮
భిన్నే శిరఃకపాలే వా మస్తులుంగస్య దర్శనే,

విసర్పము జ్వరము అతిసారము కాసము వీనిలో నేదైన నొకరోగము గలవారికిని, దప్పిగలవారికిని, నిద్రపట్టకుండు వారికిని, శ్వాసము అజీర్ణము గలవారికిని, జనించు వ్రణములు అసాధ్యంబులు. మఱియు శిరమునందలి కపాలము పగులుటవలన మస్తులుంగమను మాంసము కనుబడినచో నావ్రణము నివర్తించ నేరదు.

స్నాయుక్లేదాత్సిరాచ్ఛేదాద్గాంభీర్యాత్క్రిమిభక్షణాత్. ౧౯
అస్థిభేదాత్సశల్యత్వాత్సవిషత్వాదతర్కితాత్,
మిథ్యాబంధాదతిస్నేహాద్రౌక్ష్యాద్రోమాతిఘట్టనాత్. ౨౦
క్షోభాదశుద్ధకోష్ఠత్వాత్సౌహిత్యాదతికర్శనాత్,
మద్యపానాద్దివాస్వాపాద్వ్యవాయాద్రాత్రిజాగరాత్. ౨౧
వ్రణో మిథ్యోపచారాచ్చ నైవ సాధ్యోఽపి రోహతి,

వ్రణము సుఖసాధ్యముగ నుండినను నరములయందు క్లేదము, సిరలుఛేదింపబడుట, పల్లముపడుట, క్రిములచే భక్షింపబడుట, ఎముకలు విఱిగియుండుట, శల్యముతోఁ గూడియుండుట, విషసంబంధము కలిగియుండుట, విధిప్రకారము కట్టుగట్టకుండుట ఘృతాది స్నేహములను విశేషముగ నుపయోగించుట, స్నేహసంబంధమేలేక రూక్షతకలుగుట, వెండ్రుకలంటికొని యుండుట, అభిఘాతము కలుగుట, కోష్ఠమశుద్ధముగ నుండుట, మద్యపానము చేయుట, పగటియందు నిద్రబోవుట, మైథునము చేయుట, రాత్రులయందు నిద్రించకుండుట, మిథ్యోపచారముల ననుష్ఠించుట యీ కారణములవలన వ్రణ మసాధ్యంబగును.

## శీఘ్రసాధ్యవ్రణలక్షణము.

కపోతవర్ణప్రతిమా యస్యాంతాః క్లేదవర్జితాః. ౨౨
స్థిరాశ్చ పిటకావంతో రోహతీతి తమాదిశేత్,

ఏవ్రణముయొక్క అంచులు పావురపిట్టవర్ణముతోఁ గూడినదిగ క్లేద (అనఁగా స్రావ) రహితము గట్టిగ వాడికల్గినదిగ నుండునో అట్టివ్రణము శీఘ్రముగ శమించునని చెప్పవలయును.

### వ్రణమునందు వమనవిరేచనోపయోగము.

అథాత్రశోఫావస్థాయాం యథాసన్నం విశోధనమ్. ౨౩
యోజ్యం శోఫో హి శుద్ధానాం వ్రణశ్చాశు ప్రశామ్యతి,

వ్రణము వాపుతోఁ గూడియుండునప్పుడు సామీప్యానుగుణముగ వమనమునుగాని విరేచనమునుగాని చేయింపవలయును. ఇటులచేసిన వాపు వ్రణము ఇవి శీఘ్రముగ శమించును.

(నాభికి పైభాగమున వ్రణము జనించినచో వమనము, నాభికి క్రిందిభాగమున వ్రణము జనించినయెడల విరేచనంబును చేయింపవలెనని భావము.)

### వ్రణమునకు శీతోపచారము.

కుర్యాచ్ఛీతోపచారం తు శోఫావస్థస్య సంతతమ్. ౨౪
దోషాగ్నిరగ్నివత్తేన ప్రయాతి సహసా శమమ్,

వ్రణము శోఫావస్థ (వాపురూపమైన యాకారమున) నున్నపుడు శీతోపచారమును చేసినచో "అగ్నిశీతోపచారముచే శమించు మాడ్కి" దోషాగ్ని శీఘ్రముగ శమించును.

### శోఫవ్రణములకు రక్తమోక్షణము.

శోఫే వ్రణే చ కఠినే వివర్ణే వేదనాన్వితే. ౨౫
విషయుక్తే విశేషేణ జలౌకాద్యైర్హరేదసృక్,
దుష్టాస్రేఽపగతే సద్యః శోఫరాగరుజాం శమః. ౨౬

శోఫ వ్రణము అవి కఠినముగ వికారవర్ణముతో గూడినవిగ విశేషముగ నొప్పిగలవిగ నుండినను లేక వాని యందు విషసంబంధము కలిగియుండినను జలగలు మొదలగువానిచే దుష్టరక్తమును వెలిపుచ్చవలయును. ఇటులచేసినచో శరీరమందలి దుష్టరక్తము బైలువెడలి తత్క్షణమే శోఫాదులు శమించును.

### శోఫవ్రణమునకు సేకాభ్యంగాదులు.

హృతేఽహృతే చ రుధిరే సుశీతైః స్పర్శవీర్యయోః,
సుశ్లక్ష్ణైస్తదహః పిష్టైః క్షీరేక్షుస్వరసద్రవైః. ౨౭
శతధౌతఘృతోపేతైర్మృద్నహుర్నైర్యరశోషిభిః,
ప్రతిలోమం హితో లేపస్సేకోఽభ్యంగాశ్చ తత్కృతాః. ౨౮

కాఠిన్యము వికారవర్ణము నొప్పి వాపు వీనితోఁ గూడియుండు వ్రణము కలవానికి పలుమారు రక్తమోక్షణము చేయించి మిక్కిలి శీతస్పర్శ శీతవీర్యములు గల ద్రవ్యములను ఆవుపాలు చెఱుకురసము వీనితోడ చక్కఁగ నూరి అందులో నూరు పర్యాయములు కడగబడిన నేతినికలిపి వ్రణమునకు లేపనము చేయవలయును. మఱియు వ్రణము శోషింపఁ జేయకుండునట్టి యితరద్రవ్యములచే పలుమారు లేపనము చేసి ఆవు పాలు చెఱుకురసము నూరుపర్యాయములు కడిగిన నెయ్యి వీనిచే ప్రతిలోమముగ సేకాభ్యంగములను చేయించవలయును.

## వ్రణశోథహరలేపము.

న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షవేతసవల్కలైః,
ప్రదేహో భూరిసర్పిర్భిశ్శోథనిర్వాపణః పరమ్. ౨౯

మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, ప్రబ్బలి వీనిపట్టలను చక్కఁగనూరి అందులో విశేషముగ ఆవునేతినిచేర్చి పట్టువేసిన వ్రణమునందలి వాపు హరించును.

## శోథవ్రణములకు స్వేదకర్మ.

వాతోల్బణానాం స్తబ్ధానాం కఠినానాం మహారుజామ్,
స్రుతాసృజాం చ శోఫానాం వ్రణానామపి చేదృశామ్. ౩౦
ఆనూపవేసవారాద్యైస్స్వేదస్సోమా స్తిలాః పునః,
భృష్టా నిర్వాపితాః క్షీరే తత్పిష్టా దాహరుగ్ఘరాః. ౩౧

వాతాధిక్యముతోఁ గూడినవియు స్తబ్ధముగ కఠినముగ నుండునవియు విశేషముగ నొప్పిగలవియునగు వాపులకును వ్రణములకును రక్తమోక్షణముచేయించి చక్కఁగ నలియగొట్టి ఘృతాదులతో పక్వము చేయబడిన అనూప జంతుమాంసము మొదలగు వానిచే స్వేదకర్మను చేయించవలయును. అగసివిత్తులు, నువ్వులు వీనిని వేయించి ఆవు పాలలో నానఁబెట్టి ఆవుపాలతోడనే నూరి పట్టువేయవలయును. ఇట్లు జేసిన మంట శూల హరించును.

## స్థిరశోథకు లేపము.

స్థిరా న్మందరుజశ్శోఫా న్స్నేహైర్వాతకఫాపహైః,
అభ్యజ్య స్వేదయిత్వా చ వేణునాడ్యా శనైశ్శనైః. ౩౨
విమ్లాపనార్థం మృద్నీయా త్తలేనాంగుష్ఠకేన వా,
యవగోధూమముద్గైశ్చ సిద్ధపిష్టైః ప్రలేపయేత్. ౩౩

గట్టిగ కొంచెము నొప్పిగలదిగనుండు వాపులను వాత కఫములను పోఁగొట్టు నట్టి స్నేహములచేత నభ్యంజనము చేయించి పిదప స్వేదకర్మనొనర్చి వెదురుకొయ్యచే గాని అరచేతిచేగాని చేతిబొటనవ్రేలిచేగాని మెల్లగ తోమవలయును. యవలు, గోధుమలు, పెసలు వీనిని చక్కఁగవండి నూరి పట్టువేయవలయును.

### స్థిరశోఫమునకు ఉపనాహస్వేదము.

విలీయతే స చేన్నైవం తతస్తముపనాహయేత్,
అవిదగ్ధస్తథా శాంతిం విదగ్ధః పాకమశ్నుతే. 3౮

పైచెప్పిన ప్రకారము చికిత్సజేసినను వాపు శమించకుండిన ఉపనాహస్వేదమును చేయించవలయును. ఇటుల జేసిన అవిదగ్ధముగ నుండు వాపు శమించును. విదగ్ధముగనుండు వాపు పాకమును జెందును.

### వ్రణమునకు ఉపనాహస్వేదము.

సకోలతిలవల్లోమా దధ్యమ్లా సక్తుపిండికా,
సకిణ్వకుష్ఠలవణాకోష్ణా శస్తోపనాహనే. 3౯

రేగుపండ్లు, నువ్వులు, వాయువిడంగములు, అగసి, కిణ్వము, చెంగల్వకోష్టు సైంధవలవణము, సక్తువులు వీనిని పుల్లనిపెరుగుతో నూరి యుంటజేసి సుఖోష్ణముగ వాపునం దుపనాహస్వేదకర్మను చేయించిన హితము కలుగును.

### శోఫహరశస్త్రకర్మ.

సుపక్వే పిండితే శోఫే పీడనైరుపపీడితే,
దారణం దారణార్హస్య సుకుమారస్య చేష్యతే. 3౬

ఇఁక చెప్పఁబోయెడు పీడనద్రవ్యములచే బీడింపఁబడిన వాపు చక్కఁగ పాకమును జెంది యుంటగనుండునపుడు ఆరోగి సుకుమారుఁడై దారణ కర్మకర్హుడై యున్నచో నాశోఫమును శస్త్రముచే ఛేదింపఁదగును.

### శోఫవిదారణద్రవ్యములు.

గుగ్గుల్వతసిగోదంతస్వర్ణక్షీరీకపోతవిట్,
క్షారౌషధాని క్షారాశ్చ పక్వశోఫవిదారణమ్. 3

గుగ్గిలము, అగసి, హరిదళము, స్వర్ణక్షీరి, పావురపెట్టములు, క్షారవిధ్యధ్యాయములోఁ జెప్పియుండు క్షారౌషధములు, సర్జక్షారము మొదలగు క్షారములు. ఇవి పండిన వాపును పగలగొట్టునట్టి ద్రవ్యములు.

### పూయగర్భవ్రణమునకు పీడనము.

పూయగర్భా నణుద్వారాన్ సోత్సంగాన్మర్మగానపి,
నిస్స్నేహైః పీడనద్రవ్యైస్సమంతాత్ప్రతిపీడయేత్. ౩౮

లోన చీముగలవియు, సూక్ష్మమైన ద్వారములుగలవియు, పొడవుగ మర్మము నాశ్రయించియుండునవియునైన వ్రణములను ఘృతాది స్నేహరహితముగనుండు పీడన ద్రవ్యములచే నలుప్రక్కలయందు పీడింపవలయును.

### ఔషధలేపనక్రమము.

శుష్యంతం సముపేక్షేత ప్రలేపం పీడనం ప్రతి,
నముఖే చైనమాలింపేత్తథాదోషః ప్రసిచ్యతే. ౩౯

వ్రణములకు పీడనార్థము పట్టువేసిన అది యెండునపుడు కడగంజనదు. వ్రణములయొక్క ముఖముపై ఔషధలేపనము చేయంజనదు.

### వ్రణపీడనద్రవ్యములు.

కలాయయవగోధూమమాషముద్గహరేణవః,
ద్రవ్యాణాం పిచ్ఛిలానాం చ త్వఙ్మూలాని ప్రపీడనమ్. ౪౦

చిరుసెనగలు, యవలు, గోధుమలు, ఉద్దులు, పెసలు, రేణుకలు, జిగటగనుండు ద్రవ్యములయొక్కపట్టలు, వేళ్లు ఇవి వ్రణపీడన ద్రవ్యము లనంబడును.

### వ్రణక్షాళనాది కృత్యములయందు ఆరగ్వధాదియోగము.

సప్తసు క్షాళనాద్యేషు సురసారగ్వధాదికౌ,
భృశం దుష్టే వ్రణే యోజ్యౌ మేహకుష్ఠవ్రణేషు చ. ౪౧

దుష్టవ్రణమునకు క్షాళనము, లేపనము, ఘృతము, తైలము, రసక్రియచూర్ణము, వర్తి అను ఏడు కృత్యములను చేయుటయందును ప్రమేహవ్రణమునందును కుష్ఠవ్రణమునందును సురసాదిగణద్రవ్యములను ఆరగ్వధాదిగణద్రవ్యములను విశేషముగ ప్రయోగించవలయును.

### శుద్ధాశుద్ధవ్రణక్షాళనక్రమము.

అథవా క్షాళనం క్వాథః పటోలీనింబపత్త్రజః,
అవిశుద్ధే విశుద్ధే తు న్యగ్రోధాదిత్వగుద్భవః. ౪౨

చేదుపొట్ల, వేపాకు వీనికషాయముతో అశుద్ధవ్రణమును కడిగిన హితము కలుగును. శుద్ధవ్రణమును న్యగ్రోధాది గణద్రవ్యములయొక్క పట్టలకషాయముచే కడగవలయును.

### వ్రణశోధనలేపనము.

పటోలీతిలయష్ట్యాహ్వాత్రివృద్దంతీనిశాద్వయమ్,
నింబపత్రాణి చాలేప స్సపటు ర్వ్రణశోధనః. ౪

చేదుపొట్లాకు, నువ్వులు, అతిమధురము, తెల్లతెగడ, దంతి, పసుపు, మ్రా
పసుపు, వేపాకు వీనిని నూరి అందులో సైంధవలవణము కలిపి లేపనము చేసిన దుష్ట
వ్రణము శుద్ధంబగును.

### సూక్ష్మద్వారవ్రణశోధనక్రమము.

వ్రణాన్విశోధయేద్వర్త్యా సూక్ష్మాస్యాన్ సంధిమార్గగాన్,
కృతయా త్రివృతా దంతీలాంగలీమధుసైంధవైః. ౪

సూక్ష్మమైన ద్వారముగలవియు సంధిమర్మముల నాశ్రయించినవియు నగు వ్ర
ములను తెల్లతెగడ, దంతి, చెన్నచెగ్లగడ్డ, తేనె, సైంధవలవణము వీనితోచేయఁబడి
వత్తిచే శుద్ధిచేయవలయును.

### వాతాధికవ్రణమునకుధూపము.

వాతాభిభూతాన్ సాస్రావాన్ ధూపయేదుగ్రవేదనాన్,
యవాజ్యభూర్జమదనశ్రీవేష్టకసురాహ్వయైః ౪

వాతాధిక్యము, స్రావము, తీవ్రవేదన వీనితోఁ గూడియుండు వ్రణములకు
యవలు, నెయ్యి, భుజపత్రి, మ్రంగ, సర్జరసము, దేవదారు వీనినొకటిగచేర్చి ధూపము
వేయవలయును.

### పిత్తరక్తవ్రణచికిత్స

నిర్వాపయేద్భృశం శీతైః పిత్తరక్తవిషోల్బణాన్,

పిత్తరక్తము, విషము ఇవి అధికముగనుండు వ్రణములను శీతద్రవ్యములచే శమిం
పఁజేయవలయును.

### వ్రణమునకు ఉత్సాదనకర్మ.

శుష్కాల్పమాంసే గంభీరే వ్రణ ఉత్సాదనంహితమ్. ౪

న్యగ్రోధపద్మకాదిభ్యామశ్వగంధాబలాతిలైః,
అద్యాన్మాంసాదమాంసాని విధినోపహితాని చ. ౪
మాంసం మాంసాదమాంసేన వర్ధతే శుద్ధచేతసః,

ఎండినవదియు, మాంసము స్వల్పముగ నుండునదియు గంభీరముగ నుండునదియు నైన వ్రణమునకు న్యగ్రోధాది గణద్రవ్యములు, పద్మకాది గణద్రవ్యములు, పెన్నేరు గడ్డ, చిట్టాముట్టి, నువ్వులు వీనితో ఉత్సాదనము చేయించవలయును. జంతువులను భుజించునట్టి చిరుతపులి మొదలగు జంతువులమాంసమును చక్కగా పాకముచేసి రోగికి యిప్పించవలయును. ఇటుల జేసిన వామాంసముచే రోగిశరీరమునందు మాంసము వృద్ధిజెందును.

## ఉత్సన్నాదివ్రణహరలేపనము.

ఉత్సన్నమృదుమాంసానాం వ్రణానామవసాదనమ్, ౪౮
జాతీముకుళకాసీసమనోహ్వాలపురాగ్నికైః,

ఉత్సన్నముగ, మృదువుగ నుండు మాంసము గల వ్రణములకు జాజిమొగ్గలు, పుష్పకాసీసము, మణిశిల, హారిదళము, గుగ్గిలము, చిత్రమూలము వీనిని లేపనముచేసిన వ్రణము శమించును.

## ఉత్సన్నాదివ్రణములకు క్షారకర్మ.

ఉత్సన్నమాంసాన్ కఠినాన్ కండూయుక్తాంశ్చిరోత్థితాన్. ౪౯
వ్రణాన్ సుదుఃఖశోధ్యాంశ్చ శోధయేత్క్షారకర్మణా,

ఉత్సన్నమైన మాంసముగలవియు, కఠినముగనుండునవియు, దురదతోగూడినవియు, బహుకాలముగడచినవియు, శోధించుట కశక్యముగ నుండునవియునగు వ్రణములను క్షారములచే శుద్ధిజేయవలయును.

## అగ్నికర్మార్హవ్రణములు.

స్రవంతోఽశ్మరిజా మూత్రం యే చాన్యే రక్తవాహినః. ౫౦
ఛిన్నాశ్చ సంధయో యేషాం యథోక్తైర్యే చ శోధనైః;
శోధ్యమానా న శుధ్యంతి శోధ్యాస్సుస్తేఽగ్నికర్మణా. ౫౧
శుద్ధానాం రోపణం యోజ్యముత్సాదాయ యదీరితమ్,

మూత్రమును స్రవించునట్టి అశ్మరీవ్రణము, రక్తములను స్రవింపజేయునట్టి వ్రణము, సంధులు ఛేధింపబడియుండు వ్రణములు పైచెప్పియుండు శోధనౌషధములచే శుద్ధి జేసియు శుద్ధముకాకుండువ్రణములు వీనిని అగ్నికర్మచే శుద్ధిచేయవలయును. ఉత్సాదన కర్మకు జెప్పియుండుద్రవ్యములను శుద్ధవ్రణములు శమించుటకు ప్రయోగించవలయును.

—◉ వ్రణరోపణద్రవ్యములు. ◉—

అశ్వగంధారుహా రోధ్రం కట్ఫలం మధుయష్టికా. ౫-
సమంగా ధాతకీపుష్పం పరమం వ్రణరోపణమ్,

పెన్నేరుగడ్డ, తిప్పతీఁగె, లొద్దుగు, శేవు, అతిమధురము, మంజిష్ఠ, ఆరెపువ్వు ఇవి వ్రణములను మాన్పుటయందు మిక్కిలి శ్రేష్ఠములు.

—◉ మాంసాశ్రితవ్రణహరలేపము. ◉—

అపేతపూతిమాంసానాం మాంసస్థానామరోహతామ్. ౫
కల్కం సంరోహణం కుర్యా త్తిలానాం మధుకాన్వితమ్,

దుర్గంధమాంసములేనిదియు, మాంసము నాశ్రయించి యుండునదియు నగు వ్రణములు శమించకయుండిన వానికి నువ్వులు, అతిమధురము వీనిని నూరి కల్కముచేసి లేపనము చేయవలయును.

—◉ వ్రణశుద్ధ్యాదులకు తిలకల్కము. ◉—

స్నిగ్ధోష్ణతిక్తమధురకషాయత్వా త్స సర్వజిత్. ౫
సక్షౌద్రనింబపత్రాభ్యాం యుక్తస్సంశోధనం పరమ్,
పూర్వాభ్యాం సర్పిషా చాసౌ యుక్తస్స్యాదాశు రోపణః. ౫
తిలవ ద్యవకల్కం తు కేచి దిచ్ఛంతి తద్విదః,

నువ్వులకల్కము స్నిగ్ధముగ, ఉష్ణముగ, చేదుగ, తీపుగ, వగరుగ నుండుటవలన వాతాదిదోషములనన్నిటిని పోఁగొట్టును. మఱియు నానువ్వులకల్కములో తేనెను, వేపాకును చేర్చిన నది వ్రణమును చక్కఁగ శుద్ధిచేయును. తేనె, వేపాకు, ఆవునెయ్యి వీనితో నువ్వులకల్కమును ప్రయోగించిన వ్రణములను కడుశీఘ్రముగ మాన్పును. వ్రణస్వరూపములను తచ్చికిత్సలను చక్కఁగ నెఱిఁగినపండితులు కొందరు నువ్వులకల్కమునలె యవలకల్కముకూడ వ్రణముల నార్చునని చెప్పుచున్నారు.

—◉ రక్తపిత్తాదివ్రణచికిత్స. ◉—

సాస్రపిత్తవిషాగంతుగంభీరాన్ సోష్మణో వ్రణాన్. ౫
క్షీరరోపణభైషజ్యశృతేనాజ్యేన రోపయేత్,
రోపణౌషధసిద్ధేన తైలేన కఫవాతజాన్. ౬

రక్తపిత్తము, విషము వీనివలన జనించినదియు, ఆగంతుకమైనదియు, గంభీరనదియు, ఉష్ణముతోఁగూడినదియు నగు వ్రణములను ఆవుపాలు, పెన్నేరుగడ్డ మొదలగు

వ్రణరోపణద్రవ్యములు వీనితో కాచఁబడిన ఘృతముచే చికిత్సజేయవలయును. కఫవాతజవ్రణములను రోపణద్రవ్యములతో పక్వముచేయఁబడిన తైలముచే చికిత్సజేయ నగును.

—౷ వ్రణములకు సౌరాష్ట్ర్యాదిలేపనము. ౷—

కాశ్మీరోధ్రాభయాసర్జ సిందూరాంజనతుత్థకమ్,
చూర్ణితం తైలమధ్వైర్యుక్తం రోపణముత్తమమ్. ౫౮

తువరిమన్ను, లొద్దుగు, కరక్కాయలు, సర్జక్షారము, సిందూరము, సౌవీరాంజనము, మైలుతుత్తము, ప్రంగ వీనిని చక్కఁగ చూర్ణముచేసి నువ్వులనూనెలో కలిపిన నది వ్రణములయందు శ్రేష్ఠమైనరోపణౌషధము.

—౷ చర్మాశ్రితవ్రణములకు చూర్ణోపయోగము. ౷—

సమానాం స్థిరమాంసానాం త్వక్స్థానాం చూర్ణఇష్యతే,
సమముగ మాంసము గట్టిగనుండునదిగ చర్మము నాశ్రయించినదిగనుండు వ్రణములకు మానుటకై చూర్ణమును ప్రయోగించవలయును.

—౷ చర్మవ్రణములకు కకుభాదిచూర్ణము. ౷—

కకుభోదుంబరాశ్వత్థజంబూకట్ఫలరోధ్రజైః. ౫౯
త్వచమాశు నిగృహ్ణంతి త్వక్చూర్ణైశ్చూర్ణితా వ్రణాః,

మద్ది, మేడి, రావి, నేరేడు, జేగు, లొద్దుగు వీనిపట్టలను చక్కఁగచూర్ణముచేసి వ్రణములకు పైచేసిన శీఘ్రముగ వ్రణములు మానును.

—౷ చర్మశుద్ధికర లాక్షాదిలేపము. ౷—

లాక్షామనోహ్వామంజిష్ఠాహరితాలనిశాద్వయైః. ౬౦
ప్రలేపస్సఘృతక్షౌద్రస్త్వగ్విశుద్ధికరః పరమ్,

లక్క, మణిశిల, మంజిష్ఠ, హరిదళము, పసుపు, మ్రానిపసుపు వీనిని చక్కఁగ నూరి అందులో ఆవునెయ్యి, తేనెకలిపి చర్మమునకు లేపనముచేసిన నది చక్కఁగ శుద్ధియగును.

—౷ సవర్ణకరలేపము. ౷—

కాలీయగలతామ్రాక్షిహేమకాలారసోత్తమైః. ౬౧
లేపస్సగోమయరసస్సవర్ణకరణః పరమ్,

ఫ్రాన్పసుపు, మామిడిపప్పు, నీలియాకు, త్రిఫలములు వీనినినూరి ఆవుపేడరసములోకలిపి వ్రణమునకు పైతేపనముచేసిన వ్రణమునందు శరీరముతో సమానమైనవర్ణము కలుగును.

రోమోత్పత్తికరలేపనము.

దగ్ధోవారణదంతో౽న్తర్ధూమం తైలం రసాంజనమ్. ౬౨
రోమసంజననో లేపస్తద్వత్తైలపరిప్లుతా,
చతుష్పాన్నఖరోమాస్థిత్వక్ఛృంగఖురజామషీ. ౬౩

ఏనుగుదంతములను నిప్పులోకాల్చి యామసిని, రసాంజనమును, నువ్వులనూనెలోకలిపి లేపనముచేసినను, నాలుగుకాళ్లుగల జంతువులయొక్క గోళ్లు, వెండ్రుకలు, ఎముకలు, చర్మము, కొమ్ములు, గిట్టలు వీనినికాల్చి యామసిని నువ్వులనూనెలోకలిపి లేపనముచేసినను వ్రణమూనిన స్థలమున వెండ్రుకలు చక్కగమొలచును.

వ్రణరోగమునందు పథ్యాహారాదులు.

వ్రణిన శ్శస్త్రకర్మోక్తం పథ్యాపథ్యాన్నమాదిశేత్,

వ్రణరోగముగలవారికి పథ్యాపథ్యాహారములను శస్త్రకర్మవిధ్యధ్యాయములో చెప్పియుండునటుల నిర్ణయింపనది.

వాతాదివ్రణములను ప్రక్షాళనాదిద్రవ్యములు.

ద్వే పంచమూలే వర్గశ్చ వాతఘ్నో వాతికే హితః. ౬౪
న్యగ్రోధపద్మకాద్యా తు తద్వత్పిత్తప్రదూషితే,
ఆరగ్వధాదిశ్లేష్మఘ్నః కఫే మిశ్రస్తు మిశ్రకే. ౬౫
ఏభిః ప్రక్షాళనాలేపఘృతతైలరసక్రియాః,
చూర్ణోవర్తిశ్చ సంయోజ్యా వ్రణే సప్త యథాయథమ్. ౬౬

వాతజవ్రణమునందు దశమూలములును వాతహరగణద్రవ్యములును; పిత్తజవ్రణమునందు న్యగ్రోధాదిగణపద్మకాది గణద్రవ్యములును; శ్లేష్మజవ్రణమునందు కఫహరములగు ఆరగ్వధాదిగణద్రవ్యములును హితకరములుగనుండును. కావున పైవాతాదివ్రణములయందు ఆయాదోషమునకు చెప్పియుండుద్రవ్యములచే ప్రక్షాళనము, ఆలేపము, ఘృతము, తైలము, రసక్రియచూర్ణము, వర్తి అను నేడుచికిత్సలను చేయించవలయును. సంసర్గజవ్రణములయందు పైయౌషధములను మిశ్రముచేసి చికిత్సచేయనగును.

### గంభీరాదివ్రణహరఘృతము.

జాతీనింబపటోలపత్రకటుకా దార్వీనిశాసారిబా
మంజిష్ఠాభయసిక్థతుత్థమధుకై ర్నక్తాహ్వ బీజాన్వితైః,
సర్పిస్సాధ్యమనేన సూక్ష్మవదనా మర్మాశ్రితాః క్లేదినో
గంభీరాస్సరుజో వ్రణాస్సగతయశ్శుధ్యంతి రోహంతి చ. ౬౨

జాజియాకు, వేపాకు, చేదుపొట్లాకు, కటుకరోహిణి, మ్రానిపసుపు, పసుపు, నల్లసుగంధిపాల, మంజిష్ఠ, వట్టివేరు, మైనము, మైలుతుత్థము, అతిమధురము, క్రానుగవిత్తులు వీనిని సమముగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలోకలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి ప్రయోగించిన సూక్ష్మమైన రంధ్రములుగలవియు, మర్మముల నాశ్రయించినవియు, క్లేదముతోగూడినవియు, గంభీరములైనవియు, విశేషముగ నొప్పిగలవియు, నానాగతులుగలవియునగు వ్రణములన్నియు శుద్ధంబులై మానును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదియైదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# షడ్వింశాధ్యాయము.

వ్రణవిజ్ఞానీయ ప్రతిషేధాధ్యాయము నిరూపణానంతరము సద్యోవ్రణ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడు చున్నయది —

## సద్యోవ్రణప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో స్సద్యోవ్రణప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

వ్రణవిజ్ఞానీయ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము ప్రహారము మున్నగు నభిఘాతమువలన నపుడే జనించిన వ్రణభేదలక్షణములను వానిచికిత్సలను తెలియఁబఱచు నట్టి సద్యోవ్రణప్రతిషేధము నీయధ్యాయమును వివరించెదము.

### అష్టవిధ సద్యోవ్రణములు

సద్యోవ్రణా యే సహసా సంభవం త్యభిఘాతతః,
అనంతైరపి తైరంగ ముచ్యతే జుష్టమష్టధా. ౧
ఘృష్టావకృత్తవిచ్ఛిన్నప్రవిలంబితపాతితమ్,
విద్ధం భిన్నం విదళితం-

అభిఘాతము వలన ప్రహారాది కారణములు సంభవించినపుడే యతి వేగముతో జనించునట్టి వ్రణములు సద్యోవ్రణము లనఁబడును. అట్టివ్రణములు పలువిధంబులై లెక్కకు నలవిగాక యుండును. అయినను అట్టివ్రణములచే నాక్రమింపఁబడిన శరీరావయవములవిన్యాసభేదములఁబట్టి యావ్రణములు ఎనిమిదివిధములుగనుండును. అయ్యవి ఘృష్టము, అవకృత్తము, ఛిన్నము, ప్రవిలంబితము, పాతితము, విద్ధము, భిన్నము, విదళితము నని యెనిమిది విధములుగ నుండును.

### అష్టవిధ సద్యోవ్రణలక్షణము.

తత్ర ఘృష్టం లసీకయా. ౨
రక్తలేశనవాయుక్తం సప్లోషం ఛేదనా *త్స్రవేత్,
అవగాఢం తతః కృత్తం విచ్ఛిన్నం స్యాత్తతో పి చ. 3

* త్వచః.

ప్రవిలంబి సవేశేష్ఠి పాతితం పతితం తనోః,
సూక్ష్మాస్యం శల్యవిద్ధం తు విద్ధం కోష్ఠవివర్జితమ్. ४
భిన్నమన్యద్విదళితం మజ్జరక్తపరిప్లుతమ్,
ప్రహారపీడనోత్పేషాత్సహాస్థ్నా పృథుతాం గతమ్. ౫

పై అష్టవిధవ్రణములలో ఘృష్టమనునది బరియుటచే దోఁగియున్న వ్రణము, ఆయ్యది లసీక (అనఁగా పులిసీరు)తో గాని స్వల్పరక్తముతోఁ గాని కూడియుండును. అవకృత్తమనునది ఛేదింపఁబడుటవలన కొంచె ముష్ణముగనుండు రక్తస్రావముతోఁ గూడి యుండును. విచ్ఛిన్నమనునది అవకృత్తమునకన్న గాయము లోన తగిలినదిగ నుండును. ఆయుధము మొదలగు వానిచే ఛేదింపఁబడి కొంచెము శరీరముతో నంటుకొని వ్రేలాడు చుండు అస్థులు మొదలగునవి ప్రవిలంబిత మనఁబడును. గాయము వలన తునుకలుగ చేయఁబడి శరీరమునందుండి పడునది పాతిత మనఁబడును. శల్యము తగిలి సూక్ష్మద్వారముతోఁ గూడియుండునది విద్ధ మనఁబడును. ఛేదింపఁబడినది భిన్నమనఁబడును. విశేషముగ నభిఘాతమును జెందుటవలన మజ్జరక్తముతో వ్యాప్తంబై అస్థులవరకు లోన దిగియుండు వ్రణము విదళిత మనఁబడును.

### సద్యోవ్రణచికిత్స.

సద్యస్సద్యోవ్రణం సించేదథ యష్ట్యాహ్వసర్పిషా,
తీవ్రవ్యథం కవోష్ణేన బలాతైలేన వా పునః. ౬

పైచెప్పిన ప్రకారము సద్యోవ్రణ స్వరూపములను తెలిసికొని దారుణమైన శూలతో గూడియుండు సద్యోవ్రణమునకు అపుడే కొంచె ముష్ణముగ నుండు యష్టిమధుక తైలముచే గాని, బలాతైలముచేగాని పలుమారు సేచనము చేయవలయును.

### సద్యోవ్రణమునందు లేపాదులు.

క్షతోష్మణో నిగ్రహార్థం తత్కాలం విసృతస్య చ,
కషాయశీతమధురస్నిగ్ధా లేపాదయో హితాః. ౭

సద్యోవ్రణమునందు అభిఘాతము వలన జనించు శూల శమించుటకును రక్తము బైలువెడలకుండుటకును వగరుగను, శీతముగను, మధురముగను, స్నిగ్ధముగనుండు ద్రవ్యములను నూరి లేపాదులను చేయించవలయును.

### ఆయతసద్యోవ్రణచికిత్స.

సద్యోవ్రణే ష్వాయతేషు సంధానార్థం విశేషతః,
మధుసర్పిశ్చ యుంజీత పిత్తఘ్నీశ్చ హిమాః క్రియాః. ౮

సద్యోవ్రణములు పెద్దవిగనుండినవవి సంధించుటకై (చీలిక లొండొంటకలియుటకై) విశేషముగ తేనెను ఆవునెయ్యిని లేపనము చేయవలయును. మఱియు పిత్తహరములుగ శీతముగనుండు చికిత్సలను చేయవలయును.

### ససంరంభ వ్రణచికిత్స.

ససంరంభేషు కర్తవ్య మూర్ధ్వంచాధశ్చ శోధనమ్,
ఉపవాసో హితం భుక్తం ప్రతతం రక్తమోక్షణమ్. ౯

సద్యోవ్రణములు అధికోపద్రవములతోఁ గూడియుండినచో వమనవిరేచనంబులను లంఘనమును దోషానుగుణముగ చేయించవలయును. మఱియు నాయాయవస్థానుగుణముగ పూర్వోక్తహితాహారములను రక్తమోక్షణమును చేయించవలయును.

### ఘృష్టవిదళితవ్రణచికిత్స.

ఘృష్టే విదళితే చైవ సుతరామిష్యతే విధిః,
తయోర్హ్యల్పం స్రవత్యస్రం పాకస్తేనాశు జాయతే. ౧౦

ఘృష్టము విదళితము అనువ్రణములయందు పైచెప్పినచికిత్సలను విశేషముగచేయవలయును. ఏలయనఁగా ఆవ్రణములయందు రక్తము స్వల్పముగ స్రవించి దానిచే శీఘ్రముగ పాకము కలుగును.

### అధికరక్తస్రావవ్రణచికిత్స.

అత్యర్థమస్రం స్రవతి ప్రాయశోఽన్యత్ర విక్షతే,
తతోఽరక్తక్షయాద్వాయౌ కుపితేఽతిరుజాకరే. ౧౧
స్నేహపానపరీషేకస్వేదలేపోపనాహనమ్,
స్నేహవస్తిం చ కుర్వీత వాతఘ్నౌషధసాధితమ్. ౧౨

విశేషముగ గాయముతగిలి మిక్కిలి రక్తము స్రవించినచో నావ్రణము పాకమును జెందకుండును. అయితే అధికరక్తము వెడలుటవలన వాతము ప్రకోపించి దారుణమైన శూలలను కలుగఁజేయును. కావున దానియందు వాతహరద్రవ్యములతో పక్వము చేయఁబడిన స్నేహపానము, పరిషేకము, స్వేదకర్మ, లేపనము, ఉపనాహస్వేదము, స్నేహవస్తి వీనిని చేయిుంచవలయును.

ఇతి సప్తాహికః ప్రోక్తస్సద్యోవ్రణహితో విధిః,
సప్తాహాద్గతవేగే తు పూర్వోక్తం విధిమాచరేత్. ౧౩

ఇటుల ఏడుదినములవఱకు చేయవలసిన సద్యోవ్రణచికిత్సలు చెప్పఁబడినవి. ఏడుదినములకుపై యావ్రణవేగము తగ్గియుండినచో వ్రణప్రతిషేధాధ్యాయమునందు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

ఘృష్టవ్రణచికిత్స.

ప్రాయస్సామాన్యకర్మేదం; వక్ష్యతే తు పృథక్పృథక్,
ఘృష్టే రుజం నిగృహ్యాశు వ్రణే చూర్ణాని యోజయేత్. ౧౪

ఇటుల సద్యోవ్రణములకు సామాన్యచికిత్సలు బాహుళ్యముగ చెప్పఁబడినవి. ఇఁక ప్రత్యేకముగ వానిచికిత్సలు చెప్పఁబడుచున్నవి. ఘృష్టమనువ్రణమునందు నొప్పిని తొలుత శమింపఁజేసి పిదప చూర్ణములను ప్రయోగించవలయును.

అవకృత్తాదివ్రణచికిత్స.

కల్కాదీన్యవకృత్తే తు; విచ్ఛిన్నప్రవిలంబినోః,
సీవనం విధినోక్తేన బంధనం చానుపీడనమ్. ౧౫

అవకృత్తమను వ్రణమునందు కల్కాదులను ప్రయోగించవలయును. విచ్ఛిన్నము ప్రవిలంబితము అను వ్రణములను ముందు చెప్పఁబడియుండు విధిప్రకారము కుట్టి కట్టుగట్టి పిదప పీడనద్రవ్యములను ప్రయోగించవలయును.

స్ఫుటితనేత్రచికిత్స.

అసాధ్యం స్ఫుటితం నేత్రమదీర్ణం లంబతే తు యత్,
సన్నివేశ్య యథాస్థానమవ్యావిద్ధసిరం భిషక్. ౧౬
పీడయేత్పాణినా పద్మపలాశాంతరితేన తత్,

అభిఘాతమువలన పగిలిపోయిన నేత్రము చికిత్సయందసాధ్యము. నేత్రము పగిలి తునకలుకాక వ్రేలాడుచుండినచో దానిని నిజస్థానమునందుంచి సిరలకు అభిఘాతము కలుగనియ్యక తామరాకుచే మూయఁబడిన చేతితో అణచవలయును.

స్ఫుటితనేత్రమునకు సేచనాదులు.

తతోఽస్య సేచనే నస్యే తర్పణే చ హితం హవిః ౧౭
విపక్వమాజం యష్ట్యాహ్వాజీవకర్షభకోత్పలైః,
సపయస్కైః పరం తద్ధి సర్వనేత్రాభిఘాతజిత్. ౧౮

పిమ్మట అతిమధురము, జీవకము, ఋషభకము, నల్లకలువ వీని కల్కములను ఆవుపాలను మేకనేతిలో కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిని యారోగియొక్క నేత్రములయందు సేచనము, నస్యము, తర్పణము వీనిని చేయించవలయును. ఈఘృతము నేత్రాభిఘాతము లన్నిఁటిని పోఁగొట్టును.

గళపీడావసన్నే క్ష్ణి వమనోత్ క్లేశనక్షవాః,
ప్రాణాయామోఽథ వా కార్యాః క్రియాం చ క్షతనేత్రతత్. ౧౯

కంఠమునందు దెబ్బతగులుటచే నేత్రములకు బాధకలిగినచో వాంతి, తుమ్ము వీనినిగాని ప్రాణాయామమును గాని చేయించి క్షతనేత్రమునకు చెప్పియుండు నటుల చికిత్సలను జేయవలయును.

### స్థానచ్యుతకర్ణచికిత్స.

కర్ణే స్థానాచ్చ్యుతే స్యూతే స్రోతస్తైలేన పూరయేత్,

కర్ణములు అభిఘాతమువలన స్వస్థానము నందుండి జారినచో వానిని సరియైన స్థానములో నుంచి కుట్టి కర్ణద్వారములయందు తైలమును పోయవలయును.

### ఛిన్నకృకాటికాచికిత్స.

కృకాటికాయాం ఛిన్నాయాం నిర్గచ్ఛత్యపి మారుతే. ౨౦
సమం నివేశ్యబధ్నీయాత్స్యూత్వా శీఘ్రం నిరంతరమ్,
ఆజేన సర్పిషా చాత్ర పరిషేకః ప్రశస్యతే. ౨౧
ఉత్తానోఽన్నాని భుంజీత శయీత చ సుయంత్రితః,

ముచ్చిలిగుంట ఛేదింపఁబడి యాద్వారముచే వాతము బైలుఁవెడలుచుండినచో ముచ్చిలిగుంటను సరిగానుంచి కుట్టి గట్టిగ కట్టుకట్టవలయును. పిదప మేకనేతితో ముచ్చిలిగుంటకు పరిషేకమును చేయించవలయును. ఆట్టిరోగముకలవానిని కదలనియ వెలికిల పరుండఁబెట్టి యాహారమును భుజింపఁజేయవలయును.

### శాఖాఘాతచికిత్స.

ఘాతం శాఖాసు తిర్యక్స్థం గాత్రే సమ్యఙ్నివేశితే.
స్యూత్వా వేల్లితబంధేన బధ్నీయాద్ఘనవాససా,
చర్మణా గోఫణాబంధః కార్య శ్చాసంగతే వ్రణే.

హస్తపాదములయందు అడ్డముగ గాయము తగిలినచో నాయంగములను స నుంచి కుట్టి గట్టివస్త్రముతో వేల్లితబంధమును కట్టును కట్టవలయును. వ్రణము పై నుండి చీలిక లొండొంట చేరకయుండినచో చర్మముచే గోఫణాబంధమును కట్టును వలయును.

### భిన్నవృషణచికిత్స.

పాదౌ విళంబి ముష్కస్య ప్రోక్ష్య నేత్రే చ వారిణా,
ప్రవేశ్య వృషణౌ సీవ్యేత్సేవన్యా తున్నసంజ్ఞయా. ౨౪
కార్యశ్చ గోష్ఫణాబంధః కట్యామావేశ్య పట్టకమ్,
స్నేహసేకం న కుర్వీత తత్ర క్లిద్యతి హి వ్రణః. ౨౫

వృషణములు అభిఘాతమువలన నిజస్థానమునందుండిజారి వ్రేలాడుచుండినచో యారోగియొక్క పాదములను నేత్రములను జలముతో తడిపి యావృషణములను సరియైనస్థానములో ప్రవేశింపఁజేసి తున్నమను సేవనిచేకుట్టి నడుమునందు చిన్నపలకనుంచి గోష్ఫణాబంధమను కట్టును కట్టవలయును. స్నేహసేకములను చేయంజనదు; అటులఁజేసిన వ్రణములో స్రావముకలుగును.

### భిన్నవృషణరోపణతైలము.

కాలానుసార్యాగుర్వేలాజాతీచందనపర్పటైః,
శిలాదార్వ్యమృతాతుత్థైస్సిద్ధం తైలం చ రోపణమ్. ౨౬

సరళదేవదారుబంక, అగరుచెక్క, ఏలకులు, జాజిమొగ్గలు, చందనము, పర్పాటకము, మణిశిల, మ్రానిపసుపు, తిప్పతీగె, మైలుతుత్తము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వముచేయఁబడిన తైలమును వృషణములకు లేపనముచేయించిన వ్రణము శమించును.

### భిన్నహస్తపాదచికిత్స.

ఛిన్నాం నిశ్శేషతశ్శాఖాం దగ్ధ్వా తైలేన యుక్తితః,
బధ్నీయాత్కోశబంధేన తతో వ్రణవదాచరేత్. ౨౭

హస్తములుగాని పాదములుగాని రెండువిఱిగినచో వానికి యుక్తితో చక్కఁగ కాచిన నువ్వులనూనెచేకాల్చి కోశబంధమను కట్టునుకట్టి వ్రణమునకు చెప్పియుండు నటుల చికిత్సలను చేయవలయును.

### శిరోభంగచికిత్స.

కార్యా శల్యాహృతే విద్ధే భంగాద్విదళితే క్రియా,
శిరసోఽపహృతే శల్యే వాలవర్తిం ప్రవేశయేత్. ౨౮

మస్తులుంగస్రుతే క్రుద్ధో హన్యాదేనం చలోఽన్యథా,
వ్రణే రోహతి చైకైకం శనైరపనయేత్కచమ్. ౨౯
మస్తులుంగస్రుతౌ భాదేన్మస్తిష్కానన్యజీవజాన్,

ఆయుధాదులచే శిరమునందభిఘాతముకలిగి శల్యము గ్రుచ్చుకొన్నచో విదళిత వ్రణమునకు చెప్పియుండు చికిత్సలనుచేసి పిదప శిరమునుండి శల్యమును వెలిపటిచి శీఘ్రముగవాలవర్తిని (వెండ్రుకలతోగూడినవర్తిని) బ్రవేశింపఁజేయవలయును. అటుల చేయనిచో మెదడునందలి మజ్జస్రవించును. అందువలన వాతము ప్రకోపించి రోగిని జంపును. వ్రణము కొంచెము మానినపిదప ఆవ్రణమునం దంటుకొనియుండు వెండ్రుకల నొకటొకటిగ మెల్లగతీయవలయును. మఱియు మెదడు బైలువెడలినచో యారోగిని ఇతరజంతువుల మెదడును భక్షింపఁజేయవలయును. మెదడు బైలువెడలుటవలన మనుజుఁడు నిస్సంశయముగ మృతిజెందునని తెలిసియుండినను అంత్యశ్వాసమువఱకు రోగికి చికిత్సజేయవలయునని ఆయుర్వేదతంత్రములయందు చెప్పియుండుటవలన నిచట మెదడు బైలువెడలినపిదపకూడ చికిత్సలను తంత్రకారుఁడు చెప్పియున్నాఁడు.

### అంగచ్ఛేదమున స్నేహవర్తి.

శల్యే హృతేఽంగాదన్యస్మాత్స్నేహవర్తిం నిధాపయేత్. ౩౦
శిరముతప్ప తక్కినయంగముల యందు శల్యముతగిలిన నాశల్యమును తీసివేసి యా వ్రణమునందు స్నేహవర్తి నుంచవలయును.

### సూక్ష్మముఖవ్రణచికిత్స.

దూరావగాఢాస్సూక్ష్మాస్యా యే వ్రణాః స్రుతశోణితాః,
సేచయేచ్చక్రతైలేన సూక్ష్మనేత్రార్పితేన తాన్. ౩౧
శరీరమునకు లోపల లోతుగాప్రవేశించియుండునదియు సూక్ష్మమైన ద్వారముకలదియు విశేషముగరక్తమును స్రవింపఁజేయునదియు నగు వ్రణములను సన్నముగనుండుగొట్టములో చక్రతైలమునుబోసి యావ్రణములోపల ప్రవేశింపఁజేసి సేచనము చేయవలయును.

### కోష్ఠభేదోపద్రవములు.

భిన్నే కోష్ఠేఽసృజా పూర్ణే మూర్ఛాహృత్పార్శ్వవేదనాః,
జ్వరో దాహస్తృడాధ్మానం భక్తస్యానభినందనమ్. ౩౨

సంగో విణ్మూత్రమరుతాం శ్వాసః స్వేదో ఽక్షిరక్తతా,
లోహగంధిత్వమాస్యస్య స్యాద్గాత్రే చ విగంధతా. 33

అభిఘాతమువలన కోష్ఠముపగిలి యదిరక్తముచే పూర్ణంబైయుండినచో మూర్ఛ, అొమ్ము నొప్పి, పక్కశూల, జ్వరము, సర్వాంగతాపము, దప్పి, కడుపుబ్బరము, అన్నమునందిచ్ఛలేకుండుట, మలమూత్ర అపానవాతనిరోధులు, శ్వాసము, చెమట, నేత్రములయందు రక్తవర్ణము, నోటియందు దినుపవాసన, శరీరమునందు దుర్గంధము అను నీయుపద్రవములుకలుగును.

ఆమాశయగతరక్తోపద్రవములు.

ఆమాశయస్థే రుధిరే రుధిరం ఛర్దయత్యపి,
ఆధ్మానేనాతిమాత్రేణ శూలేన చ విశస్యతే. 3౪

అభిఘాతమువలన రక్తము ఆమాశయమునజేరియుండినచో రక్తము వమనంబగుట, మిక్కుటముగ కడుపుబ్బరము, దారుణమైన శూలలు ఇవిజనించి పిదప రోగి మరణమును జెందును.

పక్వాశయగత రుధిరోపద్రవములు.

పక్వాశయస్థే రుధిరే సశూలం గౌరవం భవేత్,
నాభేరధస్తాచ్ఛీతత్వం ఖేభ్యో రక్తస్య చాగమః. 3౫

అభిఘాతమువలన రక్తము పక్వాశయమును జేరియుండినచో శరీరమందంతట నొప్పి, గురుత్వము, నాభిక్రిందిభాగమున శైత్యము, నేత్రము మొదలగుయింద్రియద్వారములనుండి రక్తమువెడలుట ఇట్టియుపద్రవములు జనించును.

ఆమపక్వాశయ రక్తప్రవేశక్రమము.

అభిన్నే ప్యాశయస్మూక్ష్మైస్స్రోతోభిరభిపూర్యతే,
అసృజా స్యందమానేన పార్శ్వ మూత్రేణ వస్తివత్. 3౬

అభిఘాతమువలన ఆమాశయపక్వాశయములు భిన్నంబులు కాకుండినను సూక్ష్మముగనుండు స్రోతోమార్గముగ ప్రవహించునట్టి రక్తముచే పైఆమాశయాదులు "మూత్రముచే మూత్రాశయము పూర్ణంబగు చందంబున" పూరింపఁబడును.

అసాధ్యరక్తరోగము.

తత్రాంతర్లోహితం శీతపాదోచ్ఛ్వాసకరాననమ్,
రక్తాక్షం పాండువదనమానద్ధం చ వివర్జయేత్. 3౭

పాదములు, హస్తములు, ముఖము, శ్వాసము అనునవి చల్లగనుండువాఁడును నేత్రములుఎఱ్ఱగ ముఖము తెల్లగనుండువాఁడును, కడుపుబ్బరముకలవాఁడును నగు కోష్ఠవ్రణరోగిని చికిత్సయందు వర్జింపవలయును.

ఆమాశయాదిగతరక్తచికిత్స.

ఆమాశయస్థే వమనం హితం పక్వాశయాశ్రయే,
విరేచనం నిరూహం చ నిస్స్నేహోష్ణైర్విశోధనైః. 38

కోష్ఠాభిఘాతమువలన రక్తమామాశయమునందు జేరియుండినచో వమనమును, పక్వాశయమునందు జేరియుండినచో విరేచనంబును ఘృతాదిస్నేహరహితంబును ఉష్ణమునునైన యౌషధములచే నిరూహవస్తియు చేయించవలయును.

కోష్ఠవ్రణితునికి పథ్యాహారము.

యవకోలకుళుత్థానాం రసైః స్నేహవివర్జితైః,
భుంజీతాన్నం యవాగూం వా పిబేత్సైంధవ సంయుతామ్. 39

కోష్ఠమునం దభిఘాతముకలిగియుండువానికి ఘృతాదిస్నేహములేకుండునదియు; యవలు, రేగు, ఉలవలు వీనితో పక్వముచేయఁబడినదియునగు యవాగులతో నన్నమును భుజింపఁజేయవలయును, లేక సైంధవలవణముచేర్చిన యవాగువునుగాని పానముచేయించవలయును.

అధికరక్తస్రావమునందు రక్తపానము.

అతినిస్సృతరక్తస్తు భిన్నకోష్ఠః పిబేదసృక్,

అభిఘాతములవలన కోష్ఠముపగిలి విశేషముగ రక్తముబైలువెడలి యుండువానికి రక్తపానము చేయించవలయును.

క్లిన్నభిన్నాంత్ర వ్రణాసాధ్యత్వము.

క్లిన్నభిన్నాంత్రభేదేన కోష్ఠభేదో ద్విధా స్మృతః. 40
మూర్ఛాదయో ఽల్పాః ప్రథమే ద్వితీయేత్వతిబాధకాః,
క్లిన్నాంత్ర స్సంశయీ దేహీ భిన్నాంత్రో నైవ జీవతి. 41

క్లిన్నాంత్రము భిన్నాంత్రము అనికోష్ఠభేదములు ద్వివిధంబులు. వానిలో క్లిన్నాంత్రమను కోష్ఠభేదమునను ముందుచెప్పియుండు మూర్ఛాద్యుపద్రవములు కొంచెముగ

నుండును. భిన్నాంత్రమునందు పైమూర్ఛాదులు విశేషముగనుండును. క్లిన్నాంత్రము గలరోగి జీవించుట సందియము. భిన్నాంత్రరోగి నిస్సంశయముగ జచ్చును.

### సాధ్యకోష్ఠభేద లక్షణము.

యథా స్వం మార్గమాపన్నా యస్య విణ్మూత్రమారుతాః,
వ్యుపద్రవస్స భిన్నేఽపి కోష్ఠే జీవత్యసంశయమ్. ౪౨

రోగికి కోష్ఠము పగిలియుండినను మలమూత్రాపానవాతములు నిజమార్గముల వలన వెడలుచు నుపద్రవములు లేకుండిన అట్టిరోగి నిస్సంశయముగ జీవించును.

### అభిన్నాంత్రచికిత్స.

అభిన్నమంత్రం నిష్క్రాంతం ప్రవేశ్యం న త్వతోఽన్యథా,
ఉత్పంగిలశిరోగ్రస్తం తదప్యేకే వదంతి తు. ౪౩

అభిఘాతము వలన ప్రేగులు బైటికి వచ్చియుండినను అవి భిన్నము కాకుండినచో దానిని ముందువలె లోపల ప్రవేశింపఁజేయవలయును. భిన్నమైనయెడల వానిని లోనికి ప్రవేశింపఁ జేయఁజనదు. భిన్నమైయుండినను ప్రేగులను లోన ప్రవేశింపఁజేయవలయు నని కొందరాచార్యులు వచింపుచున్నారు.

### భిన్నాంత్రప్రవేశనక్రమము.

ప్రక్షాళ్య పయసా దిగ్ధం తృణశోణితపాంసుభిః,
ప్రవేశయేత్ క్లృప్తనఖో ఘృతేనాక్తం శనైశ్శనైః. ౪౪

ప్రేగులు అభిఘాతము వలన బైటికివచ్చియుండినచో గోళ్లను తీసికొనియుండు వైద్యుఁడు తృణములు, రక్తము, దుమ్ము వీనితో కప్పఁబడియుండు యాప్రేగులను ఆవు పాలతో చక్కఁగ కడిగి నేతిని పూసి కోష్ఠములోపల మెల్లమెల్లగ ప్రవేశింపఁ జేయ వలయును.

### శుష్కాంత్రప్రవేశనక్రమము.

క్షీరేణార్ద్రీకృతం శుష్కం భూరిసర్పిః పరిప్లుతమ్,
అంగుళ్యా ప్రమృశేత్కంఠం జలేనోద్వేజయేదపి. ౪౫
తథాంత్రాణి విశంత్యంతస్తత్కాలం పీడయంతి చ,

ప్రేగులు బైటికివచ్చి యెండియుండినచో వానిని ఆవుపాలతో తడిపి ఆవునేతినిబూసి వైద్యుఁడు చేతిబొటనవ్రేలితో రోగిగొంతును మెల్లగరుద్దుచు చన్నీళ్లను పైన చిలకరించుచు యాప్రేగులను లోనప్రవేశింపఁ జేయవలయును. ఇటులఁజేసి

ప్రేగులు లోన సులభముగ బ్రవేశించును. అయితే ఆసమయమున రోగికి విశేషపీడ కలుగును.

## అనేకాంత్రప్రవేశనక్రమము.

వ్రణసౌక్ష్మ్యాద్బహుత్వాద్వా కోష్ఠమంత్రమనావిశత్. ४६
తత్ప్రమాణేన జఠరం పాటయిత్వా ప్రవేశయేత్,
యథా స్థానం స్థితే సమ్యగంత్రే సీవ్యేదను వ్రణమ్. ४७
స్థానాదపేతమాదత్తే జీవితం కుపితం చ తత్,
వేష్టయిత్వానుపట్టేన ఘృతేన పరిషేచయేత్. ४८
పాయయేత్తం తతః కోష్ణం * చిత్రాతైలయుతం పయః,
మృదుక్రియార్థం శకృతో వాయోశ్చాధః ప్రవృత్తయే. ४९
అనువర్తేత వర్షం చ యథోక్తాం వ్రణయంత్రణామ్,

వ్రణము సూక్ష్మముగ నుండుటవలనగాని పేగులు అధికముగ నుంటుట వలన గాని యాపేగులు మరల కోష్ఠములో ప్రవేశింపఁజేయుట కసాధ్యముగ నుండినచో ఉదరమును పేగులంత ప్రమాణము ఛేదించి యాపేగులను లోన ప్రవేశింపఁజేసి స్వస్థానములో సరిగానుంచి పిదప ఆవ్రణమును కుట్టవలయును. అటుల చేయనుండిన బైటికి వచ్చియుండు నాపేగులు కుపితంబులై ప్రాణములను పోఁగొట్టును. వ్రణమును కుట్టిన పిదప గట్టిగనుండు వస్త్రఖండముచే చుట్టి ఘృతమును నలుప్రక్కల తడిపి ఎలుకచెవి యాకుతైలము చేర్చఁబడిన యావుపాలను రోగికి సుఖోష్ణముగ పానము చేయించవలయును. మలము అపానవాతము ఇవి అధోమార్గమున చక్కఁగ వెడలుటకై వ్రణరోగములకు చెప్పియుండు పథ్యములను ఒక సంవత్సరము వఱకు అనుసరింపుచుండవలయును.

## బహిర్నిర్గతమేదోవర్తిచికిత్స

ఉదరాన్మేదసోవర్తిం నిర్గతాం భస్మనా మృదా, ५०
అవకీర్య కషాయైర్వా శ్లక్ష్ణైర్మూలైస్తతస్సమమ్,
దృఢం బధ్వా చ సూత్రేణ వర్ధయేత్కుశలోభిషక్. ५१
తీక్ష్ణేనాగ్నిప్రతప్తేన శస్త్రేణ సకృదేవ తు,
స్యాదన్యథా రుగాటోపో మృత్యుర్వా ఛిద్యమానయా. ५२
సక్షౌద్రే చ వ్రణే బద్ధే సుజీర్ణేన్నే ఘృతం పిబేత్,

* దంతి.

క్షీరం వా శర్కరా * చిత్రాలాక్షాగోక్షురకై శ్శృతమ్. ౫౩
రుగ్దాహోజిత్సయస్త్వాహ్వోః వరం పూర్వోదితో విధిః,
మేదోగ్రంథ్యుదితం తత్ర తైలమభ్యంజనే హితమ్. ౫౪

అభిఘాతము వలన మేదోవర్తి కడుపులోనుండి బైటికి వచ్చినచో నావర్తికి బూడిదెనుగాని మట్టినిగాని వగరుగనుండు నోషధులచేళ్ల చూర్ణమును గాని పూసి యామేదోవర్తిమూలమును నూలుతో గట్టిగకట్టి అగ్నిలో కాచబడిన శస్త్రముచే బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు ఒకటే పర్యాయముగ ఛేదింపవలయును. అటుల చేయక వేరు ప్రకారముగ ఛేదించిన అధికముగ నొప్పినిగాని మరణమును గాని కలుగఁజేయును. మఱియు నావ్రణమునకు తేనెను బూసి కట్టుగట్టి శర్కర, ఎలుక చెవియాకు, లక్క, పల్లేరు, అతిమధురము వీనితో కాచఁబడిన యావుపాలనుగాని ఘృతమునుగాని అన్నము జీర్ణమైన పిదప పానము చేయించిన శూల, మంట హరించును. మఱియు ముందు చెప్పఁబడిన వ్రణచికిత్సలను సహితము చేయవలయును. మేదోగ్రంథికి చెప్పియుండు తైలముచే నభ్యంజనము చేయించవలయును.

## సద్యోవ్రణరోపణతైలము.

తాలీసం పద్మకం మాంసీహరేణ్వా గురుచందనమ్,
హారిద్రే పద్మబీజాని సోశీరం మధుకం చ తైః. ౫౫
పక్వం సద్యోవ్రణేషూక్తం తైలం రోపణముత్తమమ్,

తాళిసపత్రి, పద్మకము, జటామాంసి, రేణుకలు, అగరు, చందనము, పసుపు, మ్రానిపసుపు, తామరవిత్తులు, వట్టివేరు, అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వము జేయఁబడిన తైలము సద్యోవ్రణములను శమింపఁ జేయుటయందు మిగుల శ్రేష్ఠమైన దని చెప్పఁబడి యున్నయది.

## గూఢప్రహారాదిచికిత్స.

గూఢప్రహారాభిహతే పతితే విషమోచ్చకైః. ౫౬
కార్యం వాతాస్రజిత్తృప్తిమర్దనాభ్యంజనాదికమ్,

అభిఘాతమువలన లోన గాయముతగిలియుండు వానికిని విషమముగ పడినవానికిని ఉన్నత ప్రదేశమునుండి పడినవానికిని వాతరక్తహరములైన తర్పణము, మర్దనము, అభ్యంజనము మొదలగు చికిత్సలను చేయించవలయును.

* క్షుద్ర.



విశ్లిష్టదేహాదిచికిత్స

విశ్లిష్టదేహంమథితం క్షీణం మర్మాహతాహతమ్. ౫౭
వాసయేత్తైలపూర్ణాయాం ద్రోణ్యాం మాంసరసాశినమ్,

శరీరమునందలి అవయవము విరిగి జారినవానిని విశేషముగ శరీరమునకు లోభాగమునందు గాయము తగిలినవానిని క్షీణించియుండువానిని మర్మములో గాయముతగిలియుండువానిని మాంసరసమును భుజింపఁజేసి వానిని నువ్వులనూనె నింపించిన బానయందుండునట్టుల చేయవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువదియాఱవ అధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# స ప్త విం శా ధ్యా య ము.

సద్యోవ్రణ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము భంగ ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడు చున్నయది:—

## భంగప్రతిషేధాధ్యాయప్రారంభము.

అథాతో భంగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

సద్యోవ్రణ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము విరిగిన యెముకలకు చికిత్సలను తెలియపఱచునట్టి భంగప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### భంగలక్షణము

పాతఘాతాదిభిర్ద్వేధా భంగోఽస్థ్నాం సంధ్యసంధితః,
ప్రసారణాకుంచనయోరశక్తిస్సంధిముక్తతా. ౧
ఇతరస్మిన్ భృశం శోఫస్సర్వావస్థాస్వతివ్యథా,
అశక్తిశ్చేష్టితేఽల్పేఽపి పీడ్యమానే సశబ్దతా. ౨
సమాసాదితి భంగస్య లక్షణం బహుధా తు తత్,
భిద్యతే భంగభేదేన తస్య సర్వస్య సాధనమ్. 3
యథా స్యాదుపయోగాయ తథా తదుపదేక్ష్యతే,

పడుట, అభిఘాతము మొదలగువానివలన నెముకలు విరుగుట భంగమనఁబడును. ఇది సంధిభంగము, అసంధిభంగము అని రెండు విధములుగ నుండును. సంధిభంగమునందు హస్తపాదాదులను జాచుటకును ముడుచుటకును శక్తిలేకుండును. సంధులు జారిపోవును. అసంధిభంగమునందు వాపు సర్వకాలముల యందును విశేషముగ నొప్పి, స్వల్పపనులను చేయుటయందును అశక్తి ఎముకల బిసికిన శబ్దము కలుగుట ఇవి కలిగి యుండును. ఇటుల భంగలక్షణము సంగ్రహముగ చెప్పఁబడినది. మఱియు నాభంగము అనేక భేదములు గలదిగనుండును. అయినను చికిత్స కుపయోగముగ నుండునది మాత్రము నిక చెప్పఁబడును.

## అసాధ్యాస్థి భంగములు

ప్రాజ్యాణుద్ధారి యత్త్వస్థిస్పృష్టే శబ్దం కరోతి యత్. ౪
యత్రాస్థిలేశః ప్రవిశే న్మధ్యమస్థ్నో విదారితః,
భగ్నం యచ్చాభిఘాతేన కించిదేవావశేషితమ్. ౫
ఉన్నమ్యమానం క్షతవద్యచ్చ మజ్జని మజ్జతి,
తద్ధుస్సాధ్యంకృశాశక్తవాతలాల్పాశినామపి. ౬

పలువెరంగుల తునకలై పగిలిన అస్థి, స్పృశించిన శబ్దముతోఁ గూడియుండు అస్థి, అభిఘాతము వలన తునకగా పగిలినయస్థి, విరిగి లోన ప్రవేశించియుండు అస్థి, అభిఘాతముచే చక్కఁగ విరిగి కొంచె మంటికొనియుండు అస్థి, గాయముతగిలియుండు అస్థి, మజ్జలో మునిగియుండు అస్థి, కృశులు, దుర్బలులు, వాతప్రకోపము గలవారు స్వల్పముగ నాహారమును భుజించువారు వీరలకు గలిగియుండు అస్థిభంగము- ఇవి చికిత్సయం దసాధ్యములు.

భిన్నం కపాలం యత్కట్యాం సంధిముక్తం చ్యుతం చ యత్,
జఘనం ప్రతిపిష్టంచ భగ్నం యత్తద్వివర్జయేత్. ౭

నడుమునందలి కపాలమను నస్థి, యభిఘాతముచేఁ గిలినది చికిత్సయందసాధ్యంబు. సంధివిరిగినయస్థి, సంధిలోనుండి జారినయస్థి, అభిఘాతముచే విరిగిన పిఱుదులలోనుండు యస్థి వీనిని చికిత్సయందు వర్జింపవలయును.

అసంశ్లిష్టకపాలం చ లలాటం చూర్ణితం తథా,
యచ్చ భగ్నం భవేచ్ఛంఖశిరః పృష్ఠస్తనాంతరే. ౮

అభిఘాతముచే నుదురు, శిరఃకపాలము వీని సంధిభగ్నంబైనను, శిరఃకపాలము చూర్ణంబైనను ఇవి చికిత్సయం దసాధ్యంబులు. కణతలు, శిరము, వీపు, రొమ్ము వీని యందలి యస్థులు విరిగిన నవియు చికిత్సయం దసాధ్యంబులు.

సమ్యగ్యమితమప్యస్థిదుర్న్యాసాద్దుర్నిబంధనాత్,
సంక్షోభాదపి యద్గచ్ఛేద్విక్రియాం తద్వివర్జయేత్. ౯
ఆదితో యచ్చ దుర్జాతమస్థి సంధిరథాపి వా,

అస్థి చక్కఁగ పైకెత్తఁబడి యుండినను లోన నుంచుటకు శక్యము కాకుండుట వలనను, కట్టుకట్టుట కశక్యంబుగ నుండుటవలనను, సంక్షోభము వలనను వికారమును

జెందునట్టి అస్థులను, జనించునపుడే స్వభావముచే వికారముగ జనించియుండు అస్థిసంఘులను చికిత్సయందు వర్జింపవలయును.

## అసాధ్యతరుణాస్థ్యాది భంగలక్షణము.

తరుణాస్థీని భుజ్యంతే భజ్యంతే నలకాని తు. ౧౦
కపాలాని విభిద్యంతే స్ఫుటం త్యన్యాని భూయసా,

తరుణాస్థులు అభిఘాతమువలన వంకరగ నగును. నళకములను అస్థులు విరుగును. కపాలములను అస్థులు చీల్చఁబడును.శక్కినఅస్థులుపగులును. ఇవి చికిత్సయందు దుస్సాధ్యంబులు.

## అస్థిభంగ చికిత్స.

అథా వనతమున్నమ్య మున్నతం చావపీడయేత్. ౧౧
ఆంఛేదతిక్షి ప్త మధోగతం చోపరి వ ర్తయేత్,
ఆంఛనోత్పీడనోన్నామ చర్మసంక్షేపబంధనైః. ౧౨
సంధీన్ శరీరగాన్ సర్వాన్ చలానప్యచలానపి,
ఇత్యేతైస్థాపనోపాయైస్సమ్యక్సంస్థాప్య నిశ్చలమ్. ౧౩
పట్టైః ప్రభూతసర్పిర్భి ర్వేష్టయిత్వా సుఖై స్తతః,
కదంబోదుంబరాశ్వత్థ సర్జార్జునపలాశజైః. ౧౪
వంశోద్భవై ర్వా పృథుభి స్తనుభిస్సునివేశితైః,
సుశ్లక్ష్ణైస్సుప్రతి స్తంభై ర్వల్కలై శ్శకలై రపి. ౧౫
కుశాహ్వయైస్సమం బంధం పట్టస్యోపరి యోజయేత్,

పై చెప్పినప్రకారము అస్థిభంగములను తెలిసికొని వంగియుండు నస్థిని పైకెత్తవలయును. పైకెత్తఁబడియుండు అస్థినిక్రిందికి త్రోయవలయును. అతి క్షిప్తముగనుండు అస్థిని ఆంఛనము చేయవలయును. క్రిందిభాగమును జేరియుండు అస్థిని పైభాగమునందుంచవలయును. చంచలముగను స్థిరముగను సర్వశరీరము నాశ్రయించి యుండునదిగనుండుసంధులను పై చెప్పినప్రకారము ఆంఛనము ఉత్పీడనము ఉన్నామము సంక్షేప బంధనము మొదలగు స్థాపనోపాయంబులచే చక్కఁగ కదలనీయక ఆయాస్థానముల యందు స్థాపించి నేతిలో చక్కఁగ తడపఁబడిన వస్త్రఖండముచే చుట్టి పిదప విశాలముగ సన్నముగనుండు కడిమి, మేడి, రావి, సర్జ, మద్ది, మోదుగ అనునీ వృక్షముల పట్టలను గాని చెక్కలను గాని నున్నగ సన్నగనుండు వెదురుబద్దలనుగాని ఆవస్త్రముపై నుంచి కుశాఖ్యబంధనము చేయవలయును,

### భగ్నాస్థిబంధనక్రమము.

శిథిలేన హి బంధేన సంధే స్థైర్యం న జాయతే. ౧౬
గాఢేనాతిరుజా దాహపాకశ్వయథుసంభవః,

ఎముక తునియలుగ విరిగినపుడు ఆతునకలరెండిటి నొకటిగజేర్చి కట్టుగట్టునపుడు ఆకట్టువదలుగ నున్నచో అస్థులు రెండుతునకలు నొండొంట కలియదు. మిగుల గట్టిగ గట్టిన విశేషముగ నొప్పిమంట పాకము వాపు కలుగును. కావున సమముగ కట్టవలయును.

### బంధమోక్షణకాలనియమము.

త్ర్యహాత్త్ర్యహాద్భృతౌ ఘర్మే సప్తాహాన్మోక్షయేద్ధిమే. ౧౭
సాధారణే తు పంచాహాద్భంగదోషవశేన వా,

విరిగినయస్థులయొక్క బంధమును ఉష్ణకాలమునందు మూఁడుదినముల కొకపర్యాయమును, శీతకాలమునందు ఏడుదినముల కొకపర్యాయమును, సాధారణకాలములైన శరద్వసంతకాలములో ఐదు దినముల కొకపర్యాయమును కట్టు విప్పవలయును. లేక నాయాయస్థిభంగదోషానుగుణముగ కట్టులను విప్పవలయును.

### భగ్నాస్థిసేచనము.

న్యగ్రోధాదికషాయేణ తత శ్శీతేన సేచయేత్. ౧౮
తం పంచమూలపక్వేన పయసా తు సవేదనమ్,

కట్టువిప్పినపిదప నాసంధికి న్యగ్రోధాదిగణద్రవ్య కషాయమును చల్లార్చి సేచనము చేయించవలయును. ఆసంధిలో నొప్పియుండినచో పంచమూలములతో కాచఁబడిన యావుపాలతో సేచనము చేయించవలయును.

### అస్థిభంగమునకు చక్రతైలోపయోగము.

సుఖోష్ణం వావచార్యం స్యాచ్చక్రతైలం విజానతా. ౧౯
విభజ్య దేశం కాలం చ వాతఘ్నౌషధసంయుతమ్,

సమర్థుఁడైన వైద్యుఁడు దేశకాలభేదములను అవస్థావిశేషములను చక్కఁగ గుర్తెఱిఁగి వాతహరౌషధములతో గూడియుండు చక్రతైలమును ఆరోగికి ప్రయోగించవలయును.

### అస్థిభంగమునందు సేకలేపములు.

ప్రతతం సేకలేపాంశ్చ విదధ్యాద్భృశశీతలాన్. ౨౦

అస్థిభంగరోగములయందు మిగులచల్లనైన సేకలేపముల నెల్లప్పుడు చేయుచుండవలయును.

అస్థిభంగమునందు గృష్టిక్షీరపానము.

గృష్టిక్షీరం ససర్పిష్కం మధురౌషధసాధితమ్,
ప్రాతః ప్రాతః పిబేద్భగ్నశ్శీతలం లాక్షయా యుతమ్. ౨౧

అస్థిభంగముగలమనుజుఁడు తొలియీతనీనిన ఆవుపాలలో మధురౌషధములను జేర్చి చక్కఁగకాచి అందులో ఆవునేతినిబోసి చల్లార్చి లక్కకలిపి పానముచేయవలయును.

సవ్రణభంగచికిత్స.

సవ్రణస్య తు భగ్నస్య వ్రణో మధుఘృతోత్తరైః,
కషాయైః ప్రతిసార్యోఽథ శేషో భంగోదితః క్రమః. ౨౨

అస్థిభంగము వ్రణముతోఁ గూడియుండినచో నావ్రణమునకు తేనె, నెయ్యి అధికముగచేర్చఁబడిన కషాయములచే ప్రతిసారణమును జేయించి భంగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

లంబవ్రణచికిత్స

లంబాని వ్రణమాంసాని ప్రలిప్య మధుసర్పిషా,
సందధీత వ్రణాన్ వైద్యో బంధనైశ్చోపపాదయేత్. ౨౩

అస్థిభంగముగల మనుజునికి వ్రణమునందు మాంసము వ్రేలాడుచుండినచో ఆమాంసమునకు తేనె, నెయ్యిపూసి యొకటిగ చేర్చి సూత్రస్థానములో చెప్పియుండు ప్రకారము కట్టుగట్టవలయును.

లంబవ్రణమునకు అవచూర్ణప్రయోగము.

తాన్ సమాన్ సుస్థితాన్ జ్ఞాత్వా ఫలినీలోధ్రకట్ఫలైః,
సమంగాధాతకీయుక్తైశ్చూర్ణితైరవచూర్ణయేత్. ౨౪
ధాతకీలోధ్రచూర్ణైర్వా రోహంత్యాశు తథా వ్రణాః,

ఇతి భంగ ఉపక్రాంతః.

ఇప్పటివి చికిత్సలు చేయుటచే అస్థులు విరిగియుండు మనుజునియొక్క వ్రణములు స్థిరముగను సమముగను నైనచో ఆవ్రణములు శీఘ్రముగ శమించుటకై ప్రేంకణము, లొద్దుగు, కేకు, మంజిష్ఠ, ఆరె వీనిని చక్కఁగ చూర్ణముచేసి యాచూర్ణమునుగాని ఆరె, లొద్దుగు వీనిచూర్ణమునుగాని యావ్రణమునకుపై పూయవలయును. ఇటుల భంగ చికిత్సలు చెప్పఁబడినవి.

### సుఖసాధ్యవ్రణము.

స్థిరధాత్రోఃఋతౌహిమే. ౨౫
మాంసలస్యాల్పదోషస్య సుసాధ్యో దారుణో ఽన్యథా,

స్థిరధాతువు కలవాఁడును, మాంసపుష్టి కలవాఁడును, దోషము స్వల్పముగ కలిగి యుండువాఁడునునగు మనుజునికి శీతఋతువులయందు జనించిన వ్రణము సుఖసాధ్యముగనుండును. పైఁజెప్పిన లక్షణములకు విరుద్ధముగ నున్నయెడ నావ్రణములు కృచ్ఛ్రసాధ్యములును, అసాధ్యములును నగును.

### భగ్నసంధిస్థైర్యకాల నియమము.

పూర్వమధ్యాంతవయసామేకద్విత్రిగుణైః క్రమాత్. ౨౬
మాసైస్స్థైర్యం భవేత్సంధేర్యథోక్తం భజతో విధిమ్,

పైచెప్పిన భంగ చికిత్సలను విధిప్రకారము చేయించినచో పూర్వవయస్సు గల వారికి ఒక మాసములోను మధ్యవయస్సుగలవారికి రెండు మాసములలోను అపర వయస్సుగలవారికి మూఁడుమాసములలోను సంధులకు స్థైర్యము కలుగును. (విరిగిన యెముకల నతికినస్థలము గట్టి పడునని భావము.)

### కటీభంగాదులయందు శయనక్రమము.

కటీజంఘోరుభగ్నానాం కపాటశయనం హితమ్. ౨౭
యంత్రణార్థం తథా కీలాః పంచకార్యా నిబంధనాః,
జంఘోర్వోః పార్శ్వయోర్ద్వౌద్వౌ తల ఏకశ్చ కీలకః. ౨౮
శ్రోణ్యాం వా పృష్ఠవంశే వా వక్షస్యక్షకయోస్తథా,

నడుము, పిక్కలు, తొడలు వీనియందు భంగము గలవారిని బల్లయందు పరుండఁబెట్టవలయును. వారు కదలక యుండుటకై పిక్కలయందు రెండు కీలకములు తొడల యందు రెండు కీలకములు అరచేతియందు ఒక కీలకము ఇటుల ఐదు కీలకముల నేర్పఱచవలయును. పిఱుదులయందు భంగము గలవాఁరికిని వీపు నడిమియెముక భంగము గల వారికి నిరుప్రక్కల రెండేసి కీలకములను అరచేతియందొక కీలకమును కదలకుండుటకై యేర్పఱచవలయును.

### సంధిభంగచికిత్స.

విమోక్షే భగ్నసంధీనాం విధిమేవం సమాచరేత్. ౨౯

సంధియెముకలు విరిగియుండు వారికి పై చెప్పియుండు ప్రకారము చికిత్సలఁ జేయవలయును.

### చిరవిముక్తసంధిచికిత్స.

సంధీంశ్చిరవిముక్తాం స్తు స్నిగ్ధస్విన్నాన్మృదూకృతాన్,
ఉక్తై ర్విధానై ర్బుద్ధ్యా చ యథా స్వం స్థానమానయేత్. ౩౦

చాలకాలముగ విముక్తసంధులుగల మనుజులకు స్నేహస్వేదకర్మలను చేయించిన సంధులు మృదుత్వము జెందును. మృదుత్వము నొందిన యీసంధులను పై చెప్పినప్రకారము చికిత్సచేయుటచేతను తన బుద్ధిచేతను స్వస్థానమునం దుంచవలయును.

### అసంధిభంగచికిత్స.

అసంధిభగ్నే రూఢే తు విషమోల్బణసాధితే,
ఆపోథ్య భంగం యమయే త్తతో భగ్నవదాచరేత్. ౩౧

సంధులుతప్ప యితరస్థలములయందలి యెముకలకు భంగముకలిగి యవి విషమముగ చికిత్సఁజేయబడి వ్రణముశమించియుండినను బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు ఆభంగమును మరలఛేదించి సరిగా నాయస్థలను, స్వస్థానమందునిచి పైనిచెప్పిన ప్రకారము చికిత్సఁజేయవలెను.

### అస్థిభంగపాకనిషేధము.

భగ్నం నైతి యథా పాకం ప్రయతేత తథా భిషక్,
పక్వమాంససిరాస్నాయుసంధి శ్లేషం న గచ్ఛతి. ౩౨

అస్థులయందలి భంగము పాకము జెందినచో పుండైనచో మాంసము సిరలు స్నాయువులు పక్వములై మరల నొకటితో నొకటి చేరవు కావున నవి పాకమును జెందకుండునటుల వైద్యవరుండు మిగుల ప్రయత్నము చేయవలయును.

### భంగమునందు స్నేహవస్తికర్మలు.

వాతవ్యాధివినిర్దిష్టాన్ స్నేహాన్ భగ్నస్య యోజయేత్,
చతుఃప్రయోగాన్ బల్యాంశ్చ వస్తికర్మ చ శీలయేత్. ౩౩

అస్థిభంగముకలవానికి బలకరముగ వాతవ్యాధికి చెప్పియుండునవిగనుండు స్నేహములను పానవస్య అభ్యంగ అనువాసన వస్తికర్మలయందు ప్రయోగించవలయును. వస్తికర్మ.—

"ప్రాక్స్నేహ ఏకః పంచాంతం"

ఇత్యాది శ్లోకములలో చెప్పియుండు ప్రకారము చేయవలయును.

### అస్థిభంగమునం దాహారము.

శాల్యాజ్యరసదుగ్ధాద్యైః పౌష్టికైరవిదాహిభిః,
మాత్రయోపచరేద్భగ్నం సంధిసంశ్లేషకారిభిః. ౩౪
గ్లానిర్నశస్యతే తస్య సంధివిశ్లేషకృద్ధి సా,

అస్థిభంగముకలవానికి విఱిగినసంధులనొకటిగ జేర్చునవిగ పుష్టికరములుగ విదాహాజీర్ణమును కలుగఁజేయు నవిగనుండు సంబావియ్యము నెయ్యి మాంసరసము పాలు మొదలగువానిని తగినప్రమాణముగ నిప్పించవలయును. మఱియు భంగముగలవానికి బడలిక లేకుండవలయును కలిగినచో సంధులు నొకటిగచేరి యతకవు.

### భగ్నునికి వర్జనీయములు.

లవణం కటుకం క్షారమమ్లం మైథునమాతపమ్. ౩౫
వ్యాయామం చ న సేవేత భగ్నో రూక్షం చ భోజనమ్,

భంగముగలవాఁడు లవణము కారము క్షారము పులుసు మైథునము ఎండ శ్రమకరమైన పనులు రూక్షగనుండుభోజనము వీనిని వర్జింపవలయును.

### గంధతైలము.

కృష్ణాం స్తిలాన్ విరజసో దృఢవస్త్రబద్ధాన్ సప్తక్షపా వహతి వారిణి వాసయేత, సంశోషయేదనుదినం ప్రవిసార్య చైతాన్ క్షీరే తథైవ మధుకక్వథితే చ తోయే. ౩౬
పునరపి పీతపయస్కాం స్తాన్ పూర్వవదేవ శోషితాన్ బాఢమ్, విగతతుషానరజస్కాన్ సంచూర్ణ్య సుచూర్ణితైర్వ్యంజ్యాత్. ౩౭ నలదవాలకలోహితయష్టికానఖమిశిప్లవ కుష్ఠబలాత్రయైః, అగరుచందనకుంకుమసారిబాసరళసర్జరసామరదారుభిః. ౩౮. పద్మకాదిగణోపేతైస్తిలపిష్టం తతశ్చ తత్, సమస్తగంధభైషజ్యసిద్ధదుగ్ధేన పీడయేత్. ౩౯. తైలేయరాస్నాంశుమతీకసేరుకాలానుసారీనతపత్రలోధ్రైః, సక్షీరయుక్తైస్సపయస్య దూర్వైస్తైలం పచేత్తం నళదాదిభిశ్చ. ౪౦. గంధతైల మిదముత్తమ మస్థిస్థైర్యకృజ్జయతి

చాశు వికారాన్, వాతపిత్తజనితా నతివీర్యా న్వ్యాపినోఽపి
వివిధై రుపయోగైః. ౭౧

నిర్మలములైన నల్లనువ్వులను గట్టిగ తెల్లగనుండు వస్త్రములో మూటగట్టి వేగముగ ప్రవహించు నుదకనులో రాత్రియందు నానబెట్టి ప్రాతఃకాలమున నెత్తి ఒకటితోనొకటి అంటనీయక నెరిపి నీడనెండించి మరల రాత్రియందు ముందువలె నానబెట్టవలయును. ఇటుల ఏడుదినములుచేసి పిదప ఆనువ్వులను ఆవుపాలయందును యష్టిమధుకకషాయమునందును జలమునందును పైచెప్పినప్రకారము నానబెట్టవలయును. పిదప ఆనువ్వులనెత్తి చక్కగ నెండించి మరల నావుపాలలో ఏడుదినములు పూర్వము చెప్పినప్రకారము నానబెట్టి చక్కగ నెండ నెండించి పైపొట్టునుతీసివేసి చూర్ణముచేసి అందులో వట్టివేరు, కురువేరు, మంజిష్ట, అతిమధురము, నఖము, సదాప, తుంగముస్తలు, చంగల్వకోష్టు, చిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, బలుసు, అగరుచెక్క, చందనము, కుంకుమపువ్వు, నల్లసుగంధిపాల, సరళదేవదారు, సర్జరసము, దేవదారు, పద్మకాదిగణద్రవ్యములు వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణముచేసి కలిపి కచోరములుమొదలగు సమస్తగంధద్రవ్యములతో కాచబడినయావుపాలలో చేర్చిచక్కగబిసికి దానిలోనుండి నూనెను తీయవలయును.పిదప నానూనెలో ములుగోరింట, దుంపరాష్ణము, ముయ్యాకుపొన్న, తుంగముస్తలు. అడవిమామెన, గ్రంథితగరము, ఆకుపత్రి, లొద్దుగు, గరికె, పైచెప్పినవట్టివేరు మొదలగుద్రవ్యములు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి నాలుగింత లావుపాలుచేర్చి తైలపాకవిధిగ పక్వముచేసినది గంధతైల మనబడును.మిక్కిలి యుత్కృష్టమైనది.అస్థులకు స్థైర్యమునుకలుగజేయును. పానవస్యాదులవలన దారుణమైన వాతపిత్తరోగములను పోగొట్టును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్ర మను
ఇరువదిఏడవయధ్యాయము ముగిసెను.



శ్రీ రస్తు.

# అష్టావింశాధ్యాయము.

అన. భంగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము భంగమును బోలె భగంద్రరవ్రణరూపమైన రోగమును పటంజేసి భగందర నిదానలక్షణ చికిత్సాదుల దెల్పు భగంద ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## భగందరప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాఽతో భగందరప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః

భంగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము భగందరరోగచికిత్సలను తెలియప చునట్టి భగందర ప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

భగందర నిదానలక్షణము.

హస్త్యశ్వపృష్ఠగమనకఠినోత్కటకాసనైః,
అర్శోనిదానాభిహితైరపరైశ్చ నిషేవితైః.
అనిష్టాదృష్టపాకేన సద్యో వా సాధుగర్హణైః,
ప్రాయేణ పిటకాపూర్వో యోఽంగులే ద్వ్యంగులేఽపి వా.
పాయోర్వ్రణోఽన్తర్బాహ్యో వా దుష్టాసృఙ్మాంసగో భవేత్,
వస్తిమూత్రాశయాభ్యాశగతత్వాత్స్యందనాత్మకః.
భగందరస్సః-

ఏనుగు, గుఱ్ఱము వీనిపై నెక్కి విశేషముగ సంచరించుటవలనను కఠినముగ మిట్ట పల్లముగనుండు ఆసనముపై కూర్చుండుటవలనను పూర్వజన్మకృతములైన పాపకర్మ పరిపాకమువలనను అర్శోరోగ నిదానమున చెప్పినకారణముల వలనను అపథ్యకరములైన యాహారవిహారములవలనను పెద్దలనిందించుటవలనను గుదమునకు ఒకటి రెండంగుళముల దూరమున నైనను గుదమునందు లోభాగమున నైనను దుష్టరక్తమాంసములనాశ్రయించి నదిగను రక్తమును స్రవింపఁజేయునదిగను పిటకల ప్రమాణముగల వ్రణము జనించును. ఇది భగందరరోగ మనఁబడును. ఇది వస్తిమూత్రాశయములకు సమీపమునం దుండుట వలన అందెల్లపుడు స్రావముకలుగును.

ఈభగందర మనునది తంత్రాన్తరమున నన్వర్థముగ నిట్లు చెప్పఁబడినది:—"భగం పరిసమన్తాచ్చ గుదంవస్తింతథైవచ, భగవద్దారయే ద్యస్మాత్ తస్మాత్ జ్ఞేయోభగన్దరః" భగమును, వస్తిని, గుదమును పగులదీసి మలమూత్రాదులను బైటవెడలింపఁ జేయుటంజేసి యీవ్రణము భగందరమని చెప్పఁబడును. ఈయర్థము "భగం దారయతీతి, భగందరః" అను వ్యుత్పత్తిచే లభించును.

భగందరోపద్రవములు.

సర్వ శ్చ దారయ త్వక్రియావతః,
భగవస్తిగుదాం స్తేషు దీర్యమాణేషు భూరిభిః. ౪
వాతమూత్రశకృచ్ఛుక్రం ఖైస్సూక్ష్మైర్వమతిక్రమాత్,

పైభగందరరోగము భగము మూత్రాశయము గుదము వీనిని బ్రద్దలు చేయును. దానికి చికిత్సచేయకుండిన భగము మొదలగువానిలో సూక్ష్మములైన అనేక రంధ్రద్వారములు కలిగి ఆమార్గములవలన అపానవాత మలమూత్ర శుక్రములు యెల్లపుడు వెడలుచుండును.

భగందరభేదములు.

దోషైః పృథగ్యుతైః సర్వైరాగంతుస్సోష్టమస్స్మృతః. ౫

వాతజము పిత్తజము శ్లేష్మజము వాతపిత్తజము వాతశ్లేష్మజము పిత్తశ్లేష్మజము సన్నిపాతజము అగంతుకము అని భగందరవ్రణము లెనిమిదివిధములు.

భగందరపిటకా.

అపక్వాం పిటకామాహుః పాకప్రాప్తం భగందరమ్,

పక్వముకాకుండు వాపును పిటకయనియు, పండినవాపును భగందర మనియు పెద్దలు వచింపుచున్నారు.

భగందరకారణపిటకలు.

గూఢమూలాం ససంరంభాం రుగాఢ్యాం రూఢకోపినీమ్. ౬
భగందరకరీం విద్యాత్పిటకాం నత్వతోఽన్యథా,

మూలస్థానము తెలియనిదిగను వాపు, నొప్పి తీవ్రవేగము వీనితోఁ గూడినదిగను నుండు పిటక భగందరవ్రణమును కలుగఁజేయును. పైచెప్పిన గుణములులేకుండునట్టి పిటకలు కేవల పిటకయని చెప్పఁబడును. ఇది భగందరమును కలుగఁజేయ నేరదు.

వాతజభగందర పిటకాలక్షణము.

తత్ర శ్యావారుణాతోదభేదస్ఫురణరుక్కరీ. ౭
పిటకా మారుతాత్.

దుష్టవాతమువలన జనించిన పిటకలు శ్యావవర్ణము కలదిగను రక్తవర్ణము కలదిగను పోట్లు, భేదము, అదురుట, నొప్పి వీనితోఁ గూడినదిగను నుండును.

పిత్తజభగందరపిటకాలక్షణము.

పిత్తాదుష్ట్రగ్రీవావదుచ్ఛ్రితా,
రాగిణీ తనురూష్మాఢ్యా జ్వరధూమాయనాన్వితా. ౮

పిత్తజపిటకలు ఒంటెమెడవలె పొడవుగను, రక్తవర్ణముగలదిగను, సూక్ష్మముగను విశేష ముష్ణముగలదిగను జ్వరముతోఁగూడినదిగను నగును.

కఫజభగందరపిటకాలక్షణము.

స్థిరా స్నిగ్ధా మహామూలా పాండుః కండూమతీ కఫాత్,

కఫమువలన జనించిన పిటకలు నునుపుగను మిక్కిలి లోతులోజనించినదిగను తెల్లగను దురదతోఁ గూడినదిగను నగును.

వాతపిత్తజభగందరపిటకాలక్షణము.

శ్యావా తామ్రా సదాహోషా ఘోరరుగ్వాతపిత్తజా. ౯

వాతపిత్తమువలన జనించిన పిటకలు శ్యావవర్ణముకలదిగను ఎఱ్ఱగను సర్వాంగతాపము మంట దారుణమైన నొప్పి వీనితోఁగూడినదిగను నగును.

కఫవాతజభగందరపిటకాలక్షణము.

పాండురా కించిదాశ్యావా కృచ్ఛ్రపాకా కఫానిలాత్,

కఫవాతమువలన జనించిన పిటకలు కొంచెము శ్యావవర్ణముకలదిగను తెల్లగను కడుకష్టముమీఁద పాకమును జెందునదిగను నుండును.

సన్నిపాతజభగందరపిటకాలక్షణము.

పాదాంగుష్ఠసమా సర్వైర్దోషైర్నానావిధవ్యథా. ౧౦
శూలారోచకతృడ్దాహజ్వరఛర్దిరుపద్రుతా,

త్రిదోషమువలన జనించిన పిటక కాలిబొటనవ్రేలితో సమానాకారము గలదిగను పలువిధములైన యుపద్రవములను కలుగజేయునదిగను నొప్పి, అరోచకము, దప్పి, సర్వాంగతాపము, జ్వరము, వాంతి వీనితోఁ గూడినదిగను నుండును.

భగందరవర్ణనము.

వ్రణతాం యాంతి తాః పక్వాః ప్రమాదాత్-

పైపిటకలకు చికిత్సచేయకుండిన నవి కొంతకాలమునకు పాకమునుజెంది వ్రణంబుగ పరిణమించును.

## శతపోనకభగందరము.

తత్ర వాతజా. ౧౧

దీర్యతేఽణుముఖైశ్ఛిద్రైశ్శతపోనకవత్క్రమాత్,

అచ్ఛం స్రవద్భిరాస్రావమజస్రం ఫేనసంయుతమ్, ౧౨

శతపోనకసంజ్ఞోఽయం.

వాతమువలన జనించిన పిటకలు పక్వమైనయెడల అవిపగిలి జల్లెడవలె ననేక సూక్ష్మద్వారములతోఁగూడి యాద్వారములలోనుండి నురుగుతోడ తేటగ నుండునీరును ఎల్లపుడు స్రవింపఁజేయుచుండును. దీనికి శతపోనకభగందరమని పేరుగలదు.

## ఉష్ట్రగ్రీవభగందరము.

ఉష్ట్రగ్రీవ స్తు పిత్తజః,

పిత్తమువలనజనించిన భగందరము ఉష్ట్రగ్రీవమను పేరంబఱంగు.

## పరిస్రావిభగందరము

బహుపిచ్ఛాపరిస్రావీ పరిస్రావీ కఫోద్భవః. ౧౩

కఫమువలన జనించిన భగందరవ్రణమునందు జిగటగను అధికముగనుండు స్రావము కలిగియుండును. ఇది పరిస్రావియని చెప్పఁబడును.

## పరిక్షేపిభగందరము.

వాతపిత్తాత్పరిక్షేపీ పరిక్షిప్య గుదం గతిః,

జాయతే పరిత స్తత్ర ప్రాకారపరిఖేవ చ. ౧౪

వాతపిత్తమువలన జనించిన భగందర వ్రణమును పరిక్షేపియని చెప్పుదురు. ఇది గుదమునకు చుట్టు ప్రాకారమువలె వ్యాపించియుండును.

## ఋజుభగందరము.

ఋజుర్వాతకఫాదృజ్వ్యా గుదో గత్యా తు దీర్యతే,

వాతకఫమువలన జనించిన భగందరము ఋజువని చెప్పఁబడును. ఇది ఋజుగతిచే గుదమును చీల్చును.

## అర్శోభగందరము.

కఫపిత్తే తు పూర్వోత్థం దుర్నామాశ్రిత్య కుప్యతః. ౧౫

అర్శోమూలే తతశ్శోఫః కండూదాహాదిమాన్భవేత్,
స శీఘ్రంపక్వభిన్నోఽస్య క్లేదయన్మూలమర్శసః. ౧౬
స్రవత్యజస్రం గతిభిరయమర్శోభగందరః,

కఫపిత్తములు పూర్వము చెప్పియుండు అర్శస్సునాశ్రయించి ప్రకోపమును జెందుటవలన అర్శోమూలము నందు దురద, మంట మొదలగు నుపద్రవములు గల వాపు జనించును. ఇది శీఘ్రముగ పాకమును జెంది పగిలి అర్శోమూలమునందు స్రావమును కలుగఁజేయును. దీనియందుగల అనేక ద్వారములలో నుండి యెల్లపుడు స్రావము కలుగును. దీనిని అర్శోభగందర మందురు.

## శంబూకావర్త భగందరము.

సర్వజశ్శంబుకావర్తశ్శంబుకావర్తసన్నిభః. ౧౭
గతయో దారయంత్యస్మి న్రుగ్భేదార్తాతుదైర్గుదమ్,

సన్నిపాతమువలన జనించిన భగందరవ్రణము నత్తగుల్లలోనుండు సుడులవలె నుండును. దీనిని శంబూకావర్తమని చెప్పుదురు. ఇది ద్వారములు గలిగి దారుణమైన శూలలను కలుగఁజేసి గుదమును చీల్చును.

## ఉన్మార్గీభగందరము.

అస్థిలేశోఽభ్యవహృతో మాంసగృధ్యా యదా గుదమ్. ౧౮
క్షిణోతి తిర్యజ్నిర్గచ్ఛన్నున్మార్గం క్షతతో గతిః,
స్యాత్తతః పూయదీర్ణాయాం మాంసకోథేన తత్ర చ. ౧౯
జాయంతే క్రిమయస్తస్య ఖాదంతః పరితో గుదమ్,
విదారయంతి న చిరాదున్మార్గీ క్షతజశ్చ సః. ౨౦

మిక్కిలియాసతో నెముకతునకలతోడ మాంసమును భక్షించినయెడల ఆయెముకలు అడ్డముగ గుదమార్గమునుండి బైలువెడలును. అటుల బైలువెడలుటవలన గుదములో గాయముకలుగును. ఆగాయములో చీముపట్టి మాంసముకుళ్ళి క్రిములు జనించును. ఆ క్రిములు భగందరరోగి గుదమునుభక్షించుచు విశేషముగ బాధలను కలుగఁజేయుచు గుదమును నలుపక్కల చీల్చును. ఈభగందరము ఉన్మార్గియనియు, క్షతజమనియు చెప్పఁబడును.

## భగందరవ్రణశూలాదిజ్ఞానము.

తేషు రుగ్దాహకండ్వాదీన్వింద్యాద్వ్రణనిషేధతః,

పైత్తికభగంధరములయందు దాయాప్రణమునుబట్టి శూల, మంట, దురద మొదలగు లక్షణములను తెలిసికొనవలయును.

సాధ్యాసాధ్య భగందరములు.

షట్కృచ్ఛ్రసాధనాస్తేషాం నిచయక్షతజౌ త్యజేత్. ౨౧
ప్రవాహినీం వలీం ప్రాప్తం సేవనీం వా సమాశ్రితమ్,

పైభగందరరోగములలో వాతజము, పిత్తజము, శ్లేష్మజము, వాతపిత్తజము, వాతశ్లేష్మజము, పిత్తశ్లేష్మజము అను ఆరుభేదములు కష్టసాధ్యంబులు. సన్నిపాతజము, క్షతజము, ప్రవాహిని వీని నాశ్రయించియుండు భగందరరోగములు సేవనీనాడిని ఆశ్రయించియుండు భగందరరోగము ఇవి అసాధ్యంబులు. కావున వీనికి చికిత్స చేయం జనదు.

భగందర చికిత్సాక్రమము.

అథాస్య పిటకామేవ తథా యత్నాదుపాచరేత్. ౨౨
శుద్ధ్యస్సృక్స్రుతిసేకాద్యైర్యథా పాకం న గచ్ఛతి,

భగందరము పిటికావస్థను జెందియుండునపుడే అయ్యది పాకమును జెందకుండునటుల వమనవిరేచన రూపశుద్ధి కర్మలచేతను, రక్తమోక్షణము చేతను, సేకాదులచేతను చికిత్స చేయవలెను.

భగందరమునకు స్నేహాకర్మాదులు

పాకే పునరుపస్నిగ్ధం స్వేదితం చావగాహతః. ౨౩
యంత్రయిత్వార్శసమివ సమ్యక్పశ్యేద్భగందరమ్,
అర్వాచీనం పరాచీనమంతర్ముఖబహిర్ముఖమ్. ౨౪

భగందర పిటకలు పాకమును జెందియుండినచో దానిని స్నేహకర్మ అవగాహన స్వేదము వీనిని చేయించి అర్శోరోగమును ఛేదించునటుల ఛేదించి అర్వాఙ్ముఖముగ నున్నదా? పరాఙ్ముఖముగ నున్నదా? అంతర్ముఖముగ నున్నదా? బహిర్ముఖముగ నున్నదా? అని చక్కగ నిశ్చయించుకొనవలయును.

అంతర్ముఖాది భగందరచికిత్స.

అథాంతర్ముఖమేషిత్వా సమ్యక్ఛస్త్రేణ పాటయేత్,
బహిర్ముఖం చ నిశ్శేషం తతః క్షారేణ సాధయేత్. ౨౫
అగ్నినా వా భిషక్సాధు క్షారేణైవోష్ట్రకంధరమ్,

పిదప అంతర్ముఖముగనుండు భగందరమును ఏషిణియను యంత్రముచే చక్కఁగజూచి శస్త్రముచే ఛేదింపవలయును. బహిర్ముఖముగ నుండు భగందరమును శస్త్రముచే నిశ్శేషముగ ఛేదించి క్షారకర్మచేత గాని దాహకర్మచేత గాని చక్కఁగ చికిత్స చేయవలయును. ఉష్ట్రగ్రీవమను భగందరమును క్షారకర్మచేత మాత్రము చక్కఁగ చికిత్స చేయవలెను.

### శతపోనకచికిత్స.

నాడీరేకాంతరాః కృత్వా పాటయేచ్ఛతపోనకమ్. ౨౬
తాసు రూఢాసు శేషాశ్చ మృత్యుర్భిన్నైర్గుదే ఽన్యథా,

శతపోనకమను భగందరరోగమునం దొకనాడిని తొలుత శస్త్రముచే ఛేదించి యావ్రణము శమించినపిదప తక్కిన నాడుల నొక్కొకటిగ క్రమముగ ఛేదించి చికిత్స చేయవలెను. ఇటులఁ జేయక యొకటేపర్యాయ మన్నినాడులను ఛేదించిన యెడల రోగి మృతిజెందును.

### పరిక్షేపిచికిత్స.

పరిక్షేపిణి చాప్యేవం నాడ్యన్తైః క్షారసూత్రకైః. ౨౭

పరిక్షేపి యను భగందరరోగమునందు శతపోనకరోగమునకు చెప్పియుండునటుల చికిత్సచేయవలయును.

### అర్శోభగందరచికిత్స.

అర్శోభగందరే పూర్వమర్శాంసి ప్రతిసాధయేత్,
త్యక్తోపచర్యః క్షతజశ్శల్యం శల్యవత స్తతః. ౨౮
ఆహరేచ్చ తథా దద్యాత్క్రిమిఘ్నం లేపభోజనమ్,
పిండనాడ్యాదయస్స్వేదాస్సుస్నిగ్ధా రుజి పూజితాః. ౨౯

అర్శోభగందర రోగమున అర్శస్సులకు తొలుత చికిత్సచేయవలయును. క్షతజ భగందరరోగమును చికిత్సయందు వర్జింపవలయును. శల్యముతోఁ గూడియుండు క్షతజ భగందరరోగమున శల్యమును తీసివేసి క్రిములను పోఁగొట్టునట్టి లేపన భోజనములను చేయించవలయును. నొప్పి విశేషముగ కలిగియుండినచో మిగుల స్నిగ్ధముగనుండు పిండస్వేదనాదులను చేయించవలయును.

### బహుచ్ఛిద్ర భగందరచికిత్స.

సర్వత్ర చ బహుచ్ఛిద్రే ఛేదానాలోచ్య యోజయేత్,
గోతీర్థసర్వతోభద్రదళలాంగలలాంగలాః. 30

అనేకద్వారములతోఁ గూడియుండు భగందరరోగమునందు చక్కఁగ పర్యాలోచించి ఇఁక చెప్పఁబోయెడు గోతీర్థము, సర్వతోభద్రము, అర్ధలాంగలము లాంగలము అను నాల్గువిధములైన ఛేదములను చేయవలయును.

### గోతీర్థాదిచ్ఛేదలక్షణము.

పార్శ్వంగతేన శస్త్రేణ ఛేదో గోతీర్థకోమతః,
సర్వత స్సర్వతోభద్రః పార్శ్వచ్ఛేదోఽర్ధలాంగలః.　　　31
పార్శ్వద్వయే లాంగలకః.

శస్త్రముచేత వ్రణముయొక్క పార్శ్వమున వ్రణమును ఛేదించుట గోతీర్థకమనియు, నలుప్రక్కలను ఛేదించుట సర్వతోభద్రమనియు, ఒకపార్శ్వమును ఛేదించుట అర్ధలాంగలమనియు, ఇరుపార్శ్వములను ఛేదించుట లాంగలక మనియు మహర్షులు చెప్పుదురు, ఇటుల గోతీర్థాది నాల్గువిధఛేదములను తెలిసికొనవలయును.

### భగంధరమునకు అగ్నికర్మ.

సమస్తాంశ్చాగ్నినా దహేత్,
ఆస్రావమార్గాన్నిశ్శేషా న్నైవం వికురుతే పునః.　　　32

భగందరవ్రణమునందలి రక్తాదులను స్రవింపఁజేయునట్టి ద్వారముల నన్నిఁటిని నిశ్శేషముగ నిప్పుచే కాల్చినచో నావ్రణము మరల వికారమును బొందకుండును.

### భగందరరోగికి కోష్ఠశుద్ధి.

యతేత కోష్ఠశుద్ధౌ చ భిషక్తస్యాంతరాంతరా,

భగందరరోగికి చికిత్సచేయునపుడు పలుమాఱు అప్పుడప్పుడు కోష్ఠశుద్ధిని చేయించవలయును.

### భగందరవ్రణలేపము.

లేపో వ్రణే బిడాలాస్థి త్రిఫలారసకల్కితమ్.　　　33

భగందరవ్రణముకలవారికి పిల్లియెముకలను త్రిఫలరసముతో నూరి కల్కముచేసి లేపనముచేసిన హితముకలుగును.

### భగందరములకు జ్యోతిష్మత్యాదితైలము.

జ్యోతిష్మతీమలయులాంగలిశేలుపాఠా
కుంభాగ్ని సర్జకరవీరవచాసుధార్కైః,

అభ్యంజనాయ విపచేత్ భగందరాణాం
తైలంవదంతి పరమం హితమేతదేషామ్. 34

జ్యోతిష్మతి (మాల్కంగిని), బ్రహ్మమేడి, చన్నచర్లగడ్డ, వీరి, చిరుబొద్ది, తెల్లతెగడ, చిత్రమూలము, పేగిస, గన్నేరు, వస, జెముడు, జిల్లేడు వీనిని సమభాగములుగచేర్చి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వముచేసి ఆతైలముచే భగంధరరోగులకు అభ్యంజనము చేయించిన మిక్కిలి హితకరముగనుండునని ఋషులు వచించెదరు.

భగందరమునకు యష్టిమధుకతైలము.

మధుకరోధ్రకణాత్రుటిరేణుకాద్విరజనీఫలినీపటుసారివాః,
కమలకేసరపద్మకధాతకీమదనసర్జరసామయరోధ్రకాః. 35
సబీజపూరచ్ఛదనైరేభిస్తైలం విపాచితమ్,
భగందరాపచీకుష్ఠమధుమేహవ్రణాపహమ్. 36

అతిమధురము, లొద్దుగు, పిప్పళ్లు, పిన్నయేలకులు, రేణుకలు, పసుపు, మ్రానిపసుపు, ప్రేంకణము, సైంధవలవణము, నల్లసుగంధిపాల, తామరకేసరములు, పద్మకము, ఆరెపువ్వు, మ్రంగ, సర్జరసము, చెంగల్వకోష్టు, ఎఱ్ఱలొద్దుగు, మాదీఫలపుచెట్టుయాకు వీనిని సమభాగములుగచేర్చి కల్కముచేసి నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వము చేయఁబడినతైలము భగందరము, అపచి, కుష్ఠము, మధుమేహము ఈవ్రణములను పోఁగొట్టును.

భగందరములకు విడంగసారాదిచూర్ణము.

మధుతైలయుతా విడంగసారత్రిఫలామాగధికాకణాశ్చ లీఢాః,
క్రిమికుష్ఠభగందరప్రమేహక్షతనాడీవ్రణరోహణా భవంతి. 37

వాయువిడంగసారము, త్రిఫలములు, పిప్పళ్లు, జీలకఱ్ఱ వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి తేనె, నువ్వులనూనె వీనిలో కలిపి నాకించిన క్రిములు, కుష్ఠు, భగందరము, ప్రమేహము, నాడీవ్రణము మొదలగువ్రణములు హరించును.

భగందరమునకు అమృతాదిచూర్ణము.

అమృతాత్రుటివేల్లవత్సకం కలిపథ్యామలకాని గుగ్గులుః,
క్రమవృద్ధమిదం మధుద్రుతం పిటకాస్థౌల్యభగందరాన్ జయేత్.

మాగధికాగ్నికలింగవిడంగైర్భల్లాతఘృతైస్సవరాపలషట్కైః,
గుగ్గులునా సదృశేన సమేతైః క్షౌద్రయుతైస్సకలామయనాశః.

తిప్పతీఁగె, పిన్నయేలకులు, వాయువిడంగములు, కొడిసె, కరక, తాండ్ర, యుసిరికలు, గుగ్గిలము వీనిని క్రమముగ నొకదానికంటె నొకటిని ఒక్కొకభాగముచొప్పున హెచ్చించి చూర్ణముచేసి తేనెలో కలిపి నాకించిన పిటకలు, స్థౌల్యరోగము, భగందరము ఇవిహరించును. మఱియు పిప్పళ్లు, చిత్రమూలము, కొడిసెవిత్తులు, వాయువిడంగములు, నూరేడు, ఆవునెయ్యి ఇవి ప్రత్యేక మొక్కొకపలము, త్రిఫలము లారుపలములు, వీనికన్నిఁటికి సమము గుగ్గిలము ఇటుల నొకటిగచేర్చి చూర్ణముచేసి తేనెలో కలిపి మాత్రగనిచ్చించిన సకలరోగములు హరించును.

## స్వాయంభువగుగ్గులు.

గుగ్గులుపంచపలం పలికాంశా మాగధికా త్రిఫలా చ
పృథక్స్యాత్, త్వక్త్రుటికర్షయుతం మధులీఢం కుష్ఠభగందర
గుల్మగతిఘ్నమ్. ౪౦

గుగ్గిలము ఐదుపలములు, పిప్పళ్లు, త్రిఫలములు ఇవి దినుసుకొక్కొకపలము, లవంగపట్ట ఒకకర్షము, ఏలకులు ఒకకర్షము ఇటుల వీనినొకటిగచేర్చి చక్కఁగ చూర్ణముచేసి తేనెలోకలిపి నాకించిన కుష్ఠము, భగందరము, గుల్మము హరించును.

## భగందరమునకు శృంగిబేరాదిచూర్ణము.

శృంగిబేరరజోయుక్తం తదేవ చ సుభావితమ్,
క్వాథేన దశమూలస్య విశేషాద్వాతరోగజిత్. ౪౧

పైచెప్పిన గుగ్గుల్వాదిద్రవ్యచూర్ణములలో శుంఠిచూర్ణమును చేర్చి దశమూలకషాయములో భావనచేసి యిచ్చించిన భగందరరోగము, వాతరోగము ఇవి నిశ్శేషముగ హరించును.

## భగందరమునకు త్రిఫలాదిచూర్ణము.

ఉత్తమాఖదిరసారజం రజశ్శీలయన్నసనవారిభావితమ్,
హంతితుల్యమహిషాఖ్యమాక్షికం కుష్ఠమేహపిటకాభగందరాన్.

త్రిఫలములు, చంద్రబంక (కాచు), వీనిని చక్కఁగ చూర్ణముచేసి నేగిసకషాయములో భావనచేసి దానికి సమముగ మహిసాక్షి, గుగ్గిలమును చేర్చి యిచ్చించిన కుష్ఠము, మేహపిటకలు, భగంధరము హరించును.

భగందరే ష్వేష విశేష ఉక్తశ్శైషాణి తు వ్యంజనసాదనాని,
వ్రణాధికారా త్పరిశీలనాచ్చ సమ్యగ్విది త్వౌషధికం విదధ్యాత్.

ఇటుల భగందరరోగములకు విశేషముగ చికిత్సలు చెప్పఁబడినవి. తక్కిన వ్రణములన్నియు సుఖసాధ్యములు. కావున వానికనుగుణముగ వానిలక్షణములను చికిత్సలను చక్కఁగ పర్యాలోచించి చికిత్సలను చేయవలయును.

### భగందరరోగికి వర్జనీయములు.

అశ్వపృష్ఠగమనం చలరోధం మద్యమైథున మజీర్ణమసాత్మ్యమ్,
సాహసాని వివిధాని చ రూఢే వత్సరం పరిహరేదధికం వా. ౪౪

భగందరరోగి వ్రణము శమించియుండినను గుఱ్ఱము నెక్కుట, అపానవాతము నడ్డగించుట, మద్యమును త్రాఁగుట, సంభోగముచేయుట, అజీర్ణకారిగను, అసాత్మ్యముగనుండు నాహారములను భుజించుట, పలువిధములైన సాహసకృత్యములను జేయుట వీనిని ఒకసంవత్సరమువరకు వర్జింపవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ఇరువది ఎనిమిదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# ఏకోనత్రింశాధ్యాయము.

అవ. భగందర ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము గ్రంథ్యర్బుద శ్లీపదాపచీ నాడీవిజ్ఞానాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీ విజ్ఞానాధ్యాయప్రారంభము.

సూ. అథాతో గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

భగందరప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము గ్రంథి, అర్బుదము, శ్లీపదము, అపచి, నాడీవ్రణము వీనిలక్షణభేదములను తెలియఁజేయు గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

### గ్రంథిలక్షణము.

కఫప్రదానాః కుర్వంతి మేదోమాంసాస్రగా మలాః,
వృత్తోన్నతం యం శ్వయథుం స గ్రంథిర్గ్రథనాత్స్మృతః. ౧

మేదస్సు, మాంసము, రక్తము వీనినాశ్రయించినవిగను కఫాధిక్యముతోఁ గూడినవిగనునుండు వాతాదిదోషములు గుండ్రముగ పొడవుగనుండువాపును కలుగఁజేయును. ఇది యొంటగనుండుటవలన గ్రంథియని చెప్పఁబడును.

### గ్రంథిభేదములు.

దోషాస్రమాంసమేదోస్థిసిరా వ్రణభవా నవ,

పైగ్రంథులు వాతజము, పిత్తజము, శ్లేష్మజము, రక్తజము, మాంసజము, మేదోజము, అస్థిజము, సిరాజము, వ్రణజము నని తొమ్మిదివిధములుగ నుండును.

### వాతజగ్రంథిలక్షణము.

తే తత్ర వాతాదాయామతోదభేదాన్వితోఽసితః. ౨
స్థానాత్స్థానాంతరగతిరకస్మాద్ధానివృద్ధిమాన్,
మృదు ర్బస్తి రివానద్ధో విభిన్నోఽచ్ఛం స్రవత్యసృక్. ౩

వాతమువలన జనించిన గ్రంథి నిడివిగ పోట్లు, పగులదీయునటుల నొప్పి వీని తోఁగూడినదిగ, నల్లగ, ఒకచోటునుండి మఱియొకచోటికి పోవునదిగ, అకస్మాత్తుగ తనంతనే యొకపుడు క్షయించునదిగ మఱియొకపుడు వృద్ధిజెందునదిగనుండును. ఇది పగిలినయెడల నందుండి రక్తము తేటగస్రవించును.

## పిత్తజగ్రంథిలక్షణము.

పిత్తాత్సదాహః పీతాభో రక్తో వా పచ్యతే ద్రుతమ్,
భిన్నోఽస్రముష్ణం స్రవతి-

పిత్తమువలన జనించినగ్రంథి, మంటతోఁగూడి పసుపువర్ణముగగాని, ఎఱుపు వర్ణముగ గాని యుండును. త్వరలో పాకమునుజెందును. ఇదిపగిలిన రక్తముష్ణముగ స్రవించును.

## కఫజగ్రంథిలక్షణము.

శ్లేష్మణా నీరుజో ఘనః. ౪
శీత స్సవర్ణః కండూమాన్ పక్వః పూయం స్రవేద్ఘనమ్,

శ్లేష్మమువలన జనించిన గ్రంథి నొప్పిలేనిదిగ, శీతముగ, తెల్లగ,దురదతోఁగూడినదిగ నుండును. ఇది పక్వమైనయెడల చీము గట్టిగస్రవించును.

## రక్తజగ్రంథిలక్షణము.

దోషైర్దుష్టేఽసృజి గ్రంథిర్భవేన్మూర్ఛత్సు జంతుషు. ౫
సిరామాంసం చ సంశ్రిత్య సస్వాపః పిత్తలక్షణః.

వాతాదిదోషములచే దుష్టమైన రక్తము గ్రంథిని జనింపఁజేయును. ఆగ్రంథిలో క్రిములు వృద్ధిజెందుటవలన సిరామాంసములయందు స్పర్శజ్ఞానరహితమైన వాపుజనించును. దీనియందు పిత్తజగ్రంథికి చెప్పిన లక్షణములుండును.

## మాంసజగ్రంథిలక్షణము.

మాంసలైర్దూషితం మాంసమాహారైర్గ్రంథిమావహేత్. ౬
స్నిగ్ధం మహాంతం కఠినం సిరానద్ధం కఫాకృతిమ్,

మాంసవృద్ధికరములైన అహారములను భుజించుటవలన మాంసము దుష్టమై స్నిగ్ధముగను పెద్దదిగను కఠినముగను సిరలతో వ్యాపించినదిగను కఫాకారముగలదిగను నుండు గ్రంథికలుగును.

## మేదోజగ్రంథిలక్షణము.

ప్రవృద్ధం మేదురైర్మేదో నీతం మాంసేఽథవా త్వచి. ౭
వాయునా కురుతే గ్రంథిం భృశం స్నిగ్ధం మృదుం చలమ్,
శ్లేష్మతుల్యాకృతిం దేహక్షయవృద్ధిక్షయోదయమ్. ౮
స విభిన్నో ఘనం మేదస్తామ్రాసితసితం స్రవేత్,

మేదోవృద్ధికరములగు నాహారములను భుజించుటవలన మేదస్సు మిక్కుటముగ వృద్ధిజెంది వాతముచే మాంసమునందుగాని చర్మమునందుగాని కొనిపోఁబడినదై మేదస్సు గ్రంథిని కలుగఁజేయును. ఇది మిగులస్నిగ్ధముగ మృదువుగ చలించునదిగ శ్లేష్మముతో తుల్యాకారముగలదిగనుండును. దేహముక్షయించిన క్షయమును, వృద్ధిజెందిన వృద్ధిని జెందును. దీనిని మేదోగ్రంథి యని చెప్పుదురు ఇదిపగిలినచో అందుండి గట్టిగ ఎఱ్ఱగ, లేక తెల్లగ నల్లగనుండు మేదస్సు స్రవించును.

## అస్థిగ్రంథిలక్షణము.

అస్థిభంగాభిఘాతాభ్యామున్నతావనతం తు యత్. ౯
సోఽస్థిగ్రంథిః-

అస్థులు విరుగుటవలనగాని అస్థులయం దభిఘాతముకలుగుటవలన గాని అస్థులు పొడవుగ లేక పల్లముగనగును. ఇది అస్థిగ్రంథియనఁబడును.

## సిరాగ్రంథిలక్షణము.

పదాతేస్తు సహసాంభోఽవగాహనాత్,
వ్యాయామాద్వా ప్రతాంతస్య సిరాజాలం సశోణితమ్. ౧౦
వాయుస్సంపీడ్య సంకోచ్య వక్రీకృత్య విశోష్య చ,
నిస్ఫురం నీరుజం గ్రంథిం కురుతే స సిరాహ్వయః. ౧౧

బహుమారమార్గమునడచి తత్క్షణమే చన్నీళ్లయందు మునుఁగుటవలనగాని శ్రమకరమైన పనులనుచేయుటచే బడలికను చెందుటవలనగాని ప్రకోపించిన వాతము రక్తముతోఁగూడిన సిరలను నొప్పికలుగఁజేయుటయేగాక వానిని చిన్నవిగను వంకరగను శుష్కించినవిగను జేసి నొప్పి చలనము లేని గ్రంథులను కలుగఁజేయును. ఇది సిరాగ్రంథియనఁబడును.

## వ్రణగ్రంథిలక్షణము.

అరూఢే రూఢమాత్రే వా వ్రణే సర్వరసాశినః,

సార్ద్రే వా బంధరహితే గాత్రేఽశ్మాభిహతేఽథ వా. ౧౨
వాతోఽస్రమస్రుతం దుష్టం సంశోష్య గ్రథితం వ్రణమ్,
కుర్యాత్సదాహః కండూమాన్ వ్రణగ్రంథిరయం స్మృతః. ౧౩

వ్రణము మానకయుండునపుడు గాని మానినతోడనే గాని మధురామ్లాది రసములను భుజించినను, వ్రణము పచ్చిగనుండి కట్టుకట్టకుండినను, లేక శరీరమునందు రాతిచే గాయము తగిలినను, వాతము ప్రకోపించి దుష్టరక్తమును వెడలింపక శుష్కింపఁజేసి గ్రంథిని కలుగఁజేయును. ఇది సర్వాంగతాపము దురద వీనితోఁ గూడియుండును. దీనిని వ్రణగ్రంథి యని మహర్షులు చెప్పెదరు.

### సాధ్యాసాధ్యగ్రంథిలక్షణము.

సాధ్యా దోషాస్రమేదోజా నతు స్థూలఖరాశ్చలాః,
మర్మకంఠోదరస్థాశ్చ-

వాతాదిదోషములచే జనించిన గ్రంథులును రక్తజ మేదోజగ్రంథులును సుఖసాధ్యంబులు. లావుగను కఠినముగను చంచలముగను మర్మస్థానము కంఠము ఉదరము వీనిలో జనించినవిగనుండు గ్రంథు లసాధ్యంబులు.

### అర్బుదరోగభేదములు.

మహత్తు గ్రంథితోఽర్బుదమ్. ౧౪
తల్లక్షణం తు మేదోఽన్తైః షోఢా దోషాదిభి స్తు తత్,
ప్రాయో మేదః కఫాఢ్యత్వాత్ స్థిరత్వాచ్చ న పచ్యతే. ౧౫

గ్రంథికన్న పెద్దదిగనుండునది యర్బుదమనఁబడును. ఇది వాతజము, పిత్తజము, శ్లేష్మజము, రక్తజము, మాంసజము, మేదోజము అని ఆరువిధములు. మేదఃకఫము లధికముగను కఠినముగ నుండుటవలన పాకమును జెందకుండును.

### శోణితార్బుదలక్షణము.

సిరాస్థం శోణితం దోషస్సంకోచ్యాంతః ప్రపీడ్య చ,
పాచయేత తదానద్ధం సాస్రావం మాంసపిండితమ్. ౧౬
మాంసాంకురైశ్చితం యాతి వృద్ధిం చాశు స్రవేత్తతః,
అజస్రం దుష్టరుధిరం భూరి తచ్ఛోణితార్బుదమ్. ౧౭

వాతాదులలో నేదైన నొకదోషము సిరలలోనుండు రక్తమును క్షయింపఁజేసి పాకమునుజేయును. పక్వముగనుండు నారక్తము మాంసపిండమువలె ఉండగట్టి మాంసాం

కురములతో వ్యాప్తమై శీఘ్రముగ వృద్ధిజెందును. దానినుండి యెల్లపుడు దుష్టరక్తము అధికముగ స్రవించును. ఇది శోణితార్బుదమని చెప్పఁబడును.

## సాధ్యాసాధ్యార్బుదరోగములు.

తేష్వసృజ్మాంసజే వర్జ్యే చత్వార్యన్యాని సాధయేత్,

అర్బుదరోగము లారిటిలో రక్తజము మాంసజము అను రెండర్బుదరోగములు అసాధ్యంబులగుటవలన వానిని చికిత్సయందు వర్జింపవలయును. తక్కిన నాల్గు అర్బుద రోగములును చికిత్సార్హంబులు.

## శ్లీపదరోగసంప్రాప్తి.

ప్రస్థితా వంక్షణోర్వాదిమధఃకాయం కఫోల్బణాః. ౧౮
దోషా మాంసాస్రగాః పాదౌ కాలేనాశ్రిత్య కుర్వతే,
శనైశ్శనైర్ఘనం శోఫం శ్లీపదం తత్ప్రచక్షతే. ౧౯

గజ్జలు తొడలు మొదలగు క్రిందిశరీరము నాశ్రయించియుండు వాతాదిదోషములు కఫాధిక్యముతోఁగూడి మాంసరక్తములనుజేరి తొలుత గజ్జలయందు వాపునుకల్గించి యావాపును నానాట తొడలనుండి మీగాళ్లకు దిగజారును. ఆవాపు పాదములయందు క్రమముగ నానాటవృద్ధినొంది పెద్దదియగును, ఇయ్యది శ్లీపదము (బోదకాలు) అనఁబడును.

## వాతజశ్లీపదలక్షణము.

పరిపోటయుతం కృష్ణమనిమిత్తరుజం ఖరమ్,
రూక్షంచ వాతాత్-

వాతమువలన జనించిన శ్లీపదరోగము చర్మమున పగుళ్లతోఁగూడి నల్లగ, రూక్షముగ నుండును. దీనియందు కారణము లేకయే నొప్పికలుగును.

## పిత్తజశ్లీపదలక్షణము.

పిత్తాత్తు పీతం దాహజ్వరాన్వితమ్. ౨౦

పిత్తమువలన జనించిన శ్లీపదము పసుపువర్ణము సర్వాంగతాపము జ్వరము వీనితో గూడియుండును.

## కఫజశ్లీపదలక్షణము.

కఫాద్గురుస్నిగ్ధమరుక్చితం మాంసాంకురైర్బృహత్,

కఫమువలన జనించిన శ్లీపదరోగము పెద్దదిగను స్నిగ్ధముగను నొప్పిలేనిదిగను అనేక మాంసాంకురములతోఁ గూడినదిగ నుండును.

### అసాధ్యశ్లీపదలక్షణము.

తత్త్యజేద్వత్సరాతీతం సుమహత్సుపరిస్రుతి. ౨౧

ఒకసంవత్సరమునకు పైబడిన శ్లీపదరోగమును, పెద్దదిగను అధికస్రావముతోఁ గూడినదిగనుండు శ్లీపదరోగమును చికిత్సింపక వర్జింపవలయును.

### శ్లీపదభేదములు.

పాణినాసోష్ఠకర్ణేషు వదంత్యేకే తు పాదవత్,
శ్లీపదం జాయతే తచ్చ దేశేఽనూపే భృశం భృశమ్. ౨౨

శ్లీపదరోగము కాళ్లయందు జనించునటులనే చేతులు ముక్కు పెదవులు చెవులు వీనియందును జనించునని కొందరు వచింపుచున్నారు. ఈరోగము అనూపదేశమునందు విశేషముగ జనించును.

### గండమాలాపచీలక్షణము.

మేదస్థాః కంఠమన్యాక్షకక్షావంక్షణగా మలాః,
సవర్ణాన్ కఠినాన్ స్నిగ్ధాన్ వార్తాకామలకాకృతీన్. ౨౩
అవగాఢాన్ బహూన్ గండాంశ్చిరపాకాంశ్చ కుర్వతే,
పచ్యంతేఽల్పరుజస్త్వన్యే స్రవంత్యన్యేఽతికండురాః. ౨౪
నశ్యంత్యన్యే భవంత్యన్యే దీర్ఘకాలానుబంధినః,
గండమాలాపచీ చేయం దూర్వేవ క్షయవృద్ధిభాక్. ౨౫

మేదస్సు కంఠము పెడతల పెద్దనరము చంకలు గజ్జలు వీనినాశ్రయించియుండు వాతాదిదోషములు గట్టంబులై తమతమ వర్ణములతో తుల్యముగను కఠినముగను స్నిగ్ధముగను వంకాయ ఉసిరికకాయ వీనితో సమానాకారము గలవిగనుండు ననేకగడ్డలను కలుగఁజేయును. ఇది బహుకాలముమీఁద పాకమునుజెందును. మఱియు వానిలో కొన్ని గడ్డలు కొంచెమునొప్పితోఁగూడి పాకమును జెందును అందులో కొన్ని స్రావముతోఁ గూడియు మరికొన్ని విశేషముగ దురదతోఁగూడియునుండును. కొన్ని శీఘ్రముగ నశించును. కొన్ని చిరకాలమనువర్తింపుచుండును. ఇది గండమాలయనియు అపచి యనియు చెప్పఁబడును. ఇది గరికెవలె వృద్ధిక్షయములను జెందుచుండును.

### అసాధ్యగండమాల.

తాం త్యజేత్సజ్వరచ్ఛర్దిపార్శ్వరుక్కాసపీనసామ్,

జ్వరము వాంతి పార్శ్వశూల కాసము పీనసము వీనితోఁగూడియుండు గండ
ల యసాధ్యంబగుటవలన దానిని చికిత్సయందు వర్జింపవలయును.

## నాడీగతిలక్షణము.

అభేదాత్పక్వశోఫస్య వ్రణే చాపథ్యసేవినః. ౧౬

అనుప్రవిశ్య మాంసాదీన్ దూరం పూయోఽభిధావతి,

గతి స్సా దూరగమనా న్నాడీనాడీవ సంస్రుతేః. ౧౭

నాడ్యేకా నృజురన్యేషాం సైవానేకగతిర్గతిః,

పక్వముగనుండు వాపు పగలకుండుటవలనను, వ్రణము కలిగియుండు నపుడ
థ్యములను చేయుటవలనను, వ్రణమునందలి చీము మాంసాదులలో ప్రవేశించి బహు
రము పోవును. అటుల పోవుటవలన గతియనియు నాడివలె బహుస్రావముతోఁ
డియుండుటవలన నాడియనియు చెప్పఁబడును. ఇది ఒకటేమార్గముగను వంకరగను
వుచుండిన నాడియనియు, అనేకమార్గములుగ పోవుచుండిన గతియనియు కొన్ని
త్రకారులు చెప్పియున్నారు.

## పంచవిధనాడీవ్రణములు.

సా దోషైః పృథగేకస్థైశ్శల్యహేతుశ్చ పంచధా. ౧౮

పైచెప్పిన నాడీవ్రణము, వాతజము, పిత్తజము, శ్లేష్మజము, సన్నిపాతజము, శల్య
ము అని ఐదువిధములు.

## వాతజనాడీలక్షణము.

వాతా త్సరుక్సూక్ష్మముఖీ వివర్ణా ఫేనిలోద్వమా,

స్రవత్యభ్యధికం రాత్రౌ-

వాతమువలన జనించిన నాడీవ్రణము నొప్పితోఁగూడినదిగను స్వల్పద్వారము
దిగను వికారవర్ణము కలదిగను నురుగుతోడ రక్తాదులను స్రవింపఁజేయునదిగ నుండు
దీనియందు రాత్రులలో విశేషముగ స్రావముకలుగును.

## పిత్తజనాడీలక్షణము.

పిత్తా త్తృడ్జ్వరదాహకృత్. ౧౯

పీతోష్ణపూతిపూయా స్రుద్దివా చాతినిషించతి,

పిత్తమువలన జనించిననాడి దప్పి జ్వరము సర్వాంగతాపము వీనిని కలుగఁజేయు
గను, పసుపువర్ణము ఉష్ణము దుర్గంధము వీనితోఁగూడిన చీమును స్రవింపఁజేయునదిగ
ండును. పగటియందు విశేషస్రావముతోఁ గూడియుండును.

### కఫజనాడీలక్షణము.

ఘనపిచ్ఛిలసంస్రావా కండూలా కఠినా కఫాత్. ౩౦
నిశి చాభ్యధికక్లేదా.

కఫమువలన జనించిన నాడీవ్రణము గట్టిగను జిగటగనుండు స్రావముతోఁగూడి నదిగను దురదగలదిగను కఠినముగ నుండును. రాత్రులయం దధికస్రావముతోఁ గూడి యుండును.

### సన్నిపాతజనాడీలక్షణము.

సర్వై స్సర్వాకృతిం త్యజేత్,

సన్నిపాతమువలన జనించిన నాడీవ్రణమునకు వాతజాదినాడీవ్రణములకు చెప్పి యుండు లక్షణములన్నియు కలిగియుండును.

### శల్యజనాడీలక్షణము.

అంతస్స్థితం శల్యమనాహృతం తు
కరోతి నాడీం వహతే చ సాస్య,
ఫేనానువిద్ధం తనుమల్పముష్ణం
సాస్రం చ పూయం సరుజం చ నిత్యమ్. ౩౧

శరీరములోపల ప్రవేశించియుండు శల్యమును బైటికితీయకుండిన నది నాడీవ్రణమును కలుగఁజేయును. ఇది శల్యజనాడియనఁబడు. దీనియందు నురుగుతోఁ గూడినదిగను, తేటగను, కొంచెముగను, వేడిగను, రక్తముతోఁగూడినదిగను దుర్గంధయుక్తముగ నుండు చీము నొప్పితో నెల్లపుడు స్రవింపుచుండును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ఇరువది తొమ్మిదవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# త్రింశాధ్యాయము.

గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము తత్ప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్న యది:—

## గ్రంథ్యర్బుదశ్లీపదాపచీనాడీ ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో గ్రంథ్యర్బుదశ్లీపదాపచీనాడీప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము వానిచికిత్సలను తెలియపఱచునట్టి గ్రంథ్యర్బుద శ్లీపదాపచీనాడీప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### గ్రంథిచికిత్స.

గ్రంథిష్వామేషు కర్తవ్యా యథాస్వం శోఫవత్క్రియా,

గ్రంథుపక్వములుగాక యుండునపుడు ఆయాదోషానుగుణముగ శోఫరోగములకు జెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### గ్రంథిరోగమునకు స్నేహాలేపనములు.

బృహతీచిత్రకవ్యాఘ్రీకణాసిద్ధేన సర్పిషా. ౧
స్నేహయేచ్ఛుద్ధికామం చ తీక్ష్ణైశ్శుద్ధస్య లేపనమ్,

గ్రంథిరోగము గలవానికి ములక, చిత్రమూలము, వాకుడు, పిప్పళ్లు వీనితో పక్వము చేయఁబడిన ఘృతముచే స్నేహకర్మను పిదప వమనవిరేచనకర్మలను ఒనర్చి శుద్ధమైన శరీరముగలవానికి తీక్ష్ణద్రవ్యములచే లేపనము చేయవలయును.

### గ్రంథులకు స్వేదకర్మ.

సంస్వేద్య బహుశో గ్రంథిం విమృద్నీయాత్పునః పునః. ౨

గ్రంథులకు పలుమారు స్వేదకర్మను చక్కఁగచేయించి చేతిబొటనవేలు మొదలగువానిచే చక్కఁగ పిసకవలయును.

—◎ వాతజాదిగ్రంథిచికిత్స. ◎—

ఏష వాతే విశేషేణ క్రమః పిత్తాస్రజే పునః,
జలౌకసో హిమం సర్వం కఫజే వాతికో విధిః. 3

పైచెప్పినచికిత్సలను వాతజగ్రంథియందు విశేషముగ చేయవలయును. పిత్తరక్తజగ్రంథులయందు జలగలచే రక్తమోక్షణము చేయించి చల్లగనుండు పట్లు మొదలగువానిని వేయవలయును. శ్లేష్మజగ్రంథికి వాతజగ్రంథి చికిత్సలను చేయవలయును.

—◎ వాతజాదిగ్రంథులకు దాహకర్మ. ◎—

తథాప్యపక్వం ఛిత్త్వైనం స్థితే రక్తేఽగ్నినా దహేత్,
సాధ్వశేషం స శేషో హి పునరాప్యాయతే ధ్రువమ్. ౪

పైచెప్పినప్రకారము చికిత్సలను జేసియు గ్రంథి పక్వముకాకుండినచో దానిని శస్త్రముచే చక్కగ ఛేదించి రక్తము స్రవించడము నిలిచినపిదప దానిని నిశ్శేషముగ చక్కగ కాల్చవలయును. ఆగ్రంథి కొంచెము శేషించియుండిన నది మరల వృద్ధి జెందును.

—◎ మాంసవ్రణగ్రంథిచికిత్స. ◎—

మాంసవ్రణోద్భవౌ గ్రంథీ పాటయేదేవమేవ చ,

పైచెప్పిన ప్రకారము మాంసగ్రంథిని వ్రణగ్రంథిని ఛేదించి చికిత్సచేయవలయును.

—◎ మేదోభవగ్రంథిచికిత్స. ◎—

కార్యం మేదోభవేఽప్యేతత్తప్తైః ఫాలాదిభిశ్చ తమ్. ౫
ప్రమృద్యాత్తిలదిగ్ధేన ఛన్నం ద్విగుణవాససా,
శస్త్రేణ పాటయిత్వా వా దహేన్మేదసి సూద్ధృతే. ౬

మేదస్సువలన జనించిన గ్రంథికిని పైచికిత్సలనే చేయవలయును. మఱియు నాగ్రంథికి నువ్వులకల్కము పూయబడిన వస్త్రమును జుట్టి యాగ్రంథిని నిప్పులో కాల్చబడిన కుండపెంకులు మొదలగువానిచే దహింపవలయును. లేక శస్త్రముచే ఛేదించి లోననుండు మేదస్సును నిశ్శేషముగ బైటికితీసివేసి నిప్పుచే కాల్చవలయును.

—◎ సిరాగ్రంథిచికిత్స. ◎—

సిరాగ్రంథౌ నవే పేయం తైలం సాహచరం తథా,
ఉపనాహోఽనిలహరైర్వస్తికర్మ సిరావ్యధః. ౭

సిరాగ్రంథి క్రొత్తగనుండునపుడు సాహచర (అనఁగా గోరింట) తైలమును పానము చేయుంచవలయును. మఱియు వాతహరద్రవ్యములచే నుపనాహస్వేదము వస్తికర్మ సిరావేధ మివిని చేయించవలయును.

## అర్బుదచికిత్స.

అర్బుదే గ్రంథివత్కుర్యాద్యథా స్వం సుతరాం హితమ్,

అర్బుదరోగము కలవానికి గ్రంథిరోగమునకు చెప్పియుండునటుల చికిత్సలను చక్కఁగ చేయవలయును.

## శ్లీపదరోగచికిత్స.

శ్లీపదేఽనిలజే విధ్యేత్స్నిగ్ధ స్విన్నోపనాహితే. ౮
సిరాముపరి గుల్ఫస్య ద్వ్యంగులే పాయయేచ్చ తమ్,
మాసమేరండజం తైలం గోమూత్రేణ సమన్వితమ్. ౯
జీర్ణే జీర్ణాన్న మశ్నీయాచ్ఛుంఠీశృతపయోఽన్వితమ్,
త్రైవృతం వా పిబేదేవమశాంతావగ్నినా దహేత్. ౧౦
గుల్ఫస్యాధస్సిరా మోక్షః.

వాతమువలన జనించిన శ్లీపదరోగమునకు స్నేహస్వేదకర్మలను చేయించి పిదప నుపనాహస్వేదమునొనర్చి చీలమండకు రెండంగుళములకు పైసిరను వేధించి ఆముదములో గోమూత్రమును కలిపి యారోగికి నొకమాసమువఱకు పానము చేయించవలయును. అది జీర్ణమైనపిదప పాతసంబాబియ్యపు అన్నమును శుంఠీచేర్చి కాచఁబడిన యావుపాలతోడ భుజింపఁజేయవలయును. లేక త్రివృత్తైలమును పానముచేయుంచవలయును. ఇటుల చేసియు శ్లీపదరోగము శమింపకయుండిన నిప్పుచే కాల్చి చీలమండకు క్రిందనుండు సిరను వేధించవలయును.

## పిత్తజశ్లీపదచికిత్స.

పైత్తే సర్వం చ పిత్తజిత్,

పిత్తమువలనజనించిన శ్లీపదరోగమునకు పిత్తహరచికిత్సలన్నిటిని చేయవలయును.

## కఫజశ్లీపదచికిత్స.

సిరామంగుష్ఠకే విధ్వా కఫజే శీలయేద్యవాన్. ౧౧
సక్షౌద్రాణి కషాయాణి వర్ధమానా స్తథాభయాః,
లింపేత్సర్షపవార్తాకీమూలాభ్యాం ధాన్యయాథవా. ౧౨

కఫమువలన బుట్టిన శ్లీపదరోగమునకు కాలిబొటనవ్రేలియందలి సిరనువేధించి యవాన్నమును భుజింపఁజేయవలయును. మఱియు వగరుగనుండు ద్రవ్యములను తేనెతోడ భుజింపఁజేయవలయును. దినమున కొకటిచొప్పున వృద్ధినొందింపఁబడిన కరక్కాయను భుజింపవలయును. ఆవాలచెట్లవేళ్లనుగాని ములగవేళ్లనుగాని రేగటిమాలగోవిల వేళ్లనుగాని సొంటినిగాని నూరి లేపనము చేయవలయును.

### అపచీరోగచికిత్స.

ఊర్ధ్వాధశ్శోధనం పేయ మపచ్యాం సాధితం ఘృతమ్,
దంతీద్రవంతీత్రివృతాజాలినీ *దేవదాళిభిః. ౧౩
శీలయేత్కఫమేదోఘ్నం ధూమగండూషనావనమ్,
సిరయాపహరేద్రక్తం పిబేన్మూత్రేణ తార్క్ష్యజమ్. ౧౪

అపచీరోగమునందు దంతి, ఎలుకచెవియాకు, తెగడ, చేదుబీర, డొవరడంగి వీనినిచేర్చి కాచఁబడిన ఘృతముచే వమనవిరేచనములను చేయించి కఫమేదోహరములైన ధూమపానమును గండూషమును నస్యమును చేయించవలయును. సిరనువేధించి రక్తమోక్షణమును చేయించవలయును. రసాంజనమును గోమూత్రములో కలిపి పానము చేయించవలయును.

### అపక్వగ్రంథిచికిత్స.

గ్రంథీ నపక్వా నాలింపే న్నాకులీపటునాగరైః,
స్విన్నాన్ లవణపోట్టల్యా కఠినాననుమర్దయేత్. ౧౫

పక్వముకాకుండు గ్రంథులకు సర్పాక్షి సైంధవలవణము సొంటి వీనిని నూరి లేపనము చేయవలయును. కఠినముగ నుండు గ్రంథులను సైంధవలవణమును గుడ్డచింపిలో మూటగట్టి దానిచే స్వేదకర్మను చేయించి చేతిబొటనవ్రేలు మొదలగువానిచే పిసకవలయును.

### గ్రంథులకు శమ్యాదిలేపనము.

శమీమూలకశిగ్రూణాం బీజైస్సయవసర్షపైః,
లేపః పిష్ట్వో ఽమ్లతక్రేణ గ్రంథిగండవిలాపనః. ౧౬

జమ్మివిత్తులు, ముల్లంగివిత్తులు, మునగవిత్తులు, యవలు, ఆవాలు వీనిని సమభాగములుగ గ్రహించి పుల్లని ఆవుమజ్జిగతో నూరి లేపనము చేసిన గ్రంథులును గడ్డలును కరగును.

---

* దేవదారుభిః.

## పాకోన్ముఖగ్రంథిచికిత్స.

పాకోన్ముఖాన్ గ్రంథీంస్రస్య పిత్తశ్లేష్మహరైర్జయేత్,
అపక్వానేవ చోద్ధృత్య క్షారాగ్నిభ్యాముపాచరేత్. ౧౭

పాకమును జెందుచుండు గ్రంథులయందు రక్తమోక్షణము చేయించి పిత్తజశ్లేష్మహరద్రవ్యములచే చికిత్సచేయవలయును. పక్వముకాకుండు గ్రంథులను చక్కఁగ ఛేదించి క్షారాగ్నికర్మలచే చికిత్సచేయవలెను.

## గండమాలలకు కాకాదన్యాదితైలము.

కాకాదనీలాంగలికానహింకోత్తుండికీఫలైః,
జీమూతబీజకర్కోటీవిశాలాకృతవేధనైః. ౧౮
పాఠాన్వితైః పలార్ధాంశైర్విషకర్షయుతైః పచేత్,
ప్రస్థం కరంజతైలస్య నిర్గుండీస్వరసాఢకే. ౧౯
అనేన మాలా గండానాం చిరజా పూయవాహినీ,
సిధ్యత్యసాధ్యకల్పాపి పానాభ్యంజననావనైః. * ౨౦

నల్లపుప్పి, చన్నచ్గగడ్డ, బండిగురిగింజలు, నేపాళపువిత్తులు, ములుదోస, డావరంగివిత్తులు, పెద్దపాఁకర, చేదుబీర, చిరుబొద్ది ఇవి దినుసుకు అరపలము వీని నొకటిగచేర్చి కల్కముచేసి కానుగనూనె ఒకప్రస్థములోకలిపి అందులో వావిలికూరరసము ఒకఆఢకముఁబోసి తైలపాకవిధిగపాకముజేసి పానాభ్యంజననస్యములయందు ప్రయోగించిన చిరకాలముగ జనించియుండునదియు చీమును స్రవింపఁజేయునదియు అసాధ్యముగ నుండునదియు నగుగండమాలలు నిస్సంశయముగ నివర్తించును.

## అపచీరోగమునకు లాంగల్యాదితైలము.

తైలం లాంగలికీకందకల్కపాదే చతుర్గుణే,
నిర్గుండీస్వరసే పక్వం నస్యాద్యైరపచీప్రణుత్. ౨౧

* శ్లో. ఘృష్టాని నింబపత్రాణి క్లిన్నైః భల్లాతకైః సహ,
శరావసంపుటే దగ్ధ్వా సార్ధం సిద్ధార్థకైః స్తమైః.
ఏతచ్ఛాగాంబునా పిష్టం గండమాలాప్రలేపనమ్,

వేపాకును నూరి అందులో తెల్లావాలు, ఉడికించినజీడిగింజలు వీనిని సమభాగములుగచేర్చి శరావసంపుటములోనునిచి చక్కఁగకాల్చి గొఱ్ఱెమూత్రములోకలిపి గండమాలలకు లేపనము చేయవలయునని కొన్నిప్రతులయం దధికపాఠము గన్పట్టుచున్నది.

### గ్రంథిరోగమున సుశ్రుతమతశస్త్రచికిత్స.

పార్ష్ణిం ప్రతిద్వాదశచాంగులాని
ముక్త్వేంద్రవస్తిం చ గదాన్యపార్శ్వే,
విదార్య మత్స్యాండనిభాని మధ్యా
జ్జాలాని కర్షేదితి సుశ్రుతోక్తిః. ౩౧

ఏపార్శ్వమున రోగము కలిగియున్నదో తదితరపార్శ్వమున గుదికాళ్లకుపైనింద్రవస్తియను మర్మమునువదలి పండ్రెండు అంగుళముల ప్రమాణము ఛేదించి దాని మధ్యభాగమునుండి మత్స్యాండసమముగనుండు జాలములను బైటికితీయవలయును. ఇటుల సుశ్రుతాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

### గ్రంథిరోగమున మతాంతరశస్త్రచికిత్స.

ఆగుల్ఫకర్ణాత్సుమితస్య జంతోస్తస్యాష్టభాగం ఖుడకాద్విభజ్య,
ఘ్రాణార్జవేధస్సురరాజవస్తే ర్భిత్త్వాక్షమాత్రం త్వపరే వదంతి.

చెవులు మొదలుకొని చీలమండవఱకు కొలిచి ఎనిమిదిభాగములుగ విభజించి ముక్కుకు సమముగ దవుడలో నింద్రవస్తియను మర్మమునకుక్రింద తానికాయంత ప్రమాణము ఛేదించి పైజాలములను వెలికిందీయవలె నని కొందరాచార్యులు వచింపుచున్నారు.

### వాతజనాడీచికిత్స.

ఉపనాహ్యానిలాన్నాడీం పాటితాం సాధు లేపయేత్,
ప్రత్యక్పుష్పీఫలయుతైస్తిలైః పిష్టైస్ససైంధవైః. ౩౩

దుష్టవాతమువలన జనించిన నాడీవ్రణమును (అనఁగా లోనికేగువ్రణమును) ఛేదించిఉత్తరేణువిత్తులను సైంధవలవణమును నువ్వులనూనెతో నూరి లేపనము చేయవలయును.

### పిత్తజనాడీచికిత్స.

పైత్తీం తు తిలమంజిష్ఠానాగదంతీ *శిలాహ్వయైః,

పిత్తమువలన జనించిన నాడీవ్రణమును ఛేదించి నువ్వులు, మంజిష్ఠ, నాగదంతి, శిలాజతు వీనిని నూరి లేపనముచేయవలయును.

### కఫజనాడీచికిత్స.

శ్లైష్మికీం తిలసౌరాష్ట్రీనికుంభారిష్టసైంధవైః. ౩౪

*నిశాద్వయైః.

శ్లేష్మమువలన జనించిన నాడీవ్రణమునుఛేదించి యందు నువ్వులు,కుందురుష్కము, లేక తుమ్మిరినుస్సు, నల్లతెగడ, వేము, సైంధవలవణము వీనిని నూరి లేపనము చేయవలయును.

### శల్యజనాడీచికిత్స.

శల్యజాం తిలమధ్వాజ్యై ర్లేపయే చ్ఛిన్నశోధితామ్,

శల్యమువలన జనించిన నాడీవ్రణమును శస్త్రముచే ఛేదించి చక్కఁగకడిగి నువ్వులు, తేనె, ఆవునెయ్యి వీని నొకటిగచేర్చి లేపనము చేయవలయును.

### శస్త్రకర్మానర్హనాడీచికిత్స.

అశస్త్రకృత్యామేషిణ్యా భిత్వాంతే సమ్యగేషితామ్. ౩౫

క్షారపీతేన సూత్రేణ బహుశో దారయేద్గతిమ్,

శస్త్రముచే ఛేదించతగని నాడీయందు ఏషిణియను యంత్రముచే నావ్రణము ఏమార్గమున వ్యాపించియున్నది గమనించి చూచి క్షారములో తడపఁబడిన సూత్రమును లోపల ప్రవేశింపఁజేసి దానిని చీల్చవలయును.

### నాడీవ్రణమునందు వర్తి.

వ్రణేషు దుష్టసూక్ష్మాస్యగంభీరాదిషు సాధనమ్. ౩౬

యా వర్త్యో యాని తైలాని తన్నాడీష్వపిశస్యతే,

దుష్టములుగ సూక్ష్మద్వారముగలవిగ మిక్కిలి లోఁతున వ్యాపించినవిగనుండు వ్రణములకు చికిత్సగా చెప్పఁబడియుండు వర్తులు తైలములు వీనిని నాడీవ్రణములయందుపయోగించవలయును.

### నాడీవ్రణహరలేపము.

పిష్టం చంచుఫలం లేపాన్నాడీవ్రణహరం పరమ్. ౩౭

ఆముదపువిత్తులను చక్కఁగనూరి లేపనముచేసిన నాడీవ్రణము హరించును.

### నాడీవ్రణహరవర్తి.

ఘోంటాఫలత్వగ్లవణం సలాక్షం
బూకస్య పత్రం వనితాపయశ్చ,
స్నుగర్కదుగ్ధాన్విత ఏష కల్కో
వర్తీకృతో హంత్యచిరేణ నాడీమ్. ౩౮

పోకపండు, లవంగపట్ట, సైంధవలవణము, లక్క, ఆముదపాకు వీనినొకటిగ
చక్కఁగనూరి అందు, చనుబాలు, జముడుపాలు, జిల్లేడుపాలు వీనినిచేర్చి చక్క
కల్కముచేసి దానిచే వర్తిజేసి నాడీవ్రణములోపల ప్రవేశింపఁజేసిన శీఘ్రముగ
వ్రణము హరించును.

## నాడీవ్రణహరకల్కాదులు.

సాముద్రసౌవర్చలసింధుజన్మసుపక్వఘోంటాఫలవేశ్మధూమాః
ఆమ్రాతగాయత్రిజపల్లవాశ్చ కటంకటేర్యావథ చేతకీ చ.
కల్కే ఉభ్యంగే చూర్ణే వర్త్యాం చైతేషు సేవ్యమానేషు,
అగతిరివ నశ్యతి గతిశ్చపలా చపలేషు భూతి రివ.

సాముద్రలవణము, సౌవర్చలవణము, సైంధవలవణము, చక్కఁగ పండినపోక
డ్లు, కరిమాపము, అంబాళపుచిగుళ్లు, చంద్రచిగుళ్లు, మ్రానిపసుపు, పసుపు, కరక
యలు వీనిని కల్కమునందును అభ్యంగమునందును చూర్ణమునందును వర్తియందును
పలుమాఱు నుపయోగించుచుండిన "చపలస్వభావముగలవారికి సంపత్తు శీఘ్రముగ నశిం
భంగి" నాడీవ్రణ మతిశీఘ్రముగ నశించును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్ర మను
ముప్పదియవయధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

# ఏకత్రింశాధ్యాయము.

అవ. గ్రంథ్యర్బుదశ్లీపదాపచీనాడీ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము క్షుద్ర రోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## క్షుద్రరోగవిజ్ఞానీయాధ్యాయప్రారంభము.

సూ. అథాఽతః క్షుద్రరోగవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

గ్రంథ్యర్బుద శ్లీపదాపచీ నాడీ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము క్షుద్ర రోగముల లక్షణభేదములను తెలియపఱచునట్టి క్షుద్రరోగవిజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—రోగములు మహారోగములనియు, క్షుద్ర రోగములనియు రెండుతెఱంగులు. అందు మిక్కిలి బలిష్ఠములైన కారణములచే ననేక భేదములుకల్గి ప్రబలములైన చికిత్సలను పూనికతో చేయవలసిన వ్యాధులు మహారోగములు. స్వల్పములగు కారణములచే స్వల్పభేదములును స్వల్పలక్షణములునుకల్గి స్వల్పచికిత్సలచే సులభముగ సాధింపందగినవి క్షుద్రరోగములు. అట్టిక్షుద్రరోగములలక్షణములు ఈయధ్యాయమున చెప్పఁబడు. అయ్యాది ముప్పదియారని వాగ్భటాచార్యునిచే నీయధ్యాయాంతమునచెప్పఁబడినది. కొందఱాచార్యు లింతకన్న నెక్కువగజెప్పియున్నారు. మఱియు నీప్రకరణముననే అగ్నిరోహిణి మున్నగు కొన్ని ప్రాణాంతకములగు రోగములును చెప్పఁబడును. అయినను ప్రాయికముగ క్షుద్రరోగములు చెప్పఁబడుననిభావము.

### అజగల్లికారోగలక్షణము.

స్నిగ్ధా సవర్ణా గ్రథితా నీరుజా ముద్గసమ్మితా,
పిటకా కఫవాతాభ్యాం బాలానా మజగల్లికా. ౧

బాలురకు దుష్టకఫవాతములవలన స్నిగ్ధముగను శరీరముతో సమానవర్ణముగలదిగను నొప్పిలేనిదిగను పెసరగింజలంతప్రమాణము గలదిగనుండు పిటకలు జనించును. ఇది అజగల్లికయని చెప్పఁబడును.

యవప్రఖ్యాలక్షణము.

యవప్రఖ్యా యవప్రఖ్యాతాభ్యాం మాంసాశ్రితా ఘనా,

దుష్టకఫవాతములవలన యవగింజతో తుల్యమైనయాకారముగలవిగను కఠినములుగనుండు పిటకలు మాంసము నాశ్రయించి జనించును. ఇది యవప్రఖ్యయని చెప్పఁబడును.

కచ్ఛపీలక్షణము.

అవక్రాశ్చాలజీవృత్తా స్తోకపూయా ఘనోన్నతాః. ౨
గ్రంథయః పంచ వా షడ్వా కచ్ఛపీకచ్ఛపోన్నతా,

వంకరలేనివిగను అలజివలె గుండ్రముగను కొంచెము చీముతోఁగూడినవిగను కఠినముగను పొడవుగనుండు ఐదారు గ్రంథులు జనించును. ఇది కచ్ఛపియని చెప్పఁబడును. ఇయ్యది వీపునందు తాబేలువలె పొడవుగనుండును.

పనసికాలక్షణము.

కర్ణస్యోర్ధ్వం సమంతాద్వా పిటికాకఠినోగ్రరుక్. ౩
శాలూకాభా పనసికా-

చెవికిపైభాగమున గాని నలుప్రక్కలయందుగాని కఠినముగను అధికమైననొప్పితోఁ గూడినదిగను తామరదుంపవలె నుండు పిటక జనించును. ఇది పనసికయనిచెప్పఁబడును.

పాషాణగర్దభలక్షణము.

శోఫ స్త్వల్పరుజఃస్థిరః,
హనుసంధిసముద్భూత స్తాభ్యాం పాషాణగర్దభః. ౪

దుష్టకఫవాతములవలన చెక్కిళ్ళసంధులయందు కొంచెము నొప్పితోఁగూడి కఠినముగనుండు వాపుజనించును. ఇది పాషాణగర్దభమని చెప్పఁబడును.

ముఖదూషికాలక్షణము.

శాల్మలీకంటకాకారాః పిటికా స్సరుజో ఘనాః,
మేదోగర్భా ముఖే యూనాం తాభ్యాం చ ముఖదూషికాః. ౫

వయస్సుగల మనుజులయొక్క ముఖమున దుష్టకఫవాతములవలన బూరుగముండ్లవంటి యాకారము గలవిగను నొప్పితోఁగూడినవిగను కఠినముగను మేధస్సు గలవిగనుండు పిటకలుజనించును. ఇది ముఖదూషికయనఁబడును.

పద్మకంటకలక్షణము.

తే పద్మకంటకా జ్ఞేయా యైః పద్మమివ కంటకైః,
చీయతే నీరుజై శ్శ్వేతై శ్శరీరం కఫవాతజైః. ౩

దుష్టకఫవాతములవలన తెల్లగను నొప్పిలేనివిగనుండు పిటకలు జనించి తామర తూడును ముండ్లుకప్పుకొనియుండునటుల శరీరమంతయు కప్పుకొనును. ఇది పద్మకంటకమని చెప్పఁబడును.

విస్ఫృతాలక్షణము.

పిత్తేన పిటకా వృత్తా పక్వోదుంబరసన్నిభా,
మహాదాహజ్వరకరీ విస్ఫృతా విస్ఫృతాననా. ౭

దుష్టపిత్తముచే శరీరమున గుండ్రముగను పండిన మేడిపండువలె నుండునదిగను సర్వాంగములయందు తాపజ్వరములను కలుగఁజేయునదిగను ముఖము తెఱవఁబడినదిగనుండు పిటకజనించును. దీనికి విస్ఫృతా యనిపేరుకలదు.

మసూరికాపిటకాలక్షణము.

గాత్రేష్వంతశ్చ వక్త్రస్య దాహజ్వరరుజాన్వితాః,
మసూరమాత్రా స్తద్వర్ణా స్తత్సంజ్ఞాః పిటకాఘనాః. ౮

పిత్తప్రకోపమువలన సర్వాంగతాపము జ్వరము నొప్పి వీనితోఁ గూడినదిగను చిఱుసెనగలంతప్రమాణము గలదిగను గట్టిగనుండు పిటకలు సర్వశరీరమునందును నోటిలోపలను జనించును. దీనికి మసూరిక యనిపేరు.

విస్ఫోటాలక్షణము.

తతః కష్టతరా స్ఫోటా విస్ఫోటాఖ్యా మహారుజాః,
పిత్తప్రకోపమువలన నధికోపద్రవములతోఁగూడియుండు పిటకలు జనించును. ఇది పైమసూరికాపిటకలకంటె మిక్కిలి దారుణముగనుండును. దీనికివిస్ఫోటమనిపేరు.

విద్ధాలక్షణము.

యాపద్మకర్ణికాకారా పిటకా పిటకాచితా. ౯
సా విద్ధా వాతపిత్తాభ్యాం-

వాతపిత్తప్రకోపమువలన తామరదుద్దువంటి యాకారముగల పిటకజనించి దానికి నలుప్రక్కల చిన్నవిగనుండు ననేకపిటకలుజనించును. ఇది విద్ధయని చెప్పఁబడును.

గర్దభీలక్షణము.

తాభ్యామేవ చ గర్దభీ,

మండలా విపులోత్సన్నా సరాగపిటకాచితా. ౧౦

వాతపిత్తములవలన గుండ్రముగను విశాలముగను నడుము మిట్టగను యెఱ్ఱగనుండు పిటకలతోఁ గూడినదిగనుండు పిటకజనించును. ఇది గర్దభి యనిచెప్పఁబడును.

### కక్ష్యాలక్షణము.

కక్షేతి కక్షాసన్నేషు ప్రాయో దేశేషు సానిలాత్,

వాతమువలన చంకలకు సమీపమునందు పైగర్దభియను పిటక జనించును. ఇది కక్ష యని చెప్పఁబడును.

పిత్తాద్భవంతి పిటకాస్సూక్ష్మా లాజోపమా ఘనాః. ౧౧

పిత్తముచే చంకలకు సమీపప్రదేశమున వరిపేలాలవంటి యాకారముగలవిగను చిన్నవిగను గట్టిగనుండుపిటకలు జనించును. దీనినిగూడ కక్షయనియే చెప్పెదరు.

### గంధనామరాజికాలక్షణము.

తాదృశీ మహతీ త్వేకా గంధనామేతి కీర్తితా,
ఘర్మస్వేదపరీతేఽంగే పిటకాస్స్యురుజోఘనాః. ౧౨
రాజికా వర్ణసంస్థానప్రమాణా రాజికాహ్వయాః,

పిత్తముచే వరిపేలాలవలె పెద్దదిగనుండు నొకపిటకజనించును. దీనికి గంధనామ యని పేరుకలదు. మఱియు చెమటతోఁగూడియుండు శరీరమునందు నొప్పితోఁ గూడినదిగను గట్టిగను నల్లావాలవంటివర్ణము ఆకారము ప్రమాణము గలదిగనుండు పిటకలు జనించును. వీనికి రాజికాయనిపేరు. వీనిని చెమటకాయలని లోకమున జెప్పెదరు.

### జాలగర్దభరోగలక్షణము.

దోషైః పిత్తోల్బణైర్మందైర్విసర్పతి విసర్పవత్. ౧౩
శోఫోఽపాకస్తనుస్తామ్రో జ్వరకృజ్జాలగర్దభః,

పిత్తమధికముగ వాతశ్లేష్మములు స్వల్పముగనుండు త్రిదోషములచే వాపుజనించి విసర్పమునుబోలె శరీరమునందంతటవ్యాపించుచు పాకమును జెందక యెఱుపువర్ణముతోఁగూడినదై జ్వరమును కలుగఁజేయుచుండును ఇది జాలగర్దభ మనఁబడును.

### అగ్నిరోహిణీలక్షణము.

మలైః పిత్తోల్బణైః స్ఫోటా జ్వరిణో మాంసదారణాః. ౧౪
కక్షాభాగేషు జాయంతే యేఽగ్న్యాభాస్సాగ్నిరోహిణీ,
పంచాహాత్సప్తరాత్రాద్వా పక్షాద్వా హంతి జీవితమ్. ౧౫

పిత్తాధిక్యముతోఁగూడియుండు వాతాది త్రిదోషములచే మనుజునికి విశేషజ్వరము కలిగి నిప్పుతోతుల్యముగను మాంసమును చీల్చునదిగనుండు పెద్దపిటకలు చంకలయందు జనించును. ఇది అగ్నిరోహిణి యని చెప్పఁబడును. ఈరోగముకల్గిన నైదుదినములకైనను, ఏడుదినములకైనను, పదునైదుదినములకైనను రోగినిచంపును.

## ఇరివేల్లికాలక్షణము.

త్రిలింగా పిటకావృత్తా జత్రూర్ధ్వమిరివేల్లికా,

సన్నిపాతమువలన త్రిదోషలక్షణములు గలదిగను గుండ్రముగనుండుపిటక మెడ కొంకులకు పైభాగమునందు జనించును. దీనికి ఇరివేల్లిక యనిపేరు.

## విదారీలక్షణము.

విదారీ కందకఠినా విదారీకక్షవంక్షణే. ౧౬

దుష్టమైన త్రిదోషములచే చంకలయందును గజ్జలయందును నేలగుమ్మడు గడ్డ వలె కఠినముగనుండు పిటక జనించును. ఇది విదారి యనిచెప్పఁబడును.

## శర్కరార్బుదలక్షణము.

మేదోఽనిలకఫై గ్గ్రంథిస్స్నాయుమాంససిరాశ్రయైః,
భిన్నోవసాజ్యమధ్వాభం స్రవేత్తత్రోల్బణోఽనిలః. ౧౭
మాంసం విశోష్య గ్రథితాం శర్కరాముపపాదయేత్,
దుర్గంధం రుధిరం క్లిన్నం నానావర్ణం తతోమలాః. ౧౮
తాం స్రావయంతి నిచితాం విద్యాత్తచ్ఛర్కరార్బుదమ్,

నరములు మాంసములు సిరలు వీనినాశ్రయించి దుష్టంబులైయుండు మేదోవాత శ్లేష్మములచే గ్రంథిజనించును. ఇది కొంచెముకాలమునకుపై పగిలి కొవ్వు నెయ్యి తేనె వీనితోతుల్యముగనుండు రక్తమునుస్రవింపఁజేయును. మఱియు దీనియందు వాత ము వృద్ధిజెంది మాంసమెండి శర్కర ఉంటగజనించును. పిదప దుర్గంధయుక్తముగను నానావిధవర్ణములుగనుండురక్తము స్రవించును. దీనిని శర్కరార్బుద మని తెలిసికొన వలయును.

## వల్మీకలక్షణము.

పాణిపాదతలే సంధౌ జత్రూర్ధ్వం వోపచీయతే. ౧౯
వల్మీకవచ్ఛనైర్గ్రంథి స్తద్వద్బహ్వణుభిర్ముఖైః,
రుగ్దాహకండూక్లేదాఢ్యో వల్మీకో ఽసౌ సమస్తజః. ౨౦

అరచేతులయందుగాని అరకాళ్లయందుగాని సంధులయందుగాని మెడకొంకుల పైగాని గ్రంథిజనించి పుట్టవలె సూక్ష్మముగనుండు ననేకద్వారములతోఁగూడి మెల్లగ వృద్ధిజెందుచుండును. దీనియందు విశేషము నొప్పి మంట క్లేదము దురద అధికముగ కలిగియుండును. ఇది సన్నిపాతమువలన జనించును. దీనిని వల్మీక మనియెదరు.

కదరలక్షణము.

శర్కరోన్మథితే పాదే క్షతే వా కంటకాదిభిః,
గ్రంథిః కీలవదుత్పన్నో జాయతే కదరం తు తత్. ౨౧

అరకాళ్లయందు గులకరాయిచే నభిఘాతము కలిగినను, లేక ముండ్లు మొదలగునవి పొడిచికొనినను శల్యమువలె కొంచెముబ్బియుండు గ్రంథిజనించును. దీనికి కదర మనిపేరు. దీనిని ఆణె యని లోకమున జెప్పెదరు.

రుద్ధగుదలక్షణము.

వేగసంధారణాద్వాయు రపానోఽపానసంశ్రయమ్,
అణూకరోతి బాహ్యాంతర్మార్గమస్య తతశ్శకృత్. ౨౨
కృచ్ఛ్రాన్నిర్గచ్ఛతి వ్యాధిరయం రుద్ధగుదో మతః,

స్వయముగ ప్రవర్తింపుచుండు మలమునడ్డగించుటవలన అపానవాతము ప్రకోపించి బాహ్యాభ్యంతరములయందు గుదమార్గమును సూక్ష్మముగఁజేయును. దానివలన మనుజునికి మిక్కిలి కష్టముతో మలమువెడలును. ఇది రుద్ధగుదరోగమని చెప్పఁబడును.

ఉపనఖరోగలక్షణము.

కుర్యాత్పిత్తానిలం పాకం నఖమాంసే సరుగ్జ్వరమ్. ౨౩
చిప్పమక్షతరోగం చ విద్యాదుపనఖం చ తమ్,

పిత్తవాతములుదుష్టంబులై నఖమునకు క్రిందిభాగమునందుండు మాంసమునందు (పాకమును అనఁగా వ్రణమును) కలుగఁజేయును. దీనియందు జ్వరము నొప్పి కలుగును. ఇది చిప్పరోగమనియు, అక్షతరోగమనియు, ఉపనఖమనియు చెప్పఁబడును. దీనిని గోరుచుట్టు అని లోకమునచెప్పుదురు.

కునఖలక్షణము

కృష్ణోఽభిఘాతాద్రూక్షశ్చ ఖరశ్చ కునఖో నఖః. ౨౪

రాళ్లు మొదలగువానిచే గాయముతగులుటవలన గోళ్లు నల్లగను రూక్షగను వికారముగనగును. దీనిని కునఖరోగమనియెదరు.

—౏ అలసలక్షణము. ౏—

దుష్టకర్దమసంస్పర్శాత్కండూక్లేదాన్వితాంతరాః,
అంగుళ్యోఽలసమిత్యాహుః-

చెడ్డబురదను తాకుటవలన కాలి వేళ్ళసందులయందు దురద క్లేదము కలుగును. దీనిని అలసరోగమని చెప్పెదరు. దీనిని అడుసుపుండు అని లోకమున జెప్పుదురు.

—౏ తిలకాలకలక్షణము. ౏—

తిలాభాం స్తిలకాలకాన్. ౨౫
కృష్ణానవేదనాం స్త్వక్స్థాన్-

శరీరమున నల్లగను నొప్పిలేనిదిగను నువ్వులవంటి యాకారముగలదిగనుండు మచ్చలు చర్మము నాశ్రయించిజనించును. దీనిని తిలకాలకమని వైద్యశ్రేష్ఠులు వచించెదరు.

—౏ మాషలక్షణము. ౏—

మాషాం స్తానేవ చోన్నతాన్,

పైచెప్పిన తిలకాలకమనునది పొడవుగనుండినచో దానిని మాష మనియెదరు.

—౏ చర్మకీలలక్షణము. ౏—

మాషేభ్య స్తూన్నతతరాం శ్చర్మకీలాన్ సితాసితాన్. ౨౬

పైమాషములకన్న మిక్కిలి యున్నతముగను తెలుపు నలుపు వర్ణములతోఁ గూడినదిగనుండు పిటకజనించును. ఇది చర్మకీల మనఁబడును.

—౏ జతుమణిలక్షణము. ౏—

తథావిధో జతుమణిస్సహజో లోహితస్తు సః,

చర్మకీలమువంటి యాకారముగలదిగను శరీరముతోఁగూడ బుట్టినదిగ నెఱ్ఱఁగనుండు పిటక జతుమణి యనఁబడును. (ఇదియే పుట్టుమచ్చ.)

—౏ లాంఛనలక్షణము. ౏—

కృష్ణం సితం వా సహజం మండలం లాంఛనం సమమ్. ౨౭

మండలాకారముగ తెల్లగగాని నల్లగగానియుండు మచ్చ శరీరముతోఁడబుట్టును. దీనిని లాంఛన మనియెదరు. (ఇదియును పుట్టుమచ్చ.)

### వ్యంగనీలికాలక్షణము.

శోకక్రోధాదికుపితాద్వాతపిత్తాన్ముఖే తను,
శ్యామలం మండలం వ్యంగం వక్త్రాదన్యత్ర నీలికా. ౨౮

దుఃఖము కోపము మొదలగువానిచే వాతపిత్తములు ప్రకోపించి ముఖమునందు చిన్నదిగ నల్లగనుండు మండలము జనించును. దీనిని వ్యంగ మనియెదరు. ఇది ముఖము తప్ప యితరశరీరమునజనించిన నీలిక యని చెప్పఁబడును.

### వాతాదివ్యంగలక్షణము.

పరుషం పరుషస్పర్శం వ్యంగం శ్యావం చ మారుతాత్,
పిత్తాత్తామ్రాంతమానీలం శ్వేతాంతం కండుమత్కఫాత్. ౨౯
రక్తాద్రక్తాంతమాతామ్రం శోషం చిఁచిమాయతే,

వాతమువలన జనించినవ్యంగము పరుషముగను కఠినస్పర్శము నలుపు వర్ణముగల దిగనుండును. పిత్తమువలన జనించినవ్యంగము అంచులయందెఱ్ఱగ నడుమ నల్లగనుండును. కఫమువలన జనించినవ్యంగము తెల్లగనుండు అంచుగలదిగను దురదతోఁ గూడినదిగ నుండును. రక్తమువలన జనించినవ్యంగము అంచులయందు రక్తమువంటి వర్ణముగలదిగను నడుమ కొంచెమెఱ్ఱగను శోషతోఁ గూడినదిగనుండును.

### ప్రసుప్తిరోగలక్షణము.

వాయునోదీరితః శ్లేష్మా త్వచం ప్రాప్య విశుష్యతి. ౩౦
తత స్త్వగ్జాయతే పాండుః క్రమేణ చ విచేతనా,
అల్పకండూరవిక్లేదా సా ప్రసుప్తిః ప్రసుప్తితః. ౩౧

వాతముచే బైటికి త్రోయఁబడిన శ్లేష్మము చర్మమును జెంది చక్కఁగ నెండిపోవును. పిదప నాచర్మము తెల్లగనై క్రమముచే స్పర్శజ్ఞానములేనిదై స్వల్పదురదతోఁ గూడి క్లేదరహితముగనుండును. ఇది ప్రసుప్తి యనఁబడును.

### ఉత్కోటలక్షణము.

అసమ్యగ్వమనోదీర్ణ పిత్తశ్లేష్మాన్ననిగ్రహైః,
మండలాన్యతికండూని రాగవంతి బహూని చ. ౩౨

ఉత్కోఠ స్సోఽనుబద్ధస్తు కోఠ ఇత్యభిధీయతే,

చక్కఁగవమనము కాకుండుటవలన ప్రకోపించిన పిత్తశ్లేష్మములచేతను యుక్తకాలములో నాహారమును భుజించకుండుటవలనను మిక్కుటమగు దురద యెఱుపువర్ణము వీనితోఁగూడియుండు ననేకమండలములు జనించును. ఇది ఉత్కోఠమనఁబడును. చిరకాలమనువర్తింపుచుండిన నిదియే కోఠ మనిచెప్పఁబడును.

### క్షుద్రరోగసంఖ్య.

ప్రోక్తా షట్త్రింశదిత్యేతే క్షుద్రరోగా విభాగశః. 33

ఇత్తెఱంగున ముప్పదియారు క్షుద్రరోగములు విభాగముతో జెప్పఁబడినవి.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదియొకటవయధ్యాయము ముగిసెను.





శ్రీ ర స్తు.

# ద్వాత్రింశాధ్యాయము.

అవ. క్షుద్రరోగవిజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము వాని చికిత్సలఁదెలుపు చు క్షుద్రరోగప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## క్షుద్రరోగ ప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతః క్షుద్రరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,

ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

క్షుద్రరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము క్షుద్రరోగచికిత్సలను దెలియఁబఱచునట్టి క్షుద్రరోగప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### అజగల్లికాచికిత్స

విస్రావయే జ్జలౌకోభి రపక్వామజగల్లికామ్,

అజగల్లికారోగము పక్వముకాకపూర్వమే జలగలచే రక్తమోక్షణము చేయించవలయును.

### యవప్రఖ్యాచికిత్స.

స్వేదయిత్వా యవప్రఖ్యాం విలయాయ ప్రలేపయేత్. ౧

దారుకుష్ఠమనోహ్వాలైః.

యవప్రఖ్యయనురోగము పక్వమొందుటకు పూర్వమే స్వేదకర్మనుచేయించి దేవదారు, చెంగల్వకోష్టు, మణిశిల, హరిదళము వీనిని నూరి లేపనము చేయించవలయును. దానివలన కరఁగిపోవును.

### పాషాణగర్దభాదిచికిత్స.

ఇత్యాపాషాణగర్దభాత్,

విధి స్తాం శ్చాచరేత్పక్వా న్వ్రణవ త్సాజగల్లికాన్. ౨

పైచెప్పినప్రకారము గ్రంథి, కచ్ఛపము, పాషాణగర్దభము, శాలూకము, అజగల్లికా అనునీరోగములను చికిత్సచేయవలయును. పైరోగములు పక్వములైయుండినచో వానికి వ్రణచికిత్సను చేయవలయును.

## ముఖదూషిక చికిత్స.

రోధ్రకుస్తుంబరువచాప్రలేపో ముఖదూషికే,
వటపల్లవయుక్తా వా నారికేళోత్థశుక్తయః. ౩
అశాంతౌ వమనం నస్యం లలాటే చ సిరావ్యధః,

ముఖదూషికరోగమునకు లొద్దుగు, ధనియాలు, వస వీనినిగాని, మఱ్ఱిచిగుళ్లు, టెంకాయచిప్పలు వీనినిగాని నూరి లేపనముచేయనలయును. ఇటుల చికిత్స చేసినను ముఖదూషికారోగము నివర్తికాకయుండిన వమననస్యములను చేసి పిదప నుదుటునందు సిరావేధనమును చేయించవలయును.

## పద్మకంటకచికిత్స.

నింబాంబువాంతో నింబాంబుసాధితం పద్మకంటకే. ౪
పిబేత్క్షౌద్రాన్వితం సర్పిర్నింబారగ్వధలేపనమ్,

పద్మకంటకమనురోగమున వేఁపపట్టకషాయముతో వమనముచేయించి వేఁపకషాయముతో పక్వము చేయఁబడినఘృతమును తేనెతోడ పానము చేయించుటయేగాక వేఁపాకు ఱేల వీనిని నూరి లేపనము చేయించవలయును.

## విసృతాదిచికిత్స.

విసృతాదీంస్తు జాలాంతాంశ్చికిత్సేదిరివేల్లికామ్. ౫
పిత్తవీసర్పవత్తద్వత్ప్రత్యాఖ్యాయాగ్నిరోహిణీమ్,

విస్ఫృతరోగము మొదలు జాలరోగమువఱకు నుండు రోగములను, ఇరివేల్లిక యను రోగమును పిత్తవిసర్పమునకు జెప్పియుండువటుల చికిత్సచేయవలెను. అగ్నిరోహిణియను రోగమసాధ్యంబగుటవలన దానిని కుదురుట దుస్తరమనిచెప్పి పైజెప్పినవిధముగ చికిత్సచేయవలెను.

## జాలకగర్దభచికిత్స.

విలంఘనం రక్తవిమోక్షణం చ విరూక్షణం కాయవిశోధనం చ,
ధాత్రీప్రయోగాః శిశిరప్రదేహాః కుర్యాత్సదా జాలకగర్దభస్య.

జాలకగర్దభరోగమున లంఘనము రక్తమోక్షణము రూక్షచికిత్స వమనవిరేచనములు ఉసిరికపండు ప్రయోగము శీతలముగనుండుపట్లు వీని నాయాదోషానుగుణముగ యెల్లపుడు చేయుచుండవలయును.

## విదారికాచికిత్స.

విదారికాం హృతే రక్తే శ్లేష్మగ్రంథి వదాచరేత్,

విదారికారోగమున రక్తమోక్షణము చేయించి శ్లేష్మగ్రంథికిఁ జెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## శర్కరార్బుద చికిత్స

మేదోర్బుదక్రియాం కుర్యాత్సుతరాం శర్కరార్బుదే 2

శర్కరార్బుదరోగమున మేదోర్బుదమునకు జెప్పియుండు చికిత్సలను చక్కఁగ చేయవలయును.

## అసాధ్యవల్మీకము.

ప్రవృద్ధం సుబహుచ్ఛిద్రం సశోఫం మర్మణి స్థితమ్,
వల్మీకం హస్తపాదే చ వర్జయేత్-

మిక్కుటముగ వృద్ధిజెందినదిగ అనేకరంధ్రములతోఁ గూడినదిగ వాఁపుగలదిగ మర్మస్థానమునందును హస్తపాదములయందును జనించినదిగ నుండు వల్మీకరోగమును చికిత్సయందు వర్జింపవలయును. ఇది అసాధ్యము.

## సాధ్యవల్మీకచికిత్స.

దితరత్పునః. 3

శుద్ధస్యాస్రే హృతే లింపేత్సపట్వారేవతామృతైః,
శ్యామాకుళుత్థికామూలదంతీపలలసక్తుభిః 4

పైజెప్పిన అసాధ్యలక్షణములు లేనందునదిగ పైజెప్పిన స్థలములకన్న నితరస్థలములలో జనించినదిగనుండు వల్మీకరోగమునందు వమనవిరేచనములను రక్తమోక్షణమును చేయించి సైంధవలవణము, తెల, తిప్పతీఁగె, తెగడవేళ్లు, ఉలవవేళ్లు, దంతి, మాంసము, సక్తువులు వీనినొకటిగచేర్చి నూరి లేపనము చేయవలయును.

## నాడీవ్రణచికిత్స.

పక్వే తు దుష్టమాంసాని గతీస్సర్వాశ్చ శోధయేత్,
శస్త్రేణ సమ్యగను చ క్షారేణ జ్వలనేన వా. 10

వల్మీకరోగము పక్వమైయుండిన దానియందలి దుష్టమాంసములను అన్నిరంధ్రములను శస్త్రముచే చక్కఁగ ఛేదించి శుద్ధిచేసి క్షారముచేతగాని అగ్నిచేతగాని కాల్చవలయును.

### కదరచికిత్స.

శస్త్రేణోత్కృత్య నిశ్శేషం స్నేహేన కదరం దహేత్,
నిరుద్ధమణివత్కార్యం రుద్ధపాయోశ్చికిత్సితమ్. ౧౧

కదరము రోగమును శస్త్రముచే నిశ్శేషముగ ఛేదించి నూనెచే కాల్చవలయును. రుద్ధగుదరోగమున రుద్ధమణిరోగమునకుఁ జెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### చిప్యచికిత్స

చిప్యం శుద్ధ్యా జితోష్మాణం సాధయేచ్ఛస్త్రకర్మణా,

చిప్యరోగమున వమనవిరేచనములను చేయించి ఉష్ణము లేకుండువానికి శస్త్రకర్మచే చికిత్స చేయవలెను.

### కునఖచికిత్స.

దుష్టం కునఖమప్యేవం.

దుష్టమైయుండు కునఖరోగమునందును చిప్యరోగమునకుఁ జెప్పియుండు నటుల చికిత్స జేయవలయును.

### అలసచికిత్స.

చరణావలసే పునః. ౧౨
ధాన్యామ్లసిక్తౌ కాసీసపటోలీరోచనాతిలైః,
సనింబపత్రైరాలింపేత్.

అలసరోగమున కాళ్ళను పులికడుగుచే చక్కఁగ కడిగి కాసీసము, చేఁదుపొట్ల, గోరోచనము, నువ్వులు, వేఁపాకు వీనిని చక్కఁగనూరి కాళ్ళకు పూయవలయును.

### తిలకాలకచికిత్స.

దహేత్తు తిలకాలకాన్. ౧౩
మాషాంశ్చ సూర్యకాంతేన క్షారేణ యదివాఽగ్నినా,

తిలకాలకము మాషము అనురోగములను సూర్యకాంతము (సురాకారము)చేగాని క్షారముచేగాని నిప్పుచేగాని కాల్చవలయును.

### చర్మకీలజతుమణిచికిత్స.

తద్వదుత్కృత్య శస్త్రేణ చర్మకీలజతూమణీ ౧౪

చర్మకీలము జతుమణి అనురోగములను శస్త్రముచే చక్కఁగఛేదించి పై చెప్పిన ప్రకారము సూర్యకాంతాదులచే దహింపవలయును.

లాంఛనవ్యంగనీలికాచికిత్స.

లాంఛనాదిత్రయే కుర్యా ద్యథాసన్నం సిరావ్యధమ్,
లేపయేత్క్షీరపిష్టైశ్చ క్షీరివృక్షత్వగంకురైః ౧౫

లాంఛనము వ్యంగము నీలిక అను నీమూడురోగములయందును సమీపమునందుండు సిరను వేధించి క్షీరివృక్షములపట్టలను చిగుళ్లను నూరి లేపనముచేయవలయును.

వ్యంగహరలేపములు.

వ్యంగేషు చార్జునత్వగ్వా మంజిష్ఠా వా సమాక్షికా,
లేపస్సనవనీతా వా శ్వేతాశ్వఖురజా మషీ. ౧౬

వ్యంగరోగములయందు మద్దిపట్టనుగాని మంజిష్ఠనుగాని నూరి మాక్షికమను తేనెలోకలిపి లేపనము చేయవలయును, లేక తెల్లగుఱ్ఱముయొక్క గిట్టలనుకాల్చి యామసిని ఆవువెన్నలోకలిపి లేపనము చేయవలయును.

రక్తచందనమంజిష్ఠాకుష్ఠరోధ్రప్రియంగవః,
వటాంకురా మసూరాశ్చ వ్యంగఘ్నా ముఖకాంతిదాః. ౧౭

రక్తచందనము, మంజిష్ఠ, చెంగల్వకోష్టు, లొద్దుగు, ప్రేంకణము, మఱ్ఱిచిగుళ్లు, చిరుశెనగలు వీనిని చక్కఁగనూరి ముఖమునను లేపనముచేసిన వ్యంగరోగము హరించుట యేగాక ముఖమున మంచికాంతియుకల్గును.

ద్వే జీరకే కృష్ణతిలా స్సర్షపాః పయసా సహ,
పిష్టాః కుర్వంతి వక్త్రేందుమపాస్తవ్యంగలాంఛనమ్. ౧౮

జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, నల్లనువ్వులు, ఆవాలు వీనిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలతో నూరి లేపనముచేసిన ముఖమునందలి వ్యంగరోగములు నిశ్శేషముగ హరించును.

క్షీరపిష్టా ఘృతక్షౌద్రయుక్తా వా భృష్టనిస్తుషాః,
మసూరాః క్షీరపిష్టా వా తీక్ష్ణాశ్శాల్మలికంటకాః. ౧౯

సగుడః కోలమజ్జా వా శశాసృక్ క్షౌద్రకల్కితః,
సప్తాహం మాతులుంగస్థం కుష్ఠం వా మధునాన్వితమ్. ౨౦
పిష్టా వా ఛాగపయసా సక్షౌద్రా మూసలీ జటా,
గోరస్థి ముసలీమూలయుక్తం వా సాజ్యమాక్షికమ్ ౨౧

చిరుసెనగలను వేయించి పొట్టుతీసి ఆవుపాలతోనూరి దానియందు దావుటెయ్యిని తేనెను చేర్చిగాని, పదునుగనుండు బూరుగముండ్ల నావుపాలతో జక్కఁగ నూరిగాని, పుల్లని రేగుగుజ్జును కుందేలురక్తముతోనూరి అందులో తేనెను బెల్లమును చేర్చిగాని, చెంగల్వకోష్టును ఏడుదినములవఱకు మాదీఫలములోనుంచి పిదప దానిని చక్కఁగనూరి తేనెలో కలిపిగాని, బూరుగవేళ్ళను మేకపాలతోనూరి యందు తేనె కలిపిగాని, ఆవు యెముకలు బూరుగు వేళ్ళు వీనినినూరి అందు తేనెను ఆవునెయ్యిని కలిపిగాని లేపనము చేసిన వ్యంగరోగము నిశ్శేషముగ హరించును.

## సవర్ణకరలేపము.

జంబ్వామ్రపల్లవామస్తు హరిద్రే ద్వే నవో గుడః,
లేపస్సువర్ణకృత్పిష్టం స్వరసేన చ తిందుకమ్. ౨౨

నేరేడుచిగుళ్లు, మామిడిచిగుళ్లు, పసుపు, మ్రానిపసుపు, కొత్తబెల్లము, పెరుగు మీఁగడ వీనినొకటిగచేర్చి చక్కఁగనూరి లేపనము చేసినను, నల్లతుమికి రసమును లేపనము చేసినను ముఖమునకు మంచివర్ణము కలుగును.

## వ్యంగమున కుద్వర్తనయోగము.

ఉత్పలపత్రం తగరం ప్రియంగుకాలీయకం బదరమజ్జా,
ఇదముద్వర్తన మాస్యం కరోతి శతపత్రసంకాశమ్. ౨౩

నల్లకలువరేకులు, గ్రంథితగరము, ప్రేంకణము, మ్రానిపసుపు, రేగుపండులోని పప్పు వీనిని సమముగగ్రహించి నూరి ముఖమునకు లేపనముచేసిన ముఖమునకు తామర పుష్పమువంటి కాంతి కలుగును.

## వ్యంగహరతైలములు.

ఏభిరేవౌషధైః పిష్టైస్స్నేహాభ్యంగాయ సాధయేత్,
యథాదోషర్తుకాన్ స్నేహాన్ మధుకక్వాథసంయుతైః. ౨౪

పైజెప్పిన నల్లకలువ రేకులు మొదలగు నౌషధములను సమముగ గ్రహించి కల్కముచేసి అతిమధురముయొక్క కషాయములో కలిపి యందులో నువ్వులనూనెను చేర్చి ఆయాదోషానుగుణముగ స్నేహములను పక్వముచేసి ముఖమున కభ్యంగము జేసికొనిన ముఖమునకు మంచికాంతికలుగును.

### నీలికాన్యంగహర లేపనము.

యవాః సర్జరసం రోధ్రముశీరం చందనం మధు,
ఘృతం గుడం చ గోమూత్రే పచేదాదర్వి లేపనాత్. ౨౫
తదభ్యంగాన్నిహంత్యాశు నీలికావ్యంగదూషికాః,
ముఖం కరోతి పద్మాభం పాదౌ పద్మదళోపమౌ. ౨౬

యవలు, సర్జరసము, లొద్దుగు, వట్టివేరు, చందనము, తేనె, నెయ్యి, బెల్లము వీనినొకటిగచేర్చి చక్కగ నూరి గోమూత్రములో కలిపి గరిటెకంటునటుల పాకము చేసి దానిచే ముఖమున కభ్యంగము చేసికొనిన నీలికావ్యంగదూషికారోగములు నిశ్శేషముగ హరించి ముఖపాదములు తామరపుష్పమువంటి కాంతిగలదిగనగును.

### నీలికాదులకు కుంకుమాదితైలము.

కుంకుమోశీరకాలీయలాక్షాయష్ట్యాహ్వచందనమ్,
న్యగ్రోధపాదాంస్తరుణాః పద్మకం పద్మకేసరమ్. ౨౭
సనీలోత్పలమంజిష్ఠం పాలికం సలిలాఢకే,
పక్త్వా పాదావశేషేణ తేన పిష్టైశ్చ కార్షికైః ౨౮
లాక్షాపత్తంగమంజిష్ఠాయష్టీమధుకకుంకుమైః,
అజాక్షీరద్విగుణితం తైలస్య కుడవం పచేత్. ౨౯
నీలికాపలితవ్యంగవలీతిలకదూషికాః,
హంతి తన్నస్యమభ్యస్తం ముఖోపచయవర్ణకృత్. 30

కుంకుమపువ్వు, వట్టివేరు, కాలీయకము (అనగా మ్రానిపసుపు), లక్క, అతిమధురము, చందనము, లేతమఱ్ఱియూడలు, పద్మకము, పద్మకేసరములు, నల్లకలువ, మంజిష్ఠ వీనిని దినుసుకొకపలముచొప్పున గ్రహించి ఒక ఆఢక ప్రమాణ ముదకములో వైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో లక్క, పత్తంగము (అనగా రక్తచందన

ము) మంజిష్ఠ, అతిమధురము, కుంకుమపువ్వు వీనిని కల్కప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి దానితో మేకపాలు రెండు కుడువములు, నువ్వులనూనె ఒక కుడువముచేర్చి తైలపాకవిధిగ పక్వముచేసి దానిచే నస్యము చేయుచుండిన నీలిక, పలితము, వ్యంగము, వలి, తిలకము, దూషికము అనురోగములు హరించుటయేగాక ముఖమునకు మిక్కిలి కాంతి యుకల్గును. కాలీయము అనఁగా—కస్తూరిపసుపనియు, పర్వతములో జనించిన కృష్ణచందనమనియు, కొన్నినిఘంటువులయందు కనఁబడుచున్నది.

### వ్యంగనీల్యాదులకు మంజిష్ఠాదితైలము

మంజిష్ఠాశబరోద్భవస్తువరికాలాక్షా హరిద్రాద్వయం
నేపాలీహరితాలకుంకుమగదా గోరోచనా గైరికమ్,
పత్రం పాండుపటస్యచందనయుగం కాలీయకం పారదం
పత్తంగం కనకత్వచం కమలజం బీజంతథా కేసరమ్. ౩౧
సిక్థం తుత్థం పద్మకాద్యో వసాజ్యం
మజ్జా క్షీరంక్షీరివృక్షాంబు చాగ్నౌ,
సిద్ధం సిద్ధం వ్యంగనీల్యాదినాశే
వక్త్రేచ్ఛాయామైందవీం చాశు ధత్తే. ౩౨

మంజిష్ఠ, తెల్లలొద్దుగు, తువరికా (అనఁగా తువరిమన్ను), లక్క, పసుపు, మ్రానిపసుపు, మణిశిల, హరిదళము, కుంకుమపువ్వు, చెంగల్వకోష్టు, గోరోచనము, కావిరాయి, మఱ్ఱిపండుటాకులు, చందనము, పీతచందనము, కాలీయకము, పాదరసము, రక్తచందనము, ఉమ్మెత్తచెట్టుపట్ట, తామరవిత్తులు, తామరకేసరములు, మైనము, మైలుతుత్తము, పద్మకాదిగణద్రవ్యములు, క్రొవ్వు, నెయ్యి, మజ్జ, పాలు, క్షీరివృక్షముల (మఱ్ఱి జువ్వి రావి మున్నగువాని)పట్టకషాయము వీనినన్నిటి నొకటిగచేర్చి పొయిమీఁదఁబెట్టి పాకముచేసి దానిని ముఖమునకులేపనముచేసిన వ్యంగము నీలి మొదలగురోగములు శమించి ముఖమునందు చంద్రునికి సమానమైన కాంతికలుగును.

### వ్యంగాదులకు నస్యము.

మార్కవస్వరసక్షీరతోయపిష్టాని నావనే,

గుంటగలగరాకురసము, ఆవుపాలు, మంచినీళ్లు వీనినొకటిగఁజేర్చి నస్యముచేయించిన వ్యంగాదిరోగములు శమించును.

### ప్రసుప్తిచికిత్స.

ప్రసుప్తౌ వాతకుష్ఠోక్తం కుర్యాద్దాహం చ వహ్నినా. ౩౩

ప్రసుప్తిరోగమున వాతకుష్ఠమునకుఁ జెప్పియుండు చికిత్సలను చేయుటయేగాక ఆరోగమును నిప్పుచే కాల్చవలయును.

### ఉత్కోఠచికిత్స.

ఉత్కోఠే కఫపిత్తోక్తం కోఠే సర్వం చ కౌష్ఠికమ్,

ఉత్కోఠరోగమున కఫపిత్తమునకుఁ జెప్పియుండు చికిత్సలను, కోఠరోగమున కుష్ఠచికిత్సల నన్నింటిని చేయవలయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదిరెండవయధ్యాయము ముగిసెను.



శ్రీ రస్తు.

# త్రయస్త్రింశాధ్యాయము.

ఆవ. క్షుద్రరోగప్రతిషేధాధ్యాయనిరూపణానంతరము గుహ్యరోగవిజ్ఞానీయాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

# గుహ్యరోగ విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో గుహ్యరోగవిజ్ఞానం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

క్షుద్రరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము గుహ్యరోగములను తెలియపఱచునట్టి గుహ్యరోగవిజ్ఞానమను నీయధ్యాయమును వివరించెదము.

ఉపదంశ్యాదిగుహ్యరోగములు.

స్త్రీవ్యవాయనివృత్తస్య సహసా భజతోఽథ వా,
దోషాధ్యుషితసంకీర్ణమలినాణురజఃపథామ్. ౧
అన్యయోనిమనిచ్ఛంతీమగమ్యాం నవసూతికామ్,
దూషితం స్పృశతస్తోయం రతాంత్వేషఫి నైవ వా. ౨
వివర్ధయిషయా తీక్ష్ణాన్ ప్రలేపాదీన్ ప్రయచ్ఛతః,
ముష్టిదంతనఖోత్పీడావిషవచ్ఛుక్రపాతనైః. ౩
వేగనిగ్రహదీర్ఘాతిఖరస్పర్శవిఘట్టనైః,
దోషా దుష్టా గతా గుహ్యం త్రయోవింశతిమామయాన్. ౪
జనయంత్యుపదంశాదీన్.

స్త్రీసంభోగమును బహుకాలమువదలి మరల నకస్మాత్తుగ స్త్రీసంభోగముచేయుటవలనను, వాతాదిదోషములచే దుష్టంబుగ సంకీర్ణముగ మలినముగ సూక్ష్మముగనుండు రజోమార్గముగల స్త్రీని, లేక తనయందిచ్ఛలేకుండునట్టిస్త్రీని, లేక తోడబుట్టిన స్త్రీని, లేక బాలింతరాలిని సంభోగించుటవలనను; బఱ్ఱె మొదలగు చతుష్పాజ్జంతువులతో సంపర్కము చేయుటవలనను, సురసాంతమున విషము పురుగులు మొదలగువానిచే దూ

### అవమంథలక్షణము

పిటికా బహవో దీర్ఘా దీర్యంతే మధ్యతశ్చ యాః. ౧౨
సోఽవమంథః కఫాసృగ్భ్యాం వేదనారోమహర్షవాన్,

గుహ్యమున నిడుపుగనుండు ననేకపిటకలు జనించును. ఇవి మధ్యమున పగులును. ఈ పిటకలు అవమంథమని చెప్పఁబడును. కఫరక్తమువలన జనించును. ఈరోగమునందు నొప్పి గగుర్పాటు కలుగును.

### కుంభికాలక్షణము.

కుంభికా రక్తపిత్తోత్థా జాంబవాస్థినిభాఽశుజా. ౧౩

దుష్టములగు రక్తపిత్తములవలన నేరేడుగింజలంతేసి యాకారముకలవియు శీఘ్రముగ జనించునవియు నైన పిటకలు జనించును. ఇది కుంభిక యనఁబడును.

### యోన్యలజీలక్షణము.

అలజీం మేహవద్విద్యాత్-

ప్రమేహరోగములకుఁ జెప్పియుండు లక్షణములు మేఢ్రాలజీరోగమునకు కలిగియుండును.

### ఉత్తమాలక్షణము.

ఉత్తమాం రక్తపిత్తజామ్,
పిటకాం మాషముద్గాభాం-

పిత్తరక్తములచే మేఢ్రమునందు మినుపగింజవంటి పిటక జనించును. ఇది ఉత్తమ యనఁబడును.

### పుష్కరికాలక్షణము.

పిటకా పిటకాచితా. ౧౪
కర్ణికా పుష్కరస్యేవ జ్ఞేయా పుష్కరికేతి సా,

అనేకపిటకలతో గూడినదిగ తామరదుద్దువంటి యాకారముగలదిగ నుండు పిటకలు జనించును. ఇది పుష్కరిక యనఁబడును.

### సంమృఢపిటకాలక్షణము.

పాణిభ్యాం భృశసంవ్యూఢే సంవ్యూఢపిటకా భవేత్. ౧౫

చేతులతో మేఢ్రమును మిక్కుటముగ మర్దనము చేయుటవలన మేఢ్రమునందు పిటకజనించును. ఇవి సంవ్యూఢపిటక యనఁబడును.

## మృదితలక్షణము.

మృదితం మృదితం వస్త్రసంరబ్ధం వాతకోపతః,

చేతులతో మేఢ్రమును మర్దించుటవలనను వస్త్రముచే గట్టిగ కట్టుటవలనను వాతము ప్రకోపించి పిటకను జనింపఁజేయును. ఇది మృదిత మనఁబడును.

## అష్ఠీలికాలక్షణము.

విషమా కఠినా భుగ్నా వాయునాష్ఠీలికా స్మృతా. ౧౬

కొంచెము పొడవుగ కఠినముగ వంకరగనుండు పిటక దుష్టవాతముచే జనించును. ఇది అష్ఠీలిక యనఁబడును.

## నివృత్తలక్షణము.

విమర్దనాదిదుష్టేన వాయునా చర్మమేఢ్రజమ్,
నివర్తతే సరుగ్దాహం క్వచిత్పాకం చ గచ్ఛతి. ౧౭
పిండితం గ్రథితం చర్మ తత్ప్రలంబమధోమణేః,
నివృత్తసంజ్ఞం సకఫం కండూకాఠిన్యవత్తుతత్. ౧౮

మేఢ్రమును పిసుకుటవలన వాతము ప్రకోపించి మేఢ్రమునను పైభాగమునందలి చర్మమును నివర్తింపఁజేసి మంట తాపము వీనిని కలుఁగఁజేయును. దానియందొకానొకప్పుడు అగ్రమున వ్రణము జనించును. మణికి క్రిందచర్మము వ్రేలాడుచు నుంటగ నగును. ఆమేఢ్రము కఫము, దురద, కాఠిన్యము వీనితోఁగూడియుండును. దీనికి నివృత్తమని పేరు.

## అవపాటికాలక్షణము.

దుర్యూఢం స్ఫుటితం చర్మ నిర్దిష్టమవపాటికా,

మేఢ్రముయొక్క పైచర్మము దుష్టవాతముచే పగిలి కడుకష్టముచే శమించును. ఇది అవపాటిక యనఁబడును.

## నిరుద్ధమణిలక్షణము.

వాతేన దూషితం చర్మమణౌ సక్తం రుణద్ధి చేత్. ౧౯

స్రోతో మూత్రం తతో ఽభ్యేతి మందధారమవేదనమ్,
మణేర్వికాసరోధశ్చ సనిరుద్ధమణి ర్గదః. ౨౦

వాతముచే దూషింపఁబడినచర్మము మణియందంటుకొని స్రోతస్సును (మూత్రము వెడలు ద్వారమును) అడ్డగించును. అందువలన మూత్ర ముపద్రవరహితముగ స్వల్పముగ వెడలును. మణికి వికాసము కలుగకుండును. దీనికి రుద్ధమణి యనిపేరు.

### గ్రథితలక్షణము.

లింగం శూకై రివాకీర్ణం గ్రథితాఖ్యం కఫోద్భవమ్,

కఫమువలన మేఢ్రమునందు ముండ్లుగుచ్చుకొని యుండునటుల బాధకలుగును ఇది గ్రథిత మనఁబడును.

### స్పర్శహానిలక్షణము.

శూకదూషితరక్తోత్థా స్పర్శహాని స్తదాహ్వయా. ౨

మేఢ్రమునందు రక్తము శూకముచే దూషింపఁబడుటవలన స్పర్శజ్ఞానము లేకుండును. దీనికి స్పర్శహాని యనిపేరు.

### శుహ్యశతపోనకలక్షణము.

ఛిద్రైరణుముఖై ర్యత్తు మేహానం సర్వతశ్చితమ్,
వాతశోణితకోపేన తం విద్యాచ్ఛతపోనకమ్. ౨

వాతరక్తప్రకోపములవలన మేఢ్రమునకు నలుప్రక్కలయందు సూక్ష్మముఖములగల యనేకద్వారములు జనించును. ఇది శతపోనకరోగమని తెలిసికొనవలయు

### త్వక్పాకలక్షణము.

పిత్తాసృగ్భ్యాం త్వచః పాకః త్వక్పాకో జ్వరదాహవాన్,

పిత్తరక్తములవలన జ్వరము సర్వాంగతాపము వీనితోఁగూడియుండు వ్రణ మేఢ్రచర్మమునకు పైభాగముగ జనించును. ఇది త్వక్పాకరోగ మనఁబడును.

### మాంసపాకలక్షణము.

మాంసపాకస్సర్వజస్సర్వవేదనో మాంసశాతనః.

సన్నిపాతమువలన మాంసపాకమను రోగముజనించును. ఇది మిక్కిలియుపద్రవములతోఁగూడినదై త్రిదోషములకును జెప్పిన పోటు, మంట, దురద మొదలగుబాధలతోఁ గూడి మేఢ్రమంతయు పుండై మేఢ్రమునందలి మాంసము నూడునటులఁజేయును.

### రక్తార్బుదలక్షణము.

సరాగైరసిక్తైస్స్రావైః పిటకాభిశ్చ పీడితమ్,
మేహనం వేదనాశ్చోగ్రాస్తం విద్యాదసృగర్బుదమ్. ౨౪

కొంచెమెఱ్ఱగ నల్లగనుండు స్ఫోటకములచేతను పిటకలచేతను మేఢ్రము పీడింపఁబడును. దీనియందు దారుణమైన వ్యాప్తమై పోటు నొప్పి మున్నగుబాధలు కలుగును. దీనిని రక్తార్బుదమని తెలిసికొనవలయును.

### మాంసార్బుదలక్షణము.

మాంసార్బుదం ప్రాగుదితం విద్రధిశ్చ త్రిదోషజః,

గ్రంథ్యాదిరోగవిజ్ఞానీయాధ్యాయమునందు మాంసార్బుదలక్షణము ముందుచెప్పఁబడియున్నది. ఆలక్షణములఁబట్టియే మేఢ్రమున జనించు మాంసార్బుదమును నిర్ణయించునది. ఇది సన్నిపాతమువలనజనించును. మేఢ్రవిద్రధిరోగము త్రిదోషములవలన జనించును. దీనిలక్షణము విద్రధ్యాది విజ్ఞానీయమున ముందే చెప్పఁబడినది.

### తిలకాలకలక్షణము.

కృష్ణాని భూత్వా మాంసాని విశీర్యంతే సమంతతః. ౨౫
పక్వాని సన్నిపాతేన తాన్విద్యాత్తిలకాలకాన్,

మేఢ్రమునందలి మాంసము నల్లనై సన్నిపాతదోషముచే పాకమునుజెంది నలుప్రక్కల నూడిపడును. దీనిని తిలకాలకరోగమని తెలిసికొనవలయును.

### అసాధ్యగుహ్యరోగములు

మాంసోత్థమర్బుదం పాకం విద్రధిం తిలకాలకాన్. ౨౬
చతురో వర్జయేదేషాం శేషాన్ శీఘ్రముపాచరేత్,

పై చెప్పినరోగములలో మాంసార్బుదము మాంసపాకము విద్రధితిలకాలకము అను నాల్గురోగములు అసాధ్యంబులగుటవలన చికిత్సయందు వర్జింపఁదగినవి. తక్కిన పదునారు రోగములను శీఘ్రముగ చికిత్సచేయవలయును.

### యోనిరోగసంఖ్య.

వింశతిర్వ్యాపదో యోనేర్జాయంతే దుష్టభోజనాత్. ౨౭

హితములుకాని యాహారముల భుజించుటవలన స్త్రీలయోనియందు రోగములు జనించును. ఇవి వ్యాపత్తులనఁబడును. అవ్వవి యిరువదిభేదములు కల్గియుండును.

### వాతకీలక్షణము.

విషమస్థాంగశయనభృశమైథునసేవనైః,
దుష్టార్తవాదపద్రవ్యైర్బీజదోషేణ దైవతః. ౨౮
యోనౌ క్రుద్ధోऽనిలః కుర్యాద్రుక్తోదాయామసుప్తతాః,
పిపీలికాసృప్తిమివ స్తంభం కర్కశతాం స్వనమ్. ౨౯
ఫేనిలారుణకృష్ణాల్పతనురూక్షార్తవస్రుతిమ్,
స్రంసం వంక్షణపార్శ్వాదౌ వ్యథాం గుల్మం క్రమేణ చ. 30
తాంస్తాంశ్చ స్వాన్ గదాన్ వ్యాపద్వాతికీ నామ సా స్మృతా,

మిట్టపల్లములయందు పరుండుట, అవయవములను వ్యస్త్యస్తముగ నుంచుకొని పరుండుట, అధికముగ మైథునముచేయుట, ఋతురక్తము వాతాదులచే చెడుట, జన్మకు కారణమైనబీజము దుష్టమగుట, ఇవి మొదలగు కారణములచే వాతము ప్రకోపించి యోనియందు నొప్పి పోట్లు ఆయామవాతము సుప్తత, చీమలు పాకులాడునటు లుండుట, యోనియందు స్తబ్ధత్వము కాఠిన్యము శబ్దముకలుగుట, నురుగుతోఁగూడినదిగ యెఱ్ఱగ నల్లగ స్వల్పముగ శోణితము స్రవించుట, గజ్జలు పార్శ్వములు జారుట, విశేషముగ నొప్పికలుగుట, గుల్మము, అనేకవిధరోగములు ఇవి క్రమముగ నానాటజనించుట, యీ లక్షణములు వాతకీరోగమునకు కలిగియుండును.

### అతిచరణాలక్షణము.

సైవాతిచరణా శోఫసంయుక్తాऽతివ్యవాయతః. 3౧

అధికముగ మైథునము చేయుటవలన పైవాతకీరోగమునందు వాపుకలుగును. ఇది అతిచరణ యనఁబడును.

### ప్రాక్చరణాలక్షణము.

మైథునాదతిబాలాయాః పృష్ఠజంఘోరు వంక్షణమ్,
రుజన్ సందూషయేద్యోనిం వాయుః ప్రాక్చరణేతి సా. 3౨

బాలగానుండుస్త్రీ ఋతుమతి కాకమునుపు మైథునముచేయుటవలన వాతము ప్రకోపించి వీపు పిక్కలు తొడలు గజ్జలు వీనిని బాధింపుచు యోనిని దుష్టముగజేయును. ఇది ప్రాక్చరణయను రోగమనఁబడును.

### ఉదావృత్తాలక్షణము.

వేగోదావర్తనాద్యోనిం ప్రపీడయతి మారుతః,
సఫేనిలం రజః కృచ్ఛ్రాదుదావృత్తం విముంచతి. 33

ఇయం వ్యాపదుదావృత్తా-

శోణితవేగము నడ్డగించుటచే వాతము యోనిని మిక్కుటముగ పీడించును. అందువలన నాయోనియందుండి రజస్సు నురుగుతోఁ గూడి కడుకష్టముతో వెడలును. ఇది ఉదావృత్తరోగ మనఁబడును.

## జాతఘ్నీలక్షణము.

జాతఘ్నీ తు యదానిలః,
జాతం జాతం సుతం హంతి రౌక్ష్యాద్దుష్టార్తవోద్భవమ్. 34

వాతాదులచే దుష్టముగ నున్న యార్తవముచే బుట్టిన శిశువును ప్రకుపితమైన వాతము తనయందలి రూక్షగుణముచే చంపును. ఇత్తెరంగు పుట్టిన శిశువులనెల్ల చంపుచుండును. ఈవ్యాధి జాతఘ్ని (శిశువుల జంపునది) యనఁబడును.

## అంతర్ముఖీలక్షణము.

అత్యాశితాయా విషమం స్థితాయాస్సురతే మరుత్,
అన్నేనోత్పీడితో యోనేః స్థితః స్రోతసి వక్రయేత్. 35
సాస్థిమాంసం ముఖం తీవ్రరుజమంతర్ముఖీతి సా,

అధికముగ నన్నమును భుజించినదిగ మిట్టపల్లమునందు పరుండునదిగ నుండు స్త్రీకి మైథునకాలమున వాతము అన్నముతోఁ గూడి యోనియందలి స్రోతస్సును జేరి యాయోనిముఖమును మిక్కిలి యుపద్రవము కలదిగను వంకరగను జేయును. ఇది అంతర్ముఖియనఁబడును.

## సూచీముఖీలక్షణము.

వాతలాహారసేవిన్యాం జనన్యాం కుపితోఽనిలః. 36
స్త్రియో యోనిమణుద్వారాం కుర్యాత్సూచీముఖీతి సా,

వాతప్రకోపకరమైన యాహారములను తల్లి భుజించినయెడల వాతము ప్రకోపించి గర్భములో నుండు స్త్రీశిశువుయొక్క యోనిద్వారమును సూక్ష్మముగ జేయును. ఇది సూచీముఖీరోగ మనఁబడును.

## శుష్కాఖ్యాలక్షణము.

వేగరోధాదృతౌ వాయుర్దుష్టో విణ్మూత్రసంగ్రహమ్. 37
కరోతి యోనేశ్శోషం చ శుష్కాఖ్యా సాఽతివేదనా,

ఋతుకాలమున మలమూత్రవేగముల నడ్డగించుటవలన వాతము దుష్టంబై మలమూత్రముల నడ్డగించి యోనిని శుష్కించునటులఁ జేయును. ఇది శుష్కరోగ మనఁబడును. మిక్కిలి నొప్పితోఁ గూడియుండును.

వామినీలక్షణము.

షడహాత్సప్తరాత్రాద్వా శుక్రం గర్భాశయాన్మరుత్. ౩౮
వమేత్సరుజ్నీరుజో వా యస్యాస్సా వామినీ మతా,

దుష్టవాతము ఋతుస్నానమునకు పిదప ఆరు ఏడుదినములలో నొకల స్త్రీగర్భాశయమునుండి నొప్పితోఁగాని నొప్పిలేకగాని శుక్రమును వెడలింపఁ జేయును. ఇది వామిని యని చెప్పఁబడును.

షండలక్షణము.

యోనౌ వాతోపతప్తాయాం స్త్రీగర్భే బీజదోషతః. ౩౯
నృద్వేషిణ్యస్తనీ చ స్యాత్షండసంజ్ఞానుపక్రమా,

యోని వాతముచే పీడింపఁబడియుండు సమయమున స్త్రీపురుషసంపర్కము చేసి అందువలన గర్భము ధరించిన బీజదోషమువలన నాగర్భములోనుండి జనించిన స్త్రీసంతానము స్తనములు లేనిదిగ పురుషుని ద్వేషించునట్టి (సంభోగమునం దిచ్ఛలేని) స్వభావము గలదిగనగును. ఇది షండరోగమనఁబడును. అసాధ్యము.

మహాయోనిలక్షణము.

దుష్టో విష్టభ్య యోన్యాస్యం గర్భకోష్ఠం చ మారుతః. ౪౦
కురుతే విసృతాం స్రస్తాం వాతకీమివ దుఃఖితామ్,
ఉత్పన్నమాంసాం తామాహుర్మహాయోనిం మహారుజామ్. ౪౧

వాతము దుష్టంబై యోనిముఖమును గర్భకోష్ఠమును జేరి యాయోని ముఖము తెఱవఁబడినదిగ జారినదిగ వాతికీరోగమునవలె మిక్కిలి యుపద్రవములతోఁ గూడినదిగ మాంసము బైటికివచ్చి యుండునదిగ జేయును. ఇది మహాయోని యనఁబడును.

పైత్తికీలక్షణము.

యథాస్వైర్దూషణైర్దుష్టం పిత్తం యోనిముపాశ్రితమ్,
కరోతి దాహపాకోషాం పూతిగంధజ్వరాన్వితామ్. ౪౨
భృశోష్ణభూరికుణపనీలపీతాసితార్తవామ్,
సా వ్యాపత్పైత్తికీ.

సర్వరోగ నిదానాధ్యాయములో చెప్పియుండు పిత్తప్రకోపకారణములచే దుష్టమైన పిత్తము యోనియందు జేరి తాపము, పాకము, మంట, గుర్గంధము, జ్వరము వీనిని కలుగఁజేసి మిక్కిలి యుష్ణముగ అధికముగ శవగంధము గలదిగ నల్లగ పసుపువర్ణముగ కొంచెము తెల్లగనుండు ఆర్తవమునురక్తమును యోనియందుండి స్రవింపఁజేయును. ఇది పైత్తికీయనఁబడును.

## రక్తయోనిలక్షణము.

రక్తయోన్యాఖ్యాసృగతిస్రుతేః. ౪౩

యోనియందుండి రక్తమధికముగ స్రవించిన నది రక్తయోని యనఁబడును.

## శ్లైష్మికీలక్షణము.

కఫోఽభిష్యందిభిః క్రుద్ధః కుర్యాద్యోనిమవేదనామ్,
శీతలాం కండులాం పాండుపిచ్ఛిలాం తద్విధస్రుతిమ్. ౪౪
సా వ్యాపచ్ఛ్లైష్మికీ.

కఫప్రకోపకారణములచే శ్లేష్మము ప్రకోపించి యోని నుపద్రవరహితముగ, శీతలముగ దురదతోఁ గూడినదిగ తెల్లగ జిగటగ నుండుస్రావముతో గూడినదిగ జేయును. ఇది శ్లైష్మికి యనఁబడును.

## లోహితక్షయాలక్షణము.

వాతపిత్తాభ్యాం క్షీయతే రజః,
సదాహకార్శ్యవైవర్ణ్యం యస్యాం సా లోహితక్షయా. ౪౫

దుష్టవాతపిత్తములచే రజస్సు క్షయించి యోనియందు మంటకార్శ్యము వికారవర్ణము కలుగును. ఇది లోహితక్షయ మనఁబడును.

## పరిప్లుతాలక్షణము.

పిత్తలాయా నృసంవాసే క్షవథూద్గారధారణాత్,
పిత్తయుక్తేన మరుతా యోనిర్భవతి దూషితా. ౪౬
శూనా స్పర్శాసహా సార్తిర్నీలపీతాస్రవాహినీ,
వస్తికుక్షిగురుత్వాతిసారారోచకకారిణీ. ౪౭

శ్లో॥ శివంతక్షణరుక్తోదజ్వరకృత్సా పరిప్లుతా,
పిత్తాధిక్యముతోఁ గూడియుండు స్త్రీకి పురుషసంయోగమువలనను దగ్గును తే
పును అడ్డగించుటవలనను వాతము పిత్తముతోగూడి యోనిని చెఱచును. దానివల
యోని యుబ్బినదిగ స్పర్శను సహించకుండునదిగ నొప్పితోఁ గూడినదిగ నల్లగ పసు
వర్ణముగనుండు రక్తమును స్రవింపఁజేయునదిగ నగును. మఱియు నాస్త్రీకి పొత్తికడు
నందును కడుపునందును గురుత్వము అతిసారము అరోచకము పిక్కలయందును గజ్జ
యందును పోట్లు శూలజ్వరము ఇవి కలుగును. ఇది పరిప్లుతారోగ మనఁబడును.

ఉపప్లుతాలక్షణము.

వాతశ్లేష్మామయవ్యాప్తా శ్వేతపిచ్ఛిలవాహినీ. ౪౹
ఉపప్లుతా స్మృతా యోనిః-

స్త్రీయోని వాతశ్లేష్మరోగములచే పీడింపఁబడి తెల్లగ జిగటగనుండు స్రావమ
తోగూడినదిగ నగును. ఇది ఉపప్లుతాయని చెప్పఁబడును.

విప్లుతాలక్షణము.

విప్లుతాఖ్యా త్వధావనాత్,
సంజాతజంతుః కండూలా కండ్వాచాతిరతిప్రియా. ౪౬
యోనిని చక్కఁగ కడుగకుండుటవలన దానియందు క్రిములుజనించి విశేషము
దురదను కలుగఁజేయును. అందుచే నకస్మాత్తుగ పురుషసంభోగమునం దధికముగ నిచ్ఛ
బొడమును. ఇది విప్లుతమనఁబడును.

కర్ణినీలక్షణము.

అకాలవాహనాద్వాయుశ్శ్లేష్మరక్తవిమూర్ఛితః,
కర్ణికాం జనయేద్యోనౌ రజోమార్గనిరోధినీమ్. ౫౦
సా కర్ణినీ-

ఋతుకాలమునకంటె నితరమైనకాలమున రజస్సు స్రవించుటవలన వాతము
ప్రకోపించి కఫరక్తములతో గూడి యోనియందు రజోమార్గము నడ్డగించునట్టి కర్ణికన
కలుగఁజేయును. ఇదికర్ణిని యనఁబడును.

సాన్నిపాతికీలక్షణము.

త్రిభిర్దోషైర్యోనిగర్భాశయాశ్రితైః,
యథాస్వోపద్రవకరైర్వ్యాపత్సా సాన్నిపాతికీ. ౫౧

త్రిదోషములు ప్రకోపించి అవి యోని గర్భాశయము వీనినిఁజేరి అనేకోపద్రవములను కలుగఁజేయును. దీనికి సాన్నిపాతికీ యనిపేరు.

ఇతి యోనిగదా నారీ యైశ్శుక్రం న ప్రతీచ్ఛతి,
తతో గర్భం న గృహ్ణాతి రోగాంశ్చాప్నోతి దారుణాన్,
అసృగ్దరార్శోగుల్మాదీనాబాధాశ్చానిలాదిభిః. ౬౩ ౨

రోగములచే యోని శుక్రమును గ్రహించక గర్భమును ధరించకయుండును. దారుణములగు అసృగ్దరాది రోగములును వాతపిత్త కఫజనితములైన నానావిధోపద్రవములును స్త్రీలకు గలుగును. అట్టియోనిరోగములు విశదముగ చెప్పఁబడినవి.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదిమూడవయధ్యాయము ముగిసెను.



శ్రీ రస్తు.

# చతుస్త్రింశాధ్యాయము.

అవ. గుహ్యరోగవిజ్ఞానీయాధ్యాయనిరూపణానంతరము వానిచికిత్సల దెలుపు గుహ్యరోగప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

# గుహ్యరోగప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో గుహ్యరోగప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

గుహ్యరోగ విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము గుహ్యరోగచికిత్సలను నిరూపించునట్టి గుహ్యరోగప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

## ఉపదంశరోగచికిత్స.

మేఢ్రమధ్యే సిరాం విధ్యేదుపదంశే నవోత్థితే,
శీతాం కుర్యాత్క్రియాం శుద్ధిం విరేకేణ విశేషతః. ౧
తిలకల్కఘృతక్షౌద్రైర్లేపః పక్వే తు పాటితే,

ఉపదంశరోగము జనించిన తోడనే మేఢ్రమధ్యమునందలి సిరను వేధించవలయును. చల్లగనుండు లేపసేకములను చేయించవలయును. పలుమాఱు విరేచనముల కొసఁగవలయును. రోగము పక్వమైయుండిన దానిని ఛేదించి తెలికపిండి, నెయ్యి, తేనె వీనిని నూరి లేపనము చేయించవలయును.

## ఉపదంశరోగమునకు కషాయతైలములు.

జంబ్వామ్రసుమనోనీపశ్వేతకాంబోజికాంకురాః. ౨
సల్లకీబదరీబిల్వపలాశతినిశోద్భవాః,
త్వచః క్షీరిద్రుమాణాం చ త్రిఫలాం చ జలే పచేత్. ౩
స క్వాథః క్షాళనం; తేన పక్వం తైలం చ రోపణమ్,

నేరేడు, మామిడి, జాజి, కడిమి, తెల్లదింటెన వీనిచిగుళ్లను, అదుగు, రేగు, మారేడు, మోదుగు, సెమ్మి, క్షీరివృక్షములు వీనిపట్టలను, త్రిఫలములను సమభాగములుగ గ్రహించి యుదకములో వైచి చక్కఁగ కషాయము కాఁచి దానిచే మేఢ్రవ్రణమును పలుమారు కడుగవలయును. మఱియు పైకషాయములో నువ్వులనూనెనుచేర్చి తైలపాకవిధిగ పాకముచేసి చరిమిన నుపదంశవ్రణము శమించును.

## ఉపదంశవ్రణహరలేపము.

తుత్థగైరికలోధ్రైలామనోహ్వాలరసాంజనైః. ౪
హరేణుపుష్పకాసీససౌరాష్ట్రీలవణోత్తమైః,
లేపః క్షౌద్రయుతైస్సూక్ష్మైరుపదంశవ్రణాపహః. ౫

మైలుతుత్తము, కావిరాయి, లొద్దుగు, ఏలకులు, మణిశిల, హరిదళము, రసాంజనము, రేణుకలు, పుష్పకాసీసము, సౌరాష్ట్రి (అనఁగా తువరిమన్ను), సైంధవలవణము వీనిని సమభాగముగ గ్రహించి చక్కఁగనూరి తేనెలో కలిపి లేపనముచేసిన నుపదంశరోగము శమించును.

కపాలే త్రిఫలా దగ్ధా సఘృతా రోపణం పరమ్,

త్రిఫలములను సమభాగములుగ గ్రహించి కుండపెంకులో వైచి కాల్చి దానిని తేనెలో కలిపి లేపనము చేసిన నుపదంశవ్రణము మానును.

## వాతజాద్యుపదంశచికిత్స.

సామాన్యం సాధనమిదం ప్రతిదోషం తు శోఫవత్. ౬

పైచెప్పిన చికిత్స లుపదంశరోగము లన్నిఁటికిని సామాన్యముగ చెప్పఁబడినవి. వాతజాద్యుపదంశ రోగములయందు వాతజశోఫలకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## ఉపదంశపాకనిషేధము.

న చ యాతి యథా పాకం ప్రయతేత తథా భృశమ్,
పక్వైస్స్నాయుసిరామాంసైః ప్రాయో నశ్యతి హి ధ్వజః. ౭

ఉపదంశవ్రణము పాకమును జెందకుండునటుల మిగుల జాగరూకతతో చికిత్స జేయవలెను. ఆవ్రణము పాకమును జెందినచో నరములు, సిరలు, మాంసములు ఇవి పుండై మేఢ్రము నశించును.

## మేఢ్రార్శశ్చికిత్స.

అర్శసాం ఛిన్నదగ్ధానాం క్రియా కార్యోపదంశవత్,

మేఢ్రార్శస్సులను ఛేదించి క్షారాదులతో కాల్చి యుపదంశరోగమునకు జెప్పి యుండునటుల చికిత్సచేయవలెను.

## సర్షపికాచికిత్స.

సర్షపాలిఖితాస్సాస్త్రైః కషాయైరవచూర్ణయేత్. ౮

తై రేవాభ్యంజనం తైలం సాధయేద్వ్రణరోపణమ్,

సర్షపికయను గుహ్యరోగమును శస్త్రముచే ఛేదించి వగరుగనుండు నేరేడు మొదలగువానిపట్టలను సన్నగ చూర్ణము చేసి వ్రణముపై వేయవలయును. మఱియు పై నేరేడు మొదలగువానిపట్టల కషాయముతో బక్వముచేయఁబడిన తైలముచే నభ్యంజనము చేయించిన వ్రణము శమించును.

## అవమంథచికిత్స.

క్రియేయమవమంథేఽపి రక్తం స్రావ్యం తథోభయోః. ౯

పైచికిత్సను అవమంథమను గుహ్యరోగమునందును చేయించవలయును. సర్షపికావమంథరోగములయందు రక్తమోక్షణము చేయించవలయును.

## కుంభికాచికిత్స.

కుంభికాయాం హరేద్రక్తం పక్వాయాం శోధితే వ్రణే,

తిందుకత్రిఫలారోధ్రైర్లేపస్తైలం చ రోపణమ్. ౧౦

కుంభికయను గుహ్యరోగమున రక్తమోక్షణము చేయించవలయును. పైరోగము పక్వమై యుండిన దానిని చక్కఁగ కడిగి నల్లతుమికి, త్రిఫలములు, లొద్దుగు వీనిని నూరి లేపనము చేయవలయును. మఱియు పైనల్లతుమికి మొదలగు వానితో బక్వము చేయఁబడిన తైలమును చరిమిన వ్రణము శమించును.

## అలజీచికిత్స.

అలజ్యాం స్రుతరక్తాయామయమేవ క్రియాక్రమః,

అలజీరోగమునందు రక్తమోక్షణము చేయించి పైచికిత్సలనే చేయవలయును.

## ఉత్తమాచికిత్స.

ఉత్తమాఖ్యాం తు పిటికాం సంఛిద్య బడిశోద్ధృతామ్. ౧౧

కల్కైశ్చూర్ణైః కషాయాణాం క్షౌద్రయుక్తైరుపాచరేత్,

ఉత్తమాయను పిటకను బడిశమను నాయుధముచే పైకెత్తి చక్కగ ఛేదించి వగరు రసముగల ద్రవ్యములయొక్క చూర్ణములలో తేనెనుచేర్చి దానిచే లేపనాదులను చేయించవలయును.

### పుష్కరవ్యూఢచికిత్స.

క్రమః పిత్తవిసర్పోక్తః పుష్కరవ్యూఢయోర్హితః, ౧౨

పుష్కరికము, సంవ్యూఢము అను నీరోగములయందు పిత్తవిసర్పరోగమునకుఁ జెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### త్వక్పాకచికిత్స.

త్వక్పాకే స్పర్శహాన్యాం చ సేచయేత్.

త్వక్పాకము స్పర్శహాని అను రోగములయందు సేచనమును చేయించవలయును.

### మృదితచికిత్స.

మృదితం పునః,
బలాతైలేన కోష్ణేన మధురైశ్చోపనాహయేత్. ౧౩

మృదితమను లింగరోగమునందు నిఁక చెప్పఁబోయెడు బలాతైలమును కొంచెమున్నముగ లేపనముచేసి మధురద్రవ్యకల్కముతో కూడినదిగ సుఖోష్ణముగ ఘృతసహితముగ నుండు నుపనాహమును (కట్టుగట్టుటను) చేయించవలయును.

### అష్ఠీలికాచికిత్స.

అష్ఠీలికాం హృతే రక్తే శ్లేష్మగ్రంథివదాచరేత్,

అష్ఠీలికారోగమున రక్తక్షణము చేయించి శ్లేష్మగ్రంథిరోగమునకుఁ జెప్పియుండునటుల చికిత్సచేయవలయును.

### నివృత్తచికిత్స.

నివృత్తం సర్పిషాభ్యజ్య స్వేదయిత్వోపనాహయేత్. ౧౪
త్రిరాత్రం పంచరాత్రం వా సుస్నిగ్ధైశ్శాల్వలాదిభిః,
స్వేదయిత్వా తతో భూయస్స్నిగ్ధం చర్మసమానయేత్. ౧౫
మణిం ప్రపీడ్య శనకైః ప్రవిష్టే చోపనాహనమ్,
మణౌ పునః పునస్స్నిగ్ధం భోజనం చాత్ర శస్యతే. ౧౬

నివృత్తమను పేరుగల లింగరోగమునందు మేఢ్రమునకు నేతినిపూసి స్వేదకర్మను చేయించి మూఁడు, లేక అయిదు దినములవఱకు స్నిగ్ధముగనుండు శాల్వలాదులచే నుపనాహస్వేదమును చేయించి మఱల సామాన్యముగ స్వేదకర్మనొనర్చి మృదువుగనుండు మేఢ్రచర్మములో మేఢ్రమణిని మెల్లగ ప్రవేశింపఁజేసి, అది చక్కఁగ ప్రవేశించియుండునప్పుడు ఉపనాహస్వేదమును పలుమాఱు చేయించి ఘృతాదిస్నేహసహితముగ నాహారమును భుజింపఁజేయవలయును.

### అవపాటీచికిత్స

అయమేవ ప్రయోజ్యస్స్యాదవపాట్యామపి క్రమః,

అవపాటికయను లింగరోగమునందు పై నివృత్తలింగరోగమునకు చెప్పియుండు రీతుల చికిత్సలను చేయవలయును.

### నిరుద్ధమణిచికిత్స

నాడీ ముభయతోద్వారాం నిరుద్ధే జతునా కృతామ్. ౧౭
స్నేహాక్తాం స్రోతసి న్యస్య సించేత్ స్నేహైశ్చలాపహైః,
త్ర్యహాత్ త్ర్యహాత్ స్థూలతరాం తస్య నాడీం వినిర్ధయేత్. ౧౮
స్రోతోద్వారమసిద్ధౌ తు విద్వాన్ శస్త్రేణ పాటయేత్,
సేవనీం వర్జయన్యుంజ్యాత్సద్యః క్షతవిధిం తతః. ౧౯

నిరుద్ధమణియను పేరుగల మేఢ్రరోగమునందునిరు ప్రక్కలయందు ద్వారముఁగల గొట్టమునకు లక్కనుబూసి నేతిలోతడిపి దానిని స్నేహవిధ్యధ్యాయములో జెప్పియుండు ప్రకారము మేఢ్రద్వారములో నునిచి వాతహరములైన బలాతైలము మొదలగువాని నాగొట్టములోపోసి సేచనము చేయుచుండవలయును. ఇటుల మూఁడుదినములు చేసి యాగొట్టమునుతీసివేసి దానికంటె లావుగనుండు మఱియొకగొట్టమును ముందువలె మేఢ్రద్వారములోనుంచి బలాతైలాదులచే సేచనము చేయుచుండవలయును ఇటుల నామేఢ్రద్వారమును వృద్ధిజేయవలయును. ఇటుల చికిత్సజేసినను నిరుద్ధమణిరోగము శమింపకయుండిన బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు మేఢ్రమునందుండు సేవనియను నాడియందు గాయము తగులనీయక పైనిరుద్ధమణిని శస్త్రముచే ఛేదించి పిదప సద్యఃక్షతరోగమునకుఁ జెప్పియుండు చికిత్సలను చేయించవలయును.

### గ్రంథితచికిత్స

గ్రంథితం స్వేదితం నాడ్యా స్నిగ్ధోష్ణైరుపనాహయేత్,

గ్రంథితమను రోగమునకు నాడీస్వేదమును జేయించి పిదప స్నిగ్ధముగ నుష్ణముగ నుండు ఉపనాహస్వేదమును జేయించవలయును.

## శతపోనకచికిత్స.

లింపేత్కషాయైస్సక్షౌద్రైర్లిఖిత్వా శతపోనకమ్. ౨౦

శతపోనకమను మేఢ్రరోగమును శస్త్రముచే ఛేదించి వగరురసముగల ద్రవ్య చూర్ణములో తేనెను కలిపి లేపనము జేయవలయును.

## రక్తార్బుదచికిత్స.

రక్తవిద్రధివత్కార్యా చికిత్సా శోణితార్బుదే,

శోణితార్బుదరోగమునందు రక్తవిద్రధిరోగమునకు జెప్పియుండు చికిత్సలను జేయవలయును.

## అంగరోగోపచారము.

వ్రణోపచారం సర్వేషు యథావస్థం ప్రయోజయేత్. ౨౧

పైలింగరోగములన్నిటియందు ఆయాయవస్థానుగుణముగ వ్రణసామాన్యమునకు జెప్పిన అంతశ్శుద్ధి కషాయలేపన ఘృతతైలరసక్రియాచూర్ణాద్యుపచారములను జేయించ వలయును.

## యోనివ్యాపచ్చికిత్స.

యోనివ్యాపత్సుభూయిష్ఠం శస్యతే కర్మవాతజిత్,
స్నేహనస్వేదవస్త్యాదివాతజాసు విశేషతః. ౨౨

యోనిరోగములయందు తఱుచుగా వాతమును పోగొట్టునట్టి స్నేహస్వేదవస్తి కర్మ మొదలగు చికిత్సలం జేయవలయును. వాతజములైన యోనిరోగములయందు స్నేహ స్వేదవస్త్యాది వాతహరచికిత్సలను మిక్కుటముగ జేయవలయును.

న హి వాతాదృతే యోనిర్వనితానాం ప్రదుష్యతి,
అతో జిత్వా తమన్యస్య కుర్యాద్దోషస్య భేషజమ్. ౨౩

దుష్టవాతసంబంధములేకయే యోనిరోగము జనించదు. కాబట్టి యోనివ్యాపత్తులకు తొలుత వాతమునకు చికిత్సజేసి పిదప పిత్తాదిదోషములకు చికిత్సజేయ వలయును.

## యోనిరోగమునందు బలాతైలాద్యుపయోగము.

పాయయేత బలాతైలం మిశ్రకం సుకుమారకమ్,
స్నిగ్ధస్విన్నాం తథా యోనిం దుస్థితాం స్థాపయేత్సమామ్. ౫౨
పాణినోన్నమయేజ్జిహ్మాం సంవృతాం వ్యధయేత్పునః,
ప్రవేశయేన్నిస్సృతాం చ వివృతాం పరివర్తయేత్. ౫౩
స్థానాపవృత్తా యోని ర్హి శల్యభూతా స్త్రియో భవేత్,

యోనిరోగముగల స్త్రీకి బలాతైలము మిశ్రకఘృతము సుకుమారకఘృతము అనునౌషధములను పానము చేయించవలయును. మఱియు విషమముగనుండు ఆయోనికి స్నేహస్వేదకర్మలను జేయించి దానిని సరిగా నుంచవలయును. అది వంకరగనుండిన చేతితో సరిగా చేయవలయును. సంకోచమును జెందియుండిన దానిని విశాలముగ చేయవలయును. బైటికి వచ్చియుండిన లోన ప్రవేశింపఁ జేయవలయును. తెఱవఁబడి యుండిన దానిముఖము మూయునటుల చేయవలయును. స్వస్థానమునందుండి జారి విషమముగనుండుయోని స్త్రీలకు మిగుల నాపదను కలుగఁజేయును. కావున నెన్నివిధముల నైన సమస్థితినుంచుట ముఖ్యము.

## యోనిరోగమునందు వమనాదికర్మలు.

కర్మభిర్వమనాద్యైశ్చ మృదుభిర్యోజయేత్స్త్రియమ్. ౫౪
సర్వతస్సువిశుద్ధాయా శ్శేషం కర్మ విధీయతే,
వస్త్యభ్యంగపరీషేకప్రలేపపిచుధారణమ్. ౫౫

యోనిరోగముగల స్త్రీకి మృదువైన వమనవిరేచనాదికర్మలను తొలుతఁ జేయించవలయును. ఊర్ధ్వాధోభాగములయందు శుద్ధమైన శరీరముగల స్త్రీకి వస్తికర్మ, అభ్యంజనము, పరిషేకము, ప్రలేపము, పిచుధారణము మొదలగు చికిత్సలను జేయవలయును.

## యోనిరోగమునకు కాశ్మర్యాదిఘృతము.

కాశ్మర్యత్రిఫలాద్రాక్షా కాసమర్దనిశాద్వయైః,
గుడూచీసైర్యకాభీరుశుకనాసాపునర్నవైః ౫౬
పరూషకైశ్చ విపచేత్ప్రస్థమక్షసమైర్ఘృతాత్,
యోనివాతవికారఘ్నం తత్పీతం గర్భదం పరమ్. ౫౭

పెద్దగుమ్ముడు, త్రిఫలములు, ద్రాక్ష, కసివెంద, పసుపు, మ్రానిపసుపు, తిప్పతీఁగె, ములుగోరింట, పిల్లిపీచర, దుందిలము, గలిజేరు, పెద్దయీఁత అనువానిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి కల్కముచేసి ఒకప్రస్థ మావునెయ్యిలో కలిపి ఘృతపాకవిధిగ పాకముచేసి పానము చేయించిన స్త్రీలకు యోనిలో జనించు వాతరోగములు హరించుటయేగాక స్త్రీలు గర్భమునుకూడ ధరింతురు.

యోనిరోగమునకు వచాద్యుపయోగము.

వచోపకుంచికాఽజాజీకృష్ణావృషకసైంధనమ్,
అజమోదాయవక్షారశర్కరాచిత్రకాన్వితమ్. ౩౦
పిష్ట్వా ప్రసన్నయాఽఽలోడ్య ఖాదేత్తద్ఘృతభర్జితమ్,
యోనిపార్శ్వార్తిహృద్రోగగుల్మార్శోవినివృత్తయే. ౩౧

వస, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, పిప్పళ్లు, అడ్డసరము, సైంధవలవణము, ఓమము, యవక్షారము, శర్కర, చిత్రమూలము వీనిని సమభాగములుగ గ్రహించి ప్రసన్నయను మద్యముతోనూరి దానిలోనే కలిపి నేతిచే వేయించి యిప్పించిన యోనిశూల, పార్శ్వశూల, ఱొమ్మునొప్పి, గుల్మము, అర్శస్సు అను నీరోగములు హరించును.

యోనిరోగమునకు వృషకాదికల్కపానము.

వృషకం మాతులుంగస్య మూలాని మదయంతికామ్,
పిబేన్మద్యైస్సలవణైస్తథా కృష్ణోపకుంచికే. ౩౨

అడ్డరసము, మాదీఫలపుచెట్టువేళ్లు, మల్లె వీనిని మద్యముతోనూరి దానిలోనేకలిపి సైంధవలవణమును చేర్చి పానము చేయించినను, పిప్పళ్లు, పెద్దజీలకఱ్ఱ వీనిని మద్యముతోనూరి మద్యములోనేకలిపి అందులో సైంధవలవణము చేర్చి పానము చేయించినను, యోనిశూలలు హరించును.

యోనిరోగమునకు రాస్నాదిక్షీరము.

రాస్నాశ్వదంష్ట్రావృషకైశ్శృతం శూలహరం పయః,

సన్నరాష్ట్రము, పల్లేరు, అడ్డసరము అనువానిని సమభాగములుగ ఆవుపాలలో చేర్చి చక్కఁగకాఁచి యాపాలను పానము చేయించిన యోనిశూల హరించును.

యోనిరోగమునందు పరిషేచనము.

గుడూచీత్రిఫలాదంతీక్వాథైశ్చ పరిషేచనమ్. ౩౩

తిప్పతీఁగె, త్రిఫలములు, దంతివేళ్లు అనువానికషాయముచే సుఖోష్ణముగ నికి సేచనముచేయించిన యోనిశూల హరించును.

### యోనిశూలహరపిచువు.

నతవార్తాకినీకుష్ఠసైంధవామరదారుభిః,
తైలాత్ప్రసాధితాద్ధార్యః పిచుర్యోనౌ రుజాపహః.

గ్రంథితగరము, పెద్దములక, చెంగల్వకోష్టు, సైంధవలవణము, దేవదారు వానిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనెలోఁ జేర్చి చక్కఁగక దానిలో ప్రత్తిని తడిపి యోనియందు ధరించిన యోనిశూల హరించును.

### పిత్తలయోనిచికిత్స.

పిత్తలానాం తు యోనీనాం సేకాభ్యంగపిచుక్రియాః,
శీతాః పిత్తజితః కార్యాస్స్నేహనార్థం ఘృతాని చ.

పిత్తప్రకోపముగల యోనులకు శీతస్పర్శముగలవిగ పిత్తహరముగనుండు సే అభ్యంగము పిచుకర్మ వీనిని చేయించవలయును. ఘృతముచే స్నేహకర్మనుకూడ చే చవలయును.

### యోనిరోగమునకు శతావరీఘృతము.

శతావరీమూలతులాచతుష్కాత్క్షుణ్ణపీడితాత్,
రసేన క్షీరతుల్యేన పాచయేత ఘృతాఢకమ్.
జీవనీయైశ్శతావర్యా మృద్వీకాభిః పరూషకైః,
పిష్టైః ప్రియాలైశ్చాక్షాంశైర్మధుకాద్విబలాన్వితైః.
సిద్ధశీతే తు మధునః పిప్పల్యాశ్చ పలాష్టకమ్,
శర్కరాయా దశపలం క్షిపేల్లిహ్యాత్పిచుం తతః.
యోన్యసృక్శుక్రదోషఘ్నం వృష్యం పుంసవనం పరమ్,
క్షతం క్షయమసృక్పిత్తం కాసం శ్వాసం హలీమకమ్.
కామలాం వాతరుధిరం విసర్పం హృచ్ఛిరోగ్రహమ్,
అపస్మారార్దితాయామమదోన్మాదాంశ్చ నాశయేత్.

చల్లపిల్లిగడ్డలు (పిల్లిపీచరగడ్డలు) నాల్గు తులములను (నాలుగువందలపలములు) గ్రహించి చక్కగనూరి రసమునుపిండుకొని యారసమునకు సమము ఆవుపాలను ఒక ఆఢక ఆవునెయ్యిని వీనినొకటిగఁజేర్చి అందులో జీవనీయగణద్రవ్యములు, చల్లపిల్లిగడ్డలు, ద్రాక్ష, పేరీత, మురళి, అతిమధురము, చిట్టాముట్టి, పేరాముట్టి అనువానిని కర్షప్రమాణముచొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి చల్లారినపిదప దానియందు తేనె ఎనిమిదిపలములు, పిప్పళ్లు ఎనిమిదిపలములు, పంచదార పదిపలములు చేర్చి దానిని కర్షప్రమాణము ప్రతిదినము సేవించుచుండిన యోనిశూల, రక్తదోషము, శుక్రదోషము, క్షతము, క్షయము, రక్తపిత్తము, కాసము, శ్వాసము, హాలీమకము, కామల, వాతరక్తము, విసర్పప్పట్టువు, బొమ్మనొప్పి, తలనొప్పి, అపస్మారము, అర్దితవాతము, ఆయామవాతము, మదాత్యయము, ఉన్మాదము ఇవియన్నియు హరించును. వీర్యవృద్ధి కలుగును. గర్భమునుకలుగఁజేయును.

### యోనిరోగమునకు జీవనీయక్షీరపానము.

ఏవమేవ పయస్సర్పిర్జీవనీయోపసాధితమ్,
గర్భదం పిత్తజానాం చ రోగాణాం పరమం హితమ్. ౪౧

పైనెప్పిన ప్రకారము జీవనీయౌషధములతో పక్వము చేయఁబడిన యావుపాలను గాని నెయ్యినిగాని స్త్రీలకు పానము చేయించిన యోనిదోషము హరించి గర్భము ధరింతురు. మఱియు నిది పిత్తజరోగములయందు మిగుల హితకరముగ నుండును.

### యోనిరోగమునకు బలాదితైలము.

బలాద్రోణద్వయక్వాథే ఘృతతైలాఢకం పచేత్,
క్షీరే చతుర్గుణే కృష్ణాకాకనాసాసితాన్వితైః. ౪౨
జీవంతీక్షీరకాకోలీస్థిరావీరర్ధిజీవకైః,
పయస్యాశ్రావణీముద్గపీలుమాషాఖ్యపర్ణిభిః. ౪౩
వాతపిత్తామయాన్ హత్వాపానాద్గర్భం దధాతి తత్,

రెండుద్రోణముల పరిమితమైన చిట్టాముట్టివేళ్లకషాయములో ఒక ఆఢకపరిమితమైన ఆవునెయ్యిని, ఒక ఆఢకము నువ్వులనూనెను, నాల్గాఢకములు ఆవుపాలను బోసి అందు పిప్పళ్లు, కాకిదొండ, జీవంతి, క్షీరకాకోలి, ముయ్యాకుపొన్న, కాకోలి, ఋద్ధి, జీవకము, పిన్నమనుబాల, బోడతరము, పిల్లిపెసర, చాగ, కారుమినుములు అనువానిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి యా ఘృతమును పానము చేయించిన వాతపిత్తరోగములు హరించి గర్భధారణము కలుగును,

### రక్తయోనిచికిత్స.

రక్తయోన్యామసృగ్వర్ణైరనుబంధమపేక్ష్య చ. ౪౪
యథాదోషోదయం యుంజ్యాద్రక్తస్థాపనమౌషధం,

రక్తయోనిరోగమునందు స్రవించురక్తము యొక్క వర్ణభేదములను బట్టి వాతాదిదోషసంబంధమును తెలిసికొని ఆయాదోషానుగుణముగ ఔషధముల నిప్పించవలయును.

### పుష్యానుగచూర్ణము.

పాఠాజంబ్వామ్రయోరస్థి శిలోద్భేదం రసాంజనమ్. ౪౫
అంబష్ఠాం శాల్మలీపిచ్ఛాం సమంగాం వత్సకత్వచం,
బాహ్లీకబిల్వాతివిషారోధ్రతోయదగైరికమ్. ౪౬
శుంఠీమధూకమాచీకరక్తచందనకట్ఫలం,
కట్వంగవత్సకానంతాధాతకీమధుకార్జునమ్. ౪౭
పుష్యే గృహీత్వా సంచూర్ణ్య సక్షౌద్రం తండులాంభసా,
పిబేదర్శస్సృతీసారే రక్తం యశ్చోపవేశ్యతే. ౪౮
దోషా జంతుకృతా యే చ బాలానాం తాంశ్చ నాశయేత్,
యోనిదోషం రజోదోషం శ్యావశ్వేతారుణాసితమ్. ౪౯
చూర్ణం పుష్యానుగం నామ హితమాత్రేయపూజితం,

చిరుబొద్ది, నేరేడువిత్తులు, మామిడివిత్తులు, శిలోద్భేదము (అనఁగా శిలాజిత్తు), రసాంజనము, అంబష్ఠ (అనఁగా జలుసు), బూరుగుబంక, మంజిష్ఠ, కొడిసెపట్ట, ఇంగువ, మారేడు, అతివస, లొద్దుగు, తుంగముస్తలు, కావిరాయి, సొంటి, ఇప్ప, మాచీకము, రక్తచందనము, సేకు, దుండిలము, కొడిసె, తీటకసింద, ఆరెపువ్వు, అతిమధురము, కడిమి అను నీయోషధులను పుష్యమాసములో పుష్యనక్షత్రములో సమభాగములుగ గ్రహించి చక్కఁగ చూర్ణముచేసి బియ్యపుకడుగులో కలిపి అందులో కొంచెము తేనెచేర్చి పానముచేయించిన అర్శస్సు అతిసారము రక్తస్రావము బాలురకు క్రిమిరోగము ఇవి శమించును. మఱియు నిది యోనిరోగమును నల్లగ తెల్లగ యెఱ్ఱగనుండు ఆర్తవదోషమును పోఁగొట్టును. ఇయ్యది పుష్యానుగచూర్ణ మనఁబడును. ఆత్రేయమునిచే చెప్పఁబడినది.

### శ్లేష్మదుష్టయోనిచికిత్స.

యోన్యాం బలాసదుష్టాయాం సర్వం రూక్షోష్ణ మౌషధమ్. ౫౦

శ్లేష్మముచే దుష్టమైన యోనిగలవనితకు రూక్షముగ ఉష్ణముగనుండు నౌషధము నిప్పించవలయును.

### యోనిరోగమునకు ధాతక్యాదితైలము.

ధాతక్యామలకీపత్రస్రోతోజమధుకోత్పలైః,
జంబ్వామ్రసారకాసీసరోధ్రకట్ఫలతిందుకైః. ౫౧
సౌరాష్ట్రికాదాడిమత్వగుదుంబరశలాటుభిః,
అక్షమాత్రైరజామూత్రే క్షీరే చ ద్విగుణే పచేత్. ౫౨
తైలప్రస్థం తదభ్యంగపిచువస్తిషు యోజయేత్,
శూనోత్తానోన్నతా స్తబ్ధా పిచ్ఛిలా స్రావణీ తథా. ౫౩
విప్లుతోపప్లుతా యోని స్సిధ్యేత్ససోఫటశూలినీ,

మేకమూత్రము రెండు ప్రస్థములు, ఆవుపాలు రెండు ప్రస్థములు, నువ్వులనూనె ఒక ప్రస్థము వీనినొకటిగచేర్చి అందులో ఆరెపువ్వు, ఉసిరికయాకు, సౌవీరాంజనము, అతిమధురము, నల్లకలువ, నేరేడువిత్తులు, మామిడివిత్తులు, పుష్పకాసీసము, లొద్దుగు, చేకు, నల్లతుమికి, సౌరాష్ట్రికము, (అనఁగా తువరిమన్ను) దానిమ్మబెరడు, మేడికాయ వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున చేర్చి తైలపాకవిధిగ పక్వముచేసి యాతైలమును అభ్యంగము పిచువు వస్తికర్మ వీనియందు ప్రయోగించిన రక్తస్రావముగలదియు పోట్లు శూల బొబ్బలు వీనితోఁగూడినదియు జిగటగనుండునదియునగు యోనిరోగము లన్నియు నివర్తించును. మఱియు ఉత్తాన, ఉన్నత, స్తబ్ధ, పిచ్ఛిల, విప్లుత, ఉపప్లుత అను యోనివ్యాపత్తులును శమించును.

### యోనిరోగమునకు యవాన్నాద్యుపయోగము.

యవాన్నమభయారిష్టం సీధుతైలం చ శీలయేత్. ౫౪
పిప్పల్యయోరజఃపథ్యాప్రయోగాంశ్చ సమాక్షికాన్,

యవాన్నము, అభయారిష్టము, సీధు అను మద్యములు, నువ్వులనూనె వీనిని యోనిరోగముగల వారి కిప్పించుచుండవలయును. మఱియు పిప్పళ్ళచూర్ణము అయోభస్మము హారీతకీయోగములు అనువానిని తేనెసహితముగ పలుమాఱునిప్పించవలయును.

యోనిరోగమునకు కాసీసాదిచూర్ణము.

కాసీసం త్రిఫలా కాంక్షీ సామ్రజంబ్వస్థిధాతకీ. ౫౫
పైచ్ఛిల్యే క్షౌద్రసంయుక్తశ్చూర్ణో వైశద్యకారకః,

కాసీసము, త్రిఫలములు, తువరిమన్ను, మామిడివిత్తులు, నేరేడువిత్తులు, ఆరెపువ్వు అనువానిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణముచేసి తేనెలో కలిపి యిప్పించిన జిగటగనుండు యోని శుద్ధంబగును.

యోనిరోగమునకు పలాశాదిచూర్ణము.

పలాశధాతకీజంబూసమంగామోచసర్జజః. ౫౬
దుర్గంధే పిచ్ఛిలేక్లేదే స్తంభనశ్చూర్ణ ఇష్యతే,
ఆరగ్వధాదివర్గస్య కషాయః పరిషేచనమ్. ౫౭
స్తబ్ధానాం కర్కశానాం చ కార్యం మార్దవకారకమ్,
ధారణం వేసవారస్య కృసరాపాయసస్య చ. ౫౮

మోదుగు, ఆరెపువ్వు, నేరేడు, మంజిష్ఠ, బూరుగు, సర్జరము అనువాని చూర్ణమును ప్రయోగించిన దుర్గంధముగ స్రావముక్తముగ జిగటగనుండు యోనిరోగము హరించును. మఱియు ఆరగ్వధాదిగణద్రవ్యముల కషాయముచే సేచనము చేయించిన యోనియందలి దుర్గంధాదిదోషములు శమించును. స్తబ్ధముగ కఠినముగనుండు యోనుల యందు మృదుత్వమును గలుగఁజేయునట్టి వేసవారము కృసరము పాయసము వీనినిధరింపఁ జేయవలయును.

దుర్గంధయోనిచికిత్స.

దుర్గంధానాం కషాయస్స్యాత్ తైలం వా కల్క ఏవ వా,
చూర్ణో వా సర్వగంధానాం పూతిగంధాపకర్షణః. ౫౯

మంచివాసనగల యోషధి ద్రవ్యములయొక్క కషాయమును గాని కల్కమును గాని చూర్ణమును గాని పైద్రవ్యములతోఁ బక్వముచేయఁబడిన తైలమునుగాని ప్రయోగించిన యోనియందలి దుర్గంధము హరించును

వాతదుష్టయోనిచికిత్స.

శ్లేష్మలానాం కటుప్రాయాః సమూత్రా వస్తయో హితాః,
పిత్తే సమధుకక్షీరాః వాతే తైలామ్లసంయుతాః. ౬౦

శ్లేష్మాధిక్యముగల యోనులకు మిక్కిలి కారముగలదిగ గోమూత్రము చేర్పఁబడిన దిగనుండు వస్తికర్మలు పిత్తాధిక్యముగల యోనులకు అతిమధురము, ఆవుపాలు చేర్పఁబడినదిగనుండు వస్తికర్మలు వాతాధిక్యముగల యోనులకు నువ్వులనూనె, పులికడుగు అనువానితోఁ గూడియుండు వస్తికర్మలు హితకరంబులుగ నుండును.

## సన్నిపాతయోనిచికిత్స.

సన్నిపాతసముత్థాయాః కర్మసాధారణం హితమ్,

సన్నిపాత యోనిరోగమునందు పైవాతాదియోనిరోగములకు చెప్పియుండు చికిత్సల నన్నిఁటిని చేయవలయును.

## శుద్ధయోనియందు గర్భధారణము.

ఏవం యోనిషు శుద్ధాసు గర్భం విందంతి యోషితః. ౬౧
అదుష్టే ప్రాకృతే బీజే జీవోపక్రమణే సతి,

పైచెప్పిన ప్రకారము చికిత్స చేయుటవలన యోని శుద్ధంబై యుండి పురుషుని బీజము దోషరహితంబై యుండినచో స్త్రీలు గర్భమును ధరింతురు.

## శుక్రదోషచికిత్స.

పంచకర్మ విశుద్ధస్య పురుషస్యాపి చేంద్రియమ్. ౬౨
పరీక్ష్య వర్ణైర్దోషాణాం దుష్టం తద్ఘ్నైరుపాచరేత్,

వమనవిరేచనాది కర్మలచే పరిశుద్ధుఁడుగనుండు పురుషునియొక్క శుక్రమును తెలుపు మొదలగు వాతాదిదోషవర్ణంబులచే పరీక్షించి ఆశుక్రము దుష్టంబైయుండినచో శుక్రదోషహరములైన యౌషధముల నిప్పించవలయును.

## ఫలసర్పి.

మంజిష్ఠాకుష్ఠతగరత్రిఫలాశర్కరావచాః ౬౩
ద్వే నిశే మధుకం మేదా దీప్యకః కటురోహిణీ,
పయస్యాహింగుకాకోలీవాజిగంధాశతావరీః ౬౪
పిష్ట్వాక్షాంశైర్ఘృతప్రస్థం పచేత్క్షీరాచ్చతుర్గుణమ్,
యోనిశుక్రప్రదోషేషు తత్సర్వేషు చ శస్యతే. ౬౫

ఆయుష్యం పౌష్టికం మేధ్యం *ధన్యం పుంసవనం పరమ్,
ఫలసర్పిరితి ఖ్యాతం పుష్పే పీతం ఫలాయ యత్. ౯౯
మ్రియమాణప్రజానాం చ గర్భిణీనాం చ పూజితమ్,
ఏతత్పరం చ బాలానాం గ్రహఘ్నం దేహవర్ధనమ్. ౯౭

మంజిష్ఠ, చెంగల్వకోష్టు, గ్రంథితగరము, త్రిఫలములు, పంచదార, వస, పసుపు, మ్రానిపసుపు, అతిమధురము, మేద, ఓమము, కటుకరోహిణి, పిన్నమనుబాల, ఇంగువ, కాకోళి, పెన్నేరుగడ్డ, పిల్లిపీచర అనువానిని దినుసుకు కర్ష ప్రమాణము చొప్పు నగ్రహించి కల్కముచేసి ప్రస్థపరిమితమైన ఆవునేతిలో కలిపి అందులో నాలుగు ప్రస్థము లావుపాలనుచేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. ఇది యోనిదోష మునందును, శుక్రదోషమునందును మిగుల ప్రశస్తమైనది. ఆయుర్వృద్ధి, పుష్టి, బుద్ధి, సంతానము వీనిని గలుగఁజేయును. దీనిని స్త్రీలకు ఋతుకాలమునందు పానముచేయించిన గర్భము కలుగును. ఇది ఫలసర్పియనఁబడును. జనించినతోడనే మృతిజెందు శిశువు లను ప్రసవించునట్టి స్త్రీలకును గర్భిణులకును మిగుల హితకరమైనది. బాలగ్రహదోష మును పోఁగొట్టును. శరీరమునకు పుష్టిని కలుగఁజేయును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదినాల్గవయధ్యాయము ముగిసెను.



* వర్ణ్యం.

శ్రీ రస్తు.

# పంచత్రింశాధ్యాయము.

(విషచికిత్స (అగదతంత్రము ౬-వ అంగము.)



అవ. గుహ్యరోగాదులవలె విషము తత్క్షణమే ప్రాణములను హరించుటవలన గుహ్యరోగప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము విషప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

# విషప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాతో విషప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

గుహ్యరోగ ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము విషచికిత్సలను తెలియఁజేయుచునట్టి విషప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

విషోత్పత్తి.

మథ్యమానే జలనిధావమృతార్థం సురాసురైః,
జాతః ప్రాగమృతోత్పత్తేః పురుషో ఘోరదర్శనః. ౧
దీప్తతేజాశ్చతుర్దంష్ట్రో హరికేశో௨నలేక్షణః,
జగద్విషణ్ణం తం దృష్ట్వా తేనాసౌ విషసంజ్ఞితః. ౨
హుంకృతో బ్రహ్మణా మూర్తి తతః స్థావరజంగమే,
సో௨ధ్యతిష్ఠన్నిజం రూపముత్సృజ్య పంచనాత్మకమ్. ౩

తొల్లి దేవాసురులు అమృతముకొఱకు సముద్రమును మథింపుచుండఁగా అమృత ముత్పన్నమగుటకు మును భయంకరమైన యాకారము గలవాఁడును జ్వలింపుచుండు తేజస్సు గలవాఁడును నాల్గుకోఱపండ్లు గలవాఁడును ఆకుపచ్చవర్ణమువంటి వెండ్రుకలు గలవాఁడును నిప్పువంటి నేత్రములు గలవాఁడు నైననొకపురుషుఁడు జనించెను. వానింజూచి లోకమంతయు విషాదమును జెందెను. దానంజేసి యాపురుషునికి విషమనుపేరు కలిగినది. పిదప యావిషపురుషుఁడు బ్రహ్మచే అదలింపఁబడిన

వాఁడై వంచన స్వభావముగల నిజయాకారమును వదలి స్థావర జంగమరూపమైన శరీరమును ధరించెను. కావున విషము స్థావరము, జంగమము అని రెండువిధములుగ నుండును.

### స్థావరవిషలక్షణము

స్థిరమిత్యుల్బణం వీర్యే యత్కందేషు ప్రతిష్ఠితమ్,
కాలకూటేంద్రవత్సాఖ్యశృంగీహాలాహలాదికమ్. ౮

గడ్డలయందలి విషము స్థావరవిష మనఁబడును. అది కాలకూటము ఇంద్రవత్సము శృంగి హాలాహలము అని పలువిధములుగ నుండును. ఇది అధికవీర్యముగలది. పండ్లు పూలు మొదలగు వానియందును స్థావరవిషముండును. అయితే గడ్డలలోనుండు విషమువలె వీర్యవత్తరము కానేరదు.

"కాలకూటం వత్సనాభం సాక్తుక వాలకం కర్దమకం వైరాటం ముస్తకంశృంగీ పుండరీకంమహావిషం హాలాహలం మార్కటకం కాశపుష్పకమింద్రాయుధం తథా తైలమితి భేదాః ప్రకీర్తితాః"

కాలకూటము, వత్సనాభము, సాక్తుకము, వాలకము, కర్దమకము, వైరాటము, ముస్తకము, శృంగి, పుండరీకము, మహావిషము, హాలాహలము, మర్కటకము, కాశపుష్పకము, ఇంద్రాయుధము, తైలము అని విషభేదములు గలవని సంగ్రహమునందు చెప్పఁబడియున్నది.

### జంగమవిషలక్షణము

సర్పలూతాదిదంష్ట్రాసు దారుణం జంగమం విషమ్,

సర్పము, సాలెపురుగు మొదలగువాని కోఱలయందలి విషము జంగమ విషమనంబడును. ఇదియు దారుణముగనే యుండును. కొన్నిజంతువులకు గోళ్లు కొమ్ము మూత్రము మలము మొదలగువానియందును విషముండును.

### కృత్రిమాకృత్రిమవిషలక్షణము

స్థావరం జంగమం చేతి విషం ప్రోక్తమకృత్రిమమ్. ౯
కృత్రిమం గరసంజ్ఞం తు క్రియతే వివిధౌషధైః,
హంతి యోగవశేనాశు చిరాచ్చిరతరాచ్చ తత్. ౧౦
శోఫపాండూదరోన్మాదదుర్నామాదీన్ కరోతి చ,

పైచెప్పిన స్థావరము జంగమము అను రెండువిధములైన విషములు అకృత్రిమము (అనఁగా స్వభావసిద్ధము) అనఁబడును. నానావిధౌషధములను చేర్చి చేయఁబడినవిషము గరమనిబఱంగును. ఇది కృత్రిమముయినది. మఱియు నీగరళము విషము మనుజులను బహుకాలముమీఁద జంపును. లేక వాపు పాండువు ఉదరరోగము పైత్యము అర్శస్సు మొదలగు దారుణరోగములను కలుగఁజేయును.

## విషస్వరూపము.

తీక్ష్ణోష్ణరూక్షవిశదం వ్యవాయ్యాశుకరం లఘు. ౭
వికాసి సూక్ష్మమవ్యక్తరసం విషమపాకి చ,
ఓజసో విపరీతం తు తీక్ష్ణాద్యైరన్వితం గుణైః. ౮
వాతపిత్తోత్తరం నౄణాం సద్యో హరతి జీవితమ్,

విషము తీక్ష్ణముగ, ఉష్ణముగ, రూక్షుగ, విశదముగ, అతిశీఘ్రముగ శరీరమునందంతట వ్యాపించునదిగ, లఘువుగ, సూక్ష్మముగ, మధురాదిరసములు స్పష్టముగ తెలియకుండునదిగ, జీర్ణము కాకుండునదిగ నుండును. విషము తీక్ష్ణాదిగుణములతో గూఁడియుండుటవలన ఓజస్సునకు విరుద్ధముగ నుండును. మఱియు నది వాతపిత్తముల ప్రకోపింపఁజేసి మనుజులప్రాణముల నతిశీఘ్రముగ పోఁగొట్టును.

## విషోపద్రవము.

విషం హి దేహం సంప్రాప్య ప్రాగ్దూషయతి శోణితమ్. ౯
కఫపిత్తానిలాంశ్చాను సమం దోషాన్ సహాశయాన్,
తతో హృదయమాస్థాయ దేహోచ్ఛేదాయ కల్పతే. ౧౦

విషము శరీరమున ప్రవేశించి తొలుత రక్తమును దూషింపఁజేసి పిదప కఫపిత్తవాతములను వానివాని యాశయములతోడ నేకాలమునందు చెఱచి దుష్టరక్తకఫపిత్తవాతములతోడ హృదయమును జేరి స్రోతోమార్గము లన్నిఁటి నడ్డగించి మనుజుని జంపును.

## స్థావరవిషప్రథమవేగోపద్రవములు.

స్థావరస్యోపయుక్తస్య వేగే పూర్వే ప్రజాయతే,
జిహ్వాయాః శ్యావతా స్తంభో మూర్ఛా త్రాసః క్లమో వమిః.

స్థావరవిషముయొక్క ప్రథమవేగమున నాలుకయందు శ్యామవర్ణము శరీరమునందు స్తబ్ధత్వము మూర్ఛ వణుకు బడలిక వాంతి కలుగును.

### ద్వితీయవేగోపద్రవములు.

ద్వితీయే వేపథుః స్వేదో దాహః కంఠే చ వేదనా,
విషం చామాశయం ప్రాప్తం కురుతే హృది వేదనామ్. ౧౨

స్థావరవిషముయొక్క రెండవవేగమునందు వణుకు చెమట సర్వాంగతాపము గొంతులో నొప్పికలుగును. విషము ఆమాశయమును జెందియుండినచో రొమ్మునందు విశేషముగ నొప్పికలుగును.

### తృతీయవేగోపద్రవములు.

తాలుశోష స్తృతీయే తు శూలం చామాశయే భృశమ్.
దుర్బలే హారితే శూనే జాయేతే చాస్య లోచనే. ౧౩
పక్వాశయగతే తోదహిధ్మాకాసాంత్రకూజనమ్,

స్థావరవిషముయొక్క మూడవవేగమునందు లోదొడ యెండిపోవును. ఆమాశయమునందు మిక్కుటముగ శూల కలుగును. నేత్రములు దృష్టిశక్తిలేనివిగ ఆకుపచ్చ వర్ణముగలవిగ ఉబ్బినవిగనగును. విషము పక్వాశయమును జేరియుండిన పోట్లు ఎక్కిళ్లు దగ్గు ప్రేగులఱచుట కలుగును.

### చతుర్థవేగోపద్రవములు.

చతుర్థే జాయతే వేగే శిరస స్త్వాతిగౌరవమ్. ౧౪

స్థావరవిషముయొక్క నాల్గవవేగమునందు శిరమున మిక్కిలి గురుత్వము కలుగుటయే గాక ప్రథమాదివిషవేగములకుఁ జెప్పియుండు లక్షణములుకూడ కలుగును.

### పంచమవేగోపద్రవములు.

కఫప్రసేకో వైవర్ణ్యం పర్వభేదశ్చ పంచమే,
సర్వదోష ప్రకోపశ్చ పక్వాధానే చ వేదనా. ౧౫

అయిదవవేగమునందు కఫాధిక్యము, నోటియందు నీరూరుట, శరీరమునందు వికారవర్ణము, గణుపులయందు నొప్పి, వాతాదిత్రిదోషము, లేక కాలమునందు ప్రకోపమును జెందుట, పక్వాశయమునందు శూల కలుగును.

### షష్ఠసప్తమవేగోపద్రవములు.

షష్ఠే సంజ్ఞాప్రణాశశ్చ సుభృశం చాతిసార్యతే,
స్కంధపృష్ఠకటీభంగో భవే న్మృత్యుశ్చ సప్తమే. ౧౬

ఆఱవవేగమున ప్రజ్ఞాభంగము విరేచనము కలుగును. ఏడవవేగమునందు భుజశిరములు వీపు నడుము వీనియందు నొప్పికలుగును. రసాది సప్తధాతువులు విషముచే దూషింపఁబడుటవలన మరణముకూడ కలుగును.

### ప్రథమవిషవేగచికిత్స.

ప్రథమే విషవేగే తు వాంతం శీతాంబుసేచితమ్,
సర్పిర్మధుభ్యాం సంయుక్తమగదం పాయయేద్ధితమ్. ౧౭

స్థావరవిషముయొక్క మొదటివేగమునందు ఆరోగికి తొలుత వమనముచేయించి శీతోదకముచే సేచనము చేయించి విషహరౌషధములను తేనె నెయ్యి వీనిలో కలిపి యిప్పించవలయును.

### ద్వితీయవిషవేగచికిత్స.

ద్వితీయే పూర్వవద్వాంతం విరిక్తం చానుపాయయేత్,

రెండవవేగమునందు తొలుత శీతోదకముచే సేచనము చేయించి పిదప వమనవిరేచనములను జేయించి విషహరౌషధముల నిప్పించవలయును.

### తృతీయవిషవేగచికిత్స.

తృతీయేఽగదపానం తు హితం నస్యం తథాంజనమ్. ౧౮

మూఁడవవేగమునందు విషహరౌషధపానము, నస్యము, అంజనము వీనిని చేయించవలయును.

### చతుర్థపంచమషష్ఠసప్తమ విషవేగచికిత్స.

చతుర్థే స్నేహసంయుక్త మగదం ప్రతియోజయేత్,
పంచమే మధుకక్వాథమాక్షికాభ్యాం యుతమ్ హితమ్, ౧౯
షష్ఠేఽతిసారవత్సిద్ధి రవపీడ స్తు సప్తమే,
మూర్ధ్ని కాకపదం కృత్వా సాసృగ్వా పిశితమ్ క్షిపేత్. ౨౦

విషముయొక్క నాల్గవవేగమునందు ఘృతాదిస్నేహ సహితముగ విషౌషధముల నిప్పించవలయును. అయిదవ వేగమునందు అతిమధురకషాయము, తేనె వీనితోడ ఔషధమును జేర్చి ఇప్పించవలయును. విషముయొక్క ఆఱవవేగమునందు అతిసారరోగమునను జెప్పియుండు చికిత్సలను జేయవలయును. విషముయొక్క ఏడవ వేగమునందు సూత్రస్థానముయొక్క రోగానుత్పాదనీయాధ్యాయములో జెప్పిన అవపీడస్వేదమును జేయించవలయును. లేక రోగిశిరమున కాకపదాకారముగ ఛేదనమును చేయించి అందులో రక్తసహితముగనుండు జంతుమాంసముల నుంచవలయును.

### విషవేగమునందు యవాగూపానము.

కోశాతక్యగ్నికః పాఠా సూర్యవల్ల్యమృతాభయాః,
శేలుశ్శిరీషః కిణిహీ హరిద్రే క్షౌద్రసాహ్వయా. ౨౧
పునర్నవే త్రికటుకం బృహత్యౌ సారివే బలా,
ఏషాం యవాగూం నిర్యూహే శీతాం సఘృతమాక్షికామ్. ౨౨
యుంజ్యాద్వేగాంతరే సర్వవిషఘ్నీం కృతకర్మణః,
తద్వన్మధూకమధుకపద్మకేసరచందనైః, ౨౩

చేదుబీర, చిత్రమూలము, చిరుబొద్ది, సూర్యవల్లి, తిప్పతీఁగె, కరక్కాయ, విరిగి, దిరిసనము, ఉత్తరేణు, పసుపు, మ్రానిపసుపు, వటమాక్షికము, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, త్రికటుకములు, చిన్నములక, పెద్దములక, సుగంధిపాల, నల్లసుగంధిపాల, చిట్టాముట్టి వీనికషాయములో యవాగు అనుగంజిని పక్వముచేసి అది చల్లారినపిదప దానియందు తేనె, నెయ్యి చేర్చి విషవేగమధ్యమునందు రోగికి పానము చేయించవలయును. ఇది అన్నివిషములను పోఁగొట్టును. ఇప్ప, అతిమధురము, పద్మకేసరములు, చందనము వీనికషాయముతో పేయ యనుగంజిని పక్వముచేసి అందులో నెయ్యి, తేనె చేర్చి యిప్పించిన విషము హరించును.

### విషమునకు చంద్రోదయశాంతి.

అంజనం తగరం కుష్ఠం హరితాళం మనశ్శిలా,
ఫలినీ త్రికటు స్పృక్కా నాగపుష్పం సకేసరమ్. ౨౪
హరేణు మధుకం మాంసీ రోచనా కాకమాలికా,
శ్రీవేష్టకం సర్జరసః శతాహ్వా కుంకుమం బలా. ౨౫
తమాలపత్రతాళీసభూర్జోశీరే నిశాద్వయమ్,
కన్యోపవాసినీ స్నాతా శుక్లవాసా మధుద్రుతైః. ౨౬
ద్విజానభ్యర్చ్య తైః పుష్యే కల్పయేదగదోత్తమమ్,
వైద్యశ్చాత్ర తదా మంత్రం ప్రయతాత్మా పఠేదిమమ్. ౨౭
నమః పురుషసింహాయ నమో నారాయణాయ చ,
యథాసౌ నాభిజానాతి రణే కృష్ణపరాజయమ్. ౨౮
ఏతేన సత్యవాక్యేన అగదో మే ప్రసిద్ధ్యతు,
నమో వైడూర్యమాతే హులు హులు రక్షమాంసర్వవిషేభ్యః.

గౌరి గాంధారి చండాలి మాతంగి స్వాహా,"
పిష్టే చ ద్వితీయో మంత్రః "ఓం హరిమాయి స్వాహా. ౩౦
అశేషవిష వేతాళ గ్రహకార్మణపాప్మసు,
మారకవ్యాధిదుర్భిక్షయుద్ధాశనిభయేషు చ ౩౧
పాననస్యాంజనాలేపమణిబంధాదియోజితః,
ఏష చంద్రోదయో నామ శాంతి స్స్వస్త్యయనం పరమ్. ౩౨

రసాంజనము, గ్రంథితగరము, చెంగల్వకోష్ఠు, హరిదళము, మణిశిల ప్రేంకణము, త్రికటుకములు, స్పృక్క యను గ్రంథ్యము, నాగకేసరములు, రేణుకలు, అతిమధురము, జటామాంసి, తవక్షీరి (వెదురుప్పు), కాచి, శ్రీవేష్టకము, సర్జరసము, స్థౌణేయవిత్తులు, కుంకుమపువ్వు, చిట్టాముట్టి, తమాలపత్రి, తాళిసపత్రి, భుజపత్రి, వట్టివేరు, పసుపు, మ్రానిపసుపు ఈ ద్రవ్యములను సమభాగముగ గ్రహించవలయును. పిదప స్నానము చేసి తెల్లవస్త్రము ధరించి ఉపవాసముతో నుండు కన్యక పుష్యనక్షత్రమునందు బ్రాహ్మణపూజచేసి పై ద్రవ్యముల నత్తి తేనెలోతడిపి నూరి ఔషధమును సిద్ధము చేయవలయును. ఆసమయమున వైద్యవరుండు పరిశుద్ధుఁడై "నమః పురుషసింహాయ-చండాలిమాతంగిస్వాహా" అను మంత్రమును జపించవలెను. ఔషధమును నూరి సిద్ధముచేసినపిదప "ఓం హరిమాయిస్వాహా" అను నీమంత్రమును జపముచేయవలెను. అట్టి మంత్రపూర్వకముగ సిద్ధమైన యీ యౌషధము చంద్రోదయ మనఁబడును. దీనిని సకలవేతాళగ్రహములు, ఆవహించినపుడును, సకలవిషములయందును, పూర్వజన్మకృతపాపముచే గల్గినకష్టములయందును, చంపనుండువ్యాధులయందును, దుర్భిక్షసమయమునందును, యుద్ధకాలమునందును, పిడుగులు పడునప్పుడును, పానము, నస్యము, అంజనము, ఆలేపము, మణిబంధము మున్నగుయోగముల నుపయోగించినయెడ పైజెప్పినవియన్నియు శాంతినొందును. మిక్కిలి సుఖముకల్గును.

### దూషీవిషలక్షణము.

జీర్ణం విషఘ్నౌషధిభిర్హతం వా
దావాగ్నివాతాతపశోషితం వా,
స్వభావతో వా సుగుణైర్న యుక్తం
దూషీవిషాఖ్యాం విషమభ్యుపైతి. ౩౩
వీర్యాల్పభావాదవిభావ్యమేత
త్కఫావృతం వర్షగణానుబంధి,

తేనార్దితో భిన్నపురీషవర్ణో
దుష్టాస్రరోగీ తృడరోచనార్తః. 38
మూర్ఛన్వమ న్గద్గదవాగ్వముహ్యన్
భవేచ్చ దూష్యో దరలింగజుష్టః,
ఆమాశయస్థే కఫవాతరోగీ
పక్వాశయస్థేఽనిలపిత్తరోగీ. 39
భవేన్నరో ధ్వస్తశిరోరుహాంగో
విలూనపక్షస్స యథావిహంగః,
స్థితం రసాదిష్వథ వా విచిత్రాన్
కరోతి ధాతుప్రభవాన్ వికారాన్. 3౬

మిగులపాతదిగను లేక విషహరౌషధములచే వీర్యము పోఁగొట్టఁబడినదిగను లేక కార్చిచ్చు, ఎండ, గాలి వీనిచే శోషింపఁబడినదిగను లేక స్వభావముగనే స్వల్పగుణము కలదిగను, నుండువిషము దూషీవిష మనఁబడును. ఇది స్వల్పవీర్యము గలదియగుటవలన దానిగుణము బయిటికి తెలియకయే కఫముతోఁజేరి యనేకవర్షములు శరీరములోనే యుండును. ఆదూషీవిషముచే పీడింపఁబడియుండువానికి మలమునందు వికారవర్ణము దుష్టరక్తరోగము, దప్పి, అరోచకము, మూర్ఛ, వాంతి, వాక్కు స్పష్టముగలేకుండుట, మోహము, ఉదరరోగము ఇవి కలిగియుండును. ఈదూషీవిషము ఆమాశయమును జేరియుండినచో కఫవాతరోగములును పక్వాశయమును, జేరియుండినయెడ వాతపిత్తరోగములును కలుగును. దూషీవిషము రసాదిధాతువుల నాశ్రయించియుండినచో మనుజుఁడు రెక్కలు విరిగినపక్షివలె వెండ్రుకలురాలి కృశించినశరీరము గలవాఁడుగ నగును; లేక నానావిధములైన రోగములచే పీడింపఁబడును.

### దూషీవిషనామకారణము.

ప్రాగ్వాతాజీర్ణశీతాభ్రదివాస్వప్నాహితాశనైః,
దుష్టం దూషయతే ధాతూనతో దూషీవిషం స్మృతమ్. 3౭

పైవిషము తూర్పుగాలి అజీర్ణము శీతలద్రవ్యములు మేఘము పగటినిద్ర అహితాహారములు వీనిచే దుష్టంబై రసాదిధాతువులను చెఱచును. కావున దీనికి దూషీవిష మని పేరుకలిగినది.

### దూషీవిషచికిత్స.

దూషీవిషార్తం సుస్విన్నమూర్ధ్వం చాధశ్చ శోధితమ్,

దూషీవిషారిమగదం లేహయేన్మధునా ప్లుతమ్. ౩౭

దూషీవిషముచే పీడింపఁబడియుండువానికి స్వేదకర్మ వమనవిరేచనములు వీనిని చక్కఁగచేయించి దూషీవిషములను పోఁగొట్టునట్టి ఇఁకచెప్పఁబోయెడు ఔషధములను మాక్షిక మనుతేనెతో నాకించవలయును.

—— దూషీవిషహరద్రవ్యములు. ——

పిప్పల్యో ధ్యామకం మాంసీ రోధ్రమేలా సువర్చికా,
కుటన్నటం నతం కుష్ఠం యష్టీ చందనగైరికమ్. ౩౮
దూషీవిషారిర్నామ్నాయం న చాన్యత్రాపి వార్యతే,

పిప్పళ్లు, ధ్యామకమను గ్రంథ్యము, జటామాంసి, లొద్దుగు, ఏలకులు, ప్రొద్దుతిరుగుడుచెట్టు, దుందిలము, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, అతిమధురము, చందనము, కావిరాయి యివి దూషీవిషారి యనఁబడును. ఇతరౌషధము లుండినను వానికంటె పై పిప్పళ్లు మొదలగునవి దూషీవిషమును పోఁగొట్టుటయందు విశేషశక్తిగలవిగ నుండును.

—— విషదిగ్ధవిద్ధచికిత్స. ——

విషదిగ్ధేన విద్ధస్తు ప్రతామ్యతి ముహుర్ముహుః. ౪౦
వివర్ణభావం భజతే విషాదం చాశు గచ్ఛతి,
కీటైరివావృతం చాస్య గాత్రం చిమిచిమాయతే. ౪౧
శ్రోణిపృష్ఠశిరస్స్కంధ సంధయస్స్యుస్సవేదనాః,
కృష్ణదుష్టాస్రవిస్రావీ తృణ్మూర్ఛాజ్వరదాహవాన్. ౪౨
దృష్టికాలుష్యవమథుశ్వాసకాసకరః క్షణాత్,
ఆరక్తపీతపర్యంతః శ్యావమధ్యో తిరుగ్ వ్రణః. ౪౩
సూయతే పచ్యతే సద్యో గత్వా మాంసం చ కృష్ణతామ్,
ప్రక్లిన్నం శీర్యతే ఽభీక్ష్ణం సపిచ్ఛిలపరిస్రవమ్. ౪౪
కుర్యాదమర్మవిద్ధస్య హృదయావరణం ద్రుతమ్,

విషము పూయఁబడినశస్త్రము మున్నగునవి గ్రుచ్చుకొనిన మనుజుఁడు పలుమాఱు బడలికను జెందును. వికారవర్ణము దుఃఖము వీనిని శీఘ్రముగ జెందును. మఱియు వానియొక్క శరీరమునందు పురుగులు పాఱాడునట్లు చిమచిమయని యుపద్రవము కలుగును. పిఱుదులు, వీపు, శిరము, భుజశిరములు, సంధులు వీనియందు నొప్పికలుగును. నల్లగనుండు దుష్టరక్తము స్రవించును. దప్పి, మూర్ఛ, జ్వరము, సర్వాంగతాపము, నేత్రములు కలకబారియుండుట, వాంతి, శ్వాసము, కాసము ఈలక్షణములు కల్గును.

కొంచెమెఱ్ఱగ పసుపువర్ణముగలదిగ నడుమ నల్లగ విశేషముగ నొప్పితోఁ గూడి అతిత్వరలో పాకమును జెందునదిగ నుండును. వ్రణముకల్గును. ఆవ్రణమునందలి మాం నల్లనై స్రావముతోఁ గూడి క్రిందికి జారిపడును. మర్మస్థానముతప్ప యితరస్థ యందు గాయము తగిలినవానికి అతిశీఘ్రముగ మూర్ఛకలుగును.

శల్యమాకృష్య తప్తేన లోహేనానుదహేద్వ్రణమ్.
అథ వా ముష్కకశ్వేతాసోమత్వక్తామ్రవల్లితః,
శిరీషాద్గృధ్రనఖ్యాశ్చ క్షారేణ ప్రతిసారయేత్.
శుకనాసాప్రతివిషావ్యాఘ్రీమూలైశ్చ లేపయేత్,

విషము పూయఁబడిన శస్త్రము మున్నగువానిచే గాయము తగిలిన శరీరములో నాటియుండు శల్యమును తీసివేసి యావ్రణమును కాల్చినయిను దహింపవలయును లేక మొక్కపుచెట్టు, కలిగొట్టు, తెల్లతుమ్మ, మంజిష్ట, దిరిస నల్లఉప్పి అనువాని క్షారములచే ప్రతిసారణమును జేయించవలయును. దుంది అతివస, వాకుఁడు వీనివేళ్ళను నూరి పైవ్రణమునకు లేపనము చేయవలయును.

కీటదష్టచికిత్సాం చ కుర్యాత్తస్య యథార్హతః.

విషము పూయఁబడినశల్యముచే గాయము తగిలినవానికి పురుగుకాటునకు యుండు చికిత్సలను జేయవలయును.

## దుర్గంధవ్రణచికిత్స.

వ్రణే తు పూతిపిశితే క్రియాపిత్తవిసర్పవత్,

వ్రణమునందలి మాంసము దుర్గంధము గలదిగనుండిన పిత్తవిసర్పమునకు యుండు చికిత్సలను జేయవలయును.

## గరప్రయోగము.

సౌభాగ్యార్థం స్త్రియో భర్త్రే రాజ్ఞే వారాతిచోదితాః.
గరమాహారసంపృక్తం యచ్ఛంత్యాసన్నవర్తినః,

భర్తను స్వాధీనపఱచుకొనుటకై స్త్రీలు భర్తలకు గరమును (అనఁగా కృ విషమును) ఆహారములో కలిపి యిప్పింతురు. రాజులకు సమీపమునందుండు పర కులు శత్రువుల ప్రేరణచే గరము నిప్పింతురు.

## గరలక్షణము.

నానాప్రాణ్యంగశమలవిరుద్ధౌషధిభస్మనామ్.
విషాణాం చాల్పవీర్యాణాం యోగో గర ఇతి స్మృతః,

నానాజంతువుల అవయవములు మలములు, ఉన్మాదాదివికారములను కలుగం జేయు నౌషధులభస్మము, స్వల్పవీర్యముగల విషము, వీని నొక్కటిగఁజేర్చి చేయఁబడినది గరమని చెప్పఁబడును.

## గరోపద్రవములు.

తేన పాండుః కృశోఽల్పాగ్నిః కాసశ్వాసజ్వరార్దితః. ३०
వాయునా ప్రతిలోమేన స్వప్నచింతాపరాయణః,
మహోదరయకృత్ప్లీహీ దీనవాగ్దుర్బలోఽలసః. ३१
శోఫవాన్ సతతాధ్మాతః శుష్కపాదకరః క్షయీ,
స్వప్నే గోమాయుమార్జారనకులవ్యాలవానరాన్. ३२
ప్రాయః పశ్యతి శుష్కాంశ్చ వనస్పతిజలాశయాన్,
మన్యతే కృష్ణమాత్మానం గౌరో గౌరం చ కాలకః. ३३
వికర్ణనాసానయనం పశ్యేత్తద్విహతేంద్రియః,
ఏతైరన్యైశ్చ బహుభిః క్లిష్టో ఘోరైరుపద్రవైః. ३४
గరార్తో నాశమాప్నోతి కశ్చిత్సద్యోఽచికిత్సితః,

పైగరమును భుజించినవానికి శరీరమునందు తెలుపువర్ణము (పాండురోగము), కృశత్వము, అగ్నిమాంద్యము, కాసము, శ్వాసము, జ్వరము, ప్రతిలోమముగనుండు వాతముచే నెల్లప్పుడును నిద్రించుటయందును, చింతయందును,ఆశక్తికల్గియుండుట,మహోదరము,యకృత్తుప్లీహంబును వృద్ధినొందుట, దీనతగలమాటలు, బలహాని, ఆలస్యము, వాపు,ఎల్లపుడుకడుపుబ్బరము, కాళ్ళుచేతులయందు కృశత్వము క్షయరోగము కలుగును. మఱియు నక్క, పిల్లి, ముంగిస, సర్పము, కోఁతి మొదలగునవి స్వప్నమునం దగుపడుట, తటాకము, వృక్షములు ఇవి యెండియుండునటుల స్వప్నమున గోచరించుట, స్వభావముగ నెఱ్ఱవర్ణముగల తనశరీరము నల్లగనగుపడుట, తనకు చెవులు, ముక్కు, కండ్లు మొదలగునవి యుండియు లేనటుల నగుపడుట ఇవి మున్నగు నుపద్రవములు కలుగును. మఱియు గరసంబంధముకలవాఁడు,పైయుపద్రవములచేతను ఇతరములగు ననేకోపద్రవములచేతను పీడింపఁబడినవాఁడై మరణము నొందును. గరమును భుజించినవానికి అప్పుడే చికిత్సఁజేయనిచో గరములోఁ జేర్పఁబడిన యౌషధములయొక్క వీర్యముచేత నప్పుడే మరణమును జెందును.

## గరార్తచికిత్స.

గరార్తో వాంతవాన్ భుక్త్వా తత్పథ్యం పానభోజనమ్. ३५
శుద్ధహృచ్ఛీలయేద్హేమ సూత్రస్థానవిధేః స్మరన్,

గరముచే పీడింపఁబడినవానికి వమనము జేయించి పథ్యకరమైన యన్నపానాదుల నిప్పించి.

"శుద్ధేహృది తతశ్శాణం హేమచూర్ణస్య దాపయేత్."

అని సూత్రస్థానములోఁ జెప్పియుండు విధిప్రకారము స్వర్ణచూర్ణమునిప్పించవలయును.

—గరోపద్రవ హారలేపము.—

శర్కరాక్షౌద్రసంయుక్తం చూర్ణం తాప్యసువర్ణయోః. ౪౬
లేహః ప్రశమయత్యుగ్రం సర్వయోగకృతం విషమ్,

ధాతుమాక్షికచూర్ణము, సువర్ణచూర్ణము, వీనిని తేనె, శర్కరతోడ కలిపి నాకించిన దారుణమైన గరవిషయములన్నియు శమించును.

—గరోపద్రవహర చూర్ణము.—

మూర్వామృతానతకణాపటోలీచవ్యచిత్రకాః. ౪౭
వచాముస్తవిడంగాని తక్రకోష్ణాంబుమస్తుభిః,
పిబేద్రసేన వామ్లేన గరోపహతపావకః. ౪౮

చాగ, తిప్పతీఁగె, గ్రంథితగరము, పిప్పళ్లు, చేదుపొట్ల, చవ్యము, చిత్రమూలము, వస, తుంగముస్తలు, వాయువిడంగములు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి మజ్జిగతోఁ గాని కొంచముష్ణముగ నుండు నుదకముతోఁ గాని పెరుగుమీఁది మీఁగడతోఁ గాని పుల్లగనుండు మాదీఫలము మొదలగువాని రసములతోఁగాని కలిపి పానము జేయించిన గరసంబంధమువలన కలిగిన అగ్నిమాంద్యము శమించును.

—గరోపద్రవహరకషాయము.—

పారావతామిషశశీపుష్కరాహ్వం శృతం హిమమ్,
గరతృష్ణారుజాకాసశ్వాసహిధ్మాజ్వరాపహమ్. ౪౯

పావురపిట్టమాంసము, కచోరములు, పుష్కరమూలము వీనిని సమభాగములుగ నుదకములోవైచి చక్కఁగకాఁచి చల్లార్చి పానము జేయించిన గరము, దప్పి, కాసము, శ్వాసము, ఎక్కిళ్లు, జ్వరము ఇవి హరించును.

—విషసంకటలక్షణము.—

విషప్రకృతికాలాన్నదోషదూష్యాదిసంగమే,
విషసంకటముద్దిష్టం శతస్యైకోఽత్ర జీవతి. ౫౦

పిత్తప్రకృతి, వర్షాకాలము, విరుద్ధాన్నము, సర్పాదివిషము, పిత్తము, రక్తము, సాత్మ్యము ఇవి మున్నగునవి యొక్కటిగ జేరినచో విషసంకటమనిచెప్పఁబడును. ఆవిషసంకటముగల సమయమున విషబాధకల్గినచో నూటికొక్కఁడు మాత్రము జీవించును.

### విషవృద్ధికరద్రవ్యములు.

క్షుత్తృష్ణాఘర్మదౌర్బల్యక్రోధశోకభయశ్రమైః,
అజీర్ణవర్చోద్రవతః పిత్తమారుతవృద్ధిభిః. ౬౧
తిలపుష్పఫలాఘ్రాణభూబాష్పఘనగర్జితైః,
హస్తిమూషికవాదిత్రనిస్వనైర్విషసంకటైః. ౬౨
పురోవాతోత్పలామోదమదనైర్వర్ధతే విషమ్,

ఆఁకలి, దప్పి, దుఃఖము, బలహాని, కోపము, చెమట, భయము, ఆయాసము, అజీర్ణము, ద్రవరూపమైన యాహారము, పిత్తవాతప్రకోపము, నువ్వులు, నువ్వులపుష్పములను ఫలములను నాఘ్రాణించుట, భూబాష్పము, (అనఁగా వర్షాకాలములో భూమి యందుండి వెడలు నొకవిధమైన ఆవిరి,) ఉరుములు, ఏనుఁగగర్జనము, ఎలుకకూఁత, వాద్యశబ్దము, పై జెప్పిన విషసంకటములు, తూర్పుగాలి, నల్లకలువవాసన, కామము వీనిచే విషము వృద్ధిఁజెందును.

### వర్షాదికాలవిషస్వరూపము.

వర్షాసు చాంబుయోనిత్వాత్సంక్లేదం గుడవద్గతమ్. ౬౩
విసర్పతి ఘనాపాయే తదగస్త్యో హినస్తి చ,
ప్రయాతి మందవీర్యత్వం విషంతస్మాద్ఘనాత్యయే. ౬౪

విషము నీటిలో జనించినదికావున వర్షాకాలమునందు బెల్లమువలె ద్రవరూపము నొంది శరీరమందంతట వ్యాపించును. శరత్కాలమునందు అగస్త్యుఁ డుదయించి విషమును హరించును. కావున శరత్కాలమున విషమునకు వీర్యము తగ్గిపోవును.

### విషప్రకృత్యాదిజ్ఞానావశ్యకత్వము.

ఇతి ప్రకృతిసాత్మ్యర్తుస్థానవేగబలాబలమ్,
ఆలోచ్య నిపుణం బుధ్యా కర్మానంతరమాచరేత్. ౬౫

పైజెప్పినప్రకారము ప్రకృతిసాత్మ్యము ఋతువులు, స్థానము వేగము వీని బలాబలమును చక్కఁగ పర్యాలోచించి పిదప వాని కనుగుణముగ దగిన చికిత్సలను జేయవలయును.

### శ్లైష్మికవిషచికిత్స.

శ్లైష్మికం వమనైరుష్ణరూక్షతీక్ష్ణైః ప్రలేపనైః,
కషాయకటుతిక్తైశ్చ భోజనైశ్శమయేద్విషమ్. ౬౬

శ్లైష్మికవిషమును వమనముల చేతను ఉష్ణముగ రూక్షగ తీక్ష్ణముగనుండు పట్టుల

చేతను వగరుగ కారముగ చేదుగనుండు ఆహారములచేతను శమింపఁజేయవలయును.

## పైత్తికవిషచికిత్స.

పైత్తికం స్రంసనైస్సేకప్రదేహైర్భృశశీతలైః,
కషాయతిక్తమధురైర్ఘృతయుక్తైశ్చ భోజనైః. ౧౭

పిత్తాధిక్యముగల విషమును విరేచనములచేతను మిక్కిలి శీతలముగనుండు సేకలేపములచేతను వగరుగ చేదుగ తియ్యఁగ ఘృతసహితముగనుండు నాహారములచేతనుశమింపఁజేయవలయును.

## వాతికవిషచికిత్స

వాతాత్మకం జయేత్స్వాదుస్నిగ్ధామ్లలవణాన్వితైః,
సఘృతైర్భోజనైర్లేపైస్తథైవ పిశితాశనైః. ౧౮
నాఘృతం స్రంసనం శస్తం ప్రలేపో భోజ్యమౌషధమ్,

వాతికవిషమును మధురముగ స్నిగ్ధముగ ఆమ్లలవణరసములతోఁగూడినదిగ నెయ్యి చేర్పఁబడినదిగ నుండు భోజనములచేతను పట్టులచేతను మాంసాహారములచేతను శమింపఁజేయవలయును. విషమునందు ఘృతమును చేర్పక విరేచనమును గాని పట్టులనుగాని ఆహారమునుగాని ఔషధమును గాని చేయించకూడదు.

## విషమునందు ఘృతమునకు శ్రేష్ఠత్వము.

సర్వేషు సర్వావస్థేషు విషేషు న ఘృతోపమమ్. ౧౯
విద్యతే భేషజం కించిద్విశేషాత్ప్రబలేఽనిలే,

అన్నివిషములయందును విషోపద్రవావస్థలయందును నేతితో సమానమైన యౌషధ మేదియులేదు. వాతప్రకోపముతో గూడియుండు విషమునందు మిక్కుటముగ నేతినిప్పించవలయును.

## సాధ్యాసాధ్యవిషములు.

అయత్నాచ్ఛ్లేష్మికంసాధ్యం యత్నాత్పిత్తాశయాశ్రయమ్. ౨౦
సుదుస్సాధ్యమసాధ్యంవా వాతాశయగతం విషమ్,

కఫముతోఁ జేరియుండు విషము స్వల్పప్రయత్నముచే సుఖసాధ్యంబగును. పిత్తాశయము నాశ్రయించియుండు విషము కడుకష్టముమీఁద సాధ్యంబగును. వాతాశయము నాశ్రయించియుండు విషము మిక్కిలి కష్టసాధ్యము. లేక అసాధ్యము.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమందును
ముప్పదియైదవయధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# షట్త్రింశాధ్యాయము.

అవ. విషప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము సర్వవిషప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నది:—

## సర్వవిషప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ. అథాత స్సర్వవిషప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

విషప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము సర్వవిషముల చికిత్సలను తెలియఁజేయుచునట్టి సర్వవిషప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము:—

### దర్వీకరాదిసర్పభేదములు.

దర్వీకరా మండలినో రాజీమంతశ్చ పన్నగాః,
త్రిధా సమాసతో భౌమా భిద్యంతే తే త్వనేకధా. ౧
వ్యాసతో యోనిభేదేన నోచ్యంతేఽనుపయోగినః,

భూమియందు నివసించు సర్పములు దర్వీకరము, మండలి రాజీమంతము అని మూఁడువిధములు. మఱియు పైసర్పములు యోనిభేదంబులచే అనేకవిధములుగనుండును. అట్టిభేదములు చికిత్సయం దుపయోగరహితములుగ నుండుటంజేసి యిచట విస్తారముగ వానిభేదములను గ్రంథకర్త చెప్పఁడయ్యె.

### దర్వీకరాదివిషలక్షణము.

విశేషాద్రూక్షకటుకమమ్లోష్ణం స్వాదు శీతలమ్. ౨
విషం దర్వీకరాదీనాం క్రమాద్వాతాదికోపనమ్,

దర్వీకరము, మండలి, రాజీమంతము అను నీమూఁడువిధములైన సర్పములయొక్క విషము రూక్షముగ కారముగ పుల్లగ ఉష్ణముగ కొంచెము తియ్యఁగ శీతలముగ నుండును. యథాక్రమముగ వాతాదులను ప్రకోపింపఁజేయును. (దర్వీకరవిషము వాతమును, మండలివిషము పిత్తమును, రాజీమంత విషము కఫమును మిక్కుటముగ ప్రకో

పింపఁజేయునని భావము.) విషములన్నియు రూక్షాదిగుణయుక్తంబులుగ నుండునని పూర్వాధ్యాయమునందే చెప్పఁబడినది. అయినను దర్వీకరము మొదలగు సర్పవిషములకు పైరూక్షాదిగుణములు విశేషముగ కలిగియుండునని తెలియపఱచుటకై మరల నీయధ్యాయమునందును తంత్రకారుఁడు చెప్పియున్నాఁడు.

### దర్వీకరాదివిషవృద్ధికాలము.

తారుణ్యమధ్యవృద్ధత్వే వృష్టిశీతాతపేషు చ. 3
విషోల్బణా భవంత్యేతే వ్యంతరా ఋతుసంధిషు,

పైచెప్పిన దర్వీకరాది సర్పములకు యౌవన మధ్యమ వార్ధక్య దశలయందును వర్షాకాలమైన శ్రావణము మొదలగు నాల్గుమాసములు శీతకాలమైన మార్గశిరము మొదలగు నాల్గుమాసములు యెండకాలమైన చైత్రము మొదలగు నాల్గుమాసములు వీనియందును యథాక్రమముగ విషము అధికముగనుండును. సంకరజాతులైన పాములకు ఋతుసంధులయందు విషాధిక్యము కలిగియుండును.

(దర్వీకరసర్పములకు యౌవనవయసునందును, వర్షాకాలమైన శ్రావణ భాద్రపద ఆశ్వయుజ కార్తీకమాసముల నాల్గిఁటియందును విషమధికముగ నుండును. మండలిసర్పములకు నడివయసునందును, మంచుకాలమైన మార్గశీర్ష పుష్య మాఘ ఫాల్గునమాసముల నాల్గిఁటియందును విషమధికముగ నుండును. రాజీమంతము లనుసర్పములకు ముసలివయసునందును, ఎండకాలమైన చైత్ర వైశాఖ జ్యేష్ఠ ఆషాఢమాసముల నాల్గింటియందును విషమెక్కుడుగ నుండును. సూత్రస్థానమునఁ జెప్పిన ఋతుసంధికాలమునందు సంకరజాతులైన తక్కిన సర్పములకన్నింటికిని విషము మిక్కిలి అధికముగ నుండును.)

### దర్వీకరలక్షణము.

రథాంగలాంగలచ్ఛత్రస్వస్తికాంకుశధారిణః. ౪
ఫణినశ్శీఘ్రగతయస్సర్పా దర్వీకరాస్స్మృతాః,

చక్రము, నాగలి, గొడుగు, స్వస్తికము, అంకుశము యీ చిహ్నములతోఁ గూడిన పడిగలుగలవియు అతివేగముతో పరుగిడునవియు నగుసర్పములు దర్వీకరములని ఋషులచేఁ జెప్పఁబడును.

### మండలిలక్షణము.

జ్ఞేయా మండలినోఽభోగా మండలైర్వివిధైశ్చితాః. ౫
ప్రాంశవో మందగమనాః.

నానాప్రకారములగు మండలములతో (పొడలతో)ఁ గూడినవియు నిడుపుగ

సుండునవియు అతివేగముతోఁ గూడినవియు నగుసర్పములు మండలియని తెలిసికొన వలయును. వీనికి పడిగెలుండవు.

## రాజీమల్లక్షణము.

రాజీమంత స్తురాజిభిః,

స్నిగ్ధా విచిత్రవర్ణాభి స్తిర్యగూర్ధ్వం విచిత్రితాః. ౬

నానావిధవర్ణములతోఁగూడి అడ్డముగ నిడుపుగ వ్యాపించియుండు రేఖలు (కట్లు)గల సర్పములు రాజీమంతము లనఁబడును.

## గోధాసుతలక్షణము.

గోధాసుత స్తు గాధేరో విషే దర్వీకరై స్సమః,

చతుష్పాత్ -

గాధేరము (అనఁగా ఉడుము) దర్వీకర సర్పవిషమువంటి విషముగలదిగ నాల్గు కాళ్ళతోఁ గూడినదిగ నుండును.

(ఉడుము దర్వీకర సర్పజాతికి ఇతరసర్పజాతి సంసర్గమున కల్గునది. ఇదినాల్గు కాళ్లు కల్గియుండును. దర్వీకరసంబంధము కల్గియుండుటం జేసి దానింబోలె తీవ్రమైన విషము కల్గియుండునని భావము.)

## సంకరజాతివ్యంతరసర్పలక్షణము.

వ్యంతరాః విద్యాదే తేషామేవ సంకరాత్. ౭

వ్యామిశ్రలక్షణా స్తేహి సన్నిపాతప్రకోపనాః,

పైచెప్పిన దర్వీకరాది సర్పములయొక్క పరస్పర సంకరమువలన జనించిన సర్పములు వ్యంతరము లనఁబడును. వీనికి పైదర్వీకరాది సర్పములకుఁ జెప్పియుండు లక్షణములు కలిసియుండును. వీని విషము సన్నిపాతమును ప్రకోపింపఁజేయును.

## సర్పదంశకారణము.

ఆహారార్థం భయాత్పాదస్పర్శాదతివిషాత్క్రుధః. ౮

పాపవృత్తితయా వైరాద్దేవర్షి యమచోదనాత్,

దశంతి సర్పా స్తేషూక్తం విషాధిక్యం యథోత్తరమ్. ౯

ఆహారముకొఱకును భయమువలనను కాళ్ళచే త్రొక్కుటవలనను విషము వృద్ధిఁ జెందియుండుట వలనను కోపమువలనను పాపస్వభావము చేతను ద్వేషమువలనను దేవతలు ఋషులు యముఁడు వీరి ప్రేరేపణవలనను సర్పములు మనుజాదులను కఱచును. పైజెప్పిన కాటులలో నొకదానికన్న నొకటి విషాధిక్యము కలదిగనుండును. (అనఁగా

ఆహారము కొఱకు కఱచిన కాటునకన్న భయములవలన కఱచిన కాటునందు విషముగ నుండును.) ఇట్లు పైజెప్పిన వానిలో నొకదానికన్న నొకటి యధికవిషమని యూహింపవలెను.
చునది.

ఆదిష్టాత్కారణం జ్ఞాత్వా ప్రతికుర్యా ద్యథాయథమ్,

పైచెప్పిన దర్వీకరాది సర్పములు కఱచుటకు కారణములను చక్కఁగ తెలిసికొని వానివానికి తగినట్లు చికిత్సలను జేయవలయును.

వ్యంతరస్వరూపము.

వ్యంతరః పాపశీలత్వాన్మార్గమాశ్రిత్య తిష్ఠతి. ౧౦

వ్యంతరములను సర్పములు (సంకరజాతి సర్పములు) పాపిష్ఠిస్వభావము గలవి యగుటంజేసి యెల్లపుడు మనుజాదులు సంచరించునట్టి మార్గములయందు సంచరించుచుండును. అట్టిత్రోవలఁగనిపెట్టి ప్రాణులఁ గరవఁజూచును.

తుండాహతాది సర్పదంశలక్షణము.

యత్ర లాలాపరిక్లేదమాత్రం గాత్రే ప్రదృశ్యతే,
నతు దంష్ట్రాకృతం దంశం తత్తుండాహతమాదిశేత్. ౧౧
ఏకందంష్ట్రాపదం ద్వే వా వ్యాలీఢాఖ్యమశోణితమ్,
దంష్ట్రాపదే సరక్తే ద్వే వ్యాలుప్తం త్రీణి తాని తు. ౧౨
మాంసచ్ఛేదాదవిచ్ఛిన్నరక్తవాహీని దంష్ట్రికమ్,
దంష్ట్రాపదాని చత్వారి తద్వద్దష్టనిపీడితమ్. ౧౩
నిర్విషం ద్వయమత్రాద్యమసాధ్యం పశ్చిమం వదేత్,

మనుజునియొక్క శరీరమున సర్పముయొక్క కోరలుతగులక దాని జొల్లుమాత్రము తగిలియుండిన నది తుండాహతమనియు, ఒకటి లేక రెండు కోరలుతగిలి రక్తము వెడలకయుండిన నది వ్యాలీఢమనియు, రెండు కోరలు దృఢముగ తగిలి రక్తముతోఁ గూడియుండిన నది వ్యాలుప్తమనియు, మూఁడు కోరలు గట్టిగతగిలి మాంసము ఛేదింపఁబడి ధారగా రక్తము స్రవించుచుండిన నది దంష్ట్రికమనియు నాల్గు కోరలు దృఢముగతగిలి ధారగ రక్తము స్రవించుచుండిన నది దష్టనిపీడితమనియు జెప్పఁబడును. వానిలో తుండాహతము, వ్యాలీఢము అను రెండును విషరహితములుగ నుండును. వ్యాలుప్తము దంష్ట్రికము అను రెండును కష్టసాధ్యములు. దష్టనిపీడిత మనునది అసాధ్యము.

సర్పవిషలక్షణము.

విషం నాహేయమప్రాప్య రక్తం దూషయతే వపుః. ౧౪
రక్తమణ్వపి తు ప్రాప్తం వర్ధతే తైలమంబువత్,

సర్పవిషమునకు రక్తసంబంధము కలుగక శరీరము చెడనేరదు. ఆవిషము స్వల్పరక్తముతో సంబంధించినను జలములో నువ్వులనూనె స్వల్పముతగిలిన నుదక మంతయు నెటుల వ్యాపించునో అటుల శరీరమంతయు వ్యాపించును.

### సర్పాంగాభిహతలక్షణము.

భీరోస్తు సర్పసంస్పర్శాద్భయేన కుపితోఽనిలః. ౧౫
కదాచిత్కురుతే శోఫం సర్పాంగాభిహతం తు తత్,

భయపడు స్వభావము గలవానికి సర్పము తాకుటవలన విశేషభయముకలిగి దానిచే వాతము ప్రకోపించి ఒకానొకప్పుడు శరీరమున వాపును గలుగఁజేయును. అది సర్పాంగాభిహతమని చెప్పఁబడును.

### శంకావిషలక్షణము.

*దుర్గాంధకారే విద్ధస్య కేనచి ద్దష్టశంకయా. ౧౬
విషోద్వేగో జ్వరశ్ఛర్ది ర్మూర్ఛా దాహోఽపివా భవేత్,
గ్లానిర్మోహోఽతిసారో వా తచ్ఛంకావిషముచ్యతే. ౧౭

గాఢాంధకారములో నేదైన నొకజంతువుచే గాయము తగిలిన వానికి పాముకఱచినదన్న సందేహముచే విషవేగము జ్వరము వాంతి మూర్ఛ సర్వాంగతాపము,లేక బడలిక మోహము అతిసారము కలుగును. ఇది శంకావిషమని చెప్పఁబడును.

### సవిషనిర్విషలక్షణము.

తుద్యతే సవిషో దంశః కండూశోఫరుజాన్వితః,
దహ్యతే గ్రథితః కించిద్విపరీతస్తు నిర్విషః. ౧౮

విషముతోఁ గూడియుండు కాటునందు పోట్లు దురద వాపు శోఫనొప్పి తాపము కొంచెము ఉంటకట్టి యుండుట ఈలక్షణము లుండును. ఇట్టి లక్షణములు లేకుండిన నది నిర్విషమని తెలిసికొనవలయును.

### దర్వీకరీప్రథమ విషవేగాద్యుపద్రవములు

పూర్వే దర్వీకృతాం వేగే దుష్టం స్రావీభవత్యసృక్,
శ్యావతా తేన వక్త్రాదౌ సర్పంతీవ చ కీటకాః. ౧౯
ద్వితీయే గ్రంథయో వేగే తృతీయే మూర్ధ్ని గౌరవమ్,
దుర్గంధో దంశవిక్లేదశ్చతుర్థే ష్ఠీవనం వమిః. ౨౦
సంధివిశ్లేషణం తంద్రా పంచమే పర్వభేదనమ్,

* 'దురంధకారే' అని పాఠాన్తరము.

దాహో హిధ్మా చ షష్ఠే చ హృత్పీడా గాత్రగౌరవమ్. ౨౧
మూర్ఛా విపాకో ఽతీసారః ప్రాప్య శుక్రం తు సప్తమే,
స్కంధపృష్ఠకటీభంగస్సర్వచేష్టానివర్తనమ్. ౨౨

దర్వీకరమను సర్పముయొక్క మొదటి విషవేగమున శ్యామవర్ణముగల దుష్టరక్తము స్రవించును. దానిచేత ముఖము కండ్లు నాలుక వీనియందు శ్యామవర్ణము కలుగును. శరీర మంతట పురుగులు సంచరించున ట్లుండును. దర్వీకరమను సర్పముయొక్క రెండవవిషవేగమునందు గ్రంథులు, మూడవవిషవేగమునందు శిరోగురుత్వము, దుర్గంధము కఱచినస్థలమునందు చల్లగనుండుట, నాల్గవవిషవేగమునందు నోట జొల్లుకారుట, వాంతి శరీరసంధులు జారిపోవుట ఆలస్యము అయిదవవిషవేగమునందు గణుపులయందు నొప్పి సర్వాంగతాపము ఎక్కిళ్లు, ఆఱవవేగమున ఱొమ్మునొప్పి, శరీరగురుత్వము, మూర్ఛ, అజీర్ణము, అతిసారము, ఏడవవేగమునందు విషము శుక్రస్థానమును జేరుటవలన భుజశిరములయందును నడుమునందును వీపునందును నొప్పి, హస్తపాదాదులు చలనము లేకుండుట కలుగును.

## మండలివిషప్రథమాదివేగోపద్రవములు.

అథ మండలిదష్టస్య దుష్టం పీతీభవత్యసృక్,
తేన పీతాంగతా దాహో ద్వితీయే శ్వయథూద్భవః ౨౩
తృతీయే దంశవిక్లేదస్స్వేదస్తృష్ణా చ జాయతే,
చతుర్థే జ్వర్యతే దాహః పంచమే సర్వగాత్రగః. ౨౪

మండలియను సర్పము కఱచినవానికి మొదటివిషవేగమునందు రక్తముచెడి రక్తము పసుపువర్ణముగ నగును. దానివలన శరీరమంతయు పసుపువర్ణముగ నగును. దానివలన శరీరమంతయు పసుపువర్ణము తాపముకలుగును. రెండవవిషవేగమున వాపు, మూడవవిషవేగమున కఱచిన స్థలమునందు చెమట, దప్పి, నాల్గవవిషవేగమున జ్వరము, తాపము, అయిదవ విషవేగమున సర్వాంగతాపము కలుగును.

## రాజిలసర్పవిషవేగాద్యుపద్రవము.

దష్టస్య రాజిలైర్దుష్టం పాండుతాం యాతి శోణితమ్,
పాండుతా తేన గాత్రాణాం ద్వితీయే గురుతాతి చ. ౨౫
తృతీయే దంశవిక్లేదో నాసికాక్షిముఖస్రవాః,
చతుర్థే గరిమా మూర్ధ్నః మన్యాస్తంభశ్చ పంచమే. ౨౬
గాత్రభంగో జ్వరశ్శీతశ్శేషయోః పూర్వవద్వదేత్,

రాజీమంతమను సర్పము కరచినవానికి రక్తముచెడి తెల్లగనై శరీరమంతయు తెల్ల గనగును. రెండవవిషవేగమున శరీరమున మిక్కిలి గురుత్వము, మూడవవేగమున కఱచిన స్థలమున చెమట ముక్కు నేత్రములు నోరు వీనియందు స్రావము, నాల్గవవేగమున శిరోగురుత్వము మెడపట్టుకొనుట, అయిదవవేగమున శరీర మందంతట నొప్పి జ్వరము శైత్యము కలుగును. మండలి, రాజీమంతము అను సర్పములయొక్క ఆరు ఏడు విషవేగ ములయందు దర్వీకరమను సర్పముయొక్క ఆరు ఏడు విషవేగమువకుచెప్పియుండు ఉప ద్రవములు కలుగును.

### మండలివిషచికిత్సాకాలము.

కుర్యా త్పంచసు వేగేషు చికిత్సాం న తతః పరమ్. ౨౭

దర్వీకరాదిసర్పములు కఱచినవానికి ఐదు విషవేగములలోపల తగిన చికిత్సను చేయవలయును. అందుకుపై అసాధ్యము కావున చికిత్సజేయంజనదు.

### అల్పవిషసర్పములు.

జలాప్లుతాారతిక్షీణాభీతానకులనిర్జితాః,
శీతవాతాతపవ్యాధిక్షు త్తృష్ణాశ్రమపీడితాః. ౨౮
తూర్ణం దేశాంతరాయాతావిముక్తవిషకంచుకాః,
కుశౌషధీకంటకవద్యే చరంతీవ కాననమ్. ౨౯
దేశం చ దివ్యాధ్యుషితం సర్పా స్తేఽల్పవిషా మతాః,

జలములో తడిసినవిగ, సంభోగముచే శ్రమమును జెందినవిగ, భయపడినవిగ ముంగిసచే జయింపఁబడినవిగ, చలి, గాలి, ఎండ, వ్యాధి, ఆఁకలి, దప్పి, ఆయా సము వీనిచే పీడింపఁబడినవిగ, అపుడే దేశాంతరమునుండి వచ్చినవిగ, విషమునుగాని కూసమునుగాని విడిచినవిగ, దర్భ, ఓషధులు ముండ్లుగల అడవియందుగాని దేవతలుసంచ రించు ప్రదేశమునందు గాని సంచరింమనవిగనుండు సర్పములన్నియు మిక్కిలి స్వల్ప విషముగలవిగ నుండునని మహర్షులు వచింపుచున్నారు.

"శ్మశానచైత్యవల్మీక యజ్ఞాశ్రయసురాలయే,
చతుష్పథే జలస్థానేజీర్ణోద్యానేషు కోటరే.
క్షీరద్రుమే నింబతరా నిష్కురే గిరిగహ్వరే,
చక్రవజ్రగదాకుంతత్రిశూలాంకజటాధరాః.
రక్తాస్యనయనా యే చ తే స్యురాశీవిషోపమాః,

న తేషు కాలనియమో న చ వేగే ష్వనుక్రమః,
మంత్రతంత్రబలాన్నాపి ప్రసహ్య వినివర్తనమ్."

శ్మశానము చైత్యప్రదేశము పుట్ట యాగభూమి దేవాలయము నాల్గుత్రోవలు కలసినస్థలము జలసమీపప్రదేశము పాతయుద్యానము వృక్షములతోరటలు పాలుగల వృక్షములు వేఁపచెట్టు సెలయేరుపర్వతగుహలు వీనియందు వసించెడిపాములును, చక్రము వజ్రాయుధము గద కుంతము త్రిశూలము వీనితో తుల్యముగనుండు రేఖలుగల పడిగలతోఁగూడిన సర్పములును, నోరు కండ్లు యివి యెఱ్ఱగనుండుపాములును యివియన్నియు పెద్దసర్పములతో సమానమైన విషము కలవిగనుండును. పైపాములు కఱచుటకు కాలనియమంబును కారణంబును లేకుండును. వాని విషవేగములకు క్రమములేదు. మణి మంత్రతంత్ర ఓషధి మొదలగువాని వీర్యములచే వానివిషము త్రిప్పుటకుసాధ్యముకానేరదు. అని సంగ్రహమునందు చెప్పఁబడియున్నది.

## అసాధ్యవిషలక్షణము.

శ్మశానచితిచైత్యాదౌ పంచమీపక్షసంధిషు. ౩౦
అష్టమీనవమీసంధ్యామధ్యరాత్రిదినేషుచ,
యామ్యాగ్నేయమఘాశ్లేషావిశాఖాపూర్వనైఋతే. ౩౧
నైఋతాఖ్యే ముహూర్తే చ దష్టం మర్మసు చ త్యజేత్,
దష్టమాత్రస్సితాస్యాక్షశ్శీర్యమాణశిరోరుహః. ౩౨
స్తబ్ధజిహ్వో ముహుర్మూర్ఛన్ శీతోచ్ఛ్వాసో న జీవతి,

శ్మశాన, చితి, చైత్యప్రదేశాది దుష్టస్థలములయందును, పంచమి, పక్షసంధులు, అష్టమి, నవమి ఈతిథులయందును, సంధ్యాకాల అర్ధరాత్ర మధ్యాహ్నకాలములయందును, భరణి, కృత్తిక, మఖ, ఆశ్లేష, విశాఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మూల, ఈనక్షత్రములయందును, నైఋతమను ముహూర్తమందును, మర్మస్థానములయందును, పాముకఱచిన నా మనుజులు జీవింపనేరరు. పాముకఱచినతోడనే వానికి నోరు కండ్లు తెలుపుబారుట తలవెండ్రుక లూడిపడుట నాలుక స్తబ్ధమగుట, పలుమాఱు మూర్ఛకలుగుట ఊపిరి చల్లగవెడలుట ఈ యుపద్రవములు కలిగినవాఁడు జీవించఁడు. కావున వీరలకు చికిత్సఁజేయుట నిష్ప్రయోజనము.

"శ్వయథుర్వేదనా తీవ్రా స్రావాభంగోఽక్షిరక్తతా,
మూర్ఛా గళగ్రహ శ్ఛర్దిః ప్రేతరాజస్య కింకరాః,
జాంబవప్రతిమో దంశః కూర్మపృష్ఠవదున్నతః,

రక్తం ఖేభ్యస్సమస్తేభ్యో వర్తతే న తు దంశతః,
రోమహర్షో నఖశిరైశ్శ్వయథుర్లోహితో౽సితః,
హృష్టమేహానతావక్త్రవక్రత్వం యస్య తం త్యజేత్."

పాముకఱచినతోడనే వాపు తీవ్రమైననొప్పి మెడపట్టుకొనుట నేత్రములుఱెల్లి జారుట మూర్ఛ ఒళ్ళుముఱచికొనుట వాంతి యీయుపద్రవములు కలిగినచో నా మనుజుఁడు జీవించనేరఁడు. మఱియు పాముకఱచిన స్థలము నేరేడుపండువలె నల్లగ తాబేలు వీపువలె పొడవుగనై శరీరమునందలి ద్వారములయందుండి రక్తము స్రవించుచు పాముకఱచిన స్థలములో మాత్రము రక్తము స్రవింపకయుండిన నట్టివాఁడుజీవించఁడు. గగుర్పాటు వాపు శరీరము యెఱ్ఱగగాని నల్లగిగానినగుట నేత్రములు ముక్కు నోరు యివి వంకరగనగుట యీయుపద్రవములుగల విషరోగి జీవించఁడు. అని సంగ్రహమునందు చెప్పఁబడియున్నది.

హిధ్మా శ్వాసో వమిః కాసో దష్టమాత్రస్య దేహినః. ౩౩
జాయంతే యుగపద్యస్య సహృచ్ఛూలీ న జీవతి,

పాముకఱచినతోడనే మనుజునికి ఎక్కిళ్లు శ్వాసము వాంతి కాసను ఱొమ్ము నొప్పి యివి యేకకాలమున జనించిన నట్టివాఁడు జీవించఁడు.

ఫేనం వమతి నిస్సంజ్ఞ శ్శ్యావపాచకరాననః. ౩౪
నాసావసాదో భంగో౽ంగే విడ్భేదశ్శ్లథసంధితా,
విషపీతస్య దష్టస్య దిగ్ధేనాభిహతస్య చ. ౩౫
భవంత్యేతాని రూపాణి సంప్రాప్తే జీవతక్షయే,

విషమును త్రాఁగినవానికిగాని పాము కఱచినవానికిగాని విషము పూయఁబడిన శస్త్రముచే కొట్టఁబడిన వానికిగాని నురుగును కక్కుట, ప్రజ్ఞలేకుండుట, కాళ్లు చేతులు ముఖము నల్లగనగుట, ముక్కు వంకరగనగుట, శరీరమందంతట నొప్పి, మలము వెడలుట, సంధులుజారుట యీలక్షణములు కలిగినవాఁడు జీవించఁడు. పై లక్షణములు మరణకాలమునందే కలుగును.

న నస్యైశ్చేతనా తీక్ష్ణైర్న క్షతాత్ క్షతజాగమః. ౩౬
దండాహతస్య నో రాజీ ప్రయాతస్య యమాంతికమ్,

ముందుచెప్పిన ప్రకారము పాముకఱచిన వానికి తీక్ష్ణమైన నస్యములు చేయించియు వానికి ప్రజ్ఞతెలియకుండుట, శరీరమును ఛేదించిన నాగాయమునుండి రక్తము వెడలకుండుట, కఱ్ఱచేగట్టిగకొట్టిన యాకఱ్ఱవలె రేఖగ దద్దుకలుగకుండుట ఈ లక్షణములుకలిగినవాఁడు యముని సమీపమునకు పోవునని నిశ్చయింపవలయును.

## సాధ్యవిషచికిత్స.

అతోఽన్యథాతు త్వరయా ప్రదీప్తాగారవద్భిషక్. 32
రక్షన్ కంఠగతాన్ ప్రాణాన్ విషమాశు శమం నయేత్,

సర్పదష్టునికి పైచెప్పిన యసాధ్యలక్షణములు లేకుండినచో "నిప్పంటగిలి కాలుచుండు యిల్లును శీఘ్రముగ నుదకాదులచే శమింపఁ జేయుచందంబున" విషసంబంధముచే పీడితుండుగ నుండువానికి త్వరితముగ ఔషధాదుల నిప్పించి యా విషమును శీఘ్రముగ శమింపఁజేయవలయును.

## విషవ్యాప్తిక్రమము.

మాత్రాశతం విషం స్థిత్వా దంశే దష్టస్య దేహినః 37
దేహం ప్రక్రమతే ధాతూన్ రుధిరాదీన్ ప్రదూషయత్,
ఏతస్మిన్నంతరే కర్మ దంశస్యోత్కర్తనాదికమ్. 38
కుర్యాచ్ఛీఘ్రం యథా దేహే విషవల్లీ న రోహతి,

పాము కఱచినచోటులో నావిషము నూరుత్రుటుల కాలమువరకునుండి పిదప రక్తాదిధాతువులను చెఱచుచు దేహమంతట వ్యాపించును. కావున నాకాలములోపలనే విషము శరీరమంతట వ్యాపించకుండునటుల నతిశీఘ్రముగ పాముకఱచినతోడనే ఆపామును కఱచుట పాముకాటున కాటువేసి రక్తముదీయుట మున్నగు చికిత్సలను జేయవలయును.

## సర్పదష్టచికిత్స.

దష్టమాత్రో దశేదాశు తమేవ పవనాశినమ్. 40
లోష్టం మహీం వా దశనైశ్ఛిత్వా చాను ససంభ్రమమ్,
నిష్ఠీవేన సమాలింపే ద్దంశం కర్ణమలేన వా. 41

పాముకఱచినపురుషుఁడు తోడనే యాపామును త్వరగా కొఱుకవలయును. లేక అట్టిమనుజుఁడు మట్టిగడ్డనుగాని భూమినిగాని పండ్లచేకొరికి పిదప కారియుమిసి పాముకఱచినచోట ఆవుమ్మినిగాని తన గుబిలినిగాని తొంసు లేపనము చేయవలయును.

## సర్పదంశబంధనము.

దంశస్యోపరి బధ్నీయాదరిష్టాం చతురంగులే,
కౌమాదిభిర్వేణికయా సిద్ధైర్మంత్రైశ్చ మంత్రవిత్. 42

అంబువత్సేతుబంధేన బంధేన స్తభ్యతే విషమ్,
న వహంతి సిరాశ్చాస్య విషం బంధాభిపీడితాః. ౪౩

మంత్రసిద్ధిగలవాఁడు తెల్ల పట్టుగుడ్డ చింపినైనను, వెంత్రుకలనైనను సిద్ధమంత్రములచే నభిమంత్రించి పాము కఱచిన స్థలమునకు పైన నాల్గు అంగుళములప్రదేశములోఁ గట్టవలయును. ఇటుల కట్టుటచే ‹‹ఆనకట్టువలన ప్రవహించునీరునిలుచుభంగి'' సిరలమార్గమునుండి శరీరములో విషము వ్యాపించక నిలుచును.

## సర్పవిషహరణము.

నిష్పీడ్యానూద్ధరేద్దంశం మర్మసంధ్యగతం తథా,
న జాయతే విషావేగో బీజనాశాదివాంకురః. ౪౪

పైచెప్పిన ప్రకారము కట్టుకట్టినపిదప నావిషము మర్మములు సంధులు వీనిని జేరకయుండునపుడు కఱచినచోటును కత్తిచేగీఁచి చక్కఁగ బిసికి విషమును బైలుపఱచవలయును. ఇటులఁజేసిన ‹‹విత్తనములు నశించిన మొలకలు మొలవకుండు చందంబున'' విషమును బైలు పఱచుటవలన విషవేగము కలుగకుండును.

## సర్పదంశమునకు దాహకర్మ.

దంశం మండలినాం ముక్త్వా పిత్తలత్వాదథాపరమ్,
ప్రతప్తై ర్హేమలోహాద్యై ర్దహేదాశూల్ముకేన వా. ౪౫
కరోతి భస్మసా త్సద్యో వహ్నిః కిం నామ న క్షణాత్,

మండలియను సర్పముయొక్క కాటుతప్ప యితరములగు కాటునందు బంగారు యినుము మొదలగు లోహములను చక్కఁగకాల్చి వానిచే గాని కొఱివికట్టెలచేఁ గాని కాల్చిన నాయగ్ని విషమును క్షణకాలములో భస్మముచేయును.

## సర్పవిషాచూషణము.

ఆచూషేత్పూర్ణవక్త్రో వా మృద్భస్మాగదగోమయైః. ౪౬
ప్రచ్ఛాయాంతరరిష్టాయాం మాంసలం తు విశేషతః,
అంగం సహైవ దంశేన లేపయేదగదైర్ఘ్నహృః. ౪౭
చందనోశీరయుక్తేన సలిలేన చ సేచయేత్,

సర్పదష్టులైనవారికి పూర్వము చెప్పినప్రకారము కట్టుఁగట్టి పిదప మిక్కిలి బలవంతులగు మనుజులు మట్టి, బూడిదె, ఔషధము, గోమయము వీనిలో దేనినైన నోఁటిని నోటినిండ నుంచుకొని పాము కఱచినచోటులో నొక గొట్టమునునిచి దానిమార్గముగ

విషమును నోటిచే పీల్చవలయును. పాము విషముతగిలినవాఁడు స్థూలశరీరుఁడుగ నుండిన వానివిషమును పైచెప్పినప్రకారము నోటిచేతనే పీల్చవలయును. మఱియు విషహారౌషధములను నూరి శరీరమంతట వలుమాఱు పూయుచుండవలయును. చందనము, వట్టివేరు వీనినినూరి యుదకములో కలిపి యాయుదకముచే సేచనమును చేయవలయును.

విషోపద్రవమున సిరావేధము.

విషే ప్రవిసృతే విధ్యాత్సిరాం సా పరమా క్రియా. ౪౮
రక్తే నిర్హ్రియమాణే హి కృత్స్నం నిర్హ్రియతే విషమ్,

విషము శరీరమంతట వ్యాపించియుండిన సిరను వేధించవలయును. అట్లుచేయుటవలన రక్తము బైలువెడలి చక్కఁగ నారక్తముతో విషమంతయు బైటికి వచ్చును. కాఁబట్టి సిరావేధము విషచికిత్సయందుత్తమమైనది.

సవిషనిర్విషరక్తలక్షణము.

దుర్గంధం సవిషం రక్తమగ్నౌ చటచటాయతే. ౪౯
యథా దోషం విశుద్ధం చ పూర్వవల్లక్షయేదసృక్,

విషముతోఁగూడియుండు రక్తము దుర్గంధము కలదిగ నుండును. దానిని నిప్పులో వేసిన చటచటయను శబ్దము కలుగును. శుద్ధంబుగ నుండు రక్తము నాయా దోషానుగుణముగ సిరావ్యధవిధ్యధ్యాయములోఁ జెప్పియుండు లక్షణములచే తెలిసికొనవలయును.

విషమునందు జలౌకాప్రయోగము.

సిరాస్వదృశ్యమానాసు యోజ్యాశ్శృంగజలౌకసః. ౫౦
వాపు మొదలగు నుపద్రవములచే సిర అగుపడకయుండిన చిమ్మనగొట్టముచేగాని జలగలచేఁగాని రక్తమును తీయవలయును.

విషోపద్రవమున రక్తస్తంభనము.

శోణితం స్రుతశేషం చ ప్రవిలీనం విషోష్మణా,
లేపసేకై స్తు బహుశః స్తంభయేద్భృశశీతలైః. ౫౧

బైలువెడలినది పోఁగా శేషించియుండు రక్తము విషాగ్నిచేకరిగి వెడలుచుండిన మిక్కిలి శీతలముగ నుండు పట్లు సేకము వీనిని పలుమాఱుచేయించి యారక్తము బైలు వెడలకుండునటులఁ జేయవలయును.

### విషమూర్ఛాహరోపచారములు.

అస్కన్నే విషవేగాద్ధి మూర్ఛాయమదహృద్ద్రవాః,
భవంతి తాఞ్ జయేచ్ఛీతైర్వీజేచ్చారోమహర్షతః. ౫౨

విషవేగముచే రక్తముపేరి స్రవింపకయుండిన మూర్ఛ మదాత్యయము హృద్రోగము కలుగును. అట్టివారికి చల్లగనుండు లేపసేకములను జేయించవలయును. శరీరమున ...టు కలుగువఱకు విసనకఱ్ఱ మొదలగు వానిచే గాలితగులునట్లు విసరవలయును.

స్కన్నే తు రుధిరో సద్యో విషవేగః ప్రశామ్యతి,
రక్తము చక్కగ బైలువెడలిన విషవేగము శీఘ్రములో శమించును.

### విషోపద్రవమునకు ఘృతపానము.

విషం కర్షతి తీక్ష్ణత్వా ద్ధృదయం తస్య గుప్తయే. ౫౩
పిబేద్ఘృతం ఘృతక్షౌద్రమగదం వా ఘృతాప్లుతమ్,
హృదయావరణే చాస్య శ్లేష్మా హ్యుద్యుపచీయతే. ౫౪

విషము తీక్ష్ణస్వభావము గలదియగుటం జేసి హృదయము నీడ్చును. కాఁబట్టి ...ృదయమును కాపాడుటకై ఆవునెయ్యినిగాని, ఆవునెయ్యి తేనె కలిపిగాని, ...ౌషధములను ఆవునెయ్యిలో కలిపిగాని విషరోగి కిప్పించవలయును. ఇటుల శ్లేష్మము వృద్ధిజెంది యది హృదయమును నావరించును.

### విషవేగమున వమనావశ్యకత్వము.

ప్రవృత్తగౌరవోత్క్లేశహృల్లాసం వామయేత్తతః,
ద్రవైః కాంజికకౌళుత్థతైలమద్యాదివర్జితైః. ౫౫
వమనైర్విషహృద్భిశ్చ నైవం వ్యాప్నోతి తద్వపుః,

పాము కాటుతగిలినవానికి శరీరమునందు గురుత్వము ఓకర హృల్లాసము కలిగి...ిన విషహరములైన ద్రవరూపముగనుండు నౌషధములచే వమనము చేయించ...ను. గంజి, ఉలవకట్టు, నువ్వుల నూనె, మద్యము మొదలగు వానిచే వమనము ...పం జనదు. పైచెప్పిన ప్రకారము వమనము చేయించిన శరీరమునందు విషము ...ంచనేరదు.

### దర్వీకరాదిప్రకృత్యనుగుణచికిత్స.

భుజంగదోషప్రకృతిస్థానవేగవిశేషతః. ౫౬
సుసూక్ష్మం సమ్యగాలోచ్య విశిష్టాం వాచరేత్ క్రియామ్,

సర్వము, దోషము, ప్రకృతి, స్థానము. వేగము వీనిని చక్కఁగ పర్యాలోచించి వానివానికి తగినటుల చికిత్సలను జేయవలయును.

### దర్వీకరవిషమున పాననస్యములు.

సిందువారితమూలాని శ్వేతా చ గిరికర్ణికా. ౫౮

పానం దర్వీకరై ర్దష్టే నస్యం మధు సపాకలమ్,

దర్వీకరమను పాముకఱచినవానికి వావిలివేళ్ళను గాని తెల్లగంటెనను గాని నూరి యుదకములో కలిపి పానము చేయించి పిదప చెంగల్వకోష్టును ఉదకముతో నూరి మాక్షికమను తేనెలో కలిపి నస్యము చేయించవలయును.

### కృష్ణసర్పదష్టచికిత్స.

కృష్ణసర్పేణ దష్టస్య లింపేద్దంశం హృతేఽసృజి. ౫౮

చారటీనాకులీభ్యాం వా తీక్ష్ణమూలవిషేణ వా,

పానం చ క్షౌద్రమంజిష్ఠా గృహధూమయుతం ఘృతమ్. ౫౯

కృష్ణసర్పము కఱచినవానికి రక్తమోక్షణము చేయించి కఱచిన చోటునందు గురిగింజవేళ్లు, పెద్దసర్పాక్షివేళ్లు వీనిని నూరి లేపనము చేయవలయును. లేక తీక్ష్ణమైన మూలవిషముచే లేపనము చేయవలయును. మంజిష్ఠ, కరిధూపము, తేనె వీని నావు నెయ్యిలో కలిపి పానము చేయించవలయును.

### రాజీమద్దష్టచికిత్స.

తండులీయకకాశ్మర్య కిణిహీ గిరికర్ణికా,

మాతులుంగీ సితా శేలుః పాననస్యాంజనై ర్హితః. ౬౦

అగదః ఫణినాం ఘోరే విషే రాజీమతామపి,

రాజీమతు అనుసర్పము పెద్దసర్పములు. వీనియొక్క దారుణవిషములందు చిర్రికూర, గుమ్ముడు, ఉత్తరేణు, తెల్లగంటెన, అడవి మాదీఫలపుచెట్టు తులసి, విరిగి వీనిచే పాన నస్యాంజనములను చేయించిన హితముకలుగును.

### మండలివిషచికిత్స.

సమాః సుగంధా మృద్వీకా శ్వేతాఖ్యా గజదంతికా. ౬౧

అర్ధాంశం సౌరసం పత్రం కపిత్థం బిల్వదాడిమమ్,

సక్షౌద్రో మండలివిషే విశేషాదగదో హితః. ౬౨

పెద్దసర్పాక్షి, ద్రాక్ష, శ్వేతాఖ్యా (అనఁగా కలిగోట్టు), నాగదంతిచెట్టు ఇవి సమభాగములు. తులసి, వెలగ, మారేడు, దానిమ్మ ఇవి దిను సొకటింటికి అర్ధభాగము.

ులు వీనిని నూరి తేనెలో కలిపి మండలియను సర్పము కఱచినవారికిచ్చినచో మిక్కిలి
ుణము కలుగును.

### మండలివిషహరలేపము.

పంచవల్కవరాయష్టినాగపుష్పైలవాలుకమ్,
జీవకర్షభకోశీరం సితా పద్మక ముత్పలమ్. ౬౩
సక్షౌద్రో హిమవా న్నామ హన్తి మండలినాం విషమ్,
లేపాచ్ఛ్వయథువీసర్ప విస్ఫోటజ్వరదాహహా. ౬౪

పంచవల్కలము, (అనఁగా దిరిసెనము, రావి, మఱ్ఱి, జువ్వి, ప్రబ్బలి వీని
ట్టలు), త్రిఫలములు, అతిమధురము, నాగకేసరములు, ఏలకలు, జీవకము, ఋషభ
ము, వట్టివేరు, పంచదార, పద్మకము, నల్లకలువ వీనిని సమభాగములుగ గ్రహించి
రి తేనెలో కలిపిన నాయౌషధము 'హిమవాన్' అనఁబడును. దీనిని లేపనముఁజేసిన
ండలి సర్పవిషము, వాపు, విసర్పము, విస్ఫోటము, జ్వరము, తాపము ఇవియన్నియు
రించును.

### మండలివిషమున కాశ్మర్యాదిపానము.

కాశ్మర్యవటశృంగాణి జీవకర్షభకౌ సితా,
మంజిష్ఠా మధుకం చేతి దష్టో మండలినా పిబేత్. ౬౫

గుమ్ముడు, మఱ్ఱిచిగుళ్లు, జీవకము, ఋషభకము, పంచదార, మంజిష్ఠ, అతిమధు
ు అనువానిని నూరి ఉదకములోకలిపి మండలియను సర్పము కఱచినవానికి పానము
యుంచవలయును.

### గోనసవిషచికిత్స.

వంశత్వగ్బీజకటుకాపాటలీబీజనాగరమ్,
శిరీషబీజాతివిషే మూలం గావేధుకం వచా. ౬౬
పిష్టో గోవారిణాఽష్టాంగో హన్తి గోనసజం విషమ్,

వెదురుపట్ట, వెదురువిత్తులు, కటుకరోహిణి, కలిగొట్టువిత్తులు, శుంఠి, దిరిసెనపు
్తులు, అతివస, అడవి గోధుమచెట్టువేళ్లు, వస అనువానిని, సమభాగములుగ గ్రహించి
మూత్రములో నూరవలయును. ఇది అష్టాంగౌషధ మనఁబడును. ఇది గోనసమను
విషమును పోఁగొట్టును.

### రాజీమద్విషచికిత్స.

కటుకాతివిషాకుష్ఠగృహధూమహరేణుకాః. ౬౭

సక్షౌద్రవ్యోషతగరా ఘ్నంతి రాజీమతాం విషమ్,

కటుకరోహిణి, అతివస, చెంగల్వకోష్టు, కరిభూపము, రేణుకలు, త్రికటుకములు, గ్రంథితగరము, తేనె అనునోషధులును రాజీమంతమను సర్పవిషమును పోఁగొట్టును.

### కాండచిత్రా విషహారచికిత్స.

నిఖనేత్కాండచిత్రాయాః దంశం యామద్వయం భువి. ౬౮
ఉద్ధృత్యప్రస్థితం సర్పిర్ధాన్యమృద్భ్యాం ప్రలేపయేత్,
పిబేత్పురాణంచ ఘృతం వరాచూర్ణావచూర్ణితమ్. ౬౯
జీర్ణే విరిక్తో భుంజీత యవాన్నం సూపసంస్కృతమ్,

కాండచిత్రా యను సర్పము శరీరమునం దేప్రదేశమును కఱచినదో యాప్రదేశమును భూమిలోపల రెండుజాముల కాలము పాతిపెట్టి పిదపయెత్తి ఆకాటుపై ధాన్యపుమట్టిని నేతిలో కలిపి లేపనము చేయవలయును. పిదప త్రిఫలములను చూర్ణముచేసి ప్రాతనేతిలో కలిపి పానము చేయించి యది జీర్ణమై విరేచనమైన పిదప సంబాబియ్యములో కందిపప్పును చేర్చి పక్వముచేసి దాని నాహారముగ నిప్పించవలయును.

### వ్యంతరవిషహారచికిత్స.

కరవీరార్కకుసుమమూలలాంగలికాకణాః. ౭౦
కల్కయేదారనాళేన పాఠామరిచసంయుతాః,
ఏష వ్యంతరదష్టానామగదస్సార్వకార్మికః. ౭౧

గన్నేరుపూలు, గన్నేరువేళ్లు, జిల్లేడుపూలు, జిల్లేడువేళ్లు, చన్నచర్లగడ్డ, పిప్పళ్లు, చిరుబొద్ది, మిరియాలు అనువానిని కలితోనూరి దానిని వ్యంతరమను సర్పము కఱచినవానికి పాన నస్యాదులయం దుపయోగించవలయును.

### సర్పదష్టపాననస్యాదులు.

శిరీషపుష్పస్వరసే సప్తాహం మరిచం సితమ్,
భావితం సర్పదష్టానాం పానే నస్యాంజనే హితమ్. ౭౨

తెల్లమిరియాలను, దిరిసెనపువ్వు రసములో నేడుదినములు నానఁబెట్టి దానినిసర్పముకఱచినవారికి పాననస్యాంజనములయం దుపయోగించిన హితముకలుగును.

### సర్వవిషహరపానము.

ద్విపలం నతకుష్ఠాభ్యాం ఘృతక్షౌద్రచతుష్పలమ్,

అపి తక్షకదష్టానాం పాన మేత త్సుఖప్రదమ్. ౭౩

గ్రంథితగరము రెండుపలములు, చెంగల్వకోష్టు రెండుపలములు, ఆవునెయ్యి నాల్గుపలములు, తేనె నాల్గుపలములు ఇటుల వీని నొకటిగచేర్చి పానము చేయించిన తక్షకమను సర్పము కఱచినవానికిసూడ విషముహరించి సుఖము కలుగును.

## దర్వీకరవిషవేగచికిత్స.

అథ దర్వీకృతాం వేగే పూర్వే విస్రావ్య శోణితమ్,
అగదం మధుసర్పిర్భ్యాం సంయుక్తం త్వరితం పిబేత్. ౭౪
ద్వితీయే వమనం కృత్వా తద్వదేవాగదం పిబేత్,
విషాపహైః ప్రయుంజీత తృతీయేఽంజననావనే. ౭౫
పిబేచ్చతుర్థే పూర్వోక్తాం యవాగూం వమనే కృతే,
షష్ఠపంచమయోశ్శీతై ర్దిగ్ధం సిక్తమభీక్ష్ణశః. ౭౬
పాయయేద్వమనం తీక్ష్ణం యవాగూం చ విషాపహైః,
అగదం సప్తమే తీక్ష్ణం యుంజ్యాదంజననస్యయోః. ౭౭
కృత్వాఽవగాఢం శస్త్రేణ మూర్ధ్ని కాకపదం తతః,
మాంసం సరుధిరం తస్య చర్మ వా తత్ర నిక్షిపేత్. ౭౮

దర్వీకరమను సర్పముకఱచినవానికి మొదటివిషవేగమునందు తొలుతర క్తస్రావము జేయించి పిదప తేనె, నెయ్యి వీనితోడ విషహరౌషధమును శీఘ్రముగ నిప్పించవలయును. రెండవ విషవేగమునందు వమనమునకిప్పించి పిదప తేనె, నెయ్యి వీనిలో నౌషధమును కలిపి తినిపింపవలెను. మూఁడవ వేగమునందు విషహరములైన యౌషధములచే అంజనమును నస్యమును చేయించవలయును. నాల్గవ వేగమున వమనమును జేయించి పూర్వము చెప్పియుండు పేయను పానము చేయించవలయును. అయిదు ఆఱు వేగములయందు విషోపద్రవముగల వానిశరీరమునకు శీతముగనుండు విషహరౌషధములను పలుమాఱు పూసి విషహర కషాయముచే సేచనము చేయించి తీక్ష్ణమైన వమనౌషధము నిప్పించి విషహరౌషధములతో సిద్ధము చేయఁబడిన గంజిని పానము చేయించవలయును. ఏడవవేగమున తీక్ష్ణౌషధములచే అంజననస్యములను చేయించి శస్త్రముచే శిరము నందు కాకపదాకారముగ లోతుగ ఛేదించి దానియందు రక్తముతో గూడియుండు మాంసమును గాని చర్మమును గాని యుంచవలయును.

## మండలివిషవేగచికిత్స.

తృతీయే వమితః పేయాం వేగే మండలినాం పిబేత్,

అతీక్ష్ణమగదం షష్ఠే గణం వా పద్మకాదికమ్. ౯౮

మండలియను సర్పము కఱచినవానికి మూఁడవవిషవేగమునందు వమనముచేయించి పేయను పానము చేయించవలయును. ఆఱవ విషవేగమునందు తీక్ష్ణముకానుండు విషహారౌషధమును గాని పద్మకాదిగణద్రవ్యములను గాని యిప్పించవలయును.

## రాజీమద్విషవేగచికిత్స.

ఆద్యేఽసగాఢం ప్రచ్ఛాయ వేగే దష్టస్య రాజిలైః,
అలాబునా హరేద్రక్తం పూర్వవచ్చాగదం పిబేత్. ౯౯
షష్ఠేఽంజనం తీక్ష్ణతమమవపీడం చ యోజయేత్,

రాజిలమను సర్పము కఱచినవానికి మొదటివిషవేగమున కాటునందు గాఢముగ ఛేదించి సొరకాయబుఱ్ఱచే రక్తమును పీల్చి వెలిపఱచి ముందు చెప్పియుండునటుల నౌషధమునిప్పించవలయును. ఆఱవ విషవేగమునందు తీక్ష్ణమైన అంజనమును అవపీడమును ప్రయోగించవలయును.

## అనుక్తవిషవేగచికిత్స.

అనుక్తేషు చ వేగేషు క్రియాం దర్వీకరోదితామ్. ౧౦౦

మండలి రాజిలము అనుసర్పముల విషవేగములలో దీనికి ప్రత్యేకముగ చికిత్స చెప్పఁబడలేదో వానికి దర్వీకరమను సర్పవిషమునకుఁ జెప్పియుండు చికిత్సలం జేయవలయును.

## గర్భిణ్యాదులకు సిరావేధనిషేధము.

గర్భిణీబాలవృద్ధేషు మృదుం విధ్యేత్సిరాం న చ,

గర్భిణీస్త్రీ, బాలురు, వృద్ధులు వీరలకు పాముకాటుతగిలినచో మృదుచికిత్సలను చేయవలయును. సిరను వేధింపంజనదు.

## సర్వవిషహరత్వగాదిపానము.

త్వఙ్మనోహ్వానిశే వక్త్రం రసశ్శ్యోగ్రాలజో నఖః. ౧౦౨
తమాలః కేసరం శీతం పీతం తండులవారిణా,
హంతి సర్వవిషాణ్యేతద్వజ్రివజ్ర ఇవాసురాన్. ౧౦౩

లవంగపట్ట, మణిశిల, పసుపు, మ్రానిపసుపు, గ్రంథితగరము, రసము, పులి

గోరు, తమాలపత్రము, పద్మకేసరములు యీ ద్రవ్యములను నూరి బియ్యపు కడుగులో జేర్చి చల్లగ పానము చేయించిన అది ఇంద్రుని వజ్రాయుధము, అసురుల నశింపఁజేయు భంగి సమస్తవిషములను నశింపఁజేయును.

భుజంగాదివిషహారపానసస్యాదులు.

బిల్వస్య మూలం సురసస్య పుష్పం
ఫలం కరంజస్య నతం సురాహ్వయమ్,
ఫలత్రికం వ్యోషనిశాద్వయం చ
బస్తస్యమూత్రేణ సుసూక్ష్మపిష్టమ్. ౮౪
భుజంగలూతోందురవృశ్చికాద్యై
ర్విషూచికాజీర్ణగరజ్వరైశ్చ,
ఆర్తాన్నరాన్ భూతవిధర్షితాంశ్చ
స్వస్థీకరోత్యంజనపానసస్యైః. ౮౫

మారేడువేళ్లు, తులసిపువ్వు, క్రానుగవిత్తులు, గ్రంథితగరము, దేవదారు, త్రిఫలములు, త్రికటుకములు, పసుపు, మ్రానిపసుపు అను వానిని సమభాగములుగ గ్రహించి గొఱ్ఱెమూత్రముతో చక్కఁగ నూరి వానిని అంజన పానసస్యములయం దుపయోగించిన సర్పము, సాలెపురుగు, ఎలుక, తేలు మొదలగు విషజంతువుల విషము, విషూచిక, అజీర్ణము, గరమను విషము, జ్వరము, భూతగ్రహబాధలు ఇవియన్నియు హరించును.

నిశ్శేషవిషాహరణావశ్యకత్వము.

ప్రలేపాద్యైశ్చ నిశ్శేషం దంశాదపుద్ధరేద్విషమ్,
భూయో వేగాయ జాయేత శేషం దూషీవిషాయ వా. ౮౬

విషహరౌషధములచే పట్టువేయుట పానము అంజనము నస్యము మొదలగువానిని చేయించి విషమును నిశ్శేషముగ బైటికి తీసివేయవలయును. విషము శరీరమున కొంచెము శేషించియుండిన నది మరల వేగమును కలుగఁజేయును. లేక దూషీవిషముగ పరిణమించును. కావున కాటునందును ఇంచుకేనియు విషమును నిలుపక నిశ్శేషముగ హరింపఁజేయవలెను.

విముక్తవిషోపచారము.

విషాపాయేఽనిలం క్రుద్ధం స్నేహాదిభిరుపాచరేత్,

తైలమద్యకులుత్థామ్లవర్గ్యైః పవననాశనైః. ౮౭

పిత్తం పిత్తజ్వరహరైః కషాయస్నేహవస్తిభిః,
సమాక్షికేణ వర్గేణ కఫమారగ్వధాదినా. ౮౮

విషము శమించినపిదప ప్రకోపించియుండువాతమును నువ్వులనూనె,మద్యము, ఉలవలు, చింతపండు ఇవితప్ప తక్కిన వాతహస్నేహౌషధములచే చికిత్స చేయవలెను. పిత్తము ప్రకోపించియుండిన దానిని పిత్తజ్వరమును పోఁగొట్టునట్టి కషాయములచేతను స్నేహవస్తి కర్మలచేతను, కఫము ప్రకోపించియుండిన తేనెతోఁగూడిన ఆరగ్వధాది గణద్రవ్యములచేతను శమింపఁజేయవలయును.

### సర్వాంగాభిహతచికిత్స.

సితా వైగంధికో ద్రాక్షా పయస్యా మధుకం మధు,
పానే సమంత్రపూతాంబు ప్రోక్షణం సాంత్వహర్షణమ్. ౮౯
సర్వాంగాభిహతే యుంజ్యాత్తథా శంకావిషార్దితే,

సర్వాంగాభి ఘాతము (సర్వముయొక్క శరీరస్పర్శము)చే గాని శంకావిషము (పాముకఱచినదనే సందేహము)చే గాని పీడింపఁబడి యుండువారికి పంచదార, వైగంధికము, ద్రాక్ష, పిన్నమనుబాల, యష్టిమధుకము, తేనె వీనిని నూరి మంత్రముచే నభిమంత్రింపఁబడిన యుదకములో కలిపి పానము చేయించి పిదప నాయుదకమును శరీరముపై ప్రోక్షించి మంచిమాటలను జెప్పి సంతోషమును కలుగఁజేసిన హితముకలుగును.

### విషహారరత్నాదిధారణము.

కర్కేతనం మరకతం వజ్రం వారణమౌక్తికమ్. ౯౦
వైడూర్యం గర్దభమణిం పిచుకం విషమూషికమ్,
హిమవద్గిరిసంభూతం సోమరాజీం పునర్నవామ్. ౯౧
తథా ద్రోణాం మహాద్రోణాం మానసీం సర్పజం మణిమ్,
విషాణి విషశాంత్యర్థం వీర్యవంతి చ ధారయేత్. ౯౨

కర్కేతనమనురత్నము, మరకతము, వజ్రము,ఏనుఁగుకుంభస్థలమునుండితీయఁబడిన ముత్తియములు, వైడూర్యము, గర్దభమణి, పిచుకము (అనఁగా గారచెట్టు) విషమూషికము (అనఁగా విషముష్టిచెట్టు), హిమవత్పర్వతములోజనించిన బావంచివిత్తులు గలిజేరు మానససరస్సులోజనించిన ద్రోణా (అనగా ఏనుఁగుతుమ్మి), మహాద్రోణా (అనఁగా పెద్దతుమ్మి

చెట్టు) అను ఓషధులు, సర్పముయొక్క పడిగలోజనించినరత్నములు వీర్యముగలవిషములు వీనిని విషశాంత్యర్థము మనుజుఁడు ధరింపవలయును.

ఛత్రీజర్జరపాణిశ్చ చరేద్రాత్రౌ విశేషతః,
తచ్ఛాయాశబ్దవిత్రస్తాః ప్రణశ్యంతి భుజంగమాః. ౯3

మఱియు మనుజుఁడు గొడుగునుపట్టుకొని జర్జరమను వాద్యమును చేతిలోధరించి ఘోషింపుచు రాత్రులయందు సంచరించిన గొడుగునీడ వాద్యశబ్దము వీనివలన భయమునొంది సర్పములు దూరముగ తొలఁగును. దానంజేసి మనుజునకు సర్పబాధ తొలఁగును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదియాఱవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# సప్తత్రింశాధ్యాయము.

అవ సర్వవిష ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము విషసామ్యముచే కీటలూతాది విషప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## కీటలూతాదివిషప్రతిషేధాధ్యాయప్రారంభము.

సూ॥ అథాతః కీటలూతాదివిషప్రతిషేధం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహ రాత్రేయాదయో మహర్షయః.

సర్వవిష ప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము పురుగులు సాలెపురుగులు మొదలగువాని విషములకు చికిత్సలను దెలియఁబఱచునట్టి కీటలూతాదివిషప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### చతుర్విధకీటములు.

సర్పాణామేవ విణ్మూత్రశుక్రాండశవకోథజాః,
దోషై ర్వాయ్వగ్నివర్షాంబు స్సమస్తై శ్చ యుక్తాః కీటా శ్చతుర్విధాః ౧

పూర్వాధ్యాయములో వచించిన దర్వీకరాది సర్పములయొక్క మలమూత్రశుక్ర అండములు, చచ్చి కుళ్ళినసర్పములశరీరము వీనినుండి కీటములు జనించును. ఆయ్యవి వాతము, పిత్తము, శ్లేష్మము, సన్నిపాతము అను దోషముల గుణాదులు కల్గియుండును. అందు వాతముగ కల్గినవి వాయవ్యములనియు, పిత్తగుణము గల్గినవి ఆగ్నేయము లనియు, కఫగుణములు కల్గినవి శ్లైష్మికము లనియు, త్రిదోషముల గుణములు కల్గినవి సాన్నిపాతికములనియు నాల్గుతెఱంగు లగును.

### వాయవ్యకీటదంశలక్షణము.

దష్టస్య కీటై ర్వాయవ్యై ర్దంశస్తోదరుజోల్బణః,

పైచెప్పిన కీటములలో వాయవ్యములను కీటములు కఱచినస్థలములో పోట్లు నొప్పి అధికముగ నుండును.

### ఆగ్నేయకీటదంశలక్షణము.

ఆగ్నేయైరల్పసంస్రావో దాహరాగవిసర్పవాన్. ౨
పక్వపీలుఫలప్రఖ్యః ఖర్జూరసదృశో ఽథ వా,

ఆగ్నేయ కీటములు కఱచినచో కాటునందు స్వల్పముగ రక్తము స్రవించును. మంటయు ఎఱుపువర్ణమును కల్గియుండును. విషము శరీరమునం దెల్ల వ్యాపించును. కఱచినచోట గోగుకాయను ఖర్జూరపుకాయను బోలిన దద్దుకల్గియుండును.

### శ్లైష్మికకీటదంశలక్షణము.

కఫాధికైర్మండరుజః పక్వోదుంబరసన్నిభః. 3

శ్లైష్మికమను కీటముకఱచిన నాకాటునందు స్వల్పముగ నొప్పి మేడిపండువంటి యాకార ముండును.

### సాన్నిపాతికకీటదంశలక్షణము.

స్రావాఢ్య స్సర్వలింగస్తు వివర్జ్యస్సాన్నిపాతికైః,

సాన్నిపాతిక మను పురుగులు కఱచినవానికి కఱచినచోటునందు విశేషస్రావము పైవాయవ్యాదికీటముల కాటులకుఁ జెప్పియుండు లక్షణములు కలిగియుండును. ఇది యసాధ్యం బగుటవలన చికిత్సయందు వర్జింపఁదగినది.

### కీటవిషవేగలక్షణము.

వేగాశ్చ సర్పవచ్చోభో వర్ధిష్ణుర్విస్రరక్తతా. ౪

శిరోఽక్షిగౌరవం మూర్ఛాభ్రమశ్వాసోఽతివేదనా,

సర్వేషాం కర్ణికాశ్శోఫో జ్వరః కండూరరోచకః. ౫

పైచెప్పిన కీటములయొక్క కాటులయందు సర్పమునకుఁ జెప్పియుండు విషవేగమువంటి వేగములు కలిగియుండును. ఆకాటులందు వాపు ప్రతిదినము వృద్ధిఁ జెందుచుండును. రక్తము దుర్గంధము కలదిగనుండును. శిరమునందును నేత్రములయందును గురుత్వము కలుగును. మఱియు నారోగికి మూర్ఛ భ్రమ శ్వాసము పలువిధములైన యుపద్రవములు కలుగును. మఱియు పైచెప్పిన అన్నికీటములయొక్క కాటులందు కఱచిన స్థలములో గుండ్రముగనుండు వాపు కలుగును. మఱియు జ్వరము దురద అరోచకము కలుగును.

### వృశ్చికవిషలక్షణము.

వృశ్చికస్య విషం తీక్ష్ణమాదౌ దహతి వహ్నివత్,

ఊర్ధ్వమారోహతి క్షిప్రం దంశే పశ్చాత్తు తిష్ఠతి. ౬

దంశస్సద్యోఽతిరుక్ఛ్యావస్తుద్యతే స్ఫుటతీవ చ,

తేలుకు విషము తీక్ష్ణముగనుండును. అది మొదట అగ్నివలె శరీరమున కుట్టిన చోటునందు దహించును. పిదప నతిశీఘ్రముగ పైకెక్కి మరల కఱచినచోటులో నిలిచి యుండును. మఱియు తేలుకుట్టినచోట అధికముగ నొప్పి నల్లనివర్ణము సూదిచే పొడుచునట్లును పగిలిపోవునట్లును వేదనయు కలుగును.

### వృశ్చికోత్పత్తిక్రమము.

తే గవాదిశకృత్కోథా ద్దిగ్ధదష్టాదికోథతః. ౭
సర్పకోథాచ్చ సంభూతా మందమధ్యమహావిషాః.

ఆవు మొదలగు జంతువులయొక్క కుళ్ళిపోయిన పేడలోనుండియు, సర్పము మొదలగు విషజంతువుల కాటుతగిలి మరణమును జెంది కుళ్ళిపోయిన శరీరములలోనుండియు, సర్పము మృతిజెంది కుళ్ళిపోయినదాని శరీరమునుండియు పై తేళ్లుపుట్టును. మఱియు నవి యథాక్రమముగ మందవిషము మధ్యవిషము మహావిషము గలవిగ నుండును. (కుళ్ళిన పేడలో బుట్టినవి స్వల్పవిషము లనియు, విషజంతువులచే జచ్చినవాని శరీరమున బుట్టినవి మధ్యవిషము లనియు, కుళ్ళిన పాము శరీరమున బుట్టినవి తీవ్రవిషము లనియు భావము.)

### మందవిషవృశ్చికలక్షణము.

మందాః పీతాః సితాః శ్యావా రూక్షకర్బురమేచకాః. ౮
రోమశా బహుపర్వాణో లోహితాః పాండురోదరాః,

మందవిషముగల తేళ్లు పసుపువర్ణము కలవిగను తెలుపు శ్యావవర్ణముచిత్రవర్ణము కలవిగను నల్లనిరోమములతోఁ గూడినవిగను అనేకములగు గణుపులుగలవిగను యెఱ్ఱగను తెల్లనికడుపు కలవిగ నుండును.

### మధ్యవిషవృశ్చికలక్షణము.

ధూమ్రోదరాస్త్రిపర్వాణో మధ్యాస్తు కపిలారుణాః. ౯
పిశంగాశ్శబలాశ్చిత్రాశ్శోణితాభాః.

మధ్యవిషముగల తేళ్లు శరీరమునందు మూఁడు గణుపులు కపిలవర్ణము యెఱ్ఱని వర్ణము బంగారువర్ణము చిత్రవర్ణము రక్తమువలె నెఱ్ఱవర్ణము కడుపునందు పొగవంటి వర్ణము కలిగియుండును.

### మహావిషవృశ్చికలక్షణము.

మహావిషాః,
అగ్న్యాభా ద్వ్యేకపర్వాణో రక్తాసితసితోదరాః. ౧౦

మహావిషముగల తేళ్లు నిప్పువంటి యెఱ్ఱని కాంతిగలవిగను ఒకటిరెండు గణుపులు గలవిగనుండును. మఱియు వీనిలో కొన్ని యెఱ్ఱగనుండు కడుపుగలవిగను కొన్ని నల్లని కడుపుగలవిగను కొన్ని తెల్లని కడుపుగలవిగ నుండును.

### మహావిషదష్టలక్షణము.

తైర్దష్టశ్శ్యానరసనః స్తబ్ధగాత్రో జ్వరార్దితః,
ఖైర్వమన్ఛోణితం కృష్ణమింద్రియార్థానసంవిదన్. ౧౧
స్విద్యన్ మూర్ఛన్ విశుష్కాస్యో విహ్వలో వేదనాతురః,
విశీర్యమాణమాంసశ్చ ప్రాయశో విజహాత్యసూన్. ౧౨

పైచెప్పిన మహావిషమను తేళ్లు కుట్టినవానికి నాలుకయందుబ్బు, శరీరమున స్తబ్ధత్వము, జ్వరము, నల్లరక్తమును చక్షురాదీంద్రియద్వారములతోఁ గ్రక్కుట, శబ్దస్పర్శాది జ్ఞానములులేకుండుట, చెమట, మూర్ఛ, నోరెండుట, బడలిక పలువిధములైన యుపద్రవములు, మాంసము కుళ్ళిపడుట యీలాటి యుపద్రవములు కలుగుటయే గాక మరణము కూడ కలుగును.

### ఉచ్చటింగవృశ్చికదష్టలక్షణము.

ఉచ్చటింగస్తు వక్త్రేణ దశత్యభ్యధికవ్యథః,
సాధ్యతో వృశ్చికాత్ స్తంభం శేఫసో హృష్టరోమతామ్. ౧౩
కరోతి సేకమంగానాం దంశశ్శీతాంబునేవ చ,
ఉష్ట్రధూమస్స ఏవోక్తో రాత్రిచారాచ్చ రాత్రికః. ౧౪

ఉచ్చటింగమను పేరుగలతేలు నోటిచే కఱచును. అది కఱచినచో మనుజునికి సామాన్యమైన తేలుకన్న మిక్కిలి బాధకల్గును. మేఢ్రము స్తంభించుట, వెండ్రుకలు నిక్కబొడిచికొనుట, శరీరమంతనుండి చల్లనినీరు (చెమట) స్రవించుట, యిట్టియుపద్రవములు కలుగును. ఈతేళ్ళను ఉష్ట్రధూమమనియు రాత్రులయందు సంచరించుటవలన రాత్రికమనియుఁ జెప్పెదరు.

### కీటాదిస్వరూపము.

వాతపిత్తోత్తరాః కీటాశ్శ్లేష్మికాః కణభోందురాః,
ప్రాయో వాతోల్బణవిషా వృశ్చికాస్సోష్ట్రధూమకాః. ౧౫

కీటములు వాతపిత్తాధిక్యమైన విషము కలవిగను కణభము (కణుదురీగెలు) యెలు

కలు యివి శ్లేష్మాధిక్యముగల విషముకలవిగను తేళ్లు ఉష్ట్రిధూమకములు ఇవి వాతాధిక్యముగల విషముతోఁ గూడినవిగ నుండును.

యస్య యస్యైవ దోషస్య లింగాధిక్యం ప్రతర్కయేత్,
తస్య తస్యౌషధైః కుర్యాద్విపరీతగుణైః క్రియామ్. ౧౬

కీటాదులచే కఱవఁబడినవానికి వాతాదులలో నేదోషము యొక్క లక్షణము లధికముగ నుండునో వానిని చక్కఁగ తెలిసికొని యాదోషమునకు విరుద్ధ గుణముగల యౌషధములచే చికిత్సలను జేయవలయును.

## వాతికవిషలక్షణము.

హృత్పీడోర్ధ్వానిలస్తంభస్సిరాయామోఽస్థిపర్వరుక్,
ఘూర్ణనోద్వేష్టనంగాత్రశ్యావతా వాతికే విషే. ౧౭

వాతాధిక్యముగల విషమునందు ఱొమ్మునొప్పి, ఊర్ధ్వవాతస్తంభము, సిరలు అస్థులు గణుపులు వీనియందు శూల, ఘూర్ణనము (అనఁగా చక్రమువలె తిరుగుట) ఉద్వేష్టనము (అనఁగా పొర్లాడుట), శరీరమునందు నలుపువర్ణము, ఈలక్షణములు కలుగును.

## పైత్తికవిషలక్షణము.

సంజ్ఞానాశోష్ణనిశ్వాసౌ హృద్దాహః కటుకాస్యతా,
మాంసావదారణం శోఫో రక్తపీతశ్చ పైత్తికే, ౧౮

ప్రజ్ఞాభంగము, ఊపిరి వేడిగవెడలుట, ఱొమ్మునందు మంట, నోరు చేదుగ నుండుట, శరీరమున మాంసము చీల్చఁబడినట్లు నొప్పి, రక్తపీతవర్ణములుకల వాపు యీలక్షణములు పిత్తాధిక్యముగల విషమునకు కలిగియుండును.

## శ్లైష్మికవిషలక్షణము.

ఛర్ద్యరోచకహృల్లాసప్రసేకోత్క్లేశపీనసైః,
సశైత్యముఖమాధుర్యైర్విద్యాచ్ఛ్లేష్మాధికం విషమ్. ౧౯

శ్లేష్మాధిక్యముగల విషమునందు వాంతి అరోచకము హృల్లాసము ప్రసేకము (అనఁగా నోటియందు నీరూరుట) ఓకర పీనస శరీరమున శైత్యము, నోటియందు తీపు ఈలక్షణములు కలిగియుండును.

## వాతికవిషచికిత్స.

పిణ్యాకేన వ్రణాలేపస్తైలాభ్యంగశ్చ వాతికే,
నాడీస్వేదః పులాకాద్యైర్బృంహణశ్చ విధిర్హితః, ౨౦

వాతాధిక్యముగల విషమునందు తెలికపిండిచే వ్రణమునకు లేపనము, నువ్వుల నూనెచే నభ్యంజనము, నాడీస్వేదము, బృంహణచికిత్స వీనిని చేయించిన హితము కలుగును.

### పైత్తికవిషచికిత్స.

పైత్తికం స్తంభయేత్సేకైః ప్రదేహైశ్చాతిశీతలైః,

మిక్కిలి చల్లగనుండు సేకములచేతను పట్టులచేతను పిత్తాధిక్యముగల విషమును స్తంభింపఁజేయవలయును.

### శ్లైష్మికవిషచికిత్స.

లేఖనస్వేదనచ్ఛేదవమనైశ్శ్లైష్మికం జయేత్. ౨౧

లేఖనము, ఛేదనము, స్వేదకర్మ, వమనకర్మ వీనిచే శ్లేష్మాధిక్యముగల విషమును చికిత్సఁజేయునగును.

### త్రివిధకీటదష్టచికిత్స.

కీటానాం త్రిఃప్రకారాణాం త్రైవిధ్యేన ప్రతిక్రియా,
స్వేదాలేపనసేకాంస్తు కోష్ణాన్ప్రాయో ఒవచారయేత్. ౨౨
అన్యత్ర మూర్ఛితా ద్దంశపాకతః కోథతోఒపి వా,

పైచెప్పిన వాయవ్యాదిభేదములచే మూఁడువిధములగు కీటములయొక్క కాటుల యందు యథాక్రమముగ స్వేదకర్మ లేపనము సేకము వీనిని సుఖోష్ణముగ చేయించ వలయును. అయితే పైకీటముల కాటుతగిలినవాఁడు మూర్ఛఁజెందియుండినను పైకాటు తగిలినస్థలము వ్రణము కలిగియుండినను లేక కుళ్ళిపోయి యుండినను పై స్వేదాది చికిత్సలను చేయఁజనదు.

### విషదంశమునకు నృకేశాదిధూపము.

నృకేశాస్సర్షపాః పీతా గుడో జీర్ణశ్చ ధూపనమ్. ౨౩
విషదంశస్య సర్వస్య కాశ్యపః పరమబ్రవీత్,

మనుజుని వెండ్రుకలు, యెఱ్ఱఆవాలు, పాతబెల్లము వీనిని సమభాగములుగ గ్రహించి విషజంతువుల కాటులకన్నిఁటికిని ధూపమువేసిన హితము కలుగునని కాశ్యపుఁడు వచించియున్నాఁడు.

విషఘ్నం చ విధిం సర్వం కుర్యాత్సంశోధనాని చ. ౨౪

పైకీటాదుల యొక్క కాటులయందు విషహరచికిత్సలు వమన విరేచనములు చేయించవలయును.

కీటవృశ్చికదష్టచికిత్స.

సాధయేత్సర్పవద్దష్టాన్ విషోగ్రైః కీటవృశ్చికైః,

విషాధిక్యముగల కీటములుగాని తేళ్లుగాని కఱచినవానికి సర్పదష్టచికిత్సలను చేయవలయును.

కీటవిషమునకు తండులీయాదిపానము.

తండులీయకతుల్యాంశాం త్రివృతాం సర్పిషా పిబేత్. ౨౫

యాతి కీటవిషైః కంపం న కైలాస ఇవానిలైః,

చిర్రికూర, తెల్లతెగడ వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఆవునేతిలో కలిపి పానము చేయించినచో కైలాసపర్వతము యెటుల కదలకయుండునో అటుల కీటవిషములచే మనుజుఁడు భయమును జెందకుండును.

కీటవిషమునకు క్షీరివృక్షత్వగాలేపము.

క్షీరివృక్షత్వగాలేపశ్శుద్ధే కీటవిషాపహః. ౨౬

కీటములు కఱచినవానికి వమనవిరేచనముల జేయించి క్షీరవృక్షముల యొక్క పట్టలను నూరి లేపనము చేసిన విషము హరించును. (అత్తి, జువ్వి, మఱ్ఱి, ఇవి క్షీరివృక్షములు.)

కీటవిషమున శోఫాదిహరలేపము.

ముక్తాలేపో వరశ్శోఫతోదదాహజ్వరప్రణుత్,

ముత్తియములను చాది కీటములయొక్క కాటుకు లేపనము చేసిన వాపు,పోట్లు, జ్వరమును హరించును. ఇది మిగుల శ్రేష్ఠమైన లేపము.

కీటవిషమునకు దశాంగౌషధము.

వచా హింగువిడంగాని సైంధవం గజపిప్పలీ. ౨౭

పాఠా ప్రతివిషా వ్యోషం కాశ్యపేన వినిర్మితమ్,

దశాంగమగదం పీత్వా సర్వకీటవిషం జయేత్. ౨౮

వస, ఇంగువ, వాయువిడంగములు, సైంధవలవణము, ఏనుఁగుపిప్పళ్లు, చిఱుబొద్ది, అతివస, త్రికటుకములు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి పానము చేయించిన కీటవిషము లన్నియు హరించును. ఇది దశాంగౌషధ మనఁబడును. కాశ్యపునిచే నిర్మింపఁబడినది.

## వృశ్చికవిషమునకు సేకము.

సద్యో వృశ్చికజం దంశం చక్రతైలేన సేచయేత్,
విదారిగంధసిద్ధేన కవోష్ణేనేతరేణ వా. ౨౯
లవణోత్తమయుక్తేన సర్పిషా వా పునః పునః,
సించేత్కోష్ణారనాళేన సక్షీరలవణేన వా. ౩౦

తేలుకాటును తక్షణము చక్రతైలముచేఁగాని ముయ్యాకుపొన్నతో సిద్ధము చేయఁబడినతైలముచేఁగాని సేచనము చేయించిన హితము కలుగును. మఱియు ఆవు నేతిలో సైంధవలవణము చేర్చి దానితోఁగాని ఆవుపాలలో సైంధవలవణము చేర్చి దానితోఁగాని కొంచెముష్ణముగ నుండు కలితోఁగాని తేలుకాటుతగిలిన తావునకు పలుమాఱు సేచనము చేయుచుండిన హితము కలుగును.

## వృశ్చికదంశమునకు ఉపనాహము.

ఉపనాహో ఘృతే భృష్టః కల్కోఽజాజ్యాశ్చ సైంధవః,

జీలకఱ్ఱ, సైంధవలవణము వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కాగుచుండు నేతిలో వైచి దానిచే ఉపనాహస్వేదమును చేయించవలయును.

## వృశ్చికదంశమునకు ప్రతిసారణము.

ఆదంశం స్వేదితం చూర్ణైః ప్రచ్ఛాయ ప్రతిసారయేత్. ౩౧
రజనీసైంధవవ్యోషశిరీషఫలపుష్పజైః,

తేలుకఱచినచోటునకు చక్కఁగ స్వేదకర్మను చేయించి దానిపై పసుపు, సైంధవలవణము, త్రికటుకములు, దిరిసెనపువిత్తులు, పువ్వులు వీని చూర్ణముచే రుద్దవలయును.

## వృశ్చికవిషమున మాతులుంగాదిలేపము.

మాతులుంగామ్లగోమూత్రపిష్టం చ సురసాగ్రజమ్. ౩౨
లేపస్సుఖోష్ణశ్చ హితః పిణ్యాకో గోమయోఽపి వా,
పానే సర్పిర్మధుయుతం క్షీరం వా భూరిశర్కరమ్. ౩౩

మాదీఫలపురసము, గోమూత్రము వీనిలో తులసిపువ్వులనునూరి లేపనముచేసినను, తెలికపిండిని నూరిగాని గోమయమునుగాని సుఖోష్ణముగ లేపనము చేసినను హితము కలుగును. మఱియు ఆవు నేతిలో తేనెను కలిపిగాని ఆవుపాలలో అధికముగ పంచదారను చేర్చిగాని పానము చేయించిన హితము కలుగును.

వృశ్చికవిషమున పారావతశకృదాదిలేపము.

పారావతశకృత్పథ్యా తగరం విశ్వభేషజమ్,
బీజపూరరసోన్మిశ్రః పరమో వృశ్చికాగదః. 34
సక్షైవలోష్ట్రదంష్ట్రా చ హంతి వృశ్చికజం విషమ్,

పావురపిట్టపులము, కరక్కాయ, గ్రంథితగరము, శుంఠి వీనిని మాదీఫలరసముతో నూరి తేలుకుట్టిన స్థలములో లేపనము చేయవలయును. తేలువిషమున కిది శ్రేష్ఠౌషధము, మఱియు పాచి ఒంటెపల్లు వీనిని చాది లేపనముచేసిన తేలు విషము మానును.

"ససైంధవోష్ట్రదంష్ట్రా చ హంతి వృశ్చికజం విషమ్,
మనోహ్వాసైంధవం హింగుమాలతీపల్లవాని చ,
గోశకృద్రసపిష్టేయం గుళికావృశ్చికార్దితే,
లశునో మరిచం హింగుసురసం విశ్వభేషజమ్,
అర్కక్షీరేణగుళికా వృశ్చికార్తిశంకరీ."

సైంధవలవణము, ఒంటెపల్లు వీనిని చాది లేపనముచేసిన తేలువిషము హరించును. మణిశిల, సైంధవలవణము, ఇంగువ విరజాజిచిగుళ్లు వీనిని సమభాగములుగ ఆవు పేడ రసముతో నూరి గుళికలు చేయవలయును. వెల్లుల్లి, మిరియాలు, ఇంగువ, తులసి, శుంఠి వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలతో నూరి గుటికలు చేయవల యును. ఈ రెండువిధములగు గుటికలు చాది తేళ్ళుకుట్టినచోటునందు వేసిన తేలు విషము శమించి సుఖము కలుగును. అని సంగ్రహమునందు చెప్పఁబడియున్నది.

వృశ్చికదంశమునకు హింగ్వాదిలేపనాంజనము.

హింగునా హరితాళేన మాతులుంగరసేన చ. 35
లేపాంజనాభ్యాం గుటికా పరమం వృశ్చికాపహా,

ఇంగువ, హరిదళము వీనిని సమభాగములుగ మాదీఫలరసముతో నూరి గుటికచేసి దానిచే లేపనము అంజనము చేసిన తేలువిషము నిశ్శేషముగ హరించును.

వృశ్చికదంశమునకు కరంజాదిలేపనము.

కరంజార్జునశైలూనాం కటభ్యాః కుటజస్య చ. 36
శిరీషస్య చ పుష్పాణి మస్తునా దంశలేపనమ్,

క్రానుగు, మద్ది, విరిగి, నల్లగినియ, కొడిశ, దిరిసెనము వీనిపువ్వులను పెరుగుమీఁది మీఁగడతో నూరి తేలుకాటునకు లేపనము చేసిన హితము కలుగును.

### వృశ్చికదంశమునకు పథ్యాదిలేపనము.

యో ముహ్యతి ప్రశ్వసితి ప్రలపత్యుగ్రవేదనః. ౩౭
తస్య పథ్యా నిశా కృష్ణా మంజిష్ఠాతివిషోషణమ్,
సాలాబువృంతం వార్తాకరసపిష్టం ప్రలేపనమ్. ౩౮

ఏమనుజుఁడు తేలుకుట్టుటవలన మిక్కిలి యుపద్రవముకలవాఁడై మూర్ఛనుజెంది ట్టూర్పువిడుచుచును, అసంబద్ధముగ మాటలాడుచునుండునో అట్టివానికి కరక్కాయ, పసుపు, పిప్పళ్లు, మంజిష్ఠ, అతివస, మిరియాలు, సొరకాయతొడిమ వీనిని సమ భాగములుగ గ్రహించి వంకాయరసముతో నూరి తేలుకుట్టిన స్థలమునందు లేపనము వేయవలయును.

### వృశ్చికదంశమున సిరావేధాదులు.

సర్వత్ర చోగ్రాలివిషే పాయయే ద్దధిసర్పిషీ,
విధ్యేత్సిరాం విదధ్యాచ్చ వమనాంజననావనమ్. ౩౯
ఉష్ణస్నిగ్ధామ్లమధురం భోజనం చానిలాపహమ్,

దారుణమైన అన్ని తేలువిషములయందును ఆవుపెరుగు ఆవునెయ్యి ఆవుపాలు వీనిని సమభాగములుగ కలిపి పానము చేయించవలయును. రక్తమోక్షణము వమనకర్మ అంజనము నస్యము వీనిని చేయించవలయును. వాతమును హరించునదిగ నుష్ణముగ స్నేహయుక్తముగ కొంచెమమ్లముగ మధురముగనుండు భోజనము నిప్పించవలయును.

### వృశ్చికవిషమునకు నాగరాదిలేపము.

నాగరం గృహకపోతపురీషం
బీజపూరకరసో హరితాలమ్,
సైంధవం చ వినిహంత్యగదోఽయం
లేపతోఽళికులజం విషమాశు. ౪౦

శుంఠి, ఊరపావురపిట్టమలము, హరిదళము, సైంధవలవణము వీనిని మాదీఫలరసముతో నూరి లేపనము జేసిన తేలువిష మతిశీఘ్రముగ హరించును.

### వృశ్చికవిషహరగుటికలు.

అంతే వృశ్చికదష్టానాం సముదీర్ణేభృశంవిషే,
విషేణాలేపయే ద్దంశముచ్చిటింగేఽప్యయం విధిః. ౪౧

తేలుకుట్టినవానికి విషము మిక్కుటముగ వృద్ధిజెందుచుండిన నాకాటుకుపైన విషమును లేపనము జేయవలయును. ఉచ్చటింగమును తేలుకాటునందును ఈచికిత్సనే చేయవలయును.

కీటాదులకు విషహరౌషధము.

నాగపురీషచ్ఛత్రం రోహిషమూలం చ శేలుతోయేన,
కుర్యాద్గుటికాం లేపాదియమళివిషనాశినీ శ్రేష్ఠా. ౪౨

నాగపురీషచ్ఛత్రము, కాచిగడ్డిచేళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి విరిగిరసముతో నూరి గుటికలు చేసి దానిని లేపనముచేసిన తేలువిషము హరించును.

వృశ్చికవిషసంక్రాంతిహరౌషధము.

అర్కస్య దుగ్ధేన శిరీషబీజం
త్రిర్భావితం పిప్పలి చూర్ణమిశ్రమ్,
ఏషోఽగదో హంతి విషాణి కీట
భుజంగలూతోందురవృశ్చికానామ్. ౪౩

దిరిసెనవిత్తులను జిల్లేడుపాలలో మూఁడుపర్యాయములు భావనచేసి దానికి సమముగ పిప్పలిచూర్ణమును కలపవలయును. ఈయౌషధము కీటములు సర్పములు సాలెపురుగు ఎలుకలు తేళ్లు వీనివిషములను పోఁగొట్టును.

శిరీషపుష్పం సకరంజబీజం కాశ్మీరజం కుష్ఠమనశ్శిలా చ,
ఏషోగదో రాత్రికవృశ్చికానాం సంక్రాంతికారీ కథితో జినేన. ౪౪

దిరిసెనపువ్వు, క్రానుగవిత్తులు, కుంకుమపువ్వు, చెంగల్వకోష్టు, మణిశిల వీనిని సమభాగములుగ గ్రహించి చక్కఁగనూరవలయును. ఈయౌషధము రాత్రికమను తేలువిషమును నిశ్శేషముగ పోఁగొట్టును. సర్వజ్ఞుఁడైన బుద్ధునిచే చెప్పఁబడినది.

లూతాదంశభేదతల్లక్షణములు.

కీటేభ్యో దారుణతరాలూతా షోడశధాజగుః,
అష్టావింశతిరిత్యేకే తతోఽప్యన్యే తు భూయసీః. ౪౫
సహస్రరశ్మ్యనుచరా వదంత్యన్యే సహస్రశః,
బహూపద్రవరూపాతు లూతైకైవ విషాత్మికా. ౪౬
యాపాణినామతస్తస్యా దుర్జ్ఞేయాణ్యతిసంకరాత్,
నాస్తి స్థానవ్యవస్థా చ దోషతోఽతః ప్రచక్షతే. ౪౭

సాలెపురుగులు కీటంబులన్నిటికన్న దారుణములైనవి. అవి పదునారు విధములుగ నుండునని ఋషులు చెప్పుచున్నారు. కొందఱు ఇరువదిఎనిమిది విధములనియు మఱి కొందఱు వేయివిధములనియు, కొందఱు అనేకవిధములనియు వచింపుచున్నారు. అయినను అవి అనేకోపద్రవములను గలుగఁజేయు స్వభావముగలవిగ మిక్కిలి విషముతోఁ గూడినవిగ నుండుటంజేసి అవి ఒకటేవిధముగ నుండును. మఱియు సాలెపురుగులు మిక్కిలి సంకరములుగ నుండుటంజేసి వాని రూపనామములను వేర్వేరుగ చెప్పుటకును తెలుంగుటకును సాధ్యముకానేరదు. వానికి స్థాననిశ్చయము లేదు. కాఁబట్టి వానిదోషములనుబట్టి చికిత్సలను జెప్పఁబడును.

## సాధ్యాసాధ్యలూతావిషము.

కృచ్ఛ్రసాధ్యా పృథగ్దోషైరసాధ్యా నిచయేన సా,

సాలెపురుగు కాటు పైత్తికము శ్లైష్మికము వాతికము సాన్నిపాతికము అని నాల్గు విధములుగనుండును. వానిలో మూఁడు కృచ్ఛ్రసాధ్యములుగ సాన్నిపాతికమను నది అసాధ్యముగ నుండును.

## పైత్తికలూతాదంశలక్షణము.

తద్దంశః పైత్తికో దాహతృట్స్ఫోటజ్వర మోహవాన్. ౨౭

భృశోష్మారక్తపీతాభః క్లేదీ ద్రాక్షాఫలోపమః,

పిత్తాధిక్యముతో నుండు సాలెపురుగుకాటు కలవారికి సర్వాంగతాపము దప్పి పిటకలు జ్వరము మూర్ఛ మిక్కిలి యుష్ణము కలుగును. మఱియు నాకాటు నందు స్రావము కొంచెము ఱెుంపు పసుపువర్ణములు ద్రాక్షపండువంటి యాకారము నుండును.

## శ్లైష్మికలూతాదంశలక్షణము.

శ్లైష్మికః కఠినః పాండుః పరూషకఫలాకృతిః, ౨౮

నిద్రాం శీతజ్వరం కాసం కండూం చ కురుతే భృశమ్.

శ్లేష్మాధిక్యముగల సాలెపురుగుకాటునందు కఠినస్పర్శము తెలుపువర్ణము, పేరీఁతపండువంటి యాకారముగ కల్గియుండును. మఱియు నిది నిద్ర శీతజ్వరము కాసము దురద వీనిని మిక్కుటముగ కలుగఁజేయును.

## వాతికలూతాదంశలక్షణము

వాతికః పరుషశ్శ్యావః పర్వభేదజ్వరప్రదః. ౨౯

వాతాధిక్యముగల సాలెపురుగుకాటు కఠినముగను శ్యావవర్ణము గలదిగను సంధులయందు పగుళ్లు జ్వరము వీనిని కలుగఁజేయునదిగ నుండును.

తద్విభాగం యథా స్వం చ దోషలింగైర్విభావయేత్,

పైసాలెపురుగుల భేదములను వానికాటులకుఁ జెప్పియుండు వాతాదిదోష లక్షణములచే తెలిసికొనవలయును.

### అసాధ్యలూతాలక్షణము.

అసాధ్యాయాం తు హృన్మోహశ్వాసహిధ్మాశిరోరుజాః। ౫౧
శ్వేతాః పీతాస్సితా రక్తాః పిటికాః శ్వయథూద్భవాః,
వేపథుర్వమథుర్దాహ స్తృడాంధ్యం వక్రనాసతా. ౫౨
శ్యావోష్ఠవక్రదంతత్వం పృష్ఠగ్రీవావభంజనమ్,
పక్వజంబూసవర్ణం చ దంశాత్స్రవతి శోణితమ్. ౫౩

అసాధ్యమగు సాలెపురుగుకాటునందు చిత్తభ్రమ, శ్వాసము, ఎక్కిళ్లు, తలనొప్పి, తెల్లగ పసుపువర్ణముగ నల్లగ యెఱ్ఱగనుండు పిటకలు, వాపు, వణుకు, వాంతి, మంట, దప్పి, గుడ్డితనము, నోరు పండ్లు వీనియందు వంకర, పెదవులయందు శ్యావవర్ణము, వీపు మెడ యీడ్చికొనుట, యీయుపద్రవములు కలుగును. మఱియు సాలెపురుగు కఱచినస్థలమునందు పండిన నేరేడుపండువంటి వర్ణముగల రక్తము స్రవించును.

### పైత్తికాదివ్యపదేశకారణము.

సర్వాపి సర్వజా ప్రాయో వ్యపదేశస్తు భూయసా,

సాలెపురుగులన్నియు తఱచుగా త్రిదోషజములుగ నుండును. అయినను వాతాదులలో నేదోషలక్షణ మధికముగ నుండునో యాదోషమును బట్టి వాతికము పైత్తికము శ్లైష్మికము అనియు నెఱుఁగవలయును.

### తీక్ష్ణాదిలూతాలక్షణము.

తీక్ష్ణమధ్యావరత్వేన సా త్రిధా హంత్యుపేక్షితా. ౫౪
సప్తాహేన దశాహేన పక్షేన చ పరం క్రమాత్,

తీక్ష్ణము మధ్యమము అధమము అని సాలెపురుగులు మూఁడు విధములుగ నుండును. వానికాటులకు చికిత్స చేయక యుపేక్షించినచో తీక్ష్ణములగువాని విషము ఏడు దినములలోపలను, మధ్యమ వేగముగలవి పదిదినములలోపలను, అధమవేగము గలవి పదునైదుదినములలోపలను క్రమముగ మనుజుని చంపును.

### లూతాదంశలక్షణము.

లూతాదంశశ్చ సర్వోఽపి దద్రుమండలసన్నిభః. ౫౩
సితోఽసితోఽరుణః పీతశ్శ్యావో వా మృదురున్నతః,
మధ్యే కృష్ణోఽథ వా శ్యావః పర్యంతే జాలకావృతః. ౫౬
విసర్పవాన్ శోఫయుత స్తప్యతే బహువేదనః,
జ్వరాశుపాకవిక్లేదకోథావదరణాన్వితః. ౫౭
క్లేదేన యత్స ఎ్రశత్యంగం తత్రాపి కురుతే వ్రణమ్,

సాలెపురుగుకాటులన్నియు దద్రుపుష్టువుతో తుల్యముగను గుండ్రముగ నుండును. మఱియు నాకాటులు తెల్లగగాని యెఱ్ఱగగాని తెలుపు నలుపు కలిసిగాని పసుపువర్ణముగగానియుండును. మృదువుగ పొడవుగ మధ్యప్రదేశములో నల్లగ, లేక శ్యావవర్ణముగ అంచులయందు జాలకముతోఁగూడినదిగ విసర్పము వాపు మిక్కిలి శూల వీనితోఁ గూడినదిగనుండును. మఱియు దానియందు జ్వరము ఆశుపాకము (శీఘ్రముగ పుండగుట) స్రావము కుళ్లిపోవుట పగుళ్లు ఇవియును కలుగును. కాటులోనుండు చెడ్డనీరు శరీరములో నెచటతగిలిన నచట వ్రణము కలుగును.

### లూతాదివిషస్థానములు.

శ్వాసదంష్ట్రాశకృన్మూత్రశుక్రలాలానఖార్తవైః. ౫౮
అష్టాభి రుద్వమత్యేషా విషం వక్త్రా ద్విశేషతః,

ఊపిరి, కోరలు, మలము, మూత్రము, శుక్రము, జొల్లు, గోళ్లు, ఆర్తము అను నీయెనిమిదిటిచే సాలెపురుగులు విషమును గ్రక్కును. అందు నోటిచే విశేషముగ విషమును గ్రక్కును.

### లూతాకీటదంశస్థానములు.

లూతా నాభేర్దశత్యూర్ధ్వమూర్ధ్వం వాధశ్చ కీటకాః. ౫౯
తద్దూషితం చ వస్త్రాదిదేహే స్పృక్తం వికారకృత్,

సాలెపురుగు మనుజునియొక్క నాభికి పైభాగమునకఱచును. కీటములు మాత్రము నాభికిపైనను క్రిందను కఱచును. సాలెపురుగు విషముతగిలినవస్త్రము మొదలగునవి శరీరమున తగిలినను రోగములు జనించును.

### లూతావిషప్రథమవేగలక్షణము.

దినార్ధం లక్ష్యతే నైవం దంశో లూతావిషోద్భవః. ౬౦
సూచీవ్యధవదాభాతి తతోఽసౌ ప్రథమేఽహని,

అవ్యక్తవర్ణః ప్రచలః కించిత్కండూరుజాన్వితః. ౬౧

సాలెపురుగు కాటు అరదినమువఱకు తెలియకుండును. పిదప మొదటిదినమునందు సూదిచే పొడుచునట్లు బాధకలిగి రూపము తెలియక కొంచెము దురద నొప్పి వీనితోఁ గూడియుండును.

లూతావిషద్వితీయాదివేగలక్షణములు.

ద్వితీయేఽభ్యున్నతోఽన్తేషు పిటకైరివ చాచితః,
వ్యక్తవర్ణో నతో మధ్యే కండూమాన్ గ్రంథిసన్నిభః. ౬౨
తృతీయే సజ్వరో రోమహర్షకృద్రక్తమండలః,
శరావరూపస్తోదాఢ్యో రోమకూపేషు సస్రవః. ౬౩
మహాంశ్చతుర్థే శ్వయథు స్తాపశ్వాసభ్రమప్రదః,
వికారాన్ కురుతే తాంస్తాన్ పంచమే విషకోపజాన్. ౬౪
షష్ఠే వ్యాప్నోతి మర్మాణి సప్తమే హంతి జీవితమ్,

సాలెపురుగు కఱచిన రెండవదినమునందు కాటుయొక్క అంచులయందుబ్బు పిటకలు యివి చక్కఁగఁ గనఁబడుచు నడుము కొంచెముపల్లము గ్రంథివంటి యాకారము దురదకలుగును. మూఁడవదినమునందు జ్వరము గగుర్పాటు పోట్లు రోమకూపములయందుస్రావము సానికెవంటి యాకారముకలిగి యెఱ్ఱగ గుండ్రముగనుండును. నాల్గవ దినమునందు ఆకాటు పెద్దదిగను వాపు తాపము శ్వాసము భ్రమ వీనితోఁగూడినదిగనుండును. అయిదవదినమునందు విషప్రకోపమునఁ జనించునట్టి యనేకోపద్రవములను గలుగఁజేయును. ఆఱవదినమునందు ఆవిషము మర్మములంతట వ్యాపించును. ఏడవదినమునందు మరణమును కలుగఁజేయును.

ఇతి తీక్ష్ణంవిషం మధ్యం హీనం చ విభజేదతః. ౬౫

పైచెప్పినప్రకారము సాలెపురుగుయొక్క తీక్ష్ణవిషము ఉపద్రవములను కలుగఁజేయును. దీనిని బట్టి మధ్యమాధమవిషములను పర్యాలోచించి వాని యుపద్రవాది ప్రమాణములను తెలిసికొనవలయును.

లూతావిషకాలప్రమాణము

ఏకవింశతిరాత్రేణ విషం శామ్యతి సర్వథా,

సాలెపురుగువిషము ఇరువదియొకదినములలో శమనమునొందును.

లూతాదష్టచికిత్స.

అథాశు లూతాదష్టస్య శస్త్రేణాదంశముద్ధరేత్. ౬౬

దహేచ్చ జాంబవౌష్ఠాద్యైర్నతు పిత్తోత్తరం దహేత్,

సాలెపురుగు కఱచినవానికి గలకాటును నలుప్రక్కల శస్త్రముచే ఛేదించి జాంబవౌష్ఠాది శస్త్రములచే దహింపవలయును. ఆకాటు పిత్తాధిక్యముగలదిగనుండిన దానిని దహింపంజనదు.

లూతాదంశమున దాహకర్మనిషేధము.

కర్కశం భిన్నరోమాణం మర్మసంధ్యాదిసంశ్రితమ్. ౬౭
ప్రసృతం సర్వతో దంశం న చ్ఛిందీత దహేన్న చ,

కఠినముగ వెండ్రుకలు రాలిపోయినదిగ మర్మముసంధు మొదలగు స్థలములనాశ్రయించియుండునదిగ నలుప్రక్కల వ్యాపించినదిగనుండు సాలెపురుగుకాటును ఛేదించుటయు దహించుటయు దగదు.

లూతాదంశమునకు సేచనము.

లేపయే ద్దగ్ధమగదైర్మధుసైంధవసంయుతైః. ౬౮
సుశీతైస్సేచయేచ్చాను కషాయైః క్షీరివృక్షజైః,

పైచెప్పిన ప్రకారము శస్త్రముచే ఛేదించి దహింపఁబడిన యాకాటునకు తేనె, సైంధవలవణము వీనిని విషహరౌషధములలో కలిపి లేపనముచేసి చల్లగనుండు క్షీరివృక్షకషాయములచే సేచనము చేయవలయును.

లూతాదంశమునకు రక్తమోక్షణాదులు.

సర్వతోఽపహరేద్రక్తం శృంగాద్యైస్సిరయాఽపి వా. ౬౯
సేకాలేపా స్తతశ్శీతా బోధిశ్లేష్మాంతకాక్షకైః,

సాలెపురుగుకాటునందు చిమ్మనగొట్టము మొదలగుయంత్రములచేగాని సిరను వేధించుటచేగాని పలుమాఱు రక్తమును స్రవింపఁజేసి రావి, విరిగి, తాడి వీనిపట్టల కషాయముచే సేకమును లేపములను చల్లగ పలుమాఱు చేయించవలయును.

లూతాదంశమునకు పద్మకలేపము.

ఫలినీద్వినిశాక్షౌద్రసర్పిర్భిః పద్మకాహ్వయః. ౭౦
అశేషలూతాకీటానామగదస్సార్వకార్మికః,

ప్రేంకణము, పసుపు, మ్రానిపసుపు, తేనె, ఆవునెయ్యి వీనినొకటిగఁజేర్చి నూరవలయును. ఇది పద్మకౌషధమనఁబడును. దీనిని సాలెపురుగులు, కీటకములు మొదలగు అన్నివిషపురుగులకాటులయందును లేపసేకాదిక్రియలయందు నుపయోగించిన హితము కలుగును.

లూతాదంశమునకు చంపకౌషధము.

హరిద్రాద్వయపత్త్రంగమంజిష్ఠానతకేసరైః. ౨౧
సక్షౌద్రసర్పిః పూర్వస్మాదధిక శ్చంపకాహ్వయః,
తద్వద్గోమయనిష్పీడశర్కరాఘృతమాక్షికైః. ౨౨

పసుపు, మ్రానిపసుపు, పత్తంగము (అనఁగా రక్తచందనము), మంజిష్ఠ, గ్రంథితగరము, పద్మకేసరములు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి అందులో తేనె, ఆవునెయ్యి వీనిని సమభాగములుగ కలిపిన చంపకౌషధమనఁబడును. ఇది ముందుచెప్పిన పద్మకమను ఔషధమునకన్న మిక్కిలి శ్రేష్ఠమైనది. మఱియు ఆవుపేడరసము, పంచదార, ఆవునెయ్యి, తేనె వీనిని సమభాగములుగ గ్రహించి మిశ్రముచేసి లేపనముచేసిన సాలెపురుగులు మొదలగు కీటములవిషములు హరించును.

లూతాదంశమునకు మందరగంధమాదనౌషధములు.

అపామార్గమనోహ్వాలదార్వీధ్యామకగైరికైః,
నతైలాకుష్ఠమరిచయష్ట్యాహ్వాఘృతమాక్షికైః. ౨౩
అగదో మందరో నామ తథాఽన్యో గంధమాదనః,
నతరోధ్రవచాకట్వీపాఠైలా పత్త్రకుంకుమైః. ౨౪

ఉత్తరేణు, మణిశిల, హరిదళము, మ్రానిపసుపు, ధ్యామకమను గ్రంథ్యము, కావిఱాయి, గ్రంథితగరము, ఏలకులు, చెంగల్వకోష్టు, మిరియాలు, అతిమధురము, తేనె, ఆవునెయ్యి వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగచేర్చి నూరవలయును. ఇది మందరమనఁబడును. గ్రంథితగరము, లొద్దుగు, వస, కటుకరోహిణి, చిఱుబొద్ది ఏలకులు, జాపత్రి, కుంకుమపువ్వు వీనిని సమభాగములుగ గ్రహించి నూరవలయును. ఈ యౌషధమునకు గంధమాదనమనుపేరు. మందరము గంధమాదనము అనునీ ఔషధములు రెండును సాలెపురుగు మొదలగు వాని కాటులయందును హితమును కలుఁగఁజేయును.

లూతాదంశమునకు వమనము.

విషఘ్నం బహుదోషేషు ప్రయుంజీత విశోధనమ్,

సాలెపురుగుకాటుతగిలినవానికి దోషము అధికముగ కలిగియుండినదో విషమును పోఁగొట్టునట్టి విరేచనౌషధము నిప్పించవలయును.

లూతాదంశమునకు వమనవిరేచనౌషధము.

యష్ట్యాహ్వామదనాంకోల్లజాలినీసిందువారికాః. ౨౫

కఫే శ్రేష్ఠాంబునా పీత్వా విషమాశు సముద్వమేత్
శిరీషపత్రత్వ్యఙ్కోలఫలం వాంకోల్లమూలవత్. ౭౬
విరేచయేచ్చ త్రిఫలానీలినీత్రివృతాదిభిః,

సాలెపురుగు కాటుఁ తగిలినవానికి కఫమధికముగ కలిగియుండినచో అతిమధురసు, ఊంగ ఊడుగు, చేదుబీర, వావిలి వీనిని సమభాగములుగ గ్రహించి చక్కఁగనూరి త్రిఫలకషాయములో కలిపి పానము చేయించి యావిషము శీఘ్రముగ వమనమగునటుల చేయవలయును. లేక దిరిసెనపుటాకులు పట్టలు వేళ్లు విత్తులూ ఊడుగు వేళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి త్రిఫలోదకములో కలిపి పానము చేయించి విషము వమనంబగునటుల చేయించి పిదప త్రిఫలములు, పెద్దనీలి, తెల్లతెగడ మొదలగు విరేచనౌషధములను ప్రయోగించి విరేచనము చేయించవలయును.

## లూతాదంశమున కర్ణికాపాతనము.

నివృత్తేదాహశోఫాదౌ కర్ణికాం పాతయేద్వ్రణాత్. ౭౭

సాలెపురుగు కాటుఁగలవారికి పైచెప్పిన వమనవిరేచనాద్యౌషధములను సేవించుటచే మంట వాపు మొదలగు నుపద్రవములు శమించినయెడల నిఁకచెప్పఁబోయెడు ఔషధములచే వ్రణమునుండి కర్ణికను వెలిపుచ్చవలయును.

## లూతాదంశమున కర్ణికాపాతనౌషధము.

కుసుంభపుష్పం గోదంతస్స్వర్ణక్షీరీ కపోతవిట్,
త్రివృతా సైంధవం దంతీ కర్ణికాపాతనం తథా. ౭౮
మూలముత్తరవారుణ్యా వంశనిర్లేఖసంయుతమ్,

కుసుంబపువ్వు, హరిదళము, స్వర్ణక్షీరి, (అనగా కంకుష్ఠము,) పావురపిట్టమలము, తెల్లతెగడ, సైంధవలవణము, దంతిచెట్టువేరు అనునీయోషధులు వ్రణమునందలి కర్ణికను హరింపఁజేయును. పెద్దపాపరవేళ్లను నూరి తవక్షీరి (వెదురుప్పు) లో కలిపి లేపనము చేసిన కర్ణిక రాలిపోవును.

తద్వచ్చ సైంధవం కుష్ఠం దంతీకటుకదార్ధికమ్. ౭౯
రాజకోశాతకీమూలం కిణ్వో వా మధిశోద్భవః,

మఱియు సైంధవలవణము, చెంగల్వకోష్టు, దంతిచెట్టు, కటుకరోహిణి, పిన్నపాలవేళ్ళు, పెద్దబీరవేళ్లు, పెరుగుమీఁదిమీఁగడ అనునవియును కర్ణికను హారింపఁజేయుటయందు సమర్థంబుగనుండును.

కర్ణికాపాతమున బృంహణచికిత్స

కర్ణికాపాతసమయే బృంహయేచ్చ విషాపహైః. ౮౦

కర్ణికపడునపుడు విషహరౌషధములచే బృంహణచికిత్సలను జేయవలయును.

లూతాదంశమున ఘృతపానము

స్నేహకార్యమశేషం చ సర్పిషైవ సమాచరేత్,
విషస్య వృద్ధయే తైలమగ్నేరివ తృణోలుపమ్. ౮౧

అగ్నిని తృణములు వృద్ధిఁజేయునట్టులు నువ్వులనూనె విషమును వృద్ధిఁజేయును. కావున సర్పము సాలెపురుగు మొదలగు వాని విషయము యందు నువ్వులనూనెను బొత్తుగ వర్జించి ఆవునెయ్యిని విశేషముగ పానము చేయించవలయును. మఱియు స్నేహద్రవ్యములతో జేయవలసిన పనులనన్నిఁటిని నేతితోనే చేయవలెను.

పిత్తాదిలూతాదంశములకు హ్రీబేరాదియోగములు.

హ్రీబేరవైకంకతగోపకన్యాముస్తాశమీచందనతిందుకాని,
శైవాలనీలోత్పలవక్రయష్టీత్వఙ్నాకులీపద్మకరాఠమధ్యమ్. ౮౨
రజనీఘనసర్పలోచనాకణశుంఠీకణమూలచిత్రకాః,
వరుణాగురుబిల్వపాలలీపిచుమందాభయశేలుకేసరమ్. ౮౩
బిల్వచందననతోత్పలశుంఠీపిప్పలీనిచుళవేతసకుష్ఠమ్,
శుక్తిశాకవరపాటలిభార్గీసిందువారకరఘాటవరాంగమ్. ౮౪
పిత్తకఫానిలలూతాః పానాంజననస్యలేపసేకేన,
అగదవరాః వృత్తస్థాఃకుమతీరివ వారయంత్యేతే. ౮౫

వట్టివేరు, పుల్లవెలగ, పిల్లిపీచర, తుంగముస్తలు, జమ్మి, చందనము, నల్లతుమికి, పాచి, నల్లకలువ, గ్రంథితగరము, అతిమధురము, లవంగపుపట్ట, పెద్దసర్పాక్షి, పద్మకము, మ్రంగకాయ గుజ్జు వీనిని సమభాగములుగజేర్చి చేయఁబడిన యౌషధమొకటి. పసుపు, తుంగముస్తలు, సర్పాక్షి, పిప్పళ్లు, సొంటి, మోడి, చిత్రమూలము, ఉలిమిడి, అగరు, మారేడు, కలిగొట్టు, వేము, అభయము (అనఁగా వట్టివేరు), విరిగి, నాగకేసరములు వీనిని సమముగచేర్చి చేయఁబడిన యౌషధము రెండవది. మారేడు, చందనము, గ్రంథితగరము, నల్లకలువ, సొంటి, పిప్పళ్ళు, నీరుప్రబ్బలి, చెంగల్వకోష్టు, ముత్యపుచిప్ప, చక్రవర్తికూర, కలిగొట్టు, గంటుభారంగి, వావిలి, తామరగడ్డ, లవంగములు వీనిని సమములుగచేర్చి చేయఁబడిన యౌషధము మూఁడవది. ఈమూఁడు విధములగు శ్రేష్ఠౌషధములు పాననస్య అంజనసేకములయం దుపయోగించిన(పతివ్రతలు దుష్టవనిత

లను నిరసించుచాడున్న" పిత్త శ్లేష్మ వాతములవలన జనించిన సాలెపురుగులయొక్క విషములను నిరసించును.

సర్వలూతాదంశహర నస్యాదులు.

రోధ్రం సేవ్యం పద్మకం పద్మరేణుః
కాలీయాఖ్యం చందనం యచ్చ రక్తమ్,
కాంతాపుష్పం దుగ్ధినీకామృణాళం
లూతాస్సర్వా ఘ్నంతి సర్వక్రియాభిః. ౮౬

లొద్దుగు, కురువేరు, పద్మకము, తామరపువ్వు, తామరపుష్పముల ధూళి, పీతచందనము, రక్తచందనము, కాంతాపుష్పము, (అనఁగా ప్రేంకణపుష్పము) ఎఱ్ఱఉత్తరేణి, తామరతూండ్లు యీ ద్రవ్యములచే పాన నస్యాంజన లేపనసేకాదులను చేయించిన సాలెపురుగు విషము లన్నియు హరించును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ముప్పదిఏడవయధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# అష్టత్రింశాధ్యాయము.

అథ. కీటలూతాది విషప్రతిషేధ్యాయ నిరూపణానంతరము మూషికాళర్క విషప్రతిషేధాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## మూషికాళరవిష్క ప్రతిషేధాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో మూషికాళర్కవిషప్రతిషేధం వ్యాఖ్యాస్యామః
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

కీటలూతాదివిషచికిత్సా నిరూపణానంతరము యెలుకలు, పిచ్చికుక్కలు వీనివిషములకు చికిత్సలను వివరించునట్టి మూషికాళర్క విషప్రతిషేధమను నీయధ్యాయమును వివరించెదము.

### మూషికాభేదములు.

లాలనశ్చపలః పుత్రో హసిర శ్చిక్కిరోఽజిరః,
కషాయదంతః కులకః కోకిలః కపిలోఽసితః. ౧
అరుణశ్శబళ శ్శ్వేతః కపోతః పలితోందురః,
చుచుందరో రసాలాఖ్యో దశాష్టౌ చేతి మూషికాః. ౨

లాలనము, చపలపుత్రము, హసిరము, చిక్కిరము, అజిరము, కషాయదంతము, కులకము, కోకిలము, కపిలము, అసితము, అరుణము, శబళము, శ్వేతము, కపోతము, పలితము, ఉందురము, చుచుందరము, రసాలాఖ్యము అని యెలుకలు పదునెనిమిదిభేదములు గల్గియుండును.

### మూషికావిషదుష్టలక్షణము.

శుక్రం పతతి యత్రైషాం శుక్రదిగ్ధైః స్పృశంతి వా,
యదంగమంగై స్తత్రాస్రే దూషితే పాండుతాం గతే. 3
గ్రంథయః శ్వయథుః కోథో మండలాని భ్రమోఽరుచిః,

శీతజ్వరోఽతిరుక్సాదో వేపథుః పర్వభేదనమ్. ౪
రోమహర్షః స్రుతిర్మూర్ఛా దీర్ఘకాలానుబంధనమ్,
శ్లేష్మానుబద్ధబహ్వాఖుపోతకచ్ఛర్దనం సతృట్. ౫

పైచెప్పిన యెలుకలయొక్క శుక్రము మనుజులయొక్క యేయంగమునకు తగులునో, లేక పైయెలుకలు శుక్రముచే పూయఁబడిన యంగిములతో మనుజులయొక్క యేయంగములను తాకునో యా యంగములయందలి రక్తము దూషింపఁబడి తెలుపు వర్ణముగ పరిణమించి గ్రంథులు వాపు పుళ్ళు మండలములు కలుగును. ఇంతయే గాక నామనుజునికి భ్రమ, అరుచి, శీతజ్వరము, మిక్కిలిశూల, దౌర్బల్యము, వణుకు, గణుపులయందు నొప్పి, గగుర్పాటు, స్రావము, మూర్ఛ ఇవికల్గి బహుకాల మనువర్తించి యుండుట, దప్పి, ఎలుకలె నాకారముకల కఫమును వమనముచేయుట మొదలగు నుపద్రవములు కలుగును. ఇట్టి వమనము విషప్రభావమున కల్గును.

### ఆఖువిషలక్షణము.

వ్యవాయ్యాఖువిషం కృచ్ఛ్రం భూయో భూయశ్చ కుప్యతి,
ఎలుకవిషము శరీరమంతట వ్యాపించునట్టి స్వభావము కలదిగను కష్టసాధ్యముగ నుండుటయేగాక పలుమాఱు ప్రకోపము నొందుచుండును.

### అసాధ్యమూషికావిషలక్షణము.

మూర్ఛాంగశోథవైవర్ణ్యక్లేదశబ్దాశ్రుతిజ్వరాః. ౬
శిరోగురుత్వం లాలాసృక్ఛర్దిశ్చాసాధ్యలక్షణమ్,
మూర్ఛ, శరీరమునందు వాపు, వికారవర్ణము, క్లేదము, చెవుడు, జ్వరము, శిరోగురుత్వము, జొల్లుకారుట, రక్తము వాంతియగుట యివి యెలుకకాటునందు అసాధ్యలక్షణములని తెలయవలయును.

### వర్జనీయమూషికాదష్టలక్షణము.

శూనవస్తిం వివర్ణోష్ఠమాఖ్వాభైర్గ్రంథిభిశ్చితమ్. ౭
చుచుందరసగంధం చ వర్జయే దాఖుదూషితమ్,
పొత్తికడుపునం దుబ్బు, పెదవులయందు వికారవర్ణము, శరీరమంతట నెలుకవంటి యాకారము గల గ్రంథులు, శరీరమున చుంచెలుకవాసన, ఇట్టిలక్షణములు ఎలుకకాటుగలవానికి కలిగియుండిన అట్టివానిని చికిత్సయందు వర్జింపవలయును.

## దుష్టశునకలక్షణము

శునః శ్లేష్మోల్బణా దోషాస్సంజ్ఞాం సంజ్ఞావహాశ్రితాః. ౮
ముష్ణంతః కుర్వతే క్షోభం ధాతూనామతిదారుణమ్,
లాలావానంధబధిరః సర్వత స్సోఽభిధావతి. ౯
స్రస్తపుచ్ఛహనుస్కంధశిరో దుఃఖీ నతాననః,

కుక్కకు వాతాదిదోషములు శ్లేష్మాధిక్యముతోఁ గూడినవై సంజ్ఞను (అనఁగా జ్ఞానమును) వహించునట్టి స్రోతస్సుల నాశ్రయించి జ్ఞానమును పోఁగొట్టి రసాదిధాతువులకు దారుణమైన క్షోభను కలుగజేయును. దానివలన నాకుక్క జొల్లుకారుచుండునదిగను గ్రుడ్డిగను చెవిటితనము గలదిగను తోఁకచెక్కిళ్ళు భుజశిరము లివి జారినవిగ నుండును. మరియు నది తలవంచుకొని మిగుల దుఃఖముతో నెల్లపుడు పలుదిక్కులఁ బరువిడుచుండును.

## శునకదష్టమనుజలక్షణము.

దంశ స్తేన విదష్టస్య సుప్తః కృష్ణం *స్రవత్యసృక్. ౧౦
హృచ్ఛిరో రుగ్జ్వర స్తంభ స్తృష్ణామూర్ఛోద్భవో ను చ,

పైచెప్పియుండు లక్షణములుగల కుక్క మనుజుని కఱచినయెడల నాకాటు స్పర్శజ్ఞానము లేనిదిగ నల్లనిరక్తమును స్రవింపఁ జేయునదిగ నుండును. పిదప రొమ్ము నొప్పి జ్వరము శరీరము స్తబ్ధముగ నగుట దప్పి మూర్ఛ యివి జనించును.

## దుష్టజంతుదష్టలక్షణము.

అనేనాన్యేఽపి బోద్ధవ్యా వ్యాళా దంష్ట్రాప్రహారిణః. ౧౧

కోరలచే కఱచునట్టి నక్క మొదలగు దుష్టజంతువుల కాటులందును పైచెప్పిన కుక్కకాటు లక్షణములు కలిగియుండునని తెలియవలయును.

## సవిషనిర్విషలక్షణము.

కండూనిస్తోదవైవర్ణ్యసుప్తి క్లేదజ్వరభ్రమాః,
విదాహరాగరుక్పాకశోథగ్రంథివికుంచనమ్. ౧౨
దంశావదరణం స్ఫోటాః కర్ణికా మండలాని చ,
సర్వత్ర సవిషే లింగం విపరీతం తు నిర్విషే. ౧౩

విషముతోఁ గూడియుండు అన్ని కాటులయందును దురద, పోట్లు, వికారవర్ణము, స్పర్శాజ్ఞానము, స్రావము, జ్వరము, భ్రమ, మంట, యెఱుపువర్ణము,

* 'క్షరత్యసృక్' అని పాఠాన్తరము.

శోష్పి, పాకము, నొప్పు, గ్రంథులు, విసంచవము, కఱచినస్థలమునందు పగుళ్ళు, పిటకలు, కర్ణిక, మండలములు అను నీలక్షణములు కలిగియుండును విషరహితముగ నుండు కాటునందు నీలక్షణములు లేకుండును.

శునకాదిదష్టలక్షణము

దష్టో యేన తు తచ్చేష్టా రుతం కుర్వన్వినశ్యతి,
పశ్యం స్తమేవచాకస్మాదాదర్శసలిలాదిషు. ౧౪

ఏజంతువు మనుజునికఱచినదో యాజంతువుయొక్క వ్యాపారములను మనుజుఁడు చేయుచు దానివలె నేకూయుచు అద్దము ఉదకము మొదలగువానియందు ఆజంతువులను అకస్మాత్తుగఁజూచుచు మనుజుఁడు మృతిఁజెందును.

జలసంత్రాసలక్షణము.

యోఽద్భ్యః ప్రస్యేదదష్టోఽపి శబ్దసంస్పర్శదర్శనైః,
జలసంత్రాసనామానం దష్టం తమపి వర్జయేత్. ౧౫

కుక్క మొదలగుజంతువులు కఱవకయుండినను యెవఁడు వానియొక్క శబ్దము స్పర్శము దర్శనము వీనిచేతను ఉదకమువలనను భయపడునో వానికి జలసంత్రాస అని పేరుగలదు. అట్టివానిని చికిత్సయందు వర్జింపవలయును.

ఆఖుదష్టచికిత్స.

ఆఖునా దష్టమాత్రస్య దంశం కాండేన దాహయేత్,
దర్పణేనాథ వా తీవ్రరుజా స్యాత్కర్ణికాన్యథా. ౧౬

ఎలుక కఱచినతోడనే ఆకాటును నిప్పులో కాల్చఁబడిన యినుముచేతగాని అద్దముచేతఁగాని కాల్చవలయును. అటులచేయకుండిన క్రూరము లగుబాధలు కలుగును.

మూషికదష్టమున రక్తస్రావాదులు.

దగ్ధం విస్రావయేద్దంశం ప్రచ్ఛిన్నం చ ప్రలేపయేత్,
శిరీషరజనీవక్రకుంకుమామృతవల్లిభిః ౧౭

పైచెప్పినప్రకారము కాల్చఁబడిన ఆకాటును ఛేదించి రక్తమును స్రవింపఁజేసి దిరిసనపువిత్తులు, పసుపు, గ్రంథితగరము, కుంకుమపువ్వు, తిప్పతీఁగె వీనినినూరి కాటుపై లేపనము చేయవలయును.

మూషికదంశమునకు లేపము.

ఆగారధూమమంజిష్ఠారజనీలవణోత్తమైః,

లేపో జయత్యాఖువిషం కర్ణికాయాశ్చ పాతనః. ౧౮

కరిమాపము, మంజిష్ఠ, పసుపు, సైంధవలవణము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి లేపనముచేసిన నెలుకలవిషము హరించును. కర్ణికయును పడిపోవును.

మూషికదంశమున లేపాదులు.

తతోఽమ్లైః క్షాళయిత్వాను తోయైరను చ లేపయేత్,

పాలిందీశ్వేతకటభీబిల్వమూలగుడూచిభిః. ౧౯

అన్యైశ్చ విషశోఫఘ్నైస్సిరాం వా మోక్షయేద్ద్రుతమ్,

ఎలుకకాటును పుల్లని కలితోకడిగి మఱల శుద్ధజలములతో కడిగి నల్లతెగడ, తెల్లగినియ, మారేడువేళ్లు, తిప్పతీఁగె వీనిని నూరి దానిచేతను విషము వాపు వీనిని పోఁగొట్టునట్టి యితరయోషధులచేతను లేపనము చేయవలయును. లేక సిరను వేధించవలయును.

మూషికాదష్టమున వమనము.

ఛర్దనం నీలినీక్వాథైశ్శుకాఖ్యాంకోల్లయోరపి. ౨౦

ఎలుకకాటు కలవానికి నీలిచెట్టు కషాయముచే గాని, దిరిసనము, ఊడుగు వీని కషాయముచే గాని వమనము చేయించవలయును.

మూషికాదష్టమున వమనము.

కోశాతక్యాశ్శుకాఖ్యాయాః ఫలం జీమూతకస్య చ,

మదనస్య చ సంచూర్ణ్య దధ్నా పీత్వా విషం వమేత్. ౨౧

ఎలుక కఱచినవానికి చేదుబీర, దిరిసనము, డావరడంగి, మ్రంగ అనువాని విత్తులను చూర్ణముచేసి ఆవుపెరుగులో కలిపి పానము చేయించి విషమును వమనము చేయించవలయును.

మూషికావిషహరపానము.

వచామదనజీమూతకుష్ఠం వా మూత్రపేషితమ్,

పూర్వకల్పేన పాతవ్యం సర్వోందురవిషాపహమ్. ౨౨

వస, మ్రంగకాయ, డావరడంగి, చెంగల్వకోష్టు వీనిని సమభాగములుగ గ్రహించి గోమూత్రముతో నూరి ఆవుపెరుగులో కలిపి పానముచేయించిన నెలుకలవిషయములన్నియు హరించును.

## మూషికవిషమునందు విరేచనము.

విరేచనం త్రివృన్నీలీ త్రిఫలాకల్క ఇష్యతే,

ఎలుకకఱచినవానికి తెల్లతెగడ, నీలి, త్రిఫలములు అనువానిని సమముగ గ్ర
హించి కల్కముచేసి విరేచనమున కిప్పించవలయును.

## మూషికవిషమున కంజనము.

అంజనం గోమయరసో వ్యోషసూక్ష్మరజోఽన్వితః. ౨౩

శుంఠి, పిప్పలి, మిరియాలు వీనిని సమముగ గ్రహించి నున్నగ చూర్ణముచేసి
గోమయరసములో కలిపి ఎలుకవిషముకలవాని కంజనము వేయవలయును.

## మూషికవిషమున కవలేహము.

కపిత్థగోమయరసో మధుమానవలేహనమ్,

ఎలుకవిషమునందు వెలగపండురసము ఆవుపేడరసము వీనిని సమముగ మిశ్రము
చేసి అందులో కొంచెము తేనెకలిపి నాకించవలయును.

## ఆఖువిషహరఘృతము.

తండులీయకమూలేన సిద్ధం పానే హితం ఘృతమ్. ౨౪
ద్విনిశాకటభీరక్తాయష్ట్యాహ్వైర్వా ఘృతాన్వితైః,
ఆస్ఫోటమూలసిద్ధం వా పంచకాపిత్థమేవ వా. ౨౫

ఎలుకకాటునందు చిర్రికూరవేళ్లకల్కముతో చేయఁబడిన ఘృతమునుగాని,
పసుపు, మ్రానిపసుపు, గినియ, అతిమధురము, తిప్పతీఁగె అనువానికల్కముతో సిద్ధము
చేయఁబడిన ఘృతమునుగాని, తెల్లజిల్లేడువేళ్లకల్కముతో పక్వముచేయఁబడిన ఘృత
మునుగాని, వెలగచెట్టుయొక్క వేళ్లు, పట్టలు, ఆకులు, పువ్వులు, పండ్లు అనువాని
కల్కముతో పక్వముచేయఁబడిన ఘృతమునుగాని ఇప్పించిన హితము కలుగును.

## మూషికవిషమునకు సిందువారాదికషాయము.

సిందువారనతం శిగ్రుబిల్వమూలం పునర్నవా,
వచాశ్వదంష్ట్రాజీమూతమేషాం క్వాథం సమాక్షికమ్. ౨౬
పిబేచ్ఛాల్యోదనం దధ్నా భుంజానో మూషికార్దితః,
తక్రేణ శరపుంఖాయా బీజం సంచూర్ణ్య వా పిబేత్. ౨౭

ఎలుకవిషముచే పీడింపఁబడియుండువానికి వావిలియాకు, గ్రంథితగరము, మునగ
మారేడువేళ్లు, గలిజేరు, వస, పల్లేరు, దేవతాడి వీనికషాయమును తేనెసహితముగ

పానము చేయించి ఆవుపెరుగుతో సంబారిబియ్యపు అన్నమును భుజింపఁ జేయవలయును. లేక తెల్లజెంపలివిత్తులను చూర్ణముచేసి ఆవుమజ్జిగలో కలిపి పానము చేయించవలయును.

### మూషికవిషమునకు అంకోలమూలకల్కము.

అంకోల్లమూలకల్కో వా బస్తమూత్రేణ కల్కితః,
పానాలేపన యోర్యుక్తస్సర్వాఖువిషనాశనః. ౨౮

ఊడుగువేళ్లను గొఱ్ఱెమూత్రముతో నూరి కల్కముచేసి పానమును లేపనమును జేయించిన నెలుకవిషము హరించును.

### మూషికవిషహరకల్కాదులు.

కపిత్థమధ్యతిలకతిలాంకోల్లజటాః పిబేత్,
గవాం మూత్రేణ పయసా మంజరీం తిలకస్య వా, ౨౯
అథవా సైర్యకాన్మూలం సక్షౌద్రం తండులాంబునా,
కటుకాలాబువిన్యస్తం పీతం వాంబునిశోషితమ్. ౩౦

వెలగగుజ్జు, కానుగచెట్టువేళ్లు, నువ్వుచెట్టువేళ్లు, ఊడుగుచెట్టువేళ్లు వీనిని సమముగ గోమూత్రముతో నూరి పానము చేయించినను, లేక నువ్వులపువ్వులను ఆవుపాలలో నూరి పానము చేయించినను, లేక ములుగోరింటవేళ్లను బియ్యపుకడుగుతో నూరి అందులో కొంచెము తేనె కలిపి పానము చేయించినను, లేక చేదానుగుబుఱ్ఱలో నుదకముబోసి యొకరాత్రి నానబెట్టి దానిని పానము చేయించినను నెలుకకాటు విషము హరించును.

### మూషికవిషమునకు నస్యాదులు.

సిందువారస్య మూలాని బిడాలాస్థివిషం నతమ్,
జలపిష్టోఽగదో హంతి నస్యాద్యైరాఖుజం విషమ్. ౩౧

వల్లవావిలివేళ్లు, పిల్లియెముక విషము, గ్రంథితగరము అనువానిని సమముగ గ్రహించి ఉదకములో నూరి నస్యమును లేపనమును చేయించిన నెలుకకాటు విషము హరించును

### సశేషమూషిక విషచికిత్స.

సశేషం మూషికవిషం ప్రకుప్యత్యభ్రదర్శనే,

యథాయథం వా కాలేషు దోషాణాం వృద్ధిహేతుషు. 3౨
తత్ర సర్వే యథావస్థం ప్రయోజ్యాః స్యు రుపక్రమాః,
యథా స్వం యే చ నిర్దిష్టాః తథా దూషీవిషాపహాః. 33

పైచెప్పినప్రకారము చికిత్సజేసినను ఎలుకకాటువిషము చక్కఁగ నివర్తించక కొంచెము శేషించియుండినచో నది మేఘము వృద్ధిజెందునపుడును, వాతాదిదోషముల వృద్ధికాలములందును ప్రకోపించును. దానియందు దాయా యవస్థానుగుణముగ పైచెప్పిన చికిత్సలనన్నిఁటిని చేయుటయేగాక దూషీవిషమునకు చెప్పియుండు చికిత్సలను కూడ చేయవలయును.

## ఆళర్కదంశచికిత్స.

దంశం హ్యాళర్కదష్టస్య దగ్ధముష్ణేన సర్పిషా,
ప్రదిహ్యాదగదై స్తైః పురాణం చ ఘృతం పిబేత్. 3౪
అర్కక్షీరయుతం చాస్య యోజ్యా మాశువిరేచనమ్,

పిచ్చికుక్క కఱచినవానియొక్క కాటును బాగుగ కాచఁబడి మిక్కిలి వేడిగనుండు నేతితో కాల్చి యెలుకవిషమునకు జెప్పియుండు ఔషధములచే లేపనముచేసి ప్రాత ఆవునేతిని పానము చేయించవలయును. మఱియు త్వరలో విరేచనౌషధములో జిల్లేడుపాలను కలిపి యిప్పించవలయును.

## మూషికవిషహరపానము.

అంకోల్లోత్తరమూలాంబుత్రిపలం సహవిఃపలమ్. 3౫
పిబేత్సధత్తూరఫలాం శ్వేతాం వాపి పునర్నవామ్,

పిచ్చికుక్క కఱచినవానికి ఊడుగవేళ్లకషాయము మూఁడుపలములు, ఆవునెయ్యి ఒకపలము వీనిని మిశ్రముచేసి పానము చేయించవలయును. లేక ఉమ్మెత్తవిత్తులు, తెల్లగలిజేరు వీనిని సమముగ నుదకముతో నూరి పానము చేయించవలయును.

## ఆళర్కవిషమునకు తి[illegible]పానము.

పికథ్యం పలలం తైలం రూషికా[illegible]గుడః. 3౬
భినత్తి విషమాళర్కం ఘనబృందమివానిలః,

వేయించిన నువ్వులచూర్ణము తెల్ల[illegible] పాతబెల్లము వీనిని సమముగ

గ్రహించి మిశ్రముచే యుదకములో కలిపి పానము చేయించిన నది గాలిమేఘములను పోఁగొట్టుభంగి పిచ్చికుక్కకాటువిషమును పోఁగొట్టును.

అళర్కవిషమునకు మంత్రాదులు.

సమంత్రంసౌషధిరత్నం స్నపనం చ ప్రయోజయేత్. 32

పిచ్చికుక్క కఱచినవానికి సిద్ధమంత్రములచే నభిమంత్రింపఁబడినదిగ నోషధులు రత్నములు చేర్చఁబడినదిగ నుండు నుదకముచే స్నానమును చేయించవలయును.

"అష్టోత్తరశతం వారాన్ సిద్ధమంత్రాభిమంత్రితైః,
అష్టోత్తరశతోన్నానైః పుష్పమాలావకుంఠితైః,
గోచర్మమాత్రకేలిప్తే జ్వలితేఽగ్నౌకుశాస్తృతే,
స్థండిలే సరితస్తీరే స్నానం చాస్య చతుష్పథే,
"అళర్కాధిపతే యక్ష సారమేయగణాధిప,
అళర్కజుష్టమేతన్మే నిర్విషంకురు మాచిరాత్,
స్వాహే"తి మంత్రోఽళర్కాంతే సర్వకర్మసు శస్యతే."

అని అష్టాంగసంగ్రహమునందు పిచ్చికుక్కవిషమునకు మంత్రము స్నానక్రమము చెప్పఁబడియున్నది. ప్రశస్తమైన నదీతీరమున గోచర్మమాత్ర పరిమాణము గల ప్రదేశమున స్థండిలము నేర్పరిచి అందు దర్భల బరిచి యచ్చట నొకకలశమును నూటయెనిమిదియంగుళముల యెత్తుకల కలశమునునిచి నదీజలముచే నిండించి దానిని పుష్పమాలికలచే గప్పి ప్రక్కనన గినిడి "అలర్కాధిపతేఽకుగుమాచిరాత్ స్వాహా" అను మంత్రముచే హోమము నూటయెనిమిదిమార్లు చేసి పిదప నామంత్రముచేత నేనూటయెనిమిదిమార్లు కలశోదకము నభిమంత్రించి యామంత్రము నుచ్చరింపుచు కలశోదకముచే నభిషేకము చేయించిన పిచ్చికుక్కవిషము నిశ్శేషముగ హరించును.

చతుష్పాద్విషము.

చతుష్పాద్భిర్ద్విపాద్భిర్వా నఖదంతపరిక్షతమ్,
శూయతే పచ్యతే రాగజ్వరస్రావరుజాన్వితమ్. 33

నాల్గుకాళ్లుగల యేనుఁగు, గుఱ్ఱము, రెండుకాళ్లుగల మనుజులు, నెమలి,కోడియూ మొదలగువానియొక్క గోళ్లచేతను పండ్లచేతను మనుజులకు గాయముకలిగిన ఆచో

టులో నాజంతువులయొక్క విషముతగిలి యుబ్బి పాకమును జెంది రొంబుపువర్ణము జ్వరము స్రావము నొప్పి ఇవి కలుగును.

నఖదంతవిషహరౌషధములు.

సోమవల్కోఽశ్వకర్ణశ్చ గోజిహ్వా హంసపాదికా,
రజన్యౌ గైరికం లేపో నఖదంతవిషాపహః. 3౯

తెల్లచంద్ర, అశ్వకర్ణము (అనఁగా ఏపి), కరూపారపుబెండ, హంసపాదిచెట్టు, పసుపు, మ్రానిపసుపు, కావిరాయి వీనిని సమముగ గ్రహించి లేపనముచేసిన జంతువుల యొక్క గోళ్లవలనను పండ్లవలనను గాయము తగులుటచే జనించినవిషము నారించును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమను
ముప్పదియనిమిదవ యధ్యాయము ముగిసెను.

శ్రీ ర స్తు.

# ఏకోనచత్వారింశాధ్యాయము.

(రసాయనతంత్రము ౭-వ అంగము.)

అవ. మూషికాళర్కవిషప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము రసాయనాధ్యాయము చెప్పఁబడుచున్నయది:—

## రసాయనాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో రసాయనాధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

మూషికాళర్కవిషప్రతిషేధాధ్యాయ నిరూపణానంతరము రసాయనయోగములను తెలియపఱచునట్టి రసాయనాధ్యాయమును వివరించెదము.

(రోగములనన్నిఁటిని నివర్తింపఁజేసి ముసలితనమునురానీయక ఆయువును వృద్ధిఁజేయునది రసాయనము. అట్టియోగములు ఈయధ్యాయమున వివరింపఁబడుటంజేసి యియ్యది రసాయనాధ్యాయమని చెప్పఁబడును.)

రసాయనస్వరూపము.

దీర్ఘమాయుః స్మృతిం మేధామారోగ్యం తరుణం వయః,
ప్రభావర్ణస్వరౌదార్యం దేహేంద్రియబలోదయమ్. ౧
వాక్సిద్ధిం వృషతాం కాంతిమవాప్నోతి రసాయనాత్,
లాభోపాయో హి శస్తానాం రసాదీనాం రసాయనమ్. ౨

శ్రేష్ఠములగు రసరక్తాదిధాతువులను పొందుటకు కారణముగ నుండునది రసాయన మనఁబడును. ఈ రసాయనయోగములను సేవించుటవలన మనుజులకు దీర్ఘాయువు స్మృతి బుద్ధి శక్తి ఆరోగ్యము యౌవనము కాంతి వర్ణము మంచిస్వరము ఔదార్యము శరీరబలము చక్షురాదీంద్రియబలము వాక్సిద్ధి వీర్యపుష్టి కాంతి ఇవియన్నియు

"(రసరక్తాది ధాతూనాం) అయనం (స్థానం) రసాయనమ్" అను
కు రసరక్తాదిధాతువును పోషించుటకు కారణములగు నౌషధ

యోగములన్నియు రసాయనశబ్దముచే జెప్పఁబడును. అట్టి ధాతువులు పరిశుద్ధములై వృద్ధిఁబొందుటంజేసి మనుజులకు దీర్ఘాయుష్యము మొదలజేసి శరీరకాంతిపరకుఁ జెప్పఁబడిన గుణములన్నియు స్వయముగనే కల్గును. కావున అట్టి యాయుర్వృద్ధి మున్నగు ప్రశస్త గుణములకన్నిఁటికిని కారణమైనది రసాయనమని ఫలితార్థము.

### రసాయనసేవనకాలము.

పూర్వే వయసి మధ్యే వా తత్ప్రయోజ్యం జితాత్మనః,
స్నిగ్ధస్య స్రుతరక్తస్య విశుద్ధస్య చ సర్వథా. 3

స్నేహకర్మ, రక్తమోక్షణము వీనిని చేయించికొనినవాఁడును వమనవిరేచన కర్మంబులచే శుద్ధమైన శరీరముకలవాఁడును జితేంద్రియుఁడును నగు పురుషునికి తొలివయసునందు గాని మధ్యవయస్సునందు గాని పైరసాయనము నుపయోగించ వలయును.

### అశుద్ధశరీరునికి రసాయననిషేధము.

అవిశుద్ధే శరీరేహి యుక్తో రాసాయనో విధిః,
వాజీకరో వా మలినే వస్త్రే రంగ ఇవాఫలః. ౪

స్నేహవమన విరేచనాదికర్మలచే శరీరశుద్ధిఁ జేసికొనక ఇఁక చెప్పఁబోయెడు రసాయనయోగములను గాని వాజీకరణ యోగములను గాని ఉపయోగించిన అది "మురికిగనుండు వస్త్రమునకు రంగుబట్టకుండు చందంబున" ఫలవంతముగా నోపదు. కావున వమనవిరేచనాదులచే శోధనముఁ జేసికొనుట ముఖ్యము.

### ద్వివిధరసాయనప్రయోగము.

రసాయనానాం ద్వివిధం ప్రయోగమృషయో విదుః,
కుటీప్రావేశికం ముఖ్యం వాతాతపికమన్యథా. ౫

కుటీప్రావేశికము, వాతాతపికము అని రసాయనప్రయోగములు రెండు విధములుగ నుండుననియు వానిలో కుటీప్రావేశికము శ్రేష్ఠమనియు వాతాతపికము శ్రేష్ఠము కాదనియు మహర్షులు చెప్పుచున్నారు.

### కుటీనిర్మాణక్రమము.

నిర్వాతే నిర్భయే * హర్మ్యే ప్రాప్యోపకరణే పురే,
దిశ్యుదీచ్యాం శుభే దేశే త్రిగర్భాం సూక్ష్మలోచనామ్. ౬
ధూమాతపరజోవ్యాళ స్త్రీమూర్ఖాద్యవిలంఘితామ్,

* ధర్మ్యే.

సజ్జవైద్యోపకరణాం సుమృష్టాం కారయేత్కుటీమ్. ౭

రసాయనసేవనయం దిచ్ఛగల మనుజుఁడు గాలిలేనిదియు భయము లేకుండు నదియు అన్నిసామగ్రులు దొరకునదియు ధర్మిష్ఠమైనదియు నగుపట్టణమునం దుత్తర దిక్కులో మనస్సునకు ప్రియమును భయరహితమును నైన ప్రదేశమునందు మూఁడు గర్భగృహములు గలదియు-సూక్ష్మమైన గవాక్షములతోఁ గూడినదియు పొగ యెండ దుమ్ము సర్పము దుష్టజంతువులు స్త్రీలు దుష్టులు మొదలగువారు ప్రవేశించుట కశక్యంబుగనుండునదియు ఔషధములు సిద్ధముగ నుండునదియు ఆవుపేడ మున్నగు వానిచే నలికి పరిశుద్ధముగ నుండునదియునగు గుడిసెను నిర్మించవలయును.

### రసాయన ప్రారంభకాలము.

అథ పుణ్యేఽహ్ని సంపూజ్య పూజ్యాంస్తాం ప్రవిశేచ్ఛుచిః,
తత్ర సంశోధనైశ్శుద్ధః సుఖీ జాతబలః పునః. ౮
బ్రహ్మచారీ ధృతియుతశ్శ్రద్ధధానో జితేంద్రియః,
దానశీలదయాసత్యవ్రతధర్మపరాయణః. ౯
దేవతానుస్మృతౌ యుక్తో యుక్తస్వప్నప్రజాగరః,
ప్రియౌషధః పేశలవాక్ప్రారభేత రసాయనం. ౧౦

పిమ్మట నామనుజుఁడు శుభముహూర్తమునందు స్నానాదులచే పరిశుద్ధుఁడుగ, మంగళస్వస్తివాచనములను చేయించికొని పూజ్యులుగనుండు గురుబ్రాహ్మణమిత్రాదులను పూజించి ముందు నిర్మించఁబడినగుడిసెలోఁ ప్రవేశించవలయును. పిదప నచట సుఖముగవసించుచు వమనవిరేచనకర్మలచే శరీరశుద్ధిగలవాఁడును రోగరహితుఁడునునై మరలశరీరమునకు బలము వచ్చినపిదప స్త్రీసంభోగమును వర్జించినవాఁడుగ సంతోషము గలవాఁడుగ చాపల్యములేనివాఁడుగ జితేంద్రియుఁడుగ దానము సదాచారము దయ సత్యము నియమము ధర్మము వీనియం దాసక్తిగలవాఁడుగ ఎల్లపుడు దేవతల ధ్యానించువాఁడుగ నిద్ర జాగరము వీనిని సకాలమున యుక్తముగఁజేయువాఁడుగ ఔషధములయందు ప్రీతిగలవాఁడుగ ప్రియమైన మాటలాడువాఁడుగ శరీరవాఙ్మనశ్శుద్ధి గలవాఁడుగనుండు నామనుజుఁడు రసాయనయోగమున కారంభించవలయును.

### రసాయనోపయోగపూర్వకర్తవ్యము.

హరీతకీ మామలకం సైంధవం నాగరం వచామ్,
హరిద్రాం పిప్పలీం వేల్లం గుడం చోష్ణాంబునా పిబేత్. ౧౧
స్నిగ్ధః స్విన్నో నరః పూర్వం తేన సాధు విరిచ్యతే,

మనుజుఁడు రసాయనయోగమును సేవించుటకుముందు స్నేహస్వేదకర్మలను చేయించికొని కరక్కాయ, ఉసిరికపండు, సైంధవలవణము, శుంఠి, వస, పసుపు, పిప్పళ్ళు, వాయువిడంగములు, పాతబెల్లము వీనిని సమముగ గ్రహించి నూరి ఉష్ణోదకములో కలిపి చక్కఁగ విరేచనంబగుటకై పానముచేయవలయును.

శుద్ధశరీరునికి యవాన్నోపయోగము.

తత శ్శుద్ధశరీరాయ కృతసంసర్జనాయ చ. ౧౨
త్రిరాత్రం పంచరాత్రం వా సప్తాహం వా ఘృతాన్వితమ్,
దద్యాద్యావకమాశుద్ధేః పురాణశకృతోఽథ వా. ౧౩

అనంతరము శుద్ధశరీరముగలవాఁడును గంజి మొదలగు పథ్యములభుజించినవాఁడును నగు ఆమనుజునికి మూఁడు లేక యైదు లేక ఏడు దినములవఱకుగాని లేక కడుపులోనుండు పాతమలము బయలువెడలుపఱకుగాని యవాన్నమును ఘృతసహితముగ నిప్పింపవలయును.

శుద్ధకోష్ఠునికి రసాయనసేవనవిధి.

ఇత్థం సంస్కృతకోష్ఠస్య రసాయనముపాహరేత్,
యస్య యద్యౌగికం పశ్యే త్సర్వ మాలోచ్య సాత్మ్యవిత్. ౧౪

సమర్థుఁడుగ సాత్మ్యము నెఱింగినవాఁడుగ నుండువైద్యుఁడు పైచెప్పినప్రకారము శుద్ధమైనకోష్ఠముగల మనుజునికి నిఁక చెప్పఁబోయెడు రసాయనయోగములలో యుక్తముగనుండు రసాయనమును ప్రయోగించవలయును.

బ్రాహ్మరసాయనము.

పథ్యాసహస్రం త్రిగుణధాత్రీఫలసమన్వితమ్,
పంచానాం పంచమూలానాం సార్ధం పలశతద్వయమ్. ౧౫
జలే దశగుణే పక్త్వా దశభాగస్థితే రసే,
ఆపోథ్య కృత్వా వ్యస్థీని విజయామలకాన్యథ. ౧౬
వినీయ తస్మిౝ నిర్యూహే యోజయేత్కుడవాంశకమ్,
త్వగేలాముస్తరజనీపిప్పల్యగరుచందనమ్. ౧౭
మండూకపర్ణీకనకశంఖపుష్పీవచాప్లవమ్,
యష్ట్యాహ్వయం విడంగం చ చూర్ణితం తులయాధికమ్. ౧౮

సితోపలార్ధభారం చ పాత్రాణి త్రీణి సర్పిషః,
ద్వే చ తైలాత్పచేత్సర్వం తదగ్నౌ లేహతాం గతమ్ ౧౯
అవతీర్ణం హిమం యుంజ్యాద్వింశైః క్షౌద్రశతైస్త్రిభిః,
తతః ఖజేన మథితం నిదధ్యాద్ఘృతభాజనే ౨౦
యో నోపరుంధ్యాదాహారమేకం మాత్రాస్య సా స్మృతా,
షష్టికః పయసా చాత్ర జీర్ణే భోజనమిష్యతే. ౨౧
వైఖానసా వాలఖిల్యాస్తథాచాన్యే తపోధనాః,
బ్రహ్మణా విహితం ధన్యమిదం ప్రాశ్య రసాయనమ్. ౨౨
తంద్రాశ్రమక్లమవలీపలితామయవర్జితాః,
మేధాస్మృతిబలోపేతా బభూవురమితాయుషః. ౨౩

వెయ్యి కరక్కాయలు, మూఁడు వేలు యుసిరికపండ్లు, ఇన్నూటయాబైః ములు పంచమూలములు వీనిని పదింత లుదకములో వైచి వండి పదియవభాగము మిలునటుల కషాయము కాచి దించుకొని పై కరక్కాయలు మొదలగు వానిని చక్కఁబిసికి అందులోని విత్తులు నరములు తీసివేసి యాకషాయములో లవంగపట్ట, ఏలకుల తుంగముస్తలు, పసుపు, పిప్పళ్ళు, అగరుచెక్క, చందనము, సరస్వతియాకు, నాగకేరములు, శంఖపుష్పి, వస, తుంగముస్తః, అతిమధురము, వాయువిడంగము వీనిచూర్ణము వెవ్వేరుగ ఒకకుడవను, పదునొకండు తులములు పంచదార, మూఁడు ఆకములు, ఆవునెయ్యి, రెండు ఆఢకములు నువ్వులనూనె వీనిని చేర్చి మరల పొయిమీఁబెట్టి లేహముగ నగువఱకు వండి దించుకొని చల్లారినపిదప అందులో మున్నూట యిఁవది పలములు తేనెను చేర్చి గరిటచే చక్కఁగ కలియఁబెట్టి పాతనేతికుండలో నుంవలయును. దీనిని మాత్రగా సేవించి అది జీర్ణమైనపిదప అరువదిదినములకు ఫలించెడ సంబాధాన్యపు అన్నమును ఆవుపాలతో భుజింపవలయును. మాత్రయనఁగా—(ప్రాతఃకాలమున నీయౌషధము నెంతపరిమాణము పుచ్చుకొనిన సాయంకాలమునకు జీర్ణమగునో యంతపరిమాణము కలది) వైఖానసులు వాలఖిల్యులు ఇతరమహర్షులును బ్రహ్మచే నిర్మింపఁబడిన యీరసాయనమును సేవించి ఆలస్యము ఆయాసము బడలిక వళులు పలితము రోగములు నివిలేనివారై మేధా, స్మృతి, శరీరబలము వీనితోఁగూడి దీర్ఘాయుస్సుగలవారుగ మనిరి.

### అభయామలకరసాయనము

అభయామలకసహస్రం నిరామయం పిప్పలీసహస్రయుతమ్,
తరుణపలాశక్షారద్రవీకృతం స్థాపయేద్భాండే. ౨౪

ఉపయుక్తే చ క్షారే చ్ఛాయాసంశుష్కచూర్ణితం భోజ్యమ్,
పాదాంశేన సితాయాశ్చతుర్గుణాభ్యాం మధుఘృతాభ్యామ్.
తద్ఘృతకుంభే భూమౌ నిధాయ షణ్మాససంస్థముద్ధృత్య,
ప్రాహ్ణే ప్రాశ్య యథానలముచితాహారో భవేత్సతతమ్.
ఇత్యుపయుంజ్యాఽశేషం వర్షశతమనామయో జరారహితః,
జీవతి బలపుష్టివపుఃస్మృతిమేధాద్యన్వితో విశేషేణ ౨౭

కొత్తగనుండు మోదుగుక్షారము యొక్క నీళ్లను మట్టికుండలోబోసి అందులో వెయ్యి కరక్కాయలు, వెయ్యి ఉసిరికకాయలు, వెయ్యి పిప్పళ్లుచేర్చి మోదుగుక్షారోదక మిగిరిపోవువఱకునుంచి పిదప దానినెత్తి నీడనెండించి విత్తులు మొదలగు వానిని తీసివేసి దానిని చక్కఁగ చూర్ణముచేసి అందులో నాల్గవభాగము పంచదారను కలిపి నాలుగింతలు తేనెను ఆవునేతిని బోసి నేతికుండలోనుంచి భూమిలోపల ఆరు మాసములు పాతిబెట్టి పిదప నెత్తి ప్రాతఃకాలమున జాఠరాగ్ని బలానుగుణముగ పానము చేయించి పథ్యాహారములను భుజింపఁ జేయవలయును. ఇటుల నాయౌషధమును నిశ్శేషముగ భుజించినమనుజుఁడు రోగము ముసలితనము మున్నగునవి లేక శరీర బలము, పుష్టిస్మృతి, బుద్ధి అనువానితోఁ గూడినవాఁడై నూరుసంవత్సరములు సుఖముగ జీవించును.

ఆమలకరసాయనము.

నీరుజార్ద్రపలాశస్య ఛిన్నే శిరసి తత్క్షతమ్,
అంతర్ద్విహస్తం గంభీరం పూర్యమామలకైర్నవైః. ౨౮
ఆమూలం వేష్టితం దర్భైః పద్మినీపంకలేపితమ్,
ఆదీప్య గోమయైర్వన్యైర్నిర్వాతే స్వేదయేత్తతః. ౨౯
స్విన్నాని తాన్యామలకాని తృప్త్యా
ఖాదేన్నరః క్షౌద్రఘృతాన్వితాని,
క్షీరం శృతం చానుపిబేత్ప్రకామం
తేనైవ వర్తేత చ మాసమేకమ్.
వర్జ్యాని వర్జ్యాని చ తత్ర యత్నా
త్స్పృశ్యం చ శీతాంబు న పాణినాపి,
ఏకాదశాహేఽస్య తతో వ్యతీతే
పతంతి కేశా దశనా నఖాశ్చ. ౩౦

అథాల్పకై రేవ దినైస్సురూప స్త్రీష్వక్షయః కుంజరతుల్యవీర్యః,
విశిష్టమేధాబలబుద్ధిసత్త్వో భవత్యసౌ వర్షసహస్రజీవీ. 3౨

కీటకాదులచే చెఱచఁబడకను రోగరహితంబుగను పచ్చివిగనుండు మోదుగుచెట్టు కొమ్మయొక్క కొనను మూఁడుమూరలునతికి ఆకొమ్మకులోపల రెండుమూళ్ల ప్రమాణము లోఁతుగ రంధ్రము తొలచి ఆబొంగులో క్రొత్తదిగనుండు ఉసిరికపండ్లను నిండించి పైదర్భగడ్డిని చక్కఁగజుట్టి దానిపై తామరకొలనులోని బురదనుబూసి గాలిలేని చోటులో అడవియేరుపిడకలతో ఉసిరికాయలు పక్వమగునట్లు పుటము వేయవలయును. పిదప దానిని గ్రహించి ఉసిరికకాయలనెత్తికొని ప్రతిదినము తేనె ఆవునెయ్యి వీనితోడ తృప్తికలుగునట్లు భుజించి చక్కఁగకాఁచిన ఆవుపాలను పానముచేయవలయును. ఇటుల ఒక మాసము ఆహారములేక పైయుసిరికపండ్లను భుజింపవలయును. ఈ రసాయనమును సేవించునపుడు రసాయనసేవనలో వర్జనీయముగాచెప్పియుండు క్షారాదులను మిగులప్రయత్నముతో వర్జింపవలయును. శీతోదకమును చేతితోనైన తాకరాదు. ఇటులసేవించువానికి పదునొకండుదినములుగడచినపిదపతలవెండ్రుకలు పండ్లు గోళ్ళురాలిపోవును. పిదప స్వల్పదినములలోనే యామనుజుఁడు మున్దుకన్న విశేషసౌందర్యముగలవాఁడుగ స్త్రీసంభోగమునందు విశేషశక్తిగలవాఁడుగ ఏనుగవంటి బలముగలవాఁడుగ బుద్ధి శరీరబలము ధారణాశక్తి సత్త్వగుణము లివి అధికముగ గలవాఁడుగ నగుటయేగాక వేయి సంవత్సరములు జీవించును.

చ్యవనప్రాశనమను రసాయనము.

దశమూలబలాముస్తజీవకర్షభకోత్పలమ్,
పర్ణిన్యౌ పిప్పలీశృంగీ మేదా తామలకీత్రుటిః. 33
జీవంతీ జోంగకం ద్రాక్షా పౌష్కరం చందనం శఠీ,
పునర్నవాద్వికాకోల్యౌ *కాకనాసామృతాహ్వయాః. 3౪
విదారీ వృషమూలం చ తదైకధ్యం పలోన్మితమ్,
జలద్రోణే పచేత్పంచ ధాత్రీఫలశతాని చ. 3౫
పాదశేషం రసం తస్మాద్వ్యష్టీన్యామలకాని చ,
గృహీత్వా భర్జయేత్తైలఘృతాద్ద్వాదశభిః పలైః. 3౬
మత్స్యండికాతులార్ధేన యుక్తం తల్లేహవత్పచేత్,
స్నేహార్ధం మధుసిద్ధే తు తవక్షీర్యాశ్చతుష్పలమ్. 3౭
పిప్పల్యా ద్విపలం దద్యాచ్చతుర్జాతం కణార్ధితమ్,

*శుకనాసా.

అతోఽవలేహయేన్మాత్రాం కుటీస్థః పథ్యభోజనః. ౩౭
ఇత్యేష చ్యవనప్రాశోయం ప్రాశ్య చ్యవనో మునిః,
జరాజర్జరితోఽప్యాసీన్నారీనయననందనః. ౩౮
కాసం శ్వాసం జ్వరం శోషం హృద్రోగం వాతశోణితమ్,
మూత్రశుక్రాశ్రయాన్ దోషాన్ వైస్వర్యం చ వ్యపోహతి,
బాలవృద్ధక్షతక్షీణకృశానామంగవర్ధనః. ౪౦
మేధాం స్మృతిం కాంతిమనామయత్వ
మాయుః ప్రకర్షం పవనానులోమ్యమ్,
స్త్రీషు ప్రహర్షం బలమింద్రియాణా
మగ్నేశ్చ కుర్యాద్విధినోపయుక్తః. ౪౧

దశమూలములు, చిట్టాముట్టి, తుంగముస్తలు, జీవకము, ఋషభకము, నల్లకలువ, కోలపొన్న, నేలపొన్న, పిప్పళ్ళు, కర్కాటకశృంగి, మేద, నేలయుసిరిక, ఏలకులు, పిన్నమను బాల, నల్లఅగరు, ద్రాక్షపండు, పుష్కరమూలము, చందనము, ఆరుగంట్ల కచోరములు, గలిజేరు, కాకోళి, క్షీరకాకోలి, కాకిదొండ, తిప్పతీఁగె, నేలగుమ్మడు, అడ్డసరపు వేళ్ళు వీనిని దినుసుకు ఒక పలము చొప్పున గ్రహించి ద్రోణప్రమాణ ముదకములో వైచి అందులో నూరు యుసిరికపండ్లను జేర్చి నాల్గవభాగము నీళ్ళు మిగులునటుల వండి యీయుసిరిక పండ్లను గ్రహించి అందులోని విత్తులనెత్తివేసి యాయుసిరిక పండ్లను నువ్వులనూనె పన్నెండు పలములు ఆవునెయ్యి పన్నెండు పలములు వీనిలో వేయించి మరల నాకషాయములో జేర్చి యాపై పలములు పంచదారను కలిపి లేహమువలె వండవలయును. పిదప దానిని గ్రహించి చల్లారిన పిదప అందులో పన్నెండు పలములు తేనెను జేర్చి తవాక్షీరి (వెదురుప్పు) నాల్గు పలములు, పిప్పళ్ళు రెండు పలములు, చతుర్జాతకము ఒక పలము చేర్చి యొకపాత్రలో నుంచుకొనవలయును. ఈలేహమును ముందు జెప్పిన గుడిసెలో వసింపుచు మాత్రగా సేవింపుచు పథ్యాహారములను భుజింపుచుండవలయును. ముసలితనమువలన శిథిలమైన శరీరముగల చ్యవనుఁడను మహర్షి యీలేహమును సేవించి యౌవనవయస్సు గలవాఁడై స్త్రీలలోచనములకు ఆనందకరమైన సౌందర్యముగలవాఁ డాయెను. కావున నీరసాయనమునకు చ్యవనప్రాశమని పేరుగలిగినది. ఇది కాసము, శ్వాసము, జ్వరము, శోష, రొమ్మునొప్పి, వాతరక్తము, మూత్రకృచ్ఛ్రము, శుక్రదోషము, స్వరభంగము వీనిని పోఁగొట్టును. బాలురు వృద్ధులు క్షతక్షీణులు కృశులు వీరికి శరీరపుష్టిని కలుగఁజేయును. దీనిని విధిప్రకారము సేవించిన బుద్ధి వృద్ధి స్మృతి మంచికాంతి ఆరోగ్యము ఆయుర్వృద్ధి

మఱియు వాతమునకనులోమగతి స్త్రీలకు సంతోషమును గలుగఁజేయునట్టి సంభోగశ
చక్షురాదీంద్రియములకు బలము జాఠరాగ్ని దీపనము కలుగును.

త్రిఫలారసాయనము.

మధుకేన తవక్షీర్యా పిప్పల్యా సింధుజన్మనా,
పృథగ్లోహైస్సువర్ణేన వచయా మధుసర్పిషా. ౬
సితయా వా సమాయుక్తా సమాయుక్తా రసాయనమ్,
త్రిఫలా సర్వరోగఘ్నీ మేధాయుః స్మృతిబుద్ధిదా.

అతిమధురము, వెదురుప్పు, పిప్పలి, సైంధవలవణము, వెండి, రాగి, సీసము, త్ర
అయము, సువర్ణము, వస, తేనె, నెయ్యి, పంచదార వీనిలో దేనితోఁ గాని
ముగ త్రిఫలములను జేర్చిన నది రసాయనం బగును. దీనిని విధిప్రకారము సేవిం
సర్వరోగములు నివర్తించుటయ గాక ధారణాశక్తిఁగల బుద్ధి, ఆయువు, స్మృతి,
ఇవి కలుగును.

మండూకపర్ణ్యాదిరసాయనము.

మండూకపర్ణ్యాః స్వరసం యథాగ్ని
క్షీరేణ యష్టీమధుకస్య చూర్ణం,
రసం గుడూచ్యాస్సహమూలపుష్పాః
కల్కం ప్రయుంజీత చ శంఖపుష్ప్యాః
ఆయుః ప్రదాన్యామయనాశనానిబలాగ్ని వర్ణస్వరవర్ధనాని,
మేధ్యాని చైతాని రసాయనాని మేధ్యా విశేషేణ తు శంఖపు

మండూకబ్రహ్మి (సరస్వతియాకు) స్వరసమును ఆవుపాలతోను, అతిమ
చూర్ణమును, తిప్పతీఁగె స్వరసమును, వేళ్లు పుష్పములుగల శంఖపుష్పి కల్కమును
రాగ్ని బలానుగుణముగ సేవించిన ఆయుస్సు వృద్ధియగును. రోగములు హరించును
రబలము అగ్నిదీపనము మంచివర్ణము స్వరము కలుగును. ధారణాశక్తిఁ గలుగును.
ప్రత్యేక ప్రత్యేకముగ రసాయనముగ నుండును. పైచెప్పిన వానిలో శంఖపుష్పి
ముగ బుద్ధిశక్తులను కలుగఁజేయును.

శంఖపుష్పీరసాయనము.

నలదంకటురోహిణీ పయస్యా
మధుకం చందనసారివోగ్రగంధాః,

త్రిఫలా కటుకత్రయం హరిద్రే
సపటోలం లవణంచ తైస్సుపిష్టైః. ౪౯

త్రిగుణేన రసేన శంఖపుష్ప్యాః
స్సపయస్కం ఘృతనల్వణం విపక్వమ్,
ఉపయుజ్య భవేజ్జడోఽపి వాగ్మీ
శ్రుతధారీ ప్రతిభానవానరోగః. ౫౦

ఎట్టివేరు, కటుకరోహిణి, పిన్నమనుబాల, అతిమధురము, రక్తచందనము, నల్లసుగంధిపాల, వస, త్రిఫలములు, త్రికటుకములు, పసుపు, మ్రానిపసుపు, చేదుపొట్ల, సైంధవలవణము వీనిని సమముగ గ్రహించి చక్కఁగనూరి కల్కముచేసి ఒకఆఢక మావు నేతిలో కలిపి అందులో మూఁడు ఆఢకములు శంఖపుష్పిరసము ఒక ఆఢకము ఆవు పాలు చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిని పానము చేయించిన మూఢుఁడుగ నుండు వానికి కూడ మంచివాక్కు, ధారణాశక్తి, విశేషబుద్ధి, వికాసము, ఆరోగ్యము కలుగును.

## పంచారవిందఘృతము.

పేష్యైర్మృణాళబిసకేసరపత్రబీజైః
సిద్ధంసహేమశకలం పయసా చ సర్పిః,
పంచారవిందమితి తత్ప్రథితం పృథివ్యాం
ప్రభ్రష్టపౌరుషబలప్రతిభైర్నిషేవ్యమ్. ౫౧

తామరతూండ్లు, తామరగడ్డలు, తామర కేసరములు, తామరరేకులు, తామర విత్తులు వీనిని సమభాగములుగ జేర్చి కల్కముచేసి ఆవునేతిలో కలిపి నేతికి సమముగ ఆవుపాలు బోసి అందులో అపరంజిరేకులను జేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. ఇది పంచారవిందఘృత మనఁబడును. శుక్రము, బలము, బుద్ధి నశించియుండు వారికి దీని నిప్పించిన హితము కలుగును.

## చతుష్కువలయఘృతము.

యన్నాళకందదళకేసరవద్విపక్వం
నీలోత్పలస్య తదపి ప్రథితం ద్వితీయమ్,
సర్పిశ్చతుష్కువలయం సహిరణ్యపత్రం
మేధ్యం గవామపి భవేత్కిము మానుషాణాం. ౫౨

వల్లకలువ పుష్పము యొక్క తూండ్లు, గడ్డలు, రేకులు, కేసరములు వీనిని సమముగ గ్రహించి కల్కము చేసి ఆవునేతిలో కలిపి అందులో అపరంజిరేకులను జేర్చి నేతికి సమముగ ఆవుపాలను జేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. ఇది చతుష్కువలయ ఘృతమనఁబడును. దీని నిప్పించిన పశువులకు కూడ విశేషముగ బుద్ధి కౌశలము గలుగును. ఇఁక మనుజులమాట చెప్పనేల?

## బ్రాహ్మీరసాయనము.

బ్రాహ్మీ వచా సైంధవశంఖపుష్పీ
మత్స్యాక్షక బ్రహ్మసువర్చలేంద్రయ్యః,
వైదేహికా చ త్రియవాః పృథక్స్యుః
యవౌ సువర్ణస్య తిలో విషస్య. ౫౦
సర్పిషశ్చ పలమేకత ఏతద్యోజయేత్పరిణతే చ ఘృతాఢ్యమ్,
భోజనంసమధు వత్సరమేవం శీలయన్నధికధీస్మృతిమేధః. ౫౧
అతిక్రాంతజరావ్యాధితంద్రాలస్యశ్రమక్లమః,
జీవత్యబ్దశతం పూర్ణం శ్రీతేజః కాంతిదీప్తిమాన్. ౫౨
విశేషతః కుష్ఠకిలాసగుల్మ
విషజ్వరోన్మాదగరోదరాణి,
అథర్వమంత్రాది కృతాశ్చ
కృత్యాశ్శామ్యంత్యనేనాతిబలాశ్చ వాతాః. ౫౩

సరస్వతియాకు, వస, సైంధవలవణము, శంఖుపుష్పి, పొన్నగంటి, పత్తంగము, ఆదిత్యభక్తి, పాపర, పిప్పళ్లు యివి దినుసుకు మూఁడు యవలప్రమాణము అపరంజి రెండు యవల ప్రమాణము, విషము ఒక తిలప్రమాణము, ఆవు నెయ్యి ఒక పలము వీని నొకటిగచేర్చి నూరవలయును. దీని నిప్పించి అది జీర్ణమైనపిదప ఆవునెయ్యిని విశేషముగ చేర్చుకొని కొంచెము తేనెతోడ సంబాబియ్యపు అన్నమును భుజింపవలయును. ఇటుల ఒక సంవత్సరము సేవించిన విశేషబుద్ధి, స్మృతి, ధారణాశక్తి, సంపత్తు, తేజస్సు, కాంతి వీనితోఁ గూడి, ముసలితనము, రోగములు, ఆలస్యము, ఆయాసము, బడలిక ఇవి లేనివాఁడై నూరు సంవత్సరములు సంపూర్ణముగ జీవించును. మఱియు నీయౌషధముచే కుష్ఠము, కిలాసము, గుల్మము, విషము, జ్వరము, ఉన్మాదము, కృత్రిమవిషము, ఉదరరోగము, అథర్వమంత్రముచే జనించిన యుపద్రవములు దారుణములై వాతరోగములు ఇవి యన్నియు హరించును.

### నాగబలారసాయనము

శరన్ముఖే నాగబలాం పుష్యయోగే సముద్ధరేత్,
అక్షమాత్రం తతో మూలాచ్చూర్ణితా త్పయసాపిబేత్. ౫౪
లిహ్యాన్మధుఘృతాభ్యాం వా క్షీరవృత్తిరనన్నభుక్,
ఏవం వర్షప్రయోగేణ జీవేద్వర్షశతం బలీ. ౫౫

శరత్కాలారంభమునందు పుష్యనక్షత్రమున జిబిలికచెట్టువేళ్లను గ్రహించి చక్కఁగ చూర్ణముచేసి దానిని కర్షప్రమాణము ఆవుపాలలో కలిపిగాని లేక తేనె, నెయ్యి వీనిలో కలిపిగాని పానము చేయవలయును. అన్నమును భుజింపకూడదు. ఆవుపాలను మాత్రము పానము చేయవలయును. ఇటుల నొకసంవత్సరముచేసిన మనుజుఁడు బలిష్ఠుఁడై నూరుసంవత్సరములు జీవించును.

### గోక్షురకరసాయనము.

ఫలోన్ముఖో గోక్షురకస్సమూల
శ్ఛాయావిశుష్కస్సువిచూర్ణితాంగః,
సుభావితః స్వేన రసేన తస్మా
న్మాత్రాంపరాం ప్రాసృతికీం పిబేద్యః. ౫౬
క్షీరేణ తేనైవ చ శాలి మశ్నన్
జీర్ణే భవేత్స ద్విత్రులోపయోగాత్,
శక్తస్సురూప స్సుభగశ్శతాయుః
కామీ కకుద్మానివ గోకులస్థః. ౫౭

పండిన నేనుఁగుపల్లేరును సమూలముగ గ్రహించి నీడనెండించి చక్కఁగ చూర్ణముచేసి దానిని ఏనుఁగుపల్లేరురసముతో భావనచేసి మరల నీడనెండించి మెత్తగ చూర్ణముఁజేసి యాచూర్ణములో ప్రసృత(రెండుపలముల) పరిమితము ఆవుపాలలోకలిపి పానముచేసి యది జీర్ణమైనపిదప ఆవుపాలతో సంబావిన్యాపు అన్నమును భుజింపవలయును. ఇటుల పైచూర్ణమును ఇన్నూరుపలములు సేవించిన మనుజుఁడు మంచి శక్తి సౌందర్యము నూరుసంవత్సరము లాయుస్సు కామోద్దీపనము మదించిన యెద్దువంటి సంభోగశక్తికలవాఁడుగ నగును.

### వారాహీకందరసాయనము.

వారాహీకందమార్ద్రార్ద్రం క్షీరేణ క్షీరపః పిబేత్,

మాసం నిరన్నో మాసం చ క్షీరాన్నాదో జరాం జయేత్.

మిక్కిలి పచ్చినదగును వారాహీకందమును గ్రహించి ఆవుపాలతోనూరి ఒకమాసముపానముచేసి అన్నమును భుజింపక ఆవు పాలను మాత్రము త్రాగుచుండవలయును. పిదప నొకమాసమునను ఆవుపాలతో అన్నమును భుజింపవలయును. ఇటుల చేసిన మనుజునికి ముసలితనమే లేకుండును.

తత్కందశ్లక్ష్ణచూర్ణం వా స్వరసేన సుభావితమ్,
ఘృతక్షౌద్రప్లుతం లిహ్యాత్తత్పక్వం వా ఘృతం పిబేత్. ౫౯

వారాహీకందమును చక్కఁగచూర్ణముచేసి దానిరసములోనే చక్కఁగ భావన చేసి తేనె, నెయ్యి వీనిలోకలిపి నాకించినను లేక వారాహీకంద కల్కముతో పక్వముచేయఁబడిన ఘృతమును పానము చేయించినను ముసలితనము లేకుండును.

విదార్యాదిరసాయనయోగము.

తద్వద్విదార్యతిబలాబలామధుకవాయసీః,
*శ్రేయసీశ్రేయసీ యుక్తా పథ్యా ధాత్రీస్థిరా †స్మృతాః. ౬౦
మండూకీశంఖకుసుమావాజిగంధాశతావరీః,
ఉపయుంజీత మేధావీ వయఃస్థైర్యబలప్రదాః. ౬౧

నేలగుమ్ముడు, పేరాముట్టి, చిట్టాముట్టి, అతిమధురము, కాకమాచి, ఏనుఁగు పిప్పళ్ళు, చిఱుబొద్ది, కరక్కాయ, ఉసిరికపండ్లు, ముయ్యాకుపొన్న, మండూక బ్రహ్మి, శంఖపుష్పి, పెన్నేరుగడ్డ, పిల్లిపీచర అనువానిని ప్రత్యేకప్రత్యేకముగ వారాహీకందమునకుఁజెప్పినవిధముగ ఆవునెయ్యి పాలు వీనితోసేవించిన ధారణాశక్తి, యౌవనము, బలము కలుగును.

చిత్రమూలరసాయనయోగము.

యథా స్వం చిత్రకః పుష్పైర్జ్ఞేయః పీతసితాసితైః,
యథోత్తరం స గుణవాన్ విధినా చ రసాయనమ్. ౬౨
ఛాయాశుష్కం తతో మూలం మాసం చూర్ణీకృతం లిహన్,
సర్పిషా మధుసర్పిర్భ్యాం పిబన్ వా పయసా యతిః. ౬౩

* జీవంతీ. † 'అమృతాః' అని పాఠాంతరము.

అంభసా వా హితాన్నాశీ శతం జీవతి నీరుజః,
మేధావీ బలవాన్ కాంతో వపుష్మాన్ దీప్తపావకః. ౬౪
తైలేన లీఢో మాసేన వాతాన్ హంతి సుదుస్తరాన్,
మూత్రేణ శ్విత్రకుష్ఠాని పీత స్తక్రేణ పాయుజాన్. ౬౫

చిత్రమూలపు చెట్టు, పసుపువర్ణముతో గూడిన పుష్పముకలదిగ, తెల్లపుష్పము కలదిగ, నల్లపుష్పము కలదిగ మూఁడుతెఱఁగుల నుండును. వానిలో నుత్తరోత్తరము, నొకదానికన్న నొకటి మిగుల శ్రేష్ఠగుణము గలది. దానిని విధిప్రకార ముపయోగించిన నాయురారోగ్యబల బుద్ధి వికాసములు కలుగును. కావున చిత్రమూలపు వేళ్ళను గ్రహించి నీడ నెండించి చక్కఁగ చూర్ణముచేసి దాని నొకమాస మావునేతితోఁ గాని, ఆవునెయ్యి తేనె వీనితోఁగాని కలిపి నాకించి ఆవుపాలతో లేక మంచినీటితో పానము చేయించిగాని స్త్రీసంభోగమును వర్జించి, హితాహారములను భుజింపఁ జేయుచుండిన నా మనుజుఁడు రోగరహితుఁడుగ ధారణాశక్తిఁగల బుద్ధి బలము శరీరకాంతి పుష్టి అగ్నిదీపనము వీనితోఁ గూడినవాఁడుగ నూరుసంవత్సరములు జీవించును. మఱియు పైచిత్రమూలపువేళ్ల చూర్ణమును నువ్వుల నూనెలో కలిపి ఒకమాసము సేవించిన దారుణమైన వాత రోగములు, గోమూత్రములో కలిపి పానముచేసిన శ్విత్రకుష్ఠములు ఆవుమజ్జిగలో కలిపి పానముచేసిన గుదాంకురములు హరించును.

### భల్లాతకరసాయనవిధి.

భల్లాతకాని పుష్టాని ధాన్యరాశౌ నిధాపయేత్,
గ్రీష్మే సంగృహ్య హేమంతే స్వాదుస్నిగ్ధహిమైర్వపుః. ౬౬
సంస్కృత్య తాన్యష్టగుణే సలిలేఽష్టౌ విపాచయేత్,
అష్టాంశశిష్టం తత్క్వాథం సక్షీరం శీతలం పిబేత్. ౬౭
వర్ధయేత్ప్రత్యహంచాను తత్రైకైక మరుష్కరమ్,
సప్తరాత్రత్రయం యావత్త్రీణి త్రీణి తతః పరమ్. ౬౮
ఆచత్వారింశతస్తాని హ్రాసయేద్వృద్ధివత్తతః,
సహస్రముపయుంజీత సప్తాహైరితి సప్తభిః. ౬౯
యంత్రితాత్మా ఘృతక్షీరశాలిషష్టికభోజనః,
తద్వత్త్రిగుణితం కాలం ప్రయోగాంతేఽపి చాచరేత్. ౭౦
ఆశిషోలభతే పూర్వా వహ్నేర్దీప్తిం విశేషతః,

ప్రమేహక్రిమికుష్ఠార్శో మేదో దోషవివర్జితః. ౨౧

పండిన జీడిగింజలను గ్రీష్మకాలములో గ్రహించి ధాన్యరాశియందు బూడ్చి పెట్టవలయును. మధురముగ స్నిగ్ధముగ శీతలముగ నుండు నాహారాదులచే శరీరపుష్టిని జెందియుండు మనుజుఁడు హేమంతఋతువులో పైజీడిగింజల నెత్తి వానిలో ఎనిమిది జీడిగింజలను ఎనిమిదింత యుదకములో వైచి ఎనిమిదవభాగము మిగులునటుల కషాయము కాచి దానినెత్తికొని అందులో కొంచెమావుపాలను జేర్చి చల్లగ మొదటిదినము నందు పానము చేయవలయును. పిదప రెండవదినము మొదలుకొని ప్రతిదినమునందు నొక్కొక్క జీడిగింజచొప్పున హెచ్చించి యాగింజల నుదకములో వైచి పూర్వమువలె కషాయముకాచి, ఇరువదిదినములవఱకు ఆవుపాలలో కలిపి పానము చేయవలయును. పిదప నలువది దినములవఱకు మూఁడేసి జీడిగింజలచొప్పున హెచ్చించి కషాయము కాచి ఆవుపాలతో పానము చేయవలయును. పిదప జీడిగింజలను హెచ్చించినటులనే మరల తగ్గించి కషాయము కాచి, యావుపాలతో పానము చేయవలయును. ఇటుల నలువదితొమ్మిదిదినములలో వెయ్యి జీడిగింజల నుపయోగపఱచవలయును. పైజీడిగింజల నుపయోగించునపుడు ఆవుపాలు ఆవునెయ్యి వీనితో సంబావుబియ్యపు అన్నమును, అరువది దినములకు ఫలించెడు సంబావుబియ్యపు అన్నమును భుజింపుచు, స్త్రీసంభోగమును వర్జించి యుండవలయును. ఇటుల భల్లాతకసేవనము ముగించినపిదప నూటయాబైదినములవఱకు వైపథ్యములనే చేయుచుండవలయును. ఇటులఁజేసిన మనుజుఁడు ప్రమేహము, క్రిమిరోగము, కుష్ఠువు, అర్శస్సు, మేదోరోగము ఇవి లేనివాఁడై అగ్నిదీప్తిని ఆయురారోగ్య బలాదులను జెందును.

## భల్లాతకస్వరసము.

పిష్టస్వేదనమరుణైః పూర్ణం భల్లాతకైర్వ్యజర్ఝరితైః,
భూమినిఖాతే కుంభే ప్రతిష్ఠితం కృష్ణమృల్లిప్తమ్. ౨౨
పరివారితం సమంతాత్పచేత్తతో గోమయాగ్నినా మృదునా,
తత్స్వరసో యశ్చ్యవతే గృహ్ణీయాత్తం దినేఽన్యస్మిన్. ౨౩
అముముపయుజ్య స్వరసం మధ్వష్టమభాగికం ద్విగుణసర్పిః,
పూర్వవిధియంత్రితాత్మా ప్రాప్నోతి గుణాన్ స తానేవ. ౨౪

సంబావుబియ్యపుపిండిని నీళ్ళలో కలిపి మట్టికుండను లోపలఁబూసి దాని క్రింది భాగమున సన్నముగ రంధ్రముచేసి పండిన జీడిగింజల నలియఁగొట్టి కుండనిండుగ బోయవలయును. పిదప భూమిలోపల నొకకుండను బూడ్చి దానిపై జీడిగింజలకుండ నునిచి

నల్లమట్టితో చీలమన్ను జేసి కుండకు నలుప్రక్కల యేరుపిడకల నిండించి మృద్వగ్నిచే వండజలయును. పైకుండలో నుండి క్రిందికుండలో స్రవించి యుండు జీడితైలమును మరుదినమం దెత్తికొని ఒకభాగ మాతైలము ఎనిమిదవ భాగము తేనె, తేనెకు రెండింత లావు నెయ్యి యిటుల నొకటిగజేర్చి సేవించి, పూర్వశ్లోకములో జెప్పియుండు ప్రకారము పథ్యాహారమును భుజించిన ఆయురారోగ్యాదులు కలుగును.

## భల్లాతకలేహము.

పుష్టాని పాకేన పరిచ్యుతాని
భల్లాతకాన్యాఢకసమ్మితాని,
ఘృష్ట్వేష్టకాచూర్ణకణైర్జలేన
ప్రక్షాళ్య సంశోష్య చ మారుతేన. ౭౫
జర్జరాణి విపచేజ్జలకుంభే పాదశేషధృత గాలితశీతే,
తద్రసం పునరపి శ్రపయేత క్షీరకుంభసహితం చరణస్థే. ౭౬
సర్పిః పక్వం తేన తుల్యప్రమాణం
యుంజ్యాత్స్వచ్ఛం శర్కరాయా రజోభిః,
ఏకీభూతం తత్త్వజక్షోభణేన
స్థాప్యంధాన్యే సప్తరాత్రం సుగుప్తమ్. ౭౭
తమమృతరసపాకం యః ప్రగే ప్రాశమశ్న
న్ననుపిబతి యథేష్టం వారిదుగ్ధం రసం వా,
స్మృతిమతిబలమేధాసత్త్వసారైరుపేతః
కనకనిచయగౌరస్సోఽశ్నుతే దీర్ఘమాయుః. ౭౮

చక్కఁగముదిరి పండి తనంతట క్రిందరాలియుండు జీడిగింజలను ఒక ఆఢక ప్రమాణము గ్రహించి యిటికపొడిచే రాచి శుద్ధోదకముచే కడిగి గాలిలో నెండించి నలియఁగొట్టి ద్రోణిప్రమాణ ముదకములో వైచి చక్కఁగా పాకము చేసి పాదావశేషముగ కషాయము కాచి ఆకషాయమును గ్రహించి వడియఁగట్టి యదిచల్లారిన పిదప నారసమునందు ద్రోణిప్రమాణ మావుపాలను జేర్చి మరల పాదావశేషముగ కాచి దానియందు సమముగ ఆవునేతిని చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి సాత్మ్యప్రకృత్యాద్యనుగుణముగ పంచదారనుజేర్చి దించుకొని గరిటచే చక్కఁగ కలియఁబెట్టి ధాన్యరాశిలో నేడుదినములు చక్కఁగ బూడ్చి పెట్టి దానినెత్తికొని అమృతరసమువంటి పాకముగల యాలేహమును ప్రాతఃకాలమున జాఠరాగ్ని బలాద్యనుగుణముగ భుజించి పిదప మంచి

యుదకమును గాని ఆవుపాలను గాని మాంసరసమును గాని యథేష్టముగ పానముచేయ వలయును. ఇటులఁజేసిన పురుషునికి స్మృతి, బుద్ధిబలము, ధారణాశక్తి సత్త్వము,బంగారువంటి శరీరకాంతి, దీర్ఘాయుష్యము కలుగును.

### భల్లాతకతైలము.

ద్రోణేఽంభసో వ్రణకృతాం త్రిశతాద్విపక్వా
త్క్వాథాఢకేపలసమైస్తిలతైలపాత్రమ్;
తిక్తావిషాద్వయవరాగిరిజన్మతార్క్ష్యై
స్సిద్ధంపరం నిఖిలకుష్ఠనిబర్హణాయ. ౨౯

ద్రోణప్రమాణముదకములో మూఁడువందల జీడిగింజలను వైచి చక్కఁగ కాచి ఆఢకప్రమాణముగ దించుకొని అందులో నువ్వులనూనె ఒక ఆఢకము బోసి చేఁదు పొట్ల, వస, అతివస, క్షీరకాకోళి, శిలాజతు, రసాంజనము వీనిని దినుసుకు ఒకపలము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి దాని నుపయోగించిన కుష్ఠరోగములన్నియు నశించును.

### భల్లాతకోపయోగక్రమము.

సహామలకశుక్తిభిర్దధిసరేణ తైలేన వా
గుడేన పయసా ఘృతేన యవసక్తుభిర్వా సహ,
తిలేన సహమాక్షికేణ పలలేనసూపేన వా
వపుష్కరమరుష్కరం పరమమేధ్యమాయుష్కరమ్. ౩౦

జీడిగింజలను ఉసిరికపరుగుతోఁ గాని పెరుగుమీఁది మీఁగడతోఁ గాని నువ్వుల నూనెతోఁ గాని బెల్లముతోఁగాని ఆవుపాలతోఁ గాని నేతితోఁగాని యవలపిండితోఁ గాని నువ్వులతోఁగాని తేనెతోఁగాని మాంసముతోఁ గాని వండిన కందిపప్పుతోఁగాని చేర్చి సేవించిన శరీరపుష్టి మిక్కిలి బుద్ధివికాసము ఆయుర్వృద్ధియు కలుగును.

### భల్లాతకలక్షణము

భల్లాతకాని తీక్ష్ణాని పాకీన్యగ్నిసమాని చ,
భవంత్యమృతకల్పాని ప్రయుక్తాని యథా విధి. ౩౧

జీడిగింజలు తీక్ష్ణముగ జీర్ణశక్తిని కలుగఁజేయునవిగ అగ్నితో తుల్యమైన వీర్యముకలవిగనుండును. వానిని విధిప్రకారము సేవించిన అమృతతుల్యంబుగ నుండును.

### భల్లాతకగుణము.

కఫజో న స రోగోఽస్తి న విబంధోఽస్తి కశ్చన,

యం న భల్లాతకం హన్యాచ్ఛ్లేష్మమగ్నిబలప్రదమ్. ౮౨

మిక్కిలి జాఠరాగ్ని దీప్తిని కలుగఁజేయునట్టి జీడిగింజలచే హరింపఁబడకుండునట్టి కఫజరోగముగాని మలబంధరోగముగాని యొద్దియునులేదు.

వాతాతపికమున వర్జనీయములు.

వాతాతపవిధానేఽపి విశేషేణ వివర్జయేత్.
కుళుత్థదధిసూక్తాని తైలాభ్యంగాగ్నిసేవనమ్, ౮౩

వాతాతపికమును రసాయన ప్రయోగవిధి ననుసరించి జీడిగింజలను సేవించునపుడు ఉలవలు పెరుగు కలితైలాభ్యంగము మొదలగువానిని వర్జింపవలయును.

తువరకతైలసేవనక్రమము.

వృక్షాస్తువరకానామ పశ్చిమార్ణవతీరజాః,
వీచీతరంగవిక్షోభమారుతోద్ధూతపల్లవాః. ౮౪
తేభ్యః ఫలాన్యాదదీత సుపక్వాన్యంబుదాగమే,
మజ్జాః ఫలేభ్యశ్చాధాయ శోషయిత్వా ఽవచూర్ణ్యచ. ౮౫
తిలవత్పీడయేద్ద్రోణ్యాం క్వాథయేద్వా కుసుంభవత్,
తత్తైలం సంస్కృతం భూయః పచేదాసలిలక్షయాత్. ౮౬
అవతార్య కరీషే చ పక్షమాత్రం నిధాపయేత్,
స్నిగ్ధస్విన్నో హృతమలః పక్షాదుద్ధృత్య తత్తతః. ౮౭
చతుర్థభక్తాంతరితః ప్రాతః పాణితలం పిబేత్,
మంత్రేణానేన పూతస్య తైలస్య దివసే శుభే. ౮౮
"మజ్జాసార! మహావీర్య! సర్వాన్ధాతూన్ విశోధయ,
శంఖచక్రగదాపాణి స్త్వామాజ్ఞాపయతేఽచ్యుతః." ౮౯
తేనాస్యోర్ధ్వమధస్తాచ్చ దోషా యాంత్యసకృత్తతః,
సాయమస్నేహలవణాం యవాగూం శీతలాం పిబేత్, ౯౦
పంచాహాని పిబేత్తైలమిత్థం వర్జ్యాని వర్జయేత్,
పక్షం ముద్గరసాన్నాశీ సర్వకుష్ఠైర్విముచ్యతే. ౯౧

పశ్చిమసముద్రతీరంబున తువరకమను పేరుగల వృక్షములు జనించియుండును. వాని చిగుళ్లు సముద్రపుఅలలగాలిచే నెల్లపుడు చలించుచుండును. (ఇవియే నీరుడుగింజల మ్రానులు) అట్టివృక్షములనుండి చక్కఁగమాగిన ఫలములను వర్షాకాలమునందు

గ్రహించి వానిగింజలనుండు పప్పునుదీసి నీడ నెండించి చూర్ణముచేసి (గానుగలో నువ్వులనుండి నూనెతీయుచందంబున) గానుగనందుండి తైలముతీయవలయును. లేక కుసుమవిత్తులనుండి తైలమును దీయునటుల పైచూర్ణము నుదకములోవైచి కషాయముకాచి అందుండి తైలమును గ్రహింపవలయును. పిదప నానూనెను, పొయిమీఁదనిడి యుదకముకలియకుండునటుల కాచి దించుకొని చల్లారినపిదప యేఁబుపిడకలరాశిలో పదునైదు దినములవఱకు పూడ్చి పెట్టవలయును. యంత్రమునుండి తీయఁబడిన తైలమున జలసంబంధముండదు. కావున దానినిమాత్రము కాచఁబనిలేదు. పిదప నాతైలము నెత్తికొని—

"మజ్జాసారమహావీర్య........తేచ్యుతః"

అను మంత్రముచే నభిమంత్రించి స్నేహస్వేదకర్మలచే శుద్ధమైన శరీరముగల రోగికి ప్రాతఃకాలంబున కర్షప్రమాణ మిప్పించిన వమనవిరేచనంబులై దోషములు బయలువెడలును. పిదప సాయంకాలంబున నెయ్యి మొదలగు స్నేహములు, లవణములు వీనిని వర్జించి యవాగు అనుగంజిని చల్లగ పానము జేయించవలయును. ఈప్రకారము ఐదు దినములు పైతైలమును పానము జేయించి అపథ్యాహారములను వర్జించునటులంజేసి దానికి పిదప పదునైదు దినములవఱకు పెసలకట్టులతో సంబాబియ్యమన్నమును భుజింపఁజేయుచుండవలయును. ఇటులఁజేసిన దారుణమైన కుష్ఠములు నివర్తించును.

తదేవ ఖదిరక్వాథే త్రిగుణే సాధుసాధితమ్,
నిహితం పూర్వవత్పక్షం పిబేన్నాసం సుయంత్రితః. ౯౨
తేనాభ్యక్తశరీరశ్చ కుర్వన్నాహార మీరితమ్, *
అనేనాశు ప్రయోగేణ సాధయేత్కుష్ఠినం నరమ్ ౯౩
సర్పిర్మధుయుతం పీతం తదేవ ఖదిరాద్వినా,
పక్షమాంసరసాహారం కరోతి ద్విశతాయుషమ్. ౯౪
తదేవ నస్యే పంచాశద్దివసానుపయోజితమ్,
† వపుష్మంతం శ్రుతధరం కరోతి త్రిశతాయుషమ్. ౯౫

---

* భిన్నస్వరం రక్తనేత్రం శీర్ణాంగం క్రిమిభక్షితమ్.

వికారస్వరము కలవాఁడును, రక్తవర్ణముకల నేత్రములు కలవాఁడును, శిథిలమునొందిన అవయవములు కలవాఁడును క్రిములచే భక్షింపఁబడిన యవయవములు గలవాఁడును నైన కుష్ఠరోగికి పైతైలము నిప్పించవలయును.

† వలీపలితనిర్ముక్తం స్థిరద్విజకచశ్రుతిమ్.

వళులు, తెలవెండ్రుకలు నెరపు యివిలేనివాఁడును, దంతములు, వెండ్రుకలు ఇవి దృఢముగ నుండువాఁడును, శ్రవణశక్తికలవాఁడును నగును.

పైజెప్పిన తువరకతైలమును మూఁడింతల చంద్రకషాయములో జేర్చి తైలపాక విధిగ పక్వముజేసి యెరుమపిడకలరాశిలో పదునైదుదినములు పూడ్చిపెట్టి పిదప దాని నెత్తి దేహబలాద్యనుగుణముగ ఒకమాసమువఱకు పానముజేయించి యవాగు అనుగంజిని పథ్యముగా నిప్పించుచుండవలయును. ఆతైలముచేతనే శరీరమున కభ్యంజనము జేయించ వలయును. ఇట్లుజేసిన కుష్ఠరోగము అతిశీఘ్రముగ నివర్తియగును. మఱియు పైజెప్పిన తువరకతైలమును ఆవునెయ్యి తేనె వీనితోడ జాఠరాగ్నిబలానుగుణముగ పదునైదుదినములు పానముజేయించి మాంసరసముతోడ ఆహారరసమును భుజింపఁజేసిన మనుజుఁడు రెండువందల సంవత్సరములు జీవించును. పై తైలముచే యేఁబదిదినములవఱకు నస్యము చేయించిన మనుజునికి సుందరమైనశరీరము,ధారణాశక్తియుకల్గి మూఁడువందల సంవత్సరము లాయువుకలుగును.

## పిప్పలీరసాయనవిధానము.

పంచాష్టౌ సప్త దశ వా పిప్పలీర్మధుసర్పిషా,
రసాయనగుణాన్వేషీ సమామేకాం ప్రయోజయేత్. ౯౬

ఐదు లేక ఏడు లేక ఎనిమిది లేక పది పిప్పళ్లను తేనె ఆవునెయ్యి వీనితోడ నొకసంవత్సరమువఱకు సేవించిన ఆయురారోగ్యాదులు కలుగును.

తిస్రస్తిస్రస్తు పూర్వాహ్ణే భుక్త్వాగ్రే భోజనస్య చ,
పిప్పల్యఃకింశుకక్షారభావితా ఘృతభర్జితాః. ౯౭
ప్రయోజ్యా మధుసంమిశ్రా రసాయనగుణైషిణా,

పిప్పళ్లు మోదుగుక్షారములో భావనచేసి పిదప నేతితోవేయించి వానిలో మూఁడుపిప్పళ్ళను తేనెతోడ ప్రాతఃకాలమునందును, మూఁడు పిప్పళ్లను భోజనమునకు ముందును, మూఁడుపిప్పళ్లను భోజనానంతరమును సేవించిన రసాయనమువలె గుణము నిచ్చును.

## వర్ధమానపిప్పలీరసాయనము.

క్రమవృద్ధ్యా దశాహాని దశ పైప్పలికం దినమ్. ౯౮
వర్ధయేత్పయసా సార్ధం తథైవాపనయేత్పునః,
జీర్ణౌషధశ్చ భుంజీత షాష్టికం క్షీరసర్పిషా. ౯౯
పిప్పలీనాం సహస్రస్య ప్రయోగోఽయం రసాయనమ్,
పిష్టాస్తా బలిభిః పేయాశ్శృతా మధ్యబలైర్నరైః. ౧౦౦
తద్వచ్ఛాగదుగ్ధేన ద్వే సహస్రే ప్రయోజయేత్,

మొదటిదినమునందు పది, రెండవదినము ఇరువది, మూఁడవదినము ముప్పది ఇటుల పదిదినములవఱకు దినంఒకటికి పది పిప్పళ్లచొప్పున హెచ్చించి ఆపిప్పళ్లను ఆవుపాలతో భుజింపవలయును. పదునొకండవదినము తొంబది, పన్నిండవదినము ఎనుబది, పదుమూఁడవ దినము డెబ్బది ఇటుల దినముఒకటికి పదిపిప్పళ్లచొప్పున తగ్గించి ఇరువదిదినములవఱకు పిప్పళ్లను ఆవుపాలతో భుజింపవలయును. ఎట్లనగా:—మిక్కిలి బలముగలవారు పైపిప్పళ్లను ఆవుపాలతోనూరి పానముచేయవలయును. మధ్యమబలముగలవారు పైపిప్పళ్లను నుదకములో వైచి కషాయముకాచి పానముచేయవలయునని భావము. పైపిప్పళ్ళు జీర్ణమైనపిదప అరువదిదినములకు ఫలించెడు సంబావుబియ్యపు అన్నమును ఆవుపాలు నెయ్యి వీనితోడ భుజింపవలయును. ఇదియ సహస్రపిప్పలీ ప్రయోగమనఁబడును. ఉత్కృష్టమైన రసాయనము, ఇటులనే మేకపాలతో రెండువేల పిప్పళ్లను సేవింపవలయును.

**పిప్పలీరసాయనఫలము.**

ఏభిః ప్రయోగైః పిప్పల్యాః కాసశ్వాసగళగ్రహాన్. ౧౦౧
యక్ష్మమేహగ్రహణ్యర్శః పాండుత్వవిషమజ్వరాన్,
ఘ్నంతి శోఫం వమిం హిధ్మాం ప్లీహానం వాతశోణితమ్. ౧౦౨

పైచెప్పిన ప్రకారము పిప్పళ్లను సేవించినయెడ కాసము, శ్వాసము, గళగ్రహము, క్షయము, ప్రమేహము, గ్రహణి, అర్శస్సు, పాండురోగము, విషమజ్వరము, వాపు, వాంతి, ఎక్కిళ్ళు, ప్లీహము, వాతరక్తము ఇవియన్నియు హరించును.

**పిప్పల్యాయసలేపనము.**

బిల్వార్ధమాత్రేణ చ పిప్పలీనాం
పాత్రం ప్రలింపేదయసో నిశాయామ్,
ప్రాతః పిబేత్తత్సలిలాంజలిభ్యాం
వర్షం యథేష్టాశనపానచేష్టః. ౧౦౩

రెండు కర్షములపిప్పళ్ల నుదకముతో చక్కఁగనూరి సాయంకాలము ఇనుపపాత్రకు లోభాగమునందుబూసి మరుదినముదయమున పాత్రకుఁబూసియుండు దానిని గీఁకియెత్తికొని సేవించి రెండుదోసిళ్ళజలమును పానముచేసి పిదప యథేష్టముగ (పథ్యనియమములేక) అన్నపానాదులను సేవింపవలయును. ఇటుల నొకసంవత్సరకాలము సేవించిన పైజెప్పినరీతిగ కాసశ్వాసాదిరోగములన్నియు నివర్తించును.

**శుంఠ్యాద్యాయసలేపనము.**

శుంఠీవిడంగత్రిఫలాగుడూచీయష్టీహరిద్రాతిబలాబలాశ్చ,

ముస్తాసురాహ్వాగరుచిత్రకాశ్చ సౌగంధికం పంకజముత్పలాని.
ధవాశ్వకర్ణాసనబాలపత్రసారా స్తథా పిప్పలివత్ప్రయోజ్యాః,
లోహోపలిప్తాః పృథగేవ జీవేత్సమాశ్శతం వ్యాధిజరావిముక్తః.
క్షీరాంజలిభ్యాంచరసాయనాని యుక్తాన్యమూన్యాయసలేపనాని,
కుర్వంతి పూర్వోక్తగుణప్రకర్ష మాయుఃప్రకర్షం ద్విగుణం తతశ్చ.

శుంఠి, వాయువిడంగములు, త్రిఫలము, తిప్పతీఁగె, అతిమధురము, పసుపు, పేరాముట్టి, చిట్టాముట్టి, తుంగముస్తలు, దేవదారు, అగరు, చిత్రమూలము, నల్లకలువపువ్వు, చెంగలువపూలు, తామరపూలు, చండ్ర, ఏపి, వేగిస అనువానిచిగుళ్ళు వీనిని ప్రత్యేకప్రత్యేకముగ పైచెప్పినపిప్పళ్ళవలె నూరి రాత్రియినుపపాత్రకుఁబూసి మరుదిన ముదయమున నీ పిరియొత్తికొని రెండుదోసెళ్ళు ఆవుపాల అనుపానముతో సేవించిన మనుజుఁడు రోగము ముసలితనము లేనివాఁడై నూరుసంవత్సరములు జీవించును. మనుజుఁడు పైచెప్పిన ఆయసలేపరసాయనములను ఆవుపాలతో సేవించిన విశేషగుణములు కలుగుటయేగాక (రెండునూరుల) సంవత్సరములు జీవించును.

## సోమరాజీరసాయనము.

అసనఖదిరయూషైర్భావితాం సోమరాజీం
మధుఘృతశిఖిపథ్యాలోహచూర్ణైరుపేతామ్,
శరదమవలిహానః పారిణామా న్వికారాం
స్త్యజతి మితహితాశీ తద్వదాహారజాతాన్. ౧౦౭

వేగిస, చండ్ర వీనికషాయములతో భావనచేయఁబడిన బావంచిత్తులను తేనె, నెయ్యి, చిత్రమూలము, కరక్కాయచూర్ణము, ఉక్కుభస్మము వీనితోడ నొకసంవత్సరకాలము సేవింపుచు హితాహారములను మితముగ భుజింపుచుండిన ముసలితనమువలన జనించిన వికారములు ఆహారదోషమువలన జనించిన రోగములును హరించును.

## కుష్ఠమునందు సోమరాజీసేవనము.

తీవ్రేణ కుష్ఠేన పరీతమూర్తిర్యః సోమరాజీం నియమేన ఖాదేత్,
సంవత్సరంకృష్ణతిలద్వితీయాం ససోమరాజీం వపుషాఽతిశేతే.

దారుణమైన కుష్ఠము సర్వశరీరమునందును వ్యాపించియుండును గావున అట్టి రోగముగలవాఁడు బావంచిత్తులను నల్లనువ్వులతోడ నొకసంవత్సరము పర్యంతము తప్పక భక్షింపుచుండిన క్రూరమైన కుష్ఠముమాని చంద్రునివంటి కాంతిగల శరీరముగలవాఁడగును.

### కుష్ఠమున సోమరాజీసారసేవనము.

యే సోమరాజ్యావితుషీకృతాయా
శ్చూర్ణైరుపేతా త్పయసస్సుజాతాత్,
ఉద్ధృత్య సారం మధునా లిహంతి
తక్రం తదేవానుపిబంతి చాంతే. ౧౦౯
కుష్ఠినః కుథ్యమానాంగా స్తే జాతాంగుళినాసికాః,
భాంతి వృక్షా ఇవ పునః ప్రరూఢనవపల్లవాః*. ౧౧౦

దారుణమైన కుష్ఠరోగమువలన నవయవములు కుళ్లును. అందుచే వేళ్ళు ముక్కు యివి లోనికీడ్చుకొనిపోవును. అట్టివారికి బావంచివిత్తుల పైపొట్టుతీసి చూర్ణముచేసి ఆవుపాలలో కలిపి చక్కఁగకాచి పేరఁబెట్టి చిలికి వెన్ననెత్తి దానిని తేనెలోకలిపి నాకించి పిదప నామజ్జిగను పానముచేయించినయెడ వారికి కుష్ఠరోగమునివర్తించి వృక్షములు చిగిరించుచందంబున మరల వేళ్ళు ముక్కు చిగిరించి మునుపటివలెచక్కఁబడును.

### లశునరసాయనవిధి.

శీతవాతహిమదగ్ధతనూనాం స్తబ్ధభుగ్నకుటిలవ్యథితాస్థ్నామ్,
భేషజస్య పవనోపహతానాం వక్ష్యతే విధిరతో లశునస్య. ౧౧౧

చల్లగాలి, మంచు వీనిచే పీడింపఁబడిన శరీరముగలవారికిని, స్తబ్ధముగ నీడ్చుకొనునదిగ వంకరగ నొప్పితోఁగూడినదిగ నుండు యెముకలుగలవారికిని, వాతరోగముచే బీడింపఁబడిన వారికిని, హితకరముగనుండు వెల్లుల్లి కల్పము నిఁకవచించెద.

### లశునోత్పత్తిక్రమము.

రాహో †రమృతచౌర్యేణ లూనా ద్యే పతితా గళాత్,
అమృతస్య కణా భూమౌ తే రసోనత్వమాగతాః. ౧౧౨
ద్విజా నాశ్నంతి తమతో దైత్యదేహ సముద్భవమ్,
సాక్షాదమృతసంభూతేర్గ్రామణీస్సురసాయనమ్. ౧౧౩

రాహువు దొంగతనంబున నమృతపానము చేయుటచే వాని కంఠమును విష్ణువు చక్రముచే ఛేదించెను. అపుడు వానినోటినుండి భూమిపైఁ బడిన యమృతకణము వెల్లుల్లి గజనించె. అసురశరీరమునందుండి జనించినందున నావెల్లుల్లిని బ్రాహ్మణులు భుజింపక

* శ్లో. తే కుష్ఠినః పక్షహరిద్రనేత్రావిశీర్యమాణాంగుళి నాసికాగ్రాః,
విహాయవైరూప్యమవాప్యరూపంపునః ప్రరూఢా ఇవ భాంతి వృక్షాః.

† రచ్యుతచక్రేణ భిన్నా,

నిషేధించిరి. వెల్లుల్లి అమృతమువలన బుట్టినది యగుటంజేసి యాది రసాయనములలో మిగుల శ్రేష్ఠము. కంఠము తెగిన రాహువును బ్రతికింపఁజేయ సమర్థమగుటంజేసి రసాయనములలో వెల్లుల్లి మిక్కిలి శ్రేష్ఠమని భావము.

## లశునసేవనకాలము.

శీలయేల్లశునం శీతే వసంతేఽపి కఫోల్బణః,
ఘనోదయేఽపి వాతార్తస్సదా వా గ్రీష్మలీలయా. ౧౧౪
స్నిగ్ధశుద్ధతనుశ్శీతమధురోపస్కృతాశయః,
తదుత్తంసావతంసాభ్యాం చర్చితానుచరాజిరః. ౧౧౫

మనుజుఁడు స్నేహకర్మను చేయించుకొని వమనవిరేచనంబులచే పరిశుద్ధశరీరము గలవాఁడై శీతలముగ మధురముగనుండు ఆహారములను భుజింపుచు హేమంత శిశిరఋతువులయందు వెల్లుల్లిని సేవించవలయును. కఫాధిక్యముగలవాఁడు వసంతఋతువునందును వాతాధిక్యముగలవాఁడు వర్షఋతువునందును వెల్లుల్లిని సేవించవలయును. వాతరోగముగలవాఁడు అన్ని ఋతువులయందును గ్రీష్మర్తుచర్యాప్రకరణమున చెప్పియుండు నియమము నవలంబించి వెల్లుల్లిని సేవింపవలయును. ఆసమయమున వానిసేవకులు వెల్లుల్లిని శిరమునందును చెవులయందును అవతంసముగ నునిచికొని మందిరాంగణమున సంచరించుచుండవలెను.

## లశునసేవనక్రమము.

తస్యకందాన్వసంతాంతే హిమవచ్ఛకదేశజాన్,
అపనీతత్వచో రాత్రౌ తీమయేన్మదిరాదిభిః. ౧౧౬
తత్కల్కస్వరసం ప్రాతశ్శుచితాం తవపీడితమ్,
మదిరాయాస్సురాధాయాస్త్రిభాగేన సమన్వితమ్ ౧౧౭
మద్యస్యాన్యస్య తైలస్య మస్తునః కాంజికస్య వా,
తత్కాల ఏవ వా యుక్తం యుక్తమాలోచ్య మాత్రయా
తైలసర్పిర్వసామజ్జక్షీరమాంసరసైః పృథక్,
క్వాథేన వా యథావ్యాధి రసం కేవలమేవ వా. ౧౧౮
పిబేద్గండూషమాత్రం ప్రాక్కంఠనాడీవిశుద్ధయే,

హిమవత్పర్వతమునందును శకదేశమునందును జనించిన వెల్లుల్లిగడ్డలను వసంతకాలాంతమున గ్రహించి పైపొట్టుతీసిన వెల్లుల్లిపాయలను రాత్రియందు మద్యాదులలో

పడెయకట్టి యారసమును మూఁడింతలు మదిరయను మద్యములోఁగాని యితరమ
లలోఁగాని నువ్వులనూనెలోఁగాని పెరుగుమీఁది మీఁగడలోఁగాని కలిలో
కలిపి రోగిశరీరబలాద్యనుగుణముగ పానము చేయించవలయును. వెల్లుల్లిని నువ్వుల
నెయ్యి కొవ్వు మజ్జ ఆవుపాలు మాంసరసము వీనిలో దేనితోనైనను లేక వెల్లుల్లిరస
ప్రత్యేకముగనైనను ఆయారోగానుగుణముగ కంఠనాడి శుద్ధియగుటకై తొలుతగ
షపరిమాణము (పుక్కిటినిండుకు) పానముచేయించవలయును.

లశునసేవనయందు సేకాదులు.

ప్రశతం స్వేదనం చాను వేదనాయాం ప్రశస్యతే.
శీతాంబుసేకః సహసా వమిమూర్ఛాయయోర్ముఖే,

వెల్లుల్లిరసమును పానముచేయువానికి వేదన కలిగినచో శరీరమునందు స్వేదః
చేయించవలయును. ఆరోగికి వటులచేయుటచే వాంతి మూర్ఛకలిగిన శీఘ్రముగ మ
నందు చల్లని నీళ్ళను చల్లవలయును.

శేషం పిబేత్ల్కమాపాయే స్థిరతాం గత ఓజసి.

బడలికనివర్తించి ఓజస్సు స్థైర్యమును జెందియుండునపుడు శేషించియుండు
రసమును పానము చేయించవలయును.

లశునసేవనయందు శీతానులేపనము.

విదాహపరిహారాయ పరం శీతానులేపనః,
ధారయేత్సాంబుకణికా ముక్తాః కర్పూరమాలికాః.

వెల్లుల్లిని సేవించుటవలన జనించిన తాపము (ఒడలిపైమంట) శమించుటకై
నుండు చందనమును బూసికొనవలయును. జలబిందుసహితముగనుండు ముత్యాహార
పచ్చకర్పూరము వీనిని ధరింపవలయును.

లశునరసప్రమాణము.

కుడవోఽస్య పరామాత్రా తదర్ధం కేవలస్య తు,
పలం పిష్టస్య తన్మజ్జస్సుభక్తం ప్రాక్చ శీలయేత్.

సురయను మద్యముతో చేర్చఁబడిన వెల్లుల్లి రససేవనయందు ఒకపలము ఉ
మాత్ర. వెల్లుల్లిరసమును మాత్రము సేవించుటయందు అరపల ముత్తమమాత్ర.
పాయలను చక్కఁగనూరి చేసినకల్క సేవనయందు ఒకపల ముత్తమ మాత్ర. వీనిని
రముతోడను ఆహారమును భుజించుటకుముందును సేవింపవలయును.

లశునసేవనయందు పథ్యాహారము.

జీర్ణశాల్యోదనం జీర్ణే శంఖకుందేందుపాండురమ్,
భుంజీత యూషైః పయసా రసైర్వాధన్వచారిణామ్.

పైచెప్పియుండు ప్రకారము వెల్లుల్లిని సేవించవలయును. అది జీర్ణమైన పిదప శంఖము, కుందపుష్పము, చంద్రుఁడు వీనివలె తెల్లగనుండు పాతసంబాఖ్రబియ్యపు అన్నమును కట్టులతోడను ఆవుపాలతోడను లేక జాంగలదేశజంతువుల మాంసరసములతోడను భుజింపవలయును.

## లశునసేవనయందు పానము

మద్యమేకం పిబేత్తత్ర తృట్ప్రబంధే జలాన్వితమ్,
* అమద్యపస్త్వారనాళం ఫలాంబు పరిసిక్థికామ్. ౧౨౫
తత్కల్కం వా సమఘృతం ఘృతపాత్రే ఖజాహతమ్,
స్థితం దశాహాదశ్నీయాత్తద్వద్వా వసయాసమమ్. ౧౨౬

వెల్లుల్లిని సేవించినవారికి దప్పికలిగినచో మద్యములో నుదకమునుకలిపి పానము చేయించవలయును. రోగి మద్యపానాభ్యాసములేని వాఁడుగనుండినచో వానికి ఫలాంబువు (త్రిఫలకషాయము)నుగాని కలినిగాని పరిసిక్థికనుగాని పానము చేయించవలయును. లేక వెల్లుల్లి కల్కములో సమముగ ఆవునేతిని కలిపి నేతికుండలో బోసి గరిటతో చక్కఁగ కలియఁబెట్టి పదిదినములుంచి పిదప దానిని పానము చేయించవలయును. లేక పైకల్కములో క్రొవ్వును కలిపి పదిదినములు నేతికుండలో బోసిపెట్టి పిదప దానిని పానముచేయించవలయును.

## లశునవిమర్దకాద్యుపయోగము.

వికంచుకప్రాజ్యరసోనగర్భాన్
సశూల్యమాంసాన్ వివిధోపదంశాన్,
విమర్దకాన్వా ఘృతశుక్తయుక్తాన్
ప్రకామమద్యాల్లఘుతుష్టమశ్నన్. ౧౨౭

పొట్టుతీసిన వెల్లుల్లిపాయల నధికముగ చేర్చఁబడినదిగ శూలముతో పక్వముచేయఁబడిన మాంసముతోఁగూడినదిగ అనేకవిధ ఉపదంశములు కలవిగనుండు విమర్దకములను ఘృతశుక్తి సహితముగ భుజింపవలయును.

## వాతమునందు లశునావశ్యకత్వము.

పిత్తరక్తవినిర్ముక్తసమస్తావరణావృతే,
శుద్ధే వా విద్యతే వాయౌ న ద్రవ్యం లశునాత్పరమ్. ౧౨౮

పిత్తరక్తము తప్ప ఇతరదోషసంబంధముకలిగిన వాతమునందును శుద్ధవాతమునందును వెల్లుల్లికి సమమైన యౌషధ మెద్దియులేదు.

---

* శ్లో॥ అమద్యపాన్ మస్తుఫలాంబుశక్రసువంతిశోమంచసుగంధిశీతం,
సద్వీరకం జాంగలజం రసం వా తుషోదకంవా పరిసిక్థకం వా. అనిపాఠాన్తరము.

లశునని షేధము.

ప్రియాంబుగుడదుగ్ధస్య మాంసమద్యామ్లవిద్విషః,
అతితీక్ష్ణోరజీర్ణం చ రసోనో వ్యాపదే ధ్రువమ్. ౧౨౯

నీళ్లు, బెల్లము, పాలు వీనియందిచ్ఛగలవారికిని, మాంసము, మద్యము, ఆమ్లరసముగలవస్తులు వీనియందుద్వేషము గలవారికిని, అజీర్ణమును సహింపకుండు వారికిని వెల్లుల్లి ఆపదను కలుగఁజేయును.

లశునసేవనయందు విరేచనము.

పిత్తకోపభయాదంతే యుంజ్యాన్మృదు విరేచనమ్,
రసాయనగుణానేనం పరిపూర్ణాన్ సమశ్నుతే. ౧౩౦

వెల్లుల్లిని సేవించినపిదప రోగికి పిత్తప్రకోపము కలుగకుండుటకై వైద్యుఁడు మృదువైన విరేచనౌషధముల నిప్పించవలయును. ఇటులఁజేసిన మనుజునికి పరిపూర్ణమైన రసాయనగుణంబులు ఫలించును:—

“ ఆమాంబుపానేక్షువికారమత్స్యయానాధ్వ వాతాతపభాష్యచింతాః,
స్వప్నం దివా జాగరణం నిశాసు పిష్టంవ్యవాయం దధిచాత్ర నేచ్ఛేత్.”

రసాయనవిధిప్రకారము వెల్లుల్లిని సేవించువారు శీతోదకపానము, బెల్లము, శర్కర మొదలగునవి, మత్స్యములు, మద్యపానము, మార్గసంచారము, యెండ, గాలి, అధికసంభాషణము, మనశ్చింత, పగటినిద్ర, రాత్రులయందు జాగరణము, పిండిచే చేయఁబడిన భక్ష్యములు, స్త్రీసంభోగము, పెరుగు వీనిని వర్జింపవలయునని కోశాంతరములయం దధికపాఠము కనఁబడుచున్నయది.”

శిలాజతు కల్పము.

శిలాజతూత్పత్తిక్రమము.

గ్రీష్మేఽ* ర్కతప్తాగిరయో జతుతుల్యం వమంతి యత్,
హేమాదిషడ్ధాతురసం ప్రోచ్యతే తచ్ఛిలాజతు. ౧౩౧

గ్రీష్మఋతువునందు పర్వతములు సూర్యునిచే తపింపఁబడి అందుండి బంగారు మొదలగు ఆఱులోహములరసములు లక్కవలె స్రవించును. ఇది శిలాజతువనఁబడును. (బంగరు, వెండి, రాగి, ఇనుము, సీసము, తగరము అను నీయాఱుధాతువులవలన సరూపముగ శిలాజతువు పుట్టుననిభావము )

* గ్రీష్మేఽతప్తా.

### శిలాజతుగుణము.

*సర్వం చ తిక్తకటుకం నాత్యుష్ణం కటుపాకతః,
ఛేదనం చ విశేషేణ లౌహం తత్ర ప్రశస్యతే. ౧౩౨

బంగారు మొదలగు ఆఱుధాతువులచే జనించిన శిలాజతువు చేదుగ కారముగ కొంచెము ముష్ణముగ పాకమువలన కటురసముగలదిగ వాతాదిదోషములను ఛేదించునదిగ నుండును. వానిలో నినుమువలన బుట్టిన శిలాజతు మిక్కిల ప్రశస్తమైనది.

### శ్రేష్ఠమైనశిలాజతులక్షణము.

గోమూత్రగంధి కృష్ణం గుగ్గుల్వాభం విశర్కరం మృత్స్నమ్,
స్నిగ్ధమనమ్లకషాయం మృదు గురు చ శిలాజతు శ్రేష్ఠమ్. ౧౩౩

ఆవుపంచితమువంటి వాసనగలదియు, నలుపువర్ణము గలదియు, గుగ్గిలమువంటి కాంతిగలదియు, ఇసుక మట్టితగలదియు, స్నిగ్ధముగ నుండునదియు, పుల్లగ వగరుగ లేకుండునదియు, మెత్తగ వగరుగ నుండునదియునగు శిలాజతువు శ్రేష్ఠము.

### శిలాజతుభావనాక్రమము.

వ్యాధివ్యాధితసాత్మ్యం సమనుస్మరన్ భావయేదయఃపాత్రే,
ప్రాక్కేవలజలధౌతం శుష్కం క్వాథైస్తతో భావ్యమ్. ౧౩౪

రోగముయొక్క సాత్మ్యము రోగియొక్క సాత్మ్యము వీనిని చక్కగ పర్యాలోచించి మొదట శిలాజతువును మంచినీళ్ళతో చక్కగకడిగి యెండించి పిదపదానిని యినుపపాత్రలో వైది కషాయములతో భావన చేయవలయును.

### శిలాజతుభావనాకషాయము.

సమగిరిజమష్టగుణితే నిఃక్వాథ్యం భావనౌషధం తోయే,
తన్నిర్యూహేఽష్టాంశే పూతోష్ణే ప్రక్షిపేద్గిరిజమ్. ౧౩౫
తత్సమరసతాం యాతం సంశుష్కం ప్రక్షిపేద్రసే భూయః,
స్వైః స్వైరేవం క్వాథైర్భావ్యం వారాన్ భవేత్సప్త. ౧౩౬

శిలాజతు, భావనౌషధములు వీనిని సమముగ గ్రహించి ఎనిమిదింత లుదకము

---

* శ్లో. సర్వదోషప్రశమనం సర్వరోగవినాశనమ్,
శిలాభ్యో యస్య యజ్జాతం ధాతోస్తత్తద్గుణం వదేత్.

శిలాజతువు వాతాదిదోషప్రకోపము, సమస్తరోగములు వీనిని పోగొట్టును. ఏధాతువునుండి జనించునో ఆధాతువుగుణము శిలాజతువునకు కలుగును.

లో వైచి ఎనిమిదవభాగము మిగులునటుల కషాయము కాచి వడియఁగట్టి వేడిగనుండు నాకషాయములో శిలాజతువును వేయవలయును. నానినపిదప ఆశిలాజతువు నెండించి మరల నాకషాయములో వేయవలయును. ఇటుల నాయాకషాయములలో నేడుపర్యాయములు భావన చేయవలయును.

### శిలాజతుప్రయోగక్రమము.

అథ స్నిగ్ధస్య శుద్ధస్య ఘృతం తిక్తకసాధితమ్,
త్ర్యహం యుంజీత గిరిజమేకైకేన తథా త్ర్యహమ్. ౧౩౭
ఫలత్రయస్య యూషేణ పటోల్యా మధుకస్య చ,
యోగయోగ్యం తతస్తస్య కాలాపేక్షం ప్రయోజయేత్. ౧౩౮
శిలాజమేవం దేహస్య భవత్యత్యుపకారకమ్,
గుణాన్ సమగ్రాన్కురుతే సహసావ్యాపదం న చ. ౧౩౯

స్నేహకర్మను చేయించికొనిన వాఁడును, వమనవిరేచనంబులను చేసికొని శుద్ధమైన శరీరముగల వాఁడును నగురోగికి తొలుత తిక్తఘృతమును మూఁడుదినము లిప్పించి పిదప శుద్ధశిలాజతువును మూఁడుదినములును, త్రిఫల కషాయముతోడను మూఁడుదినములును, చేఁదుపొట్ల కషాయముతోడను మూఁడుదినములు అతిమధుర కషాయముతోడ నిప్పించవలయును. పిదప యుక్తకాలమును యోచించి శిలాజతు నిప్పించవలయును. ఇటుల శిలాజతువును ప్రయోగించిన నది శరీరమునకు మిగుల నుపకారమును కలుగఁజేసి విశేషగుణములనిచ్చును. అకస్మాత్తుగ నాపదలను గలుగఁజేయకుండును.

### శిలాజతుసేవనకాలప్రమాణము.

ఏకత్రింశస్తసప్తాహం కర్షమర్ధపలం పలమ్,
హీనమధ్యోత్తమో యోగశ్శిలాజస్య క్రమాస్మృతః. ౧౪౦

శిలాజతు ప్రయోగమునకు ఏడుదినములు అధమము, ఇరువదిఒకదినములు మధ్యమము, నలువదితొమ్మిది దినములు ఉత్తమము. పాతికపలము అధమమాత్ర, అరపలము మధ్యమమాత్ర, ఒకపలము ఉత్తమమాత్ర. ఇటుల కాలమాత్రాయోగముల తెలిసికొనవలయును.

"ప్రయోగస్సప్తసప్తాహాస్త్రయ ఏకశ్చ కాలతః,
నిర్దిష్టస్త్రివిధస్తస్య వరో మధ్యోఽవరస్తథా,
పలమర్ధపలం కర్షం మాత్రా తస్య త్రిధా మతా."

అని పైయర్థమునే చరకాచార్యుఁడును చెప్పియున్నాఁడు.

## శిలాజతుసేవనవిధి.

సంస్కృతం సత్కృతే దేహే ప్రయుక్తం గిరిజాహ్వయమ్,
యుక్తం వ్యస్తైస్సమస్తైర్వా తామ్రాయోరూప్యహేమభిః. ౧౪౧
క్షీరేణాలోడితం కుర్యాచ్ఛీఘ్రం రాసాయనం ఫలమ్,
కుళుత్థాన్కాకమాచీం చ కపోతాంశ్చ సదాత్యజేత్*. ౧౪౨

స్నేహస్వేదవమనాదులచే శుద్ధమైన శరీరముగలవానికి వాతాదిదోషములను పోఁగొట్టునట్టి ఓషధులతో భావనచేయఁబడిన శిలాజతువును తామ్రము, ఇనుము, వెండి, బంగారు వీనిలో నొక్కొక్కటితోఁ గాని లేక అన్నిఁటితోఁగాని ఆవుపాలలో కలిపి యిప్పించిన రసాయనఫలము సిద్ధించును. శిలాజతు సేవనయందు ఉలవలు, కాచియాకు, పావురపిట్ట మాంసము వీని నెల్లప్పుడు వర్జింపవలయును.

"శుష్కామిషం విరూఢం పిష్టం శుక్తం విదాహి గురుచాన్యత్,
పానాశనం కుళుత్థాన్ విశేషతో వర్జయేచ్చాత్ర,
శిలాజతుప్రయోగేషు విదాహీని గురూణి చ,
వర్జయేత్సర్వకాలేషు కుళుత్థాంశ్చ సదా త్యజేత్."

శిలాజతువును సేవించువాఁడు యెండినమాంసము, గడ్డలు, పిండి, కలి, విదాహిగ గురువుగనుండు ఆహారపానములు వీనిని వర్జింపవలయును. ఉలవలను మాత్రము నెల్లపుడును వర్జింపవలయునని చరకాచార్యుఁడును, ఖరనాథుఁడును చెప్పియున్నారు.

ఇచ్చట "కులుత్థాంశ్చ సదాత్యజేత్" అని చెప్పుటవలన ఉలవలను మాత్రము శిలాజతువునుసేవించిన మనుజుఁడు తనజీవదశవరకును వర్జించవలెననియభిప్రాయము. రాళ్లను పగులదీయు గుణము ఉలవలయందున్నవి. రాళ్లను పగులదీయువారు ఉలవలను నీళ్ళలో పోసి కాచి యానీళ్ళచే రాళ్లను తడిపి సుఖముగ రాళ్లను పగులదీయుట వాడుక. కావున ఉలవలయందు రాళ్లను పగులదీయు గుణము ప్రత్యక్షము. రాళ్ళయందు దాని సత్త్వరూపముగ జనించినది శిలాజతువు. దానిసేవించిన వారి శరీరము శిలాజతుమయముగ నుండును. అట్టివారికి పైజెప్పినరీతిగ రాళ్ళభేదించు శక్తికల ఉలవల నుపయోగించుటవలన శరీరము శిథిలమగును. ఈయభిప్రాయముచేతనే చరకాచార్యులు 'సదాత్యజేత్' అనియుపదేశించిరి. ఈ యభిప్రాయము ననుసరించియే వాగ్భట ఖరనాథాదులును ముఖ్యముగ నిషేధించిరి.

---

*శ్లో. పిబేన్మాహేంద్రముదకం కాపం ప్రాస్రవణాంబు వా.

శిలాజతువును సేవించునపుడు ఆకాశోదకమునుగాని బావినీళ్లనుగాని సెలయేటినీళ్లనుగాని త్రాగవలయును.

శిలాజతువునకు సర్వరోగహారత్వము.

న సోఽస్తి రోగో భువి సాధ్యరూపో
జత్వశ్మజం యం నజయేత్ప్రసహ్య,
తత్కాలయోగై ర్విధివత్ప్రయుక్తం
స్వస్థస్య చోర్జాం విపులాం దధాతి. ౧౪౩

పూర్వముచెప్పిన కాలమాత్రాదియోగములతో విధిప్రకారము ప్రయోగింపఁబడిన శిలాజతువువలన పోఁగొట్టఁబడకుండునట్టిరోగము లోకమునం దెచ్చటను లేదు. మఱియు పైశిలాజతువును విధిప్రకారము ప్రయోగించినచో స్వస్థశరీరముగలవాని కధికబలము శీఘ్రముగ కలుగును

మఱియు శిలాజతుప్రయోగమున రోగభేదములచే ననుపానాదిభేదములం సంగ్రహమున నిట్లు చెప్పఁబడియె.

"జ్వరీజ్వరఘ్నాంబుదపర్పటాది
క్వాథేన రక్తీమధుయష్టికాయాః,
శోషీరసైః క్రవ్యభుగామిషోత్థై
ర్నాయూరమాంసైః పయసా చ కార్శ్యే.
మధ్వంబునా మేదసి సంప్రవృద్ధే క్షీరేణ పర్యాకులబుద్ధిసత్త్వః,
పాండ్వాసశోఫే జఠరే సకృచ్ఛ్రే పిబేచ్ఛిలాజం మహిషీజలేన.
అశ్మ వీరతరాద్యేనకుష్ఠం ఖదిరవారిణా,
విషం విషఘ్నైరగదై ర్హంత్యేవం తద్యథామయమ్.
శైలజత్రికటుషౌద్రషౌద్రధాతూన్నిషేవతే,
క్షీరోదనాశీయో జీర్ణే యక్ష్మణా న సబాధ్యతే.
సుభావితాం సారజలైస్తులాంపీత్వా శిలోద్భవాత్,
సారాంబునైవ భుంజానశ్శాలీన్ జాంగలజై రసైః.
అపోహ్య మధుమేహాఖ్యమంతకం రోగసంకరమ్,
వపుర్వర్ణబలోపేతశ్శతం జీవత్యనామయః.
అమరమందిరమందరసంభవాత్పలశతం గిరిజాదుపయోజయ,
యది జరామరదుఃఖవివర్జితాం సుచిరమిచ్ఛసి జీవితసంతతమ్,

దశగుణముపయుంక్తే యశ్శతం శైలజాతా
ల్లఘుహితమితభోజీ వర్జయన్ వర్జనీయాన్,
సతతసమనుషక్తాన్ వర్జితాన్ వైద్యబృందై
ర్వివిధమతి సగదాఘాన్ నేష తే చాయుషోఽంతమ్.
శిలాహ్వాత్ షోడశపలం త్రిస్త్రిరేకత్ర భావయేత్,
వరాయా దశమూలస్య గుడూచ్యాః కర్కటస్య చ.
బలాయా మధుయష్ట్యాశ్చ రసే గవ్యే చ వారిణి,
క్షీరేసకృత్క్రమేణైవం సప్తకృత్వస్తథా పునః.
కాకోళియుగ్మఘనపుష్కరవహ్నిరాస్నా
మేదాయుగర్ధిచవికాగజపిప్పలీనామ్,
పాఠాద్విజీరకనికుంభవిదారియుగ్మ
వీరావరీమధుఫలాంశుమతీద్వయానామ్.
పలికానామబ్ద్రోణే సిద్ధానాంపాదశేషితే క్వాథే,
భావితమిత్థం గిరిజం ద్విపలైశ్చూర్ణీకృతైర్యుంజ్యాత్.
కర్కటశృంగీధాత్రీవ్యోషైస్తాలీసపత్రకుడవేన,
చూర్ణపలేన విదార్యాస్తవక్షీర్యాః కర్షయుగ్మేన.
కుడవేన చతుర్జాతై స్తైలఘృతక్షౌద్రశర్కరాభిశ్చ,
ద్విపలాభిర్ద్విగుణాభిః కుర్యాద్గుళికాస్తతోఽక్షసమాః.
తాశ్శుష్కా నవకుంభే జాతీపుష్పాధివాసితేస్థాప్యాః,
తాసామేకాం ఖాదేత్ప్రతిదినమనుపానమత్రేష్టమ్.
క్షీరరసదాడిమాంభోమార్ద్వీకసురాసవాద్యన్యతమమ్,
జీర్ణేఽన్నం లఘుభోజ్యం యూషపయః పిశితనిర్యూహైః.
సప్తాహమాత్రమేవం సర్వాన్నీనః క్రమాద్భవేత్పరతః,
భక్తస్యాంతే ప్రాగ్వాగుళికా న విరుధ్యతేచైషామ్
నిరపాయాభూరిఫలా పరిహారసుఖోపయోజితా జయతి,
ప్రబలమపి వాతశోణితమూరుస్తంభం జ్వరం దీర్ఘమ్
భగమూత్రశుకదోషప్లీహాయకృద్రక్తపాండుహృద్రోగాన్,

వర్ధ్మ వమిగుల్మపీనసహిధ్మాకాసారుచిశ్వాసాన్.
విద్రధిముదరం కుష్ఠం శ్విత్రంపాండ్వ్యం క్షయుంమదం మూర్ఛాన్,
ఉన్మాదమపస్మారం ముఖనేత్రశిరోగదాంస్తాంస్తాన్.
ఆనాహమతీసారం హలీమకం కామలాగ్రహణిరోగాన్,
గ్రంథ్యర్బుదాన్ సపిటకాన్ భగందరం గండమాలాం చ.
అతికార్శ్యమతిస్థౌల్యం స్వేదమపి శ్లీపదం గుదే కీలాన్,
దంష్ట్రావిషం సమూలం గరప్రయోగాన్ సుఘోరాంశ్చ.
అభిచారమరాతికృతం దుస్స్వప్నం భౌతికీం తథా బాధామ్,
పాప్మాలక్ష్మీం చేయం గుటికాశమయేచ్ఛివా నామ.
వృష్యాయుష్యా ధన్యా కాంతియశశ్శ్రీవిబోధనీమేధ్యా,
కురుతే నృపవల్లభతాం జయతి వివాదే చ వక్త్రస్థా.
జితఖలతివలీపలితం జీవయతి సుఖం శతద్వయం శరదామ్,
వర్షద్వయప్రయోగాద్వర్షశతచతుష్టయం జీవేత్."

జ్వరితునికి శిలాజతువు జ్వరహరమగు ముస్తాపర్పటకాదికషాయములతోడను, రక్తపిత్తగ్నికి యష్టిమధుకకషాయముతోడను, క్షయరోగము గలవానికి మాంసమును భుజించునట్టి జంతువులయొక్క మాంసరసముతోడను, కార్శ్యము గలవానికి నెమలి మాంసముతోఁగాని, ఆవుపాలుతోఁ గాని, మేదోరోగము గలవానికి తేనె, ఉదకము వీనితోడను, బుద్ధిభ్రమ గలవానికి ఆవుపాలతోడను, పాండురోగము వాపు దారుణ మైన యుదరరోగము యీరోగములు గలవానికి బస్తిమూత్రముతోడను పానము చేయింపవలయును. మఱియు శిలాజతువును వీరతర్వాది కషాయములతోడను, చంద్ర కషాయముతోడను, పానము చేయించిన కుష్ఠరోగము హరించును. విషహరౌషధ ములతో పానముచేయించిన విషములన్నియు హరించును. ఇటుల శిలాజతువు నాయా రోగానుగుణముగ నిప్పించవలయును. శిలాజతు, త్రికటుకములు, తేనె, ధాతుమాక్షి కము వీని నొకటిగచేర్చి సేవించి యాయౌషధము జీర్ణంబైన పిదప ఆవుపాలతోడ సంబావుబియ్యపు అన్నమును భుజించిన క్షయరోగము హరించును. సారోదకములో భావనచేయఁబడిన శిలాజతువును సారోదకముతోడ పానము చేసి యది జీర్ణమైన పిదప జాంగల జంతు మాంసరసములతో సంబావు బియ్యపు అన్నమును భుజింపవల యును. ఇటుల ఒకమాసము చేసిన భయంకరమగు మధుమేహ రోగములు నివర్తించి మంచిశరీరకాంతి బలము వీనితోడ రోగములేక యేనూరుసంవత్సరములు మనుజుఁడు

జీవించును. మఱియు రోగోపద్రవంబులు ముసలితనములేక బహుకాలము సుఖముతో జీవించుటయం దిచ్ఛగలవాఁడు హిమవత్పర్వతములో జనించిన శిలాజతువును నూరు పలములు భుజించవలయును. మనుజుఁడు శుద్ధశిలాజతువును వెయ్యిపలములు కాల క్రమముగ భుజింపుచు అపథ్యాహారముల వర్జించి లఘువుగ హితముగ మితముగనుండు ఆహారములను భుజింపుచుండిన రోగరహితుఁడై పెక్కు సంవత్సరములు జీవించును.

మఱియు పదునారు పలములు శిలాజతువును గ్రహించి త్రిఫలకషాయము దశ మూలకషాయము, తిప్పతీఁగె కషాయము, కర్కాటకశృంగి కషాయము, యష్టిమధుక కషాయము వీనిలో నొక్కొక్క దానియందును మూఁడేసిపర్యాయములు భావనచేసి పిదప ఆవుపంచితము నందును, ఆవుపాలయందును నొక్కొక్కపర్యాయము భావన చేయవలయును. పిదప కాకోళి, క్షీరకాకోళి, తుంగముస్తలు, పుష్కరమూలము, చిత్రమూలము, సన్నరాస్నము, మేద, మహామేద, బుద్ధి, చవ్యము, ఏనుగుపిప్పళ్లు, చిరు బొద్ది, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, దంతివేళ్లు, నేలగుమ్ముడు, తెల్లనేలగుమ్ముడు, పిల్లిపీచర, ఇప్ప, కోలపొన్న, నేలపొన్న వీనిని ప్రత్యేక మొక్కొక పలముచొప్పున గ్రహించి ద్రోణప్రమాణముదకములో వైచి పాదావశేషముగ కషాయము కాచి అందులో పైశి లాజతువును ఏడుపర్యాయములు భావనచేసి చూర్ణించి దానియందు కర్కాటకశృంగి, ఉసిరికపరుగు, త్రికటుకములు, తాళిసపత్రి వీనిచూర్ణము దినుసుకు ఒకకుడపము, నేలగుమ్ముడుగడ్డ చూర్ణము ఒకపలము, తవక్షీరి, (వెదురుప్పు) రెండుకర్షములు, చతుర్జాతకములు ఒక కుడపము, నువ్వులనూనె, తేనె, నెయ్యి, పంచదార యివి దిను సుకు నాల్గుపలములు వీనినన్నిటి నొకటిగచేర్చి చక్కఁగనూరి కర్ష (కాలుపలము) ప్రమాణము గుటికలుచేసి నీడనెండించి జాజిపువ్వులతో వాసనబట్టఁబడిన క్రొత్తకుండలో నుంచుకొని, వానిలో ప్రతిదిన మొక్కొక్క గుటికను భుజింపుచు ఆవుపాలు, మాంస రసము, దానిమ్మపండు రసము, మార్ద్వీకము, సుర, ఆసవము అనుమద్యములు, వీనిలో దేనినైన ప్రియముగనుండుదానిని అనుపానముచేసి యది జీర్ణమైన పిదప లఘువైన యన్నమును పప్పుకట్టు, ఆవుపాలు, మాంసరసము వీనిలో దేనితోడనైన భుజింప వలయును.

పైప్రకారము ఏడు దినములు గుటికలను సేవింపవలయును. పిదప నాహారమును పథ్యనియమములేక యిచ్ఛవచ్చినట్లు భుజింపవచ్చును. పైగుటికలను భోజనమునకు ముం దుగాని, భోజనమునకు పిదపగాని భుజింపవలయును. ఇవి యుపద్రవమును కలుగఁజేయ నేరదు. విశేషగుణమును కలుగఁజేయును. ఇది శివగుటికలని చెప్పఁబడును. దారుణమైన వాతరక్తము, ఊరుస్తంభము, బహుకాల మనువర్తింపుచుండు జ్వరము, యోనిరోగము, మూత్రకృచ్ఛ్రము, శుక్రదోషము, ప్లీహవృద్ధి, యకృద్వృద్ధి, రక్తదోషము, పాండువు,

హృద్రోగము, వర్ధ్మరోగము, వాంతి,గుల్మము, పీనసము, ఎక్కిళ్లు, కాసము,అరుచి,శ్వాసము, విద్రధి,ఉదరరోగము, కుష్ఠువు, శ్విత్రము, నపుంసకత్వము,క్షయము, మదాత్యయము, మూర్ఛ, ఉన్మాదము, అపస్మారము,ముఖరోగము, నేత్రరోగము, శిరోరోగము, కడుపుబ్బరము, హలీమకము, అతిసారము, కామిల, గ్రహణి, గ్రంథి, అర్బుదము, పిటకలు, భగందరము, గండమాల, అతికార్శ్యము, అతిస్థౌల్యము, స్వేదము, శ్లీపదము, అర్శోంకురములు కోరపండ్లవిషము, కృత్రిమప్రయోగవిషము, ఆధివారోపద్రవములు, దుస్స్వప్నము, భూతబాధ, పాపము, అలక్ష్మి వీనినన్నిఁటిని పోఁగొట్టును. మఱియు నిది ఆయుర్వృద్ధి, శుక్రవృద్ధి, మంచికాంతి, బుద్ధివికాసము వీనిని కలుగఁజేయును. ఈ గుటికల నోటిలో నుంచుకొనియుండిన రాజవశ్యము కలుగును. వివాదమునందు జయముకలుగును. దీనిని సేవించిన మనుజులు వళులు, వెంట్రుకలు నెరయుట యివి లేనివారై రెండువందల సంవత్సరములు జీవింతురు. మఱియు మనుజులు దీనిని రెండుసంవత్సరములు విధిప్రకారము సేవించిన నాల్గువందల సంవత్సరములు జీవింతురు. అని సంగ్రహమున చెప్పఁబడియున్నది.

మఱియు ఖరనాథుఁడు శిలాజతూత్పత్తిక్రమము, వాని భేదములు, వాని రసగుణవీర్యవిపాదులు, వాని గుణములు, భావనాభేదములు మున్నగువాని నిట్లుచెప్పెను:—

"కనకాద్రజతాత్తామ్రాదయసస్సీసాత్తథా త్రపుణః,
గిరివివరనిస్సృతం తత్కాథస్నిగ్ధాతిమృదు మృత్స్నమ్.
జత్వాభం చ శిలాజతు వింద్యాదేతజ్జడాత్మకం గిరిజమ్,
సంరక్తపీతవర్ణం సతిక్తమధురంరసే కటువిపాకి.
శీతం కనకశిలాజతు విశేషతశ్శ్లేష్మపిత్తఘ్నమ్,
శ్వేతంచ తిక్తమధురం పాచనవల్లేఖనం శీతమ్.
కించిల్లవణం విద్యాద్విశేషతో వాతపిత్తఘ్నమ్,
శితికంఠతుల్యవర్ణం తీక్ష్ణోష్ణంలేఖనం విపాకకటు.
కించిల్లవణం తామ్రాత్మకం స్మృతం కఫవృద్ధిదోషేణ,
గుగ్గులుకాభం స్నిగ్ధం తిక్తం లవణం సరం విశదతీక్ష్ణమ్.
కటుపాకి నాతిశీతంత్రిమలఘ్నం త్వాయసం శ్రేష్ఠమ్,
స్వాకరసమానవర్ణే సీసత్రపుసంభవే శిలాజతునీ.
అల్పాంతరకర్మగుణే కృష్ణాయసజాచ్ఛిలాజతునః,
గోమూత్రగంధమసితం గుగ్గులుకాభం విశర్కరం మృత్స్నమ్.

స్నిగ్ధమనమ్లకషాయం శిలోద్భవం సర్వకర్మణ్యమ్,
సస్నేహాలవణభావాద్వాతఘ్నం పిత్తనుత్సరత్వాత్తత్.
రసపాకయోః కటుత్వాత్తైక్ష్ణ్యాచ్ఛ్లేష్మమేదోఘ్నమ్,
కటుతీక్ష్ణత్వాద్దీపనమగ్నేరుద్దీపనాన్మలాన్ పచతి.
తిక్తత్వాద్రక్తఘ్నం కటుతైక్ష్ణ్యోష్ణ్యాత్క్రిమిఘ్నం వా,
శోభనభావాద్వృష్యం స్నిగ్ధత్వాత్పౌష్టికం చ బల్యం చ.
ఆయుష్యం చ విషఘ్నం మంగళ్యమమృతాన్వయత్వాచ్చ,
శోధనభావాత్స్రోతోధాత్వింద్రియబుద్ధిశోధనం వర్ణ్యమ్.
పుత్ర్యం చ వృష్యభావాన్మేధ్యం యోనిస్వభావాచ్చ"
"భావితమన్యైర్ద్రవ్యై ర్వీర్యోత్కర్షాద్విశేషకర్మణ్యం,
తత్సామ్యత్తస్మాద్భావ్యం వాతాదిహరౌషధకషాయైః.
రాస్నాదశమూలబలాపునర్నవైరండశుంఠిమధుకానాం,
క్వాథేన భావితం తద్విశేషతో వాతరోగఘ్నం.
ద్రాక్షాభీరుపటోలీత్రాయంతిగుడూచిజీవనీయానాం,
క్వాథేన భావితం తద్విశేషతః పిత్తరోగఘ్నం.
త్రిఫలావచావిడంగకరంజఘనముఖ్యపంచమూలానామ్,
సహపంచకోలకానాంక్వాథేన కఫామయే భావ్యమ్.
లఘుపంచమూలశుంఠీద్రాక్షాకాశ్మర్యవాజిగంధానామ్,
సగుడూచీగసబలానాం రసేన పిత్తానిలగదేషు.
ఘనకుష్ఠవచాత్రిఫలాసురదారువిడంగపంచకోలానామ్,
రజనీమరిచాతివిషాయుక్తానాం వాతకఫజేషు.
పాఠాపటోలనింబత్రిఫలాఘనకుష్ఠసప్తపర్ణానాం,
త్రాయంత్యమృతాతివిషాసహితానాం పిత్తకఫజేషు.
త్రిమలేషుయథాదోషం యోగానేతాన్వికల్ప్య భావ్యం స్యాత్,
కేవలజలధౌతం తచ్ఛుష్కంక్వాథై స్తతోభావ్యం.
గిరిజం చతుర్గుణజలం క్వాథ్యం స్యాత్ భావనౌషధంతత్ర,
చతుర్థశేషే క్వాథేపూతోష్ణే ప్రక్షిపేద్గిరిజమ్."

పర్వతమునందు బంగారు, వెండి, రాగి, అయము, సీసము, త్రపు (అనఁగా తగరము) వీనిలోనుండి ప్రత్యేకప్రత్యేకముగ లక్కవలె ద్రవముగ స్రవించునది శిలాజతు వనఁబడును. వానిలో సువర్ణము వలన బుట్టిన శిలాజతువు యెఱ్ఱగను పసుపుగను కొంచెము చేదుగను తియ్యగను, పాకమువలన కటువుగను శీతముగ నుండును. ఇది తఱుచుగ శ్లేష్మపిత్తములను పోఁగొట్టును. వెండివలనపుట్టిన శిలాజతువు చేదుగ మధురముగ జీరమును కలుగఁజేయునదిగ వాతాదిదోషముల భేదించునదిగ శీతముగ కొంచెముప్పగ నుండును. ఇది తఱుచుగ వాతపిత్తమును హరించును. తామ్రమువలన జనించిన శిలాజతువు నెమలివంటి వర్ణముగలదిగ తీక్ష్ణముగ నుష్ణముగ వాతాదిదోషముల భేదించునదిగ కటువుగ కొంచెముప్పగ నుండును. ఇది కఫమును వృద్ధిజేయును. అయమునుండి బుట్టినశిలాజతువు గుగ్గిలమువంటి వర్ణముగలదిగ స్నిగ్ధముగ చేదుగ ఉప్పగ శీఘ్రముగ శరీరమున వ్యాపించునదిగ నిర్మలముగ తీక్ష్ణముగ పాకమువలన కారముగ కొంచెము శీతముగ నుండును. ఇది సన్నిపాతమును పోకడచును. మిగుల శ్రేష్ఠమైనది. సీసము తగరము వీని వలన జనించిన శిలాజతువు, సీసము తగరము వీనివర్ణము కలదిగ నుండును. వానిగుణములు ఆయస శిలాజతువుకన్న కొంచెము తక్కువగనుండును. గోమూత్రమువంటి వాసనకలదియు తెల్లగను గుగ్గిలమువలె నుండునదియు రాళ్లులేనిదియు శ్రేష్ఠమైన మట్టిలోఁగూడి స్నిగ్ధముగ పులుపుగ వగరు రసములు గలదియునైన శిలాజతువు సర్వకృత్యములయం దుపయోగార్హము.

మఱియు నీశిలాజతువు స్నేహముతోఁ గూడి ఉప్పగ నుండుటవలన వాతమును పోఁగొట్టును. శరీరమందంతట వ్యాపించు స్వభావము కలదియగుటవలన పిత్తమునుహరించును. కటువైన రసపాకములు కలదిగ తీక్ష్ణముగ నుండుటవలన శ్లేష్మము మేదస్సు వీనిని పోఁగొట్టును. కారముగ తీక్ష్ణముగ నుండుటవలన జాఠరాగ్నికి దీపనమును కలుగఁజేసి దోషములను పాకము చేయును. చేదుగనుండుటవలన రక్తదోషమును కారముగ తీక్ష్ణముగ నుష్ణముగ నుండుటవలన కృములను పోఁగొట్టును. అనేక సుగుణములు గలదిగ నుండుటవలన శుక్రవృద్ధిని, స్నిగ్ధముగ నుండుటవలన శరీరపుష్టి బలమును, అమృతసంబంధము గలదిగ నుండుటవలన ఆయుర్వృద్ధిని బలమును కలుగఁజేయును. విషమును పోఁగొట్టును. మఱియు నిది శుద్ధిచేయునదిగ నుండుటవలన స్రోతోమార్గములు రసరక్తాది ధాతువులు చక్షురాదీంద్రియములు వీనిని శుద్ధిపఱచును. శరీరమునకు మంచివర్ణమును కలుగఁజేయును. శుక్రమును వృద్ధిజేయునదిగ నుండుటవలన సంతానమునుకలుగఁజేయును, సువర్ణాది ధాతువులనుండి జనించినదగుటవలన బుద్ధికి ధారణాశక్తిని గలుగఁజేయును.

మఱియు నీశిలాజతువును యితరద్రవ్యములతో భావనజేసినది మిగుల వీర్యయుక్తంబై విశేషగుణములను కలుగఁజేయును. కావున వాతాదిదోషములను పోఁగొట్టునట్టి యౌషధముల కషాయములలో భావనచేయవలయును. సన్నరాస్నము, దశమూల

ములు చిట్టాముట్టి, గలిజేరు, ఆముదపాకు, సొంటి, అతిమధురము అనువానికషాయము లతో భావనచేయఁబడిన శిలాజతువు విశేషముగ వాతరోగములను బోఁగొట్టును. ద్రాక్ష, పిల్లిపీచర, చేఁదుపొట్ల, కలుక్రాను గు, తిప్పతీఁగె, జీవనీయౌషధములు వీనికషాయము లతో భావనచేయఁబడిన శిలాజతువు పిత్తరోగములను నిశ్శేషముగ పోఁగొట్టును. త్రిఫలములు, వస, వాయువిడంగములు, క్రాను గు, తుంగముస్తలు, దశమూలములు, పంచకోలములు అనువానికషాయములతో భావనచేయఁబడిన శిలాజతువును కఫరోగ మున ప్రయోగింపవలయును. లఘుపంచమూలములు, సొంటి, ద్రాక్ష, గుమ్మడు, పెన్నేరుగడ్డ, తిప్పతీఁగెరసము, చిట్టాముట్టి వీనితో భావనచేయఁబడిన శిలాజతువును పిత్తవాతరోగములయందుపయోగింపవలయును. తుంగముస్తలు, చెంగల్వకోష్టు, వస, త్రిఫలములు, దేవదారు, వాయువిడంగములు, పంచకోలములు, పసుపు, మిరియాలు, అతివస వీనికషాయములతో భావనజేయఁబడిన దానిని వాతశ్లేష్మజరోగములయందుప యోగింపవలయును. చిఱుబొద్ది, చేదుపొట్ల, వేము, త్రిఫలములు, తుంగముస్తలు, చెంగల్వకోష్టు, ఏడాకులపొన్న, కలుక్రాను గు, తిప్పతీఁగె, అతివస అనువానికషాయము లలో భావనచేయఁబడిన దానిని పిత్తశ్లేష్మరోగములయందు చేర్చుకొనవలయును. సన్నిపాత దోషములయందు ఆయాదోష ప్రకోపానుగుణముగ పైచెప్పిన కషాయము లను పర్యాలోచించి వానిలో శిలాజతువును భావనచేయవలయును.

శిలాజతువును తొలుత మంచియుదకములో కడిగి యెండించి పిదప దానిని వాతాదిదోషహార కషాయములతో పైజెప్పినవిధముగ భావనచేయవలయును. భావనౌష ధములను నాలుగింత లుదకములోవైచి నాల్గవభాగము మిగులునటుల కషాయముకాచి వడియగట్టి ఉష్ణముగనుండు దానిలో శిలాజతువును వైచి భావనచేయవలయును. అని ఖరనాథుఁడు చెప్పియున్నాఁడు.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—వాగ్భటాచార్యులు "సమగిరిజమష్టగుణితే క్వాథ్యం, కన్నిర్వ్యూహే ఒష్టాంశే పూతోష్ణే ప్రక్షిపే ద్గిరిజమ్" అనువాక్యముచే క్వాథ్యద్రవ్యమునకు ఎనిమిదింతలునీళ్లుబోసి అష్టమాంశము మిగులునట్లు కాచినకషాయ మున శిలాజతువునుభావనచేయవలెనని చెప్పిరి. ఖరనాథుఁడు—'గిరిజం=ద్గిరిజం' అనువాక్య ముచే నాల్గవభాగమును శేషించినకషాయమున భావనచెప్పెను. వాగ్భటునకు అష్టమాంశ శేషక్వాథము వీర్యవత్తరముగ నుండునని భావము.

"సలిలవిశుద్ధా ద్గిరిజా త్పి బేదరోగః ఫలత్రికరసేన,
మాత్రాం క్రమాభివృద్ధాం త్ర్యహం కషాయేణ మధుకస్య.
రోగాన్వితేషు గిరిజంజలశుద్ధం భావితం కషాయైశ్చ,
దోషవ్యాధిబలాతురకాలాపేక్షీ ప్రయుంజీత.

జీర్ణౌషధస్సుఖోదకపరిషిక్తో మాంసరసపయోయూషైః,
రక్తాదిషాష్టికోదన మనవమరోగో గదీ చాద్యాత్.
వ్యాధ్యాతురదోషబలం దృష్ట్వా తస్య త్రిధా ప్రయోగస్స్యాత్,
శ్రేష్ఠ స్త్రిషష్టిరాత్రం మాసోమధ్య స్త్రిసప్తరాత్ర మవరః.
పానావగాహ యోస్స్యద్దివ్యం శైలోద్భవం కౌపమ్."

రోగరహితుఁడుగనుండు పురుషుఁడు మంచియుదకములో శుద్ధిజేసిన శిలాజతువును క్రమముగ నొక్కొక్కదినమున నొక్కొక్కభాగము హెచ్చించి మూఁడుదినములవఱకు త్రిఫలకషాయము యష్టిమధుకకషాయము వీనితోడ పానము చేయవలయును. రోగముతోఁగూడియుండు వానికి ఉదకములో చక్కఁగ కడగఁబడి ఆయారోగానుగుణమగు కషాయములో భావనచేయఁబడిన శిలాజతువును వాతాదిదోషరోగరోగి బలకాలాదుల ననుసరించి మాత్రగనిప్పించి యది జీర్ణమైనపిదప నుష్ణోదకములో స్నానముచేయించి యెఱ్ఱసంబాబియ్యము, అరువదిదినములలోపలించెడు సంబావుబియ్యము వీనియన్నములను మాంసరసము, ఆవుపాలు, కట్టులు వీనితోడ భుజింపఁజేయవలయును. మఱియు నీశిలాజతువును అరువదిమూఁడుదినములుసేవించుట ఉత్తమము. ఒకమాసముసేవించుట మధ్యమము, ఇరువదియొకదినములు సేవించుట అధమము, ఇటుల శిలాజతుప్రయోగము ఉత్తమ-మధ్యమ-అధమభేదములచే మూఁడువిధములుగనుండును. రోగము, రోగి, వాతాదిదోషములు వీనిబలమును చక్కఁగ పర్యాలోచించి పైజెప్పిన మూఁడువిధములలో నెద్ది యుక్తముగనుండునో దానిని ప్రయోగింపవలయును. శిలాజతువునుసేవించువారికి స్నానపానాదులయందు దివ్యోదకము సెలయేటినీరు బావినీరు వీని నుపయోగింపవలయును. అని తంత్రాన్తరమునగలదు.

చరకాచార్యులుమాత్రము శిలాజతూత్పత్తిని నాల్గువిధములుగనే యిట్లుచెప్పిరి:—

"అనమ్లం చ కషాయం చ కటుపాకి శిలాజతు,
అత్యుష్ణశీతం ధాతుభ్యశ్చతుర్భ్య స్తస్య సంభవః,
హేమ్న స్సరజతా త్తామ్రా ద్వరం కృష్ణాయసాదపి."

శిలాజతువు ఆమ్లరసరహితముగ వగరుగపాకమువలన కారముగ అత్యుష్ణముగ శీతముగనుండును. ఇది స్వర్ణములోనుండియు రజతమునందుండియు తామ్రమునందుండియు మంచి ఇనుమునందుండియుజనించును. వానిలో మంచి యినుములో జనించినది మిగుల శ్రేష్ఠము అనియు, సువర్ణాది నాల్గుధాతువులలోనుండి శిలాజతువుజనించుననియు, చరకాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

"దానవేంద్రవిజితాన్ పురా సురాన్
భ్రష్టకాంతిధృతిశౌర్య తేజసః,
వీక్ష్య విష్ణు రమృతం కిలాసృజ
ద్గుగ్గులుం బలవపుర్జయప్రదమ్.
అద్యాప్యతస్సురగణాః కిలధూపముఖ్యాన్
హిత్వా వరాగరుతురుష్క హిమేందుదర్పాన్,
నిర్దహ్యమానవపుషో పి శిఖాం పిబంతో
గంధేన యస్యముదితా దధతి ప్రసాదమ్.
స యోగవాహీ స శివ స్సశార్వ
స్సర్వర్తుసేవ్య స్సుఖశీలనీయః,
హంతా జరాపాప్మ మయామయానాం
కర్తా గ్నిమేధా స్మృతిపాటవానామ్.
గంధోత్కటస్సుదాహో స్నిగ్ధద్రవపిచ్ఛిలో విగతశల్యః,
మహిషాఖ్యః పుష్పరాగస్ఫటికాసితనీరుజచ్ఛాయః.
యఃపద్మరాగరాగ్యేభః కనకచ్ఛదపాటలో యో వా,
జయతీంద్రనీలమమలం భగ్నోఽప్యతికాంతిమత్త్వేన.
జ్యేష్ఠః ప్రయోగో ఽస్య తులా పలాన్యైవాధికం పిబేత్,
ఆత్రేయమునిగీతశ్చ మంత్రో యం సర్వకర్మకృత్.
"భగవాన్ పుండరీకాక్షో దేవాశ్చ సపురందరాః,
ఆజ్ఞాపయంతి సమ్యక్త్వాం ప్రభావం చాదిశంతి తే.
జరామరణదుఃఖేభ్యో యథా తేఽభ్యర్థితాస్సురాః,
ఉపయోక్తు స్తథైవాస్య భవత్వం హి మహాబల."
పంచమూలస్య మహతః క్వాథేన హితభోజినా,
గుగ్గులుశ్శీలితో హంతి సర్వాన్ వాతకఫామయాన్.
లక్ష్మీయసోఽపి తద్వచ్చ సుఖోష్ణేన జలేన వా,
మస్తుధాన్యామ్లమద్యైర్వా వచాదేస్సలిలేన వా.
వరణాదేస్తు బాధిర్యం దంతకర్ణశిరోరుజః,

స్వరభేదోదరశ్వాసవర్ధ్మాంతర్గుల్మవిద్రధీన్,
వాతపిత్తాస్రరోగేషు బృంహణార్థిని చేష్యతే,
క్వాథేన వాజిగంధాయా జీవనీయగణస్య వా.
క్వాథేనోత్పలమృద్వీకారక్తచందనజన్మనా,
వాతపిత్తం నిహంత్యేష పద్మకాదిగణస్య వా.
చవ్యకుష్ఠవిడంగానాం యవాన్యానాగరస్య వా,
ప్రసారణ్యాశ్చ తోయేన గుగ్గులుః కఫవాతజిత్.
త్రూష్యణాగ్నిఘనవేల్లవరాభి
ర్భక్షయన్ సమఘృతం మహిషాక్షం,
ఆశు హంతి కఫమారుతమేదో
దోషజాన్ బలవతోఽపి వికారాన్.
పటోలనింబత్రిఫలాగుడూచీగాయత్రిరాత్రిద్వయబీజకానామ్,
క్వాథైః పృథక్పథ్యపరస్య హంతి
మాసేన ఘోరాన్ కఫపిత్తరోగాన్,
విశేషాచ్ఛోఫవీసర్పదుష్టవ్రణభగందరాన్,
శుక్రార్తవమనోదోషప్రమేహశ్విత్రపాండుతాః.
పటోలారిష్టనిర్యూహపిష్టశూల్యరసాంజనః,
గళరోగాపచీవ్యంగగ్రంథిస్థౌల్యక్రిమివ్రణుత్.
శిలాజతుసమః పీతః పయసా వాతశోణితమ్,
నివర్తయత్యతిబలం క్షీరమాంసఘృతాశినః.
రసేన పయసామూత్రైర్వాతపిత్తకఫాపహాః,
బ్రాహ్మీమండూకశంఖానాం పృథఙ్మేధాదికృద్రసైః.
మాగధికాగ్నివిడంగకళింగైర్బిల్వఘృతైస్సవిచాపలషట్కైః,
గుగ్గులునా సదృశేన సమేతైః క్షౌద్రయుతైస్సకలామయనాశః.
పిబేత్పలశతం యోఽస్య విధినానియతో యతిః.
నాకాలమృత్యుర్న వ్యాధిర్న తస్య జరసో భయమ్.
కల్పయేద్దోషధైస్తైస్తైర్వ్యాధిషు వ్యాధినాశనైః,

శిలాజతు విధానం చ గుగ్గులోస్సర్వమిష్యతే.
గుణనిధిరపి కుర్యాత్సోऽతిమాత్రోపయుక్త
స్తిమిరవదనశోషక్లీబతాకార్శ్యమేహాన్,
శమలశిథిలభావం దేహరౌక్ష్యం చ తస్మా
ద్రజనిచరనిషేవీ స్యాన్న రోగీష్వమీషు."

తొల్లి దేవత లసురులచే జయింపఁబడి కాంతి ధైర్యము శౌర్యము సంతోషములు తేజస్సు మొదలగువానిని పోఁగొట్టుకొని మిక్కుటముగ దుఃఖింపుచుండు వారియందు విష్ణువు దయార్ద్రహృదయుండై శరీరకాంతి బలారోగ్యజయప్రదమును అమృతతుల్యమునైన గుగ్గిలమును సృజించెను. కావున దేవతాగణంబు లిపుడును శ్రేష్ఠమైన అగరుచెక్క, అందుబంక, పచ్చకర్పూరము మొదలగు శ్రేష్ఠధూపద్రవ్యములను వర్జించి గుగ్గిలపుధూపవాసనచే సంతుష్టులై మనుజులయొక్క కోరికలను పూర్తిచేయుచున్నారు. మఱియు గుగ్గిలము యోగవాహిగా సుఖమును కలుగఁజేయునదిగ సర్వర్తువులయందును సుఖముగ సేవింపఁదగినదిగనుండును. ముసలితనమును దారుణమైన రోగములను పోఁగొట్టును. జాఠరాగ్నిదీపనము ధారణాశక్తిగలబుద్ధి, స్మృతి వీనిని కలుగఁజేయును. కాల్చిన విశేషవాసనగలదిగ స్నిగ్ధముగ జిగటగ శల్యరహితముగ పుష్యరాగము, స్ఫటికము, ఇంద్రనీలము మొదలగు మణులవంటి వర్ణముగలదిగనుండు నెడ మహిషాక్షీ గుగ్గిలమనఁబడును. పద్మరాగమువంటి వర్ణముగలదిగగాని బంగారు రేసులవంటి వర్ణము కలదిగగాని పగులఁగొట్టినచో ఇంద్రనీలమణివంటి వర్ణముకలదిగగాని నుండుగుగ్గిలము మిగులశ్రేష్ఠము. దీనికి ఒకతులము తగినప్రమాణము. రెండు పలములకుపై సేవింపఁజనదు. దీనిని:—

"భగవాన్ పుండరీకాక్షః మహాబల"

అను మంత్రములచే నభిమంత్రించి ప్రయోగింపవలయును. మహాపంచమూలకషాయములతో గుగ్గిలమును సేవించి హితాహారములను భుజింపుచుండిన వాతరోగము లన్నియు హరించును. లఘుపంచమూలకషాయముతోఁగాని సుఖోష్ణముగ నుండునుదకముతోఁగాని పెరుగుమీఁది మీఁగడతోఁగాని పులికడుగుతోఁగాని మద్యములతోఁగాని వచాదిగణద్రవ్యముల కషాయములతోఁగాని వరణాదిగణద్రవ్యకషాయములతోఁగాని గుగ్గిలమును కలిపి పానముచేసిన చెవిటితనము, పండ్లనొప్పి, చెవినొప్పి, శిరశ్శూల, స్వరభేదము, ఉదరరోగము, శ్వాసము, వృద్ధి, గుల్మము, విద్రధి, వాతపిత్తరోగములు హరించును. పెన్నేరుగడ్డలకషాయముతోఁగాని జీవనీయగణద్రవ్యకషాయముతోఁగాని నల్లకలువ, ద్రాక్షపండు, రక్తచందనము వీనికషాయములతోఁగాని గుగ్గిలమును

పానము చేసిన వాతపిత్తరోగములు హరించును. శరీరమునకు పుష్టికల్గును. పద్మకాదిగణ ద్రవ్య కషాయములతోఁగాని చవ్యము, చెంగల్వకోష్టు, వాయువిడంగములు అనువాని కషాయములతోఁగాని దురదగొండి, శుంఠి వీనికషాయములతోఁగాని పాపరకషాయముతోఁగాని గుగ్గిలమును సేవించిన కఫవాతములు హరించును. త్రికటుకములు, చిత్రమూలములు, తుంగముస్తలు, వాయువిడంగములు, పిల్లిపీచర అనువాని కషాయములలో మహిసాక్షిగుగ్గిలము ఆవునెయ్యిచేర్చి పానము చేయించిన కఫవాతజరోగములు, మేదోదోషము హరించును. చేదుపొట్ల, వేము, త్రిఫలములు, తిప్పతీఁగె, చంద్ర, పసుపు మ్రానిపసుపు, వేగిస అనువానికషాయములతో ప్రత్యేకముగ గుగ్గిలము నొకమాసము సేవించిన దారుణమైన కఫపిత్తరోగములు, వాపు, విసర్పము, గుప్తవ్రణములు, భగందరము, శుక్రదోషము, ఆర్తనదోషము, ప్రమేహము, శ్విత్రకుష్ఠువు, పాండురోగము హరించును. చేదుపొట్ల, వేము అనువాని కషాయములలో రసాంజనము గుగ్గిలము వీనిని సమముగ కలిపి పానముచేయించిన గళరోగము, అపచి, వ్యంగము, స్థౌల్యరోగము, గ్రంథులు, క్రిమిరోగము హరించును శిలాజతువునకు సమభాగముగ గుగ్గిలమునుకలిపి ఆవుపాలతోఁగూర్చి పానముచేయించి ఆవుపాలు, మాంసరసము, ఆవునెయ్యి వీనితోడ ఆహారమును భుజింపఁజేసిన దారుణమైన వాతరక్తరోగములు హరించును. మాంసరసముతోఁగాని ఆవుపాలతోఁగాని గోమూత్రముతోఁగాని గుగ్గిలమును పానముచేయించిన వాతపిత్తకఫములు హరించును. సరస్వతియాకురసము, బోడతరము, శంఖుపుష్పి అనువానిరసములతో వేరువేరుగపానముజేసిన జ్ఞాపకశక్తి బుద్ధిమున్నగునవి వృద్ధినొందును. పిప్పళ్లు, చిత్రమూలము, వాయువిడంగములు, కొడిసెవిత్తులు, మారేడుపండు, ఆవునెయ్యి, వస వీనిని దినమునకు ఆరు పలములు చొప్పున గ్రహించి అందులో ఆరుపలములు గుగ్గిలమునుచేర్చి తేనెలోకలిపి పానముచేయించిన సమస్తరోగములు నివర్తించును. నూరు పలముల గుగ్గిలమును విధిప్రకారము సేవించి పథ్యాహారములను భుజింపుచు స్త్రీసంభోగమును వర్జించియుండిన అకాలమరణము, రోగము, ముసలితనము కలుగకుండును. శిలాజతుకల్పమునకుఁ జెప్పియుండు ప్రకారము గుగ్గిలమును ఆయారోగముల కనుగుణములైన యనుపానముల గల్పించి ఇప్పించవలయును.

మరియు గుగ్గిలమునందు పైజెప్పినవిధముగ నమోఘగుణములు కల్గియున్నను పరిమితి కధికముగసేవించినయెడ తిమిరరోగము, నోరెండుట, షండత్వము, కృశత్వము, ప్రమేహములు, అవయవశైథిల్యము, శరీరమున జిడ్డులేక రూక్షముగనుండుట ఇవి మున్నగురోగములు కల్గును. కావున గుగ్గిలమును తగిన ప్రమాణముతో ననుగుణములైన యనుపానములఁ గూర్చి విధ్యుక్తప్రకారము గుగ్గిలము సేవించినచో రోగములన్నియు నివర్తించును. ఇత్తెఱంగున గుగ్గిలకల్పము అష్టాంగసంగ్రహమున జెప్పఁబడినది.

### కుటీప్రవేశవాతాతపరసాయనయోగ్యము.

కుటీప్రవేశః క్షణినాం పరిచ్ఛదవతాం హితః,
అతోఽన్యథా తు యే తేషాం సూర్యమారుతికో విధిః. ౧౪౪

స్వతంత్రులుగ విశేషపరివారము కలవారుగ నుండువారికి కుటీప్రవేశమను రసాయనప్రయోగము హితకరముగనుండును. పరాధీనులును పరివారరహితులు నైనవారికి వాతాతపికమను రసాయనయోగము హితకరముగ నుండును.

### వాతాతపికరసాయనయోగము.

వాతాతపసహా యోగా వక్ష్యంతేఽతో విశేషతః,
*సుఖోపచారా భ్రంశేఽపి యే న దేహస్య బాధకాః. ౧౪౫

వాతాతపికమను రసాయనయోగములు విశేషముగ చెప్పఁబడుచున్నవి. ఈ యోగములు అనాయాసముగ సేవింపఁదగినవిగనుండును. పథ్యాహారవిహారాదులయందేదైన భ్రంశము కలిగినను శరీరమునకు ఉపద్రవములను కలుగఁజేయకుండును.

శీతోదకం పయః క్షౌద్రం ఘృతమేకైకశో ద్విశః,
త్రిశస్సమస్తమథవా ప్రాక్పీతం స్థాపయేద్వయః. ౧౪౬

శీతోదకము ఆవుపాలు, తేనె, నెయ్యి వీనిని ప్రత్యేక ప్రత్యేకముగాని రెండేసిగా చేర్చిగాని మూఁడేసిగ చేర్చిగాని అన్నిఁటిని చేర్చిగాని భోజనమునకుముందు పానముచేసిన యౌవనము స్థిరముగ కలుగును.

### వాతాతపహారీతకీవిధానము

గుడేన మధునా శుంఠ్యా కృష్ణయా లవణేన వా,
ద్వే ద్వే ఖాదన్ సదా పథ్యే జీవేద్వర్షశతం సుఖీ. ౧౪౭

మనుజుఁడు ప్రతిదినము రెండేసి కరక్కాయలను బెల్లముతోఁగాని తేనెతోఁగాని శుంఠితోఁగాని పిప్పళ్ళతోఁగాని సైంధవలవణముతోఁగాని భక్షింపుచుండిన నూరు సంవత్సరములు సుఖముగ జీవించును

### హారీతకీఘృతము

హారీతకీం సర్పిషి సంప్రతాప్య సమశ్నతస్తత్పిబతో ఘృతం చ,

---

* శ్లో. వాతాతపవిధానేఽపి విశేషేణ వివర్జయేత్,
కులత్థదధిశుక్తాని తైలాభ్యంగనిషేవణమ్.

వాతాతపికరసాయనయోగములను సేవించువారును ఉలవలు, పెరుగు, కలి, తైలాభ్యంగము వీనిని వర్జింపవలయును.

భవేచ్చిరస్థాయి బలం శరీరే సకృత్కృతం సాధు యథా కృతజ్ఞే.

కరక్కాయబెరడును నేతితో వేయించి భక్షించి యాఘృతమును పానముచేసిన యెడ కృతజ్ఞుఁడగు వానికి చేసిన యుపకారమునుబోలె శరీరమునం దెల్లపుడు స్థిరమైన బలము కలుగును.

## ధాత్రీరసాయనము.

ధాత్రీరసక్షౌద్రసితాఘృతాని
హితాశనానాం లిహతాం నరాణాం,
ప్రణాశమాయాంతి జరావికారా
గ్రంథావిశాలా ఇవ దుర్గృహీతాః. ౧౪౯

ఉసిరికపండురసము, తేనె, పంచదార, ఆవునెయ్యి వీనిని సమముగ చేర్చి సేవించి హితమైన యాహారములను భుజించు వారికి "చక్కఁగ చదవఁబడక యుండు గొప్ప గ్రంథములు శీఘ్రముగ నశించు చందంబున" ముసలితనము వలన జనించిన వికారములు నశించును.

## ధాత్ర్యాదిచూర్ణము.

ధాత్రీక్రిమిఘ్నాసనసారచూర్ణం సతైలసర్పిర్మధులోహరేణు,
నిషేవమాణస్య భవేన్నరస్య తారుణ్యలావణ్యమవిప్రణష్టమ్.

ఉసిరికపండ్లు, వాయువిడంగములు, వేగిసచేవ వీనిచూర్ణము; నువ్వులనూనె, ఆవునెయ్యి, లోహచూర్ణము అనువాని నొకటిగ చేర్చి సేవింపుచుండు మనుజునికి యౌవన సౌందర్యములు నశించక యుండును.

## లోహాదిచూర్ణము.

లోహం రజో వేల్లభవం చ సర్పిః క్షౌద్రద్రుతం స్థాపితమబ్దమాత్రమ్,
సాముద్గకే బీజకసారక్లృప్తే లిహన్ బలీ జీవతికృష్ణకేశః. ౧౫౧

లోహచూర్ణము, వాయువిడంగముల చూర్ణము, ఆవునెయ్యి, తేనె వీనిని సమముగ నొకటిగ చేర్చి కలియఁబెట్టి వేగిసచేవతోఁ జేయఁబడిన సంపుటములో నొక సంవత్సరము నిలువనుంచి పిదప దానిని సేవించిన మనుజుఁడు మిక్కిలి బలము నల్లని తలవెండ్రుకలు వీనితోడ చిరకాలము జీవించును.

## విడంగాదిచూర్ణము.

విడంగభల్లాతకనాగరాణి యేఽశ్నంతి సర్పిర్మధుసంయుతాని,

జరానదీం రోగతరంగిణీం తే లావణ్యాయుక్తాః పురుషా స్తరంతి.

వాయువిడంగములు, జీడిగింజలు, శుంఠి అనువానిని ఆవునెయ్యి, తేనె వీనితోడ ప్రతిదినము సేవించు పురుషులు రోగమనెడు అలలతోఁగూడియుండు ముసలితనమనెడు నదిని దాటి సౌందర్యముతోడ చిరకాలము జీవింతురు.

## త్రిఫలవాతాతపవిధానము.

ఖదిరాసనయూషభావితాయా
స్త్రిఫలాయా ఘృతమాక్షికప్లుతాయాః,
నియమేన నరా నిషేవితారో
యది జీవంత్యరుజః కిమత్ర చిత్రమ్.　　౧౫౩

త్రిఫలములను, చండ్ర, వేగిస అనువానికషాయములలో భావనచేసి దానిని ఆవు నెయ్యి, తేనె వీనితోడ ప్రతిదినము తప్పక సేవించువారు రోగరహితులై నిశ్చయముగ చిరకాలము జీవింతురు.

బీజకస్య రసమంగుళిహార్యం శర్కరామధుఘృతం త్రిఫలాం చ,
శీలయత్సు పురుషేషుజరత్వాస్వాగతాపి వినివర్తత ఏవ.　　౧౫౪

చిక్కఁగనుండు వేగిసరసము, పంచదార, తేనె, నెయ్యి, త్రిఫలములు వీనిని సమముగగూర్చి సేవించిన పురుషులకు, ముసలితనమువచ్చినను అది చక్కఁగ నివర్తించును.

## పునర్నవారసాయనము.

పునర్నవస్యార్ధపలం నవస్య
పిష్టం పిబేద్యః పయసార్ధమాసమ్,
మాసద్వయం తత్త్రిగుణం సమాం వా
జీర్ణోఽపిభూయ స్సపునర్నవస్స్యాత్.　　౧౫౫

క్రొత్తగనుండు గలిజేరును అరపలము గ్రహించి ఆవుపాలలో నూరి కలిపి పదునైదు దినములు లేక రెండు మాసములు లేక ఆరు మాసములు లేక ఒక సంవత్సరము సేవించి పథ్యాహారములను భుజింపుచుండిన ముసలితనముగల మనుజుఁడు గూడ యౌవనము గలవాఁ డగును.

## మూర్వాదిరసాయనము.

మూర్వాబృహత్యంశుమతీబలానాముశీరపాఠాసనసారిబానామ్,
కాలానుసార్యాగురుచందనానాం వదంతి పౌనర్నవమేవకల్పమ్,

చాగ, వాకుడు లేక, ములక, ముయ్యాకుపొన్న, చిట్టాముట్టి, వట్టివేరు, చి
బొద్ది, వేగిస, నల్లసుగంధిపాల, యిరుగుడు, అగరు, చందనము అనువానిని పైగలిజేర
చెప్పయుంచునటుల నూరి ఆవుపాలలో కలిపి సేవించిన రసాయనఫలము కలుగు
మహర్షులు వచింపుచున్నారు.

### శతావరీఘృతరసాయనము.

శతావరీకల్కకషాయసిద్ధం యే సర్పిరశ్నంతి సితాద్వితీయం,
తాన్ జీవితాధ్వానమభి ప్రపన్నాన్న విప్రలుంపంతి వికారచౌర

పిల్లిపీచర కషాయకల్కములతోఁ బక్వముచేయఁబడిన ఘృతమును పంచ
సహితముగ పానము చేయుమనుజులు ఆయుస్సు అనుమార్గమునందు సంచరించునపు
వారిని రోగము నెడుచోరులు పీడింపఁజాలరు. అనఁగా నీరసాయనమును సేవింపుచుఁ
మనుజులకు జీవితకాలమువఱకు రోగములు కలుగవని భావము.

### అశ్వగంధారసాయనము.

పీతాశ్వగంధా పయసార్ధమాసం ఘృతేన తైలేన సుఖాంబునా
కృశస్య పుష్టిం వపుషో విధత్తే బాలస్య సస్యస్యయథా సువృ

పెన్నేరుగడ్డచూర్ణమును ఆవుపాలతోఁగాని ఆవునేతితోఁగాని నువ్వులనూనె
గాని ఉష్ణోదకముతోఁగాని పదునైదుదినములు పానముచేసి పథ్యముతో నుండిన "వ
వర్షముచే లేఁతసస్యములకు పుష్టికలుగుచందంబున" కృశించియుండువారికి శరీర
కలుగును.

### కృష్ణతిలరసాయనయోగము.

దినేదినే కృష్ణతిలప్రకుంచం సమశ్నతాం శీతజలానుపానమ్,
పోషశ్శరీరస్య భవత్యనల్పో దృఢీభవంత్యామరణాచ్చ దంతాః.

ప్రతిదినము నల్లనువ్వులను ఒక పలముభక్షించి శీతోదకమును అనుపాన
పానముచేయువారికి విశేషశరీరపుష్టి కలుగుటయేగాక మరణమువఱకు దంతములు చ
పక దృఢములై యుండును.

### శ్వదంష్ట్రాదిరసాయనయోగము.

చూర్ణం శ్వదంష్ట్రామలకామృతానాం
లిహన్ససర్పిర్మధుభాగమిశ్రమ్,
వృషః స్థిరశ్శాంతవికారదుఃఖః
సమాశ్శతం జీవతి కృష్ణకేశః.

పల్లేరు, ఉసిరికపరుగు, తిప్పతీఁగె వీనిచూర్ణమును ఆవునెయ్యి, తేనె వీనితోఁడ ప్రతిదినము సేవించువారు ధాతుపుష్టి బలము నల్లనితలవెండ్రుకలు వీనితోఁగూడి రోగరహితులై నూరుసంవత్సరములు జీవింతురు.

### హరీతక్యామలకరసాయనయోగము.

సార్ధంతిలైరామలకాని కృష్ణై
రక్షాణి సంక్షుద్య హరీతకీర్వా,
యేఽద్యుర్న్మయూరా ఇవ తే మనుష్యా
రమ్యం పరీణామమవాప్నువంతి. ౧౬౧

నల్లనువ్వులతోఁడ ఉసిరికపరుగును గాని తాడికాయ బెరడును గాని కరక్కాయను గాని చూర్ణముచేసి ప్రతిదినము భక్షింపుచుండు వారు నెమలివలె సుందరముగ నుండు యౌవనమును జెందుదురు.

### శిలాజత్వాదిరసాయనయోగము.

శిలాజతుక్షౌద్రవిడంగసర్పిర్లోహాభయాపారదతాప్యభక్షః,
ఆపూర్యతే దుర్బలదేహధాతుస్త్రిపంచరాత్రేణ యథాశశాంకః.

శిలాజతువు, తేనె, వాయువిడంగములు, ఆవునెయ్యి, లోహచూర్ణము, కరక్కాయ, పాదరసము, ధాతుమాక్షికము వీనిని సమముగ చేర్చి సేవించిన పైదుదినములలోపల చంద్రుఁడు వృద్ధిఁజెందు చందంబున కృశించినవారికి శరీరబలధాతుపుష్టులు వృద్ధిఁజెందును.

### భృంగరసాయనయోగము.

యే మాసమేకం స్వరసం పిబంతి దినేదినే భృంగరజస్సముత్థమ్,
క్షీరాశిన స్తేబలవీర్యయుక్తా స్సమాశ్శతం జీవితమాప్నువంతి.

గుంటగలగరాకు రసమును ఒక మాసమువఱకు ప్రతిదినము పానముచేసి ఆవుపాలుతోఁడ అన్నమును భుజింపుచుండిన మనుజులు బలవీర్యయుక్తులై నూరు సంవత్సరములు జీవింతురు.

### వచారసాయనవిధి.

మాసం వచామప్యుపసేవమానాఃక్షీరేణ తైలేనఘృతేనవాఽపి,
భవంతి రక్షోభిరధృష్యరూపా మేధావినోనిర్మలమృష్టవాక్యాః,

వసను ఆవుపాలతోఁ గాని ఆవునేతితోఁ గాని నువ్వులనూనెతోఁ గాని
మాసము భుజించిన మనుజులు రాక్షసబాధరహితులై ధారణశక్తిఁగల బుద్ధి, మేధ, స్వ
ముగ మధురముగనుండు వాక్కు వీనితోఁ సుఖముగ జీవింతురు.

మండూకపర్ణీరసాయనవిధి.

మండూకపర్ణీమపి భక్షయంతో
భృష్టాం ఘృతే మాసమనన్నభక్ష్యాః,
జీవంతి కాలం విపులం ప్రగల్భా
స్తారుణ్యలావణ్యగుణోదయస్థాః. ౧౬

సరస్వతియాకును నేతిలోవేయించి ఒకమాసమువఱకు భుజింపుచు అన్నము
భక్షింపకయుండిన మనుజులు యౌవనము సౌందర్యము సుగుణములు వీనితోగూడ
కాలము జీవించియుందురు.

లాంగల్యాదిరసాయనగుటికలు.

లాంగలీత్రిఫలాలోహపలపంచాశతాకృతమ్,
మార్కవస్వరసే పక్త్వా గుటికానాం శతత్రయమ్. ౧౬
ఛాయావిశుష్కం గుటికార్ధమద్యా
త్పూర్వం సమస్తామపి తాం క్రమేణ,
పిబేద్వారి క్తః క్రమశశ్చ మండం
పేయాం విలేపీం రసకౌదనంచ. ౧౬
సర్పిఃస్నిగ్ధం మాసమేకం యతాత్మా
మాసాదూర్ధ్వం సర్వథా స్వైరవృత్తిః,
వర్జ్యం యత్నాత్సర్వకాలం త్వజీర్ణం
వర్షేణైవం యోగమేవోపయుంజ్యాత్. ౧౬
భవతి విగతరోగో యోఽప్యసాధ్యామయార్తః
ప్రబలపురుషకారశ్శోభతే యోఽపివృద్ధః,
ఉపచితపృథుగాత్రశ్శ్రోత్రనేత్రాదియుక్త
స్తరుణ ఇవ సమానాం పంచజీవేచ్ఛతాని. ౧౬

నాగేటిచాలుగడ్డ, త్రిఫలములు, ఇనుము వీనిని దినుసుకు పది పలముల చొప్ప
మొత్తము ఏబది పలములను గుంటగలగరాకుస్వరసముతో నూరి మూఁడువందలా అరు

గుటికలుచేసి నీడనెండించి తొలుత నాగుటిక యొకటిలో సగమును భుజింపవలయును. ఇటుల ఒక మాసమునఱకు భుజింపుచు విరేచనంబైన పిదప క్రమముగ ముండము, పేయి, విలేపి అనుగంజులను మాంసరసముతోడ నన్నమును విశేషముగ నేతితో భుజింపవలయును. పిదప పథ్యములేకయే యథేష్టముగ సర్వాన్నములను భుజింపనగును. అజీర్ణకరమగు అన్నమును మాత్రము ప్రయత్నముతో వర్జింపవలయును. ఈప్రకారము ఆగుటికల నన్నిఁటిని ఒక సంవత్సరము లోపల భుజింపవలయును. ఇటులచేసిన మనుజుఁడు అసాధ్యరోగ పీడితుఁడుగ నుండినను మిక్కిలి వృద్ధుఁడుగ నుండినను శరీరపుష్టి బలము చక్షురాదీంద్రియపటుత్వము వీనితోడంగూడి యౌవనము గలవానివలె ఐదువందల సంవత్సరములు జీవించును.

## నారసింహఘృతము.

గాయత్రీశిఖశింశుపాసన శివావేల్లాక్షుకారుష్కరాన్
పిష్ట్వాష్టాదశసంగుణేఽంభసి ధృతాన్ ఖండైస్సహాయోమయైః,
పాత్రే లోహమయే త్ర్యహం రవికరైరాలోడయన్పాచయే
దగ్నౌచానుమృదౌ సలోహశకలం పాదస్థితం తత్పచేత్. ౧౭౦
పూతస్యాంశః క్షీరతోఽంశ స్తథాంశో
భార్ఙ్గాన్నిర్యాసాద్ద్వౌ వరాయాస్త్రయోఽంశాః,
అంశాశ్చత్వారశ్చేహ హయ్యంగవీనా
దేకీకృత్యైతత్సాధయేత్కృష్ణలోహైః. ౧౭౧
విమలఖండసితామధుభిః పృథగ్యు
తమయుక్తమిదం యది వా ఘృతమ్,
స్వరుచిభోజనపానవిచేష్టితో
భవతి నా పలశః పరిశీలయన్. ౧౭౨
శ్రీమాన్నిర్ధూతపాప్మా వనమహిషబలోవాజివేగః స్థిరాంగః
కేశైర్భృంగాంగనీలైర్మధుసురభిముఖో నైకయోషిన్నిషేవీ,
వాఙ్మేధాధసమృద్ధస్సపటుహుతవహో మాసమాత్రోపయోగా
ద్ధత్తేఽసౌ నారసింహం వపురనలశిఖాతప్తచామీకరాభమ్.
అత్తారం నారసింహస్య వ్యాధయోన స్పృశంత్యపి,
చక్రోజ్జ్వలభుజం భీతా నారసింహ మివాసురాః. ౧౭౪

చంద్ర, చిత్రమూలము, యినుగుడుము, వేగిస, కరకకాయ, వాయువిడంగములు, తొనికాయ, జీలకఱ్ఱలు అనువానిని సమముగ గ్రహించి యినుపకుండలోవైచి దాని మీదింత ఉదకముబోసి అందులో నినుపతునకలనుచేర్చి మూఁడుదినములు ఎండలోనుంచి కఱ్ఱచే కలియఁబెట్టుచుండవలయును. పిదప దానిని పొయిమీఁదఁబెట్టిమృద్వగ్నిచే నాలవభాగము మిగులునటుల కషాయముకాచి వడియగట్టి యాకషాయము ఒక భాగము, ఆవుపాలు ఒక భాగము, గుంటగలగరాకురసము రెండు భాగములు త్రిఫలకషాయము మూఁడుభాగములు, ఆవునెయ్యి నాల్గుభాగములు, ఇటుల వీనినన్నిఁటినొకటిగచేర్చి ఇనుపపాత్రలోబోసి పైయినుపతునకలతోడ మరల ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. దీనిలో ఖండశర్కరను లేక తేనెను చేర్చిగాని చేర్చకగాని పానము చేయవలయును. ఇది నారసింహఘృతమనఁబడును. దీనిని ప్రతిదినము ఒకపలప్రమాణముచొప్పున ఒక మాసమువఱకు పానముచేసి యథేచ్ఛాహారవిహారముల నేయుచుండిన మనుజుఁడు మంచి బుద్ధిగలవాఁడుగ అడవియున్నబోతునంటి బలము, గుఱ్ఱమువంటి వేగము, దృఢాంగత్వము, నల్లనివెండ్రుకలు, నోటియందు తేనెతో తుల్యమగువాసన, అనేకస్త్రీసంభోగశక్తి స్పష్టమైనవాక్కు, ధారణాశక్తి, మంచిబుద్ధి, జాఠరాగ్నిదీప్తి, కరగించిన అపరంజివంటి శరీరవర్ణము వీనిని జెందును. మఱియు చక్రధరుండగు నృసింహమూర్తి సమీపంబున నసురులు భయముచే రాకుండునటుల నీఘృతమును సేవించువారి సమీపంబున రోగములు రాకుండును.

భృంగప్రవాళరసాయనము.

భృంగప్రవాళానమునైవ భృష్టాన్
ఘృతేన యః ఖాదతియంత్రితాత్మా,
విశుద్ధకోష్ఠోఽసనసారసిద్ధ
దుగ్ధానుపస్తత్కృతభోజనార్థః. ॥౧౭॥
మాసోపయోగాత్ససుఖీ జీవత్యబ్దశతద్వయమ్,
గృహ్ణాతి సకృదప్యుక్తమవిలుప్తస్మృతీంద్రియః. ॥౧౮॥

మనుజుఁడు స్నేహవమనవిరేచనకర్మల చేయించికొని పరిశుద్ధమైన కోష్ఠముగలవాఁడై గుంటగలగరచిగుళ్లను పైనారసింహఘృతములో వేయించి భక్షించి వేగిస చేవనుచేర్చి కాచఁబడిన యావుపాలను అనుపానముగ పుచ్చుకొని పైపాలతోడనే సంబావు బియ్యపు అన్నమును భుజింపవలయును. ఇటుల నొకమాసము సేవించిన సుఖముతోడ రెండువందల సంవత్సరములు మనుజుఁడు జీవించును. చక్షురాదీంద్రియములు స్మృతి వీనికి హాని కలుగకుండును. మఱియు వానికి ఒకపర్యాయము చెప్పిన మాత్రముచేతనే గ్రహించునట్టి ధారణాశక్తి కలుగును.

### భృంగతైలకల్పము.

అనేనైవ చ కల్పేన యస్తైలముపయోజయేత్,
తానేవాప్నోతి సగుణాన్ కృష్ణకేశశ్చ జాయతే. ౧౭౭

పైచెప్పిన నారసింహఘృతవిధిప్రకారము తైలమును సిద్ధముచేసి సేవించిన మనుజునికి పైచెప్పిన గుణములన్నియు కలుగుటయే గాక వెండ్రుకలును నల్లనగును.

### యుగానురూపరసాయనము.

ఉక్తాని శక్యాని ఫలాన్వితాని యుగానురూపాణి రసాయనాని,
మహానుశంసాన్యపి చాపరాణి ప్రాప్త్యాదికష్టాని నకీర్తితాని. ౧౭౮

కలియుగమున కనుగుణములును మిక్కిలి సుఖాయురారోగ్యాది సుగుణంబులను కలుగఁజేయునవియు సేవించుటకు సులభంబుగ నుండునవియునగు రసాయనయోగములు చెప్పఁబడినవి. మిగుల శ్రేష్ఠంబుగ విశేషగుణములతోఁ గూడినవిగ నుండు ఇతరరసాయన యోగములుండినను అవి యీయుగంబున ననుష్ఠించుట కశక్యంబుగను వానిలో జెప్పియుండు ఔషధంబులు లభించుట దుర్లభంబుగను నతికష్టావహంబులుగ నుండుట వలన వానిని తంత్రకారుఁడెచట వచింపఁడయ్యె.

### రసాయనవిధిభ్రంశచికిత్స.

రసాయనవిధిభ్రంశాజ్జాయేరన్వ్యాధయో యది,
యథా స్వమౌషధం తేషాం కార్యం ముక్త్వారసాయనమ్.

రసాయనయోగమును సేవించినపుడు అపథ్యాదులచే రోగములు జనించినచో రసాయనసేవనను వదలి ఆయా రోగములకు చెప్పియుండు ఔషధములను సేవింపవలయును.

### నిత్యరసాయనలక్షణము.

సత్యవాదినమక్రోధమధ్యాత్మప్రవణేంద్రియమ్,
శాంతం సద్వృత్తనిరతం విద్యాన్నిత్యరసాయనమ్. ౧౮౦

సత్యమును సంభాషించువాఁడును, కోపరహితుఁడును, యోగాభ్యాసము చేయువాఁడును, శాంతి, సదాచారము వీనితోఁగూడిన వాఁడును నగు మనుజుఁడు ప్రతి దినము రసాయనసేవనవలన కలుగు ఫలమును పొందును

### రసాయనసేవనగుణము.

గుణైరేభిస్సముదితస్సేవతే యో రసాయనమ్,

స నివృత్తాత్మా దీర్ఘాయుః పరత్రేహ చ మోదతే. ౧౮౧

మనుజుఁడు పైచెప్పిన సత్యాదిసుగుణ సమన్వితుండై పై రసాయనములను సేవించిన దీర్ఘాయువుతోఁ గూడి యిహలోకమున మిక్కిలి సుఖముల ననుభవించి లోకాంతరంబున పరమానందమును పొందును.

### పరిపూర్ణరసాయనఫలము.

శాస్త్రానుసారిణీ చర్యా చిత్తజ్ఞాః పార్శ్వవర్తినః,
బుద్ధిరస్ఖలితార్థేషు పరిపూర్ణం రసాయనమ్. ౧౮౨

తనప్రవర్తనము శాస్త్రపద్ధతి ననుసరించి యుండుట, తనపరిచారకులు తనచిత్తము నెఱింగి మెలంగుచుండుట, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను నట్టియింద్రియముల విషయములయందు ఆయాయింద్రియమును స్వేచ్ఛగవిడువక చలనములేని బుద్ధికల్గియుండుట, ఈమూఁడును పరిపూర్ణమైన రసాయనమై యుండును.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
ముప్పదితొమ్మిదవ యధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# చ త్వా రిం శా ధ్యా య ము

(వాజీకరణతంత్రము, ౭-వ అంగము.)



అవ. రసాయనాధ్యాయనిరూపణానంతరము రసాయనమువలె బలవీర్యాదులు కలుగుట కుపాయమును దెలియపఱచునట్టి వాజీకరణాధ్యాయము చెప్పఁబడుచున్న యది:—

# వాజీకరణాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో వాజీకరణాధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

రసాయనాధ్యాయనిరూపణానంతరము వాజీకరణ యోగములను దెలియపఱచు నట్టి వాజీకరణమను నీయధ్యాయమును వివరించెదము:—

(వాజీకరణమనః—దుష్టములగు వాతాదిదోష సంబంధమునంజేసి జీవాధారమైన రేతస్సు చెడియుండు వారికి అట్టిరేతస్సును నిర్దుష్టముగఁజేసి సంభోగవిషయమై గుఱ్ఱమును బోలె పూర్ణమైన శ క్తిని కల్గించునదియని యర్థము.) ఈవిషయము క్రిందనుండు రెండు మూఁడు శ్లోకములచే తంత్రకారుఁడే వివరించెను.

వాజీకరణౌషధగుణము.

వాజీకరణమన్విచ్ఛే త్సతతం విషయీ పుమాన్,
తుష్టిః పుష్టిరపత్యం చ గుణవ త్తత్ర సంశ్రితమ్. ౧
అపత్యసంతానకరం యత్సద్య స్సంప్రహర్షణమ్,

స్త్రీసంభోగమునం దాస క్తిగల పురుషుఁడు వాజీకరణౌషధములనెల్లప్పుడు సేవిం పుచుండవలయును. దానిచేత సంతోషము శరీరపుష్టి మంచిగుణముగల పుత్రసంతానము గొప్పసంతోషము యివి తత్క్షణమున కలుగును.

వాజీకరణలక్షణము.

వాజీవాతిబలో యేన యాత్యప్రతిహతోఽఙ్గనాః, ౨

భవత్యతిప్రియః స్త్రీణాం యేన యేనోపచీయతే,
తద్వాజీకరణం తద్ధి దేహస్యోర్జస్కరం పరమ్. 3

ఏయౌషధసేవనచే పురుషుఁడు గుఱ్ఱమువలె నధిక బలముగలవాఁడై స్త్రీసంభోగమునందు మిక్కిలి సామర్థ్యము గలవాఁడుగ స్త్రీలకు మిక్కిలి ప్రియుఁడుగ నగునో, మఱియు నేయౌషధముచే శరీరము విశేషముగ వృద్ధిఁజెందునో, యది యవాజీకరణమనఁబడును. ఇది విశేషబలమును కలుగఁజేయును.

## బ్రహ్మచర్యప్రాశస్త్యము.

ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వయరసాయనమ్,
అనుమోదామహే బ్రహ్మచర్యమేకాంతనిర్మలమ్. ౪

ధర్మము, యశస్సు, ఆయుస్సు వీనిని కలుగఁజేయునదియు, ఇహలోక పరలోకములకు రసాయనమువలె మిక్కిలి యుపకారియునగు బ్రహ్మచర్యము ఎల్లప్పుడు నిర్మలముగ నుండును. కావున నది మిక్కిలి శ్రేష్ఠమైనది.

## వాజీకరణప్రయోజనము.

అల్పసత్త్వస్య తు క్లేశైర్బాధ్యమానస్య రాగిణః,
శరీరక్షయరక్షార్థం వాజీకరణముచ్యతే. ౫

స్వల్పశక్తిగలవాఁడును విషయానుభవము వలన జనించిన దుఃఖములచే పీడింపఁబడియుండువాఁడును స్త్రీసంభోగేచ్ఛ గలవాఁడును నగు పురుషునికి శరీర రక్షణము కొఱకై తంత్రకారునిచే నీవాజీకరణము చెప్పఁబడుచున్నది. లోకమునందు నైశ్రేయసికము, ఆభ్యుదయికము అని రెండుమార్గములు గలవు. అందు కేవలము పరలోకమునకు సాధనమైనది నైశ్రేయసికము. ఇహలోకమున కల్గు సంతానాది సుఖములకనుకూలమైనది ఆభ్యుదయికము. వానిలో నైశ్రేయసికమార్గము ననుసరించి బ్రహ్మచర్యోపదేశము చేయఁబడును. ఆభ్యుదయికమార్గము ననుసరించి స్త్రీసంభోగము మొదలగు విషయానుభవములకు సాధనమైన వాజీకరణాద్యుపదేశ మిచట చెప్పఁబడుచున్నది. ఇతర తంత్రకారులును ఈ వాజీకరణమును చెప్పియున్నారు.

కల్పస్యోదగ్రవయసో వాజీకరణసేవినః,
సర్వేష్వృతుష్వహరహర్వ్యవాయో న నివార్యతే. ౬

సమర్థుఁడును యౌవనవయస్సుగలవాఁడును వాజీకరణౌషధములను సేవించువాఁడును నగు పురుషునికి అన్నిఋతువులయందును ప్రతిదినమునందును స్త్రీసంభోగము చేయందగును.

### వాజీకరణసేవనక్రమము.

అథ స్నిగ్ధవిశుద్ధానాం నిరూహాన్ సానువాసనాన్,
ఘృతతైలరసక్షీరశర్కరాక్షౌద్రసంయుతాన్. ౭
యోగవిద్యోజయేత్పూర్వం క్షీరమాంసరసాశినామ్,
తతో వాజీకరాన్ యోగాన్ శుక్రాపత్యవివర్ధనాన్. ౮

స్నేహకర్మను చేయించుకొని వమనవిరేచనంబులచే శుద్ధమైన శరీరము గలవాఁడును, ఆవుపాలతోడను మాంసరసముతోడను అన్నమును భుజించువాఁడును నగు పురుషునికి నువ్వులనూనె, ఆవునెయ్యి, ఆవుపాలు, మాంసరసము, పంచదార, తేనె అను వానితోఁ గూడియుండు నిరూహానువాసన వస్తికర్మలను తొలుతఁజేయించి వాజీకరణ యోగముల నెఱింగినవైద్యుఁడు శుక్రవృద్ధిని పుత్రవృద్ధిని కలుగఁజేయునట్టి వాజీకరణ యోగములను ప్రయోగింపవలయును.

### సంతానరహితపురుషనింద.

అచ్ఛాయః పూతికుసుమః ఫలేన రహితో ద్రుమః,
యథైకశ్చైకశాఖశ్చ నిరపత్యస్తథా నరః. ౯

ఛాయావిహీనంబును దుర్గంధయుక్త పుష్పములతోఁ గూడినదియు, ఫలరహితమైనదియు, ఒకటే కొమ్మగలదియు, ఒకటిగ నుండునదియు నగు వృక్షము మనుజులచే నెటుల నిందింపఁబడునో అటులనే సంతానములేకుండు మనుజుఁడు నిందింపఁబడును.

### సంతానప్రశంస.

స్ఖలద్గమనమవ్యక్తవచనం ధూళిధూసరమ్,
అపిలాలావిలముఖం హృదయాహ్లాదకారకమ్. ౧౦
అపత్యం తుల్యతా కేన దర్శనస్పర్శనాదిషు,
కింపునర్యద్యశోధర్మమానశ్రీకులవర్ధనమ్. ౧౧

తడఁబడుచుండు నడక, స్పష్టముగాని మాటలు, దుమ్ముచే పూయఁబడిన శరీరము, జొల్లుకారుచుండు నోరు, యీలాటి చిహ్నములు గల శిశువు మనుజులను జూచుటవలనను, తాకుటవలనను, హృదయమునకు మిక్కిలి సంతోషముకలుగును. దీనికి సమానమైన సుఖ మీలోకమునం దెద్దియులేదు. కావున యశస్సు, ధర్మము, గౌరవము, సంపద, కులము వీనిని వృద్ధిఁజేయునట్టి సుగుణసంతానము మనుజుని మనస్సునకు మిక్కిలి సంతోషమును కలుగఁజేయునని వేరుగ చెప్పనేల? అట్టి సంతానము లభించుటకు వాజీక

### శుద్ధశరీరమున వాజీకరణౌషధప్రయోగము.

శుద్ధకాయే యథాశక్తి వృష్యయోగాన్ ప్రయోజయేత్,

జాఠరాగ్ని బలానుగుణముగ శుద్ధశరీరముగల పురుషునికి నిఁక చెప్పఁబోఁ
వాజీకరణయోగములను ప్రయోగింపవలయును.

### వృష్యలేహము.

శరేక్షుకుశకాశానాం విదార్యా వీరణస్య చ.
మూలానికంటకార్యాశ్చ జీకర్షభకౌబలామ్,
మేదే ద్వే ద్వే చకాకోల్యౌ శూర్పపర్ణ్యౌ శతావరీమ్.
అశ్వగంధామతిబలామాత్మగుప్తాం పునర్నవామ్,
వీరాం పయస్యాంజీవంతీమృద్ధిం రాస్నాం త్రికంటకమ్.
మధుకం శాలిపర్ణీం చ భాగాం స్త్రిపలికాన్ పృథక్,
మాషాణా మాఢకంచైతద్ద్విద్రోణే సాధయేదపామ్.
రసేనాఢకశేషేణపచేత్తేన ఘృతాఢకమ్,
దత్వా విదారీధాత్రీక్షురసానామాఢకాఢకమ్.
ఘృతాచ్చతుర్గుణం క్షీరంపేష్యాణీమాని చావపేత్,
వీరాం స్వగుప్తాం కాకోల్యౌ యష్టీంఫల్గూని పిప్పలీమ్.
ద్రాక్షాం విదారీం ఖర్జూరం మధుకాని శతావరీమ్,
తత్సిద్ధపూతం చూర్ణస్య పృథక్ప్రస్థేనయోజయేత్.
శర్కరాయాస్తుగాయాశ్చ పిప్పల్యాఃకుడవేన చ,
మరిచస్య ప్రకుంచేన పృథగర్ధపలోన్మితైః.
త్వగేలాకేసరైఃశ్లక్ష్ణైః క్షౌద్రాద్ద్వికుడవేన చ,
పలమాత్రంతతః ఖాదేత్ప్రత్యహం రసదుగ్ధభుక్.
తేనారోహతివాజీవ కులింగ ఇవ హృష్యతి,

రెల్లు, చెఱుకు, కుశగడ్డి, కుంచురెల్లు, నేలగుమ్ముడు, వీరతృణము, (అః ఆవురుగడ్డి) వ్రాకుడు వీనివేళ్లు. జీవకము, ఋషభకము, చిట్టాముట్టి, మేద, మేద, కాకోళి, క్షీరకాకోళి, కారుమినుములు, అడవిపెసల, పిల్లిపీచర, పెన్నేర పేరాముట్టి, రేగటిచూలగోవిల, గలిజేరు, పెద్దచల్లపిల్లి గడ్డలు, సిన్నమనుబాల,

మనుబాల, బుద్ధి, త్రికంటకములు, అతిమధురము, ముయ్యాకుపొన్న వీనిని దిను మూఁడుపలములపొప్పున గ్రహించి రెండుదోర్ణము లుదకములో వైచి అంద రెండుఆఢకములు మినుములను చేర్చి ఒకఆఢకము మిగులునటుల చక్కఁగ కషాం కాచి వడియఁగట్టి దానిలో ఆవునెయ్యి ఒకఆఢకము, నేలగుమ్ముడు, ఉసిరిక చె వీనిరసములు దినుసుకు ఒకఆఢకము, ఆవుపాలు నాల్గుఆఢకములు యిటుల వీనిని పెద్దపిల్లిపీచర, రేగటిదూలగోవిల, కాకోళి, క్షీరకాకోళి, అతిమధురము, బ్రహ్మ పిప్పళ్ళు, ద్రాక్ష, నేలగుమ్ముడు, ఖర్జూరము, యష్టిమధుకము, పిల్లిపీచర వీనిని ముగ గ్రహించి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిఁ పక్వముచేసి వడియగట్టి అం పంచదార, తవక్షీరి, (వెదురుప్పు) వీనిచూర్ణము ఒకప్రస్థము, పిప్పళ్లు నాల్గుపలః మిరియాలు ఒకపలము, లవంగపుచెక్క, ఏలకలు, నాగకేసరములు అనుపానిచూ అరపలము, తేనె రెండుకుడవములుచేర్చి చక్కఁగ కలియబెట్టి దానిని ప్రతిదినమ పలము పానముచేసి మాంసరసము ఆవుపాలు వీనితోడ అన్నమును భుజింపవలచ ఇటులఁ జేసిన గుఱ్ఱమువంటి సంభోగశక్తి పిచ్చుకవంటి క్రీడాశక్తియు కల్గును.

## విదార్యాదిచూర్ణము.

విదారీపిప్పలీశాలి ప్రియాళేక్షురకాద్రజః.
పృథక్ స్వగుప్తామూలాచ్చ కుడవాంశం తథా మధు,
తులార్ధం శర్కరాచూర్ణాత్ప్రస్థార్ధం నవసర్పిషః.
సోఽక్షమాత్రమతః ఖాదేద్యస్య రామాశతం గృహే,

నేలగుమ్ముడుగడ్డ, పిప్పళ్లు, శాలి, మొరలి, గొలిమిడి, తీటకసిందవే చూర్ణము దినుసుకు వకకుడవము, తేనె వకకుడవము, పంచదార యాభైపలములు, నెయ్యి పదునారుపలములు వీనినన్నిఁటి నొకటిగచేర్చి చక్కఁగ కలియఁబెట్టి ప్రతిదినము కర్షప్రమాణము భక్షించిన మనుజులకు నూరుస్త్రీల నేకకాలమున గించునట్టి శక్తికలుగును.

## ఆత్మగుప్తాదియోగము.

సాత్మగుప్తాఫలాన్ క్షీరే గోధూమాన్ సాధితాన్ హిమా
మాషాన్వా సఘృతక్షౌద్రాన్ ఖాదాన్ గృష్టిపయో నుప
జాగర్తి రాత్రిం సకలామస్విన్నః స్వేదయేత్త్రియః.

తీటకసిందవిత్తులు, గోధుమలు వీనిని ఆవుపాలలో చేర్చి వండి చల్లార్చి గాని ఆవుపాలలో మినుములనువండి దానిని ఆవునెయ్యి, తేనె వీనితోఁగాని

త్రాలుచూరు దూడవేసిన యావుపాలను పానముచేసిన అనేకస్త్రీలను సంభోగించునట్టి శక్తి మనుజులకు కలుగును.

భావితతిలయోగము.

బస్తాండసిద్ధే పయసి భావితానసకృత్తిలాన్,
యః ఖాదేత్ససితాన్ గచ్ఛేత్స స్త్రీశతమపూర్వవత్. ౨౪

గాడిదెగడపరిచెట్టునుచేర్చి కాచఁబడిన యావుపాలలో నల్లనువ్వులను పలుమారు భావనచేసి దానిని పంచదారతోడ భక్షించిన నూరు స్త్రీలను సంభోగించునట్టి శక్తి మనుజులకు కలుగును.

విదారీచూర్ణయోగము.

చూర్ణం విదార్యా బహుశః స్వరసేనైవ భావితమ్,
క్షౌద్రసర్పిర్యుతం లీఢ్వా ప్రమదాశతమృచ్ఛతి. ౨౫

నేలగుమ్మడుగడ్డచూర్ణమును నేలగుమ్మడుగడ్డరసములో పలుమారు భావనచేసి ఆవునెయ్యి, తేనె వీనిలో కలిపి సేవించిన పురుషుఁడు నూర్గురుస్త్రీల నేకకాలమున సంభోగించును.

పిప్పల్యాదిచూర్ణయోగము.

కృష్ణాధాత్రీఫలరజ స్స్వరసేన సుభావితమ్,
శర్కరామధుసర్పిర్భిర్లీఢ్వా యోఽనుపయః పిబేత్. ౨౬
స నరోఽశీతి వర్షోఽపి యువేన పరిహృష్యతి.

పిప్పళ్లు ఉసిరికవరుగు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి దానిని యుసిరికసండ్లరసములో పలుమారు భావచేసి పంచదార, తేనె, ఆవునెయ్యి వీనిలో కలిపి సేవించి పిదప నావుపాలను పానముచేసిన పురుషుఁడు ఎనుబదిసంవత్సరముల వాఁడుగనుండినను యౌవనపురుషునివలె స్త్రీలను సంభోగించును.

యష్టిమధుకచూర్ణయోగము.

కర్షం మధుకచూర్ణస్య ఘృతక్షౌద్రసమన్వితమ్. ౨౭
పయోఽనుపానం యో లిహ్యాన్నిత్యవేగస్స నా భవేత్,

యష్టిమధుకచూర్ణము ఒకకర్షమును, ఆవునెయ్యి, తేనె వీనిలో కలిపి భక్షించిన తోడనే ఆవుపాలను పానముజేసిన పురుషునికి స్త్రీసంభోగమునం దెల్లపుడును శక్తి కలుగును.

కర్కాటకశృంగియోగము.

కుళీరశృంగ్యా యః కల్కమాలోడ్య పయసా పిబేత్. ౨౮

సితాఘృతపయోన్నాశీ స నారీషు వృషాయతే,

కర్కాటకశృంగి సనూరి కల్కము చేసి ఆవుపాలలో కలిపి పానము చేసి పంచదార, ఆవు నెయ్యి, ఆవుపాలు వీనితోడ సంబావుబియ్యపు అన్నమును భుజించిన పురుషుఁడు మదించినవృషభము వలె స్త్రీలను సంభోగించును.

## క్షీరకాకోళియోగము.

యః పయస్యాం పయస్సిద్ధాం ఖాదేన్మధు ఘృతాన్వితామ్. ౩౦
పిబేద్బాష్కయణాం చాను క్షీరం న క్షయమేతి సః,

క్షీరకాకోళిని ఆవుపాలలో చేర్చి వండి ఆవు నెయ్యి, తేనె వీనితోడ భక్షించి ముదిరిన దూడగలయావుపాలను పానము చేసిన మనుజునికి స్త్రీసంభోగమునవలన శుక్రము క్షయింపకుండును.

## స్వయంగుప్తాదిచూర్ణయోగము.

స్వయం గుప్తేక్షురకయోర్బీజచూర్ణం సశర్కరమ్. ౩౧
ధారోష్ణేన నరః పీత్వా పయసా రాసభాయతే,
ఉచ్చటాచూర్ణమప్యేవం శతావర్యాశ్చ యోజయేత్. ౩౨

తీటకసిందవిత్తులు, గొలిమిడివిత్తులు వీనిని సముముగ గ్రహించి చూర్ణము చేసి దానికి సమముగ పంచదారను కలిపి భక్షించి ఆవుపాలను ధారోష్ణముగ పానము చేసిన స్త్రీసంభోగమునందు విశేషముగ శక్తి కలుగును. గుండ్రమైన తుంగముస్తలచూర్ణమును లేక పిల్లిపీచరచూర్ణమును శర్కరతోడ కలిపి భక్షించి ఆవుపాలను ధారోష్ణముగ పానము చేసిన పురుషునికి స్త్రీసంభోగమునందు విశేషశక్తి కలుగును.

## దధిసరాది వృష్యయోగము.

చంద్రశుభ్రం దధిసరం ససితం షాష్టికౌదనమ్,
పటే సుమార్జితం భుక్త్వా వృద్ధోఽపి తరుణాయతే. ౩౩

చంద్రుని వలె తెల్లగనుండు ఆవుపెరుగుమీఁది మీఁగడను తెల్లనివస్త్రముపై నుంచి దానికి సమముగ శర్కరను కలిపి అందులో అరువదిదినములకు ఫలించెడు సంబావుబియ్యపు అన్నమును చేర్చి చక్కఁగ కలిపి భక్షించిన వృద్ధుఁడు కూడ వయస్సుగలవాఁడగును.

## శ్వదంష్ట్రాదియోగము.

శ్వదంష్ట్రేక్షురమాషాత్మగుప్తాబీజశతావరీః,

పిబన్ క్షీరేణ జీర్ణోఽపి గచ్ఛతి ప్రమదాశతమ్. 34

పల్లేరు, గోలిమిడివిత్తులు, మినుములు, తీటకసిందవిత్తులు, పిల్లిపీచర వీనిని సమ భాగములుగ గ్రహించి నూరి ఆవుపాలలోకలిపి పానముచేసిన వృద్ధునికిగూడ నూర్గురు స్త్రీలను సంభోగించునట్టి శక్తికలుగును.

శుక్రవృద్ధికర వస్తువులు.

యత్కించిన్మధురం స్నిగ్ధం బృంహణం బలవర్ధనమ్,
మనసో హర్షణం యచ్చ తత్సర్వం వృష్యముచ్యతే. 35

మధురరసము గలదియును స్నిగ్ధమును శరీరపుష్టిని కలుగఁజేయునదియును బలమును వృద్ధిపఱచునదియును మనస్సునకు సంతోషమును కలుగఁజేయునదియునైన వస్తువులన్నియు శుక్రమును వృద్ధిజేయునని మహర్షులు వచింపుచురు.

ద్రవ్యైరేవం విధై స్తస్మాద్దర్పితః ప్రమదాం వ్రజేత్,
ఆత్మవేగేన చోద్దీర్ణః స్త్రీగుణైశ్చ ప్రహర్షితః. 36

పురుషుఁడు పైచెప్పిన వాజీకరణయోగములను సేవించుటవలన శక్తిగలవాఁడై లావణ్య సౌందర్యాదిగుణములచే సంతోషమును జెందినవాఁడై స్త్రీలతో సంభోగము జేయవలయును.

శబ్దాదివిషయానుభవము.

సేవ్యాస్సర్వేంద్రియసుఖా ధర్మకల్పద్రుమాంకురాః,
విషయాతిశయాః పంచ శరాః కుసుమధన్వనః. 37

ధర్మమనెడు కల్పవృక్షముయొక్క చిగుళ్లవలె నుండునవియు మన్మథుని పంచ బాణమువలె నుండునవియు మనోహరముగ నుండునవియు సర్వేంద్రియములకు సుఖ మును కలుగఁజేయునవియు నైన శబ్దస్పర్శరూపరసగంధములు మనుజునిచే సేవింప వలయును.

శబ్దాదివిషయములకు కామోద్దీపకత్వము.

ఇష్టా హ్యేకైకశోఽప్యర్థా హర్షప్రీతికరాః పరమ్,
కింపునః స్త్రీశరీరే యే సంఘాతేన ప్రతిష్ఠితాః. 38

శబ్దస్పర్శరూప రసగంధములలో నొక్కొక్కటియు మిక్కుటముగ మనుజుని యొక్క మనస్సునకు సంతోషమును కలుగఁజేయును. అట్టి శబ్దస్పర్శాదులన్నియు నేకకా లమున స్త్రీశరీరమునందు సముదాయముగ స్థాపింపఁబడి మిక్కుటముగ సంతోషమును కలుగఁజేయునెడ అట్టి సంతోషమిట్టిదని చెప్పవలెనా?

కాంతాజనములకు కామోద్దీపకత్వము.

నామాపి యస్యాహృదయోత్సవాయ
యాం పశ్యతాం తృప్తిరనాప్తపూర్వా,
సర్వేంద్రియాకర్షణపాశభూతా
కాంతానువృత్తివ్రతదీక్షితా యా. ౩౯
కలావిలాసాంగవయోవిభూషా శుచిస్సలజ్జా రహసి ప్రగల్భా,
ప్రియంవదాతుల్యమనశ్చ యాయా సాస్త్రీ వృషత్వాయపరంనరస్య.

నామోచ్చారణ మాత్రంబున మనంబున కాహ్లాదము కలుగఁజేయునదియు దర్శన మాత్రంబున విశేషతృప్తిని కలుగఁజేయునదియు, సర్వేంద్రియముల నాకర్షించు స్వభావము కలదియు, యెల్లప్పుడు భర్త ననుసరింపుచుండునదియు, కామతంత్రకళలు, లీలలు, మనోహరమైన అవయవములు, యుక్తమైన వయస్సు, ఆభరణములు, లజ్జ వీనిచే మనోహరముగ నుండునదియు, సురతమునందు విశేషచాతుర్యము గలదియు, ప్రియముగ మాటలాడునదియు, సమానమైన అనురాగముతోఁ గూడినదియు నగు స్త్రీ మనుజునికి విశేష శుక్రవృద్ధిని కలుగఁజేయుటయేగాక పురుషునియొక్క హృదయమును ఆకర్షించును.

వైద్యతంత్రానుగుణ సురతావశ్యకత్వము.

ఆచరేచ్చ సకలాం రతిచర్యాం కామశాస్త్రవిహితామనవద్యామ్,
దేశకాలబలశక్త్యనురోధాద్వైద్యతంత్రసమయోక్త్యవిరుద్ధామ్.

మనుజుఁడు కామశాస్త్రములో చెప్పఁబడినదియు శరీరమునకు రోగాదులను కలుగజేయనిదియు ఆయుర్వేద తంత్రాచారములకు విరుద్ధము కాకుండునదియు నగు సురతముల నన్నిఁటిని దేశకాలబలశక్త్యనుసారముగ చేయవలయును.

మనోవాజీకర ణౌషధవస్తువులు.

అభ్యంజనోద్వర్తనసేకగంధస్రక్చిత్రవస్త్రాభరణప్రకారాః,
గాంధర్వకావ్యాదికథాప్రవీణాస్సమస్వభావా వశగావయస్యాః.
దీర్ఘికా స్వభవనాంతరనివిష్టా పద్మరేణుమధుమత్తవిహంగా,
నీలసానుగిరికూటనితంబే కాననాని పురకంఠగతాని. ౪౩
దృష్టిసుఖా వివిధా తరుజాతిశ్శ్రోత్రసుఖఃకలకోకిలనాదః,
అంగసుఖర్తువశేన విభూషా చిత్తసుఖస్సకలఃపరివారః. ౪౪
తాంబూలమచ్ఛమదిరా కాంతా కాంతానిశా శశాంకాంకా,
యద్యచ్చకించిదిష్టం మనసో వాజీకరంతత్తత్. ౪౫

అభ్యంజనము, ఉద్వర్తనము, సేకము, గంధద్రవ్యములు, పుష్పహారము, వ
వస్త్రములు, భూషణములు, సంగీతమునందును కావ్యనాటకాది రసవంతములైన గ్ర
ములయందును పాండిత్యము గలవారుగ, మంచి స్వభావముగలవారుగ స్వాధీను
నుండు స్నేహితులు, తామరపువ్వులయందలి దుమ్ముచేతను మకరందముచేతను వ
చిన పక్షులతోఁ గూడినదియు తనగృహసమీపమునందు నిర్మింపఁబడినదియు నగు
బావులు, పచ్చనిపచ్చికచే మూసికొనియుండు పర్వతసమీప ప్రదేశమునందలి ఆడవ
చూచుటకు మిగుల రమ్యముగనుండు నానావిధ వృక్షజాతులు, చెవులకు సుఖముని
కోకిలస్వరము, ఆయా ఋతువుల కనుగుణములును అవయవములకు కష్టమును క
జేయునిదియునైన భూషణములు, మనస్సునకు ప్రియకరములైన పరివారములు, తాం
లము, నిర్మలముగనుండు మద్యములు, లావణ్యగుణములతోఁ గూడియుండు ప్రి
రాలు, పూర్ణచంద్రునితో ప్రకాశించు రాత్రులు ఇవియన్నియు మనస్సునకు
మును కలుగఁజేయును. కావున వీనిని వాజీకరణ మనఁబడును. ఇంతయేగాక మనస్సు
మిక్కిలి ప్రియమును కలుగఁజేయునదియైన వస్తువులన్నియు వాజీకరణమనియే చె
బడును.

కామోద్దీపకరవస్తువులు.

మధు ముఖమిన సోత్పలం ప్రియాయాః
కళరణనాపరివాదినీప్రియేవ,
కుసుమచయమనోరమా చ శయ్యా
కిసలయినీలతికేవ పుష్పితాగ్రా.
దేశే శరీరే చ న కాచిదార్తిరర్థేషు నాల్పోపి మనోవిఘాతః
వాజీకరాస్సన్నిహితాశ్చ యోగాః కామస్య కామం పరిపూరయ

కలువపుష్పములతో నలంకరింపఁబడిన ద్రాక్షామద్యము, యిష్టురాలువలె వ
ముగ శబ్దించునట్టి వీణాగానము, పుష్పములు, చిగుళ్ళు వీనితో నిర్మింపఁబడిన శ
శరీరమునందు రోగాదులులేకుండుట, తనకిష్టమైన పదార్థములు సులభముగ దొరు
పైచెప్పియుండు వాజీకరణయోగములు, దృష్టికిరమ్యముగ రోగాదులను కలుగఁజేయ
నుండు ప్రదేశము, ఇవియన్నియు మనుజునికి ప్రియురాలియొక్క ముఖమువలె క
దీపనమును కలుగఁజేయును.

జ్వరాదిరోగములకు ముఖ్యౌషధసంగ్రహము.

ముస్తాపర్పటకం జ్వరే, తృషి జలం, మృద్భృష్టలోష్ఠోద్భవం

లాజాశ్ఛర్దిషు వస్తిజేషు గిరిజం మేహేషు ధాత్రీనిశే,
పాండౌ శ్రేష్ఠమయోఽభయానిలకఫే ప్లీహామయే పిప్పలీ
సంధానే క్రిమిజా విషే శుకతరుశ్మేదోఽనిలే గుగ్గులుః.
వృషోఽస్రపిత్తే కుటజోఽతిసారే
భల్లాతకోఽర్శస్సు గరేషు హేమ,
స్థూలేషు తార్క్ష్యం క్రిమిషు క్రిమిఘ్నం
శోషేసురాఛాగపయోఽను మాంసమ్. ౪౯
అక్ష్యామయేషు త్రిఫలా గుడూచీ
వాతాస్రరోగే మథితం గ్రహిణ్యామ్,
కుష్ఠేషు సేవ్యః ఖదిరస్య సార
స్సర్వేషురోగేషు శిలాహ్వయం చ. ౫౦
ఉన్మాదం ఘృతమనవం శోకం మద్యంవ్యపస్మృతిం బ్రాహ్మీ,
నిద్రానాశం క్షీరం జయతి రసాలా ప్రతిశ్యాయమ్. ౫౧
మాంసం కార్శ్యం లశునః ప్రభంజనం స్తబ్ధగాత్రతాం స్వేదః,
గుడమంజర్యాః ఖపురో నస్యాత్ స్కంధాం సబాహురుజమ్. ౫౨
నవనీతఖండమర్దితమాప్రిమూత్రం పయశ్చ హంత్యుదరం,
నస్యం మూర్ధవికారాన్ విద్రధిమచిరోత్థమస్రవిస్రావః. ౫౩
నస్యం కేవలముఖజాన్నస్యాంజనతర్పణాని నేత్రరుజః,
వృద్ధత్వం క్షీరఘృతేమూర్ఛాం శీతాంబుమారుతచ్ఛాయాః. ౫౪
సమశుక్తార్ద్రికమాత్రా మందే వహ్నౌ శ్రమే సురాస్నానం,
దుఃఖసహత్వే స్థైర్యే వ్యాయామో గోక్షురుర్హితః కృచ్ఛ్రే. ౫౫
కాసే నిదిగ్ధికా పార్శ్వశూలే పుష్కరజా జటా,
పయసః స్థాపనేధాత్రీ త్రిఫలాగుగ్గులుర్వ్రణే. ౫౬
వస్తిర్వాతవికారాన్ పైత్తాన్ రేకః కఫోద్భవాన్ వమనమ్,
క్షౌద్రం జయతి బలాసం సర్పిః పిత్తం సమీరణం తైలమ్. ౫౭
ఇత్యగ్ర్యంయతోప్రోక్తం రోగాణామౌషధం శమాయాలమ్.
తద్దేశకాలబలతో వికల్పనీయం యథా యోగమ్. ౫౮

జ్వరమునందు తుంగముస్తలు, పర్పాటకము, దప్పియందు కుండపెంకులు, యినుము మొదలగువానిని నిప్పులోకాల్చి ముంచిన యుదకము వాంతియందు వరిపేలాలు, మూత్రకోశమునందలి రోగములయందు శిలాజతువు, ప్రమేహరోగములయందు ఉసిరిక, పసుపు, పాండురోగమునందు అయము, వాతకఫములయందు కరక్కాయ, ప్లీహరోగమునందు పిప్పళ్లు, ఉరఃక్షతమునందు లక్క, విషోపద్రవమున దిరిశనము, మేదోరోగమున గుగ్గిలము, రక్తపిత్తరోగమున అడ్డసరము, అతిసారరోగమున కొడిసె, అర్శోరోగమున జీడి, కృత్రిమవిషమున బంగారు, కృమిరోగమున వాయువిడంగములు, శోషయందు సురయనుమద్యము, మేకపాలు, మేకమాంసము, నేత్రరోగములయందు త్రిఫలములు, వాతరక్తరోగమున తిప్పతీఁగె, గ్రహణీరోగమున చిలికినమజ్జిగ, కుష్ఠరోగమున చంద్రచేవ, సకలరోగములయందు శిలాజతువు మిక్కిలి శ్రేష్ఠముగనుండును. మఱియు పాతనెయ్యి ఉన్మాదరోగమును, మద్యము శోకమును, సరస్వతియాకు, అపస్మారరోగమును, ఆవుపాలు నిద్రాహానిని, రసాలాయనునది పీనసరోగమును, మాంసము కృశత్వమును, వెల్లుల్లి వాతరోగమును, స్వేదకర్మ శరీరస్తబ్ధత్వమును, నల్లబూరుగుబంక నస్యమువలన, కంఠము భుజశిరములు చేతులు తొడలు అనువానియందు జనించిన రోగములను, వెన్నఖండశర్కర అనువానిని సమముగచేర్చి చక్కఁగమర్దించబడిన ఒంటెమూత్రము లేక ఒంటెపాలు ఉదరరోగమును, నస్యము శిరోరోగములను, రక్తమోక్షణము విద్రధిరోగములను, నస్యము కబళము అనునవి నోటిలోజనించు రోగములను, నస్యము అంజనము తర్పణము అనునీమూఁడును నేత్రరోగములను, ఆవుపాలు, ఆవునెయ్యి ముసలితనమును, చల్లఁగనుండు నుదకము గాలి నీడ యివి మూర్ఛారోగమును పోఁగొట్టును. అల్లము అగ్నిమాంద్యమును, సురయనుమద్యము స్నానము అనునవి శ్రమమును, వ్యాయామము దుఃఖమును, స్థైర్యమును, షల్లేరు మూత్రకృచ్ఛ్రమును, వాకుడు కాసరోగమును, పుష్కరమూలము పార్శ్వశూలను పోఁగొట్టును. ఉసిరిక, త్రిఫలములు అనునవి వయస్సును స్థిరపఱచును. గుగ్గిలము వ్రణమునార్చును. వస్తికర్మలు వాతరోగములను, విరేచనము పిత్తరోగములను, వమనకర్మ కఫరోగములను పోఁగొట్టును. మఱియు తేనె కఫమును, నెయ్యి పిత్తమును, నువ్వులనూనె వాతమును పోఁగొట్టును. ఇటుల నాయారోగములను బోఁగొట్టునట్టి యౌషధములు చెప్పఁబడినవి. బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు దేశకాలబలాదులను పర్యాలోచించి ఆయారోగములకు తగిన యోగములను ప్రయోగించవలయును. ఆయారోగచికిత్సాప్రకరణములయం దౌషధములు విస్తారముగ చెప్పఁబడియుండినను తొలుత విస్తారముగచెప్పి పిదప నాయర్థములనే సంగ్రహముగ చెప్పుట తంత్రకారులయొక్క సంప్రదాయము కావున మరల నిచట యాయౌషధములనే సంగ్రహముగ నీగ్రంథకర్త వచించియున్నాఁడు.

### అగ్నివేశకృతాయుర్వేద విషయప్రశ్నము.

ఇత్యాత్రేయా దాగమయ్యార్థసూత్రం
తత్సూక్తానాం పేశలానామతృప్తః,
భేడాదీనాం సమ్మతో భక్తినమ్రః
పప్రచ్ఛేదం సంశయానోగ్నివేశః. ౫౯
దృశ్యంతే భగవన్ కేచిదాత్మవంతోఽపి రోగిణః,
ద్రవ్యోపస్థాతృసంపన్నా వృద్ధవైద్యమతానుగాః. ౬౦
మ్రియమాణామయప్రాణా విపరీతాస్తథాపరే,
హితాహితవిభాగస్య ఫలం తస్మాదనిశ్చితమ్. ౬౧
కింశాస్తి శాస్త్రమస్మిన్నితి కల్పయతోఽగ్నివేశముఖ్యస్య,
శిష్యగణస్య పునర్వసురాచఖ్యౌ కార్త్స్న్యతస్తత్త్వమ్. ౬౨

అగ్నివేశముని ఆత్రేయమహర్షిచే పైచెప్పినప్రకారము ఆయుర్వేద సూత్రార్థములను చక్కఁగ గుర్తెఱిఁగి వానియందు మరల సంశయముగలవాఁడై మధురముగను యుక్తియుక్తంబులైన ఆత్రేయముని భాషితంబుల నాకర్ణించి తనివినొందక భేడాది ఋషుల సమ్మతిని పొంది భక్తివినయములతోడ ఆత్రేయమహర్షీ! కొందరు మనుజులాయుర్వేదమున చెప్పియుండుప్రకారము హితాహారవిహారాదులను చేయుచుండియు రోగములచే బీడింపఁబడుచున్నారు. మఱియు వారు ఔషధము పరిచారకులు ద్రవ్యము వీనితోఁగూడి గొప్పవైద్యుల మతానుసారముగ నౌషధములనుసేవించియు కొందఱురోగనివృత్తిని కొందఱు మరణమును జెందుచున్నారు. మఱియు హితాహారవిహారములను పాటింపక ద్రవ్యౌషధపరిచారక సంపత్తి లేకుండువారును వృద్ధవైద్యమతముల ననుసరింపకుండువారును నగు యితరులుపైచెప్పినప్రకారము కొందఱు మరణమును కొందఱు రోగనివృత్తిని జెందుచున్నారు. కావున హితాహారవిహారాదులకు ఫలము నిశ్చయముగ కలుగుటలేదు. ఈశాస్త్రమునందేది యుపదేశింపఁబడుచున్నది? ఆయుర్వేదశాస్త్రముచే ఫలమేదియు కనుపడలేదు. దానంజేసి కాకదంత పరీక్షవలె యీశాస్త్రారంభము నిష్ప్రయోజనంబుగ జూపబడెడిని; అని ప్రశ్నజేసెను. యిటుల సంశయముతోగూడియుండు అగ్నివేశాది శిష్యగణంబులకు ఆయుర్వేద తత్వార్థములన్నిఁటిని ఆత్రేయమహర్షి నిఁక చెప్పఁబోవుప్రకారము మరల నుపదేశించెను.

### ఆత్రేయమహర్షి కృతోత్తరము.

నచికిత్సా ఽచికిత్సా చ తుల్యా భవితుమర్హతి,

వినాపి క్రియయా స్వాస్థ్యం గచ్ఛతాం షోడశాంశయా. ౬౩
ఆతంకపంకమగ్నానాం హస్తాలంబో భిషగ్జితమ్,
జీవితం మ్రియమాణానాం సర్వేషామేవ నౌషధాత్. ౬౪
నహ్యుపాయమపేక్షంతే సర్వే రోగా న చాన్యథా,
ఉపాయసాధ్యాస్సిధ్యంతి నాహేతు ర్హేతుమాన్యతః ౬౫
యదుక్తం సర్వసంపత్తి యుక్తయాపిచికిత్సయా,
మృత్యుర్భవతి తన్నైవం నోపాయేఽస్త్యనుపాయతా. ౬౬
అస్త్యేవోపాయయుక్తస్య ధీమతోజాతుచిత్క్రియా,
న సిధ్యేద్దైవవైగుణ్యాన్నత్వియం షోడశాత్మికా. ౬౭
కస్యాసిద్ధోఽగ్నితోయాదిస్వేదస్తంభాదికర్మణి,
సప్రీణనం కర్శనం వా కస్య క్షీరగవేధుకమ్. ౬౮
కస్య మాహాత్మ్యగుప్తాదా వృషత్వే నాస్తి నిశ్చయః,
విణ్మూత్రకరణాక్షేపౌ కస్య సంశయితౌ యవే. ౬౯
విషం కస్య జరాం యాతి మంత్రతంత్రవివర్జితమ్,
కః ప్రాప్తః కల్యతాం పథ్యాదృతే రోహిణికాదిషు. ౭౦
అపిచాకాలమరణం సర్వసిద్ధాంతనిశ్చితమ్,
మహతాపి ప్రయత్నేన వార్యతాం కథమన్యథా. ౭౧
చందనాద్యపి దాహాదౌ రూఢమాగమపూర్వకమ్,
శాస్త్రాదేవ గతం సిద్ధిం జ్వరే లంఘనబృంహణమ్. ౭౨
చతుష్పాద్గుణసంపన్నే సమ్యగాలోచ్య యోజితే,
మా కృథా వ్యాధినిర్ఘాతం విచికిత్సాం చికిత్సితే. ౭౩
ఏతద్ధి మృత్యుపాశానామకాండే ఛేదనం దృఢమ్,
రోగోత్త్రాసితభీతానాం రక్షాసూత్రమసూత్రకమ్. ౭౪
ఏతత్తదమృతం సాక్షాజ్జగత్యాయాసవర్జితమ్,
యాతిహాలాహలత్వం చ సద్యోదుర్భాజనస్థితమ్. ౭౫

ఓ అగ్నివేశా! చికిత్స యనునది నాల్గుపాదములతోడను పదునాఱు గుణములతోడను కూడియుండును. అట్టి చికిత్సలేకయే యెచటరోగము నివర్తించినదని చెప్పెదవో

నచటను చికిత్సకలదనియే చెప్పవలెను. చికిత్సలచే నివర్తింపఁదగిన రోహిణికాది రోగము లెప్పుడును చికిత్సలేకయే శమింపనేరవు; దానంజేసి చికిత్సచేయుటయు చికిత్స చేయకుండుటయును యీరెండును తుల్యము కానేరదు. రోగము నెడు పంకంబున మగ్నంబై యుండువారికి మంచి యౌషధముల నుపదేశించునట్టి యీచికిత్సాశాస్త్రము హస్తాలంబతుల్యముగ నుండును. మరణమును జెందువారికి ఔషధప్రయోగములచే ప్రాణము కలుగనేరదు. రోగములలో కొన్ని యసాధ్యంబులుగ నుండుటవలన యన్ని రోగములయందును చతుష్పాదములతోఁ గూడియుండు నీచికిత్స సఫలము కానేరదు. అయితే సుఖసాధ్యములుగనుండు రోగములు మాత్రము చికిత్సలచే శమించు గావున:—

"దృశ్యంతే భగవన్ కేచిత్"

అను శ్లోకములచే చికిత్సలేక రోగము నివర్తించుచున్నది. చికిత్సలను చేసియు మరణము కలుగుచున్నయది. అనిచెప్పిన యది యుక్తియుక్తము కానేరదు. బుద్ధిమంతుఁడును సకలసామగ్రులతోఁ గూడినవాఁడుగను నుండువానికి కాలదోషమువలన పదునారు గుణములతోఁ గూడియుండు చికిత్సఫల మివ్వకుండును. అయితే రోగియొక్క ఆయుష్కాలము రోగముల సాధ్యాసాధ్యత్వములు వీనిని తొలుత చక్కఁగ తెలిసికొని పిదప చికిత్సచేయుట కారంభించవలయునని ఆయుర్వేదతంత్రములలో చెప్పియుండుటవలన వైద్యవరుండు వానిని తెలిసికొని చికిత్సలను జేయుట కుపక్రమించిన నవి నిస్సంశయముగ సఫలము లగును. ఈయర్థమునే:—

"సాధ్యాసాధ్యవిభాగజ్ఞో జ్ఞానపూర్వం చికిత్సకః,
కాలేనారభతే కర్మయత్తత్సాధయతే ధ్రువమ్."

అనుశ్లోకముచే చరకాచార్యుఁడును చెప్పియున్నాఁడు.

మఱియు అగ్నిస్వేదమును, ఉదకము స్తంభనమును, అన్నపానలు తృప్తిని, గోధుమలు కృశత్వమును, మినుములు తీటకసింద అనునవి శుక్రమును వృద్ధిజేయును. మనుజులకు మలమూత్రవిసర్జనములు సుఖకరంబులు. వానినడ్డగించుట రోగకారణము. మంత్రతంత్రప్రయోగములు లేక విషము జీర్ణము కానేరదు. రోహిణికాదిరోగములు పథ్యము లేకయే నివర్తింపవని సకలజనులకును విశదముగ తెలియును. కావున నీచికిత్స సఫలమని కరతలామలకమువలె కనుఁబడుచున్నది. మఱియు అకాలమరణమనునది సర్వసిద్ధాంతసమ్మతముగ నున్నది. చికిత్సాశాస్త్రము లేకుండిన నెటువంటి ప్రయత్నముచేతను అకాలమరణమును అడ్డగించుటకు సాధ్యము కానేరదు శరీరమున విశేషతాపము కలిగినచో చందనాదులను లేపనము చేయవలయుననియు, వాతపిత్తాదిజ్వరములు కలిగినచో లంఘనపాచన కషాయాది ప్రయోగములను, పేయ, యవాగు మొదలగు పథ్యముల నిప్పించవలయు

వనియు, అహితాహార విహారములను వర్జింపవలయు ననియు, చికిత్సాశాస్త్రము వలః తెలియవలయునే కాని యితర విధోపాయమువలన తెలియుటకు సాధ్యము కానేరదు కావున సూత్రస్థానమునం దాయుష్కామీయాధ్యాయములో జెప్పియుండు చత పాదములతోఁ గూడినది ను రోగిశరీరదేశకాలబలాదులను చక్కఁగ బర్యాలోచిం చేయఁబడినదియునైన చికిత్సరోగమును శమింపఁజేయునా? చేయదా? యని సంశయము జెందరాదు ఈచికిత్సాశాస్త్రము మనుజులకు అకాలమున యమపాశమువలెనుం జ్వరాదిరోగములను నిస్సంశయముగ ఛేదించుటయేగాక రోగభయము కలిగియుం వారిని రక్షాసూత్రమువలె రక్షించును. కావున నిది సకలజనులచేతను అవశ్యము నభ్యసింపఁదగినది. మఱియు నీశాస్త్రము సముద్రమథనప్రయాసలేకయే లభిం ప్రత్యక్షామృతమునవలె నుండును. ఇటులుండినను దుష్టవైద్య హస్తగతమైనచో “శ పాత్రలోనుంచిన అమృతము విషముగ పరిణమించుచందంబున” విషరూపమ వగును.

## ఆయుర్వేదజ్ఞానశూన్యవైద్యనింద

అజ్ఞాతశాస్త్రసద్భావాన్ శాస్త్రమాత్రపరాయణాన్,
త్యజేద్దూరాద్భిషక్పాశాన్ పాశాన్ వైవస్వతానివ.

ఆయుర్వేదశాస్త్రపరిజ్ఞానములేక కేవలము చికిత్సామాత్రమును కొంత కొని చికిత్సఁజేయువారును, శాస్త్రమునుమాత్ర మభ్యసించి అనుభవజ్ఞానములేని వై లును యమపాపాశములబోలె రోగులప్రాణముల హింసఁజేయుదురు. కావున అట్టి వై లను దూరముగవర్జింపవలెను. (శాస్త్రపరిజ్ఞానంబును, అనుభవజ్ఞానంబును రెండును వైద్యుఁడు చికిత్సఁజేయ నర్హుఁడుకాని రెంటిలో నొకటిమాత్రము కలవైద్యుఁడు త్సజేయనోపడని భావము.)

ఈవిషయమునే సుశ్రుతాచార్యులిట్లుపదేశించిరి:—“యస్తు కేవలశా కర్మస్వపరినిష్ఠితః, సముహ్యాత్యాతురంప్రాప్య ప్రాప్యభీరురివాహవమ్, యస్తుకర్మసు తః ధార్ష్ట్యాత్ శాస్త్రబహిష్కృతాః, నసత్సుపూజామాప్నోతి వధంచార్హతిరా (కేవలము శాస్త్రమునుమాత్రము చక్కఁగచదివి చికిత్సావిధానములయం దనుభవః లేనివైద్యుఁడు రోగివిషయమై దేశకాలాది బలాబలముల నెరుంగనోపక భయః ముకలవాఁడు రణరంగమున నుపయోగించినచందమున చికిత్సయందు పొరబాటుః మరియు చికిత్సావిధానమున ననుభవజ్ఞానముమాత్రము కల్గియుండి శాస్త్రపరి

బొత్తుగలేక వైద్యశాస్త్రమును ధిక్కరించు కుత్సితవైద్యుఁడు గౌరవమును బొందఁజాలడు. అట్టివైద్యుఁడు రాజుచే చంపఁదగియుండును.)

ఆయుర్వేద సంప్రదాయానుభవజ్ఞ వైద్యప్రశంస

భిషజాం సాధువృత్తానాం భద్రమాగమశాలినామ్,
అభ్యస్తకర్మణాం భద్రం భద్రం భద్రాభిలాషిణామ్. ८६

మంచినడతలుగలవారును ఆయుర్వేదాగమంబులను జక్కఁగ బఠించి వానియందలి సారాంశములను నిస్సంశయముగ తెలిసికొని తైలలేహాదిపాకములు నిరూహానువాసనవస్తికర్మలు సిరావేధ మొదలగు వానియం దనుభవముగలవారును, సకలజనులకు సుఖమును గోరువారును నగు వైద్యోత్తములు మిక్కిలి శ్రేష్ఠులు. అటువంటివారికి యిహలోకపరలోకములయందు క్షేమము కలుగును.

అష్టాంగహృదయగ్రంథనిర్మాణఫలము.

ఇతి తంత్రగుణైర్యుక్తం తంత్రదోషవివర్జితం,
చికిత్సాశాస్త్రమఖిలం వ్యాప్య యత్ పరితః స్థితమ్. ८८

విపులామలవిజ్ఞానమహామునిమతానుగమ్,
మహాసాగరగంభీరసంగ్రహార్థోపలక్షణమ్. ८౮

అష్టాంగవైద్యకమహోదధిమంథనేన
యోఽష్టాంగసంగ్రహమహామృతరాశిరాప్తః,
తస్మాదనల్పఫలమల్పసముద్యమానాం
ప్రీత్యర్థమేతదుదితం పృథగేవ తంత్రమ్. ८౯

"అలంకృతం యుక్తిపదైస్సద్రత్నైరివ కాంచనమ్,
షట్త్రింశతార్థదుర్గేషు భిషజాం సంక్రమైరివ.
తత్రాధికరణం యోగో హేత్వర్థోఽర్థఃపదస్య చ,
ప్రదేశోద్దేశనిర్దేశవాక్యశేషాః ప్రయోజనమ్.
ఉపదేశాపదేశాతిదేశార్థాపత్తినిర్ణయాః,
ప్రసంగైకాంతనైకాంతాస్సాపవర్గో విపర్యయః.
పూర్వపక్షవిధానానుమతవ్యాఖ్యానసంశయాః,
అతీతానాగతాపేక్షా స్వసంజ్ఞోహ్యసముచ్చయాః.

నిదర్శనం నిర్వచనంనియోగోఽథవికల్పనమ్,
ప్రత్యుత్సారస్తథోద్ధారః సంభవస్తంత్రయుక్తయః."

ఇత్యాదిశ్లోకములచే జెప్పఁబడియుండు ముప్పదియారు తంత్రలక్షణములతోఁగూడినదియు, అప్రసిద్ధంబ్బాపి తంత్రదోషరహితంబును, బ్రహ్మచే జెప్పఁబడినదియు, శతసాహస్రసంహితారూపమైనదియు నైన చికిత్సాశాస్త్రమును చక్కఁగ బఠించి వానియందలి తత్త్వార్థముల చక్కఁగనెఱింగి నిర్మింపఁబడినదియు, సమస్తవస్తుజ్ఞానములు నిర్మలముగ కలిగియుండు ఆత్రేయాదిమహర్షుల మతము ననుసరించి యుండునదియు, సముద్రమువలె నతిగంభీరముగ నుండునదియు, ఆయుర్వేద తంత్రములన్నిఁటిలోనుండు సకలసారార్థములను బోధించునదియు, అష్టాంగవైద్యకమను గొప్పసముద్రమును మథించి గ్రహించిన అమృతరాశివలెనుండునదియు, స్వల్పప్రయాసగలవారికిని ఆయురారోగ్యైశ్వర్యాది గొప్పఫలముల నిచ్చునదియునగు నీయష్టాంగహృదయమను తంత్రము సకలలోకులకు ప్రీతికొఱకై ప్రత్యేకముగ నిర్మింపఁబడినది.

## బాహటచికిత్సితాశంకానిషేధము.

ఇదమాగమసిద్ధత్వాత్ప్రత్యక్షఫలదర్శనాత్,
మంత్రవత్సంప్రయోక్తవ్యం న మీమాంస్యం కథంచన.

ఈతంత్రము ఆత్రేయాదిమహర్షులయొక్క ఆయుర్వేదాగమంబుల ననుసరించి నిర్మింపఁబడియుండుట వలనను ప్రత్యక్షముగ ఫలముల నిచ్చుటవలనను దీనిని మంత్రమువలె రక్షించుచు ప్రయోగించవలసినది. దీనిలో జెప్పియుండు విషయములు ఫలించునా ఫలించవా యని సందేహింపఁజనదు.

## అష్టాంగహృదయగ్రంథపఠనఫలము.

దీర్ఘజీవితమారోగ్యం ధర్మమర్థం సుఖం యశః,
పాఠావబోధానుష్ఠానైరధిగచ్ఛత్యతో ధ్రువం. ౮౧

ఏతత్పఠన్ సంగ్రహబోధశక్త
స్స్వభ్యస్తకర్మా భిషగప్రకంప్యః,
ఆకంపయత్యన్య విశాలతంత్ర
కృతాభియోగాన్ యది తన్న చిత్రమ్. ౮౨

అష్టాంగహృదయమను నీగ్రంథమును చక్కఁగబఠించి యందలి యర్థములను నిస్సంశయముగ తెలిసికొని తద్విధిప్రకారము అనుష్ఠించిన మనుజుఁడు దీర్ఘాయువు, ఆరోగ్యము, ధర్మము, అర్థము, సుఖము, యశము అనువానిని నిస్సంశయముగ పొందును. మఱియు అష్టాంగహృదయమను నీతంత్రమును బఠించి అర్థములను దెలిసికొని

దీనిలోఁ జెప్పఁబడియుండు ప్రకారము చికిత్సాదులను చేయువైద్యుఁడు వైద్యులందఱి కన్న శ్రేష్ఠుఁడుగ నుండుటయే గాక చరక సుశ్రుతాది మహర్షుల ప్రణీతంబులుగ నతి విస్తారముగ నుండు వైద్యతంత్రములయందు విశేషపరిశ్రమగల వైద్యులను సులభముగ జయించును.

## అష్టాంగహృదయ పఠనావశ్యకత్వము.

యది చరకమధీతేతద్ధ్రువం సుశ్రుతాది
ప్రణిగదితగదానాంనామమాత్రేఽపి బాహ్యః,
అథ చరకవిహీనః ప్రక్రియాయామఖిన్నః
కిమివఖలు కరోతు వ్యాధితానాం వరాకః. ౮౩

చరకతంత్రమును మాత్రము పఠించి యుండువానికి సుశ్రుతతంత్రములోఁ జెప్పియుండు వర్త్మసంధి సితాసితాది నేత్రరోగములయొక్క నామములు కూడ తెలియక పోవును. సుశ్రుతాదితంత్రములను మాత్రము పఠించియుండువానికి చరకతంత్రములోఁ జెప్పియుండు దోషదూష్యకాల శరీరసత్త్వసాత్మ్యాది లక్షణములు తెలియకుండును. అట్టివైద్యులు రోగులకెటుల చికిత్సఁ జేయుటకు శక్తిగలవారగుదురు? అష్టాంగహృదయ మను నీగ్రంథమునందు చరక సుశ్రుతతంత్రముల యందలి చికిత్సలన్నియు స్పష్టముగ చెప్పఁబడియుండుటవలన దీనిని పఠించువారు అన్నిరోగములకు చిత్సలను జేయ గలరు.

## అష్టాంగహృదయ గ్రాహ్యత్వము.

అభినివేశవశాదభియుజ్యతే
సుభణితేఽపి న యో దృఢమూఢకః,
పఠతు యత్నపరః పురుషాయుషం
స ఖలు వైద్యకమాద్యమనిర్విదః. ౮४

మిక్కిలి మూఢబుద్ధిగల మనుజుఁడు ఆత్రేయాది మహర్షిప్రణీత సకలాయుర్వేదసారాంశత త్త్వజ్ఞానములను అనాయాసముగ కలుగఁజేయు నీగ్రంథమును వదలి పక్షపాతబుద్ధివలన ప్రాచీనగ్రంథములయందు విశ్వాసముచే వానిని అభ్యసింపుచుండిన నట్టివాఁడు నూరు సంవత్సరములవఱకు మిక్కిలి ప్రయత్నముతో నాప్రాచీనగ్రంథములనే పరిశీలించుగాత. (అనఁగా కలియుగమున మనుజులకు ఆయువు బుద్ధి బలము జ్ఞానము ఇవి మిక్కిలి స్వల్పముగ నుండుటవలన పైచెప్పిన ప్రాచీనగ్రంథములను పఠించి వాని యర్థంబులను దెలిసికొనుటకు నీయాయువుచాలదని భావము.)

వాతే పిత్తే శ్లేష్మశాంతౌ చ పథ్యం
తైలం సర్పిర్మాక్షికం చ క్రమేణ,
ఏతద్బ్రహ్మా భాషతే బ్రహ్మజో వా
కానిర్మంత్రే వక్తృభేదో క్తిశక్తిః. ౮౫
అభిధాతృవశాత్కిం వా ద్రవ్యశక్తిర్విశిష్యతే,
అతో మత్సరముత్సృజ్యమాధ్యస్థ్యమవలంబ్యతామ్. ౮౬

వాతమునందు నువ్వులనూనె, పిత్తమునందు నెయ్యి, శ్లేష్మమునందు తేనె పథ్యకరములు. అని సాక్షాద్బ్రహ్మ చెప్పినను లేక బ్రహ్మపుత్రుఁడైన సనత్కుమారుఁడు చెప్పినను వాతపిత్తశ్లేష్మాదులను పోఁగొట్టుటయందు తైలాదులకు విశేషశక్తి కలుగదు. సామాన్యమైన మనుజుఁడు చెప్పినను దానికి శక్తి తగ్గదు. అటుల వచించువారి మహిమ వలన ద్రవ్యములకు శక్తి కలుగనేరదు. కాఁబట్టి బుద్ధిమంతుఁడగు మనుజుఁడు పక్షపాతము వదలి యేకాలమునందేది సులభముగను సఫలముగనుండునో అట్టిగ్రంథములను గ్రహింపవలయును.

ఋషిప్రణీతే ప్రీతిశ్చేన్ముక్త్వా చరకసుశ్రుతౌ,
భేడాద్యాః కిం న పఠ్యన్తే తస్మాద్గ్రాహ్యం సుభాషితమ్. ౮౭

మహర్షులు రచించిన వైద్యతంత్రములనే పఠింపవలయునని ప్రీతిగలవారు చరకసుశ్రుతతంత్రములను వదలి భేడాదితంత్రముల నేల పఠింపఁగూడదు? కావున బుద్ధిమంతులగువారు సుభాషితము నవశ్యముగ గ్రహింపవలయును. భేడాదితంత్రములను వదలి విశేషార్థ ప్రతిపాదకంబులును అనాయాసముగ పఠింపఁ దగినవియునునగు చరకసుశ్రుతతంత్రములను వైద్యోత్తములందఱు నెటుల పఠించుచున్నారో అటులనే "యుక్తియుక్తం వచో గ్రాహ్యం" అను న్యాయము ననుసరించి బుద్ధిమంతులు చరకసుశ్రుతాది సకలతంత్రములకంటె సులభముగ సకలాయుర్వేద తంత్రములయందలి సారార్థములను ప్రతిపాదించునదిగ నుండు నీయష్టాంగహృదయతంత్రమును మిక్కిలి శ్రద్ధతో బఠింపవలయును.

అష్టాంగహృదయ గ్రంథసంపూర్తి.

హృదయమివ హృదయమేతత్సర్వాయుర్వేదవాఙ్మయపయోధేః,
హృష్ట్వా యచ్ఛుభమాప్తం శుభమస్తు పరంతతో జగతః. ౮౮

అష్టాంగహృదయమను నీవైద్యతంత్రము సకలాయుర్వేద తంత్రములనెడు సముద్రమునకు హృదయమువలె నుండును. (అనఁగా మనుజులహృదయము శరీర

ములో నొకభాగముగ నుండిన నది పదిమూలసిరలచే సకలశరీరము నెటుల వ్యాపించి యుండునో అటులనే యీతంత్రము సూత్ర శారీర నిదాన చికిత్స కల్పసిద్ధి ఉత్తర తంత్రమనెడు ఆఱుస్థానంబులచే నాయుర్వేద తంత్రములన్నిఁటిని వ్యాపించి వానిలో నుండు సారార్థములను సులభముగ ప్రతిపాదింపుచు సర్వోత్కృష్టముగ నుండును. కావున బుద్ధిమంతులు ఈయష్టాంగహృదయము నభ్యసించి యందలి సారాంశములను గ్రహించి మంగళమును పొందవలయును. అందువలన సకలలోకమునకు అత్యుత్తమమైన మంగళము కలుగుగాత.

ఇది అష్టాంగహృదయమునందలి ఉత్తరతంత్రమును
నలువదవయధ్యాయము ముగిసెను.



ఇతి శ్రీసింహగుప్తాచార్యపుత్ర వాగ్భటాచార్యవిరచితాయాం
అష్టాంగహృదయసంహితాయాం ఆంధ్రతాత్పర్యసహితాయాం
షష్ఠముత్తరస్థానం సమాప్తమ్.



శ్రీమదష్టాంగహృదయమను బాహటగ్రంథము
సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1930

# వైద్యగ్రంథములు.

| | | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|---|
| అనుపానమంజరి, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 8 |
| అజీర్ణమంజరి | ,, | ... | 0 | 4 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | | ... | 6 | 0 |
| డిటో | చికిత్సాస్థానము, కల్పస్థానము | ... | 5 | 0 |
| డిటో | శారీరనిదానస్థానము | ... | 3 | 8 |
| డిటో | ఉత్తరస్థానము | | 6 | 0 |
| ఇలాజుల్ గుర్బా, యూనానివైద్యగ్రంథములలో మిక్కిలి యుత్తమమైనది, ఉర్దూను తర్జుమా, కాలికోబైండు | | ... | 3 | 0 |
| కాలజ్ఞానము, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 4 |
| కుమారతంత్రము, రావణకృతము | | ... | 0 | 6 |
| గదనిగ్రహము, సోఢలకృతము, సాంధ్రతాత్పర్యము | | ... | 2 | 8 |
| చక్రదత్త, ఆంధ్రతాత్పర్యము | | ... | 3 | 12 |
| చికిత్సాసారము, ఆంధ్రతాత్పర్యము | | ... | 2 | 8 |
| నాడీజ్ఞానము, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 4 |
| బసవరాజీయము, ఆంధ్రతాత్పర్యసహితము, క్రొత్తకూర్పు | | | 7 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | | | 0 | 6 |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానసహితము | | ... | 3 | 0 |
| మసూచికము, (Smallpox) | | ... | 0 | 4 |
| రాజమార్తాండము, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 10 |
| లోలంబరాజీయము | ,, | ... | 0 | 8 |
| వస్తుగుణమహోదధి | ,, | ... | 5 | 0 |
| విశ్వవైద్యచింతామణి | ,, | ... | 2 | 0 |
| వృక్షాయుర్వేదము | ,, | ... | 0 | 4 |
| వైద్యశతశ్లోకి | ,, | ... | 0 | 6 |
| సుశ్రుతశారీరము | ,, | ... | 2 | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

ప్రతి 1-

రఘువంశము, ప్రథమసర్గటీకాతాత్పర్యము, పాతప్రతి
విక్రమార్కచరిత్రము, సటీక ...

### నాటకములు.

ఉత్తరరామచరిత్రము, సవ్యాఖ్యానము ...
వేణీసంహారము ,, ...
శాకుంతలనాటకము ,, ...

### చంపూగ్రంథములు,

భారతచంపు, సవ్యాఖ్యానము ...
రామాయణచంపు ,, ...
విశ్వగుణాదర్శము, మేలుప్రతి ...

### వ్యాకరణము, అలంకారములు.

అభినయదర్పణము, సాంధ్రతాత్పర్యము ...
అథర్వణకారికావళి, టీకాతాత్పర్యము ...
ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము ...
చంద్రాలోకము, సటీక ...
తర్కసంగ్రహము, సవ్యాఖ్యానము ...
ప్రతాపరుద్రీయము ,, ...
లఘుకౌముది, సటిప్పణము ...
ఆంధ్రీకృతలఘుసిద్ధాంతకౌముది ...
న్యాయకుసుమాంజలి, ఆంధ్రతాత్పర్యసహితము ...




### స్తోత్రములు,

కృష్ణకర్ణామృతము, సాంధ్రతాత్పర్యము ...
శ్రీకృష్ణలీలాతరంగిణి, సటీక ...
రామకర్ణామృతము, సాంధ్రపద్యతాత్పర్యము ...
లక్ష్మీస్తోత్రరత్నత్రయము, సాంధ్రటీకాతాత్పర్యము ...
శివానందలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము ...

### సహస్రనామములు నామావళీసహితము.

శ్రీలలితాసహస్రనామస్తోత్రము, ఆంధ్రటీకాతాత్పర్యసహితవ
శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము ,, ...
సహస్రనామకదంబము, నామావళీసహి ...